శ్రీః

# అయోధ్యాకాండాంతర్గత విషయసూచిక


| సర్గ | విషయము | పుట |
|---|---|---|
| 1. | శ్రీరామసద్గుణవర్ణనము, దశరథుడు రాముని యువరాజును చేయవలె నని ఆలోచించుట; వివిధ రాజన్యులను, పౌరులను జానపదులను ఆలోచనమునకై రాజసభ కాహ్వానించుట. | 1 |
| 2. | దశరథుడు సభాముఖమున శ్రీరాముని పట్టాభిషేకమును గూర్చి ప్రస్తావించుట, సభాసదులు రామగుణవర్ణనపూర్వకముగ దానిని హర్షముతో ఆమోదించుట. | 21 |
| 3. | రాముని రాజ్యాభిషేకమునకు కావలసిన సంభారములు సమకూర్చవలసినదిగా దశరథుడు వసిష్ఠవామదేవులను ప్రార్థింపగా, వారు సేవకులకు అందుకు తగిన ఆజ్ఞ ఇచ్చుట, దశరథుని ఆజ్ఞ ప్రకారము సుమంత్రుడు రాముని రాజసభకు తీసికొని వచ్చుట, దశరథుడు రామునకు హితోపదేశము చేయుట. | 42 |
| 4. | రాముని మరల తీసికొనిరమ్మని దశరథుడు సుమంత్రుని ఆజ్ఞాపించుట; వచ్చిన రామునకు దశరథుడు ఏవియో కొన్ని విషయములు చెప్పి, అతని గృహమునకు పంపివేయుట; రాముడు కౌసల్యా భవనమునకు వెళ్ళి ఆమెకు తన అభిషేకమును గూర్చి చెప్పి, ఆమె ఆశీస్సులు పొందుట; లక్ష్మణునితో స్నేహపూర్వక సంభాషణము చేసి స్వగృహమునకు వెళ్లుట. | 61 |
| 5. | దశరథవచనానుసారము వసిష్ఠుడు సీతారాములచే ఉపవాస దీక్ష చేయించి, మరలివచ్చి రాజునకు తెలుపుట; రాజు అంతఃపురము ప్రవేశించుట. | 78 |

6. శ్రీరాముడు సీతాసమేతుడై వ్రతనియమము పాటించుట; అయోధ్యా పౌరు లానందపరవశులై నగరమును అలంకరించుట; రాజునకు తమ కృతజ్ఞతను వ్యక్తము చేయుట; జానపదులు గుంపులుగా అయోధ్యాపురికి చేరుట. 89

7. రామాభిషేకవార్త విని మంథర దుఃఖితయై కైకేయికి దుర్బోధ చేయుట; కాని ప్రసన్నురాలైన కైక సంతోషముతో మంథరకు బహుమానముగ తన ఆభరణమిచ్చి, వరము కోరుమనుట. 98

8. రామాభిషేకము కైకకు కీడు కలిగించునని మంథర పలుకుట; కైక రాముగుణములను తెలిపి అభిషేకమును సమర్థించుట. మరల మంథర రామాభిషేకము భరతునకు భయజనకమని కైకను భయ పెట్టుట. 118

9. మంథర దుర్బోధ తలకెక్కగా కైక కోపగృహమున ప్రవేశించుట. 129

10. దశరథమహారాజు కైకేయీభవనమునకు పోవుట; కైక కోప గృహమును ప్రవేశించుట చూచి దుఃఖితు డగుట; పలు విధము లుగ ఆమె నోదార్చుట. 154

11. కైక రాజును ప్రతిజ్ఞాబద్ధుని చేసి, మున్ను తన కొసగిన రెండు వరములు స్మరింపచేయుట; అందు మొదటివరముచే భరతునకు పట్టాభిషేకము, రెండవదానిచే రామునకు పదునాలుగేండ్లు అరణ్య వాసము కోరుట. 169

12. దశరథమహారాజు చింతించుట; దశరథవిలాపము; కైకేయిని నిందించుట; పరిస్థితిని వివరించి అట్టి వరములు కోరవలదని ప్రార్థించుట. 181

13. రాజు విలపించుట; కైక ననునయించుట. 225

14. కైకేయి దశరథుని సత్యము తప్పకుమని ప్రేరించుట; తాను కోరిన వరములను ఇమ్మని నిర్బంధించుట; వసిష్ఠమహర్షి అంతః

పురద్వారము కడకు వచ్చి, సుమంత్రుని రాజుకడకు పంపుట; రాజాజ్ఞచే సుమంత్రుడు రాముని కొనివచ్చుటకై వెడలుట. 287

15. రాజాజ్ఞచే సుమంత్రుడు శ్రీరాముని పిలుచుకొని వచ్చుటకు ఆయన గృహమున కేగుట. 282

16. సుమంత్రుడు శ్రీరామభవనము చేరి మహారాజు సందేశము విని పించుట; శ్రీరాముడు సీత యనుమతితో లక్ష్మణసమేతుడై, రథా రూఢుడై మంగళవాద్యములతో, మార్గమున స్త్రీపురుషుల మాటలు వినుచు పోవుట. 282

17. శ్రీరాముడు రాజమార్గపు శోభను చూచుచు, మిత్రుల వచనములు వినుచు, తండ్రియింట ప్రవేశించుట. 301

18. శ్రీరాముడు తన తండ్రి యేల చింతాక్రాంతు డయ్యెనని కైక నడుగుట; కైక కఠినచిత్తయై తాను కోరిన రెండు వరములను గూర్చి తెలిపి, రాముని వనవాసమునకు ప్రేరించుట. 309

19. శ్రీరాముడు కైకతో మాటలాడి, వనవాసమునకు అంగీకరించుట, తన తల్లి కౌసల్య అనుమతి పొందుటకై వెడలుట. 324

20. దశరథుని తక్కిన రాణులు విలపించుట; శ్రీరాముడు కౌసల్యా భవనమునకు పోవుట; ఆమెకు తన వనవాసమును గూర్చి తెలుపుట; కౌసల్య తెలివితప్పి పడుట; శ్రీరాము డామెను లేవనెత్తగా ఆయన ముఖము చూచి, కౌసల్య విలపించుట. 339

21. లక్ష్మణుని క్రోధము; శ్రీరాముని బలాత్కారముగ రాజ్యము చేజిక్కించుకొమ్మని అతడు శ్రీరాముని ప్రేరించుట; రాముడు పితృాజ్ఞాపాలనమే ధర్మమని తల్లికిని లక్ష్మణునికి నచ్చబలుకుట. 360

22. శ్రీరాముడు లక్ష్మణునికి నచ్చజెప్పి దైవమే తన వనవాసమునకు కారణ మనుట; అభిషేక సంభారములు తీసివేయ నాజ్ఞాపించుట. 386

23. లక్ష్మణుని ప్రతాపోక్తులు, అతడు దైవమును త్రోసిపుచ్చి పౌరుష మును ప్రతిపాదించుట; రామాభిషేకమునకై విరోధులతో యుద్ధము నకు సిద్ధపడుట. 398

24. విలపించుచున్న కౌసల్య తన్ను కూడ అడవికి గొని పొమ్మని రాముని పట్టుబట్టుట; పతిసేవయే పత్నికి పరమధర్మమని పలికి, శ్రీరాముడామెను నిలిపి, వనవాసమున కామె యనుమతి పొందుట. 410

25. వనవాసమునకై వెళ్ళుచున్న రామునకు, కౌసల్య మంగళాశాసన పూర్వకముగా స్వస్తివాచనములు చేయించుట; రాముడు ఆమెకు నమస్కరించి సీతానివాసభవనమునకు వెళ్ళుట. 429

26. రాముడు దిగులు చెంది ఉండుట చూచి, సీత అందుకు కారణము తెలియగోరుట; రాముడు, తండ్రి ఆజ్ఞచేత తాను వనమునకు వెళ్ళుచున్నట్లు సీతకు తెలిపి, "నీవు అయోధ్యలోనే ఉండుము" అని ఆమెకు ఉపదేశించుట. 447

27. "నన్ను కూడ అరణ్యమునకు తీసికొని వెళ్లుము" అని సీత రాముని ప్రార్థించుట. 461

28. శ్రీరాముడు వనవాసమందలి క్లేశములను వర్ణించుచు, సీతను వనమునకు రావలదని వారించుట. 471

29. తాను కూడ అరణ్యమునకు రామునితో కలిసి వెళ్ళుట యుక్తమని సీత వాదించుట. 481

30. తనతో వనమునకు వచ్చుటకై సీత పట్టుపట్టి, దుఃఖించుచు విలపించగా, రాముడు చివరకు అంగీకరించుట; తల్లిదండ్రులకు, పెద్దలకు సేవచేయుట ఉత్తమధర్మమని ఆమెకు బోధించుట, వనమునకు పోవు సందర్భమున గృహములోని వస్తువులన్నీ బ్రాహ్మణాదులకు దానము చేయుమని ఆమెను ఆదేశించుట. 490

31. రామలక్ష్మణుల సంవాదము, రాముని ఆజ్ఞప్రకారము లక్ష్మణుడు మిత్రాదులకు వీడ్కోలు చెప్పి, దివ్యాయుధములు గ్రహించి వనమునకు బయలుదేరుట, 'ధనమునంతను బ్రాహ్మణులకు దానము చేసి వేయుము' అని రాముడు అతనిని ఆదేశించుట. 508

32. శ్రీరాముడు సీతాసమేతుడై వసిష్ఠపుత్రుడగు సుయజ్ఞుని పిలిపించి, అతనికి, ఆయన పత్నికిని అమూల్యములగు ఆభరణములు,

రత్నములు, ధనములు మున్నగునవి యొసగుట, పిమ్మట లక్ష్మ
ణునితో కలిసి బ్రాహ్మణులకు, బ్రహ్మచారులకు, సేవకులకు,
త్రిజటు డను బ్రాహ్మణునకు, మిత్రులకు ధన మొసంగుట. 521

33. శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై, దుఃఖితు లైన నగరవాసుల
పలువిధములగు సంభాషణలు వినుచు తండ్రిని చూచుటకై
కైకేయీభవనమునకు పోవుట. 529

34. శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై రాణులతో కూడిన దశరథ
మహారాజు వద్దకు పోయి, వనవాసమునకై సెల వడుగుట, రాజు
శోకముచే మూర్ఛిల్లుట, శ్రీరాముడు తండ్రికి నచ్చబలుకుట, రాజు
శ్రీరాముని గాఢాశ్లేషము చేసి మరల మూర్ఛ నొందుట. 540

35. సుమంత్రుడు ఎంతగా బ్రతిమాలినను, నిందించినను కైక తన
నిశ్చయమును మార్చుకొనకుండుట. 574

36. దశరథమహారాజు శ్రీరామునితో సేనను, ధనమును పంపుట
కాదేశించుట, కైకేయి అందులకు వ్యతిరేకించుట, సిద్ధార్థుడు కైక
ననునయించుట, రాజు రామునితో తానును అడవికి పోవలయు
నను కోరికను వెల్లడించుట. 588

37. శ్రీరామాదులు నారవస్త్రములు ధరించుట, సీత నారచీర ధరింప
వలసివచ్చుటకు చూచి రాణివాసపు స్త్రీలు కలత చెందుట, కుల
గురువగు వసిష్ఠుడు కైకేయిని నిందించుచు సీత నారచీరములు
దాల్చుట అనుచిత మని పలుకుట. 601

38. దశరథమహారాజు సీత నారచీరలు దాల్చుట అనుచితమని పలికి
కైకను నిందించుట, శ్రీరాముడు తల్లి కౌసల్యను దయతో చూడ
వలయునని తండ్రిని కోరుట. 615

39. దశరథుని విలాపము, రాజాజ్ఞచే సుమంత్రుడు రామునికై రథ
మును కొనివచ్చుట, కోశాధిపతి సీతకై అమూల్యవస్త్రములు,
ఆభరణములు నిచ్చుట, కౌసల్య సీతకు పతిసేవ నుపదేశించుట,
సీత ఆ ఉపదేశమును స్వీకరించుట, శ్రీరాముడు తన తండ్రిని

రోషదృష్టితో చూడకుమని తల్లిని ప్రార్థించుట; తక్కిన తల్లులను సెల వడుగుట. 628

40. సీతారామలక్ష్మణులు దశరథునకు ప్రదక్షిణ మొనర్చి కౌసల్యకు వందన మాచరించుట, సుమిత్ర లక్ష్మణున కుపదేశము చేయుట, సీతారామలక్ష్మణులు రథముపై నెక్కి వనమునకు బయలు దేరుట. పౌరులు, రాణులు, రాజు శోకముతో కలత నొందుట. 636

41. శ్రీరాముని అరణ్యగమనముచే అంతఃపురస్త్రీల విలాపము, నగర వాసులు శోకముతో వ్యాకులత చెందుట. 657

42. దశరథమహారాజు భూమిపై పడుట, రామునికై విలపించుట, కైకను తనవద్దకు రావలదని వారించి యామెను విడిచిపెట్టుట, సేవకుల తోడుపాటుతో రాజు కౌసల్యాభవనమునకు పోవుట, అచటను రామునికై దుఃఖ మనుభవించుట. 666

43. కౌసల్యా విలాపము. 680

44. సుమిత్ర కౌసల్యను ఓదార్చుట.

45. భరతుని యెడల, మహారాజు పట్ల ప్రీతిని చూపు డనియు, అయోధ్యకు మరలిపొం డనియు రాముడు పౌరులకు చెప్పుట, నగరవాసులగు వృద్ధబ్రాహ్మణులు రాము నయోధ్యకు రమ్మని పట్టుబట్టుట. రాముడు వారందరితో తమసాతీరమునకు చేరుట. 701

46. రాముడు సీతాలక్ష్మణసమేతుడై తమసాతీరమున నివసించుట, తల్లిదండ్రులను, అయోధ్యానగరమును గూర్చి చింతించుట, పుర వాసులు నిద్రించుచుండగా వారిని విడచి అరణ్యమువైపు పోవుట. 713

47. పౌరులు వేకువనే లేచి విలపించుట. నిరాశ నొంది నగరమునకు మరలిపోవుట. 728

48. నగరవాసులగు స్త్రీలు విలపించుట. 732

49. రాముడు గ్రామవాసుల మాటలు వినుచు, కోసల గ్రామములు దాటుచు పోవుట, వేదశ్రుతి, గోమతి, స్యందికా నదులను దాటి, సుమంత్రునితో సంభాషించుట. 747

50. మార్గమున రాముడు అయోధ్యకు వనవాసమునకై అనుమతింప గోరుట. శృంగిబేరపురమున గంగాతీరము చేరి రాత్రి యచట నివసించుట, అచట నిషాదరాజు గుహుడు రామాదులను సత్కరించుట. 764

51. నిషాదరాజైన గుహుని సమక్షమున లక్ష్మణుడు విలపించుట. 778

52. రాముని ఆజ్ఞచే గుహుడు నావను తెప్పించుట, రాముడు సుమంత్రుని ఒడబరచి అయోధ్యకు పోవ ననుమతించుట, తల్లిదండ్రులు మున్నగువారికై రాముడు సందేశమును వినిపించుట, సుమంత్రుడు తాను వనమునకే వత్తునని పట్టుబట్టగా రాముడు అతనిని యుక్తితో మరలిపోవుట కొఱలడచుట, తిరిగి ముగ్గురును నావలో కూర్చుండుట, సీత గంగను ప్రార్థించుట, రామాదులు నావచే గంగను దాటి వత్సదేశము చేరుట. సాయంకాలమొక చెట్టుక్రింద నిలుచుటకై పోవుట 788

53. రాజును నిందించుచు కైక కౌసల్యాదులకు కీడు కలిగించునేమో యని రాముడు లక్ష్మణు నయోధ్యకు పంప ప్రయత్నించుట. రాముడు లేనిచో తాను జీవించుట అసంభవ మని పలికి అయోధ్య కేగుటకు తిరస్కరించుట. తిరిగి రాముడు అతనిని వనవాసమున కనుమతించుట.

54. శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై ప్రయాగలో గంగా యమునా సంగమమునకు చెంతనే యున్న భరద్వాజాశ్రమమునకు పోవుట. భరద్వాజముని వారిని సత్కరించుట. చిత్రకూటమున నివసింపుడని అనతిచ్చుట. చిత్రకూటపు మహాత్త్వమును, శోభను వర్ణించుట. 834

శ్రీరామాయ నమః

శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రణీత

# శ్రీమద్రామాయణము

# అయోధ్యా కాండము

మొదటి సంపుటము

శ్రీ:
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః
బాలానన్దినీ సహితమగు
# శ్రీమద్రామాయణము - అయోధ్యాకాండము
## అథ ప్రథమః సర్గః

*[శ్రీరామ సద్గుణ వర్ణనము, దశరథుడు రాముని యువరాజును చేయవలెనని ఆలోచించుట, వివిధ రాజన్యులను, పౌరులను, జానపదులను ఆలోచనమునకై రాజసభ కాహ్వానించుట.]*

మూ. గచ్ఛతా మాతులకులం భరతేన తదాఽనఘః,
శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః. 1

ప్ర. అ. మాతులకులమ్ = మేనమామ యింటికి, గచ్ఛతా = పోవుచున్న, భరతేన = భరతునిచేత, తదా = అప్పుడు, అనఘః = పాపము లేనివాడును, నిత్యశత్రుఘ్నః = ఎల్లప్పుడు శత్రువులను సంహరించువాడును అయిన, శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, ప్రీతిపురస్కృతః = ప్రేమచే పురస్కరింపబడినవాడై, నీతః = తీసికొని వెళ్లబడెను.

తా. భరతుడు తన మేనమామ యింటికి వెళ్ళుచు పాపరహితుడును, నిత్యము శత్రుసంహారియు అయిన శత్రుఘ్నుని కూడ ప్రీతిపురస్సరముగా తన వెంట తీసికొని వెళ్ళెను. 1

మూ. స తత్ర న్యవసద్భ్రాత్రా సహ సత్కారసత్కృతః,
మాతులేనాశ్వపతినా పుత్రస్నేహేన లాలితః. 2

ప్ర. అ. సః = ఆ భరతుడు, అశ్వపతినా = అశ్వపతియను ప్రసిద్ధుడైన, మాతులేన = మేనమామచేత, సత్కారసత్కృతః = సత్కారములచే పూజింపబడినవాడై, పుత్రస్నేహేన = పుత్రస్నేహముచేత, లాలితః = లాలింపబడినవాడై, భ్రాత్రా సహ = సోదరునితో కూడ, తత్ర = అచట, న్యవసత్ = నివసించెను.

తా. అనేకము లైన అశ్వములకు ప్రభు వైన మేనమామ యుధాజిత్తు సత్కారములచే సత్కరించుచు పుత్రప్రేమతో లాలింపగా ఆ భరతుడు తమ్మునితో గూడ అచట నివసించెను. 2

మూ. తత్రాపి నివసన్తౌ తౌ తర్ప్యమాణౌ చ కామతః,
భ్రాతరౌ స్మరతాం వీరౌ వృద్ధం దశరథం నృపమ్. 3

ప్ర. అ. వీరౌ=వీరు లైన, భ్రాతరౌ=ఆ సోదరు లిద్దరును, తత్ర=అచట, నివసన్తౌ=నివసించుచు, కామతః=కోరిన పదార్థము లన్నింటి చేతను, తర్ప్యమాణౌ చాపి=తృప్తిపొందింపబడుచున్నవా రైనను, వృద్ధమ్=వృద్ధు డైన, దశరథం నృపమ్=దశరథమహారాజును, స్మరతామ్=స్మరించిరి.

తా. వీరు లైన ఆ భరతశత్రుఘ్నులు మాతులగృహమునందు నివసించుచు సకలసౌఖ్యములను అనుభవించుచున్నను వృద్ధు డైన తమ తండ్రిని స్మరించుచునే యుండిరి. 3

మూ. రాజాపి తౌ మహాతేజాః సస్మార ప్రోషితౌ సుతౌ,
ఉభౌ భరతశత్రుఘ్నౌ మహేన్ద్రవరుణోపమౌ. 4

ప్ర. అ. మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రాజాపి=రాజు కూడ, మహేన్ద్రవరుణోపమౌ=మహేంద్రవరుణులతో సమానులును, ప్రోషితౌ=ప్రవాసము నందున్నవారును, సుతౌ=కుమారులును అయిన, భరతశత్రుఘ్నౌ ఉభౌ=భరతశత్రుఘ్నుల నిద్దరిని, సస్మార=స్మరించెను.

తా. మహాతేజశ్శాలి యైన దశరథుడు కూడ మహేంద్రవరుణులతో సమాను లైనవారును, దేశాంతరమునం దున్నవారును, అయిన తన కుమారు లైన భరతశత్రుఘ్నులను సదా స్మరించుచుండెను. 4

మూ. సర్వ ఏవ తు తస్యేష్టాశ్చత్వారః పురుషర్షభాః,
స్వశరీరాద్వినిర్వృత్తాశ్చత్వార ఇవ బాహవః. 5

ప్ర. అ. చత్వారః=నలుగురు, పురుషర్షభాః=పురుషశ్రేష్ఠు లైన, సర్వే ఏవ తు=వారందరును, తస్య=ఆ దశరథునకు, స్వశరీరాత్=తన శరీరమునుండి, వినిర్వృత్తాః=వెలువడిన, చత్వారః బాహవః ఇవ=నాలుగుబాహువుల వలె, ఇష్టాః=ఇష్టమైనవారు.

తా. దశరథుడు పురుషశ్రేష్ఠులైన ఆ నలుగురు కుమారులను తన శరీరమునుండి ఆవిర్భవించిన నాలుగుబాహువులను వలె సమముగనే ప్రేమించెను.

మూ. తేషామపి మహాతేజా రామో రతికరః పితుః,
స్వయమ్భూరివ భూతానాం బభూవ గుణవత్తరః. 6

ప్ర. అ. భూతానామ్ = సమస్త ప్రాణులలో, స్వయమ్భూరివ = బ్రహ్మదేవుడు వలె, తేషామపి = ఆ అన్నదమ్ములలో, గుణవత్తరః = అధికగుణములు కలవాడు, మహాతేజాః = గొప్పతేజస్సుగలవాడు అయిన, రామః = రాముడు, పితుః = తండ్రికి, రతికరః = ఆనందమును కలిగించువాడుగా, బభూవ = అయెను.

తా. ప్రాణులలో బ్రహ్మదేవుడు వలె, సోదరులలో అధికగుణవంతుడూ మహాతేజశాలీ అయిన రామునిపై తండ్రికి ప్రేమ అధికముగా నుండెను. 6.

మూ. స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః,
అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుః సనాతనః. 7

ప్ర. అ. సనాతనః = శాశ్వతుడైన, విష్ణుః = విష్ణువు, ఉదీర్ణస్య = దృప్తుడైన, రావణస్య = రావణునియొక్క, వధార్థిభిః = వధను కోరిన, దేవైః = దేవతలచేత, అర్థితః = కోరబడినవాడై, మానుషే లోకే = మనుష్యలోకమునందు, సః = రాముడుగా, జజ్ఞే హి = పుట్టెను కదా.

తా. ఆ రాముడు, దృప్తుడైన రావణుని సంహరించుటకై దేవతలు ప్రార్థింపగా భూలోకములో పుట్టిన శాశ్వతుడైన విష్ణుమూర్తి కదా 7

మూ. కౌసల్యా శుశుభే తేన పుత్రేణామితతేజసా,
యథా వరేణ దేవానామదితిర్వజ్రపాణినా. 8

ప్ర. అ. అమితతేజసా = అపారమైన తేజస్సు గల, పుత్రేణ = పుత్రుడైన, తేన = ఆ రామునిచేత, కౌసల్యా = కౌసల్య, దేవానాం వరేణ = దేవతలలో శ్రేష్ఠుడైన, వజ్రపాణినా = వజ్రమును హస్తమునందు ధరించు ఇంద్రునిచేత, అదితిర్యథా = అదితి వలె, శుశుభే = ప్రకాశించినది.

తా. అనంతతేజశ్శాలి యైన కుమారుడైన ఆ రామునిచేత కౌసల్య, దేవతలలో శ్రేష్ఠుడైన ఇంద్రునిచేత అదితి వలె ప్రకాశించెను. 8

మూ. స హి రూపోపపన్నశ్చ వీర్యవాననసూయకః,
భూమావనుపమః సూనుర్గుణైర్దశరథోపమః. 9

ప్ర. అ. సః = ఆ రామురు, రూపోపపన్నః చ = రూపముగలవాడు. వీర్యవాన్ = వీర్యవంతుడు. అనసూయకః = అసూయ లేనివాడు. గుణైః = గుణము లచే, దశరథోపమః = దశరథునితో సమానుడు. భూమౌ = భూమియందు, అను పమః = సాటిలేని, సూనుః హి = పుత్రుడు కదా.

తా. రాముడు సౌందర్యశాలి. పరాక్రమవంతుడు. అసూయ లేనివాడు. గుణములచే దశరథునివంటివాడు. ఈ విధముగ అతడు భూమిపై సాటిలేని కుమారుడు కదా. 9

మూ. స చ నిత్యం ప్రశాన్తాత్మా మృదుపూర్వం తు భాషతే,
ఉచ్యమానోఽపి పరుషం నోత్తరం ప్రతిపద్యతే 10

ప్ర. అ. నిత్యమ్ = ఎల్లప్పుడును, ప్రశాన్తాత్మా = ప్రశాంతమైన మనస్సు కల, సః = ఆ రాముడు, మృదుపూర్వమ్ = మృదువుగా, భాషతే = మాటలాడును. పరుషమ్ = పరుషవాక్యమును, ఉచ్యమానః అపి = చెప్పబడినవాడైనను, ఉత్తరమ్ = ప్రత్యుత్తరమును, న ప్రతిపద్యతే = పొందడు (చెప్పడు).

తా. ఎల్లపుడును ప్రశాంతచిత్తుడైన ఆ రాముడు మృదువుగనే మాట లాడును. ఎవరైన పరుషవాక్యములు పలికినను దానికి ప్రత్యుత్తరము చెప్పడు. 10

మూ. కథంచిదుపకారేణ కృతేనైకేన తుష్యతి,
న స్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా. 11

ప్ర. అ. ఆత్మవత్తయా = మంచి మనస్సు కలవాడు అగుటచే, సః = ఆ రాముడు, కథంచిత్ = ఏదియో విధముగ, కృతేన = చేయబడిన, ఏకేన = ఒక, ఉపకారేణ = ఉపకారముచేత, తుష్యతి = సంతోషించును. అపకారాణామ్ = అప కారములయొక్క, శతమపి = శతమునైనను, న స్మరతి = స్మరింపడు.

తా. మంచి మనస్సు గల ఆ రాముడు ఎవరైన ఏదియో విధముగ ఒక్క ఉపకారము చేసినను దానికే సంతోషించును. ఇతరులు ఎన్ని అపకారములు చేసి నను వానిని స్మరింపడు. 11

మూ. శీలవృద్ధై ర్జ్ఞానవృద్ధైర్వయోవృద్ధైశ్చ సజ్జనైః,
కథయన్నాస్త వై నిత్య మస్త్రయోగ్యాన్తరేష్వపి. 12

ప్ర. అ. అస్త్రయోగ్యాన్తరేష్వపి = అస్త్రాభ్యాస సమయమునందు లభించిన అవకాశమునందు కూడ, శీలవృద్ధైః = శీలముచే పెద్దవారితోడను, జ్ఞానవృద్ధైః = జ్ఞానముచేత పెద్దవారితోడను, వయోవృద్ధైశ్చ = వయస్సుచేత పెద్దవారితోడను, సజ్జనైః = సజ్జనులతోడను, నిత్యమ్ = ఎల్లప్పుడును, కథయన్ = సంభాషణచేయుచు, అస్త = ఉండెను.

తా. అస్త్రాభ్యాసము చేయు సమయమునందు అవకాశము లభించినపుడు గూడ రాముడు, శీలవృద్ధులవద్దకును, జ్ఞానవృద్ధులవద్దకును, వయోవృద్ధులవద్దకును, సత్పురుషుల వద్దకును వెళ్ళి వారితో సంభాషించుచుండెడివాడు. 12

మూ. బుద్ధిమాన్ మధురాభాషీ పూర్వభాషీ ప్రియంవదః,
వీర్యవాన్న చ వీర్యేణ మహతా స్వేన విస్మితః. 13

ప్ర. అ. (రాముడు) బుద్ధిమాన్ = మంచి బుద్ధి కలవాడు. మధురాభాషీ = మధురముగా మాటలాడువాడు. పూర్వభాషీ = ముందుగనే మాటలాడువాడు. ప్రియంవదః = ప్రియముగా పలుకువాడు. వీర్యవాన్ = పరాక్రమవంతుడు. మహతా = గొప్పదైన, స్వేన = తన సంబంధమైన, వీర్యేణ = పరాక్రమముచేత, న చ విస్మితః = గర్వించినవాడు కాడు.

తా. రాముడు మహాబుద్ధిశాలి. మధురముగా మాటలాడువాడు. ఇతరులను తానే ముందుగా పలుకరించి ప్రియముగా మాటలాడువాడు, పరాక్రమవంతుడు. ఐనను, తన కున్న పరాక్రమాతిశయమును చూచుకొని గర్వించని వాడు. 13

మూ. న చానృతకథో విద్వాన్ వృద్ధానాం ప్రతిపూజకః,
అనురక్తః ప్రజాభిశ్చ ప్రజాశ్చాప్యనురజ్యతే. 14

ప్ర. అ. (ఆ రాముడు) అనృతకథః = అసత్యము చెప్పువాడు, న చ = కాడు. విద్వాన్ = అన్ని విషయములు తెలిసినవాడు. వృద్ధానామ్ = వృద్ధులకు ప్రతిపూజకః = ఎదు రేగి గౌరవము చేయువాడు. ప్రజాభిః = ప్రజలచేత, అను

రక్తః = ప్రేమింపబడినవాడు. ప్రజాశ్చాపి = ప్రజలను కూడ, అనురజ్యతే = ప్రేమించువాడు.

తా. రాము డెన్నడును అసత్య మాడి ఎరుగడు. అన్ని (విషయములు) తెలిసినవాడు. పెద్దలను సగౌరవముగా ఎదు రేగి పూజించువాడు. ప్రజలకు అతనిపై ఎంత ప్రేమ ఉండెడిదో అతనికి కూడ ప్రజలపై అంత ప్రేమ ఉండెడిది. 14

మూ. సానుక్రోశో జితక్రోధో బ్రాహ్మణప్రతిపూజకః,
దీనానుకమ్పీ ధర్మజ్ఞో నిత్యం ప్రగ్రహవాన్ శుచిః. 15

ప్ర. అ. (ఆ రాముడు), సానుక్రోశః = దయ కలవాడు. జితక్రోధః = జయింపబడిన క్రోధము కలవాడు. బ్రాహ్మణప్రతిపూజకః = బ్రాహ్మణులను ఎదురేగి పూజించువాడు, దీనానుకమ్పీ = దీనులపై జాలిగొనువాడు. ధర్మజ్ఞః = ధర్మము తెలిసినవాడు. నిత్యమ్ = ఎల్లప్పుడును, ప్రగ్రహవాన్ = ఆత్మ సంయమము కల వాడు. శుచిః = పరిశుద్ధుడు (నిజాయితీ ఉన్నవాడు).

తా. ఆ రాముడు దయాళువు. కోపమును జయించినవాడు. బ్రాహ్మణు లకు ఎదురేగి సన్మానించువాడు. దీనులను చూచి జాలిచెందువాడు. ధర్మము లన్నియు తెలిసిన వాడు. ఎల్లప్పుడును తనను తన అదుపులో ఉంచుకొనువాడు. పరిశుద్ధవర్తనుడు. 15

మూ. కులోచితమతిః క్షాత్రం ధర్మం స్వం బహుమన్యతే,
మన్యతే పరయా కీర్త్యా మహత్స్వర్గఫలం తతః. 16

ప్ర. అ. (ఆ రాముడు), కులోచితమతిః = తన వంశమునకు తగిన బుద్ధి కలవాడై, స్వమ్ = తనకు సంబంధించిన, క్షాత్రం ధర్మమ్ = క్షత్రియధర్మమును, బహుమన్యతే = గౌరవించును. తతః = ఆ క్షాత్రధర్మమువలన కలిగిన, పరయా కీర్త్యా = గొప్ప కీర్తిచేత, మహత్ = గొప్ప, స్వర్గఫలమ్ = స్వర్గఫలమును, మన్యతే = తలచును.

తా. తన వంశమునకు తగిన బుద్ధి గల ఆ రాముడు తన క్షత్రియ ధర్మము విషయమున అత్యంతాదరము చూపుచు, ఆ ధర్మము నాచరించుట వలన కలుగు గొప్ప కీర్తిచే స్వర్గ మను ఫలము కలుగు నని విశ్వసించెను. 16

మూ. నాశ్రేయసి రతో విద్వాన్న విరుద్ధకథారుచిః,
ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతి ర్యథా. 17

ప్ర. అ. అశ్రేయసి = శ్రేయస్కరము కాని కార్యమునందు, రతః = ఆసక్తి కలవాడు, న = కాడు. విద్వాన్ = పండితుడు. విరుద్ధకథారుచిః = ధర్మ విరుద్ధమైన మాటలయందు అభిరుచి కలవాడు, న = కాడు. ఉత్తరోత్తరయుక్తౌ = ఒకదాని తరువాత ఒకటిగా యుక్తులను చూపుటయందు, వాచస్పతిర్యథా = బృహస్పతి వలె, వక్తా = వక్త.

తా. రాముడు శ్రేయస్కరములు కాని కార్యములందు ఆసక్తి లేని వాడు; పండితుడు. ధర్మవిరుద్ధము లైన కథలయందు అభిరుచి లేనివాడు. వరుసగా యుక్తులను చూపుచు మాటలాడుటయందు బృహస్పతివంటివాడు. 17

మూ. ఆరోగ స్తరుణో వాగ్మీ వపుష్మాన్ దేశకాలవిత్,
లోకే పురుషసారజ్ఞస్సాధురేకో వినిర్మితః. 18

ప్ర. అ. (ఆ రాముడు) ఆరోగః = రోగము లేనివాడు. తరుణః = యువకుడు. వాగ్మీ = వాక్చాతుర్యము కలవాడు. వపుష్మాన్ = మంచి దేహము కలవాడు. దేశకాలవిత్ = ఆ యా కార్యములకు తగిన దేశము, కాలము తెలిసినవాడు. పురుషసారజ్ఞః = పురుషుల సారమును గ్రహించగలిగినవాడు. లోకే = లోకమునందు, వినిర్మితః = సృష్టింపబడిన, ఏకః = ఒకే ఒక, సాధుః = సత్పురుషుడు.

తా. ఆ రాముడు రోగము లేని యువకుడు, మంచి వాక్చాతుర్యము కలవాడు. అందమైన దేహము కలవాడు. ఏ దేశమునందు, ఏ కాలమునందు ఏ పని చేయవలెనో తెలిసినవాడు. పురుషులలో ఉన్న సారమును గ్రహింపగలవాడు. లోకములో జనించిన ఏకైకసత్పురుషుడు. 18

మూ. స తు శ్రేష్ఠైర్గుణైర్యుక్తః ప్రజానాం పార్థివాత్మజః,
బహిశ్చర ఇవ ప్రాణో బభూవ గుణతః ప్రియః. 19

ప్ర. అ. శ్రేష్ఠైః = శ్రేష్ఠములైన, గుణైః = గుణములతో, యుక్తః = కూడిన, సః = ఆ, పార్థివాత్మజః = రాజకుమారుడు, ప్రజానామ్ = ప్రజలకు, గుణతః = గుణములవలన, ప్రియః = ప్రియుడై, బహిశ్చరః = బైట సంచరించు, ప్రాణః ఇవ = ప్రాణమువలె, బభూవ = ఉండెను.

తా. ఇట్టి శ్రేష్ఠగుణములుగల రాజకుమారు డైన ఆ రామునిపై ప్రజ లందరును చాల ప్రేమ గలవారై, ఆతనిని బైట సంచరించుచున్న తమ ప్రాణముగా భావించిరి. 19

మూ. సమ్యగ్విద్యావ్రతస్నాతో యథావత్సాఙ్గవేదవిత్,
ఇష్వస్త్రే చ పితుః శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః. 20

ప్ర. అ. సమ్యక్ = బాగుగా, విద్యావ్రతస్నాతః = విద్యావ్రతమునందు స్నానము చేసిన (విద్యాభ్యాసవ్రతమును ముగించుకొనిన) వాడును, యథావత్ = యథార్థముగా, సాఙ్గవేదవిత్ = సాంగవేదములను నేర్చిన (తెలిసికొనిన) వాడును అగు, భరతాగ్రజః = రాముడు, ఇష్వస్త్రే = బాణాస్త్రప్రయోగమునందు, పితుః = తండ్రికంటె, శ్రేష్ఠః = శ్రేష్ఠుడుగా, బభూవ = ఉండెను.

తా. విద్యాభ్యాసనియమమును చక్కగా పూర్తిచేసికొని సాంగవేద నిష్ణాతు డైన ఆ రాముడు ధనుర్వేదమునందు తండ్రిని మించి యుండెను. 20

మూ. కల్యాణాభిజనః సాధురదీనః సత్యవాగృజుః,
వృద్ధైరభివినీతశ్చ ద్విజైర్ధర్మార్థదర్శిభిః. 21

ప్ర. అ. కల్యాణాభిజనః = ఉత్తమమైన వంశమునందు జనించిన ఆ రాముడు, సాధుః = సత్పురుషుడు. అదీనః = దైన్యము లేనివాడు. సత్యవాక్ = సత్య మైన వాక్కు కలవాడు. ఋజుః = వక్రబుద్ధిలేనివాడు. ధర్మార్థదర్శిభిః = ధర్మార్థములను ఎరిగిన, వృద్ధైః = వృద్ధు లైన, ద్విజైః = బ్రాహ్మణులచే, అభివినీతః = చక్కగా శిక్షింపబడినవాడు.

తా. సద్వంశసంజాతు డైన ఆ రాముడు సాధుస్వభావుడు; దైన్యము లేనివాడు. సత్యమునే పలుకువాడు. ఋజుప్రవర్తన కలవాడు. ధర్మార్థజ్ఞు లైన వృద్ధులగు బ్రాహ్మణులనుండి చక్కగా విద్యాబుద్ధులు నేర్చినవాడు. 21

మూ. ధర్మకామార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్,
లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః. 22

ప్ర. అ. ఆ రాముడు, ధర్మకామార్థతత్త్వజ్ఞః = ధర్మ-కామ-అర్థముల యథార్థస్వరూపము తెలిసినవాడు. స్మృతిమాన్ = స్మరణశక్తి కలవాడు. ప్రతి

కాలవిత్ = సమయస్ఫూర్తి కలవాడు. లోకే=లోకవ్యవహారమునకు సంబంధించిన, సమయాచారే = ఆ యా సమయముల కనుయుక్తమగు నట్లు ఏర్పరచిన ఆచారమునందు, కృతకల్పః = చేయబడిన ఏర్పాటు కలవాడు. విశారదః = నేర్పు కలవాడు.

తా. ఆ రాముడు ధర్మార్థకామముల యథార్థస్వరూపము తెలిసినవాడు. మఱపు లేనివాడు. సమయస్ఫూర్తి కలవాడు ఆ యా సమయములలో ఉపయోగించే లోకవ్యవహారోపయుక్తములైన ఆచారములందు, విశారదుడై వాటిని ఏర్పరచువాడు. 22.

మూ. నిభృతః సంవృతాకారో గుప్తమన్త్రః సహాయవాన్,
అమోఘక్రోధహర్షశ్చ త్యాగసంయమకాలవిత్. 23

ప్ర. అ. నిభృతః = అణకువతో ఉండెడివాడు. సంవృతాకారః = కప్పబడిన ఆకారము కలవాడు. గుప్తమన్త్రః = రహస్యముగా నుంచబడిన ఆలోచన కలవాడు. సహాయవాన్ = మంచి సహాయము కలవాడు. అమోఘక్రోధహర్షశ్చ = వ్యర్థములుగాని క్రోధహర్షములు కలవాడు. త్యాగసంయమకాలవిత్ = దానము చేయుటయొక్క, చేయకుండుటయొక్క కాలము తెలిసినవాడు.

తా. ఆ రాముడు అణకువ కలవాడు. లోపలనున్న భావమును ముఖవికారములచే పైకి తెలియనీయనివాడు. ఆలోచనలను రహస్యముగ ఉంచువాడు. సహాయవంతుడు. అతనికి కోపము వచ్చినను, సంతోషము కలిగినను వ్యర్థములు కావు. ఎవ్వరు దానము చేయవలెనో ఎప్పుడు చేయగూడదో తెలిసినవాడు. 23

మూ. దృఢభక్తిః స్థిరప్రజ్ఞో నాసద్గ్రాహీ న దుర్వచాః,
నిస్తన్ద్రిరప్రమత్తశ్చ స్వదోషపరదోషవిత్. 24

ప్ర. అ. ఆ రాముడు, దృఢభక్తిః = దృఢమైన భక్తి కలవాడు. స్థిరప్రజ్ఞః = స్థిరమైన బుద్ధి కలవాడు. అసద్గ్రాహీ=మొండిపట్టు గలవాడు, న= కాడు. దుర్వచాః=చెడ్డమాటలు కలవాడు, న = కాడు. నిస్తన్ద్రిః=సోమరితనము లేనివాడు. అప్రమత్తః = ఏమరిపాటు లేనివాడు. స్వదోషపరదోషవిత్= తనలో ఉన్న దోషములను పరులలో ఉన్న దోషములను తెలిసికొనగలిగినవాడు.

తా. ఆ రాముడు పెద్దల విషయమున దృఢమైన భక్తి కలవాడు. చపలత్వము లేని బుద్ధి కలవాడు. మొండి పట్టుదల లేని వాడు. చెడ్డమాటలు

వలుకనివాడు. సోమరితనము గాని, ఏమరిపాటు గాని లేనివాడు. ఇతరులలో ఉన్న దోషములనే కాక తనలో ఉన్న దోషములనుకూడ గుర్తింపగలవాడు. 24

మూ. శాస్త్రజ్ఞశ్చ కృతజ్ఞశ్చ పురుషాన్తరకోవిదః,
యః ప్రగ్రహానుగ్రహయోర్యథాన్యాయం విచక్షణః. 25

ప్ర. అ. యః = ఏ రాముడు, శాస్త్రజ్ఞః చ = శాస్త్రములు తెలిసినవాడు. కృతజ్ఞః చ=కృతజ్ఞుడు. పురుషాన్తరకోవిద=పురుషులలో తారతమ్యమును ఎరిగిన వాడు. యథాన్యాయమ్=న్యాయానుసారముగా, ప్రగ్రహానుగ్రహయోః=అపరాధులను నిగ్రహించుటయందును మంచివారిని అనుగ్రహించుటయందును, విచక్షణః= నేర్పు గలవాడు.

తా. ఆ రాముడు శాస్త్రములు తెలిసినవాడు. చేసిన మేలు మరువనివాడు. పురుషుల తారతమ్యమును గ్రహింపగలవాడు. న్యాయానుసారముగా దుష్టులను నిగ్రహించుటయందును, శిష్టులను అనుగ్రహించుటయందును నేర్పు గలవాడు. 25

మూ. సత్సంగ్రహప్రగ్రహణే స్థానవిన్నిగ్రహస్య చ,
ఆయకర్మణ్యుపాయజ్ఞః సందృష్టవ్యయకర్మవిత్. 26

ప్ర. అ. ఆ రాముడు, సత్సంగ్రహప్రగ్రహణే = సత్పురుషులను చేరదీయుటయందును వారిని రక్షించుటయందును, (విచక్షణః = నేర్పుగలవాడు). నిగ్రహస్య చ=నిగ్రహించుటకు, స్థానవిత్ = తగిన వ్యక్తులను ఎరిగినవాడు. ఆయకర్మణి = ఆయకర్మయందు, ఉపాయజ్ఞః = ఉపాయములు తెలిసినవాడు. సందృష్టవ్యయకర్మవిత్=శాస్త్రములో చూడబడిన వ్యయకర్మను ఎరిగినవాడు.

తా. రాముడు సత్పురుషులను చేరదీసి రక్షించుటలో నిపుణుడు. ఎవరిని నిగ్రహించవలెనో తెలిసినవాడు. ధనము సంపాదించు ఉపాయములు తెలిసిన వాడు శాస్త్రోక్తప్రకారము వ్యయము చేయు పద్ధతి నెరిగినవాడు. 26

మూ. శ్రైష్ఠ్యం శాస్త్రసమూహేషు ప్రాప్తో వ్యామిశ్రకేషు చ,
అర్థధర్మౌ చ సంగృహ్య సుఖతన్త్రో న చాలసః. 27

ప్ర. అ. ఆ రాముడు, శాస్త్రసమూహేషు = శాస్త్రముల సముదాయము లందును, వ్యామిశ్రకేషు చ = పరస్పరసంబంధము గల విద్యలందును,

శ్రైష్ఠ్యమ్ = శ్రేష్ఠత్వమును, ప్రాప్తః = పొందినవాడు. అర్థధర్మౌ = అర్థధర్మములను, సంగృహ్య = సంగ్రహించుకొని, సుఖతన్త్రః = సుఖాసక్తికలవాడు. అలసః = సోమరితనము కలవాడు. న = కాడు.

తా. రాముడు శాస్త్రముల సముదాయములందును, ఒకదానితో ఒకటి సంబంధించి ఉన్న (లేదా చిన్న చిన్న) విద్యలందును గొప్ప ప్రావీణ్యమును సంపాదించినాడు. అర్థధర్మముల విషయమున సరియైన జాగరూకత వహించిన పిమ్మటనే భోగములను అనుభవించెడివాడు. ఎన్నడును అలసత్వము లేనివాడు.

వి. 'వ్యామిశ్రకేషు' అనుదానికి సంస్కృత ప్రాకృతాది వివిధభాషా మిశ్రితములైన కావ్యనాటకాదులందు అని కొందరు వ్యాఖ్యాతలు అర్థము చెప్పినారు. రామాయణము ఆదికావ్య మని అంటూ రామునికాలంలో సంస్కృతప్రాకృతాది కావ్యా లున్నా వని చెప్పుట ఎంతవరకు సమంజసమో తెలియదు. 27

మూ. వైహారికాణాం శిల్పానాం విజ్ఞాతార్థవిభాగవిత్,
ఆరోహే వినయే చైవ యుక్తో వారణవాజినామ్. 28

ప్ర. అ. ఆ రాముడు, వైహారికాణామ్ = మనోవినోదమునకు ఉపయోగించు, శిల్పానామ్ = సంగీతాదివిద్యలను, విజ్ఞాతా = తెలిసికొన్నవాడు. అర్థవిభాగవిత్ = ధనమును ఎట్లు పంచవలెనో తెలిసినవాడు. వారణవాజినామ్ = ఏనుగులను గుఱ్ఱములను, ఆరోహే = ఎక్కుటయందును, వినయే చైవ = వాటిని అదుపులో పెట్టుటయందును, యుక్తః = సమర్థుడు.

తా. రాముడు, వినోదమునకై ఉపయోగించు సంగీతనృత్యాదులలో ప్రవేశ మున్నవాడు. ధనము నెట్లు వ్యయము చేయవలెనో తెలిసినవాడు. ఏనుగులను, గుఱ్ఱములను లొంగదీసికొని వాటిని అధిరోహించుటకు సమర్థుడు.

వి. ధర్మాయ యశసేఽర్థాయ ఆత్మనే స్వజనాయ చ.
పఞ్చధా విభజన్ విత్తమిహాముత్ర చ శోభతే"

అని — (సంపాదించిన ధనమును ధర్మముకొరకు, కీర్తికొరకు, లౌకిక వ్యవహారముకొరకు, తనకొరకు, స్వజనముకొరకు ఐదు విధముల వితరించువాడు ఇహపరలోకములలో ప్రకాశించును) ధనవ్యయమునకు ఐదు మార్గములు చెప్పబడినవి. 28

మూ. ధనుర్వేదవిదాం శ్రేష్ఠో లోకేఽతిరథసంమతః,
అభియాతా ప్రహర్తా చ సేనానయవిశారదః. 29

ప్ర. అ. రాముడు, లోకే = ప్రపంచములోని, ధనుర్వేదవిదామ్ = ధనుర్వేదము తెలిసినవారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడు. అతిరథసంమతః = ఒకే సమయమున అనేక ధనుర్ధరులతో యుద్ధముచేయు అతిరథులచేత పూజింపబడినవాడు. అభియాతా = శత్రువులకు ఎదురుగా వెళ్లువాడు. ప్రహర్తా చ = వారిని చంపువాడు. సేనానయవిశారదః = సేనలను నడుపుటయందు చాల సమర్థుడు.

తా. ప్రపంచమునందలి ధనుర్వేదవేత్తలలో శ్రేష్ఠుడైన ఆ రాముని అతిరథు లందరును మెచ్చుకొనెడివారు. సేనను నడపుటలో మంచి నైపుణ్యము గల ఆ రాముడు శత్రువులపై దండెత్తి వారిని సంహరించెడివాడు. 29.

మూ. అప్రధృష్యశ్చ సంగ్రామే క్రుద్ధైరపి సురాసురైః,
అనసూయో జితక్రోధో న దృప్తో న చ మత్సరీ,
న చావమన్తా భూతానాం న చ కాలవశానుగః. 30

ప్ర. అ. ఆ రాముడు, క్రుద్ధైః = కోపించిన, సురాసురైరపి = దేవతలచేతను రాక్షసులచేతను కూడ, సంగ్రామే = యుద్ధమునందు, అప్రధృష్యః = ఎదిరింప శక్యము కానివాడు. అనసూయః = అసూయ లేనివాడు. జితక్రోధః = జయింపబడిన క్రోధము గలవాడు. న దృప్తః = గర్వించనివాడు. మత్సరీ చ = మత్సరము కలవాడు కూడ, న = కాడు. భూతానామ్ = ప్రాణులను, న చ అవమన్తా = అవమానించనివాడు. కాలవశానుగః చ = కాలమునకు లొంగిపోవువాడు గూడ, న = కాడు.

తా. కోపించిన సురాసురులు కూడ రాముని యుద్ధమునందు ఎదిరింప జాలరు. ఆతడు అసూయ లేనివాడు. క్రోధమును జయించినవాడు. గర్వము, మత్సరము లేనివాడు. ఏ ప్రాణిని గూడ అవమానించడు. కాలమును బట్టి మారిపోవువాడు కాడు.

వి. ఇతరుల గుణములను దోషములుగా చిత్రించు స్వభావము అసూయ. ఇతరుల ఉన్నతిని చూచి ఓర్వజాలకపోవుట మత్సరము. 30

మూ. ఏవం శ్రేష్ఠగుణైర్యుక్తః ప్రజానాం పార్థివాత్మజః,
సంమతస్త్రిషు లోకేషు వసుధాయాః క్షమాగుణైః, 31
బుద్ధ్యా బృహస్పతేస్తుల్యో వీర్యేణాపి శచీపతేః.

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, శ్రేష్ఠగుణైః = శ్రేష్ఠములైన గుణములతో, పార్థివాత్మజః = రాజకుమారు డైన రాముడు, ప్రజానామ్ = ప్రజలకు, యుక్తః = తగినవాడుగా ఉండెను. త్రిషు లోకేషు = మూడు లోకములందును, సంమతః = పూజింపబడినవాడు. క్షమాగుణైః = ఓర్పుతో సంబంధించిన గుణములచేత, వసుధాయాః = భూమికిని, బుద్ధ్యా = బుద్ధిచేత, బృహస్పతేః = బృహస్పతికిని, వీర్యేణ = పరాక్రమముచేత, శచీపతేః = దేవేంద్రునకును, తుల్యః = సమానుడు.

తా. ఇట్టి శ్రేష్ఠగుణములతో కూడిన ఆ రాజకుమారుడు ప్రజలకు తగినవాడుగా ఉండెను. మూడు లోకములందును పూజ్యుడయ్యెను. ఓర్పుచేతను దానికి సంబంధించిన ఇతరసద్గుణములచేతను భూమితోను, బుద్ధిచే బృహస్పతితోను, పరాక్రమముచే దేవేంద్రునితోను, సమానుడై ఉండెను. 31

మూ. తథా సర్వప్రజాకాన్తైః ప్రీతిసంజననైః పితుః, 32
గుణైర్విరురుచే రామో దీప్తః సూర్య ఇవాంశుభిః.

ప్ర. అ. తథా = అట్లు, సర్వప్రజాకాన్తైః = సకలప్రజలకును మనోహరములైనవీ, పితుః = తండ్రికి, ప్రీతిసంజననైః = ఆనందమును కలిగించునవీ అగు, గుణైః = గుణములచేత, రామః = రాముడు, అంశుభిః = కిరణములచేత, దీప్తః = ప్రకాశించుచున్న, సూర్యః ఇవ = సూర్యుడు వలె, విరురుచే = ప్రకాశించెను.

తా. రాము డీ విధముగ ప్రజలందరికిని ఆనందమును కలిగించునవీ, తండ్రికి సంతోషము కలిగించునవీ, అగు గుణములచేత, కిరణములచేత ప్రజ్వలించుచున్న సూర్యుడు వలె ప్రకాశించెను. 32

మూ. తమేవంవ్రతసంపన్నమప్రధృష్యపరాక్రమమ్, 33
లోకపాలోపమం నాథమకామయత మేదినీ.

ప్ర. అ. ఏవంవ్రతసంపన్నమ్ = ఇట్టి నియమములతో కూడినవాడును, అప్రధృష్యపరాక్రమమ్ = ఎదిరింప శక్యము కాని పరాక్రమము గలవాడును, లోక

పాలోపమమ్ = ఇంద్రాదిలోకపాలకులతో సమానుడును అగు, తమ్ = ఆ రాముని, మేదినీ = భూమి, నాథమ్ = ప్రభువుగా, అకామయత = కోరెను.

తా. ఆశ్రితరక్షణాది నియమసంపన్నుడును, ఎదిరింప శక్యము కాని పరాక్రమము కలవాడును, ఇంద్రాదిదిక్పాలురతో సమానుడును అగు ఆ రాముడు తనకు ప్రభువు కావలె నని భూమి కోరెను. 33

మూ. ఏతైస్తు బహుభిర్యుక్తం గుణైరనుపమైః సుతమ్, 34
దృష్ట్వా దశరథో రాజా చక్రే చింతాం పరంతపః.

ప్ర. అ. పరంతపః = శత్రువులను పీడించు, దశరథః రాజా = దశరథ మహారాజు, అనుపమైః = సాటిలేని, బహుభిః = అనేక మైన, ఏతైః = ఈ, గుణైః = గుణములతో, యుక్తమ్ = కూడిన, సుతమ్ = కుమారుని, దృష్ట్వా = చూచి, చింతామ్ = ఆలోచనను, చక్రే = చేసెను.

తా. శత్రుసంహారకు డగు దశరథమహారాజు, సాటి లేని ఇట్టి అనేక గుణములతో కూడిన కుమారుని చూచి ఇట్లాలోచించెను. 34

మూ. అథ రాజ్ఞో బభూవైవం వృద్ధస్య చిరజీవినః, 35
ప్రీతిరేషా కథం రామో రాజా స్యాన్మయి జీవతి.

ప్ర. అ. అథ = పిమ్మట, చిరజీవినః = చిరకాలము జీవించినవాడును, వృద్ధస్య = వృద్ధుడును అగు, రాజ్ఞః = దశరథునకు, మయి = నేను, జీవతి = జీవించి యుండగా, రామః = రాముడు, రాజా = రాజు, కథం స్యాత్ = ఎట్లు అగును; ఏషా ప్రీతిః = ఈ ఆనందము, (కథం స్యాత్ = ఎట్లగును), ఏవమ్ = ఇట్లు, బభూవ = ఆలోచన కలిగెను.

తా. చిరకాలజీవియు, వృద్ధుడును అగు దశరథునకు— "నేను జీవించి యుండగా రాముడు రాజగునా? నే నీ ఆనందమును అనుభవింతునా"? అని ఆలోచన కలిగెను. 35

మూ. ఏషా హ్యస్య పరా ప్రీతిర్హృది సంపరివర్తతే, 36
కదా నామ సుతం ద్రక్ష్యామ్యభిషిక్తమహం ప్రియమ్.

ప్ర. అ. అహమ్=నేను, అభిషిక్తమ్=రాజ్యాభిషిక్తు డైన, ప్రియం సుతమ్=ప్రియు డైన కుమారుని, కదా నామ=ఎప్పుడు, ద్రక్ష్యామి = చూడగలను? ఏషా=ఈ, పరా=గొప్ప, ప్రీతిః=ప్రేమపూర్వక మైన ఆలోచన, అస్య=ఈతని హృది = హృదయమునందు, సంపరివర్తతే హి = తిరుగుచున్నది కదా.

తా. నా ప్రియపుత్రు డగు రాముడు రాజ్యాభిషిక్తుడు కాగా నేనెప్పుడు చూడగలనో కదా అను గొప్ప ప్రేమపూర్వక మగు చింత ఆతని మనస్సులో మెదులుచుండును. 36

మూ. వృద్ధికామో హి లోకస్య సర్వభూతానుకమ్పనః, 37
మత్తః ప్రియతరో లోకే పర్జన్య ఇవ వృష్టిమాన్.

ప్ర. అ. లోకస్య=లోకముయొక్క, వృద్ధికామః=వృద్ధియందు కోరిక గలవాడును, సర్వభూతానుకమ్పనః=సకలభూతముల విషయమున జాలి కల వాడును అగు రాముడు, వృష్టిమాన్ = వర్షము గల, పర్జన్యః ఇవ=మేఘము వలె, లోకే=లోకమునందు, మత్తః=నాకంటె, ప్రియతరః హి = ఎక్కువ ప్రియ మైనవాడు కదా?

తా. ప్రజల అభివృద్ధిని కోరువాడు, సకలప్రాణులను దయతో చూచువాడు ఆయిన రాముడు వర్షించు మేఘము వలె ప్రజ లందరికిని నాకంటె గూడ ఎక్కువ ప్రియుడు కదా. 37

మూ. యమశక్రసమో వీర్యే బృహస్పతిసమో మతౌ, 38
మహీధరసమో ధృత్యాం మత్తశ్చ గుణవత్తరః.

ప్ర. అ. రాముడు, వీర్యే=పరాక్రమమునందు, యమ శక్ర సమః = యమునితోడను, దేవేంద్రునితోడను సమానుడు. మతౌ=బుద్ధియందు, బృహస్పతి సమః=బృహస్పతితో సమానుడు, ధృత్యామ్ = ధైర్యమునందు, మహీధరసమః= పర్వతముతో సమానుడు, మత్తః చ= నా కంటె కూడ, గుణవత్తరః = ఎక్కువ గుణవంతుడు.

తా. రాముడు పరాక్రమమునందు యమునితోను దేవేంద్రునితోను, బుద్ధియందు బృహస్పతితోను, ధైర్యమునందు పర్వతముతోను సమానుడు. నాకంటె కూడ చాల మంచి గుణములు కలవాడు. 38

మూ. మహీమహమిమాం కృత్స్నామధితిష్ఠన్తమాత్మజమ్, 38
అనేన వయసా దృష్ట్వా యథా స్వర్గమవాప్నుయామ్.

ప్ర. అ. కృత్స్నామ్=సమస్త మైన, ఇమామ్=ఈ, మహీమ్=భూమిని, అధితిష్ఠన్తమ్=అధిష్ఠించి యున్న, ఆత్మజమ్=కుమారుని, అనేన=ఈ, వయసా=వయస్సుతో, దృష్ట్వా=చూచి, అహమ్=నేను, యథా=ఎట్లు, స్వర్గమ్=స్వర్గమును, అవాప్నుయామ్=పొందుదునో, (అట్లు అగునా?).

తా. నా కుమారుడు ఈ భూమినంతను పరిపాలించుచుండగా ఈ వయస్సులో చూచి, నేను స్వర్గమును పొందెదనా? 39

మూ. ఇత్యేతైర్వివిధై స్తైస్తై రన్యపార్థివదుర్లభైః, 40
శిష్టైరపరిమేయైశ్చ లోకే లోకోత్తరైర్గుణైః,
తం సమీక్ష్య మహారాజో యుక్తం సముదితైః శుభైః, 41
నిశ్చిత్య సచివైః సార్ధం యువరాజమమన్యత.

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, వివిధైః=అనేకవిధము లైన, అన్యపార్థివదుర్లభైః=ఇతరరాజులకు దుర్లభము లైన, తైః తైః=ఆయా, ఏతైః=ఈ గుణములతోడను, లోకే=లోకమునందు, అపరిమేయైః=లెక్కింప శక్యము కానివియు, లోకోత్తరైః=లోకములో శ్రేష్ఠమైనవియు, సముదితైః=ఒక్కచోటకలిసినవియు, శుభైః=మంగళప్రదములైనవియు అగు, శిష్టైః=మిగిలిన, గుణైః=గుణములతోడను, యుక్తమ్=కూడిన, తమ్=ఆ రాముని, సమీక్ష్య=చూచి, మహారాజః=దశరథమహారాజు, సచివైః సార్ధమ్=మంత్రులతో కూడ, నిశ్చిత్య=నిశ్చయించి, యువరాజమ్=యువరాజునుగా, అమన్యత=తలచెను.

తా. రామునియందు ఇంతవరకు చెప్పిన ఇతరరాజదుర్లభము లైన ఈ వివిధగుణములే కాక ఇంకను ఎన్నియో శుభగుణములు చేరి యున్నవి. అవి లెక్కింపరానివి. లోకములో శ్రేష్ఠమైనవి. అట్టి రాముని చూచి దశరథమహారాజు మంత్రులతో ఆలోచించి అతనిని యువరాజును చేయవలెనని నిర్ణయించెను. 40,41

మూ. దివ్యన్తరిక్షే భూమౌ చ ఘోరముత్పాతజం భయమ్, 42
సంచచక్షేఽథ మేధావీ శరీరే చాత్మనో జరామ్.

ప్ర. అ. అథ = అటు పిమ్మట, మేధావీ=మేధావి యైన దశరథుడు, దివి=స్వర్గము నందును, అన్తరిక్షే = ఆకాశమునందును, భూమౌ చ=భూమి యందును, ఉత్పాతజమ్ = ఉత్పాతములవలన కలిగిన (రాబోవు కీడును సూచించు తోకచుక్క కనబడుట మొద లైనవి ఉత్పాతములు), ఘోరమ్ = ఘోర మైన, భయమ్ = భయమును, ఆత్మనః = తనయొక్క, శరీరే = శరీరమునందు, జరాం చ = ముసలితనమును, ఆచచక్షే = చెప్పెను.

తా. బుద్ధిమంతు డగు దశరథుడు స్వర్గాకాశభూములపై కనబడుచున్న ఉత్పాతములచే ఘోరమైన భయము రానున్న దని సూచింపబడుచున్న దనియు, తన శరీరము జరాజీర్ణ మైపోయిన దనియు మంత్రులతో చెప్పెను. 42

మూ. పూర్ణచన్ద్రాననస్యాథ శోకాపనుదమాత్మనః, 43
లోకే రామస్య బుబుధే సంప్రియత్వం మహాత్మనః.

ప్ర. అ. అథ = మరియు, పూర్ణచన్ద్రాననస్య = పూర్ణచంద్రునివంటి ముఖము కలవాడును, మహాత్మనః = గొప్ప బుద్ధి కలవాడును అగు, రామస్య = రామునియొక్క, ఆత్మనః = తనయొక్క, శోకాపనుదమ్ = శోకమును తొలగించు, లోకే సంప్రియత్వమ్ = లోకమునందు ప్రియత్వమును, బుబుధే = తెలిసికొనెను.

, తా. పూర్ణచంద్రుని వంటి ముఖము గలవాడును, మహాబుద్ధిశాలియు అగు రాముడు లోకప్రియు డగుటచే అతనికి పట్టాభిషేకము చేసినచో తన కెట్టి విచారము ఉండ దను విషయమును గూడ గుర్తించెను. 43

మూ. ఆత్మనశ్చ ప్రజానాం చ శ్రేయసే చ ప్రియేణ చ, 44
ప్రాప్తకాలేన ధర్మాత్మా భక్త్యా త్వరితవాన్ నృపః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, నృపః = రాజు, ఆత్మనశ్చ = తనయొక్కయు, ప్రజానాం చ = ప్రజలయొక్కయు, శ్రేయసే చ = శ్రేయస్సుకొరకును, ప్రియేణ చ = సంతోషముచేతను, ప్రాప్తకాలేన = సంప్రాప్తించిన కాలముచేతను, సరియైన కాలము సంప్రాప్త మగుటచేతను, భక్త్యా = ఆసక్తితో, త్వరితవాన్ = తొందరపడెను.

తా. ధర్మాత్ము డైన ఆ దశరథమహారాజు, తనకును ప్రజలకును శ్రేయస్సుకొరకును, తన కా కార్యము ఇష్ట మగుటచేతను, సమయము వచ్చుటచేతను ఆసక్తిపూర్వకముగా రామాభిషేకార్థమై తొందర పడెను. 44

మూ. నానానగరవాస్తవ్యాన్ పృథగ్జానపదానపి, 45
సమానినాయ మేదిన్యాః ప్రధానాన్ పృథివీపతీన్.

ప్ర. ఆ. నానానగరవాస్తవ్యాన్ = అనేకనగరములలో నివసించువారును, జానపదానపి = గ్రామములలో నివసించువారును అగు, మేదిన్యాః = భూమియొక్క, ప్రధానాన్ = ప్రధానాధికారులను, పృథివీపతీన్ = రాజులను, పృథక్ = వేరువేరుగా, సమానినాయ = రప్పించెను.

తా. దశరథుడు రాజులను, నగరములలో నివసించు అధికారులను, గ్రామములలో నివసించు అధికారులను వేరు వేరుగా పిలిపించెను. 45

మూ. న తు కేకయరాజానం జనకం వా నరాధిపః, 46
త్వరయా చానయామాస పశ్చాత్తౌ శ్రోష్యతః ప్రియమ్.

ప్ర. ఆ. నరాధిపః = రాజు, త్వరయా = తొందరచే, కేకయరాజానమ్ = కేకయదేశరాజును గాని, జనకం వా = జనకుని గాని, తౌ = వారిరువురును, ప్రియమ్ = ఈ ప్రియవిషయమును, పశ్చాత్ = తరువాత, శ్రోష్యతః = వినగలరు అను అభిప్రాయముతో, న ఆనయామాస = రప్పించలేదు.

తా. తొందరలో నున్న ఆ దశరథుడు, భరతుని మాతామహు డైన కేకయరాజును గాని, జనకమహారాజును గాని పిలిపించలేదు. వా రీ శుభవార్తను తరువాత వినెదరు లెమ్మని భావించెను. 46

మూ. తాన్వేశ్మనానాభరణై ర్యథార్హం ప్రతిపూజితాన్, 47
దదర్శాలంకృతో రాజా ప్రజాపతిరివ ప్రజాః.

ప్ర. ఆ. వేశ్మనానాభరణైః = గృహములచేతను అనేకములైన అలంకారములచేతను, యథార్హమ్ = యోగ్యతానుసారముగా, ప్రతిపూజితాన్ = పూజింపబడిన, తాన్ = వారి నందరిని, రాజా = దశరథమహారాజు, అలంకృతః =

అలంకరింపబడినవారై, ప్రజాపతిః = బ్రహ్మదేవుడు; ప్రజాః ఇవ = ప్రజలను వలె, దదర్శ = చూచెను.

తా. దశరథమహారాజు, వారి నందరిని నివాసాంతరచారులలో తగు రీతి సత్కరించి, మహారాజోచితరీతిని చక్కగ అలంకరించుకొని, ప్రజాపతి ప్రజలను చూచి నట్లు వారిని చూచెను (కలిసెను). 47

మూ. అథోపవిష్టే నృపతౌ తస్మిన్ పరబలార్దనే, 48
తతః ప్రవివిశుః శేషా రాజానో లోకసమ్మతాః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, పరబలార్దనే = శత్రుసేనలను పీడించు, తస్మిన్ = ఆ, నృపతౌ = రాజు; ఉపవిష్టే = కూర్చుండగా, తతః = పిమ్మట, లోకసంమతాః = ప్రజల కిష్టులైన, శేషాః = మిగిలిన, రాజానః = రాజులు, ప్రవివిశుః = ప్రవేశించిరి.

తా. పరసైన్యసంహారకు డగు ఆ దశరథమహారాజు కూర్చున్న పిమ్మట, జనులకు ప్రియులైన ఆహూతు లైన ఇతరరాజు లందరును ప్రవేశించిరి. 48

మూ. అథ రాజవితీర్ణేషు వివిధేష్వాసనేషు చ, 49
రాజానమేవాభిముఖా నిషేదుర్నియతా నృపాః.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, నృపాః = ఆరాజులు, రాజవితీర్ణేషు = రాజుచే ఇవ్వబడిన, వివిధేషు = అనేకవిధము లైన, ఆసనేషు = ఆసనములపై, రాజానమేవ = రాజునుగూర్చియే, అభిముఖాః = అభిముఖులై, నియతాః = నియమవంతులై, నిషేదుః = కూర్చుండిరి.

తా. లోనికి ప్రవేశించిన ఆ రాజులు, రాజు ఒసగిన ఆసనములపై రాజాభిముఖులై, రాజాస్థాననియమములను పాటించుచు కూర్చుండిరి. 49

మూ. స లబ్ధమానైర్వినయాన్వితైర్నృపైః
పురాలయైర్జానపదైశ్చ మానవైః,
ఉపోపవిష్టైర్నృపతిర్వృతో బభౌ
సహస్రచక్షుర్భగవానివామరైః. 50

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే, ఆదికావ్యే, అయోధ్యాకాణ్డే ప్రథమః సర్గః.

ప్ర. అ. లబ్ధమానైః=పొందబడిన గౌరవము గలవారును, వినయాన్వితైః = వినయవంతులును, ఉపోపవిష్టైః = సమీపమున కూర్చున్నవారును అగు, నృపైః = రాజులచేతను, పురాలయైః = పట్టణములలో నున్నవారును, జానపదైః చ = గ్రామములలో నుండు వారును అగు, మానవైః = అధికారి పురుషులచేతను, వృతః = చుట్టబడిన, సః = ఆ దశరథమహారాజు, అమరైః=దేవతలచే చుట్టబడిన, భగవాన్=భగవంతు డైన, సహస్రచక్షురివ= దేవేంద్రుడు వలె, బభౌ = ప్రకాశించెను.

తా. తగు విధము లగు సత్కారముల నందికొని వినయాన్వితులై, తన చుట్టును కూర్చొని యున్న ఆ రాజులతోడను, పురగ్రామప్రముఖులతోడను ఆ దశరథమహారాజు దేవతాసమేతుడైన మహేంద్రుడు వలె ప్రకాశించెను. 50

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున
అయోధ్యాకాండలో ప్రథమసర్గ సమాప్తము.

# అథ ద్వితీయః సర్గః

[దశరథుడు సభాముఖమున శ్రీరాముని పట్టాభిషేకమును గూర్చి ప్రస్తావించుట, సభాసదులు రామగుణవర్ణనపూర్వకముగ దానిని హర్షముతో ఆమోదించుట.]

మూ. తతః పరిషదం సర్వామామన్త్ర్య వసుధాధిపః,
హితముద్ధర్షణం చైవమువాచ ప్రథితం వచః. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట; వసుధాధిపః = భూమికి ప్రభువైన దశరథుడు; సర్వామ్ = సమస్తమైన; పరిషదమ్ = సభను, ఆమన్త్ర్య = పిలిచి, హితమ్ = హిత మైనదియు, ఉద్ధర్షణమ్ = ఆనందమును కలిగించు నదియు, ప్రథితం = ప్రసిద్ధ మైనదియు అనగా స్పష్టమైన అర్థము కలదియు అగు, వచః = వాక్యమును, ఏవమ్ = ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. దశరథుడు సభ నంతను ఉద్దేశించి హితము, సంతోషజనకము, స్పష్టార్థము అయిన వాక్కును ఈ విధముగ పలికెను. 1

మూ. దున్దుభిస్వనకల్పేన గమ్భీరేణానునాదినా,
స్వరేణ మహతా రాజా జీమూత ఇవ నాదయన్, 2
రాజలక్షణయుక్తేన కాన్తేనానుపమేన చ,
ఉవాచ రసయుక్తేన స్వరేణ నృపతిర్నృపాన్. 3

ప్ర. అ. నృపతిః = మనుష్యుల ప్రభు వైన, రాజా = రాజు, దున్దుభిస్వనకల్పేన = దుందుభిధ్వనితో సమాన మైనదియు, గమ్భీరేణ = గంభీర మైనదియు, అనునాదినా = ప్రతిధ్వనించుచున్నదియు, మహతా = గొప్పదైన, స్వరేణ = ధ్వనిచేత, జీమూతః ఇవ = మేఘము వలె, నాదయన్ = ధ్వనింప చేయుచు, రాజలక్షణయుక్తేన = రాజలక్షణములతో కూడినదియు, కాన్తేన = మనోహర మైనదియు, అనుపమేన చ = సాటి లేనిదియు, రసయుక్తేన = మాధుర్యముతో కూడినదియు అగు, స్వరేణ = కంఠస్వరముతో, నృపాన్ = రాజులనుగూర్చి, ఉవాచ = పలికెను.

తా. దశరథమహారాజు దుందుభిధ్వనివలె గంభీరమై, ప్రతిధ్వనించుచున్న, గొప్ప కంఠధ్వనితో మేఘము వలె (సభామండపమును) ధ్వనింప చేయుచు, రాజలక్షణములతో కూడినదీ, మనోహర మైనదీ, సాటి లేనిదీ, మధుర మైనదీ అయిన కంఠస్వరముతో రాజులతో ఇట్లనెను. 2,3

మూ. విదితం భవతామేతద్యథా మే రాజ్యముత్తమమ్,
పూర్వకైర్మమ రాజేన్ద్రైస్సుతవత్ పరిపాలితమ్. 4

ప్ర. అ. మే=నాయొక్క, ఉత్తమం=ఉత్తమ మైన, రాజ్యమ్=రాజ్యము, మమ=నాయొక్క, పూర్వకైః=పూర్వు లైన, రాజేన్ద్రైః=శ్రేష్ఠ లైన రాజుల చేత, సుతవత్=పుత్రుల వలె, యథా=ఎట్లు, పరిపాలితమ్=పాలింపబడినదో, ఏతత్=ఈ విషయము, భవతామ్=మీకు, విదితమ్=తెలియబడినదే.

తా. ఈ ఉత్తమరాజ్యములోని ప్రజలను మా పూర్వు లైన రాజశ్రేష్ఠులు పుత్రుల వలె పరిపాలించి రను విషయము మీకు తెలిసినదే. 4

మూ. సోఽహమిక్ష్వాకుభిః సర్వైర్నరేన్ద్రైః పరిపాలితమ్,
శ్రేయసా యోక్తుకామోఽస్మి సుఖార్హమఖిలం జగత్. 5

ప్ర. అ. సః=అట్టి, అహమ్=నేను, ఇక్ష్వాకుభిః=ఇక్ష్వాకువంశీయులైన, సర్వైః=సమస్త మైన, నరేన్ద్రైః=రాజులచేత, పరిపాలితమ్=పాలింపబడిన, సుఖార్హమ్=సుఖమునకు తగిన, అఖిలమ్=సమస్త మైన, జగత్=జగత్తును; శ్రేయసా=శ్రేయస్సుతో, యోక్తుకామః=కూర్చుటకు కోరికకలవాడను, అస్మి=అయి ఉన్నాను.

తా. నేను ఇక్ష్వాకువంశీయు లైన రాజు లందరును పరిపాలించిన, సుఖమునకు తగిన ఈ జగత్తున కంతకును శ్రేయస్సు సమకూర్చ గోరుచున్నాను. 5

మూ. మయాప్యాచరితం పూర్వైః పన్థానమనుగచ్ఛతా,
ప్రజా నిత్యమనిద్రేణ యథాశక్త్యభిరక్షితాః. 6

ప్ర. అ. పూర్వైః=నా పూర్వులచేత, ఆచరితమ్=అనుసరింపబడిన, పన్థానమ్=మార్గమును, అనుగచ్ఛతా=అనుసరించుచున్నవాడను, నిత్యమ్=

ఎల్లప్పుడును, అనిద్రేణ=జాగరూకుడను అయిన, మయాపి=నాచేత కూడ, ప్రజాః =ప్రజలు, యథాశక్తి=శక్త్యనుసారముగా, అభిరక్షితాః=రక్షింపబడినారు.

తా. నేను కూడ నిత్యము జాగరూకుడనై, పూర్వులు అనుసరించిన మార్గమునే అనుసరించుచు, యథాశక్తిగా ప్రజలను రక్షించితిని. 6

మూ. ఇదం శరీరం కృత్స్నస్య లోకస్య చరతా హితమ్,
పాణ్డురస్యాతపత్రస్య ఛాయాయాం జరితం మయా. 7

ప్ర. అ. కృత్స్నస్య = సమస్తమైన, లోకస్య = లోకముయొక్క, హితమ్ = హితమును, చరతా = ఆచరించుచున్న, మయా = నాచేత, ఇదమ్ = ఈ, శరీరమ్ = శరీరము, పాణ్డురస్య = తెల్లని, ఆతపత్రస్య = గొడుగుయొక్క, ఛాయాయామ్ = నీడయందు, జరితమ్ = జీర్ణము చేయబడినది.

తా. సకలప్రజలకు హితము నాచరించుచు రాజ్యము చేయుచుండగా, నా శరీరము తెల్లని గొడుగు క్రిందనే జీర్ణమైపోయినది. 7

మూ. ప్రాప్య వర్షసహస్రాణి బహూన్యాయూంషి జీవతః,
జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాన్తి మభిరోచయే. 8

ప్ర. అ. బహూని = అనేకము లైన, వర్షసహస్రాణి = వేలకొలది సంవత్సరములను, ఆయూంషి = ఆయుర్దాయమును, ప్రాప్య = పొంది, జీవతః = జీవించియున్న, అస్య = ఈ, శరీరస్య = శరీరమునకు, విశ్రాన్తిమ్ = విశ్రాంతిని, అభిరోచయే = కోరుచున్నాను,

తా. ఈ శరీరము ఎన్నియో వేల సంవత్సరముల ఆయుర్దాయము పొంది, జీవించి ఇపుడు జరాజీర్ణ మైనది. అందుచే దీనికి విశ్రాంతిని కోరుచున్నాను. 8

మూ. రాజప్రభావజుష్టాం హి దుర్వహామజితేన్ద్రియైః,
పరిశ్రాన్తోఽస్మి లోకస్య గుర్వీం ధర్మధురం వహన్. 9

ప్ర. అ. రాజప్రభావజుష్టామ్ = శౌర్యధైర్యాదిరూప మైన రాజప్రభావము చేత సేవింపబడినదియు, అజితేన్ద్రియైః = జితేంద్రియులు కాని వారిచేత, దుర్వహామ్ = మోయ శక్యము కానిదియు, గుర్వీమ్ = గొప్ప దైన, లోకస్య =

లోకముయొక్క, ధర్మధురమ్ = ధర్మభారమును, వహన్ = మోయుచు, పరిశ్రాన్తః = అలసిపోయినవాడను, అస్మి = అయితిని.

తా. లోకమునకు సంబంధించిన ఈ ధర్మభారము చాల బరువైనది. శౌర్యధైర్యాదిరూప మగు రాజప్రభావముచేతనే నిలుపుకొనదగినది. జితేంద్రియులు కానివారు దీనిని మోయజాలరు. అట్టి ధర్మభారమును మోసి మోసి అలసిపోయితిని. 9

మూ. సోఽహం విశ్రమమిచ్ఛామి పుత్రం కృత్వా ప్రజాహితే,
సన్నికృష్టానిమాన్ సర్వాననుమాన్య ద్విజర్షభాన్. 10

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, సన్నికృష్టాన్ = సమీపవర్తులైన, ఇమాన్ = ఈ, ద్విజర్షభాన్ = ద్విజశ్రేష్ఠులను, సర్వాన్ = అందరిని, అనుమాన్య = అంగీకరింపజేసి, పుత్రమ్ = పుత్రుని, ప్రజాహితే = ప్రజల హితమునందు, కృత్వా ఉంచి, విశ్రమమ్ = విశ్రాంతిని, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. అట్టి నేను, నా కాంతరంగికులైన వసిష్ఠాదిబ్రాహ్మణోత్తముల అంగీకారము పొంది, ప్రజాపాలనమునందు కుమారుని నియమించి, విశ్రాంతి తీసికొనదలచుచున్నాను. 10

మూ. అనుజాతో హి మాం సర్వైర్గుణైర్జ్యేష్ఠో మమాత్మజః,
పురన్దరసమో వీర్యే రామః పరపురంజయః. 11

ప్ర. అ. వీర్యే = పరాక్రమమునందు, పురన్దరసమః = దేవేంద్రునితో సమానుడూ, పరపురంజయః = శత్రుపురములను జయించువాడూ, మమ = నాయొక్క, జ్యేష్ఠః ఆత్మజః = జ్యేష్ఠకుమారుడూ అయిన, రామః = రాముడు, సర్వైః = సమస్తమైన, గుణైః = గుణములచేత, మామ్ = నన్ను, అనుజాతః హి = అనుసరించి పుట్టినాడు కదా.

తా. నా జ్యేష్ఠకుమారుడైన రాముడు పరాక్రమమునందు దేవేంద్రునితో సమానుడు. శత్రుపురములను జయించువాడు. అన్నిగుణములచేతను, అతడు నన్ను పోలినవాడు. 11

మూ. తం చన్ద్రమివ పుష్యేణ యుక్తం ధర్మభృతాం వరమ్,
యౌవరాజ్యే నియోక్తాస్మి ప్రీతః పురుషపుఙ్గవమ్. 12

ప్ర. అ. పుష్యేణ = పుష్యనక్షత్రముతో, యుక్తమ్ = కూడిన, చన్ద్రమివ = చంద్రుడు వలె ఉన్నవాడూ, ధర్మభృతామ్ = ధర్మసంరక్షకులలో, వరమ్ = శ్రేష్ఠుడూ, పురుషపుఙ్గవమ్ = పురుషశ్రేష్ఠుడూ అయిన, తమ్ = ఆ రాముని, ప్రీతః = సంతోషించినవాడనై, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, నియోక్తాస్మి = నియమింపగలను.

తా. పుష్యనక్షత్రముతో కూడిన చంద్రుడు వలె ప్రకాశించువాడూ, ధర్మసంరక్షకులలో అగ్రేసరుడూ, పురుషశ్రేష్ఠుడూ అయిన ఆ రాముని, సంతోషపూర్వకముగా యౌవరాజ్యమునందు అభిషేకించగలను. 12

మూ. అనురూపః స వై నాథో లక్ష్మీవాన్ లక్ష్మణాగ్రజః,
త్రైలోక్యమపి నాథేన యేన స్యాన్నాథవత్తరమ్. 13

ప్ర. అ. నాథేన = ప్రభువుగా ఉన్న, యేన = ఎవనిచేత, త్రైలోక్యమపి = లోకత్రయము కూడ, నాథవత్తరమ్ = ఉత్తమనాథుడు కలది, స్యాత్ = అగునో, సః = అట్టి, లక్ష్మీవాన్ = శోభ గల, లక్ష్మణాగ్రజః = రాముడు, అనురూపః = తగిన, నాథః వై = ప్రభువు.

తా. రాముడు ప్రభు వైనచో మూడులోకములు గూడ ఉత్తమప్రభువు కలవగును. ఇతడు గొప్ప శోభ కలవాడు. అట్టి రాముడే ఈ రాజ్యమునకు తగిన ప్రభువు. 13

మూ. అనేన శ్రేయసా సద్యః సంయోజ్యైవమిమాం మహీమ్,
గతక్లేశో భవిష్యామి సుతే తస్మిన్నివేశ్య వై. 14

ప్ర. అ. తస్మిన్ = అట్టి, సుతే = కుమారు డైన రామునియందు, ఇమామ్ = ఈ, మహీమ్ = భూమిని, నివేశ్య = ఉంచి, అనేన = ఈ, శ్రేయసా = శ్రేయస్సుతో, ఏవమ్ = ఈ విధముగా, సద్యః = వెంటనే, సంయోజ్య = కూర్చి, గతక్లేశః = తొలగిపోయిన క్లేశములు కలవాడను, భవిష్యామి = కాగలను.

తా. నే నీ రాజ్యభారమును రామునకు అప్పగించుట ద్వారా లోకాభ్యుదయకర మగు కార్యమును వెంటనే చేసి విశ్రాంతి నొందెదను. 14

మూ. యదీదం మేఽనురూపార్థం మయా సాధు సుమన్త్రితమ్,
భవన్తో మేఽనుమన్యన్తాం కథం వా కరవాణ్యహమ్. 15

ప్ర. అ. మయా=నాచేత, సుమన్త్రితమ్=బాగుగా ఆలోచింపబడిన, మే=నాయొక్క, ఇదమ్=ఈ వాక్యము, సాధు=సాధువు, అనురూపార్థం యది=అనురూపప్రయోజనము కలది అయినచో, భవన్తః=మీరు, మే=నాకు, అనుమన్యన్తామ్=అనుమతి నిచ్చెదరు గాక. అహమ్=నేను, కథం వా=ఎట్లు, కరవాణి=చేయుదును?

తా. నే నీ విషయమును గూర్చి బాగుగా ఆలోచించియే చెప్పుచున్నాను. ఇది మంచి ప్రయోజనమును సమకూర్చును అని మీకు కూడ తోచినచో అనుమతించి, నే నెట్లు చేయవలెనో చెప్పుడు. 15

మూ. యద్యప్యేషా మమ ప్రీతిర్హితమన్యద్విచిన్త్యతామ్,
అన్యా మధ్యస్థచిన్తా హి విమర్దాభ్యధికోదయా. 16

ప్ర. అ. ఏషా=ఇది, మమ=నాయొక్క, ప్రీతిః యద్యపి=కోరికయే యైనను, అన్యత్=మరియొక, హితమ్=లాభకర మైన దున్నచో అది, విచిన్త్యతామ్=ఆలోచింపబడుగాక. మధ్యస్థచిన్తా=పక్షపాతరహితు లైన మధ్యస్థుల ఆలోచన, అన్యా=విలక్షణ మైనది; విమర్దాభ్యధికోదయా=తరచి తరచి చేసిన దగుటచే ఎక్కువ అభ్యుదయము నిచ్చునది.

తా. నా కోరిక ఈ విధముగా నున్నది. అయినను, మఱొక హితకర మైన మార్గ మున్నదా అని ఆలోచింపుడు. పక్షపాతము లేని మధ్యస్థులు చేసిన ఆలోచన విశిష్టముగా నుండి, తరచి తరచి చేసిన దగుటచే ఎక్కువ అభ్యుదయ మును కలిగించును కదా? 16

మూ. ఇతి బ్రువన్తం ముదితాః ప్రత్యనన్దన్ నృపా నృపమ్,
వృష్టిమన్తం మహామేఘం నర్దన్త ఇవ బర్హిణః. 17

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, బ్రువన్తమ్=పలుకుచున్న, నృపమ్=రాజును, నృపాః=రాజులు, ముదితాః=సంతోషించినవారై, వృష్టిమన్తమ్=

వర్షించుచున్న, మహామేఘమ్ = గొప్ప మేఘమును, నర్దన్తః = ధ్వనిచేయుచున్న, బర్హిణః ఇవ = నెమళ్లు వలె, ప్రత్యనన్దన్ = అభినందించిరి.

తా. ఈ విధముగ పలుకుచున్న దశరథమహారాజును, ఆ రాజులు సంతసించినవారై, వర్షించుచున్న మేఘమును నెమళ్లు ధ్వనిచేయుచు అభినందించినట్లు అభినందించిరి. 17

మూ. స్నిగ్ధోఽనునాదీ సంజజ్ఞే తత్ర హర్షసమీరితః,
జనౌఘోద్ఘుష్టసన్నాదో విమానం కమ్పయన్నివ. 18

ప్ర. అ. తత్ర = అచట, స్నిగ్ధః = మధుర మైనదియు, అనునాదీ = ప్రతిధ్వని చేయుచున్నదియు, హర్షసమీరితః = సంతోషముచేత చేయబడిన, జనౌఘోద్ఘుష్టసంనాదః = జనసముదాయముయొక్క ఉద్ఘోషధ్వని, విమానమ్ = ఆ భవనమును, కమ్పయన్నివ = కంపింపచేయుచున్నది వలె, సంజజ్ఞే = పుట్టెను.

తా. ఆ సభలోని వారు సంతోషముతో "బాగున్నది బాగున్నది" అని చేసిన మధుర మైనదీ, ప్రతిధ్వనించునదీ అయిన ధ్వనిచే ఆ భనవము కంపించిన ట్లైనది. 18

మూ. తస్య ధర్మార్థవిదుషో భావమాజ్ఞాయ సర్వశః,
బ్రాహ్మణా జనముఖ్యాశ్చ పౌరజానపదైః సహ. 19

సమేత్య మన్త్రయిత్వా తు సమతాగతబుద్ధయః,
ఊచుశ్చ మనసా జ్ఞాత్వా వృద్ధం దశరథం నృపమ్. 20

ప్ర. అ. పౌరజానపదైః సహ = నగరనివాసులతోడను గ్రామనివాసులతోడను కూడిన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులును, జనముఖ్యాః చ = ప్రధానులైన జనులును, ధర్మార్థవిదుషః = ధర్మార్థవేత్త యైన, తస్య = దశరథునియొక్క, భావమ్ = అభిప్రాయమును, సర్వశః = సర్వవిధముల, ఆజ్ఞాయ = తెలిసికొని, సమేత్య = కలిసి, మన్త్రయిత్వా = ఆలోచించి, మనసా = మనస్సుచేత, జ్ఞాత్వా = తెలుసుకొని, సమతాగతబుద్ధయః = సమత్వమును పొందిన, అనగా ఒకే ఆలోచన గల బుద్ధులు కలవారై, వృద్ధమ్ = వృద్ధుడైన, దశరథం నృపమ్ = దశరథమహారాజును గూర్చి, ఊచుః = పలికిరి.

తా. బ్రాహ్మణులును, జనులలో ప్రధానులగు రాజులును, నగరనివాసులును, గ్రామనివాసులును ధర్మార్థములను ఎరిగిన ఆ దశరథమహారాజు అభిప్రాయమును సర్వవిధముల గ్రహించి, పిమ్మట అందరును కలిసి ఆలోచించి, మనస్సుచేత కూడ చక్కగా గ్రహించి, ఒక ఏకాభిప్రాయమునకు వచ్చి, వృద్ధుడైన ఆ రాజుతో ఇట్లనిరి. 19, 20

మూ. అనేకవర్షసాహస్రో వృద్ధస్త్వమసి పార్థివ,
స రామం యువరాజానమభిషిఞ్చస్వ పార్థివమ్. 21

ప్ర. అ. పార్థివ = ఓ మహారాజా! త్వమ్ = నీవు, అనేకవర్షసాహస్రః = అనేకసహస్రవర్షములు గల, వృద్ధః = వృద్ధుడవుగా, అసి = అయి ఉన్నావు. సః = అట్టి నీవు, రామమ్ = రాముని, పార్థివమ్ = భూమిని పరిపాలించు, యువరాజానమ్ = యువరాజునుగా, అభిషిఞ్చస్వ = అభిషేకించుము.

తా. మహారాజా! నీవు ఎన్నియో వేల సంవత్సరముల వయస్సు గల వృద్ధుడవు. అందుచే రాజ్యమును పాలించు యువరాజునుగా రాముని అభిషిక్తుని చేయుము. 21

మూ. ఇచ్ఛామో హి మహాబాహుం రఘువీరం మహాబలమ్,
గజేన మహతా యాన్తం రామం ఛత్రావృతాననమ్. 22

ప్ర. అ. మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడూ, రఘువీరమ్ = రఘువంశమునందు పుట్టినవారిలో వీరుడూ, మహాబలమ్ = గొప్ప బలము కలవాడూ అయిన, రామమ్ = రాముని, ఛత్రావృతాననమ్ = ఛత్రముచే కప్పబడిన ముఖము కలవాడై, మహతా = గొప్ప, గజేన = గజముచే, యాన్తమ్ = వెళ్లుచున్నవానినిగా, ఇచ్ఛామః హి = కోరుచున్నాము కదా.

తా. గొప్పబాహువులు గలవాడూ, రఘువంశసంజాతులలో మహావీరుడూ, మహాబలశాలీ అయిన రాముడు పట్టాభిషిక్తుడై, శ్వేతచ్ఛత్రధారియై, మహాగజము నధిష్ఠించి వెళ్లుచుండగా చూడవలెనని మే మందరము కోరుచున్నాము. 22

మూ. ఇతి తద్వచనం శ్రుత్వా రాజా తేషాం మనఃప్రియమ్,
అజానన్నివ జిజ్ఞాసురిదం వచనమబ్రవీత్. 23

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, తద్వచనమ్ = వారి వాక్యమును, శ్రుత్వా = విని, రాజా = రాజు, తేషామ్ = వారియొక్క, మనఃప్రియమ్ = మనస్సునకు ప్రియమైన విషయమును, అజానన్నివ = తెలియనివాడు వలె, జిజ్ఞాసుః = తెలియగోరుచున్నవాడై, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. వారి వాక్యము విన్న దశరథమహారాజు వారి మనస్సులోని అభీష్టము పూర్వము తెలియక ఇప్పుడు తెలియగోరుచున్నవాడు వలె ఇట్లు పలికెను. 23

మూ. శ్రుత్వైవ వచనం యన్మే రాఘవం పతిమిచ్ఛథ,
రాజానః సంశయోఽయం మే తదిదం బ్రూత తత్త్వతః 24

ప్ర. అ. రాజానః = రాజులారా। మే = నాయొక్క, వచనమ్ = వాక్యమును, శ్రుత్వైవ = వినగనే, యత్ = ఏ కారణమువలన, రాఘవమ్ = రాముని, పతిమ్ = రాజునుగా, ఇచ్ఛథ = కోరుచున్నారో, అందువలన, మే = నాకు, అయమ్ = ఈ, సంశయః = సంశయము కలుగుచున్నది. తత్ ఇదమ్ = ఆ ప్రకృతవిషయమును, తత్త్వతః = యథార్థముగా, బ్రూత = చెప్పుడు.

తా. రాజులారా! నా మాట వినగానే, మీరు, రాముడు ప్రభువు కావలెనని చెప్పుట చూచి నాకు ఎదురు చెప్పజాలక అట్లు అనుచున్నారేమో అని నాకు సంశయము కలుగుచున్నది. ఈ విషయమున యథార్థముగ మీ అభిప్రాయము తెలుపుడు. 24

మూ. కథం ను మయి ధర్మేణ పృథివీమనుశాసతి,
భవన్తో ద్రష్టుమిచ్ఛన్తి యువరాజం మమాఽఽత్మజమ్. 25

ప్ర. అ. మయి = నేను, ధర్మేణ = ధర్మముచేత, పృథివీమ్ = భూమిని, అనుశాసతి = పరిపాలించుచుండగా, భవన్తః = మీరు, మమ = నాయొక్క, ఆత్మజమ్ = కుమారుని, యువరాజమ్ = యువరాజునుగా, ద్రష్టుమ్ = చూచుటకు, కథం ను = ఎట్లు, ఇచ్ఛన్తి = కోరుచున్నారు?

తా. నేను ధర్మానుసారముగా భూమిని పరిపాలించుచుండగా మీ రందరును నా కుమారుడగు రాముడు యువరాజు కావలెనని ఎందుచే కోరుచున్నారు? ఇదే నా సంశయము. 25

మూ. తే తమూచుర్మహాత్మానం పౌరజానపదైః సహ,
బహవో నృప కల్యాణా గుణాః పుత్రస్య సన్తి తే. 26

ప్ర. అ. పౌరజానపదైః సహ = పౌరజానపదులతో కూడిన, తే = ఆ రాజులు; మహాత్మానమ్ = మహాత్ముడైన, తమ్ = అతనిని గూర్చి, ఊచుః = పలికిరి. నృప = రాజా! తే = నీయొక్క, పుత్రస్య = పుత్రునియొక్క, బహవః = అనేకమైన, కల్యాణాః = మంగళప్రదములైన, గుణాః = గుణములు, సన్తి = ఉన్నవి.

తా. రాజులును, పౌరులును, జానపదులును ఆ మాటలు విని, ఆ మహాత్మునితో ఇట్లు పలికిరి—"రాజా! నీ కుమారుడైన రామునియందు అనంతములైన కల్యాణగుణము లున్నవి. 26

మూ. గుణాన్ గుణవతో దేవ దేవకల్పస్య ధీమతః,
ప్రియానానన్దదాన్ కృత్స్నాన్ ప్రవక్ష్యామోఽద్య తాన్ శృణు. 27

ప్ర. అ. దేవ = మహారాజా! గుణవతః = గుణవంతుడూ, దేవకల్పస్య = దేవతలతో సమానుడూ, ధీమతః = బుద్ధిశాలీ అయిన నీ కుమారునియొక్క, ప్రియాన్ = అందరికిని ఇష్టమైనవీ, ఆనన్దదాన్ = ఆనందము నిచ్చునవీ అయిన, కృత్స్నాన్ = సమస్తమైన, తాన్ గుణాన్ = ఆ గుణములను, అద్య = ఇపుడు, వక్ష్యామః = చెప్పగలము; శృణు = వినుము.

తా. మహారాజా! సద్గుణవంతుడూ, దేవతలతో సమానుడూ, బుద్ధిమంతుడూ అయిన నీ కుమారుడైన రాముని గుణములు అందరికిని ఇష్టమైనవి; ఆనందకరమైనవి. వాటి నన్నింటిని వర్ణించి చెప్పెదము; వినుము. 27

మూ. దివ్యైర్గుణైః శక్రసమో రామః సత్యపరాక్రమః,
ఇక్ష్వాకుభ్యోఽపి సర్వేభ్యో హ్యతిరిక్తో విశాంపతే. 28

ప్ర. అ. విశాంపతే = ప్రజలకు ప్రభువైన ఓ దశరథమహారాజా! రామః = రాముడు, దివ్యైః = స్వర్గమునందు మాత్రమే కానవచ్చు, గుణైః = గుణములచేత, శక్రసమః = దేవేంద్రునితో సమానుడు. సత్యపరాక్రమః = సత్య

మైన పరాక్రమము కలవాడు. సర్వేలోకేఽపి=సమస్త మైన, ఇక్ష్వాకుభ్యః = ఇక్ష్వాకువంశరాజులకంటె. అతిరిక్తః = గొప్పవాడు.

తా. రాజా॥ రాముడు దివ్యమైన గుణములచే దేవేంద్రునితో సమానుడు. సత్య మైన పరాక్రమము గలవాడు. ఇక్ష్వాకువంశములో పుట్టిన అందరు రాజులకంటెను గొప్పవాడు. 28

మూ. రామః సత్పురుషో లోకే సత్యధర్మపరాయణః,
సాక్షాద్రామాద్వినిర్వృత్తో ధర్మశ్చాపి శ్రియా సహ. 29

ప్ర. అ. లోకే = లోకమునందు, రామః=రాముడు, సత్పురుషః=మంచి వాడు. సత్యధర్మపరాయణః = సత్యధర్మములందు ఆసక్తి గలవాడు. రామాత్= రామునివలననే, ధర్మః చ అపి = ధర్మము, శ్రియా సహ = లక్ష్మితో కూడ, సాక్షాత్ = వ్యవధానము లేకుండ, వినిర్వృత్తః = ఏర్పడినది.

తా. రాముడు లోకప్రసిద్ధు డైన సత్పురుషుడు. సత్యధర్మములందు ఆసక్తి కలవాడు. ధర్మము, లక్ష్మియు ఎన్నడును ఎడబాయకుండు నట్లు చేయ గలవాడు రాము డొక్కడే. 29

మూ. ప్రజాసుఖత్వే చన్ద్రస్య వసుధాయాః క్షమాగుణైః,
బుద్ధ్యా బృహస్పతేస్తుల్యో వీర్యే సాక్షాచ్ఛచీపతేః. 30

ప్ర. అ. ప్రజాసుఖత్వే = ప్రజలకు సుఖము కలిగించు విషయమున, చన్ద్రస్య = చంద్రునకును, క్షమాగుణైః=ఓర్పు మొద లైన గుణములచేత, వసుధాయాః = భూమికిని, బుద్ధ్యా=బుద్ధిచేత, బృహస్పతేః=బృహస్పతికిని, వీర్యే= పరాక్రమమునందు, శచీపతేః = దేవేంద్రునకును, సాక్షాత్ = సాక్షాత్తుగా, తుల్యః=సమానుడు.

తా. ప్రజలకు ఆనందము కలిగించుటలో చంద్రునితోడను, క్షమాది గుణములచే భూమితోడను, బుద్ధిచే బృహస్పతితోడను, పరాక్రమమునందు దేవేంద్రునితోడను, అన్ని విధముల సమానుడు. 30

మూ. ధర్మజ్ఞః సత్యసన్ధశ్చ శీలవాననసూయకః,
క్షాన్తః సాన్త్వయితా శ్లక్ష్ణః కృతజ్ఞో విజితేన్ద్రియః. 31

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మము తెలిసినవాడు. సత్యసన్ధః = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు. శీలవాన్ = మంచి స్వభావము కలవాడు. అనసూయకః = అసూయ లేనివాడు. క్షాన్తః = ఓర్పు గలవాడు. సాన్త్వయితా = కష్టములలోనున్న వారిని ఓదార్చువాడు. శ్లక్ష్ణః = మృదుస్వభావుడు. కృతజ్ఞః = పరులు చేసిన ఉపకారమును గుర్తించువాడు. విజితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడు.

తా. రాముడు అన్ని ధర్మములు తెలిసినవాడు. సత్యసంధుడు. ఉత్తమశీలవంతుడు. అసూయ లేనివాడు. ఓర్పుగలవాడు. దుఃఖితులను ఓదార్చువాడు. మృదువైనవాడు. కృతజ్ఞుడు. ఇంద్రియములను అదుపులో ఉంచుకొన్నవాడు.

మూ. మృదుశ్చ స్థిరచిత్తశ్చ సదా భవ్యోఽనసూయకః,
ప్రియవాదీ చ భూతానాం సత్యవాదీ చ రాఘవః. 32

బహుశ్రుతానాం వృద్ధానాం బ్రాహ్మణానాముపాసితా,
తేనాస్యేహాతులా కీర్తిర్యశస్తేజశ్చ వర్ధతే. 33

ప్ర. అ. రాఘవః = రాముడు, మృదుః చ = సున్నితమైన స్వభావము కలవాడు, స్థిరచిత్తః చ = స్థిరమైన చిత్తము కలవాడు. సదా = ఎల్లప్పుడును, భవ్యః = మంగళప్రదుడు; అనసూయకః = అసూయ లేనివాడు. భూతానామ్ = ప్రాణులకు, ప్రియవాదీ = సంతోషమును కలిగించునట్లుగా మాటలాడువాడు. సత్యవాదీ చ = సత్యమునే పలుకువాడు, బహుశ్రుతానామ్ = అధికమైన శాస్త్రజ్ఞానము గల, వృద్ధానామ్ = పెద్దలైన, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులకు, ఉపాసితా = ఉపాసన చేయువాడు. తేన = దానిచేత, అస్య = ఈతనియొక్క, అతులా = సాటిలేని, కీర్తిః = కీర్తియు, యశః = యశస్సు (ఔదార్యాదులవలన వచ్చు మంచి పేరు కీర్తి; పరాక్రమాదుల వలన వచ్చునది యశస్సు), తేజశ్చ = తేజస్సు, ఇహ = ఈ లోకమున, వర్ధతే = వృద్ధి పొందుచున్నది.

తా. రాముడు సుకుమారస్వభావము కలవాడు. స్థిరమైన ఆలోచనలు కలవాడు, సర్వదా మంగళప్రదుడు, అసూయలేనివాడు, ప్రాణులకు ప్రియము

లైన మాటలను పలుకువాడు. సత్యమునే చెప్పువాడు. వివిధశాస్త్రపారంగతు లైన వృద్ధు లైన బ్రాహ్మణులఁ ఉపాసన చేయువాడు. అట్లు ఉపాసన చేయుటవలననే ఈ లోకమునందు ఈతని కీర్తి, యశస్సు, తేజస్సు వృద్ధి పొందుచున్నవి. 32, 33

మూ. దేవాసురమనుష్యాణాం సర్వాస్త్రేషు విశారదః,
సమ్యగ్విద్యావ్రతస్నాతో యథావత్సాఙ్గవేదవిత్. 34

ప్ర. అ. దేవాసురమనుష్యాణామ్ = దేవతలకును అసురులకును మానవులకును తెలిసిన, సర్వాస్త్రేషు = సమస్త మైన అస్త్రములందును, విశారదః = సమర్థుడు. సమ్యక్ = బాగుగా, విద్యావ్రతస్నాతః = విద్యాభ్యాసమను వ్రతమునందు స్నానము చేసినవాడు. యథావత్ = యథాశాస్త్రముగా, సాఙ్గవేదవిత్ = సాంగము లైన వేదము లెరిగినవాడు.

తా. దేవతలకును, అసురులకును, మానవులకును తెలిసిన అన్ని అస్త్రము లందును ఇతనికి ప్రావీణ్య మున్నది. చక్కగా విద్యాభ్యాసమును పూర్తి చేసి కొన్నవాడు. యథావిధిగా సాంగోపాంగము లైన వేదముల అధ్యయనము చేసినవాడు. 34

మూ. గాన్ధర్వే చ భువి శ్రేష్ఠో బభూవ భరతాగ్రజః,
కల్యాణాభిజనః సాధురదీనాత్మా మహామతిః. 35

ప్ర. అ. భరతాగ్రజః = రాముడు, గాన్ధర్వే = సంగీతము నందు, భువి = ఈ భూమియందు, శ్రేష్ఠః = శ్రేష్ఠుడుగా, బభూవ = అయినాడు. కల్యాణాభిజనః = ఉత్తమ మైన బంధువర్గము కలవాడు. సాధుః = సత్పురుషుడు. అదీనాత్మా = దైన్యము లేని మనస్సు కలవాడు. మహామతిః = గొప్ప బుద్ధి కలవాడు.

తా. సంగీతవిద్యలో రాముని మించినవా రీ లోకములో లేరు. ఇతని బంధువర్గ మంతయు అత్యుత్తమ మైనది. ఇతడు సత్పురుషుడు. దైన్యము నెఱుగనివాడు. గొప్ప బుద్ధి కలవాడు. 35

మూ. ద్విజైరభివినీతశ్చ శ్రేష్ఠైర్ధర్మార్థనైపుణైః,
యదా వ్రజతి సంగ్రామం గ్రామార్థే నగరస్య వా, 36
గత్వా సౌమిత్రిసహితో నావిజిత్య నివర్తతే.

ప్ర. అ. ధర్మార్థనైపుణ్యైః = ధర్మార్థములందు నైపుణ్యము గల, శ్రేష్ఠైః = శ్రేష్ఠులైన, ద్విజైః = బ్రాహ్మణులచేత, అభివినీతః = అన్ని విషయములందును శిక్షింపబడినవాడు. గ్రామార్థే = గ్రామముకొరకుగాని, నగరస్య వా = పట్టణముకొరకు గాని, యదా = ఎప్పుడు, సంగ్రామమ్ = యుద్ధమును గూర్చి, వ్రజతి = వెళ్ళునో, అప్పుడు, సౌమిత్రిసహితః = లక్ష్మణసమేతుడై, గత్వా = వెళ్ళి, అవిజిత్య = జయించకుండగా, న నివర్తతే = మరలిరాడు.

తా. రాముడు ధర్మార్థములందు నైపుణ్యము గల శ్రేష్ఠులైన బ్రాహ్మణుల వద్ద అన్ని విషయములందును శిక్షణము పొందినవాడు. గ్రామముకొరకు గాని, నగరముకొరకు గాని యుద్ధము చేయవలసి వచ్చినపుడు రాముడు లక్ష్మణునితో కలిసి వెళ్ళి జయము లభించిన పిమ్మటనే తిరిగి వచ్చును. 36

మూ. సంగ్రామాత్పునరాగమ్య కుఞ్జరేణ రథేన వా, 37
పౌరాన్ స్వజనవన్నిత్యం కుశలం పరిపృచ్ఛతి.

పుత్రేష్వగ్నిషు దారేషు ప్రేష్యశిష్యగణేషు చ, 38
నిఖిలేనానుపూర్వ్యాచ్చ పితా పుత్రానివౌరసాన్.

ప్ర. అ. సంగ్రామాత్ = యుద్ధమునుండి, కుఞ్జరేణ = ఏనుగమీదగాని, రథేన వా = రథముమీదగాని ఎక్కి, పునః ఆగత్య = మరల వచ్చి, పౌరాన్ = పౌరులను, స్వజనవత్ = బంధుజనమును వలె, పితా = తండ్రి, ఔరసాన్ పుత్రానివ = ఔరసులైన పుత్రులను వలె, పుత్రేషు = పుత్రుల విషయమునను, అగ్నిషు = అగ్నుల విషయమునను, దారేషు = భార్యల విషయమునను, ప్రేష్యశిష్యగణేషు చ = భృత్యుల విషయమునను, శిష్యుల విషయమునను, నిఖిలేన = పూర్తిగను, అనుపూర్వ్యాచ్చ = క్రమానుసారముగను, నిత్యమ్ = ఎల్లపుడును, కుశలమ్ = కుశలమును, పరిపృచ్ఛతి = ప్రశ్నించును.

తా. యుద్ధమునుండి తిరిగి వచ్చి, ఏనుగను గాని రథమును గాని ఎక్కి పౌరులవద్దకు వెళ్ళి వారి నందరిని, బంధు జనులు అడిగినట్లును, తండ్రి పుత్రులను అడిగినట్లును, పూర్తిగ, పుత్రులు, భార్యలు, అగ్నిహోత్రాద్యనుష్ఠానములు,

భృత్యులు, శిష్యగణములు మొదలగువారి విషయమున, వరుస తప్పకుండగా, కుశలప్రశ్న చేయుచుండును. 37, 38

మూ. శుశ్రూషన్తే చ వః శిష్యాః కచ్చిత్కర్మసు దంశితాః, 39
ఇతి నః పురుషవ్యాఘ్రః సదా రామోఽభిభాషతే.

ప్ర. అ. వః = మీయొక్క, శిష్యాః = శిష్యులు, కర్మసు = ఆ యా కర్మలయందు, దంశితాః = పూనికతో ఉద్యుక్తులై, శుశ్రూషన్తే = శుశ్రూషచేయుచున్నారా? ఇతి = అని, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠు డైన, రామః = రాముడు, సదా = ఎల్లప్పుడును, నః = మమ్ములను, అభిభాషతే = పలకరించుచుండును.

తా. పురుషశ్రేష్ఠు డైన రాముడు, "మీ చెప్పుచేతలలో నుండు భృత్యాదులు తమ తమ పనులు పూనికతో నిర్వర్తించుచు మీకు సేవచేయుచున్నారా?" అని కనబడినపు డెల్ల మమ్ములను ప్రశ్నించుచుండును. 39

మూ. వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః. 40
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి.

ప్ర. అ. మనుష్యాణామ్ = మనుష్యులయొక్క, వ్యసనేషు = ఆపదలయందు, భృశమ్ = మిక్కిలి, దుఃఖితః భవతి = దుఃఖితు డగును. ఉత్సవేషు = ఉత్సవములయందు, సర్వేషు = అందరి జనుల విషయమునందును, పితేవ = తండ్రివలె, పరితుష్యతి = సంతోషించును.

తా. ఎవరి కైన ఆపద వచ్చి నపుడు రాముడు చాల దుఃఖించును. ఎవరికి అభివృద్ధి కలిగినను అది చూచి, పుత్రునకు కలిగిన అభివృద్ధిని చూచి తండ్రి సంతోషించి నట్లు సంతోషించును. 40

మూ. సత్యవాదీ మహేష్వాసో వృద్ధసేవీ జితేన్ద్రియః, 41
స్మితపూర్వాభిభాషీ చ ధర్మం సర్వాత్మనా శ్రితః.

ప్ర. అ. సత్యవాదీ = సత్యమునే పలుకువాడు. మహేష్వాసః = గొప్ప ధనస్సు గలవాడు. వృద్ధసేవీ = పెద్దలను సేవించువాడు, జితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడు. స్మితపూర్వాభిభాషీ చ = చిరునవ్వు ముందు

కలుగు నట్లుగా మాటలాడువాడు. సర్వాత్మనా = సర్వవిధముల, ధర్మం శ్రితః = ధర్మమునే ఆశ్రయించినవాడు.

తా. రాముడు సత్యమునే పలుకును. మహావీరుడు. పెద్దలను సేవించువాడు. ఇంద్రియములను వశమునందుంచుకొన్నవాడు. చిరునవ్వు నవ్వుచు మాటలాడు రాముడు సర్వవిధముల ధర్మమును పరిరక్షించును. 41

మూ. సమ్యగ్యోక్తా శ్రేయసాం చ న విగృహ్య కథారుచిః । 42
ఉత్తరోత్తరయుక్తౌ చ వక్తా వాచస్పతిర్యథా ॥

ప్ర. అ. సమ్యక్ = బాగుగా, శ్రేయసాం యోక్తా = శ్రేయస్సులను సమకూర్చువాడు. విగృహ్య = కలహించి, కథారుచిః = సంభాషణలయందు ఆసక్తి కలవాడు, న = కాడు ఉత్తరోత్తరయుక్తౌ = పై పై యుక్తులను చూపుటయందు, వాచస్పతిర్యథా = బృహస్పతి వలె, వక్తా = వక్త.

తా. రాముడు, ఆశ్రితులకు మేలు సమకూర్చువాడు. కలహము పెంచుకొనుచు మాటలాడుటలో అభిరుచి లేనివాడు. యుక్తికి పై యుక్తి చూపుచు మాటలాడుటలో బృహస్పతివంటివాడు. 42

మూ. సుభ్రూరాయతతామ్రాక్షస్సాక్షాద్విష్ణురివ స్వయమ్, 43
రామో లోకాభిరామోఽయం శౌర్యవీర్యపరాక్రమైః ॥

ప్ర. అ. లోకాభిరామః = లోకమునకు మనోహరుడైన, అయమ్ = ఈ, రామః = రాముడు, సుభ్రూః = మంచి కనుబొమ్మలు కలవాడు. ఆయతతామ్రాక్షః = దీర్ఘమైన ఎఱ్ఱని నేత్రములు కలవాడు. శౌర్యవీర్యపరాక్రమైః = శౌర్య-వీర్య పరాక్రమములచేత, సాక్షాత్ = సాక్షాత్తు, స్వయమ్ = స్వయముగా, విష్ణుః ఇవ = విష్ణువు వంటివాడు.

తా. లోకాభిరాముడైన ఈ రాముడు అందమైన కనుబొమలు కలవాడు. విశాలమైన ఎఱ్ఱని నేత్రములు కలవాడు. శౌర్య వీర్య పరాక్రమములచేత. సాక్షాత్తు విష్ణువే అన్నట్లున్నవాడు.

వి. శౌర్య మనగా నిర్భయముగా ఎదుటివానిపై దూసికొని వెళ్ళు స్వభావము. తాను వికారము చెందక శత్రువులను వికారము చెందించుట వీర్యము, శత్రుజయమునం దుత్సాహము పరాక్రమము. 43

మూ. ప్రజాపాలనతత్త్వజ్ఞో న రాగోపహతేన్ద్రియః, 44
శక్తస్త్రైలోక్యమప్యేకో భోక్తుం కిం ను మహీమిమామ.

ప్ర. అ. ప్రజాపాలనతత్త్వజ్ఞః=ప్రజలను పాలించుటలోని మెలకువలు తెలిసినవాడు. రాగోపహతేన్ద్రియః = రాగముచేత కొట్టబడిన ఇంద్రియములు కలవాడు, న=కాడు. ఏకః = ఒక్కడే, త్రైలోక్యమపి = మూడులోకములను కూడ, భోక్తుమ్ = అనుభవించుటకు, శక్తః = సమర్థుడు. ఇమామ్ = ఈ, మహీమ్=భూమిని, కిం ను=చెప్పనేల ?

తా. ప్రజలను పాలించుటలోని మెళుకువలు తెలిసినవాడు. ఈతని ఇంద్రియములు రాగముచే (అత్యాసక్తిచే) చెడుమార్గమును పట్టునవి కావు. ఈత డొక్కడే మూడు లోకములను కూడ పాలింప సమర్థుడన్నచో ఇంక భూలోకము మాట చెప్పవలెనా ? 44

మూ. నాऽస్య క్రోధః ప్రసాదశ్చ నిరర్థోऽస్తి కదాచన. 45
హన్త్యేవ నియమాద్వధ్యానవధ్యే చ న కుప్యతి.

ప్ర. అ. అస్య = ఇతనియొక్క, కోపః=కోపము గాని, ప్రసాదశ్చ = అనుగ్రహము గాని, కదాచన=ఎన్నడును, నిరర్థకః=వ్యర్థమైనదిగా, నాస్తి= లేదు. నియమాత్ = శాస్త్రనియమానుసారముగా, వధ్యాన్ = చంపదగినవారిని, హన్త్యేవ = చంపితీరును. అవధ్యే = చంపదగనివానియందు, న కుప్యతి = కోపించడు.

తా. రామునకు కోపము వచ్చినను, అనుగ్రహము కలిగినను అవి, ఎన్నడును, నిష్ఫలములు కావు. ఎవరైన నియమానుసారముగా వధ్యులైనచో వారిని చంపియే తీరును. అవధ్యులవిషయమున కోపము వహింపడు. 45

మూ. యునక్త్యర్థైః ప్రహృష్టశ్చ తమసౌ యత్ర తుష్యతి. 46
శాన్తైః సర్వప్రజాకాన్తైః ప్రీతిసంజననైర్నృణామ్,
గుణైర్విరురుచే రామో దీప్తః సూర్య ఇవాంశుభిః. 47

ప్ర. అ. అసౌ=ఈ రాముడు, యత్ర = ఎవని విషయమై, తుష్యతి = సంతోషించునో, తమ్=వానిని, ప్రహృష్టః=సంతసించినవాడై, అర్థైః = ధనము

లతో, యునక్తి=కూర్పును, కాన్తైః=కాంతము లైనవియు, సర్వప్రజాకాన్తైః= సకలప్రజలకును మనోహరములును, నృణామ్=మానవులకు, ప్రీతిసంజననైః= ఆనందము కలిగించునవియు అగు, గుణైః=గుణములచేత, రామః=రాముడు, అంశుభిః=కిరణములచేత, దీప్తః=ప్రకాశించుచున్న, సూర్యః ఇవ= సూర్యుడు వలె, విరురుచే = ప్రకాశించెను.

తా. రాము డెవ్వని విషయమున సంతోషించునో ఆతనికి సకలైశ్వర్యము లును సమకూర్చును. కిరణములతో ప్రకాశించు సూర్యుడు వలె, రాముడు కాంత ములూ, సర్వప్రజలకును మనోహరములూ, మానవులకు ప్రీతిని కలిగించునవీ అయిన గుణములతో ప్రకాశించుచున్నాడు. 46, 47

మూ. తమేవంగుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్,
లోకపాలోపమం నాథమకామయత మేదినీ. 48

ప్ర. అ. మేదినీ = భూమి, ఏవంగుణసంపన్నమ్ = ఇట్టి గుణములతో కూడినవాడూ, సత్యపరాక్రమమ్ = సత్యమైన పరాక్రమము కలవాడూ, లోకపాలోపమమ్ = ఇంద్రాదిలోకపాలులతో సమానుడూ అయిన, రామమ్= రాముని, నాథమ్ = ప్రభువునుగా, అకామయత=కోరినది.

తా. పితాదృశకల్యాణగుణసంపన్నుడూ, సత్యమైన పరాక్రమము కలవాడూ, ఇంద్రాదిదిక్పాలకులతో సమానుడూ అయిన రాముడు ప్రభువు కావలెనని ప్రజలందరును కోరుచున్నారు. 48

మూ. వత్సః శ్రేయసి జాతస్తే దిష్ట్యాసౌ తవ రాఘవ,
దిష్ట్యా పుత్రగుణైర్యుక్తో మారీచ ఇవ కాశ్యపః. 49

ప్ర. అ. రాఘవ=దశరథమహారాజా! తవ=నీయొక్క, దిష్ట్యా=భాగ్యము చేత, అసౌ=ఈ రాముడు, శ్రేయసి=శ్రేయస్సు కలిగించుటకై, తే=నీకు, వత్సః = కుమారుడుగా, జాతః = పుట్టినాడు. మారీచః = మరీచి కుమారుడైన, కాశ్యపః ఇవ=కాశ్యపుడు వలె, దిష్ట్యా=నీ భాగ్యముచే, పుత్రగుణైః=పుత్రున కుండవలసిన గుణములతో, యుక్తః = కూడియున్నాడు.

తా. దశరథమహారాజా! నీ పూర్వపుణ్యవశముచే ఈ రాముడు లోక కల్యాణార్థమై నీ కుమారుడుగా జనించినాడు. మరీచిప్రజాపతి కుమారుడైన

రాక్యపునికి వలె ఈతనికి పుత్రున కుండవలసిన సద్గుణము లన్నియు ఉన్నవి. అది కూడ నీ భాగ్యమే. 49

మూ. బలమారోగ్యమాయుశ్చ రామస్య విదితాత్మనః,
దేవాసురమనుష్యేషు సగన్ధర్వోరగేషు చ. 50
ఆశంసతే జనః సర్వో రాష్ట్రే పురవరే తథా,
ఆభ్యన్తరశ్చ బాహ్యాశ్చ పౌరజానపదో జనః. 51

ప్ర. అ. సగన్ధర్వోరగేషు చ = గంధర్వులతోడను, ఉరగులతోడను కూడిన, దేవాసురమనుష్యేషు = దేవాసురమనుష్యులలో, విదితాత్మనః = ప్రసిద్ధమైన స్వభావముగల, రామస్య = రామునియొక్క (నకు), బలమ్ = బలమును, ఆరోగ్యమ్ = ఆరోగ్యమును, ఆయుశ్చ = ఆయుర్దాయమును, రాష్ట్రే = రాష్ట్రమునందును, తథా = మరియు, పురవరే = పురశ్రేష్ఠమునందును ఉన్న, సర్వః జనః = సకలజనము, ఆభ్యన్తరః చ = సన్నిహితమైన, బాహ్యాశ్చ = దూరముగా ఉన్న, పౌరజానపదః జనః = పురములకును గ్రామములకును సంబంధించిన జనము, ఆశంసతే = కోరుచున్నది.

తా. దేవాసురమనుష్యగంధర్వోరగులలో ప్రసిద్ధమైన స్వభావము గల రామునకు ఆయురారోగ్యబలములు కలుగవలె నని రాష్ట్రములోని జనులూ, రాజధానిలోని జనులూ, దూరమునందూ, సమీపమునందూ ఉన్న జనులూ, (అంతరంగికులూ తదితరులూ గూడ) కోరుచున్నారు. 50, 51

మూ. స్త్రియో వృద్ధాస్తరుణ్యశ్చ సాయం ప్రాతః సమాహితాః,
సర్వాన్ దేవాన్ నమస్యన్తి రామస్యార్థే యశస్వినః. 52

ప్ర. అ. వృద్ధాః = వయస్సు మళ్లినవారును, తరుణ్యశ్చ = యువతులును అగు, స్త్రియః = స్త్రీలు, సాయమ్ = సాయంకాలము, ప్రాతః = ప్రాతఃకాలమునందును, సమాహితాః = నిశ్చలచిత్తముగలవారై, యశస్వినః = యశశ్శాలియైన, రామస్య = రామునియొక్క, అర్థే = ప్రయోజనముకొరకై, సర్వాన్ = సమస్తమైన, దేవాన్ = దేవతలను, నమస్యన్తి = నమస్కరించుచున్నారు.

తా. వృద్ధమహిళలు, యువతులు గూడ, సమాహితచిత్తముతో, యశఃశాలియైన రాముని అభివృద్ధిని కోరుచు, సాయంప్రాతఃకాలములందు సకల దేవతలకూ నమస్కరించుచున్నారు. 52

మూ. తేషామాయాచితం దేవ త్వత్ప్రసాదా త్సమృద్ధ్యతామ్,
రామమిన్దీవరశ్యామం సర్వశత్రునిబర్హణమ్, 53
పశ్యామో యౌవరాజ్యస్థం తవ రాజోత్తమాఽత్మజమ్.

ప్ర. అ. దేవ = రాజా! త్వత్ప్రసాదాత్ = నీ అనుగ్రహమువలన, తేషామ్ = ఆ ప్రజలయొక్క, ఆయాచితమ్ = ప్రార్థన, సమృద్ధ్యతామ్ = సఫల మగుగాక. రాజోత్తమ = రాజశ్రేష్ఠుడా, ఇన్దీవరశ్యామమ్ = నల్లకలువవలె నల్లనివాడూ, సర్వశత్రునిబర్హణమ్ = సకలశత్రువులను నశింపచేయువాడూ, తవ = నీయొక్క, ఆత్మజమ్ = కుమారుడూ అయిన, రామమ్ = రాముని, యౌవరాజ్యస్థమ్ = యౌవరాజ్యములో ఉన్నవానినిగా, పశ్యామః = చూడగలము.

తా. రాజశ్రేష్ఠుడవైన దశరథమహారాజా! నీ అనుగ్రహముచే ఆ ప్రజల కోరిక తీరుగాక. ఇందీవరశ్యాముడూ, సర్వశత్రుసంహారకుడూ అయిన నీ కుమారుడు రాముడు యౌవరాజ్యాభిషిక్తుడై యుండగా చూచెదముగాక. 53

మూ. తం దేవదేవోపమమాత్మజం తే
సర్వస్య లోకస్య హితే నివిష్టమ్,
హితాయ నః క్షిప్రముదారజుష్టం
ముదాభిషేక్తుం వరద త్వ మర్హసి. 54

ఇత్యార్షే, శ్రీమద్రామాయణే ఆదికావ్యే, అయోధ్యాకాణ్డే ద్వితీయః సర్గః.

ప్ర. అ. వరద = మాకోర్కెలను దీర్చు ఓ మహారాజా! దేవదేవోపమమ్ = దేవదేవుడైన విష్ణువుతో సమానుడూ, సర్వస్య = సమస్తమైన, లోకస్య = లోకముయొక్క, హితే = హితమునందు, నివిష్టమ్ = శ్రద్ధకలవాడూ, ఉదారజుష్టమ్ = ఉత్తమగుణములతో కూడినవాడూ అయిన, తమ్ = ఆ, తే ఆత్మజమ్ = నీ కుమారుడైన రాముని, త్వమ్ = నీవు, నః = మాయొక్క, హితాయ = హితముకొరకు, క్షిప్రమ్ = శీఘ్రముగా, ముదా = ఆనందముతో, అభిషేక్తుమ్ = అభిషేకము చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. ప్రజల కోర్కెలను దీర్చు ఓ దశరథ మహారాజా! విష్ణుసమానుడూ, సర్వలోకహితాసక్తుడూ, ఉత్తమగుణసంపన్నుడూ అయిన నీ కుమారుడైన రాముని, మా హితముకొరకై, సంతోషపూర్వకముగ, శీఘ్రముగ రాజ్యాభిషిక్తుని చేయుము." 54

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ద్వితీయసర్గ సమాప్తము.

## అథ తృతీయః సర్గః

[రాముని రాజ్యాభిషేకానికి కావలసిన సంభారములు సమకూర్చ వలసినదిగా దశరథుడు వసిష్ఠవామదేవులను ప్రార్థింపగా వారు సేవకులకు అందుకు తగిన ఆజ్ఞ ఇచ్చుట, దశరథుని ఆజ్ఞ ప్రకారము సుమంత్రుడు రాముని రాజసభకు తీసికొని వచ్చుట, దశరథుడు రామునకు హితోపదేశము చేయుట]

మూ. తేషామఞ్జలిపద్మాని ప్రగృహీతాని సర్వశః,
ప్రతిగృహ్యాబ్రవీద్రాజా తేభ్యః ప్రియహితం వచః. 1

ప్ర. అ. రాజా = రాజు, సర్వశః = సర్వవిధముల, ప్రగృహీతాని = గ్రహింపబడిన, తేషామ్ = వారియొక్క, అఞ్జలిపద్మాని = పద్మములవంటి దోసిళ్లను, ప్రతిగృహ్య = స్వీకరించి, తేభ్యః = వారికి, ప్రియహితమ్ = ప్రియము, హితము అయిన, వచః = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగ పలికి ఆ పౌరజానపదశ్రేష్ఠులు పద్మములవంటి దోసిళ్లు కట్టి దశరథునకు నమస్కరించగా, అతడు ఆ నమస్కారములను అభినందించి వారికి ప్రియము, హితము అయిన వాక్యము పలికెను. 1

మూ. అహోఽస్మి పరమప్రీతః ప్రభావశ్చాతులో మమ,
యన్మే జ్యేష్ఠం ప్రియం పుత్రం యౌవరాజ్యస్థ మిచ్ఛథ. 2

ప్ర. అ. మే = నాయొక్క, జ్యేష్ఠమ్ = జ్యేష్ఠుడైన, ప్రియమ్ = ఇష్టుడైన, పుత్రమ్ = పుత్రుని, యౌవరాజ్యస్థమ్ = యౌవరాజ్యమునందున్నవానినిగా, యత్ ఇచ్ఛథ = ఏ కారణమువలన కోరుచున్నారో, అందువలన, అహో = ఆహా! పరమప్రీతః అస్మి = మిక్కిలి సంతసించినవాడనైతిని. మమ = నాయొక్క, ప్రభావశ్చ = ప్రభావము కూడ, అతులః = సాటిలేనిది.

తా. "నా కిష్టుడైన నా జ్యేష్ఠపుత్రుడు యౌవరాజ్యాభిషిక్తుడు కావలెనని మీ రందరును కోరుచుండుటచే చాలా సంతోషించుచున్నాను. నా ప్రభావము (భాగ్యము) సాటిలేనిదని భావించుచున్నాను." 2

మూ. ఇతి ప్రత్యర్చ్య తాన్ రాజా బ్రాహ్మణానిద మబ్రవీత్,
వసిష్ఠం వామదేవం చ తేషామేవోపశృణ్వతామ్. 3

ప్ర. అ. రాజా=రాజు, ఇతి=ఈ విధముగా, తాన్=వారిని, ప్రత్యర్చ్య =గౌరవించి, తేషామ్=వారందరును, ఉపశృణ్వతామ్ ఏవ=వినుచుండగా, వసిష్ఠమ్=వసిష్ఠుని గూర్చియు, వామదేవం చ = వామదేవుని గూర్చియు, బ్రాహ్మణాన్ = ఇతరబ్రాహ్మణులను గూర్చియు, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. దశరథమహారాజు ఆ సభకు అందరిని ఈ విధముగా గౌరవించి, వారు వినుచుండగనే వసిష్ఠవామదేవాదిబ్రాహ్మణులతో ఇట్లు పలికెను. 3

మూ. చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః,
యౌవరాజ్యాయ రామస్య సర్వమేవోపకల్ప్యతామ్. 4
రాజ్ఞస్తూపరతే వాక్యే జనఘోషో మహానభూత్.

ప్ర. అ. శ్రీమాన్=శోభాయుక్తమైన, అయమ్=ఈ, చైత్రః మాసః =చైత్రమాసము, పుణ్యః=పుణ్యమైనది; పుష్పితకాననః = పుష్పించిన అటవులు కలది. రామస్య=రామునియొక్క, యౌవరాజ్యాయ = యౌవరాజ్యము కొరకు, సర్వమ్ ఏవ=సమస్తము, ఉపకల్ప్యతామ్=ఏర్పరుపబడుగాక. రాజ్ఞః =రాజుయొక్క, వాక్యే=వాక్యము, ఉపరతే = పూర్తియైన దగుచుండగా, మహాన్ =గొప్పదైన, జనఘోషః=జనుల ధ్వని, అభూత్=అయెను.

తా. "శోభాయుక్తమూ, పుష్పించిన అటవులు కలదీ అయిన చైత్ర మాసము పుణ్యమైనది. రాముని యౌవరాజ్యము కొరకు ఏర్పాటు లన్నియు చేయబడుగాక". రాజు ఇట్లు పలుకగనే జను లందరు చాల పెద్దగా సంతోష ధ్వానములు చేసిరి. 4

మూ. శనైస్తస్మిన్ ప్రశాన్తే చ జనఘోషే జనాధిపః, 5
వసిష్ఠం మునిశార్దూలం రాజా వచనమబ్రవీత్.

ప్ర. అ. తస్మిన్ = ఆ, జనఘోషే =జనులధ్వని, శనైః=మెల్లగా, ప్రశాన్తే=శాంతించిన దగుచుండగా, జనాధిపః=జనులకు ప్రభువైన, రాజా = రాజు, మునిశార్దూలమ్=మునిశ్రేష్ఠుడైన, వసిష్ఠమ్=వసిష్ఠుని గూర్చి, వచనమ్ =వచనమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ జనఘోషము మెల్లగా శాంతించినది. అపుడు దశరథమహారాజు మునిశ్రేష్ఠుడైన, వసిష్ఠునితో ఇట్లనెను. 5

మూ. అభిషేకాయ రామస్య యత్కర్మ సపరిచ్ఛదమ్, 6
తదద్య భగవన్ సర్వమాజ్ఞాపయితు మర్హసి.

ప్ర. అ. భగవన్=పూజ్యుడా! రామస్య = రామునియొక్క, అభిషేకాయ=అభిషేకముకొరకు, సపరిచ్ఛదమ్=ఉపకరణములతో కూడిన, యత్=ఏ, కర్మ=కర్మ గలదో, తత్=దానిని, అద్య=ఇపుడు, ఆజ్ఞాపయితుమ్=ఆజ్ఞాపించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. ఓ "పూజ్యుడా! రామాభిషేకమునకై కావలసిన పనులను, ఉపకరణములను సిద్ధముచేయుటకై తగువారిని ఆజ్ఞాపించుము." 6

మూ. తచ్ఛ్రుత్వా భూమిపాలస్య వసిష్ఠో ద్విజసత్తమః, 7
ఆదిదేశాగ్రతో రాజ్ఞః స్థితాన్ యుక్తాన్ కృతాఞ్జలీన్.

ప్ర. అ. ద్విజసత్తమః = బ్రాహ్మణశ్రేష్ఠుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, భూమిపాలస్య=రాజుయొక్క, తత్= ఆ వాక్యమును, శ్రుత్వా=విని, రాజ్ఞః = రాజుయొక్క, అగ్రతః=ఎదుట, స్థితాన్=ఉన్న, కృతాఞ్జలీన్ = చేయబడిన దోసిళ్లు గల, యుక్తాన్=అధికారులను, ఆదిదేశ=ఆజ్ఞాపించెను.

తా. రాజు మాటలు విని, ద్విజశ్రేష్ఠుడైన వసిష్ఠుడు దోసిళ్ల కట్టి రాజు ఎదుట నిలచియున్న అధికారులతో ఇట్లనెను. 7

మూ. సువర్ణాదీని రత్నాని బలీన్ సర్వౌషధీరపి, 8
శుక్లమాల్యాంశ్చ లాజాంశ్చ పృథక్చ మధుసర్పిషీ,
అహతాని చ వాసాంసి రథం సర్వాయుధాన్యపి, 9
చతురఙ్గబలం చైవ గజం చ శుభలక్షణమ్,
చామరవ్యజనే శ్వేతే ధ్వజం ఛత్రం చ పాణ్డురమ, 10
శతం చ శాతకుమ్భానాం కుమ్భానామగ్నివర్చసామ్,
హిరణ్యశృఙ్గమృషభం సమగ్రం వ్యాఘ్రచర్మ చ, 11
ఉపస్థాపయత ప్రాతరగ్న్యగారం మహీపతేః.

ప్ర. అ. సువర్ణాదీని = బంగారము మొదలైనవానిని, రత్నాని = రత్నములను, బలీన్ = పూజాద్రవ్యములను, సర్వౌషధీః అపి=సమస్తమైన

ఓషధులను, శుక్లమాల్యాన్ చ=తెల్లని పుష్పమాలలను, లాజాన్ చ=పేలాలను, పృథక్=వేరువేరుగా, మధుసర్పిషీ =తేనెను, నేతిని, అహతాని వాసాంసి చ= నూతనవస్త్రములను, రథమ్ = రథమును, సర్వాయుధాన్యపి =సమస్త మైన ఆయుధములను, చతురఙ్గబలం చైవ = చతురంగసైన్యమును, శుభలక్షణమ్= శుభమైన లక్షణములు గల, గజం చ=ఏనుగను, శ్వేతే=తెల్లని, చామరవ్యజనే =చమరీమృగమునకు సంబంధించిన వింజామరలను, ధ్వజమ్ = ధ్వజమును, పాణ్డురమ్=తెల్లని, ఛత్రం చ=ఛత్రమును, శాతకుమ్భానామ్ = బంగారువికార మైన, అగ్నివర్చసామ్ = అగ్ని వంటి తేజస్సు గల, కుమ్భానామ్=కుంభముల యొక్క, శతం చ=శతమును, హిరణ్యశృఙ్గమ్ = బంగారుకొమ్ములు గల, ఋషభమ్=ఎద్దును, సమగ్రమ్=పూర్ణ మైన, వ్యాఘ్రచర్మ చ=పులి చర్మమును, ప్రాతః = ఉదయముననే, మహీపతేః=రాజుయొక్క, అగ్న్యగారమ్=అగ్ని గృహమును, ఉపస్థాపయత=చేర్పుడు.

తా. "బంగారము మొదలైనవి, రత్నములు, పూజాద్రవ్యములు, సమస్త మైన ఓషధులు, తెల్లని పుష్పమాలలు, పేలాలు, వేరు వేరుగా తేనె-నెయ్యి, నూతనవస్త్రములు, రథము, సమస్త మైన ఆయుధములు, చతురంగ సైన్యము, శుభలక్షణములు గల గజము, తెల్లని చామరము, ధ్వజము, శ్వేతచ్ఛత్రము, అగ్నివలె ప్రకాశించు నూరు బంగారు కుంభములు, బంగారు కొమ్ముల వృషభము, పూర్తిగా ఉన్న వ్యాఘ్రచర్మము వీటి నన్నింటిని తెల్లవారుసరికి రాజు గారి అగ్నిహోత్రగృహములో చేర్పవలెను. 8-11

మూ. యచ్చాన్యత్కిఞ్చిదేష్టవ్యం తత్సర్వముపకల్ప్యతామ్, 12
అన్తఃపురస్య ద్వారాణి సర్వస్య నగరస్య చ,
చన్దనస్రగ్భిరర్చ్యన్తాం ధూపైశ్చ ఘ్రాణహారిభిః. 13

ప్ర. అ. అన్యత్=మరియొక, యత్ చ కిఞ్చిత్ =ఏ కొంచె మైనను, ఏష్టవ్యమ్=అపేక్షింపదగినదో, తత్ సర్వమ్ =అది యంతయు, ఉపకల్ప్యతామ్=ఏర్పరుపబడుగాక. అన్తఃపురస్య=అంతఃపురముయొక్కయు, సర్వస్య= సమస్త మైన, నగరస్య చ= నగరముయొక్కయు, ద్వారాణి = ద్వారములు, చన్దనస్రగ్భిః = చందనముచేతను పుష్పమాలలచేతను, ఘ్రాణహారిభిః= ఘ్రాణేంద్రియమును ఆకర్షించు, ధూపైః = ధూపములచేతను, అర్చ్యన్తామ్= పూజింపబడుగాక.

తా. ఇంకను ఏ చిన్న వస్తువు లైనను అపేక్షితము లైనచో వాటి నన్ని టిని సమకూర్చుడు. అంతఃపురద్వారములను సమస్త మైన నగరద్వారములను చందనముతో కడిగి, పుష్పమాలలచేత అలంకరించి ఘ్రాణేంద్రియమును ఆక ర్షించు ధూపములచేత సువాసన కలవాటినిగా చేయించుడు. 12, 13

మూ. ప్రశస్తమన్నం గుణవద్దధిక్షీరోపసేచనమ్,
ద్విజానాం శతసాహస్రే యత్ప్రకామమలం భవేత్. 14

ప్ర. అ. యత్ = ఏది, ద్విజానామ్ = బ్రాహ్మణులయొక్క, శత సాహస్రే = నూరువేలకు, ప్రకామమ్ = పూర్తిగా, అలం భవేత్ = సరి పోవునో, అట్టి, గుణవత్ = మంచి గుణములు కలవీ, దధిక్షీరోపసేచనమ్ = పెరుగు పాలు నంజుగా గలదీ అయిన, ప్రశస్తమ్ = ప్రశస్త మైన, అన్నమ్= అన్నము, (ఏర్పరుపబడుగాక).

తా. వేలకొలది బ్రాహ్మణులకు సమృద్ధిగా సరిపోవునదీ, మంచి గుణ ములు గలదీ, పెరుగు, పాలు మొదలైన నంజులతో కూడినదీ, ప్రశస్తమూ అయిన అన్నమును ఏర్పరచుడు. 14

మూ. సత్కృత్య ద్విజముఖ్యానాం శ్వః ప్రభాతే ప్రదీయతామ్,
ఘృతం దధి చ లాజాశ్చ దక్షిణాశ్చాపి పుష్కలాః. 15

ప్ర. అ. (ఆ అన్నము) శ్వః = రేపు, ప్రభాతే = ప్రాతఃకాలము నందు, ద్విజముఖ్యానామ్ = బ్రాహ్మణశ్రేష్ఠులకు, సత్కృత్య = సత్కరించి, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక. ఘృతం = నెయ్యి, దధి చ = పెరుగు, లాజాః చ = పేలాలు, పుష్కలాః = పుష్కలము లైన, దక్షిణాశ్చాపి = దక్షిణలును, (ఇవ్వబడుగాక).

తా. ఆ అన్నమును రేపు ప్రాతఃకాలమునందు ద్విజముఖ్యులకు సత్కార పూర్వకముగా ఇవ్వవలెను. నెయ్యి, పెరుగు, పేలాలు, పుష్కలం మైన దక్షి ణలు కూడ వారికి ఇవ్వవలెను. 15

మూ. సూర్యేఽభ్యుదితమాత్రే శ్వో భవితా స్వస్తివాచనమ్,
బ్రాహ్మణాశ్చ నిమన్త్ర్యన్తాం కల్ప్యన్తామాసనాని చ. 16

ప్ర. అ. శ్వః = రేపు, సూర్యే = సూర్యుడు, అభ్యుదితమాత్రే = ఉద యించగనే, స్వస్తివాచనమ్ = స్వస్తివాచనము, భవితా = కాగలదు.

బ్రాహ్మణాః చ = బ్రాహ్మణులు, నిమన్త్ర్యన్తామ్ =పిలువబడుదురుగాక. ఆసనాని చ = ఆసనములు కూడ, కల్ప్యన్తామ్ = కల్పింపబడుగాక.

తా. రేపు సూర్యోదయ మైన వెంటనే స్వస్తివాచనము జరుగును. బ్రాహ్మణులను ఆహ్వానించి వారికి తగు ఆసనములు ఏర్పాటుచేయుడు. 16

మూ. ఆబధ్యన్తాం పతాకాశ్చ రాజమార్గశ్చ సిచ్యతామ్,
సర్వే చ తాళాపచరా గణికాశ్చ స్వలంకృతాః, 17
కక్ష్యాం ద్వితీయామాసాద్య తిష్ఠన్తు నృపవేశ్మనః.

ప్ర. అ. పతాకాః చ = పతాకలు, ఆబధ్యన్తామ్ = కట్టబడుగాక. రాజమార్గః చ = రాజమార్గము, సిచ్యతాం చ = తడుపబడుగాక. సర్వే = సమస్త మైన, తాళాపచరాః =తాళములచే జీవించు నటులును, స్వలంకృతాః = చక్కగా అలంకరింపబడిన, గణికాః చ = వేశ్యాస్త్రీలును, నృపవేశ్మనః = రాజప్రాసాదముయొక్క, ద్వితీయామ్ = రెండవ, కక్ష్యామ్ = కక్ష్యను, ఆసాద్య = పొంది, తిష్ఠన్తు =ఉందురుగాక.

తా. పురమునందు పతాకలు కట్టించి రాజవీధులను తడిపించుడు. తాళములను వేయు నటులును, బాగుగా అలంకరించుకొన్న వేశ్యా స్త్రీలును రాజప్రాసాదమునందలి రెండవ కక్ష్యకు వచ్చియుండు నట్లు చేయుడు. 17

మూ. దేవాయతనచైత్యేషు సాన్నభక్షాః సదక్షిణాః, 18
ఉపస్థాపయితవ్యాః స్యుర్మాల్యయోగ్యాః పృథక్ పృథక్.

ప్ర. అ. సాన్నభక్షాః = అన్నములతోడను భక్ష్యములతోడను కూడినవారును, సదక్షిణాః=దక్షిణలతో కూడినవారును, మాల్యయోగ్యాః = పుష్పమాలలకు యోగ్యులును, పృథక్ పృథక్ = వేరువేరుగా, దేవాయతనచైత్యేషు =దేవాలయములందును, చతుష్పథములందును, ఉపస్థాపయితవ్యాః స్యుః = చేర్చదగినవారు. (చైత్య మనగా వీథిలోని వృక్షమని కొందరు వ్యాఖ్యాతలు).

తా. దేవాలయములందును, చైత్యములందును పూజలు చేయవలెను గాన అచట వేరువేరుగా అన్నములు, భక్ష్యములు, దక్షిణలు, పుష్పమాలలు తీసికొని పురుషులు సిద్ధముగా నుండు నట్లు చేయుడు. 18

మూ. దీర్ఘాసిబద్ధా యోధాశ్చ సన్నద్ధా మృష్టవాసస:, 19
మహారాజాఙ్గణం సర్వే ప్రవిశన్తు మహోదయమ్.

ప్ర. అ. దీర్ఘాసిబద్ధా: = దీర్ఘమైన ఖడ్గములను ధరించినవారూ, సన్నద్ధా: = కవచధారులూ, మృష్టవాసస: =ఉతికిన వస్త్రములు ధరించినవారూ అయిన, సర్వే = సమస్తమైన, యోధా: చ = యుద్ధభటులు కూడ, మహోదయమ్ = గొప్ప అభివృద్ధి గల, మహారాజాఙ్గణమ్ = మహారాజగృహముయొక్క ముంగిలిని, ప్రవిశన్తు = ప్రవేశింతురుగాక.

తా. యోధు లందరును కవచాదులు ధరించి, పరిశుభ్ర మైన వస్త్రములు కట్టుకొని, దీర్ఘ మైన ఖడ్గములతో, గొప్ప ఉత్సవము గల మహారాజప్రాసాదము ముంగిలిలోనికి వచ్చియుండవలెను." 19

మూ. ఏవం వ్యాదిశ్య విప్రౌ తౌ క్రియాస్తత్ర సునిష్ఠితౌ, 20
చక్రతుశ్చైవ యచ్ఛేషం పార్థివాయ నివేద్య చ.

ప్ర. అ. సునిష్ఠితౌ = మిక్కిలి సావధానచిత్తులైన, తౌ = ఆ, విప్రౌ = వసిష్ఠవామదేవులు, తత్ర = అచట, ఏవమ్ = ఈ విధముగా, క్రియా: = చేయదగిన పనులు, వ్యాదిశ్య = ఆజ్ఞాపించి, పార్థివాయ = రాజునకు, నివేద్య చ = తెలిపి, యత్ = ఏది, శేషమ్ = మిగిలినదో, దానిని కూడ, చక్రతు: చ ఏవ = చేసిరి.

తా. ఆ వసిష్ఠవామదేవులు సావధానచిత్తములతో అచట చేయవలసిన కార్యము లన్నింటిని ఆజ్ఞాపించి, ఆ విషయమును దశరథునకు తెలిపి, మిగిలిన పనులు కూడ నిర్వర్తించిరి. 20

మూ. కృతమిత్యేవ చాబ్రూతామభిగమ్య జగత్పతిమ్, 21
యథోక్తవచనం ప్రీతౌ హర్షయుక్తౌ ద్విజర్షభౌ.

ప్ర. అ. ప్రీతౌ = సంతృప్తులై, హర్షయుక్తౌ = ఆనందముతో గూడిన, ద్విజర్షభౌ = బ్రాహ్మణశ్రేష్ఠులైన వసిష్ఠవామదేవులు, జగత్పతిమ్ = దశరథుని, అభిగమ్య = సమీపించి, యథోక్తవచనమ్ = చెప్పబడిన వచనము ప్రకారము, కృతమిత్యేవ = చేయబడిన దని, అబ్రూతామ్ = పలికిరి.

తా. తమ యాజ్ఞ ప్రకారము అన్నియు జరుగుచున్నందుకు సంతృప్తి చెంది ఆనందించిన ఆ వసిష్ఠవామదేవులు రాజు దగ్గరకు వెళ్లి "నీవు చెప్పినట్లు అన్నియు చేయబడినవి" అని చెప్పిరి. 21

మూ. తతః సుమన్త్రం ద్యుతిమాన్ రాజా వచనమబ్రవీత్, 22
రామః కృతాత్మా భవతా శీఘ్రమానీయతామితి.

ప్ర. అ. తతః = పిమ్మట, ద్యుతిమాన్ = కాంతి గల, రాజా = రాజు, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, కృతాత్మా = శిక్షిత మైన బుద్ధిగల, రామః = రాముడు, భవతా = నీచేత, శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆనీయతామ్ = తీసికొని రాబడుగాక, ఇతి = అని, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట దశరథుడు సుమంత్రునితో "ఆత్మ నిగ్రహవంతు డగు రాముని శీఘ్రముగా తీసికొని రమ్ము" అని పలికెను. 22

మూ. స తథేతి ప్రతిజ్ఞాయ సుమన్త్రో రాజశాసనాత్, 23
రామం తత్రానయాంచక్రే రథేన రథినాం వరమ్.

ప్ర. అ. సః = ఆ, సుమన్త్రః = సుమంత్రుడు, తథా ఇతి = అటులనే చేసెదను అని, ప్రతిజ్ఞాయ = పలికి, రాజశాసనాత్ = రాజాజ్ఞానుసారముగా, రథినామ్ = రథికులలో, వరమ్ = శ్రేష్ఠుడైన, రామమ్ = రాముని, రథేన = రథముచేత, తత్ర = అచటికి, ఆనయాంచక్రే = తీసికొని వచ్చెను.

తా. సుమంత్రుడు, రాజాజ్ఞానుసారము, మహారథికుడైన రాముని రథముపై నెక్కించుకొని అచటికి తీసికొని వచ్చెను (తీసికొని వచ్చుటకు వెళ్లెను). 23

మూ. అథ తత్ర సమాసీనాస్తదా దశరథం నృపమ్, 24
ప్రాచ్యోదీచ్యాః ప్రతీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ భూమిపాః.

మ్లేచ్ఛాశ్చార్యాశ్చ యే చాన్యే వనే శైలాన్తవాసినః, 25
ఉపాసాఞ్చక్రిరే సర్వే తం దేవా ఇవ వాసవమ్.

ప్ర. అ. అథ = పిమ్మట (సుమంత్రగమనానంతరము) ప్రాచ్యోదీచ్యాః = తూర్పు ఉత్తర దేశములకు సంబంధించిన వారూ, ప్రతీచ్యాః చ = పశ్చిమదేశమునకు సంబంధించిన వారూ, దాక్షిణాత్యాః చ = దక్షిణ దేశమునకు సంబంధించినవారూ అయిన, భూమిపాః = రాజులును, మ్లేచ్ఛాః చ = మ్లేచ్ఛ

దేశీయులూ, ఆర్యాః చ = ఆర్యావర్తమునకు చెందినవారూ, వనే = వన్య ప్రాంతము నందు, అన్యే = ఇతరులు, యే = ఎవ రుందురో వారూ, శైలాన్త వాసినః = పర్వతప్రాంతనివాసులూ, సర్వే = అందరూ, తదా = అప్పుడు, తత్ర = అచట, సమాసీనాః = కూర్చున్నవారై, తమ్ = ఆ, దశరథం నృపమ్ = దశరథమహారాజును, దేవాః=దేవతలు, వాసవమివ =దేవేంద్రుని వలె, ఉపాసాంచక్రిరే = సేవించిరి.

తా. సుమంత్రుడు రాముని తీసికొనివచ్చుటకై వెళ్లిన పిమ్మట, తూర్పు దేశాల రాజులూ, పడమటిదేశాల రాజులూ, ఉత్తరదేశాల రాజులూ, దక్షిణ దేశాల రాజులూ, మ్లేచ్ఛదేశాలరాజులూ, ఆర్యావర్తదేశానికి చెందిన రాజులూ, వనపర్వతప్రాంతపాలకు లైన రాజులూ, అచట కూర్చుండి దేవతలు దేవేంద్రుని సేవించి నట్లు దశరథుని సేవించిరి. 24, 25

మూ. తేషాం మధ్యే స రాజర్షిర్మరుతామివ వాసవః, 26
ప్రాసాదస్థో రథగతం దదర్శాయాన్త మాత్మజమ్.

ప్ర. అ. మరుతామ్ = దేవతల మధ్యయందు, వాసవః = దేవేంద్రుడు వలె, తేషాం = వారియొక్క, మధ్యే = మధ్యయం దున్న, సః = ఆ, రాజర్షిః = రాజూ ఋషి అయిన దశరథుడు, ప్రాసాదస్థః = ప్రాసాదముపై నున్నవాడై, రథగతమ్ = రథమునం దున్న, ఆయాన్తమ్ = వచ్చుచున్న, ఆత్మజమ్ = కుమారుని, దదర్శ = చూచెను.

తా. దేవతామధ్యమునం దున్న దేవేంద్రుడు వలె ఆ రాజుల మధ్య ప్రకాశించుచున్న రాజర్షి యైన ఆ దశరథుడు, రథ మెక్కి వచ్చుచున్న తన కుమారుని ప్రాసాదమునుండియే చూచెను. 26

మూ. గన్ధర్వరాజప్రతిమం లోకే విఖ్యాతపౌరుషమ్, 27
దీర్ఘబాహుం మహాసత్త్వం మత్తమాతఙ్గగామినమ్,
చన్ద్రకాన్తాననం రామమతీవ ప్రియదర్శనమ్, 28
రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్,
ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయన్తమివ ప్రజాః, 29
న తతర్ప సమాయాన్తం పశ్యమానో నరాధిపః.

ప్ర. అ. గన్ధర్వరాజప్రతిమమ్ = గంధర్వరాజుతో సమానుడూ, లోకే = లోకమునందు, విఖ్యాతపౌరుషమ్ = ప్రసిద్ధ మైన పౌరుషము కలవాడూ, దీర్ఘబాహుమ్ = దీర్ఘ మైన బాహువులు కలవాడూ, మహాసత్త్వమ్ = గొప్ప బలము కలవాడూ, మత్తమాతఙ్గగామినమ్ = మదించిన ఏనుగు వలె నడచు వాడూ, చన్ద్రకాన్తాననమ్ = చంద్రుడు వలె మనోహర మైన ముఖముకల వాడూ, అతీవ = మిక్కిలి, ప్రియదర్శనమ్ = ఆనందకర మైన దర్శనము కలవాడూ, రూపౌదార్యగుణైః = రూపముచేతా, ఔదార్యముచేతా, గుణముల చేతా, పుంసామ్ = పురుషులయొక్క, దృష్టిచిత్తాపహారకమ్ = దృష్టిని చిత్తమును అపహరించువాడూ, ఘర్మాభితప్తాః = గ్రీష్మముచే తపింపచేయబడిన, ప్రజాః = ప్రజలను, హ్లాదయన్తమ్ = సంతోషపెట్టుచున్న, పర్జన్యమ్ ఇవ = మేఘము వలె నున్నవాడూ అయిన, సమాయాన్తమ్ = వచ్చుచున్న, రామమ్ = రాముని, పశ్యమానః = చూచుచున్న, నరాధిపః = రాజు, న తతర్ప = తృప్తి చెందలేదు.

తా. రాముడు రూపవేషాదులచే గంధర్వరాజు వలె ఉన్నాడు. అతని పౌరుషము జగద్విదిత మైనది. మహాబలశాలియై మదించిన ఏనుగ వలె నడచు అతని చేతులు చాల దీర్ఘ మైనవి. చంద్రునివలె మనోహరమైన ముఖముతో చూచుటకు ముచ్చటగా ఉన్నాడు. రూపముచేతను, ఔదార్యము చేతను, ఇతర గుణములచేతను పురుషుల దృష్టులను మనస్సులను ఆకర్షించుచున్నాడు. అట్టి రాముడు వచ్చుచుండగా చూచుచున్న దశరథమహారాజునకు ఎంత చూచినను తృప్తి కలుగలేదు. 27-29

మూ. అవతార్య సుమన్త్రస్తం రాఘవం స్యన్దనోత్తమాత్, 30
పితుః సమీపం గచ్ఛన్తం ప్రాఞ్జలిః పృష్ఠతోఽన్వగాత్.

ప్ర. అ. సుమన్త్రః = సుమంత్రుడు, తమ్ = ఆ, రాఘవమ్ = రాముని, స్యన్దనోత్తమాత్ = రథశ్రేష్ఠమునుండి, అవతార్య = దింపి, పితుః = తండ్రియొక్క, సమీపమ్ = సమీపమును గూర్చి, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్న ఆ రాముని, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, పృష్ఠతః = వెనుకనే, అన్వగాత్ = అనుసరించి వెళ్లెను.

తా. సుమన్త్రుడు రాముని రథమునుండి దింపి, అతడు తండ్రి దగ్గరకు వెళ్లుచుండగా, అంజలి బంధించి, అతని వెనుకనే వెళ్లెను. 30

మూ. స తం కైలాసశృఙ్గాభం ప్రాసాదం నరపుఙ్గవః, 31
ఆరురోహ నృపం ద్రష్టుం సహ సూతేన రాఘవః.

ప్ర. అ. నరపుఙ్గవః = నరులలో శ్రేష్ఠుడైన, సః = ఆ, రాఘవః = రాముడు, నృపమ్ = రాజును, ద్రష్టుమ్ = చూచుటకు, సూతేన సహ = సారథితో కూడ, కైలాసశృఙ్గాభమ్ = కైలాసశిఖరముతో సమానమైన, తమ్ = ఆ, ప్రాసాదమ్ = మేడను, ఆరురోహ = ఎక్కెను.

తా. నరశ్రేష్ఠుడైన, రాముడు, సుమన్త్రసహితుడై, తండ్రి దర్శనము నకై కైలాసశిఖరతుల్యమైన ఆ మేడను ఎక్కెను. 31

మూ. స ప్రాఞ్జలిరభిప్రేత్య ప్రణతః పితురన్తికే, 32
నామ స్వం శ్రావయన్ రామో వవన్దే చరణౌ పితుః.

ప్ర. అ. సః = ఆ, రామః = రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, అభిప్రేత్య = సమీపించి, పితుః = తండ్రియొక్క, అన్తికే = సమీపమున, ప్రణతః = వంగినవాడై, స్వమ్ = తన, నామ = పేరును, శ్రావయన్ = వినిపింపచేయుచు, పితుః = తండ్రియొక్క, చరణౌ = పాదములను, వవన్దే = నమస్కరించెను.

తా. ఆ రాముడు అంజలి ఘటించి, నమ్రుడై తండ్రిని సమీపించి, 'రామ వర్మాహం భో అభివాదయే' అని తన పేరు వినిపింప చేయుచు తండ్రి పాదములకు నమస్కరించెను. 32

మూ. తం దృష్ట్వా ప్రణతం పార్శ్వే కృతాఞ్జలిపుటం నృపః, 33
గృహ్యాఞ్జలౌ సమాకృష్య సస్వజే ప్రియమాత్మజమ్.

ప్ర. అ. నృపః = రాజు, పార్శ్వే = పార్శ్వమునందు, ప్రణతమ్ = నమ్రుడై యున్న, కృతాఞ్జలిపుటమ్ = అంజలి ఘటించి యున్న, ప్రియమ్ = ఇష్టుడైన, తమ్ = ఆ, ఆత్మజమ్ = కుమారుని, అఞ్జలౌ = దోసిలియందు, గృహ్య = పట్టుకొని, సమాకృష్య = దగ్గరకు లాగికొని, సస్వజే = కౌగలించుకొనెను.

తా. దశరథమహారాజు, తన ప్రక్క అంజలి ఘటించి నమ్రుఁడై నిలిచియున్న ఆ ప్రియపుత్రుని అంజలి పట్టి దగ్గరకు లాగికొని కౌగలించుకొనెను.

మూ. తస్మై చాభ్యుదితం దివ్యం మణికాఞ్చనభూషితమ్, 34
దిదేశ రాజా రుచిరం రామాయ పరమాసనమ్.

ప్ర. అ. రాజా = దశరథమహారాజు, తస్మై = ఆ, రామాయ = రామునికొరకు, అభ్యుదితమ్ = ఉన్నత మైనదీ, దివ్యమ్ = శ్రేష్ఠ మైనదీ, మణికాఞ్చనభూషితమ్ = మణులచేతను బంగారముచేతను అలంకరింపబడినదీ అయిన, రుచిరమ్ = సుందర మైన, పరమాసనమ్ = గొప్ప ఆసనమును, దిదేశ = ఇచ్చెను.

తా. దశరథమహారాజు ఉన్నతమూ, శ్రేష్ఠమూ, సువర్ణరత్నాలంకృతమూ, సుందరమూ అయిన ఉత్తమ మైన ఆసనముపై రాముని కూర్చుండబెట్టెను. 34

మూ. తదాసనవరం ప్రాప్య వ్యదీపయత రాఘవః, 35
స్వయేవ ప్రభయా మేరుముదయే విమలో రవిః.

ప్ర. అ. రాఘవః = రాముడు, తత్ = ఆ, ఆసనవరమ్ = శ్రేష్ఠ మైన ఆసనమును, ప్రాప్య = పొంది, ఉదయే = ఉదయసమయమునందు, విమలః = నిర్మల మైన, రవిః = సూర్యుడు, మేరుమివ = మేరు పర్వతమును వలె, స్వయా = తనదైన, ప్రభయా = కాంతిచేత, వ్యదీపయత = ప్రకాశింపచేసెను.

తా. రాముడు ఆ ఆసనశ్రేష్ఠముపై ఉపవిష్టుడై ఉదయసమయమున నిర్మలకాంతి గల సూర్యుడు మేరుపర్వతమును ప్రకాశింపచేసి నట్లు ఆ ఆసనమును తన కాంతిచేత ప్రకాశింపచేసెను. 35

మూ. తేన విభ్రాజితా తత్ర సా సభాభివ్యరోచత, 36
విమలగ్రహనక్షత్రా శారదీ ద్యౌరివేన్దునా.

ప్ర. అ. తత్ర = అచట, విభ్రాజితా = ప్రకాశించుచున్న, తేన = ఆ రాముని చేత, సా = ఆ, సభా = సభ, విమలగ్రహనక్షత్రా = స్వచ్ఛ మైన

గ్రహములు నక్షత్రములు గల, శారదీ = శరత్కాలసంబంధమైన, ద్యౌః = ఆకాశము, ఇన్దునా ఇవ = చంద్రునిచేతవలె, అతివ్యరోచత = ఎక్కువగా ప్రకాశించెను.

తా. నిర్మలమైన గ్రహనక్షత్రములు గల ఆకాశమును శరత్కాలమున చంద్రుడు ప్రకాశింపచేసినట్లు ఆ రాముడు తన ప్రకాశముచే ఆ సభను ప్రకాశింప చేసెను. ౩౬

మూ. తం పశ్యమానో నృపతి స్తుతోష ప్రియమాత్మజమ్, ౩౭
అలఙ్కృతమివాత్మానమాదర్శతలసంస్థితమ్.

ప్ర. అ. తమ్ = ఆ, ప్రియమ్ = ప్రియుడైన, ఆత్మజమ్ = కుమారుని, పశ్యమానః = చూచుచున్న, నృపతిః = రాజు, అలఙ్కృతమ్ = అలంకరింపబడినట్టియు, ఆదర్శతలసంస్థితమ్ = అద్దములో నున్న, ఆత్మానమివ = తనను చూచుచున్న వాడు వలె, తుతోష = సంతసించెను.

తా. ప్రేమపాత్రుడైన తన పుత్రుని చూచుచు దశరథమహారాజు, తనను అలంకరించుకొని, అద్దములో చూచుకొనుచు మురిసిపోయి నట్లు మురిసి పోయెను. ౩౭

మూ. స తం సస్మితమాభాష్య పుత్రం పుత్రవతాం వరః, ౩౮
ఉవాచేదం వచో రాజా దేవేన్ద్రమివ కాశ్యపః.

ప్ర. అ. పుత్రవతామ్ = పుత్రవంతులలో, వరః = శ్రేష్ఠుడైన, సః = ఆ, రాజా = రాజు, తమ్ = ఆ, పుత్రమ్ = పుత్రుని, సస్మితమ్ = చిరునవ్వుతో కూడినట్లుగా, ఆభాష్య = పలకరించి, కాశ్యపః = కాశ్యపుడు, దేవేన్ద్రమివ = దేవేంద్రుని వలె; ఇదం = ఈ, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. రాముని వంటి ఉత్తమపుత్రుడుండుటచే, పుత్రులు కలవారిలో శ్రేష్ఠుడైన ఆ దశరథుడు చిరునవ్వుతో కుమారుని పలకరించి కాశ్యపుడు దేవేంద్రునితో పలికి నట్లు ఈ వాక్యములు పలికెను. ౩౮

మూ. జ్యేష్ఠాయామసి మే పత్న్యాం సదృశ్యాం సదృశః సుతః, 39
ఉత్పన్నస్త్వం గుణశ్రేష్ఠో మమ రామాత్మజః ప్రియః.

ప్ర. అ. రామ = ఓ రామా! జ్యేష్ఠాయామ్ = పెద్దదీ, సదృశ్యామ్ = తగినదీ అయిన, మే పత్న్యామ్ = నా భార్యయందు, ఉత్పన్నః = పుట్టిన, సదృశః = తగిన, సుతః = కుమారుడవు, అసి = అయి ఉన్నావు. గుణశ్రేష్ఠః = గుణములచేత శ్రేష్ఠుడవైన, త్వమ్ = నీవు, మమ = నాకు, ప్రియః = ఇష్టుడవైన, ఆత్మజః = కుమారుడవు.

తా. రామా! నీవు యోగ్యురాలైన నా జ్యేష్ఠభార్యయందు పుట్టిన యోగ్యుడవైన కుమారుడవు. శ్రేష్ఠములైన గుణములున్నవాడవగుటచే నాకు చాల ప్రియుడవు. 39

మూ. యత స్త్వయా ప్రజాశ్చేమాః స్వగుణైరనురఞ్జితాః, 40
తస్మాత్త్వం పుష్యయోగేన యౌవరాజ్యమవాప్నుహి.

ప్ర. అ. యతః = ఎందువలన, త్వయా = నీచేత, ఇమాః = ఈ, ప్రజాః = ప్రజలు, స్వగుణైః = నీ సద్గుణములచేత, అనురఞ్జితాః = రంజింపచేయబడినారో, తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, పుష్యయోగేన = పుష్యమీనక్షత్రయుక్తదివసమున, యౌవరాజ్యమ్ = యౌవరాజ్యమును, అవాప్నుహి = పొందుము.

తా. రామా! నీవు నీ సద్గుణములచేత ఈ ప్రజలను రంజింపచేసితివి. అందుచే పుష్యమీనక్షత్రయుక్తమైన దివసమునందు నిన్ను యౌవరాజ్యాభిషిక్తుని చేసెదను. 40

మూ. కామత స్త్వం ప్రకృత్యైవ వినీతో గుణవానసి, 41
గుణవత్యపి తు స్నేహాత్పుత్ర వక్ష్యామి తే హితమ్.

ప్ర. అ. త్వమ్ = నీవు, కామతః = మిక్కిలి, ప్రకృత్యైవ = స్వభావముచేతనే, వినీతః = వినయవంతుడవు, గుణవాన్ = గుణవంతుడవు, అసి = అయిఉన్నావు. పుత్ర = కుమారా! గుణవత్యపి తు = గుణవంతుడవే అయినను నీయందు, స్నేహాత్ = స్నేహమువలన, తే = నీకు, హితమ్ = హితమును, వక్ష్యామి = చెప్పగలను.

తా. కుమారా! సహజముగనే నీవు మిక్కిలి వినయశాలివి; సద్గుణవంతుడవు. అయినను నీపై నున్న స్నేహముచే నీకు హితము బోధించుచున్నాను. 41

మూ. భూయో వినయమాస్థాయ భవ నిత్యం జితేన్ద్రియః, 42
కామక్రోధసముత్థాని త్యజేథా వ్యసనాని చ.

ప్ర. అ. భూయః = ఇంకను, వినయమ్ = వినయమును, ఆస్థాయ = అవలంబించి, నిత్యమ్ = ఎల్లప్పుడును, జితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడవు, భవ = అగుము. కామక్రోధసముత్థాని = కామక్రోధములవలన కలుగు, వ్యసనాని చ = వ్యసనములను, త్యజేథాః = విడిచి పెట్టుము.

తా. ఇంకను వినయము పెంచుకొని ఎల్లప్పుడును ఇంద్రియములను అదుపులో పెట్టుకొనుము. కామమువలన కలుగు వ్యసనములకును, క్రోధము వలన కలుగు వ్యసనములకును దూరముగా నుండుము.

వి. కామజము లైన వ్యసనములు పది :-

"మృగయాక్షో దివాస్వప్నః పరివాదః స్త్రియో మదః,
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః" (మనుస్మృతి vii.47)

(వేటాడుట, ద్యూతము, పగటినిద్ర, పరదోషకథనము, స్త్రీసంభోగము, మద్యాదిపానము, నృత్యము, గీతము, వాద్యము పనిలేకుండ దేశసంచారము చేయుట, ఇవి కామము వలన కలుగు పది వ్యసనములు).

క్రోధజములగు వ్యసనములు ఎనిమిది :-

"పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాఽసూయార్థదూషణమ్,
వాగ్దణ్డజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః" (మనుస్మృతి vii.48)

(పైశున్యమ్ = చాడీలుచెప్పుట, సాహసమ్ = సత్పురుషులను బంధనాదులచే నిగ్రహించుట, ద్రోహః = కపటప్రయోగముచే వధించుట, ఈర్ష్యా = ఇతరుల అభివృద్ధిని చూచి ఓర్వజాలకపోవుట, అసూయా = ఇతరుల గుణములను దోషములనుగా చిత్రించుట, అర్థదూషణమ్ = ధనమును అపహరించుట,

ఇతరుల కీయవలసిన ధనము ఇవ్వకుండుట. వాగ్దణ్డజం పారుష్యమ్ = వాక్పారుష్యము=తిట్టుట మొదలైనది; దండపారుష్యము = కొట్టుట మొదలగునది; ఇవి క్రోధజము లైన ఎనిమిది వ్యసనములు.) 42

మూ. పరోక్షయా వర్తమానో వృత్త్యా ప్రత్యక్షయా తథా, 43
అమాత్యప్రభృతీః సర్వాః ప్రకృతీశ్చానురఞ్జయ.

ప్ర. అ. పరోక్షయా = పరోక్షమైన, వృత్త్యా = ప్రవర్తనతోడను, తథా = మరియు, ప్రత్యక్షయా = ప్రత్యక్షవృత్తితోడను, వర్తమానః = వ్యవహరించుచున్నవాడవై, అమాత్యప్రభృతీః = అమాత్యులు మొదలైన, సర్వాః = సమస్తమైన, ప్రకృతీః = ప్రకృతులను, అనురఞ్జయ = ఆనందింపజేయుము.

తా. పరోక్షప్రత్యక్షవృత్తులతో వ్యవహరించుచు అమాత్యులు మొదలగు ప్రకృతుల నందరిని సంతోషపెట్టుము.

వి. కొందరితో ఒకప్పుడు పరోక్షముగా (ఇతరులద్వారా) వ్యవహరింపవలసియుండును. అనగా వారిని ప్రత్యక్షముగా కలవవలసిన పనిలేదు. ఒకప్పుడు కొందరితో ప్రత్యక్షముగా వ్యవహరింపవలసియుండును. లేదా ఇతర రాజ్యవృత్తాంతములను పరోక్షమార్గముల ద్వారా తెలిసికొనవలెను. స్వరాజ్య వృత్తాంతములను ప్రత్యక్షముగ (స్వయముగ) తెలిసికొనవలెను.

స్వామ్యమాత్యౌ పురం రాష్ట్రం కోశదణ్డౌ సుహృత్తథా,
సప్త ప్రకృతయో హ్యేతాః సప్తాఙ్గం రాజ్యముచ్యతే" (మనుస్మృతి. ix. 294)

అని మనుస్మృతిలో చెప్పిన— రాజు, అమాత్యులు, దుర్గములో నున్న పురము, దేశము, ధనాగారము, సేనాబలము, మిత్రుడు అను ఏడును సప్త ప్రకృతులు. ఇచట "ప్రకృతీః" అనుదానికి యథోచితముగ "ప్రకృతులను" అని గాని, సామాన్యరూపమున ప్రజలను అని గాని అర్థము గ్రహింపవచ్చును. 43

మూ. కోష్ఠాగారాయుధాగారైః కృత్వా సన్నిచయాన్ బహూన్. 44

తుష్టానురక్తప్రకృతిర్యః పాలయతి మేదినీమ్,
తస్య నన్దన్తి మిత్రాణి లబ్ధ్వాఽమృతమివాఽమరాః. 45
తస్మాత్త్వమపి చాత్మానం నియమ్యైవం సమాచర.

ప్ర. అ. కోష్ఠాగారాయుధాగారైః = ధాన్యాదిగృహములచేతను ఆయుధగృహములచేతను, బహూన్ = అనేకమైన, సన్నిచయాన్ = మంచినిచయములను (నిచయ మనగా ఒక్కచోట ప్రోగుచేయుట), కృత్వా = చేసి, తుష్టానురక్తప్రకృతిః = సంతసించిన, అనురాగవంతులైన ప్రకృతులు కలవారై, యః = ఎవడు, మేదినీమ్ = భూమిని, పాలయతి = పాలించునో, తస్య = వానియొక్క, మిత్రాణి = మిత్రులు, అమృతమ్ = అమృతమును, లబ్ధ్వా = పొంది, అమరాః ఇవ = దేవతలు వలె, నన్దన్తి = ఆనందింతురు, తస్మాత్ = ఆకారణమువలన, త్వమపి = నీవు కూడ, ఆత్మానమ్ = తనను లేదా మనస్సును, ఏవం = ఇట్లు, సమాచర = చేయుము.

తా. కోష్ఠాగారాయుధాగారములను చక్కగ నింపి ప్రకృతులకు ఆనందము కలిగించుచు, తనపై అనురక్తులను చేయుచు భూమిని పాలించువాని మిత్రులు అమృతముపొందిన దేవతల వలె, ఆనందింతురు. అందుచే నీవు కూడ ఆత్మనిగ్రహవంతుడవై ఆ విధముగ ఆచరింపుము. 44, 45

మూ. తచ్ఛ్రుత్వా సుహృదస్తస్య రామస్య ప్రియకారిణః, 46
త్వరితాః శీఘ్రమభ్యేత్య కౌసల్యాయై న్యవేదయన్.

ప్ర. అ. తస్య = ఆ, రామస్య = రామునియొక్క, సుహృదః = మిత్రులు, తత్ = అది, శ్రుత్వా = విని, త్వరితాః = తొందరపడుచున్నవారై, ప్రియకారిణః = ప్రియమును చేయువారై, శీఘ్రమ్ = శీఘ్రముగా, అభ్యేత్య = వచ్చి, కౌసల్యాయై = కౌసల్యకు, న్యవేదయన్ = తెలిపిరి.

తా. ఆ మాటలు విని రాముని మిత్రులు, కౌసల్యకు ప్రియము చేయవలెనను అభిప్రాయముతో శీఘ్రముగ వెళ్లి ఆమెకీ విషయము తెలిపిరి. 46

మూ. సా హిరణ్యం చ గాశ్చైవ రత్నాని వివిధాని చ, 47
వ్యాదిదేశ ప్రియాఖ్యేభ్యః కౌసల్యా ప్రమదోత్తమా.

ప్ర. అ. ప్రమదోత్తమా = స్త్రీలలో ఉత్తమురాలైన, సా = ఆ, కౌసల్యా = కౌసల్య, హిరణ్యం చ = బంగారమును, గాః చైవ = గోవులను, వివిధాని=అనేకవిధము లైన, రత్నాని చ = రత్నములను, ప్రియాఖ్యేభ్యః= ప్రియమైన ఈ వార్త చెప్పినవారికి, వ్యాదిదేశ = ఇచ్చెను.

తా. స్త్రీలలో ఉత్తమురా లైన ఆ కౌసల్య, ప్రియమైన వార్త తీసికొని వచ్చిన వారందరికిని బంగారము, గోవులు, వివిధ రత్నములు ఇచ్చి బహూక రించెను. 47

మూ. అథాభివాద్య రాజానం రథమారుహ్య రాఘవః, 48
యయౌ స్వం ద్యుతిమద్వేశ్మ జనౌఘైః ప్రతిపూజితః.

ప్ర. అ. అథ = పిమ్మట, రాఘవః = రాముడు, రాజానమ్ = రాజును, అభివాద్య = నమస్కరించి, రథమ్ = రథమును, ఆరుహ్య = ఎక్కి, జనౌఘైః = జనసముదాయములచే, ప్రతిపూజితః = పూజింపబడిన వాడై, ద్యుతిమత్ = కాంతిగల, స్వం వేశ్మ = తన గృహమును గూర్చి, యయౌ = వెళ్లెను.

తా. రాముడు దశరథమహారాజును నమస్కరించి, రథ మధిరోహించి, జను లందరును పూజించుచుండగా, సుందర మైన తన గృహమునకు వెళ్లెను.

మూ. తే చాపి పౌరా నృపతేర్వచస్త
చ్ఛ్రుత్వా తదా లాభమివేష్టమాశు,
నరేన్ద్రమామన్త్ర్య గృహాణి గత్వా
దేవాన్ సమానర్చురతిప్రహృష్టాః. 49

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే తృతీయః సర్గః.

ప్ర. అ. తదా = అప్పుడు, తే = ఆ, పౌరాశ్చాపి = పౌరులు కూడ, ఇష్టమ్ = ఇష్ట మైన, లాభమివ = లాభమువలె నున్న, నృపతేః = రాజు యొక్క, తత్ = ఆ, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, నరేంద్రమ్ = దశరథమహారాజును, ఆమన్త్ర్య = వీడ్కొని, ఆశు = శీఘ్రముగా, గృహాణి =

గృహములను గూర్చి, గత్వా = వెళ్ళి, అతి ప్రహృష్టాః = చాలా సంతసించినవారై, దేవాన్ = దేవతలను, సమానర్చుః = పూజించిరి.

తా. అప్పుడా పౌరు లందరును రాజు మాటలను, తమ కత్యంతాభీష్టమైన విషయమును వినినట్లు విని, సంతసించినవారై, అతనివద్ద సెలవు గైకొని, తమ గృహములు చేరి దేవతలను పూజించిరి. 49

"బాలానందిని'' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో తృతీయసర్గసమాప్తము.

## అథ చతుర్థః సర్గః

*[రాముని మరల తీసుకొనిరమ్మని దశరథుడు సుమంత్రుని ఆజ్ఞాపించుట, వచ్చిన రామునకు దశరథుడు ఏవియో కొన్ని విషయములు చెప్పి అతని గృహమునకు పంపివేయుట, రాముడు కౌసల్యా భవనమునకు వెళ్లి ఆమెకు తన అభిషేకమును గూర్చి చెప్పి, ఆమె ఆశీస్సులు పొందుట, లక్ష్మణునితో స్నేహపూర్వకసంభాషణము చేసి స్వగృహమునకు వెళ్లుట].*

మూ. గతేష్వథ నృపో భూయః పౌరేషు సహ మన్త్రిభిః,
మన్త్రయిత్వా తతశ్చక్రే నిశ్చయజ్ఞః స నిశ్చయమ్. 1

మూ. శ్వ ఏవ పుష్యో భవితా శ్వోఽభిషేచ్యస్తు మే సుతః,
రామో రాజీవతామ్రాక్షో యౌవరాజ్య ఇతి ప్రభుః. 2

ప్ర. అ. అథ = పిమ్మట, పౌరేషు = పౌరులు, గతేషు సత్సు = వెళ్లినవారగుచుండగా, నిశ్చయజ్ఞః = నిశ్చయించు విధానమును ఎరిగినవాడును, ప్రభుః = సమర్థుడును అయిన, నృపః = రాజు, మన్త్రిభిః సహ = మంత్రులతో కూడ, భూయః = మరల, మన్త్రయిత్వా = ఆలోచన చేసి, శ్వః ఏవ = రేపే, పుష్యః = పుష్యనక్షత్రము, భవితా = కాగలదు. రాజీవతామ్రాక్షః = పద్మములవలె ఎఱ్ఱని నేత్రములు గల, మే సుతః = నా కుమారుడైన, రామః = రాముడు, శ్వః = రేపు, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేచ్యః = అభిషేకింపదగినవాడు. ఇతి = అని, నిశ్చయమ్ = నిశ్చయమును, చక్రే = చేసెను.

తా. పౌరు లందరును వెళ్లిన పిమ్మట, నిర్ణయములను తీసికొనుటలో సమర్థుడైన దశరథుడు మరల మంత్రులతో ఆలోచించి– "రేపే పుష్యమీ నక్షత్రము. అందుచే పద్మముల వంటి ఎఱ్ఱని నేత్రములు గల నా కుమారుడైన రాముని యౌవరాజ్యమున అభిషిక్తుని చేయవలెను", అని నిశ్చయించెను. 1,2

మూ. అథాన్తర్గృహమాసాద్య రాజా దశరథస్తదా,
సూతమామన్త్రయామాస రామం పునరిహానయ. 3

ప్ర. అ. అథ = పిమ్మట, రాజా దశరథః = దశరథమహారాజు, అన్తర్గృహమ్ = అంతఃపురమును, ఆసాద్య = పొంది. తదా = అప్పుడు. రామమ్ = రాముని, పునః = మరల, ఇహ = ఇచటికి, ఆనయ = తీసికొనిరమ్ము అని, సూతమ్ = సారథియైన సుమంత్రుని, అమన్త్రయామాస = ఆజ్ఞాపించెను.

తా. అటు పిమ్మట దశరథుడు అంతఃపురమునకు వెళ్లి — "మరల ఒకమారు రాముని ఇచటికి తీసికొని రమ్ము" అని సుమంత్రు నాజ్ఞాపించెను. 3

మూ. ప్రతిగృహ్య స తద్వాక్యం సూతః పునరుపాయయౌ,
రామస్య భవనం శీఘ్రం రామమానయితుం పునః. 4

ప్ర. అ. సః = ఆ, సూతః = సారథి, తత్ = ఆ, వాక్యమ్ = వాక్యమును, ప్రతిగృహ్య = స్వీకరించి, పునః = మరల, రామమ్ = రాముని, ఆనయితుమ్ = తీసికొనివచ్చుటకు, శీఘ్రమ్ = శీఘ్రముగా, పునః = మరల, రామస్య = రామునియొక్క, భవనమ్ = గృహమును, ఉపాయయౌ = పొందెను.

తా. సుమంత్రుడు రాజాజ్ఞానుసారముగా రాముని మరల తీసికొనివచ్చుటకై మరల రాముని భవనమునకు వెళ్లెను. 4

మూ. ద్వాఃస్థైరావేదితం తస్య రామాయాగమనం పునః,
శ్రుత్వైవ చాపి రామస్తం ప్రాప్తం శఙ్కాన్వితోఽభవత్.

ప్ర. అ. పునః = మరల, తస్య = అతనియొక్క, ఆగమనమ్ = రాక, ద్వాఃస్థైః = ద్వారపాలకులచేత, రామాయ = రామునకు, ఆవేదితమ్ = తెలుపబడినది. తమ్ = అతనిని, ప్రాప్తమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా ఏవ = వినగనే, రామః = రాముడు, శఙ్కాన్వితః = శంకతో కూడినవాడు, అభవత్ = ఆయెను.

తా. సుమంత్రుడు మరల వచ్చినట్లుగా ద్వారపాలకులు రామునకు తెలిపిరి. అతడు వచ్చినట్లు వినగనే, రాముని మనస్సులో శంక కలిగెను. 5

మూ. ప్రవేశ్య చైనం త్వరితం రామో వచన మబ్రవీత్,
యదాగమనకృత్యం తే భూయ స్తద్బ్రూహ్యశేషతః. 6

ప్ర. అ. రామః = రాముడు, ఏనమ్ = ఈతనిని, త్వరితమ్ = తొందరగా, ప్రవేశ్య = ప్రవేశింపజేసి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను. భూయః = మరల, తే = నీ యొక్క, ఆగమనకృత్యమ్ = రాకలో పని, యత్ = ఏది యున్నదో, తత్ = దానిని, అశేషతః = సంపూర్ణముగా, బ్రూహి = చెప్పుము.

తా. రాముడు ఆ సుమంత్రుని వెంటనే లోనికి రప్పించి "మరల నీ వెందుకు వచ్చితివో పూర్తిగా తెలుపుము" అని పలికెను. 6

మూ. తమువాచ తతః సూతో రాజా త్వాం ద్రష్టు మిచ్ఛతి,
శ్రుత్వా ప్రమాణమత్ర త్వం గమనాయేతరాయ వా. 7

ప్ర. అ. తతః = పిమ్మట, సూతః = సారథి, తమ్ = ఆతనిని గూర్చి, ఉవాచ = పలికెను. రాజా = రాజు, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. శ్రుత్వా = విని, అత్ర = ఈ విషయమున, గమనాయ = వెళ్లుటకు గాని, ఇతరాయ వా = వెళ్లకుండుటకు గాని, త్వమ్ = నీవే, ప్రమాణమ్ = ప్రమాణము.

తా. ఆ మాటలు విని సుమంత్రుడు– "దశరథమహారాజు నిన్ను చూడ గోరుచున్నాడు. వెళ్లవలెనా లేదా అను విషయమును నీవే నిర్ణయించుకొనవలెను" అని పలికెను. 7

మూ. ఇతి సూతవచః శ్రుత్వా రామోఽథ త్వరయాన్వితః,
ప్రయయౌ రాజభవనం పునర్ద్రష్టుం నరేశ్వరమ్. 8

ప్ర. అ. ఇతి = ఇట్లు, సూతవచః = సారథివాక్యమును, శ్రుత్వా = విని, రామః = రాముడు, అథ = పిమ్మట, త్వరయా = తొందరతో, అన్వితః = కూడినవాడై, నరేశ్వరమ్ = రాజును, పునః = మరల, ద్రష్టుమ్ = చూచుటకు, రాజభవనమ్ = రాజగృహమును గూర్చి, ప్రయయౌ వెళ్లెను.

తా. సుమంత్రుని మాటలు విన్న రాముడు వెంటనే బయలుదేరి, మరల దశరథమహారాజును చూచుటకై రాజప్రాసాదమునకు వెళ్లెను. 8

మూ. తం శ్రుత్వా సమనుప్రాప్తం రామం దశరథో నృపః,
ప్రవేశయామాస గృహం వివక్షుః ప్రియముత్తమమ్. 9

ప్ర. అ. దశరథః నృపః = దశరథమహారాజు, తమ్ = ఆ, రామమ్ = రాముని, సమనుప్రాప్తమ్ = వచ్చినవానినిగా, శ్రుత్వా = విని, ఉత్తమమ్ = ఉత్తమమైన, ప్రియమ్ = ప్రియవాక్యమును, వివక్షుః = చెప్పదలచినవాడై, గృహమ్ = గృహమును, ప్రవేశయామాస = ప్రవేశింపచేసెను.

తా. రాముడు వచ్చినట్లు విని, దశరథమహారాజు, అతని కొరకు ప్రియమైన విషయమును చెప్పుటకై గృహములోనికి రప్పించుకొనెను. 9

మూ. ప్రవిశన్నేవ చ శ్రీమాన్ రాఘవో భవనం పితుః,
దదర్శ పితరం దూరాత్ ప్రణిపత్య కృతాఞ్జలిః. 10

ప్ర. అ. శ్రీమాన్ = శోభాసంపన్నుడైన, రాఘవః = రాముడు, పితుః = తండ్రియొక్క, భవనమ్ = భవనమును, ప్రవిశన్నేవ = ప్రవేశించుచునే, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, దూరాత్ = దూరమునుండి, పితరమ్ = తండ్రిని, ప్రణిపత్య = నమస్కరించి, దదర్శ = చూచెను.

తా. అత్యధికశోభాసంపన్నుడైన రాముడు తండ్రిగారి భవనములోనికి ప్రవేశింపగనే, దూరమునుండియే దోసిలి కట్టి నమస్కరించి తండ్రిని చూచెను. 10

మూ. ప్రణమన్తం సముత్థాప్య తం పరిష్వజ్య భూమిపః,
ప్రదిశ్య చాస్మై రుచిరమాసనం పునరబ్రవీత్. 11

ప్ర. అ. భూమిపః = రాజు, ప్రణమన్తమ్ = నమస్కరించుచున్న, తమ్ = అతనిని, సముత్థాప్య = లేవదీసి, పరిష్వజ్య = కౌగలించుకొని, అస్మై = అతనికి, రుచిరమ్ = అందమైన, ఆసనమ్ = ఆసనమును, ప్రదిశ్య చ = ఇచ్చి, పునః = మరల, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథుడు నమస్కరించుచున్న ఆ రాముని లేవదీసి కౌగలించు కొనెను. పిమ్మట అతని కొరకు అందమైన ఆసనము నిచ్చి ఇట్లనెను. 11

మూ. రామ వృద్ధోఽస్మి దీర్ఘాయుర్భుక్తా భోగా మయేప్సితాః,
అన్నవద్భిః క్రతుశతైస్తథేష్టం భూరిదక్షిణైః. 12

ప్ర. అ. రామ = రామా! దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయవంతుడనైన నేను, వృద్ధః అస్మి = వృద్ధుడనైనాను. మయా = నాచేత, ఈప్సితాః = ఇష్టమైన, భోగాః = భోగములు, భుక్తాః = అనుభవింపబడినవి. అన్నవద్భిః = అన్నముకలవీ, భూరిదక్షిణైః = అధికమైన దక్షిణలు కలవీ అయిన, క్రతుశతైః = వందలకొలది క్రతువులచే, ఇష్టమ్ = దేవతారాధనము చేయబడినది.

తా. రామా! దీర్ఘాయుర్దాయవంతుడనైన నే నిపుడు వృద్ధుడనైనాను. నే నింతవరకును ఇష్టమైన భోగము అనుభవించితిని. అన్నదానము, భూరి దక్షిణలు గల వందలాది యజ్ఞములు చేసితిని. 12

మూ. జాతమిష్టమపత్యం మే త్వమద్యానుపమం భువి,
దత్తమిష్టమధీతం చ మయా పురుషసత్తమ. 13

ప్ర. అ. పురుషసత్తమ = పురుషశ్రేష్ఠుడవైన ఓ రామా! త్వమ్ = నీవు, అద్య = ఇపుడు, భువి = భూమియందు, అనుపమమ్ = సాటిలేని, ఇష్టమ్ = ప్రియమైన, అపత్యమ్ = సంతానముగా, మే = నాకు, జాతమ్ = పుట్టితివి. మయా = నాచేత, దత్తమ్ = ఇవ్వబడెను, ఇష్టమ్ = యజింపబడెను. అధీతం చ = అధ్యయనము చేయబడెను.

తా. రామా! ఇపుడు నేను నిన్ను భూలోకములో సాటిలేని సంతానముగ పొంది యున్నాను. క్షత్రియధర్మములైన అధ్యయన-యజన - దానములను చేసినాను. 13

మూ. అనుభూతాని చేష్టాని మయా వీర సుఖాన్యపి,
దేవర్షిపితృవిప్రాణామనృణోఽస్మి తథాత్మనః. 14

ప్ర. అ. వీర = ఓ వీరుడా! మయా = నా చేత, ఇష్టాని = ఇష్టము లైన, సుఖాన్యపి = సుఖములు కూడ, అనుభూతాని = అనుభవింపబడినవి. దేవర్షిపితృవిప్రాణామ్ = దేవతలకును, ఋషులకును, పితృదేవతలకును, బ్రాహ్మణులకును, తథా = మరియు, ఆత్మనః = నాకును, (నా శరీరమున కును) అనృణః = ఋణము లేనివాడను, అస్మి = అయి ఉన్నాను.

తా. రామా! నా కిష్టమైన సుఖము లన్నియు అనుభవించితిని. యజ్ఞ ములు చేయుటచే దేవతాఋణమును, స్వాధ్యాయాధ్యయనముచే ఋషిఋణమును సంతానమును కనుటచే పితృదేవతాఋణమును, దానాదులచే బ్రాహ్మణఋణమును తీర్చివేసితిని. ఈ విధముగ ఈ శరీరము ధార్చినందుకు చెల్లించవలసిన ఋణము లన్నింటిని చెల్లించితిని. 14

మూ. న కిఞ్చిన్మమ కర్తవ్యం తవాన్యత్రాభిషేచనాత్,
అతో యత్త్వామహం బ్రూయాం తన్మే త్వం కర్తుమర్హసి.

ప్ర. అ. తవ = నీయొక్క, అభిషేచనాత్ అన్యత్ర = అభిషేకము చేయుటకంటె వేరుగ, కర్తవ్యమ్ = చేయదగిన పని, కిఞ్చిత్ = ఏదియు, మమ = నాకు, న = లేదు. అతః = ఆ కారణమువలన, అహమ్ = నేను, త్వామ్ = నిన్ను గూర్చి, యత్ = ఏది, బ్రూయామ్ = చెప్పుదునో, తత్ = దానిని, త్వమ్ = నీవు, మే = నాకు, కర్తుమ్ = చేయుటకు, అర్హసి= తగియున్నావు.

తా. నీకు రాజ్యాభిషేకము చేయుట తప్ప నేను చేయవలసినది మరేమియు లేదు. అందుచే నీవు నేను చెప్పినట్లు చేయుము. 15

మూ. అద్య ప్రకృతయః సర్వాస్త్వామిచ్ఛన్తి నరాధిపమ్,
అతస్త్వాం యువరాజానమభిషేక్ష్యామి పుత్రక. 16

ప్ర. అ. అద్య = ఇపుడు, సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = ప్రజలు, త్వామ్ = నిన్ను, నరాధిపమ్ = రాజునుగా, ఇచ్ఛన్తి = కోరుచున్నారు. పుత్రక = కుమారుడా! అతః = ఆకారణమువలన, త్వామ్= నిన్ను, యువరాజానమ్ = యువరాజునుగా, అభిషేక్ష్యామి = అభిషేకింప గలను.

తా. ఇపుడు నీవు రాజు కావలె నని ప్రజ లందరును కోరుచున్నారు. అందుచే నిన్ను యౌవరాజ్యాభిషిక్తుని చేసెదను. 16

మూ. అపి చాద్యాశుభాన్ రామ స్వప్నే పశ్యామి దారుణాన్,
సనిర్ఘాతా దివోల్కా చ పతతీహ మహాస్వనా. 17

ప్ర. అ. రామ = రామా! అపి చ = మరియు, అద్య = ఇపుడు, స్వప్నే = స్వప్నమునందు, దారుణాన్ = భయంకరము లైన, అశుభాన్ = అశుభములను, పశ్యామి = చూచుచున్నాను. దివా = పగటియందు. సనిర్ఘాతా = పిడుగుతో కూడినదియు, మహాస్వనా = గొప్పధ్వని గలది, ఉల్కా = ఉల్క (పొగ, మంట లేని కొరవి), ఇహ = ఇచట, పతతి = పడుచున్నది.

తా. రామా! ప్రజలు కోరుటయే కాదు; నేను దివసములలో భయంకరము లైన, అమంగళకరములైన స్వప్నములు చూచుచున్నాను. పిడుగులతో కూడి, గొప్పధ్వనితో ఉల్కలు, పగటియందే పడుచున్నవి.

వి. 'దివోల్కా' అనుచోట 'దివః ఉల్కా' అని గ్రహించి, సంధి ఆర్షమని చెప్పి, కొందరు వ్యాఖ్యాతలు 'దివః = ఆకాశమునుండి' అని వ్యాఖ్యానించినారు. ఉల్కలు పగటియందు కూడా పడవచ్చునని బృహత్సంహితాదుల వల్ల తెలియుచున్నది గాన "దివా ఉల్కా" అనియే గ్రహింపవచ్చును. 17

మూ. అవష్టబ్ధం చ మే రామ నక్షత్రం దారుణైర్గ్రహైః,
ఆవేదయన్తి దైవజ్ఞాః సూర్యాఙ్గారకరాహుభిః. 18

ప్ర. అ. రామ = రామా! సూర్యాఙ్గారకరాహుభిః = సూర్యుడు, కుజుడు, రాహువు, అను, దారుణైః = క్రూరములైన, గ్రహైః = గ్రహములచే, మే = నాయొక్క, నక్షత్రమ్ = నక్షత్రమును, అవష్టబ్ధమ్ = ఆక్రమించబడిన దానినిగా, దైవజ్ఞాః = జ్యోతిషికులు, ఆవేదయన్తి = తెలుపుచున్నారు.

తా. రామా! క్రూరగ్రహములైన రవి-కుజ-రాహువులు నా జన్మనక్షత్రము నాక్రమించి యున్నట్లు దైవజ్ఞులు చెప్పుచున్నారు. 18

మూ. ప్రాయేణ హి నిమిత్తానామీదృశానాం సముద్భవే,
రాజా హి మృత్యుమాప్నోతి ఘోరం వాపదమృచ్ఛతి. 19

ప్ర. అ. ఉత్పన్నానామ్ = ఇట్టి, నిమిత్తానామ్ = శకునములయొక్క, సముత్పత్తే = పుట్టుక కలిగి నపుడు, ప్రాయేణ హి = సాధారణముగా, రాజా =రాజా, మృత్యుమ్ = మృత్యువును, ఆప్నోతి = పొందును; ఘోరమ్ = భయంకరమైన, ఆపదం వా = ఆపద నైనను, ఋచ్ఛతి = పొందును.

తా. ఇట్టి అపశకునములు కనబడి నపుడు, సాధారణముగ, రాజునకు మృత్యువైన వచ్చును, లేదా అతనికి ఘోరమైన ఆపద సంభవించును. 19

మూ. తద్యావదేవ మే చేతో న విముఞ్చతి రాఘవ,
తావదేవాభిషిఞ్చస్వ చలా హి ప్రాణినాం మతిః. 20

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, రాఘవ = రామా! మే = నా యొక్క, చేతః = చిత్తము, యావదేవ = ఎంతలో, న విముఞ్చతి = విడువదో (మార్పు చెందదో), తావదేవ = అంతలోనే, అభిషిఞ్చస్వ = అభిషేకము చేయించుకొనుము. ప్రాణినామ్ = ప్రాణులయొక్క, మతిః = బుద్ధి, చలా హి = చంచలమైనది కదా.

తా. రామా! నా మనస్సులో మరి యొక ఆలోచన కలుగుటకు పూర్వమే అభిషిక్తుడ వగుము. మానవుల మనస్సు చంచలమైనది కదా। 20

మూ. అద్య చన్ద్రోఽభ్యుపగతః పుష్యాత్పూర్వం పునర్వసూ,
శ్వః పుష్యయోగం నియతం వక్ష్యన్తే దైవచిన్తకాః. 21

ప్ర. అ. అద్య = నేడు, చన్ద్రః = చంద్రుడు, పుష్యాత్ = పుష్యమీ నక్షత్రము కంటె, పూర్వమ్ = పూర్వమునందున్న, పునర్వసూ = పునర్వసు నక్షత్రమును, అభ్యుపగతః = పొందినాడు. శ్వః = రేపు, పుష్యయోగమ్ = చంద్రునకు పుష్యమీనక్షత్రయోగమును, నియతమ్ = పట్టాభిషేకము నిమిత్తము నిశ్చిత మైనదానినిగా, దైవచిన్తకాః = జ్యోతిషికులు, వక్ష్యన్తే = చెప్పగలరు (చెప్పుచున్నారు).

తా. నేడు చంద్రుడు పుష్యమీనక్షత్రమునకు వెనుక నున్న పునర్వసు నక్షత్రముతో సంబంధించి యున్నాడు. రేపు చంద్రుడు పుష్యమీనక్షత్రముతో కలిసినపుడు పట్టాభిషేకము చేయ నిశ్చయించిన సమయమని దైవజ్ఞులు చెప్పు చున్నారు. 21

మూ. తతః పుష్యేఽభిషిచ్యస్వ మనస్త్వరయతీవ మామ్.
శ్వస్త్వాహమభిషేక్ష్యామి యౌవరాజ్యే పరంతప. 22

ప్ర. అ. తతః = ఆ కారణమువలన, పుష్యే = పుష్యమీనక్షత్రమునందు, అభిషిచ్యస్వ = అభిషిక్తుడవగుము. మనః = నా మనస్సు, మామ్ = నన్ను, త్వరయతీవ = తొందరపెట్టుచున్నట్లున్నది. పరంతప = శత్రువులను పీడించువాడా! అహమ్ = నేను, శ్వః = రేపు, త్వా = నిన్ను, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేక్ష్యామి = అభిషేకించెదను.

తా. అందువలన నీవు పుష్యమీనక్షత్రమునందు అభిషిక్తుడవగుము. నా మనస్సు నన్ను తొందరపెట్టుచున్నది. ఓ శత్రుసంహారకుడా! నిన్ను రేపు యౌవరాజ్యాభిషిక్తుని చేసెదను. 22

మూ. తస్మాత్త్వయాద్యప్రభృతి నిశేయం నియతాత్మనా,
సహ వధ్వోపవస్తవ్యా దర్భప్రస్తరశాయినా. 23

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, అద్యప్రభృతి = ఇది మొదలు, ఇయమ్ = ఈ, నిశా = రాత్రి, నియతాత్మనా = నిగ్రహించుకొనబడిన మనస్సుగల, దర్భప్రస్తరశాయినా = దర్భాసనముపై శయనించిన, త్వయా = నీచేత, వధ్వా సహ = కోడలైన సీతతో కూడ, ఉపవస్తవ్యా = ఉపవసింపదగినది.

తా. అందుచే, భార్యాసమేతుడవైన నీవు ఆత్మనిగ్రహవంతుడవై, ఇది మొదలు రాత్రి అంతయు, దర్భాసనముపై శయనించి ఉపవాసము చేయవలెను. 23

మూ. సుహృదశ్చాప్రమత్తాస్త్వాం రక్షన్త్వద్య సమన్తతః,
భవన్తి బహువిఘ్నాని కార్యాణ్యేవంవిధాని హి. 24

ప్ర. అ. అద్య = ఈనాడు, సుహృదశ్చ = నీ స్నేహితులు కూడ, సమన్తతః = నలువైపుల, అప్రమత్తాః = ఏమరుపాటు లేనివారై, త్వామ్ = నిన్ను, రక్షన్తు = రక్షించుదురుగాక, ఏవంవిధాని = ఈ విధమైన, కార్యాణి =

కార్యములు, ప్రాయేణ = సాధారణముగ, బహువిఘ్నాని = అనేక విఘ్నములు
కలవి, భవన్తి హి = అగును కదా.

తా. అన్ని కార్యములందు సాధారణముగ అనేక విఘ్నములు కలుగుచుండును. అందుచే నీ మిత్రులందరును అప్రమత్తులై అన్ని విధముల నిన్ను రక్షింపవలెను. 24

మూ. విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః,
తావదేవాభిషేకస్తే ప్రాప్తకాలో మతో మమ. 25

ప్ర. అ. భరతః = భరతుడు, ఇతః = ఈ, పురాత్ = నగరమునుండి, యావదేవ = ఎంతవరకు, విప్రోషితః = దూరముగా నుందునో, తావదేవ = అంతలోనే, తే = నీయొక్క, అభిషేకః = అభిషేకము, ప్రాప్తకాలః = యుక్తమైనదిగా, మే = నాకు, మతః = ఇష్టమైనది.

తా. భరతుడు ఈ నగరమునుండి దూరమున నుండగానే నీకు అభిషేకము జరుగవలె నని నా అభిప్రాయము. 25

మూ. కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః,
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేన్ద్రియః. 26

ప్ర. అ. తే = నీయొక్క, భ్రాతా = సోదరు డైన, భరతః = భరతుడు, కామమ్ = మిక్కిలి, సతాం వృత్తే = సత్పురుషుల మార్గమునందు, స్థితః = ఉన్నాడు. జ్యేష్ఠానువర్తీ = జ్యేష్ఠసోదరుని అనుసరించియే ఉండువాడు. ధర్మాత్మా = ధర్మాత్ముడు. సానుక్రోశః = జాలికలవాడు. జితేన్ద్రియః = జయింపబడిన ఇంద్రియములు కలవాడు.

తా. నీ సోదరు డైన భరతుడు అన్నగారిని అనుసరించియే ఉండువాడు. ధర్మబుద్ధి గలవాడు; దయాశీలుడు; ఇంద్రియనిగ్రహము గలవాడు; సత్పురుషుల మార్గమున చరించువాడు; ఇదంతయు వాస్తవమే. 26

మూ. కిన్తు చిత్తం మనుష్యాణామనిత్యమితి మే మతిః,
సతాం చ ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ. 27

ప్ర. అ. కిన్తు = కాని, ధర్మనిత్యానామ్ = ధర్మమునందు స్థిరులైన, సతాం చ = సత్పురుషులైన, మనుష్యాణామ్ = మనుష్యులయొక్క, కృతశోభి = చేయబడిన శోభగల, చిత్తమ్ = చిత్తము కూడా, అనిత్యమ్ ఇతి = చంచలమైనది అని, మే = నాయొక్క, మతిః = అభిప్రాయము.

తా. కాని, ధర్మనిరతులై, సన్మార్గమున వర్తించు మనుష్యుల శోభాయుక్తమైన చిత్తము కూడ చంచలము కావచ్చునని నా అభిప్రాయము. 27

మూ. ఇత్యుక్తః సోఽభ్యనుజ్ఞాతః శ్వోభావిన్యభిషేచనే,
వ్రజేతి రామః పితరమభివాద్యాభ్యయాద్గృహమ్. 28

ప్ర. అ. శ్వః = రేపు, భావిని = కానున్న, అభిషేచనే = అభిషేకము విషయమున, ఇతి = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, సః = ఆ, రామః = రాముడు, వ్రజ ఇతి = వెళ్లుము అని, అభ్యనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడినవాడై, పితరమ్ = తండ్రిని, అభివాద్య = నమస్కరించి, గృహమ్ = గృహమును గూర్చి, అభ్యయాత్ = వెళ్లెను.

తా. దశరథుడు రేపు జరుగనున్న అభిషేకమును గూర్చి ఈ విధముగ చెప్పి 'నీవు వెళ్లుము' అని అనుజ్ఞ నీయగా రాముడు తండ్రికి నమస్కరించి తన భవనమునకు వెళ్లెను. 28

మూ. ప్రవిశ్య చాత్మనో వేశ్మ రాజ్ఞోద్దిష్టేఽభిషేచనే,
తత్క్షణేన చ నిర్గమ్య మాతురన్తఃపురం యయౌ. 29

ప్ర. అ. రాజ్ఞా = రాజుచేత, అభిషేచనే = అభిషేకము, ఉద్దిష్టే = నిర్దేశింపబడిన దగుచుండగా, ఆత్మనః = తనయొక్క, వేశ్మ = గృహమును, ప్రవిశ్య = ప్రవేశించి, తత్క్షణేన = ఆ క్షణమునందే, నిర్గమ్య = బయలువెడలి, మాతుః = తల్లియొక్క, అన్తఃపురమ్ = అంతఃపురమును గూర్చి, యయౌ = వెళ్లెను.

తా. ఈ విధముగ దశరథమహారాజు అభిషేకమునుగూర్చి చేసిన నిర్ణయమును విని రాముడు, తన గృహమునకు వెళ్లి, వెంటనే బయలుదేరి తన తల్లి అంతఃపురమునకు వెళ్లెను. 29

మూ. తత్ర తాం ప్రవణామేవ మాతరం క్షౌమవాసినీమ్,
వాగ్యతాం దేవతాగారే దదర్శాయాచతీం శ్రియమ్. 30

ప్ర. అ. తత్ర = అచట, దేవతాగారే = దేవతాగృహమునందు, ప్రవణామేవ = దేవతాపూజాసక్తురాలుగానే ఉన్నదీ, క్షౌమవాసినీమ్ = పట్టువస్త్రములను ధరించియున్నదీ, వాగ్యతామ్ = మౌనవ్రతము నవలంబించినదీ, శ్రియమ్ = లక్ష్మీదేవిని, ఆయాచతీమ్ = ప్రార్థించుచున్నదీ అయిన, తామ్ = ఆ, మాతరమ్ = తల్లిని, దదర్శ = చూచెను.

తా. అంతఃపురములో కౌసల్య దేవతాగృహమునందు పట్టువస్త్రములు ధరించి, ధ్యానాసక్తయై, మౌనము వహించి లక్ష్మీదేవిని ప్రార్థించుచుండగా రాముడామెను చూచెను. 30

మూ. ప్రాగేవ చాగతా తత్ర సుమిత్రా లక్ష్మణస్తదా,
సీతా చానాయితా శ్రుత్వా ప్రియం రామాభిషేచనమ్. 31

ప్ర. అ. ప్రియమ్ = ప్రియమైన, రామాభిషేచనమ్ = రాముని అభిషేకమును, శ్రుత్వా = విని, ప్రాగేవ = (రామునికంటె) ముందుగనే, తదా = అపుడు, సుమిత్రా = సుమిత్ర, ఆగతా = వచ్చినది. లక్ష్మణః = లక్ష్మణుడు (వచ్చినాడు). సీతా చ = సీతకూడ, ఆనాయితా = రప్పింపబడినది.

తా. ప్రియమైన రామాభిషేకవార్త విని, అంతకు ముందుగనే, సుమిత్రయు లక్ష్మణుడును అచటకు వచ్చియుండిరి. సీతను కూడ రప్పించిరి. 31

మూ. తస్మిన్ కాలే హి కౌసల్యా తస్థావామీలితేక్షణా,
సుమిత్రయాన్వాస్యమానా సీతయా లక్ష్మణేన చ. 32

ప్ర. అ. తస్మిన్ = ఆ, కాలే = సమయమునందు, కౌసల్యా = కౌసల్య, సుమిత్రయా = సుమిత్రచేతను, సీతయా = సీతచేతను, లక్ష్మణేన చ = లక్ష్మణుని చేతను, అన్వాస్యమానా = దగ్గర కూర్చుండి సేవింపబడుచున్నదై, ఆమీలితేక్షణా = మూయబడిన నేత్రములు కలదై, తస్థౌ = ఉండెను.

తా. ఆ సమయమున కౌసల్య కండ్లు మూసుకొని ధ్యానమగ్న యై యుండెను. సుమిత్రయు, లక్ష్మణుడును, సీతయు సమీపముననే ఆమెతో పాటు కూర్చుండియుండిరి. 32

మూ. శ్రుత్వా పుష్యేణ పుత్రస్య యౌవరాజ్యాభిషేచనమ్,
ప్రాణాయామేన పురుషం ధ్యాయమానా జనార్దనమ్. 33

ప్ర. పుష్యేణ = పుష్యనక్షత్రమునందు, పుత్రస్య = కుమారునియొక్క, యౌవరాజ్యాభిషేచనమ్ = యౌవరాజ్యాభిషేకమును, శ్రుత్వా = విని, ప్రాణాయామేన = ప్రాణాయామముతో, పురుషమ్ = ఉత్తమపురుషుడైన, జనార్దనమ్ = విష్ణువును, ధ్యాయమానా = ధ్యానము చేయుచు ఉండెను.

తా. పుష్యనక్షత్రమున పుత్రునకు యౌవరాజ్యాభిషేకము జరుగు నని విని, కౌసల్య ప్రాణాయామము చేసి పురుషోత్తము డైన శ్రీమహావిష్ణువును ధ్యానించుచు కూర్చుండెను. 33

మూ. తథా సనియమామేవ సోఽభిగమ్యాభివాద్య చ,
ఉవాచ వచనం రామో హర్షయంస్తామిదం తదా. 34

ప్ర. అ. సః = ఆ, రామః = రాముడు, తథా = ఆ విధముగ, సనియమామేవ = నియమములతోకూడిన తల్లిని, అభిగమ్య = సమీపించి, అభివాద్య చ = నమస్కారము చేసి, తదా = అప్పుడు, తామ్ = ఆమెను, హర్షయన్ = సంతోషింపచేయుచు, ఇదమ్ = ఈ, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. ఆ విధముగ నియమము వహించియున్న తల్లిని సమీపించి, నమస్కరించి, రాముడు ఆమె కానందము కలిగించుచు ఇట్లు పలికెను. 34

మూ. అమ్బ పిత్రా నియుక్తోఽస్మి ప్రజాపాలనకర్మణి,
భవితా శ్వోఽభిషేకో మే యథా మే శాసనం పితుః. 35

ప్ర. అ. అమ్బ = తల్లీ, పిత్రా = తండ్రిచే, ప్రజాపాలనకర్మణి = ప్రజాపాలన మను పనియందు, నియుక్తః అస్మి = నియమింపబడితిని. మే = నా యొక్క, పితుః = తండ్రియొక్క, శాసనమ్ = ఆజ్ఞ, యథా = ఎట్లో, దాని

ప్రకారము, శ్వః=రేపు, మే=నాయొక్క, అభిషేకః=అభిషేకము, భవితా =కాగలదు.

తా. అమ్మా! తండ్రిగారు నన్ను ప్రజాపాలనము చేయుమని నియమించినారు. వారి ఆజ్ఞప్రకారము నాకు రేపు రాజ్యాభిషేకము కాగలదు. 35

మూ. సీతయాప్యుపవస్తవ్యా రజనీయం మయా సహ,
ఏవమృత్విగుపాధ్యాయైస్సహ మాముక్తవాన్ పితా. 36

ప్ర. అ. ఇయమ్=ఈ, రజనీ=రాత్రి, సీతయాపి=సీతచేత కూడ, మయా సహ=నాతో కూడ, ఉపవస్తవ్యా=ఉపవాస ముండవగినది. ఏవమ్=ఇట్లు, ఋత్విగుపాధ్యాయైః సహ=ఋత్విక్కులతోడను ఉపాధ్యాయులతోడను కూడియున్న, పితా=తండ్రి, మామ్=నన్ను గూర్చి, ఉక్తవాన్=పలికినారు.

తా. సీత కూడా నాతో పాటు ఈ రాత్రియంతయు ఉపవాస ముండవలెను అని ఋత్విగుపాధ్యాయులును, తండ్రిగారును చెప్పినారు 36

మూ. యాని యాన్యత్ర యోగ్యాని శ్వో భావీన్యభిషేచనే,
తాని మే మఙ్గళాన్యద్య వైదేహ్యాశ్చైవ కారయ. 37

ప్ర. అ. శ్వః=రేపు, భావీని=కానున్న, అభిషేచనే=అభిషేకమునందు, యాని యాని=ఏ యే, మఙ్గళాని=మంగళములు, యోగ్యాని=తగినవో, తాని=వాటిని, అద్య=ఈనాడు, మే=నాకును, వైదేహ్యాః చైవ=సీతకును, కారయ=చేయించుము.

తా. రేపు జరగనున్న అభిషేకమునకు తగిన మంగళకృత్యము లన్నియు నాకును, సీతకును ఇపుడు చేయించుము. 37

మూ. ఏతచ్ఛ్రుత్వా తు కౌసల్యా చిరకాలాభికాఙ్క్షితమ్,
హర్షబాష్పకలం వాక్యమిదం రామ మభాషత. 38

ప్ర. అ. కౌసల్యా తు=కౌసల్య, చిరకాలాభికాఙ్క్షితమ్=చిరకాలమునుండి కోరబడిన, ఏతత్=ఈపట్టాభిషేకవార్తను, శ్రుత్వా=విని, హర్షబాష్పకలమ్=

ఆనందాశ్రువులతో మధుర మైన, ఇదమ్=ఈ, వాక్యమ్=వాక్యమును, రామమ్= రాముని గూర్చి, అభాషత=పలికెను.

తా. కౌసల్య చిరకాలమునుండియు కోరబడు చున్న అభిషేకవార్త విని, ఆనందబాష్పములను కార్చుచు, రామునితో మధురమైన వాక్యము పలికెను. 38

మూ. వత్స రామ చిరం జీవ హతాస్తే పరిపన్థినః,
జ్ఞాతీన్మే త్వం శ్రియాయుక్తః సుమిత్రాయాశ్చ నన్దయ. 39

ప్ర. అ. వత్స=చిన్ని పిల్లవాడా! రామ=రామా, చిరం = చిర కాలము, జీవ=జీవింపుము. తే=నీయొక్క, పరిపన్థినః=శత్రువులు, హతాః =నశించినారు. త్వమ్=నీవు, శ్రియా=ఐశ్వర్యముతో, యుక్తః=కూడినవాడ వై, మే=నా యొక్క, జ్ఞాతీన్ = జ్ఞాతులను, సుమిత్రాయాః చ =సుమిత్రయొక్క జ్ఞాతులను, నన్దయ = ఆనందింపజేయుము.

తా. నాయనా! రామా! చిరకాలము జీవింపుము. నీ శత్రువులు నశింతురు గాక. ఐశ్వర్యముతో కూడినవాడవై నా జ్ఞాతులను, సుమిత్రజ్ఞాతులను ఆనందింప జేయుము. 39

మూ. కల్యాణే బత నక్షత్రే మయి జాతోఽసి పుత్రక,
యేన త్వయా దశరథో గుణైరారాధితః పితా. 40

ప్ర. అ. పుత్రక=నా చిన్నికుమారుడా! యేన=ఏ, త్వయా = నీ చేత, పితా=తండ్రియైన, దశరథః=దశరథమహారాజు, గుణైః=సద్గుణముల చేత, ఆరాధితః = సంతోషపెట్టబడినాడో, అట్టి నీవు, కల్యాణే = కల్యాణకర మైన, నక్షత్రే=నక్షత్రమునందు, మయి = నాయందు, జాతః అసి=పుట్టితివి. బత = ఎంత ఆనందము.

తా. నా చిన్నికుమారా! నీవు నా కుమారుడవుగా పుట్టిన నక్షత్రము చాల మంగళకర మైనది. కావుననే సద్గుణములచేత తండ్రి యైన దశరథ మహారాజును ఆనందింపచేసితివి. 40

మూ. అమోఘం బత మే క్షాన్తం పురుషే పుష్కరేక్షణే,
యేయమిక్ష్వాకురాజ్యశ్రీః పుత్ర త్వాం సంశ్రయిష్యతి. 41

ప్ర. అ. పుష్కరేక్షణే = పుండరీకాక్షు డైన, పురుషే = శ్రీమహావిష్ణువు విషయమున, మే = నాయొక్క, క్షాన్తమ్ = వ్రతోపవాసాదిక్లేశ సహనము, అమోఘమ్ = వ్యర్థముకానిది. బత = ఎంత ఆనందము. పుత్ర = కుమారా! యా = ఏ, ఇయమ్ = ఈ, ఇక్ష్వాకురాజ్యశ్రీః = ఇక్ష్వాకురాజ్యలక్ష్మి యున్నదో అది, త్వామ్ = నిన్ను, సంశ్రయిష్యతి = ఆశ్రయించగలదు.

తా. కుమారా! పుండరీకాక్షు డైన శ్రీమహావిష్ణు నారాధించుచు నేను చేసిన వ్రతోపవాసాదిక్లేశము సఫలం మైనది. కావుననే ఈ ఇక్ష్వాకువంశీయుల రాజ్యలక్ష్మి నిన్నాశ్రయింప నున్నది. 41

మూ. ఇత్యేవముక్తో మాత్రేదం రామో భ్రాతరమబ్రవీత్,
ప్రాఞ్జలిం ప్రహ్వమాసీనమభివీక్ష్య స్మయన్నివ. 42

ప్ర. అ. మాత్రా = తల్లిచేత, ఇత్యేవమ్ = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, రామః = రాముడు, ప్రహ్వమ్ = నమ్రుడూ, ప్రాఞ్జలిమ్ = కట్టబడిన దోసిలి కలవాడూ అయిన, ఆసీనమ్ = కూర్చొనియున్న, భ్రాతరమ్ = సోదరుడైన లక్ష్మణుని, అభివీక్ష్య = చూచి; స్మయన్నివ = నవ్వుచున్నవాడు వలె (చిరునవ్వు నవ్వుచు), ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు, ఈ విధముగ పలికిన తల్లి మాటలు విని, తన ప్రక్కనే అంజలి ఘటించి నమ్రుడై కూర్చొని యున్న లక్ష్మణుని చూచి, చిరునవ్వుతో ఇట్లనెను. 42

మూ. లక్ష్మణేమాం మయా సార్థం ప్రశాధి త్వం వసుంధరామ్,
ద్వితీయం మేఽన్తరాత్మానం త్వామియం శ్రీరుపస్థితా. 43

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా, మయా సార్థమ్ = నాతో కలిసినవాడవై, త్వమ్ = నీవు, ఇమామ్ = ఈ, వసుంధరామ్ = భూమిని, ప్రశాధి = పాలింపుము. మే = నాయొక్క, ద్వితీయమ్ = రెండవ, అన్తరాత్మానమ్ = అంతరాత్మవైన, త్వామ్ = నిన్ను, ఇయమ్ = ఈ, శ్రీః = లక్ష్మి, ఉపస్థితా = చేరినది.

తా. లక్ష్మణా! నాతో నీవు ఈ భూమిని పాలింపుము. నీవు నా రెండవ ప్రాణము. అట్టి నిన్ను కూడ ఈ రాజ్యలక్ష్మి వరించినది. 43

మూ. సౌమిత్రే భుఙ్క్ష్వ భోగాం స్త్వమిష్టాన్ రాజ్యఫలాని చ,
జీవితం చ హి రాజ్యం చ త్వదర్థమభికామయే. 44

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా! త్వమ్=నీవు, ఇష్టాన్ = ఇష్టములైన, భోగాన్=భోగములను, రాజ్యఫలాని చ=రాజ్యఫలములను, భుఙ్క్ష్వ = అనుభవింపుము. జీవితం చ = జీవితమును, రాజ్యం చ=రాజ్యమును కూడ, త్వదర్థమ్ = నీకొరకు మాత్రమే, అభికామయే హి = కోరుచున్నాను గదా.

తా. లక్ష్మణా! నీ కిష్టమైన భోగములను, ఇతర రాజ్యఫలములను గూడ అనుభవింపుము. నే నీ జీవితమును గాని, రాజ్యమును గాని కోరుకొనుట నీకొరకు మాత్రమే. 44

మూ. ఇత్యుక్త్వా లక్ష్మణం రామో మాతరావభివాద్య చ,
అభ్యనుజ్ఞాప్య సీతాం చ జగామ స్వం నివేశనమ్. 45

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే

చతుర్థః సర్గః.

ప్ర. అ. రామః=రాముడు, లక్ష్మణమ్= లక్ష్మణుని గూర్చి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, మాతరౌ = తల్లుల నిద్దరిని, అభివాద్య చ = నమస్కరించి, సీతాం చ = సీతను కూడ, అభ్యనుజ్ఞాప్య=అనుజ్ఞ పొందింపజేసి, స్వమ్ = తనసంబంధమైన, నివేశనమ్ = గృహమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. రాముడు లక్ష్మణునితో ఇట్లు పలికి, ఇరువురు తల్లులకును నమస్కరించి, సీతకు కూడ వారి అనుమతి ఇప్పించి, సీతాసమేతుడై తన గృహమునకు వెళ్లెను. 45

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమున
అయోధ్యాకాండలో చతుర్థసర్గ సమాప్తము.

## అథ పఞ్చమః సర్గః

*[దశరథ వచనానుసారము వసిష్ఠుడు సీతారాములకు ఉపవాస దీక్ష నిచ్చి, మరలివచ్చి రాజునకు తెలుపుట, రాజు అంతఃపురము ప్రవేశించుట.]*

మూ. సన్దిశ్య రామం నృపతిః శ్వోభావిన్యభిషేచనే,
పురోహితం సమాహూయ వసిష్ఠమిదమబ్రవీత్. 1

ప్ర. అ. నృపతిః = రాజు, రామమ్ = రాముని, సన్దిశ్య = పంపివేసి, పురోహితమ్ = పురోహితుడు వైన, వసిష్ఠమ్ = వసిష్ఠుని, సమాహూయ = పిలచి, శ్వః = రేపు, భావిని = కానున్న, అభిషేచనే = అభిషేకము విషయమున, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథమహారాజు రాముని పంపివేసిన తరువాత పురోహితు డైన వసిష్ఠుని పిలిపించి, మరునాడు జరుగ నున్న అభిషేకము విషయమున ఇట్లు పలికెను. 1

మూ. గచ్ఛోపవాసం కాకుత్స్థం కారయాద్య తపోధన,
శ్రీయశోరాజ్యలాభాయ వధ్వా సహ యతవ్రతమ్. 2

ప్ర. అ. తపోధన = ఓ మహర్షీ! గచ్ఛ = వెళ్లుము. అద్య = ఈనాడు, యతవ్రతమ్ = నిశ్చితమైన వ్రతముగల, కాకుత్స్థమ్ = రాముని, శ్రీయశోరాజ్య లాభాయ = లక్ష్మీకీర్తిరాజ్యముల లాభము కొరకు, వధ్వా సహ = కోడలైన సీతతో కూడ, ఉపవాసమ్ = ఉపవాసమును, కారయ = చేయించుము.

తా. ఓ వసిష్ఠమహామునీ! నీవు వెళ్లి, వ్రతము నవలంబించిన రాముని చేత ను, సీతచేతను ఈనాడు లక్ష్మి, కీర్తి, రాజ్యము లభించుటకై ఉపవాసము చేయించుము. 2

మూ. తథేతి చ స రాజానముక్త్వా వేదవిదాం వరః,
స్వయం వసిష్ఠో భగవాన్ యయౌ రామనివేశనమ్. 3

మూ. ఉపవాసయితుం రామం మన్త్రవన్మన్త్రకోవిదః,
బ్రాహ్మం రథవరం యుక్తమాస్థాయ సుదృఢవ్రతః. 4

ప్ర. అ. వేదవిదామ్ = వేదవేత్తలలో, వరః = శ్రేష్ఠుడూ, మన్త్రకోవిదః = మంత్రములనెరిగినవాడూ, సుదృఢవ్రతః = మిక్కిలి దృఢమైన వ్రతము కల వాడూ, భగవాన్ = పూజ్యుడూ అయిన, సః = ఆ, వసిష్ఠః = వసిష్ఠుడు, తథా ఇతి = అటులనే అని, రాజానమ్ = రాజును గూర్చి, ఉక్త్వా = పలికి, యుక్తమ్ = సిద్ధముచేయబడిన, బ్రాహ్మమ్ = బ్రాహ్మణయోగ్య మైన, రథవరమ్ = శ్రేష్ఠ మైన రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, రామమ్ = రాముని, మన్త్రవత్ = మంత్రపూర్వక ముగా, ఉపవాసయితుమ్ = ఉపవాసము చేయించుటకై, స్వయమ్ = స్వయముగ, రామనివేశనమ్ = రాముని గృహమును గూర్చి, యయౌ = వెళ్లెను.

తా. వేదవేత్తలలో శ్రేష్ఠుడూ, మంత్రవేత్తా, దృఢమైన తపోనియమము కలవాడూ అయిన పూజ్యుడైన వసిష్ఠుడు "అటులనే చేసెదను" అని రాజుతో పలికి, సిద్ధముగా నున్న, బ్రాహ్మణయోగ్యమైన రథము నెక్కి, రామునిచే మంత్రపూర్వకముగ ఉపవాసదీక్ష చేయించుటకై స్వయముగ రాముని గృహము నకు వెళ్లెను. 3, 4

మూ. స రామభవనం ప్రాప్య పాణ్డురాభ్రఘనప్రభమ్,
తిస్రః కక్ష్యా రథేనైవ వివేశ మునిసత్తమః. 5

ప్ర. అ. సః = ఆ, మునిసత్తమః = మునిశ్రేష్ఠుడు, పాణ్డురాభ్రఘన ప్రభమ్ = తెల్లని మేఘము వలె దట్టమైన కాంతిగల, రామభవనమ్ = రాముని గృహమును, ప్రాప్య = పొంది, తిస్రః = మూడు, కక్ష్యాః = వాకిళ్లను, రథేనైవ = రథముచేతనే, వివేశ = ప్రవేశించెను.

తా. ఆ మహాముని తెల్లని మేఘము వలె దట్టమైన కాంతిగల రాముని భవనమును చేరి, మూడు వాకిళ్లను రథముచేతనే ప్రవేశించెను. 5

మూ. తమాగతమృషిం రామస్త్వరన్నివ ససమ్భ్రమః,
మానయిష్యన్ స మానార్హం నిశ్చక్రామ నివేశనాత్. 6

ప్ర. అ. సః = ఆ, రామః = రాముడు, మానార్హమ్ = గౌరవింపదగినవాడైన, ఆగతమ్ = వచ్చిన, తం ఋషిమ్ = ఆ ఋషీశ్వరుని, మానయిష్యన్ =

పూజింపనున్నవాడై, త్వరన్నిత = తొందరపడుచున్నవాడై, ససంభ్రమః = తొట్రుపాటుతో కూడినవాడై, నివేశనాత్ = గృహమునుండి, నిశ్చక్రామ = బయలుదేరెను.

తా. రాముడు తన యింటికి వచ్చిన, గౌరవార్హుడైన ఆ ఋషీశ్వరుని పూజించుటకై తొందరపాటుచే తొట్రుపడుచు ఇంటినుండి బైటకు వచ్చెను. 6

మూ. అభ్యేత్య త్వరమాణశ్చ రథాభ్యాశం మనీషిణః,
తతో௨వతారయామాస పరిగృహ్య రథాత్స్వయమ్. 7

ప్ర. అ. మనీషిణః = బుద్ధిమంతుడైన ఆ వసిష్ఠునియొక్క, రథాభ్యాశమ్ = రథసమీపమును, త్వరమాణః = తొందరపడుచున్నవాడై, అభ్యేత్య = పొంది, తతః = ఆ, రథాత్ = రథమునుండి, స్వయమ్ = స్వయముగ, పరిగృహ్య = పట్టుకొని, అవతారయామాస = దింపెను.

తా. రాముడు తొందరగా ఆ వసిష్ఠుని రథము దగ్గరకు వెళ్లి, స్వయముగ ఆయనను పట్టుకొని రథమునుండి క్రిందకి దింపెను. 7

మూ. స చైనం ప్రశ్రితం దృష్ట్వా సంభాష్యాభిప్రసాద్య చ,
ప్రియార్హం హర్షయన్ రామమిత్యువాచ పురోహితః. 8

ప్ర. అ. సః = ఆ, పురోహితః చ = పురోహితుడు కూడ, ప్రియార్హమ్ = ప్రియవచనములు పలుకుటకు తగిన, ప్రశ్రితమ్ = వినయవంతుడైన, ఏనమ్ = ఈ, రామమ్ = రాముని, దృష్ట్వా = చూచి, సంభాష్య = పలకరించి, అభిప్రసాద్య చ = ప్రసన్నుని చేసికొని, హర్షయన్ = సంతసింపచేయుచు, ఇతి = ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. పురోహితుడైన ఆ వసిష్ఠుడు కూడ, వినయవంతుడూ, ప్రియవచనములకు తగినవాడూ అయిన ఆ రాముని కుశలప్రశ్నలచే ప్రసన్నుని చేసికొని, అతనిని ఆనందింపజేయుచు ఇట్లు పలికెను. 8

మూ. ప్రసన్నస్తే పితా రామ యౌవరాజ్యమవాప్స్యసి,
ఉపవాసం భవానద్య కరోతు సహ సీతయా. 9.

ప్ర. అ. రామ = రామా! తే = నీ విషయమున, పితా = నీ తండ్రి, ప్రసన్నః = ప్రసన్నుడైనాడు. యౌవరాజ్యమ్ = యౌవరాజ్యమును, అవాప్స్యసి = పొందగలవు. భవాన్ = నీవు, అద్య = నేడు, సహ సీతయా = సీతతో కూడ, ఉపవాసం కరోతు = ఉపవాసము చేయుదువుగాక.

తా. "రామా! నీ తండ్రి నీ విషయమున ప్రసన్నుడైనాడు. రేపు యౌవరాజ్యాభిషేకమును పొందగలవు. అందుచే నీవును, సీతయు ఈనాడు ఉపవాసము చేయవలెను." 9

మూ. ప్రాతస్త్వామభిషేక్తా హి యౌవరాజ్యే నరాధిపః,
పితా దశరథః ప్రీత్యా యయాతిం నహుషో యథా. 10

ప్ర. అ. నరాధిపః రాజైన, పితా = నీ తండ్రి యైన, దశరథః = దశరథుడు, ప్రాతః = రేపు ప్రాతఃకాలమున, త్వామ్ = నిన్ను, నహుషః = నహుషచక్రవర్తి, యయాతిం యథా = యయాతిని వలె, ప్రీత్యా = ప్రేమతో, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేక్తా హి = అభిషేకింపనున్నాడు కదా.

తా. "నీ తండ్రియైన దశరథమహారాజు, నహుషుడు యయాతిని వలె, నిన్ను ప్రేమపూర్వకముగ రేపు ప్రాతఃకాలముననే యౌవరాజ్యమునందు అభిషేకింపనున్నాడు". 10

మూ. ఇత్యుక్త్వా స తదా రామ ముపవాసం యతవ్రతమ్,
మన్త్రవత్ కారయామాస వైదేహ్యా సహితం మునిః. 11

ప్ర. అ. సః = ఆ, మునిః = ముని, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, యతవ్రతమ్ = నియమిత మైన వ్రతముగల, వైదేహ్యా సహితమ్ = సీతాసమేతు డైన, రామమ్ = రాముని, తదా = అప్పుడు, మన్త్రవత్ = మంత్రపూర్వకముగా, ఉపవాసమ్ = ఉపవాసమును, కారయామాస = చేయించెను.

తా. వసిష్ఠుడు రామునితో ఇట్లు పలికి, వైదేహీసహితుడైన అతనిచే అప్పుడు మంత్రపూర్వకముగ ఉపవాసము చేయించెను. 11

మూ. తతో యథావద్రామేణ స రాజ్ఞో గురురర్చితః,
అభ్యనుజ్ఞాప్య కాకుత్స్థం యయౌ రామనివేశనాత్. 12

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజ్ఞః=రాజుయొక్క, గురుః = గురువైన, సః = ఆ వసిష్ఠుడు, రామేణ = రామునిచేత, యథావత్=యథాశాస్త్రముగ, అర్చితః=పూజింపబడినవాడై, కాకుత్స్థమ్ = రాముని, అభ్యనుజ్ఞాప్య = అనుజ్ఞ ఇచ్చునట్లు చేసి, రామనివేశనాత్ = రాముని గృహమునుండి, యయౌ = వెళ్లెను.

తా. పిమ్మట రాముడు రాజగురువైన ఆ వసిష్ఠుని యథోచితరీతిని పూజించెను. వసిష్ఠుడు కూడ రాముని అనుజ్ఞ పొంది అతని గృహమునుండి వెళ్లిపోయెను. 12

మూ. సుహృద్భిస్తత్ర రామోఽపి సహాసీనః ప్రియంవదైః,
సభాజితో వివేశాథ తాననుజ్ఞాప్య సర్వశః. 13

ప్ర. అ. రామోఽపి = రాముడు కూడ, ప్రియంవదైః = ప్రియముగ మాటలాడు, సుహృద్భిః సహ = మిత్రులతో, తత్ర = అచట, ఆసీనః=కూర్చున్నవాడై, అథ=పిమ్మట, సభాజితః = గౌరవింపబడినవాడై, సర్వశః=అన్ని విధముల, తాన్ = వారిని, అనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చునట్లు చేసి, వివేశ = (అంతఃపురమును) ప్రవేశించెను.

తా. రాముడు కొంత సమయము ప్రియసంభాషణము చేయు మిత్రులతో గడపి, వారిచే గౌరవింపబడినవాడై, సర్వవిధముల వారి అనుజ్ఞ పొంది అంతఃపురములోనికి వెళ్లెను. 13

మూ. హృష్టనారీనరయుతం రామవేశ్మ తదా బభౌ,
యథా మత్తద్విజగణం ప్రఫుల్లనలినం సరః. 14

ప్ర. అ. తదా=అప్పుడు, హృష్టనారీనరయుతమ్ = సంతసించిన స్త్రీ పురుషులతో గూడిన, రామవేశ్మ = రాముని గృహము, మత్తద్విజగణమ్ = మదించిన పక్షిసముదాయము గల, ప్రఫుల్లనలినమ్ = వికసించిన పద్మములు గల, సరః యథా = సరస్సువలె, బభౌ = ప్రకాశించెను.

తా. అపుడు రాముని భవనము సంతోషించిన స్త్రీపురుషులతో, మదించిన పక్షులు గలదీ, వికసించిన పద్మములు గలదీ అయిన సరస్సువలె ప్రకాశించెను. 14

మూ. స రాజభవనప్రఖ్యాత్తస్మాద్రామనివేశనాత్,
నిర్గత్య దదృశే మార్గం వసిష్ఠో జనసంవృతమ్. 15

ప్ర. అ. సః = ఆ, వసిష్ఠః = వసిష్ఠుడు, రాజభవనప్రఖ్యాత్ = రాజభవనముతో సమాన మైన, తస్మాత్ = ఆ, రామనివేశనాత్ = రాముని గృహమునుండి, నిర్గత్య = బయలుదేరి, జనసంవృతమ్ = జనులతో నిండిన, మార్గమ్ = మార్గమును, దదృశే = చూచెను.

తా. వసిష్ఠుడు రాజభవనము వలె నున్న రాముని భవనమునుండి బయలుదేరి జనులతో నిండి యున్న మార్గమును చూచెను. 15

మూ. బృన్దబృన్దైరయోధ్యాయాం రాజమార్గాః సమన్తతః,
బభూవురభిసంబాధాః కుతూహలజనైర్వృతాః. 16

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యానగరమునందు, రాజమార్గాః = రాజమార్గములు, సమన్తతః = అంతటను, బృన్దబృన్దైః = గుంపులు గుంపులుగా ఉన్న, కుతూహలజనైః = వేడుకతో కూడిన జనులతో, వృతాః = కూడినవై, అభిసంబాధాః బభూవుః = ఇరుకుగా అయినవి.

తా. అయోధ్యానగరమునందలి రాజమార్గము లన్నియు, కుతూహలముచే గుంపులుగుంపులుగా ఏర్పడిన జనులతో నిండి ఇరుకుగ అయినవి. 16

మూ. జనబృన్దోర్మిసంఘర్షహర్షస్వనవతస్తదా,
బభూవ రాజమార్గస్య సాగరస్యేవ నిస్వనః. 17

ప్ర. అ. తదా = అప్పుడు, జనబృన్దోర్మిసంఘర్షహర్షస్వనవతః = తరంగములవంటి జనసముదాయముల త్రొక్కిసలాటవలనను హర్షమువలనను కలిగిన ధ్వని గల, రాజమార్గస్య = రాజమార్గముయొక్క, నిస్వనః = ధ్వని, సాగరస్యేవ = సాగరముయొక్క ధ్వని వలె, బభూవ = ఆయెను.

తా. అప్పుడు, తరంగముల వలె ఉన్న జనసమూహముల సంఘర్షము వలన కలిగిన ధ్వనియు, హర్షధ్వనియు కలియుటచే రాజమార్గమునందలి ధ్వని సముద్రఘోష వలె ఉండెను. 17

మూ. సిక్తసమ్మృష్టరథ్యా హి తదహర్వనమాలినీ,
ఆసీదయోధ్యా నగరీ సముచ్ఛ్రితగృహధ్వజా. 18

ప్ర. అ. తదహః=ఆ దివసమున, అయోధ్యానగరీ=అయోధ్యానగరము, సిక్తసమ్మృష్టరథ్యా హి = తడిపి తుడిచిన వీథులు కలదిగాను, వనమాలినీ = వృక్షపంక్తులు కలదిగాను, సముచ్ఛ్రితగృహధ్వజా=ఎగురవేయబడిన గృహధ్వజములు కలదిగాను, ఆసీత్=ఆయెను.

తా. ఆ దివసమున అయోధ్యానగరమునందు అన్ని వీథులను తుడిచి నీళ్లు చల్లిరి. వృక్షముల పంక్తులు ఏర్పరచిరి. ఇండ్లపై ధ్వజములను ఎగురవేసిరి. 18

మూ. తదా హ్యయోధ్యానిలయః సస్త్రీబాలాబలో జనః,
రామాభిషేకమాకాఙ్క్షన్నాకాఙ్క్షదుదయం రవేః. 19

ప్ర. అ. తదా = అప్పుడు, సస్త్రీబాలాబలః = స్త్రీబాలవృద్ధులతో కూడిన, అయోధ్యానిలయః = అయోధ్యలో నివసించు, జనః = జనము, రామాభిషేకమ్ = రాముని అభిషేకమును, ఆకాఙ్క్షన్ = కోరుచు, రవేః = సూర్యుని యొక్క, ఉదయమ్ = ఉదయమును, అకాఙ్క్షత్ = కోరెను.

తా. ఆనాడు, స్త్రీబాలవృద్ధసహితముగ అయోధ్యావాసులు అందరును రామాభిషేకము జరుగవలె నని కోరుచు సూర్యోదయ మెప్పు డగునా అని వేచియుండిరి. 19

మూ. ప్రజాలఙ్కారభూతం చ జనస్యానన్దవర్ధనమ్,
ఉత్సుకోఽభూజ్జనో ద్రష్టుం తమయోధ్యామహోత్సవమ్.

ప్ర. అ. ప్రజాలఙ్కారభూతమ్ = ప్రజలకు అలంకార మైనదీ, జనస్య=జనమునకు, ఆనన్దవర్ధనమ్=ఆనందమును వృద్ధిపొందించునదీ అయిన, తమ్=ఆ, అయోధ్యామహోత్సవమ్ = అయోధ్యలో జరుగు మహోత్సవమును, ద్రష్టుమ్=చూచుటకు, జనః=జనము, ఉత్సుకః = వేడుకకలది, అభూత్ = ఆయెను.

తా. ప్రజలందు అలంకారమైనదీ, జనుల ఆనందమును వృద్ధి పొందించునదీ అయిన ఆ అయోధ్యానగరములో జరుగుచున్న మహోత్సవమును చూచుటకై జను లందరును ఉవ్విళ్లూరుచుండిరి. 20

మూ. ఏవం తం జనసంబాధం రాజమార్గం పురోహితః,
వ్యూహన్నివ జనౌఘం తం శనై రాజకులం యయౌ. 21

ప్ర. అ. పురోహితః = పురోహితుడు, ఏవమ్ = ఈ విధముగ, జనసంబాధమ్ = జనులచే ఇరుకైన, తం రాజమార్గమ్ = ఆ రాజమార్గమును (చూచుచు), తం జనౌఘమ్ = ఆ జనసముదాయమును, వ్యూహన్నివ = విభజించుచున్నవాడు వలె, శనైః = మెల్లగా, రాజకులమ్ = రాజగృహమును, యయౌ = పొందెను.

తా. వసిష్ఠు డీ విధముగ జనులతో కిక్కిరిసి యున్న రాజమార్గమును చూచుచు, ఆ జనసముదాయమును రెండు పాయలుగ విభజించుచున్నవాడు వలె రథముపై ప్రయాణము చేయుచు మెల్లగ రాజప్రాసాదమును చేరుకొనెను. 21

మూ. సితాభ్రశిఖరప్రఖ్యం ప్రాసాదమధిరుహ్య సః,
సమీయాయ నరేన్ద్రేణ శక్రేణేవ బృహస్పతిః. 22

ప్ర. అ. సః = అతడు, సితాభ్రశిఖరప్రఖ్యమ్ = తెల్లని మేఘము గల పర్వతశిఖరము వలె నున్న, ప్రాసాదమ్ = రాజప్రాసాదమును, అధిరుహ్య = ఎక్కి, బృహస్పతిః = బృహస్పతి, శక్రేణేవ = దేవేంద్రునితో వలె, నరేన్ద్రేణ = రాజుతో, సమీయాయ = కలుసుకొనెను.

తా. అతడు, తెల్లని మేఘముచే కప్పబడిన పర్వతశిఖరము వలె నున్న ప్రాసాదము నెక్కి, బృహస్పతి దేవేంద్రుని కలిసినట్లు ఆ దశరథుని కలిసెను. 22

మూ. తమాగతమభిప్రేక్ష్య హిత్వా రాజాసనం నృపః,
పప్రచ్ఛ స చ తస్మై తత్కృతమిత్యభ్యవేదయత్. 23

ప్ర. అ. నృపః = రాజు, ఆగతమ్ = వచ్చిన, తమ్ = ఆతనిని, అభిప్రేక్ష్య = చూచి, రాజాసనమ్ = సింహాసనమును, హిత్వా = విడచి, పప్రచ్ఛ = అడిగెను.

స: చ = అతడు కూడ, తత్ = ఆ కార్యము, కృతమ్ = చేయబడినది, ఇతి = అని, తస్మై = అతనికి, అభ్యవేదయత్ = తెలిపెను.

తా. వచ్చిన వసిష్ఠుని చూచి దశరథమహారాజు సింహాసనమునుండి దిగి గౌరవపూర్వకముగా "నేను చెప్పినట్లు చేసితివా"అని ప్రశ్నించెను. "చేయ దగిన దంతయు చేసితిని" అని అతడు సమాధానమిచ్చెను. 23

మూ. తేన చైవ తదా తుల్యం సహాసీనాః సభాసదః,
ఆసనేభ్యః సముత్తస్థుః పూజయన్తః పురోహితమ్. 24

ప్ర. అ. తదా = అప్పుడు, సహ ఆసీనాః = రాజుతో కూడ కూర్చొని యున్న, సభాసదః = సభ్యులు, తేన తుల్యమ్ ఏవ = ఆ దశరథునితో సమానము గనే, పురోహితమ్ = పురోహితుని, పూజయన్తః = పూజించుచు, ఆసనేభ్యః = ఆసనములనుండి, సముత్తస్థుః = లేచిరి.

తా. అంతవరకును రాజుతో పాటు కూర్చొని యున్న సభాసదు లంద రును, పురోహితుడైన ఆ వసిష్ఠుని పూజించుచు, రాజుతో పాటు తామును ఆసనములనుండి లేచిరి. 24

మూ. గురుణా త్వభ్యనుజ్ఞాతో మనుజౌఘం విసృజ్య తమ్,
వివేశాన్తఃపురం రాజా సింహో గిరిగుహామివ. 25

ప్ర. అ. రాజా = రాజు, గురుణా = గురువుచేత, అభ్యనుజ్ఞాతః = అనుజ్ఞ ఇవ్వబడినవాడై, తమ్ = ఆ, మనుజౌఘమ్ = మనుష్యసముదాయమును, విసృజ్య = విడచి, సింహః = సింహము, గిరిగుహామివ = పర్వతగుహను వలె, అన్తః పురమ్ = అంతఃపురమును, వివేశ = ప్రవేశించెను.

తా. దశరథమహారాజు వసిష్ఠుని అనుజ్ఞ పొంది, ఆ సభాసదు లందరిని పంపివేసి, సింహము పర్వతగుహలోనికి వెళ్లి నట్లు అంతఃపురములోనికి వెళ్లెను.

మూ. తమగ్ర్యవేషప్రమదాజనాకులం
మహేన్ద్రవేశ్మప్రతిమం నివేశనమ్,
విదీపయంశ్చారు వివేశ పార్థివః
శశీవ తారాగణసంకులం నభః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చమః సర్గః.

ప్ర. అ. పార్థివః=రాజు, అగ్ర్యవేషప్రమదాజనాకులమ్ = శ్రేష్ఠ మైన వేషములు ధరించిన స్త్రీజనముతో కూడినదీ, మహేన్ద్రవేశ్మప్రతిమమ్ = దేవేంద్రుని గృహముతో సమానమైనదీ అయిన, తం నివేశనమ్=ఆ అంతఃపురమును, విదీపయన్ = ప్రకాశింపచేయుచు, చారు = సుందర మైనదీ, తారాగణ సంకులమ్ = నక్షత్రసముదాయముతో నిండినదీ అయిన, నభః = ఆకాశమును, శశీవ = చంద్రుడు వలె, వివేశ = ప్రవేశించెను.

తా. అత్యుత్తమ మైన వేషము ధరించిన స్త్రీలతో ఆ అంతఃపురము దేవేంద్రభవనము వలె ఉండెను. అట్టి అంతఃపురము ఇంకను ప్రకాశించునట్లు చేయుచు దశరథమహారాజు ప్రవేశించగనే అది తారాగణముతో నిండిన ఆకాశము పైకి చంద్రుడు వచ్చిన ట్లుండెను. 26

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో పంచమసర్గ సమాప్తము.

## అథ షష్ఠః సర్గః

*[శ్రీరాముడు సీతాసమేతుడై వ్రతనియమము పాటించుట. అయోధ్యాపౌరు లానందపరవశులై నగరమును అలంకరించుట, రాజునకు తమ కృతజ్ఞతను వ్యక్తము చేయుట, జానపదులు గుంపులుగా అయోధ్యాపురికి చేరుట.]*

మూ. గతే పురోహితే రామః స్నాతో నియతమానసః,
సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణముపాగమత్. 1

ప్ర. అ. పురోహితే = పురోహితుడు, గతే సతి = వెళ్లినవా డగుచుండగా, రామః = రాముడు, స్నాతః = స్నానము చేసినవాడై, నియతమానసః = ఏకాగ్రముగ చేయబడిన మనస్సు కలవాడై, విశాలాక్ష్యా = విశాల మైన నేత్రములు గల, పత్న్యా సహ = భార్యతో కూడ, నారాయణమ్ = నారాయణుని, ఉపాగమత్ = ఉపాసించెను.

తా. వసిష్ఠుడు వెడలిపోయిన పిమ్మట రాముడు స్నానము చేసి, ఏకాగ్ర మైన చిత్తము కలవాడై, విశాల మైన నేత్రములు గల సీతతో కూడ శ్రీమన్నారాయణుని ఉపాసించెను. 1

మూ. ప్రగృహ్య శిరసా పాత్రం హవిషో విధివత్తదా,
మహతే దైవతాయాజ్యం జుహావ జ్వలితానలే. 2

ప్ర. అ. తదా = అప్పుడు, హవిషః = హవిస్సుయొక్క, పాత్రమ్ = పాత్రను, విధివత్ = యథాశాస్త్రముగ, శిరసా = శిరస్సుచేత, ప్రగృహ్య = గ్రహించి, జ్వలితానలే = ప్రజ్వలించుచున్న అగ్నియందు, మహతే = గొప్ప, దైవతాయ = దేవతకు, ఆజ్యమ్ = నేతిని, జుహావ = హోమము చేసెను.

తా. హవిస్సు ఉన్న పాత్రను యథాశాస్త్రముగ శిరస్సుపై ధరించి, ప్రజ్వలించుచున్న అగ్నిలో, శ్రీమహావిష్ణువు నుద్దేశించి ఆజ్యము హోమము చేసెను.

మూ. శేషం చ హవిష స్తస్య ప్రాశ్యాశాస్యాత్మనః ప్రియమ్,
ధ్యాయన్నారాయణం దేవం స్వాస్తీర్ణే కుశసంస్తరే. 3

వాగ్యతః సహ వైదేహ్యా భూత్వా నియతమానసః,
శ్రీమత్యాయతనే విష్ణోః శిశ్యే నరవరాత్మజః. 4

ప్ర. అ. నరవరాత్మజః = రాజకుమారు డైన రాముడు, ఆత్మనః = తన యొక్క, ప్రియమ్ = ప్రియమును, ఆశాస్య = కోరి, తస్య = ఆ, హవిషః = హవిస్సుయొక్క, శేషం = శేషమును, ప్రాశ్య చ = భుజించి, దేవమ్ = దేవు డైన, నారాయణమ్ = నారాయణుని, ధ్యాయన్ = ధ్యానించుచు, వాగ్యతః = వాఙ్నియమము కలవాడు, భూత్వా = అయి, నియతమానసః = వశమునం దుంచుకొనబడిన మనస్సు కలవాడై, విష్ణోః = విష్ణువుయొక్క, శ్రీమతి = శోభాయుక్త మైన, ఆయతనే = ఆలయమునందు, స్వాస్తీర్ణే = చక్కగా పరవబడిన, కుశసంస్తరే = కుశాస్తరణము నందు, వైదేహ్యా సహ = సీతతో కూడ, శిశ్యే = శయనించెను.

తా. రాముడు తన శ్రేయస్సును కోరి, హోమము చేయగా మిగిలిన హవిస్సు భక్షించి, నారాయణుని ధ్యానించుచు, మౌనవ్రత మవలంబించి మనోనిగ్రహముతో, శోభాయుక్త మైన విష్ణువు ఆలయమునందు, చక్కగ పరచిన దర్భసంస్తరముపై, సీతతో కూడ శయనించెను. 3, 4

మూ. ఏకయామావశిష్టాయాం రాత్ర్యాం ప్రతివిబుధ్య సః,
అలఙ్కారవిధిం కృత్స్నం కారయామాస వేశ్మనః. 5

ప్ర. అ. సః = అతడు, రాత్ర్యామ్ = రాత్రి ఏకయామావశిష్టాయామ్ = ఒక జాము మిగిలి యున్నదగుచుండగా, ప్రతివిబుధ్య = మేల్కొని, వేశ్మనః = ఇంటియొక్క, కృత్స్నమ్ = సమస్త మైన, అలఙ్కారవిధిమ్ = అలంకరణమును, కారయామాస = చేయించెను.

తా. రాముడు జాము రాత్రి ఉన్న దనగా మేల్కొని, ఇంటికి పూర్తిగ అలంకరణము చేయించెను. 5

మూ. తత్ర శృణ్వన్ సుఖా వాచః సూతమాగధవన్దినామ్,
పూర్వాం సన్ధ్యాముపాసీనో జజాప యతమానసః. 6

ప్ర. అ. తత్ర = ఆ రాత్రి చివరి యామమునందు, సూత మాగధ వన్దినామ్ = సూత మాగధ వందులయొక్క, సుఖాః = సుఖకర మైన, వాచః = వాక్కులను, శృణ్వన్ = వినుచున్నవాడై, పూర్వాం సన్ధ్యామ్ = మొదటిదైన ప్రాతఃకాలసంధ్యను, ఉపాసీనః = ఉపాసించినవాడై, యతమానసః = నిశ్చలమైన మనస్సు కలవాడై, జజాప = గాయత్రి జపించెను.

తా. ఆ నాల్గవ జామున సుఖకరము లైన సూతమాగధవందుల మాటలు వినుచు, ప్రాతఃకాలసంధ్య నుపాసించి, నిశ్చలమైన మనస్సుతో గాయత్రీజపము చేసెను. 6

మూ. తుష్టావ ప్రణతశ్చైవ శిరసా మధుసూదనమ్,
విమలక్షౌమసంవీతో వాచయామాస చ ద్విజాన్. 7

ప్ర. అ. శిరసా = శిరస్సుచేత, ప్రణతః = నమ్రుడై. మధుసూదనమ్ = శ్రీ మహావిష్ణువును, తుష్టావ = స్తుతించెను. విమలక్షౌమసంవీతః = స్వచ్ఛమైన పట్టుబట్టలచేత కప్పబడినవాడై, ద్విజాన్ = బ్రాహ్మణులను, వాచయామాస = పుణ్యాహవాచనము చేయించెను.

తా. శిరస్సు వంచి నమస్కరించి శ్రీ మహావిష్ణువును స్తుతించెను. తెల్లని పట్టుబట్టలు ధరించి బ్రాహ్మణులచేత పుణ్యాహవాచనము చేయించెను. 7

మూ. తేషాం పుణ్యాహఘోషోఽథ గమ్భీరమధుర స్తదా,
అయోధ్యాం పూరయామాస తూర్యఘోషానునాదితః. 8

ప్ర. అ. అథ = అటు పిమ్మట, తేషామ్ = వారియొక్క, గమ్భీరమధురః = గంభీరము, మధురము అయిన, పుణ్యాహఘోషః = పుణ్యాహవాచనధ్వని, తూర్యఘోషానునాదితః = తూర్యముల ధ్వనిని అనుసరించి ధ్వనించుచున్నదై, తదా = అప్పుడు, అయోధ్యామ్ = అయోధ్యను, పూరయామాస = నింపెను.

తా. అపుడు, గంభీరము, మధురము అయిన ఆ బ్రాహ్మణుల పుణ్యాహ వాచనఘోష తూర్యధ్వనులతో కలిసి అయోధ్యానగరమును నింపెను. 8

మూ. కృతోపవాసం తు తదా వైదేహ్యా సహ రాఘవమ్,
అయోధ్యానిలయః శ్రుత్వా సర్వః ప్రముదితో జనః. 9

ప్ర. అ. తదా = అప్పుడు, రాఘవమ్=రాముని, వైదేహ్యా సహ=సీతతో కూడ, కృతోపవాసం = చేయబడిన ఉపవాసము కలవానినిగా, శ్రుత్వా=విని, అయోధ్యానిలయః = అయోధ్య నివాసముగా గల, సర్వః = సమస్త మైన, జనః = జనము, ప్రముదితః = సంతోషించినది.

తా. అపుడు, రాముడును, సీతయు అభిషేకముకొరకై ఉపవాస ముండిరని విని అయోధ్యావాసు లందరును సంతసించిరి. 9

మూ. తతః పౌరజనః సర్వః శ్రుత్వా రామాభిషేచనమ్,
ప్రభాతాం రజనీం దృష్ట్వా చక్రే శోభయితుం పురీమ్. 10

ప్ర. అ. తతః = పిమ్మట, సర్వః = సమస్త మైన, పౌరజనః=పౌర జనము, రామాభిషేచనమ్ = రాముని అభిషేకమును, శ్రుత్వా = విని, రజనీమ్=రాత్రిని, ప్రభాతామ్ = ప్రాతఃకాల మైనదానినిగా, దృష్ట్వా = చూచి, పురీమ్ = పట్టణమును, శోభయితుమ్=అలంకరించుటకు, చక్రే = చేసెను.

తా. రామాభిషేకము జరుగ నున్న దని పౌరు లందరును సూర్యోదయము అయిన వెంటనే పట్టణమును అలంకరించిరి. 10

మూ. సితాభ్రశిఖరాభేషు దేవతాయతనేషు చ,
చతుష్పథేషు రథ్యాసు చైత్యేష్వట్టాలకేషు చ. 11

నానాపణ్యసమృద్ధేషు వణిజామాపణేషు చ,
కుటుమ్బినాం సమృద్ధేషు శ్రీమత్సు భవనేషు చ. 12

సభాసు చైవ సర్వాసు వృక్షేష్వాలక్షితేషు చ,
ధ్వజాః సముచ్ఛ్రితాశ్చిత్రాః పతాకాశ్చాభవంస్తదా. 13

ప్ర. అ. సితాభ్రశిఖరాభేషు = తెల్లని మేఘము గల శిఖరముల వంటి కాంతి గల, దేవతాయతనేషు చ = దేవాలయములందును, చతుష్పథేషు= నాలుగు మార్గములు కలియు ప్రదేశములందును, రథ్యాసు = వీథులందును, చైత్యేషు=దేవాలయములలో ఉన్న మహావృక్షములందును, అట్టాలకేషు చ=కోట బురుజులందును, నానాపణ్యసమృద్ధేషు=అనేకవిధము లైన అమ్మదగిన వస్తువు

లతో సమృద్ధముగా ఉన్న, వణిజామ్ = వర్తకుల, ఆపణేషు చ = అంగళ్ల యందును, కుటుమ్బినామ్ = గృహస్థులయొక్క, సమృద్ధేషు=సమృద్ధములును, శ్రీమత్సు = ఐశ్వర్యసంపన్నములు అయిన, భవనేషు చ = భవనములందును, సర్వాసు=సమస్త మైన, సభాసు=సభాభవనములందును, అలక్షితేషు=అంత టను చూడబడిన, (ఎత్తైన), వృక్షేషు = వృక్షములందును, తదా = అప్పుడు, ధ్వజాః=(రాజ్యచిహ్నములున్న) ధ్వజములును, చిత్రాః=చిత్రవర్ణముగల, పతా కాః చ=పతాకలును, సముచ్ఛ్రితాః = ఎత్తబడినవి.

తా. తెల్లని మేఘములచే కప్పబడిన శిఖరముల వలె నున్న దేవాలయ ముల మీదను, చతుష్పథములందును, వీధులలోను, దేవాలయాదులలో ఉన్న చెట్లమీదను, కోటబురుజులపైనను, అనేకవస్తువులు సమృద్ధిగా ఉన్న వర్తకుల అపణము లందును, సంపత్సమృద్ధములై ఉన్న గృహస్థుల భవనములమీదను, సభాభవనములపైనను, ఎత్తైన వృక్షములపైనను, ధ్వజములను, చిత్రవర్ణము లైన పతాకలను ఎగురవేసిరి. 11-13

మూ. నటనర్తకసంఘానాం గాయతానాం చ గాయతామ్,
మనఃకర్ణసుఖా వాచః శుశ్రువుశ్చ తత స్తతః. 14

ప్ర. అ. తత స్తతః = ఆ యా వైపులనుండి, నటనర్తకసంఘానామ్ = అభినయముచేయు నటుల సంఘములయొక్కయు, నృత్యముచేయు నర్తకుల సంఘములయొక్కయు, గాయతామ్=గానముచేయుచున్న, గాయతానాం చ= గాయకులయొక్కయు, మనః కర్ణసుఖాః=మనస్సులకును, చెవులకును సుఖ మును కలిగించు, వాచః=వాక్కులను, శుశ్రువుః=వినిరి.

తా. అక్కడక్కడ నటులు అభినయములు చేయుచుండిరి. నర్తకులు నృత్యము చేయుచుండిరి. గాయకులు గానము చేయుచుండిరి. మనస్సులకును, చెవులకును సుఖకరము లైన వాక్కులు వినవచ్చు చుండెను. 14

మూ. రామాభిషేకయుక్తాశ్చ కథాశ్చక్రుర్మిథో జనాః,
రామాభిషేకే సంప్రాప్తే చత్వరేషు గృహేషు చ. 15

ప్ర. అ. రామాభిషేకే = రామాభిషేకము, సంప్రాప్తే = సమీపించగా, జనాః = జనులు, చత్వరేషు=ముంగిళ్లయందును లేదా చతుష్పథములందును,

గృహేషు చ=గృహములందును, మిథః=పరస్పరము, రామాభిషేకయుక్తాః= రామాభిషేకమునకు సంబంధించిన, కథాః=సంభాషణములను, చక్రుః=చేసిరి.

తా. రామాభిషేకము సమీపించు చుండగా, జనులు చతుష్పథము లందును, గృహములలోను, పరస్పరము రామాభిషేకమునకు సంబంధించిన మాటలు చెప్పుకొనిరి. 15

మూ. బాలా అపి క్రీడమానా గృహద్వారేషు సంఘశః,
రామాభిషవసంయుక్తాశ్చక్రురేవం మిథః కథాః. 16

ప్ర. అ. ఏవమ్ = ఇట్లు, గృహద్వారేషు = గృహద్వారములందు, సంఘశః = గుంపులుగా చేరి, క్రీడమానాః = ఆడుకొనుచున్న, బాలాః అపి= బాలులు కూడ, మిథః = పరస్పరము, రామాభిషవసంయుక్తాః=రాముని అభిషేకమునకు సంబంధించిన, కథాః=కథలను, చక్రుః = చేసిరి.

తా. గుమిగూడి ముంగిళ్లలో ఆడుకొనుచున్న బాలులు కూడ, పరస్పరము రామాభిషేకమునకు సంబంధించిన మాటలు చెప్పుకొనిరి. 16

మూ. కృతపుష్పోపహారశ్చ ధూపగన్ధాధివాసితః,
రాజమార్గః కృతః శ్రీమాన్ పౌరై రామాభిషేచనే. 17

ప్ర. అ. రామాభిషేచనే=రాముని అభిషేకసందర్భమున, పౌరైః = పౌరులచేత, రాజమార్గః = రాజమార్గము, కృతపుష్పోపహారశ్చ = చేయబడిన పుష్పముల ఉపహారము (చల్లుట) కలదై, ధూపగన్ధాధివాసితః = ధూపము యొక్క గంధముచే సువాసన కలదిగ చేయబడినదై, శ్రీమాన్ = శోభాయుక్తముగ, కృతః = చేయబడెను.

తా. రామాభిషేకము సందర్భమున, పౌరు లందరును, పుష్పములు చల్లి, ధూపముల సుగంధమును వ్యాపింపచేసి, రాజమార్గమును శోభాయుక్తము చేసిరి. 17

మూ. ప్రకాశకరణార్థం చ నిశాగమనశఙ్కయా,
దీపవృక్షాం స్తథాచక్రు రనురథ్యాసు సర్వశః. 18

ప్ర. అ. తథా = మరియు, అను=పుష్పాద్యలంకరణానంతరము, నిశా

గమనశఙ్కయా=రాత్రి యగు నను శంకచే, ప్రకాశకరణార్థమ్ = వెలుతురును ఏర్పాటు చేయుటకై, రథ్యాసు = వీధులందు, సర్వశః=అంతటను, దీపవృక్షాన్ = దీపముల చెట్లను, చక్రుః = చేసిరి.

తా. రామాభిషేకాదులు పూర్తి యగు సరికి రాత్రి యగునేమో అను శంకచే, ప్రకాశమును కల్పించుటకై వీధులలో అంతటను దీపవృక్షములను, అనగా వృక్షాకారములో అమర్చిన దీపములను, ఏర్పాటుచేసిరి. 18

మూ. అలఙ్కారం పురస్యైవం కృత్వా తత్పురవాసినః,
ఆకాఙ్క్షమాణా రామస్య యౌవరాజ్యాభిషేచనమ్, 19
సమేత్య సంఘశః సర్వే చత్వరేషు సభాసు చ,
కథయన్తో మిథస్తత్ర ప్రశశంసుర్జనాధిపమ్. 20

ప్ర. అ. తత్పురవాసినః = ఆ పురమునందు నివసించుచున్న, సర్వే = అందరును, ఏవం=ఈ విధముగా, పురస్య = పురముయొక్క, అలఙ్కారమ్ = అలంకారమును, కృత్వా=చేసి, రామస్య = రామునియొక్క, యౌవరాజ్యాభిషేచనమ్=యౌవరాజ్యాభిషేకమును, ఆకాఙ్క్షమాణాః=కోరుచున్నవారై, చత్వరేషు = చతుష్పథములందు, సభాసు చ = సభాభవనములందు, సంఘశః= గుంపులు గుంపులుగా, సమేత్య = కలిసి, తత్ర = అచట, మిథః=పరస్పరము, కథయన్తః=చెప్పుకొనుచున్నవారై, జనాధిపమ్ = రాజును, ప్రశశంసుః= ప్రశంసించిరి.

తా. అయోధ్యాపురములో నివసించు పౌరు లందరును పురము నీ విధముగ అలంకరించి, రాముని యౌవరాజ్యాభిషేకమును కోరుచు చతుష్పథములందును, సభాభవనములందును గుంపులు గుంపులుగా కలిసి, పరస్పరము ఆ విషయమును గూర్చియే మాటలాడికొనుచు, దశరథమహారాజును ప్రశంసించిరి. 19,20

మూ. అహో మహాత్మా రాజాయమిక్ష్వాకుకులనన్దనః,
జ్ఞాత్వా యో వృద్ధ మాత్మానం రామం రాజ్యేఽభిషేక్ష్యతి.

ప్ర. అ. యః=ఏ రాజు, ఆత్మానమ్=తనను, వృద్ధమ్ = వృద్ధునిగా, జ్ఞాత్వా=తెలిసికొని, రామమ్ = రాముని, రాజ్యే=రాజ్యమునందు, అభిషే

ష్యతి = అభిషేకింప నున్నారో, అట్టి, అయమ్ = ఈ, ఇక్ష్వాకుకులనన్దనః = ఇక్ష్వాకు వంశమునకు ఆనందకరు డైన, రాజా = దశరథమహారాజు, మహాత్మా = గొప్ప మనస్సు కలవాడు, అహో = ఆహా!

తా. ఆహా! ఇక్ష్వాకువంశమును ఆనందింపచేయు ఈ దశరథమహారాజు, తాను వృద్ధు డైన విషయమును గ్రహించి, రాముని రాజ్యమునందు అభిషేకింప నున్నాడు. ఇతడు గొప్ప మనస్సు కలవాడు. 21

మూ. సర్వేఽప్యనుగృహీతాః స్మ యన్నో రామో మహీపతిః,
చిరాయ భవితా గోప్తా దృష్టలోకపరావరః. 22

ప్ర. అ. యత్ = ఏ కారణమువలన, దృష్టలోకపరావరః = చూడబడిన లోకమునందలి ఎచ్చు తగ్గులు గల, రామః = రాముడు, మహీపతిః = రాజై, చిరాయ = చిరకాలము, నః = మనకు, గోప్తా = రక్షకుడుగా, భవితా = కాను న్నాడో, అందువలన, సర్వేఽపి = మన మందరమును, అనుగృహీతాః స్మ = అనుగ్రహింపబడినవారము అగుచున్నాము.

తా. జనులలోని తారతమ్యములు తెలిసిన రాముడు రాజై చాలకాలము మనలను రక్షింపగలడు. మన మందరము ధన్యులము. 22

మూ. అనుద్ధతమనా విద్వాన్ ధర్మాత్మా భ్రాతృవత్సలః,
యథా చ భ్రాతృషు స్నిగ్ధస్తథాస్మాస్వపి రాఘవః. 23

ప్ర. అ. అనుద్ధతమనాః = గర్వము లేని మనస్సు గలవాడూ, విద్వాన్ = పండితుడూ, ధర్మాత్మా = ధర్మాత్ముడూ, భ్రాతృవత్సలః = సోదరులందు ప్రేమ కలవాడూ అయిన, రాఘవః = రాముడు, భ్రాతృషు = సోదరులయందు, యథా = ఎట్లు, స్నిగ్ధః = స్నేహము కలవాడో, అస్మాస్వపి = మనయందు కూడా, తథా = అట్లే.

తా. మనస్సులో ఏ మాత్రము గర్వములేనివాడూ, పండితుడూ, ధర్మాత్ముడూ, సోదరులందు ప్రేమకలవాడూ అయిన రామునకు సోదరులపై ఎంత ప్రేమయో మనపై కూడ అంత ప్రేమయే. 23

మూ. చిరం జీవతు ధర్మాత్మా రాజా దశరథోఽనఘః,
యత్ప్రసాదేనాభిషిక్తం రామం ద్రక్ష్యామహే వయమ్. 24

ప్ర. అ. యత్ప్రసాదేన=ఏ దశరథుని అనుగ్రహముచేత, అభిషిక్తమ్=అభిషేకము చేయబడిన, రామమ్ = రాముని, ద్రక్ష్యామహే=చూడ నున్నామో, అట్టి, ధర్మాత్మా = ధర్మాత్ము డైన, అనఘః=దోషరహితు డైన, దశరథః రాజా = దశరథమహారాజు, చిరమ్ = చిరకాలము, జీవతు = జీవించుగాక.

తా. ధర్మాత్ముడూ, దోషరహితుడూ అయిన దశరథమహారాజు చిరకాలము జీవించుగాక. అతని అనుగ్రహముచే యౌవరాజ్యాభిషిక్తు డైన రాముని చూడనున్నాము. 24

మూ. ఏవంవిధం కథయతాం పౌరాణాం శుశ్రువుస్తదా
దిగ్భ్యోఽపి శ్రుతవృత్తాన్తాః ప్రాప్తా జానపదా నరాః. 25

ప్ర. అ. శ్రుతవృత్తాన్తాః=వినబడిన రామాభిషేకవృత్తాంతము కలవారై, దిగ్భ్యః అపి = నాలుగు దిక్కులనుండి గూడ, ప్రాప్తాః = వచ్చిన, జానపదాః జనాః = గ్రామములందు నివసించు జనులు, తదా = అప్పుడు, ఏవంవిధమ్ = ఈ విధముగ, పౌరాణామ్ = పౌరులు, కథయతామ్ = చెప్పుకొనుచుండగా, శుశ్రువుః = వినిరి.

తా. రామునకు యౌవరాజ్యాభిషేకము జరుగగల దని విని నానా దిక్కులనుండి వచ్చిన జానపదులు, ఈ విధముగ పౌరు లందరూ మాటలాడు కొనుచుండగా వినిరి. 25

మూ. తే తు దిగ్భ్యః పురీం ప్రాప్తా ద్రష్టుం రామాభిషేచనమ్,
రామస్య పూరయామాసుః పురీం జానపదా జనాః. 26

ప్ర. అ. రామాభిషేచనమ్=రాముని అభిషేకమును, ద్రష్టుమ్=చూచుటకు, దిగ్భ్యః = దిక్కులనుండి, పురమ్ = పట్టణమును, ప్రాప్తాః = పొందిన, తే=ఆ, జానపదాః = పల్లెలలో నుండు, జనాః=జనులు, రామస్య = రాముని యొక్క, పురీమ్ = పుర మైన అయోధ్యను, పూరయామాసుః=నింపిరి.

తా. రామాభిషేకమును చూచుటకై అన్ని దిక్కులనుండి వచ్చిన గ్రామ నివాసి జనులతో అయోధ్యానగరము నిండిపోయెను. 26

మూ. జనౌఘై స్తైర్విసర్పద్భిః శుశ్రువే తత్ర నిస్వనః,
పర్వసూదీర్ణవేగస్య సాగరస్యేవ నిస్వనః. 27

ప్ర. అ. విసర్పద్భిః=సంచరించుచున్న, తైః=ఆ, జనౌఘైః=జనసముదాయములచేత కలిగిన, తత్ర = అచట, నిస్వనః=ధ్వని, పర్వసు = పర్వములందు, ఉదీర్ణవేగస్య=అధిక మైన వేగము గల, సాగరస్య = సముద్రముయొక్క, నిస్వనః ఇవ=ధ్వని వలె, శుశ్రువే=వినబడెను.

తా. అక్కడ జనప్రవాహముల సంచారముచే కలిగిన ధ్వని, పర్వము నందు అత్యధిక మైన వేగము గల సముద్రము ధ్వని వలె వినబడెను. 27

మూ. తత స్తదిన్ద్రక్షయసన్నిభం పురం
దిదృక్షుభిర్జానపదై రుపాగతైః,
సమన్తతః సస్వనమాకులం బభౌ
సముద్రయాదోభి రివార్ణవోదకమ్. 28

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షష్ఠః సర్గః.

ప్ర. అ. దిదృక్షుభిః=చూడ నభిలాష గల, ఉపాగతైః =వచ్చిన, జానపదైః = జానపదులతో, సమన్తతః = అంతటను, ఆకులమ్=వ్యాకుల మైనదీ, సస్వనమ్ =ధ్వనితో కూడినదీ, ఇన్ద్రక్షయసన్నిభమ్ = ఇంద్రుని నివాస మైన అమరావతితో సమానమైనదీ అయిన, తత్ =ఆ, పురమ్ = పట్టణము, సముద్ర యాదోభిః=సముద్రమునందలి జలజంతువులతో, అర్ణవోదకమ్ ఇవ=సముద్రమునందలి జలము వలె, బభౌ = ప్రకాశించెను.

తా. రాముని యౌవరాజ్యాభిషేకము చూడవలె నను కోరికతో వచ్చిన జానపదులతో అంతటను నిండి యుండి, ధ్వనితో కూడిన అమరావతీ సదృశమైన ఆ అయోధ్యానగరము, జలజంతువులతో నిండి ఘోషించుచున్న సముద్రమువలె నుండెను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో షష్ఠసర్గ సమాప్తము.

## అథ సప్తమః సర్గః

[రామాభిషేకవార్త విని మంథర దుఃఖితయై కైకేయికి మర్లోభ్రబోధ చేయుట, కాని ప్రసన్నురాలైన కైక సంతోషముతో మంథరకు బహుమానముగ తన ఆభరణమిచ్చి, వరము కోరుమనుట.]

మూ. జ్ఞాతిదాసీ యతో జాతా కైకేయ్యా తు సహోషితా
ప్రాసాదం చన్ద్రసజ్కాశమారురోహ యదృచ్ఛయా. 1

ప్ర. అ. యతః జాతా = ఎప్పటినుండి పుట్టినదో అప్పటి నుండియు, పుట్టినప్పటి నుండియు, కైకేయ్యా సహ = కైకేయితో, ఉషితా = నివసించుచున్న, జ్ఞాతిదాసీ = బంధువుల దాసి యైన మంథర, (అనగా పుట్టింటినుండి అరణముగా వచ్చిన దని యర్థము), యదృచ్ఛయా = దైవవశముచేత, చన్ద్రసజ్కాశమ్ = చంద్రునితో సమాన మైన, ప్రాసాదమ్ = ప్రాసాదమును, ఆరురోహ = ఎక్కెను.

తా. పుట్టినది మొదలు కైకేయి దగ్గర నివసించుచున్న జ్ఞాతిదాసి యైన మంథర, దైవవశముచే, చంద్రునితో సమాన మైన తెల్లని ప్రాసాదము నెక్కెను.

వి. "యతో జాతా" అను పదమునకు కొందరు వ్యాఖ్యాతలు "ఏ దేశము నందో, ఏ తలిదండ్రులకో పుట్టినది. నామగోత్రాదులు తెలియని ఆడుది" అని యర్థము చెప్పినారు. "ఇట్టి స్త్రీ అయోధ్యలో పుట్టదు గాన ఇట్లు చెప్పబడినది. హాస్యజనకము లైన గూను మొదలైనవి ఉండుటచేతనే ఈమె కైకకు దాసి అయినది గాని లేకున్నచో అందుకు తగినది కాదు" ఇత్యాది భావాలు చెప్పినారు. రాముడు శీఘ్రముగ వనవాసమునకై వెళ్లుటకై దేవతలు సృజించిన వ్యక్తి అగుటచే ఆమె జన్మాదికము దేవరహస్యము. అందుచే ఇట్లు చెప్పబడినది అని మరొక వ్యాఖ్యానము. ఇవన్నియు మంథరపై మన కున్న కోపమునకు సూచకములు. ఈమె నిజముగా అట్టి స్త్రీ అయినచో అట్టిదానిని దశరథుడు తన రాణికి దాసిగా అంగీకరించుట అతని వివేకరాహిత్యమును సూచించును గదా. ఇట్టి అర్థాలు చెప్పవలె నన్నచో 'కింకరః' "కింపచానః" "కాందిశీకః" ఇత్యాదిపదములలో వలె 'కిమ్' శబ్దము ప్రయోగింపబడును గాని సంబంధార్థక మగు యచ్ఛబ్దము

ప్రయోగింప బడదు. ''యతః కాలాత్ జాతా తతః ప్రభృతి కైకేయ్యా సహోషితా" ఎప్పుడు పుట్టినదో అప్పటినుండియు కైకేయితో కలిసి పెరిగిన, ఆమె జ్ఞాతి కుటుంబమున కులక్రమాగత మైన దాసి' అని అర్థము యుక్తము. 'కైకేయ్యాస్తు సహోషితా' అన్న పాఠముకంటె 'కైకేయ్యా తు సహోషితా' అను పాఠము (గోరక్ పూర్ ప్రతిలోనిది) యుక్తము. 1

మూ. సిక్తరాజపథాం కృత్స్నాం ప్రకీర్ణకుసుమోత్కరామ్,
అయోధ్యాం మన్థరా తస్మాత్ప్రాసాదాదన్వవైక్షత. 2

ప్ర. అ. మన్థరా = మంథర, సిక్తరాజపథామ్ = తడపబడిన రాజమార్గములు కలదీ, ప్రకీర్ణకుసుమోత్కరామ్=చిమ్మబడిన పుష్పసముదాయము కలదీ అయిన, కృత్స్నామ్=సమస్త మైన, అయోధ్యామ్ = అయోధ్యను, తస్మాత్ =ఆ, ప్రాసాదాత్ = ప్రాసాదమునుండి, అన్వవైక్షత = చూచెను.

తా. ఆ మంథర ప్రాసాదముపై కెక్కి, అచటినుండి, రాజమార్గములన్నియు తడిపి పూవులు చల్లి ఉన్న అయోధ్యానగరము నంతను చూచెను. 2

మూ. పతాకాభిర్వరార్హాభిర్ధ్వజైశ్చ సమలఙ్కృతామ్,
వృతాం ఛన్దపథైశ్చాపి శిరఃస్నాతజనైర్వృతామ్, 3
మాల్యమోదకహస్తైశ్చ ద్విజేన్ద్రైరభినాదితామ్,
శుక్లదేవగృహద్వారాం సర్వవాదిత్రనిస్వనామ్, 4
సంప్రహృష్టజనాకీర్ణాం బ్రహ్మఘోషాభినాదితామ్,
ప్రహృష్టవరహస్త్యశ్వాం సంప్రణర్దితగోవృషామ్, 5
ప్రహృష్టముదితైః పౌరైరుచ్ఛ్రితధ్వజమాలినీమ్,
అయోధ్యాం మన్థరా తస్మాత్ప్రాసాదాదన్వవైక్షత. 6

ప్ర. అ. మన్థరా = మంథర, తస్మాత్ = ఆ, ప్రాసాదాత్=ప్రాసాదమునుండి, వరార్హాభిః = శ్రేష్ఠమైన, పతాకాభిః = పతాకలచేతనూ, ధ్వజైశ్చ = ధ్వజములచేతనూ, సమలఙ్కృతామ్=అలంకరింపబడినదీ, ఛన్దపథైః చ అపి = నిరాటంకముగా సంచరించుటకై ఏర్పరచిన మార్గములతో, వృతామ్=కూడినదీ,

శిరఃస్నాతజనైః = శిరఃస్నానము చేసిన జనులతో, వృతామ్ = కూడినదీ, మాల్యమోదకహస్తైః = పుష్పమాలలూ, మోదకములూ హస్తమునందు గల, ద్విజేన్ద్రైః = బ్రాహ్మణశ్రేష్ఠులచేత, అభినాదితామ్ = ధ్వనింపచేయబడినదీ, శుక్ల దేవగృహద్వారామ్ = తెల్లని దేవతాగృహద్వారములు కలదీ, సర్వవాదిత్ర నిస్వనామ్ = సమస్తమైన వాద్యముల ధ్వని కలదీ, సంప్రహృష్టజనాకీర్ణామ్ = సంతసించిన జనులతో నిండినదీ, బ్రహ్మఘోషాభినాదితామ్ = వేదఘోషచే ధ్వనింపచేయబడినదీ, ప్రహృష్టవరహస్త్యశ్వామ్ = సంతసించిన గజములు అశ్వములు కలదీ, సంప్రణర్దిత గోవృషామ్ = ధ్వనిచేయుచున్న ఆబోతులు కలదీ, ప్రహృష్టముదితైః = మిక్కిలి సంతసించిన, పౌరైః = పౌరులచేత, ఉచ్ఛ్రిత ధ్వజమాలినీమ్ = ఎత్తబడిన ధ్వజపంక్తులు కలదీ అయిన, అయోధ్యామ్ = అయోధ్యను, అన్వవైక్షత = చూచెను.

తా. మంథర ప్రాసాద మెక్కి అయోధ్యను చూచు సరికి ఆ నగరమును శ్రేష్ఠమైన పతాకలతోనూ, ధ్వజములతోనూ అలంకరించిరి. జనులు నిరాటంకముగ సంచరించుటకై ప్రాకారాదులను తొలగించి, క్రొత్త మార్గములు వేయబడినవి. జను లందరును శిరఃస్నానము చేసి ఉండిరి. బ్రాహ్మణులు పుష్పమాలలను, మధురభక్ష్యములను చేత గ్రహించి మంత్రపాఠాదులు చేయుచుండిరి. దేవాలయద్వారములు వెల్లవేయుటచే తెల్లగా ప్రకాశించుచుండెను. అనేక విధములైన వాద్యములు మ్రోగుచుండెను. ఆ నగరము అత్యంతహృష్టాంతరంగులైన జనులతో నిండి వేదఘోషతో మారుమ్రోగు చుండెను. గజములూ అశ్వములూ గూడ ఉత్సాహముతో ఉండెను. ఆబోతులు రంకెలు వేయుచుండెను. ఆనందభరితులైన పౌరు లందరును తమ తమ గృహములపై ధ్వజముల నెగురవేసిరి. 3.6

మూ. ప్రహర్షోత్ఫుల్లనయనాం పాణ్డురక్షౌమవాసినీమ్,
అవిదూరే స్థితాం దృష్ట్వా ధాత్రీం పప్రచ్ఛ మన్థరా. 7

ప్ర. అ. మన్థరా = మంథర, ప్రహర్షోత్ఫుల్లనయనామ్ = ఆనందముచే వికసించిన నేత్రములు కలదీ, పాణ్డురక్షౌమవాసినీమ్ = తెల్లని పట్టువస్త్రమును ధరించినదీ, అవిదూరే = సమీపముననే, స్థితామ్ = ఉన్న, ధాత్రీమ్ = దాదిని, దృష్ట్వా = చూచి, పప్రచ్ఛ = అడిగెను.

తా. ఒక దాది సంతోషముతో నయనములు వికసింప, తెల్లని పట్టువస్త్రమును ధరించి సమీపముననే నిలచి యుండగా మంథర ఆమె ని ట్లడిగెను.

వి. "హర్షోత్ఫుల్లనయనామ్" అని వర్ణించుటచే ఈ దాది రాముని పెంచిన దాది యనియు, పాండురక్షౌమములను ధరించిన దని చెప్పుటచే శుభ కార్యములందు తెల్లని వస్త్రములు ధరించుట ఆనాటి సదాచార మనియు సూచిత మగుచున్నది. 7

మూ. ఉత్తమేనాభిసంయుక్తా హర్షేణార్థపరా సతీ,
రామమాతా ధనం కిం ను జనేభ్యః సంప్రయచ్ఛతి. 8

ప్ర. అ. రామమాతా=రాముని తల్లి, అర్థపరా సతీ=ధనమునందు ఆసక్తి కలదైనను, ఉత్తమేన=ఉత్తమమైన, హర్షేణ=సంతోషముతో, అభిసంయుక్తా=కూడినదై, జనేభ్యః = జనులకొరకు, ధనమ్ = ధనమును, కిం ను సంప్రయచ్ఛతి = ఎందుచేత దానము చేయుచున్నది?

తా. కౌసల్య ఎక్కువ ధనాభిలాష కల దగుటచే లుబ్ధురాలైనను, ఈనాడు అత్యంతానందముతో జనులకు ధనము దానము చేయుచున్న దేమి?

వి. మంథరకు కౌసల్యపై ఉన్న అసూయ ఎట్టి దనగా ఆమె పేరు కూడ ఉచ్చరించుటకు ఇష్టపడక 'రామమాతా' అని నిర్దేశించుచున్నది. 'అర్థపరా' అనునది కూడ ఆమె విషయమున మంథర కున్న అసూయను సూచించుచున్నది. (వ్యాఖ్యాతలు). 'అర్థపరా' అనుదానికి "ఏదియో ఉత్తమ ప్రయోజనమును అపేక్షించుచున్నదై" అని కూడ అర్థము (గోవిందరాజులు). 8

మూ. అతిమాత్రప్రహర్షోఽయం కిం జనస్య చ శంస మే,
కారయిష్యతి కిం వాపి సంప్రహృష్టో మహీపతిః. 9

ప్ర. అ. జనస్య=జనము యొక్క, అయమ్=ఈ, అతిమాత్రప్రహర్షః=మిక్కిలి ఆనందము, కిమ్ = ఎందులకు? మే=నాకు, శంస = చెప్పుము. సంప్రహృష్టః=సంతసించిన, మహీపతిః = రాజు, కిం వాపి=ఏమైన, కారయిష్యతి వా = చేయింపనున్నాడా?

తా. "ఇను అందరును ఇంత ఆనందముగా నుండుటకు కారణ మేమి? రాజు సంతోషించి ఏమైన ఘనకార్యము చేయనున్నాడా? నాకు చెప్పుము."

మూ. విదీర్యమాణా హర్షేణ ధాత్రీ తు పరయా ముదా,
ఆచచక్షేఽథ కుబ్జాయై భూయసీం రాఘవశ్రియమ్. 10

ప్ర. అ. ధాత్రీ తు = దాది యైతే, హర్షేణ = సంతోషముచేత, విదీర్యమాణా = ఉబ్బితబ్బిబ్బై పోవుచున్నదై, అథ = పిమ్మట, కుబ్జాయై = గూను దైన మంథరకు, భూయసీమ్ = అధిక మైన, రాఘవశ్రియమ్ = రాముని రాజ్యలక్ష్మీ సంప్రాప్తిని గూర్చి, పరయా = గొప్ప, ముదా = సంతోషముతో, ఆచచక్షే = చెప్పెను.

తా. అప్పుడా దాది సంతోషముతో తబ్బిబ్బు లగుచు, ఆ మంథరకు, రామునకు కలుగ నున్న అత్యధిక మైన అభివృద్ధిని గూర్చి పరమానందముతో తెలిపెను. 10

మూ. శ్వః పుష్యేణ జితక్రోధం యౌవరాజ్యేన రాఘవమ్,
రాజా దశరథో రామమభిషేచయితానఘమ్. 11

ప్ర. అ. దశరథః రాజా = దశరథమహారాజు, శ్వః = రేపు, పుష్యేణ = పుష్యమీనక్షత్రమునందు, రాఘవమ్ = రఘువంశసంజాతుడూ, అనఘమ్ = దోషములు లేనివాడూ అయిన, రామమ్ = రాముని, యౌవరాజ్యేన = యౌవరాజ్యముచే, అభిషేచయితా = అభిషేకము చేయనున్నాడు.

తా. దశరథమహారాజు, రేపు పుష్యమీ నక్షత్రమునందు, దోషరహితు డైన రాముని యౌవరాజ్యాభిషిక్తుని చేయనున్నాడు. 11

మూ. ధాత్ర్యాస్తు వచనం శ్రుత్వా కుబ్జా క్షిప్రమమర్షితా
కైలాసశిఖరాకారాత్ప్రాసాదాదవరోహత. 12

ప్ర. అ. కుబ్జా = ఆ గూనుది, ధాత్ర్యాః = దాదియొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, అమర్షితా = కోపముకలదై, కైలాసశిఖరాకారాత్ = కైలాసపర్వతశిఖరము వంటి ఆకారము గల, ప్రాసాదాత్ = ప్రాసాదమునుండి, క్షిప్రమ్ = శీఘ్రముగా, అవరోహత = దిగెను.

తా. దాది మాటలు విన్న ఆ మంథర కోపావిష్టురాలై కైలాసశిఖరము వంటి ఆకారము గల ప్రాసాదమునుండి శీఘ్రముగ దిగెను. 12

మూ. సా దహ్యమానా కోపేన మన్థరా పాపదర్శినీ,
శయానామేత్య కైకేయీమిదం వచన మబ్రవీత్. 13

ప్ర. అ. పాపదర్శినీ = పాపము కలిగించు కార్యమునే చూచు, సా = ఆ, మన్థరా = మంథర, కోపేన = కోపముచేత, దహ్యమానా = దహింపబడుచున్నదై, శయానామ్ = శయనించి యున్న, కైకేయీమ్ = కైకేయిని, ఏత్య = చేరి, ఇదమ్ = ఈ, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పాపాలోచన గల ఆ మంథర కోపముతో మండిపడుచు, శయనించి యున్న కైకేయివద్ద కేగి ఇట్లు పలికెను. 13

మూ. ఉత్తిష్ఠ మూఢే కిం శేషే భయం త్వామభివర్తతే,
ఉపప్లుతమఘౌఘేన కిమాత్మానం న బుధ్యసే. 14

ప్ర. అ. మూఢే = ఓ తెలివితక్కువదానా! ఉత్తిష్ఠ = లెమ్ము. కిం = ఎందువలన శేషే = నిద్రపోవుచున్నావు? భయమ్ = భయము, త్వా = నిన్ను, అభివర్తతే = సమీపించుచున్నది. అఘౌఘేన = దుఃఖముల సముదాయముచేత, ఉపప్లుతమ్ = ముంచెత్తబడిన, ఆత్మానమ్ = తనను గూర్చి, కిమ్ = ఎందువలన, న బుధ్యసే = తెలిసికొనకున్నావు?

తా. ఓ తెలివితక్కువదానా! పరుండి ఉన్నావేమి? లెమ్ము. నీ పైకి ఆపదలు ముంచెత్తికొని వచ్చుచున్నవి. నీవు తెలిసికొనజాలకున్నావు! 14

మూ. అనిష్టే సుభగాకారే సౌభాగ్యేన వికత్థసే,
చలం హి తవ సౌభాగ్యం నద్యాః స్రోత ఇవోష్ణగే. 15

ప్ర. అ. సుభగాకారే = భర్తకు ప్రియురాలవైనట్లు పైకి కనబడుదానా! అనిష్టే = భర్తకు అనిష్టురాలా! సౌభాగ్యేన = సౌభాగ్యముచేత, వికత్థసే = గర్వించుచున్నావు, (బడాయి చెప్పుకొనుచున్నావు); ఉష్ణగే = గ్రీష్మఋతువునందు, నద్యాః = నదియొక్క, స్రోతః ఇవ = ప్రవాహము వలె, తవ = నీయొక్క, సౌభాగ్యమ్ = సౌభాగ్యము, చలం హి = చంచలమైనది కదా!

తా. ఓ కైకేయీ! నీవు భర్తకు ప్రియురాలవు అని పైకి కనబడుటయే కాని వాస్తవమున నీ వాతనికి ఇష్టురాలవు కాదు. సౌభాగ్యవంతురాల నని (భర్త ప్రేమకు పాత్రురాల నని) బడాయి చెప్పుకొనుచున్నావు; కాని నీ సౌభాగ్యము గ్రీష్మమునందు నదీప్రవాహము వలె చంచల మైపోయినది. 15

మూ. ఏవముక్తా తు కైకేయీ రుష్టయా పరుషం వచః,
కుబ్జయా పాపదర్శిన్యా విషాదమగమత్పరమ్. 16

ప్ర. అ. రుష్టయా = కోపించిన, పాపదర్శిన్యా = పాపపు టాలోచనలు గల, కుబ్జయా = గూను గైన మంథర చేత, ఏవమ్ = ఇట్లు, పరుషమ్ = పరుష మైన, వచః = వాక్యమును, ఉక్తా = పలకబడిన, కైకేయీ = కైకేయి, పరమ్ = గొప్ప, విషాదమ్ = దిగులును, అగమత్ = పొందెను.

తా. పాపపు ఆలోచనలు గల ఆ మంథర కోపముతో పలికిన పరుష వాక్యములు విని కైకేయి చాల దిగులు చెందెను. 16

మూ. కైకేయీ త్వబ్రవీత్కుబ్జాం కచ్చిత్క్షేమం న మన్థరే,
విషణ్ణవదనాం హి త్వాం లక్షయే భృశదుఃఖితామ్ 17

ప్ర. అ. కైకేయీ తు = కైకేయి, కుబ్జామ్ = గూనిదానిని గూర్చి, అబ్రవీత్ = పలికెను. మన్థరే = మంథరా! క్షేమం న కచ్చిత్ = క్షేమము లేదా యేమి? త్వామ్ = నిన్ను, విషణ్ణవదనామ్ = దిగులు చెందిన ముఖము కలదానినిగాను, భృశదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖించిన దానినిగాను, లక్షయే హి = చూచు చున్నాను కదా.

తా. కైకేయి మంథరతో—"ఓ మంథరా! మన క్షేమమునకు భంగము వాటిల్లినదా యేమి? నీవు దిగులుచెందిన ముఖముతో చాల దుఃఖితురాలుగ కన బడుచున్నావు" అని ప్రశ్నించెను. 17

మూ. మన్థరా తు వచః శ్రుత్వా కైకేయ్యా మధురాక్షరమ్,
ఉవాచ క్రోధసంయుక్తా వాక్యం వాక్యవిశారదా. 18

ప్ర. అ. వాక్యవిశారదా = మాటలలో నేర్పరియైన మన్థరా తు = మంథర యైతే, మధురాక్షరమ్ = మధుర మైన అక్షరములు గల, కైకేయ్యాః వచః =

కైకేయి వాక్యాను, శ్రుత్వా = విని, క్రోధసంయుక్తా = కోపముతో కూడినదై, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మాటలలో నేర్పరి యైన మంథర కైకేయి పలికిన మధురాక్షరములు గల మాటలు విని, కోపముతో ఇట్లు పలికెను. 18.

మూ. సా విషణ్ణతరా భూత్వా కుబ్జా తస్యా హితైషిణీ,
విషాదయన్తీ ప్రోవాచ భేదయన్తీ చ రాఘవమ్. 19

ప్ర. అ. సా = ఆ, కుబ్జా = మంథర, విషణ్ణతరా భూత్వా = ఇంకను విషణ్ణురాలై, తస్యాః = ఆమెయొక్క, హితైషిణీ = హితమును కోరుచున్నదై, విషాదయన్తీ = ఆమెకు దిగులును కలిగించుచు, రాఘవమ్ = రాముని, భేద యన్తీ చ = వేరుపరచుచున్నదై. ప్రోవాచ = పలికెను.

తా. కైకేయి హితమును కోరుచున్న ఆ మంథర ఇంకను ఎక్కువగ విషణ్ణురాలై, కైకేయికి దుఃఖమును కలిగించుచు, రామునిపై ఆమెకు వైమనస్యమును పుట్టించుచు ఇట్లు పలికెను. 19

మూ. అక్షయ్యం సుమహద్దేవి ప్రవృత్తం త్వద్వినాశనమ్,
రామం దశరథో రాజా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి. 20

ప్ర. అ. దేవి = ఓ రాణీ! అక్షయ్యమ్ = అంతులేని, సుమహత్ = చాల గొప్పదైన, త్వద్వినాశనమ్ = నీ వినాశనము, ప్రవృత్తమ్ = ఏర్పడినది. రాజా = రాజైన, దశరథః = దశరథుడు, రామమ్ = రాముని, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేక్ష్యతి = అభిషేకింపనున్నాడు.

తా. రాణీ! నీకు అంతు లేని మహాదుఃఖము వచ్చి పడినది. దశరథ మహారాజు రాముని యౌవరాజ్యాభిషిక్తుని చేయనున్నాడు. 20

మూ. సాస్మ్యగాధే భయే మగ్నా దుఃఖశోకసమన్వితా
దహ్యమానాఽనలేనేవ త్వద్ధితార్థమిహాగతా. 21.

ప్ర. అ. సా = అట్టి నేను, అగాధే = మిక్కిలి అధిక మైన, భయే = భయమునందు, మగ్నా = మునిగిన దాననై, దుఃఖశోకసమన్వితా = మనస్తాపముతోను,

రోదనముతోను, కూడిన దానన్తై, అనలేన = అగ్నిచేత, దహ్యమానేవ = కాల్చ బడుచున్నదానను వలె అయి, త్వద్ధితార్థమ్ = నీ హితముకొరకు, ఇహ = ఇచటికి, ఆగతా = వచ్చినాను.

తా. నేను అనంత మైన దుఃఖములో మునిగిపోయినాను. నన్ను అగ్నిచే కాల్చివేయుచున్న ట్లున్నది. ఈ విధముగ దుఃఖశోకముంతో నిండినదాననై, నీకు హితము చేయగోరి ఇచటికి వచ్చితిని. 21

మూ. తవ దుఃఖేన కైకేయి మమ దుఃఖం మహద్భవేత్,
త్వద్వృద్ధౌ మమ వృద్ధిశ్చ భవేదత్ర న సంశయః. 22

ప్ర. అ. కైకేయి = ఓ కైకేయీ! తవ = నీయొక్క, దుఃఖేన = దుఃఖము చేత, మమ = నాకు, మహత్ = గొప్ప, దుఃఖమ్ = దుఃఖము, భవేత్ = కలుగును. త్వద్వృద్ధౌ = నీకు అభివృద్ధి కలిగినచో, మమ = నాకు, వృద్ధిశ్చ = వృద్ధియు, భవేత్ = కలుగును. అత్ర = ఇందు, సంశయః = సంశయము, న = లేదు.

తా. కైకేయీ! నీకు దుఃఖము కలిగినచో నాకు గొప్ప దుఃఖము కలుగును. నీకు అభివృద్ధి కలిగినచో నాకు అభివృద్ధి లభించును. ఈ విషయమున సంశయము లేదు. 22

మూ. నరాధిపకులే జాతా మహిషీ త్వం మహీపతేః,
ఉగ్రత్వం రాజధర్మాణాం కథం దేవి న బుధ్యసే. 23

ప్ర. అ. దేవి = రాణీ! నరాధిపకులే = రాజవంశమునందు, జాతా = పుట్టిన దానవు, మహీపతేః = రాజుయొక్క, మహిషీ = ప్రధానభార్యవూ అయిన, త్వమ్ = నీవు, రాజధర్మాణామ్ = రాజధర్మములయొక్క, ఉగ్రత్వమ్ = క్రూరత్వ మును, కథమ్ = ఎట్లు, న బుధ్యసే = తెలియజాల కున్నావు?

తా. కైకేయీ! రాజవంశములో జనించి, రాజభార్యలలో ప్రధానురాల వైనను నీవు రాజధర్మమునందలి క్రౌర్యమును తెలియజాలకున్నావేమి? 23

మూ. ధర్మవాదీ శఠో భర్తా శ్లక్ష్ణవాదీ చ దారుణః,
శుద్ధభావే న జానీషే తేనైవమతిసన్ధితా. 24

ప్ర. అ. భర్తా=నీ భర్త, ధర్మవాదీ=ధర్మము మాటలాడువాడు. శఠః= రహస్యముగా అపకారము చేయువాడు. శ్లక్ష్ణవాదీ=మధురముగా మాటలాడు వాడు. దారుణః చ=క్రూరుడు. శుద్ధభావే=ఓ పరిశుద్ధ స్వభావురాలా! తేన= ఆ భర్తచేత, ఏవమ్=ఇట్లు, అతిసన్ధితా=మోసగించబడిన నీవు, న జానీషే= తెలిసికొనజాలకున్నావు.

తా. నీ భర్త ధర్మాలు చెప్పుచుండును గాని రహస్యముగా అపకారము చేయును. తియ్యగ మాటలాడుచు క్రూరముగ ప్రవర్తించును. నీవు పరిశుద్ధమైన హృదయము కలదాన వగుటచే అతడీ విధముగ మోసగించుచున్నను తెలిసికొన జాలకున్నావు. 25

మూ. ఉపస్థితః ప్రయుఞ్జానస్త్వయి సాన్త్వమనర్థకమ్,
అర్థేనైవాద్య తే భర్తా కౌసల్యాం యోజయిష్యతి. 25

ప్ర. అ. ఉపస్థితః=సమీపించినవాడై, అనర్థకమ్=ఎట్టి ప్రయోజనమును లేని, సాన్త్వమ్=మంచిమాటలను, త్వయి=నీ విషయమున, ప్రయుఞ్జానః= ప్రయోగించుచుండు, తే భర్తా=నీ భర్త, అద్య=నేడు, కౌసల్యామేవ= కౌసల్యనే, అర్థేన=లాభముతో, యోజయిష్యతి=కూర్పగలడు.

తా. నీ భర్త నీవద్దకు వచ్చి నిష్ప్రయోజనములైన మంచి మాటలు పలుకుచుండును. కాని లాభమును మాత్రము కౌసల్యకే సమకూర్చనున్నాడు. 25

మూ. అపవాహ్య స దుష్టాత్మా భరతం తవ బన్ధుషు,
కాల్యే స్థాపయితా రామం రాజ్యే నిహతకణ్టకే. 26

ప్ర. అ. దుష్టాత్మా=దుష్టమైన బుద్ధి గల, సః=అతడు, భరతమ్= భరతుని, తవ బన్ధుషు=నీ బంధువుల వద్దకు, అపవాహ్య=పంపివేసి, కాల్యే= ప్రాతఃకాలమునందు, రామమ్=రాముని, నిహతకణ్టకే=తొలగింపబడిన అడ్డు గల, రాజ్యే=రాజ్యమునందు, స్థాపయితా=స్థాపింపనున్నాడు.

తా. దుష్టబుద్ధి గల నీ భర్త భరతుని నీ బంధువుల ఇంటికి పంపివేసి, రేపు ప్రాతఃకాలమున, ఏ అడ్డులును లేని రాజ్యమును రామున కివ్వనున్నాడు.

మూ. శత్రుః పతిప్రవాదేన మాత్రేవ హితకామ్యయా,
ఆశీవిష ఇవాఙ్కేన బాలే పరిధృతస్త్వయా. 27

ప్ర. అ. బాలే=చిన్నదానా! (తెలివిలేనిదానా), మాత్రేవ=తల్లిచేతవలె, త్వయా=నీచేత, హితకామ్యయా = హితాభిలాషచేత, ఆశీవిషః = సర్పము, అఙ్కేనేవ=ఒడిచేత (లో) వలె, శత్రుః=శత్రువు, పతిప్రవాదేన=భర్త యను ప్రవాదముచే (పేరుతో), పరిధృతః = ధరింపబడినాడు.

తా. ఓ అమాయకురాలా! నీవు తల్లి వలె హితమును కోరుచు, సర్పమును ఒడిలో ధరించి నట్లు శత్రువును భర్త యను పేరుతో గ్రహించియున్నావు.

మూ. యథా హి కుర్యాత్సర్పో వా శత్రుర్వా ప్రత్యుపేక్షితః,
రాజ్ఞా దశరథేనాద్య సపుత్రా త్వం తథా కృతా. 28

ప్ర. అ. సపుత్రా = పుత్రసహితురాల వైన, త్వమ్ = నీవు, రాజ్ఞా = రాజైన, దశరథేన=దశరథుని చేత, ప్రత్యుపేక్షితః = ఉపేక్షింపబడిన, సర్పో వా=సర్పము గాని, శత్రుర్వా = శత్రువు గాని, యథా = ఎట్లు, కుర్యాత్ = చేయునో, తథా = అట్లు, కృతా = చేయబడితివి.

తా. ఉపేక్షించిన సర్పము గాని, శత్రువు గాని ఏమి చేయునో, దశరథ మహారాజు నీ విషయమునను, నీ కుమారుని విషయమునకు అదియే చేసినాడు.

మూ. పాపేనానృతసాన్త్వేన బాలే నిత్యసుఖోచితే,
రామం స్థాపయతా రాజ్యే సానుబన్ధా హతా హ్యసి. 29

ప్ర. అ. నిత్యసుఖోచితే = నిత్యము సుఖములకు అలవాటుపడినదానా, బాలే=ఓ బాలా! అనృతసాన్త్వేన = అసత్యమైన మంచి మాటలు గలవాడూ, రామమ్ = రాముని, రాజ్యే = రాజ్యమునందు, స్థాపయతా = స్థాపించుచున్నవాడూ, అయిన, పాపేన=ఆ పాపాత్మునిచేత, సానుబన్ధా=సంతానసహితురాలవైన నీవు, హతా=కొట్టబడినదానవు, అసి హి=అగుచున్నావు కదా!

తా. ఓ తెలివితక్కువదానా! నిత్యము సుఖములకు అలవడిన నిన్ను బూటకపు మాటలతో బుజ్జగించుచు ఆ పాపాత్ముడు రామునకు రాజ్యాభిషేకము చేసి నిన్ను సంతానసహితముగా నశింపచేయుచున్నాడు కదా! 29

మూ. సా ప్రాప్తకాలం కైకేయి క్షిప్రం కురు హితం తవ,
త్రాయస్వ పుత్రమాత్మానం మాం చ విస్మయదర్శనే. 80

ప్ర. అ. కైకేయి = ఓ కైకేయీ! సా=అట్టి నీవు, తవ=నీకు, హితమ్= హిత మైన, ప్రాప్తకాలమ్ = సమయమునకు తగిన కార్యమును, క్షిప్రమ్ = శీఘ్రముగా, కురు = చేయుము. విస్మయదర్శనే=ఆశ్చర్యకర మైన దర్శనము కలదానా! పుత్రమ్ = నీ పుత్రుని, ఆత్మానమ్ = తనను, మాం చ = నన్ను కూడ, త్రాయస్వ = రక్షించుము.

తా. కైకేయీ! సమయోచితముగా నీకు హిత మైన కార్యము చేయుము. చూపరులకు ఆశ్చర్యము కలిగించు సౌందర్యము కలదానా! నీ పుత్రుని, నిన్ను నన్ను కూడ రక్షించుము. 80

మూ. మన్థరాయా వచః శ్రుత్వా శయానా సా శుభాననా,
ఉత్తస్థౌ హర్షసంపూర్ణా చన్ద్రలేఖేవ శారదీ. 81

ప్ర. అ. శయానా = శయనించి యున్న, సా = ఆ, శుభాననా=సుందర మైన ముఖము గల కైకేయి, మన్థరాయాః=మంథర యొక్క, వచః=వాక్కును, శ్రుత్వా = విని, హర్షసంపూర్ణా = సంతోషముతో నిండినదై, శారదీ=శరత్కాలమునకు సంబంధించిన, చన్ద్రలేఖేవ = చంద్రరేఖ వలె, ఉత్తస్థౌ=లేచెను.

తా. అంతవరకును శయనించి యున్న ఆ సుందరముఖి, మంథర మాటలు విని, ఆనందభరిత యై, శరత్కాలమునందలి చంద్రరేఖ వలె, లేచెను. 81

మూ. అతీవ సా తు సంహృష్టా కైకేయీ విస్మయాన్వితా
ఏకమాభరణం తస్యై కుబ్జాయై ప్రదదౌ శుభమ్. 82

ప్ర. అ. సా కైకేయీ = ఆ కైకేయి, అతీవ = మిక్కిలి, సన్హృష్టా = సంతోషించినదై, విస్మయాన్వితా = ఆశ్చర్యముతో కూడినదై, తస్యై = ఆ, కుబ్జాయై = కుబ్జకు, ఏకమ్ = ఒక, శుభమ్=అందమైన, ఆభరణమ్ = ఆభరణమును, దదౌ=ఇచ్చెను.

తా. కైకేయి చాల సంతోషించి, మంథర మాటల తీరుకు ఆశ్చర్య పడుచు, ఆమెకు ఒక మంచి ఆభరణమును పారితోషికముగా ఇచ్చెను. 32

మూ. దత్వా త్వాభరణం తస్యై కుబ్జాయై ప్రమదోత్తమా,
కైకేయీ మన్థరాం దృష్ట్వా పునరేవాబ్రవీదిదమ్. 33.

ప్ర. అ. ప్రమదోత్తమా = స్త్రీలలో ఉత్తమురాలైన, కైకేయీ = కైకేయి, తస్యై = ఆ, కుబ్జాయై = కుబ్జకు, ఆభరణమ్ = ఆభరణమును, దత్వా = ఇచ్చి, మన్థరామ్ = మంథరను, దృష్ట్వా = చూచి, పునః ఏవ = మరల, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. స్త్రీలలో ఉత్తమురాలైన ఆ కైకేయి మంథరకు ఆభరణ మిచ్చి ఆమెతో ఇట్లనెను. 33

మూ. ఇదం తు మన్థరే మహ్యమాఖ్యాసి పరమం ప్రియమ్.
ఏతన్మే ప్రియమాఖ్యాతుః కిం వా భూయః కరోమి తే. 34

ప్ర. అ. మన్థరే = మంథరా, మహ్యమ్ = నాకు, పరమమ్ = ఎక్కువ, ప్రియమ్ = ప్రియమైన, ఇదమ్ = దీనిని, ఆఖ్యాసి = చెప్పుచున్నావు. మే = నాకు, ప్రియమ్ = ప్రియమును, ఆఖ్యాతుః = చెప్పువానికి, ఏతత్ = ఇది పారితోషికము. తే = నీకు, భూయః = ఇంకను, కిం వా = ఏమి, కరోమి = చేయుదును?

తా. మంథరా! నీవు చెప్పినది నా కత్యంత ప్రియమైన విషయము. ఇది నేను ప్రియమైన వార్త చెప్పినవారి కిచ్చు పారితోషికము. అతి ప్రియవార్తను తెచ్చిన నీ కింకను ఏమి ఇవ్వవలెనో చెప్పుము. 34

మూ. రామే వా భరతే వాహం విశేషం నోపలక్షయే,
తస్మాత్తుష్టాస్మి యద్రాజా రామం రాజ్యేఽభిషేక్ష్యతి 35

ప్ర. అ. అహమ్ = నేను, రామే వా = రాముని యందుగాని, భరతే వా = భరతుని యందు గాని, విశేషమ్ = భేదమును, నోపలక్షయే = చూడను. తస్మాత్ = అందువలన, రాజా = రాజు, రామమ్ = రాముని, రాజ్యే = రాజ్యమునందు, యత్ అభిషేక్ష్యతి = అభిషిక్తుని చేయునను విషయమున, తుష్టా అస్మి = సంతోషించితిని.

తా. నాకు రాము డన్నను, భరతు డన్నను భేదబుద్ధి లేదు. అందుచే రాజు రాముని రాజ్యాభిషిక్తుని చేయ నున్నాడను విషయమున సంతోషించు చున్నాను. 35

మూ. న మే పరం కిఞ్చి దితస్త్వయాపి న
ప్రియం ప్రియార్హే సువచం వచః పరమ్,
తథా హ్యవోచస్త్వమతః ప్రియోత్తరం
వరం వరం తే ప్రదదామి తం వృణు. 36

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తమః సర్గః.

ప్ర. అ. ప్రియార్హే = ప్రియమునకు అర్హురాల వైన ఓ మంథరా! మే = నాకు, ఇతః = ఇంతకంటె, పరమ్ = గొప్పది, కిఞ్చిత్ = ఏదియు, న = లేదు. త్వయాపి = నీచేతగూడ, పరమ్ = అధికముగా, ప్రియమ్ = ప్రియ మైన, వచః = వచనము, సువచమ్ = సులభముగా చెప్ప శక్యమైనది, న = కాదు. త్వమ్ = నీవు, తథా = ఆవిధముగా, ప్రియోత్తరమ్ = ప్రియ మైన వాటిలో శ్రేష్ఠ మైనదానిని, అవోచః హి = చెప్పితివి గదా. అతః = ఆ కారణము వలన, పరమ్ = ఉత్తమ మైన, వరమ్ = వరమును, తే = నీకు, ప్రదదామి = ఇచ్చుచున్నాను. తమ్ = దానిని, వృణు = కోరుకొనుము.

తా. మంథరా! నీవు సంతోషమునకు తగినదానవు. నా కింతకంటె ప్రియ మైనది మరొకటి లేదు. అందుచే నీవు ఇంతకంటె ప్రియ మైనదానిని మరల ఎన్నడును చెప్పజాలవు. నీకు మంచి వరము నిచ్చెదను; కోరుకొనుము.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో సప్తమసర్గ సమాప్తము.

# అథ అష్టమః సర్గః

[రామాభిషేకము కైకకు కీడు కలిగించునని మంథర పలుకుట. కైక రామగుణములను తెలిపి అభిషేకమును సమర్థించుట. మరల మంథర రామాభిషేకము భరతునకు భయజనకమని కైకను భయ పెట్టుట]

మూ. మన్థరా త్వభ్యసూయైనాముత్సృజ్యాభరణం చ తత్,
ఉవాచేదం తతో వాక్యం కోపదుఃఖసమన్వితా. 1

ప్ర. అ. మన్థరా తు = మంథర యైతే, ఏనామ్ = ఈమెను గూర్చి, అభ్యసూయ = విసుగుచెంది, కోపదుఃఖసమన్వితా = కోపదుఃఖములతో కూడినదై, తత్ = ఆ, ఆభరణమ్ = ఆభరణమును, ఉత్సృజ్య = విడచి, తతః = పిమ్మట, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మంథర కైకేయిపై విసుగు చూపుచు, కోపదుఃఖములతో కూడినదై, ఆ ఆభరణమును పరిత్యజించి, ఇట్లు పలికెను. 1

మూ. హర్షం కిమిదమస్థానే కృతవత్యసి బాలిశే,
శోకసాగరమధ్యస్థమాత్మానం నావబుధ్యసే. 2

ప్ర. అ. బాలిశే = తెలివితక్కువదానా! అస్థానే = తగని విషయమున, హర్షమ్ = సంతోషమును, కృతవతీ అసి = చేయుచున్నావు. ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి? శోకసాగరమధ్యస్థమ్ = శోకసాగరమధ్యమునం దున్న, ఆత్మానమ్ = నిన్ను గూర్చి, నావబుధ్యసే = తెలిసికొనజాలకున్నావు.

తా. మూఢురాలా! నీవు శోకసాగరమధ్యలో నున్నావను విషయము తెలియక ఏమిటిది విచారహేతు వైన విషయమున సంతోషించుచున్నావు? 2

మూ. మనసా ప్రహసామి త్వాం దేవి దుఃఖార్దితా సతీ,
యచ్ఛోచితవ్యే హృష్టాసి ప్రాప్యేదం వ్యసనం మహత్. 3

ప్ర. అ. దేవి=ఓ రాణీ! మహత్=గొప్ప దైన, ఇదమ్=ఈ, వ్యసనమ్ =వ్యసనమును, ప్రాప్య = పొంది, శోచితవ్యే = దుఃఖించదగియుండగా, యత్=ఏకారణమువలన, హృష్టా అసి=సంతసించినదాన వగుచున్నావో, అందువలన, దుఃఖార్తితా సతీ=దుఃఖముచేత పీడింపబడినదాననై, త్వామ్= నిన్ను గూర్చి, మనసా=మనస్సుచేత, ప్రహసామి=నవ్వుచున్నాను.

తా. ఓ రాణీ! ఇంతటి మహావ్యసనము కలిగి దుఃఖించదగిన సమయమున నీవు ఆనందించుచున్నావు. ఇది చూచి దుఃఖపీడితురాల నైన నేను నాలో నేనే నవ్వుకొనుచున్నాను. 3

మూ. శోచామి దుర్మతిత్వం తే కా హి ప్రాజ్ఞా ప్రహర్షయేత్,
అరేః సపత్నిపుత్రస్య వృద్ధిం మృత్యుమివాగతామ్. 4

ప్ర. అ. తే=నీయొక్క, దుర్మతిత్వమ్ = దుష్టవిషయమున బుద్ధి కలిగియుండుటను గూర్చి, శోచామి = దుఃఖించుచున్నాను. ప్రాజ్ఞా=బుద్ధి మంతురా లైన, కా=ఎవతె, అరేః=శత్రు వైన, సపత్నిపుత్రస్య = సవతి కుమారునియొక్క, వృద్ధిమ్=అభివృద్ధిని గూర్చి, ఆగతామ్=వచ్చిన, మృత్యు మివ=మృత్యువును గూర్చి వలె, ప్రహర్షయేత్=సంతసించును?

తా. నీ తెలివితక్కువదనమును గూర్చి చాల విచారించుచున్నాను. తెలివి గల ఏ ఆడదైనా శత్రు వైన సవతికుమారునికి అభివృద్ధి కలుగుచుండగా చూచి, సంతోషింతునా? ఇది మృత్యువును అభినందించుటవంటిది కాదా? 4

మూ. భరతాదేవ రామస్య రాజ్యసాధారణాద్భయమ్,
తద్విచిన్త్య విషణ్ణాస్మి భయం భీతాద్ధి జాయతే. 5

ప్ర. అ. రామస్య=రామునకు, రాజ్యసాధారణాత్=రాజ్యముపై సమానాధికార మున్న, భరతాదేవ=భరతుని నుండియే, భయమ్=భయము. తత్= ఆ విషయమును, విచిన్త్య=ఆలోచించి, విషణ్ణా=దుఃఖితురాలను, అస్మి= అయినాను. భీతాత్=భయపడినవానివలన, భయమ్=భయము, జాయతే హి= కలుగునుకదా.

తా. భరతునకు కూడ తనతో సమానముగ రాజ్యాధికార మున్నది గాన రామునకు భరతుని చూచిన భయము. ఈ విషయము నాలోచించినకొలది నాకు

దుఃఖము కలుగుచున్నది. మనలను చూచి భయపడినవానినుండియే మన కాపదలు వచ్చునుకదా? 5.

మూ. లక్ష్మణో హి మహేష్వాసో రామం సర్వాత్మనా గతః,
శత్రుఘ్నశ్చాపి భరతం కాకుత్స్థం లక్ష్మణో యథా. 6

ప్ర. అ. మహేష్వాసః = గొప్ప ధనస్సుగల, లక్ష్మణః = లక్ష్మణుడు, సర్వాత్మనా = సర్వవిధములచేతను, రామమ్ = రాముని, గతః = చేరినాడు. శత్రుఘ్నః చ అపి = శత్రుఘ్నుడు కూడ, లక్ష్మణః = లక్ష్మణుడు, కాకుత్స్థం యథా = రాముని వలె, భరతమ్ = భరతుని (చేరినాడు).

తా. మహాధనుర్ధరుడైన లక్ష్మణుడు సర్వవిధములచేతను రాముని ఆశ్రయించి ఉన్నాడు. లక్ష్మణుడు రాముని ఆశ్రయించినట్లు శత్రుఘ్నుడు భరతుని ఆశ్రయించి యున్నాడు. 6

మూ. ప్రత్యాసన్నక్రమేణాపి భరతస్యైవ భామిని,
రాజ్యక్రమో విప్రకృష్టస్తయోస్తావత్కనీయసోః. 7

ప్ర. అ. భామిని = కైకేయీ, ప్రత్యాసన్నక్రమేణాపి = పుట్టుకలో సామీప్యముచేత ఏర్పడిన క్రమమును పట్టి గూడ, రాజ్యక్రమః = రాజ్యక్రమము, భరతస్యైవ = భరతునకే. కనీయసోః = చిన్నవారైన, తయోః తావత్ = వారిద్దరికి అయితే, విప్రకృష్టః = దూరమైనది.

తా. పుట్టుకలో దగ్గరగా నుండుటను బట్టి ఏర్పడు క్రమముచేత గూడ రాముని తరువాత రాజ్యము పొందవలసినవాడు భరతుడే. లక్ష్మణశత్రుఘ్నులు చిన్నవారు గాన వారికి రాజ్యాధికారావకాశము దూరమైనది. 7

మూ. విదుషః క్షత్రచారిత్రే ప్రాజ్ఞస్య ప్రాప్తకారిణః,
భయాత్ప్రవేపే రామస్య చిన్తయన్తీ తవాత్మజమ్. 8

ప్ర. అ. విదుషః = విద్వాంసుడు, క్షత్రచారిత్రే = రాజనీతియందు, ప్రాజ్ఞస్య = సమర్థుడూ, ప్రాప్తకారిణః = ఏ సమయమునకు ఏది యుక్తమో అది చేయువాడు అయిన రామునియొక్క (వలన), భయాత్ = భయమువలన, తవ

లక్ష్మణమ్ = నీ కుమారుని గూర్చి, చిన్తయన్తీ = ఆలోచించుచున్నదానవై, ప్రవేపే=వణకుచున్నాను.

తా. రాముడు విద్వాంసుడు; రాజనీతిరతుడు; కాలము మించి పోకుండగ కార్యములను సాధించువాడు. అట్టి రామునివలన నీ కుమారునకు కలుగనున్న ఆపదను గూర్చి ఆలోచింపగా నాకు వణకు పుట్టుచున్నది. 8

మూ. సుభగా ఖలు కౌసల్యా యస్యాః పుత్రోఽభిషేక్ష్యతే,
యౌవరాజ్యేన మహతా శ్వః పుష్యేణ ద్విజోత్తమైః. 9

ప్ర. అ. యస్యాః=ఏ కౌసల్యయొక్క, పుత్రః=పుత్రుడు, శ్వః = రేపు, పుష్యేణ=పుష్యమినక్షత్రమునందు, ద్విజోత్తమైః = బ్రాహ్మణశ్రేష్ఠులచేత, మహతా = గొప్ప దైన, యౌవరాజ్యేన=యౌవరాజ్యముచేత, అభిషేక్ష్యతే = అభిషేకింపబడనున్నాడో, కౌసల్యా = అట్టి కౌసల్య, సుభగా ఖలు = మంచి భాగ్యము కలదికదా?

తా. కౌసల్య చాల అదృష్టవంతురాలు. ఆమె కుమారునకు, ద్విజోత్తములు, రేపు పుష్యమినక్షత్రమునందు గొప్ప యౌవరాజ్యాభిషేకము చేయనున్నారు. 9

మూ. ప్రాప్తాం సుమహతీం ప్రీతిం ప్రతీతాం తాం హతద్విషమ్,
ఉపస్థాస్యసి కౌసల్యాం దాసీవత్త్వం కృతాఞ్జలిః. 10

ప్ర. అ. సుమహతీమ్ = చాలగొప్ప దైన, ప్రీతిమ్ = సంతోషమును, ప్రాప్తామ్ = పొందినదీ, ప్రతీతామ్=ప్రసిద్ధిగాంచినదీ, హతద్విషమ్=నశించిన శత్రువులు గలదీ అయిన, తాం కౌసల్యామ్=ఆ కౌసల్యను, త్వమ్ = నీవు, దాసీవత్ =దాసి వలె, కృతాఞ్జలిః=చేయబడిన దోసిలి కలదానవై, ఉపస్థాస్యసి= సేవించగలవు.

తా. గొప్ప అభివృద్ధిని పొంది, శత్రువులను అణచి, ప్రసిద్ధి పొందు ఆ కౌసల్యను నీవు దాసి వలె చేతులు కట్టుకొని సేవించవలసియుండును. 10

మూ. ఏవం చేత్త్వం సహాస్మాభిస్తస్యాః ప్రేష్యా భవిష్యసి,
పుత్రశ్చ తవ రామస్య ప్రేష్యభావం గమిష్యతి. 11

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగ, త్వమ్ = నీవు, అస్మాభిః సహ = మాతో కూడ, తస్యాః = ఆమెకు, ప్రేష్యా = దాసివిగా, భవిష్యసి యది = కాబోయి నచో, తవ = నీయొక్క, పుత్రశ్చ = పుత్రుడు గూడ, రామస్య = రామునకు, ప్రేష్యభావమ్ = దాసత్వమును, గమిష్యతి = పొందగలడు.

తా. నీ వీ విధముగ మాతో కలిసి కౌసల్యకు దాసి వైనచో, నీ కుమారుడు రాముని సేవకు డగును. 11

మూ. హృష్టాః ఖలు భవిష్యన్తి రామస్య పరమాః స్త్రియః,
అప్రహృష్టా భవిష్యన్తి స్నుషాస్తే భరతక్షయే. 12

ప్ర. అ. రామస్య = రామునియొక్క, పరమాః స్త్రియః = గొప్పస్త్రీలు, హృష్టాః = సంతసించిన వారలై, భవిష్యన్తి ఖలు = కాగలరు కదా. భరతక్షయే = భరతునకు క్షీణదశ కలుగగా, తే = నీయొక్క, స్నుషాః = కోడండ్రు, అప్రహృష్టాః = ఆనందము లేనివారు, భవిష్యన్తి = కాగలరు.

తా. రాముని భార్య లందరును సంతోషింపగలరు. భరతునకు క్షీణదశ కలుగుటచే నీ కోడళ్లు సంతోషవిహీన లయ్యెదరు.

వి. ఇక్కడ "నీ కోడళ్లు" అని చెప్పి భరతునకు చాలమంది భార్య లున్నట్లు చెప్పబడినది గాన "రామస్య పరమాః స్త్రియః" అనుదానికి కూడ "రాముని భార్యలు" అనియే అర్థము చెప్పవలెను. ఇది రాముడు ఏకపత్నీవ్రతుడు అను ప్రసిద్ధికి విరుద్ధముగా ఉన్నది కదా అని ఆశంక కలుగవచ్చును. దీనికి సమాధాన మేమనగా రాజులు బహుభార్యావంతులు గాన రామభరతాదులు ఇతరక్షత్రియవంశీయుల వలెనే అనేకభార్యలను వివాహమాడగల రను ఉద్దేశ్యముతో (భవిష్యద్దృష్టితో) మంథర అట్లు పలికినది. 12

మూ. తాం దృష్ట్వా పరమప్రీతాం బ్రువన్తీం మన్థరాం తతః,
రామస్యైవ గుణాన్ దేవీ కైకేయీ ప్రశశంస హ. 13

ప్ర. అ. తతః = పిమ్మట, పరమ్ = మిక్కిలి, అప్రీతామ్ = దుఃఖితురాలై, బ్రువన్తీమ్ = ఆవిధముగ మాటలాడుచున్న, తామ్ = ఆ, మన్థరామ్ =

మంథరను, దృష్ట్వా = చూచి, కైకేయీ = కైకేయి, రామస్య గుణానేవ = రాముని గుణములనే, ప్రశశంస హ = ప్రశంసించెను.

తా. మిక్కిలి దుఃఖితురాలై ఆ విధముగ మాటలాడుచున్న మంథరను చూచి కైకేయి రాముని గుణగణములనే స్తుతింప మొదలిడెను. 13

మూ. ధర్మజ్ఞో గురుభిర్దాన్తః కృతజ్ఞః సత్యవాక్ఛుచిః,
రామో రాజ్ఞః సుతో జ్యేష్ఠో యౌవరాజ్యమతోఽర్హతి. 14

ప్ర. అ. రామః = రాముడు, ధర్మజ్ఞః = ధర్మములు తెలిసినవాడు. గురుభిః = పెద్దలచేత, దాన్తః = శిక్షితుడు. కృతజ్ఞః = కృతజ్ఞుడు. సత్యవాక్ = సత్య మైన వాక్కు కలవాడు. శుచిః = పరిశుద్ధచరిత్రుడు. రాజ్ఞః = దశరథ మహారాజు యొక్క, జ్యేష్ఠః = పెద్దవా డైన, సుతః = కుమారుడు. అతః = అందు వలన, యౌవరాజ్యమ్ = యౌవరాజ్యమును గూర్చి, అర్హతి = తగియున్నాడు.

తా. రాముడు ధర్మము లన్నియు తెలిసినవాడు. పెద్దల వలన విద్యా బుద్ధులు నేర్చినవాడు. కృతజ్ఞుడు. సత్యవచనుడు. నిర్మల మైన చరిత్ర కల వాడు. దశరథమహారాజునకు జ్యేష్ఠకుమారుడు. అందువలన అతడే యౌవ రాజ్యము పొందుటకు అర్హత ఉన్నవాడు. 14

మూ. భ్రాతౄన్భృత్యాంశ్చ దీర్ఘాయుః పితృవత్పాలయిష్యతి,
సంతప్యసే కథం కుబ్జే శ్రుత్వా రామాభిషేచనమ్. 15

ప్ర. అ. దీర్ఘాయుః = దీర్ఘాయుర్దాయవంతు డైన రాముడు, భ్రాతౄన్ = సోదరులను, భృత్యాంశ్చ = పోషింపదగినవారి నందరిని, పితృవత్ = తండ్రి వలె, పాలయిష్యతి = పాలింపగలడు, కుబ్జే = ఓ గూనుదానా! (మంథరా), రామాభిషేచనమ్ = రామాభిషేకమును, శ్రుత్వా = విని, కథమ్ = ఎట్లు, సంతప్యసే = బాధపడు చున్నావు?

తా. చిరంజీవి యైన రాముడు సోదరులను, పోష్యవర్గమునకు చెందిన వారి నందరిని, తండ్రి పాలించి నట్లు పాలింపగలడు. ఓ గూనుదానా! రామాభి షేకమును వినగా నీ మనస్సునకు బాధ ఎట్లు కలుగుచున్నది? 15

మూ. భరతశ్చాపి రామస్య ధ్రువం వర్షశతాత్పరమ్,
పితృపైతామహం రాజ్యమవాప్తా పురుషర్షభః. 16

ప్ర. అ. వర్షశతాత్=నూరుసంవత్సరములకంటె, పరమ్=అనంతరము, పురుషర్షభః=పురుషశ్రేష్ఠుడైన, భరతశ్చాపి=భరతుడు కూడ, రామస్య=రామునియొక్క, పితృపైతామహమ్=తండ్రితాతలకు సంబంధించిన, రాజ్యమ్=రాజ్యమును, అవాప్తా=పొందగలడు,

తా. నూరు సంవత్సరముల పాటు రాముడు పాలించిన తరువాత పితృపితామహ క్రమమున వచ్చుచున్న రాజ్యమును, పురుషశ్రేష్ఠుడైన భరతుడు కూడ పాలింపగలడు. 16

మూ. సా త్వమభ్యుదయే ప్రాప్తే వర్తమానే చ మన్థరే,
భవిష్యతి చ కల్యాణే కిమర్థం పరితప్యసే. 17

ప్ర. అ. మన్థరే=మంథరా, సా త్వమ్=అట్టి నీవు, అభ్యుదయే=అభ్యుదయము, ప్రాప్తే=వచ్చిన దగుచుండగా, వర్తమానే చ=జరుగుచుండగా, కల్యాణే=కల్యాణము, భవిష్యతి=జరుగ నుండగా, కిమర్థమ్ = ఎందుకు, పరితప్యసే=దుఃఖించుచున్నావు.

తా. మంథరా! మనకు అభ్యుదయము ప్రాప్తించినది. ఇంకను కొనసాగు చున్నది. భవిష్యత్తులో కూడ కల్యాణము జరుగ నున్నది. ఇట్టి పరిస్థితిలో నీవు దుఃఖించుచున్నా వెందులకు? 17

మూ. యథా మే భరతో మాన్యస్తథా భూయోఽపి రాఘవః,
కౌసల్యాతోఽతిరిక్తం చ సో హి శుశ్రూషతే హి మామ్.

ప్ర. అ. మే=నాకు, భరతః=భరతుడు, యథా=ఎట్లు, మాన్యః=బహుమానింపదగినవాడో, రాఘవః=రాముడును, తథా=అట్లే మాన్యుడు. భూయః అపి=అధికముగా కూడ (మాన్యుడు). సః=అతడు, మామ్=నన్ను, కౌసల్యాతః=కౌసల్యకంటె, అతిరిక్తమ్=అధికముగ, అనుశుశ్రూషతే హి=సేవించుచుండును కదా?

తా. నాకు భరతుడు ఎంత ప్రేమపాత్రుడో రాముడు కూడ అంతయే. వాస్తవమున రాముడు అధిక ప్రేమపాత్రుడు. అతడు కౌసల్యకంటె ఎక్కువ నన్ను సేవించుచుండును గదా? 18

మూ. రాజ్యం యది హి రామస్య భరతస్యాపి తత్తదా,
మన్యతే హి యథాత్మానం తథా భ్రాతౄంశ్చ రాఘవః.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, రాజ్యం యది = రాజ్య మైనచో, తత్ = అది, తదా = అప్పుడు, భరతస్యాపి = భరతుని రాజ్యము కూడ అగును. రాఘవః = రాముడు, ఆత్మానమ్ = తనను; యథా = ఎట్లో, భ్రాతౄంశ్చ = సోదరులను గూడ, తథా = అటులనే, మన్యతే = తలంచుచుండును కదా?

తా. రామునకు రాజ్య మున్నచో అది భరతునికి కూడ ఉన్నట్లే. రామునకు తాను, తన సోదరులు అను భేదబుద్ధియే లేదు కదా? 19.

మూ. కైకేయీవచనం శ్రుత్వా మన్థరా భృశదుఃఖితా,
దీర్ఘముష్ణం చ నిఃశ్వస్య కైకేయీమిదమబ్రవీత్. 20

ప్ర. అ. మన్థరా = మంథర, కైకేయీవచనమ్ = కైకేయి మాటలను, శ్రుత్వా = విని, భృశదుఃఖితా = చాలా దుఃఖించినదై, దీర్ఘమ్ = దీర్ఘము గాను, ఉష్ణం చ = వేడి గాను, నిఃశ్వస్య = నిట్టూర్చి, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. కైకేయి మాటలు వినిన మంథర చాల దుఃఖించుచు, దీర్ఘముగాను, వేడిగాను నిట్టూర్చి, కైకేయితో ఇట్లనెను. 20

మూ. అనర్థదర్శినీ మౌర్ఖ్యాన్నాత్మానమవబుధ్యసే,
శోకవ్యసనవిస్తీర్ణే మజ్జన్తీ దుఃఖసాగరే. 21

ప్ర. అ. శోకవ్యసనవిస్తీర్ణే = శోకములతోనూ, ఆపదలతోనూ నిండిన, దుఃఖసాగరే = దుఃఖసముద్రమునందు, మజ్జన్తీ = మునిగిపోవుచున్న నీవు, మౌర్ఖ్యాత్ = మూర్ఖత్వమువలన, అనర్థదర్శినీ = స్వప్రయోజనమును చూడజాలక, ఆత్మానమ్ = నిన్ను నీవే, నావబుధ్యసే = తెలిసికొనుటలేదు.

తా. ఒక ప్రక్క నీవు శోకముతోనూ ఆపదలతోనూ నిండిన దుఃఖ సముద్రములో మునిగిపోవుచున్నావు. కాని మూర్ఖత్వముచేత స్వప్రయోజనమును గుర్తింప జాలక నిన్ను నీవే తెలిసికొనలేకున్నావు. 21

మూ. భవితా రాఘవో రాజా రాఘవస్యాను యః సుతః,
రాజవంశాత్తు కైకేయి భరతః పరిహాస్యతే 22

ప్ర. అ. రాఘవః = రాముడు, రాజా = రాజుగా, భవితా = కాగలడు. రాఘవస్య అను = రాముని తరువాత, యః = ఎవడు, సుతః = ఆతని కుమారుడో, అతడు రాజు కాగలడు. కైకేయి = కైకేయీ! భరతః తు = భరతుడైతే, రాజవంశాత్ = రాజవంశమునుండియే, పరిహాస్యతే = తొలగింపబడును.

తా. కైకేయీ! ఇపుడు రాముడు రాజైనచో, ఆతని తరువాత ఆతని కుమారుడు రాజగును. ఈ విధముగ రాజవంశములో భరతుని పేరే లేకుండ పోవును. 22

మూ. న హి రాజ్ఞః సుతాః సర్వే రాజ్యే తిష్ఠన్తి భామిని,
స్థాప్యమానేషు సర్వేషు సుమహాననయో భవేత్. 23

ప్ర. అ. భామిని = కైకేయీ! రాజ్ఞః = రాజుయొక్క, సుతాః = కుమారులు. సర్వే = అందరును, రాజ్యే = రాజ్యమునందు, న తిష్ఠన్తి హి = ఉండరు కదా. సర్వేషు = అందరును, స్థాప్యమానేషు = రాజ్యమునందు స్థాపింపబడినచో, సుమహాన్ = చాల గొప్ప, అనయః = నీతి లేకుండుట, భవేత్ = అగును.

తా. కైకేయీ! ఒక రాజున కున్న కుమారు లందరును రాజ్యాభిషిక్తులు కారు. అందరినీ రాజులుగ చేసినచో నీతి చెడి గొప్ప ఉపద్రవ మేర్పడును. 23

మూ. తస్మాజ్జ్యేష్ఠే హి కైకేయి రాజ్యతన్త్రాణి పార్థివాః,
స్థాపయన్త్యనవద్యాఙ్గి గుణవత్స్వితరేష్వపి. 24

ప్ర. అ. అనవద్యాఙ్గి = దోషములు లేని అవయవములు గల, కైకేయి = ఓ కైకేయీ! తస్మాత్ = ఆ కారణమువలన, పార్థివాః = రాజులు, జ్యేష్ఠే = జ్యేష్ఠపుత్రునియందు గాని, గుణవత్సు = గుణవంతు లైన, ఇతరేష్వపి = మిగిలిన

కుమారులయందు గాని, రాజ్యతన్త్రాణి=రాజ్య వ్యవహారములను, స్థాపయన్తి=స్థాపించుచుందురు.

తా. సుందరాంగి వైన కైకేయీ! ఆ కారణముచేతనే రాజులు రాజ్యభారమును జ్యేష్ఠపుత్రునకు గాని, గుణవంతు లైన ఇతరపుత్రులకు గాని అప్ప చెప్పుచుందురు. 24

మూ. అసావత్యన్తనిర్భగ్నస్తవ పుత్రో భవిష్యతి,
అనాథవత్సుఖేభ్యశ్చ రాజవంశాచ్చ వత్సలే. 25

ప్ర. అ. వత్సలే=పుత్రవాత్సల్యవంతురాలా! తవ=నీయొక్క, అసౌ=ఈ, పుత్రః=పుత్రుడు, అనాథవత్=అనాదుడువలె, సుఖేభ్యశ్చ=సుఖములనుండియు, రాజవంశాచ్చ=రాజవంశమునుండియు. అత్యన్త నిర్భగ్నః=పూర్తిగా భంగము చెందినవాడు, భవిష్యతి=కాగలడు.

తా. పుత్రప్రేమ గల ఓ కైకేయీ! నీ కుమారుడు, అనాథుడు వలె సుఖములనుండి, రాజవంశమునుండి, పూర్తిగా దూర మైపోవును. 25

మూ. సాహం త్వదర్థే సంప్రాప్తా త్వం తు మాం నావబుధ్యసే,
సపత్నివృద్ధౌ యా మే త్వం ప్రదేయం దాతుమిచ్ఛసి.

ప్ర. అ. సా=అట్టి, అహమ్=నేను, త్వదర్థే=నీ నిమిత్తమై, సంప్రాప్తా=వచ్చితిని. త్వంతు=నీ వైతే, మామ్=నన్ను, నావబుధ్యసే=అర్థము చేసికొనుటలేదు. యా=ఏ, త్వమ్=నీవు, సపత్నివృద్ధౌ=సవతికి అభివృద్ధి కలుగగా, మే=నాకు, ప్రదేయం=పారితోషికమును. దాతుమ్=ఇచ్చుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావో

తా. నేను నీ మేలు కోరి వచ్చి యుండగా నీవు నన్నర్థము చేసికొనక సవతికి అభివృద్ధి కలిగిన సందర్భమున నాకు కానుక నీయగోరుచున్నావు! 26

మూ. ధ్రువం తు భరతం రామః ప్రాప్య రాజ్యమకణ్టకమ్,
దేశాన్తరం నాయయితా లోకాన్తరమథాపి వా. 27

ప్ర. అ. రామః = రాముడు, అకణ్టకమ్ = శత్రువులు లేని, రాజ్యమ్ = రాజ్యమును, ప్రాప్య = పొంది, భరతం = భరతుని, దేశాన్తరం వా = దేశాంతరమునకు గాని, అథాపి వా = లేక, లోకాన్తరమ్ = లోకాంతరమునకు గాని, నయితా = పంపగలడు. ధ్రువమ్ = ఇది నిశ్చితము.

తా. నిష్కంటక మైన రాజ్యము లభించిన రాముడు భరతుని దేశాంతరమున కైన పంపివేయును, లేదా చంపివేయును. 27

మూ. బాల ఏవ హి మాతుల్యం భరతో నాయిత స్త్వయా,
సన్నికర్షాచ్చ సౌహార్దం జాయతే స్థావరేష్వపి. 28

ప్ర. అ. త్వయా = నీచేత, భరతః = భరతుడు, బాలః ఏవ = బాలుడుగా ఉండగనే, మాతుల్యమ్ = మేనమామ ఇంటికి, నాయితః హి = పంపబడినాడు కదా. సన్నికర్షాత్ = దగ్గరగా ఉండుటవలన, స్థావరేష్వపి = స్థావరములయందు కూడ, సౌహార్దమ్ = స్నేహము, జాయతే = పుట్టును.

తా. నీవు భరతుని చిన్నతనమునందే మేనమామ యింటికి పంపివేసితివి. దగ్గరగా ఉన్నచో స్థావరములపై గూడ ప్రేమ కలుగును. భరతుని దూరము పంపివేసి దశరథున కాతనిపై ప్రేమ లేకుండ చేసితివి. 28

మూ. భరతస్యానువశగః శత్రుఘ్నోఽపి సమం గతః,
లక్ష్మణో హి యథా రామం తథాసౌ భరతం గతః. 29

ప్ర. అ. భరతస్య = భరతునకు, అనువశగః = అనుసరించి వశమునం దుండు, శత్రుఘ్నోఽపి = శత్రుఘ్నుడు కూడ, సమమ్ = ఆతనితో కూడ, గతః = వెళ్లినాడు. లక్ష్మణః = లక్ష్మణుడు, రామమ్ = రాముని, యథా = ఎట్లు, గతః = చేరినాడో, అసౌ = ఈ శత్రుఘ్నుడు, తథా = అట్లు, భరతమ్ = భరతుని, (చేరినాడు).

తా. భరతుని అనుసరించుచు ఆతని వశములో ఉండు శత్రుఘ్నుడు కూడ భరతునితో కలిసి వెళ్లిపోయినాడు. లక్ష్మణుడు రాము నాశ్రయించి నట్లు శత్రుఘ్నుడు భరతు నాశ్రయించి యుండువాడు కదా! శత్రుఘ్ను డైనను ఇక్కడ ఉన్నచో భరతుని అభివృద్ధికై ప్రయత్నించెడివాడు. 29

మూ. శ్రూయతే హి ద్రుమః కశ్చిచ్ఛేత్తవ్యో వనజీవిభిః,
సన్నికర్షాదిషీకాభిర్మోచితః పరమాద్భయాత్. 80

ప్ర. అ. వనజీవిభిః = వనమునందు జీవించువారిచేత, ఛేత్తవ్యః = ఛేదింప బడ దగిన, కశ్చిత్ = ఒకానొక, ద్రుమః = వృక్షము, ఇషీకాభిః = ఇషీక యను గడ్డిచేత, సన్నికర్షాత్ = సామీప్యమువలన, పరమాత్ = గొప్ప దైన, భయాత్ = భయమునుండి, మోచితః = విడిపింపబడినదిగా, శ్రూయతే హి = వినబడుచున్నది

తా. వనేచరులు ఖండింప వలసిన ఒక వృక్షమును, సామీప్యముచేత ఇషీక మొదలగు ముళ్లపొదలు కప్పివేసి దానిని రక్షించిన దని వినుచున్నాము కదా. అట్లే భరతుడు ఇచటనే ఉన్నచో సామీప్యమున కలిగిన స్నేహముచే దశరథుడే అతనిని రక్షించెడివాడు. 80

మూ. గోప్తా హి రామం సౌమిత్రిర్లక్ష్మణం చాపి రాఘవః,
అశ్వినోరివ సౌభ్రాత్రం తయోర్లోకేషు విశ్రుతమ్ 81

ప్ర. అ. సౌమిత్రిః = లక్ష్మణుడు, రామమ్ = రాముని, గోప్తా హి = రక్షింపగలడు కదా; రాఘవః = రాముడు, లక్ష్మణం చాపి = లక్ష్మణుని కూడ, రక్షింపగలడు. అశ్వినోః = అశ్వినీదేవతలయొక్క, సౌభ్రాత్రమ్ ఇవ = సోదరప్రేమ వలె, తయోః = వారిద్దరియొక్క ప్రేమ, లోకేషు = లోకములలో, విశ్రుతమ్ = ప్రసిద్ధ మైనది.

తా. లక్ష్మణుడు రాముని రక్షించుచుండును; రాముడు లక్ష్మణుని రక్షించుచుండును. అశ్వినీదేవతల కున్న భ్రాతృస్నేహమువంటి వారి భ్రాతృప్రేమ లోకప్రసిద్ధ మైనది. 81

మూ. తస్మాన్న లక్ష్మణే రామః పాపం కిఞ్చిత్కరిష్యతి,
రామస్తు భరతే పాపం కుర్యాదితి న సంశయః. 82

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, రామః = రాముడు, లక్ష్మణే = లక్ష్మణుని విషయమున, పాపమ్ = పాపకార్యమును, కిఞ్చిత్ = కొంచె మైనను,

న కరిష్యతి = చేయదు. భరతే తు = భరతుని విషయమునం దైతే, రామః = రాముడు, పాపమ్ = పాపకార్యమును, కుర్యాత్ = చేయును; ఇతి = ఈ విషయమున, సంశయః = సంశయము, న = లేదు.

తా. అందుచే రాముడు లక్ష్మణుని విషయమున చంపుట వంటి పాప కార్య మేమియు చేయడు. భరతుని విషయమున చేయు ననుటలో సందేహము లేదు. 32

మూ. తస్మాద్రాజగృహాదేవ వనం గచ్ఛతు తే సుతః,
ఏతద్ధి రోచతే మహ్యం భృశం చాపి హితం తవ. 33

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, తే సుతః = నీ కుమారుడు, రాజగృహాదేవ = రాజగృహమునుండియే, వనమ్ = వనమును గూర్చి, గచ్ఛతు = వెళ్లగాక, ఏతత్ = ఇది, మహ్యమ్ = నాకు, రోచతే హి = ఇష్ట మగుచున్నది కదా? తవాపి చ = నీకు కూడ, భృశమ్ = మిక్కిలి, హితమ్ = హిత మైనది.

తా. అందుచే నీ కుమారుడు అటు మేనమామ ఇంటినుండియే అరణ్యమునకు పోవుట మంచి దని నాకు తోచుచున్నది. ఇది నీకును హితకర మగును. 33

మూ. ఏవం తే జ్ఞాతిపక్షస్య శ్రేయశ్చైవ భవిష్యతి,
యది చేద్భరతో ధర్మాత్పిత్ర్యం రాజ్యమవాప్స్యతి. 34

ప్ర. అ. భరతః = భరతుడు, ధర్మాత్ = ధర్మమువలన, పిత్ర్యమ్ = తండ్రికి సంబంధించిన, రాజ్యమ్ = రాజ్యమును, అవాప్స్యతి యది = పొందిన దైతే, ఏవం చేత్ = ఇట్లు అయిన దైతే, తే = నీకును, జ్ఞాతిపక్షస్య చైవ = నీ బంధు పక్షమువారికిని, శ్రేయః = శ్రేయస్సు, భవిష్యతి = కాగలదు.

తా. భరతునకు ధర్మానుసారము తండ్రిగారి రాజ్యము లభించినచో, నీకును, నీ వైపు బంధువులకును శ్రేయస్సు కలుగును. 34.

మూ. స తే సుఖోచితో బాలో రామస్య సహజో రిపుః,
సమృద్ధార్థస్య నష్టార్థో జీవిష్యతి కథం వశే. 35

ప్ర. అ. తే=నీయొక్క, సః=ఆ, సుఖోచితః=సుఖములకు అలవడిన, బాలః=బాలుడైన భరతుడు, రామస్య = రామునియొక్క, సహజః రిపుః = సహజశత్రువు. నష్టార్థః=నష్ట మైన ప్రయోజనము గల అతడు, సమృద్ధార్థస్య= సమృద్ధి చెందిన ప్రయోజనము గల రామునియొక్క, వశే = వశమునందు, కథమ్=ఎట్లు, జీవిష్యతి=జీవించగలడు?

తా. సుఖము ననుభవించుటకు అలవాటుపడినవాడూ, బాలుడూ అయిన నీ కుమారుడు, దాయాదు డగుటచే, రామునకు సహజశత్రువు. తన ప్రయోజన మును సాధించుకొనుటలో విఫలు డైన ఆ భరతుడు, ప్రయోజనమును సాధించు కొని అభివృద్ధిలో నున్న రాముని వశములో ఎట్లుండగలడు? 35

మూ. అభిద్రుత మివారణ్యే సింహేన గజయూథపమ్,
ప్రచ్ఛాద్యమానం రామేణ భరతం త్రాతుమర్హసి. 36

ప్ర. అ. అరణ్యే = అరణ్యమునందు, సింహేన = సింహముచేత, అభిద్రుతమ్=తరుమబడుచున్న, గజయూథపమ్ ఇవ = ఏనుగుల గుంపు నాయకుని వలె, రామేణ=రామునిచేత, ప్రచ్ఛాద్యమానమ్=కప్పివేయబడు చున్న, భరతమ్=భరతుని, త్రాతుమ్=రక్షించుటకు, అర్హసి=తగియున్నావు.

తా. అరణ్యములో సింహము గజరాజును తరిమి ఆక్రమించి నట్లు రాముడు భరతుని ఆక్రమించుచున్నాడు. అతనిని రక్షించుకొనుము. 36

మూ. దర్పాన్నిరాకృతా పూర్వం త్వయా సౌభాగ్యవత్తయా,
రామమాతా సపత్నీ తే కథం వైరం న శాతయేత్. 37

ప్ర. అ. త్వయా=నీచేత, సౌభాగ్యవత్తయా=సౌభాగ్యము కలదాన వగుటచే(భర్తకు ఎక్కువ ఇష్టురాల వగుటచే), దర్పాత్ = గర్వమువలన, పూర్వమ్=పూర్వము,నిరాకృతా=అనాదరము చేయబడినది, తే=నీయొక్క, సపత్నీ=సవతి, అయిన, రామమాతా=రాముని తల్లి, వైరమ్ = వైరమును, కథమ్=ఎట్లు, న శాతయేత్=తీర్చుకొనకుండును?

తా. నేనే సౌభాగ్యవంతురాల నను గర్వముచే పూర్వము నీవు కౌస ల్యను అనాదరము చేసితివి. నీ సవతి యైన అట్టి కౌసల్య తన పగ తీర్చుకొన కుండునా? 37

మూ. యదా హి రామః పృథివీమవాప్స్యతి
ప్రభూతరత్నాకరశైలపత్తనామ్,
తదా గమిష్యస్యశుభం పరాభవం
సహైవ దీనా భరతేన భామిని. 38

ప్ర. అ. భామిని = కైకేయీ! రామః = రాముడు, యదా = ఎప్పుడు, ప్రభూతరత్నాకర శైలపత్తనామ్=సమృద్ధములైన రత్నములకు నిలయము లైన శైలములూ, పట్టణములూ గల, లేదా సమృద్ధము లైన సముద్రము, శైలములు పట్టణములు గల, పృథివీమ్=భూమిని, అవాప్స్యతి=పొందగలడో, తదా = అప్పుడు, భరతేన సహైవ=భరతునితో కూడ, దీనా=దీనురాలవై, అశుభమ్= అశుభ మైన, పరాభవమును, గమిష్యసి = పొందగలవు.

తా. కైకేయీ! రాము డెనాడు, విశాలము లైన సముద్రములు, పర్వతములు, పట్టణములు గల భూమికి అధిపతి యగునో అనాడే నీవూ, భరతుడునూ, దైన్యము నొంది అశుభ మైన అవమానమునకు గురి యగుదురు. 38

మూ. యదా హి రామః పృథివీమవాప్స్యతి
ధ్రువం ప్రణష్టో భరతో భవిష్యతి,
అతో హి సంచిన్తయ రాజ్యమాత్మజే
పరస్య చైవాద్య వివాసకారణమ్. 39

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టమః సర్గః.

ప్ర. అ. రామః=రాముడు, యదా హి=ఎప్పుడు, పృథివీమ్=భూమిని, అవాప్స్యతి=పొందగలడో, అప్పుడు, భరతః = భరతుడు, ధ్రువమ్=నిశ్చయముగ, ప్రణష్టః = నశించినవాడు, భవిష్యతి=కాగలడు. అతః=ఆ కారణమువలన, ఆత్మజే=నీ కుమారునకు, రాజ్యమ్=రాజ్యమునూ, అద్యైవ = ఇప్పుడే, పరస్య=శత్రు వైన రామునియొక్క, వివాసకారణమ్=ప్రవాసమునకు ఉపాయమునూ, సంచిన్తయ = ఆలోచింపుము.

తా. రామునకు రాజ్యాధిపత్యము లభించినతోడనే భరతునికి వినాశము తప్పదు. అందుచే నీ కుమారుడైన భరతునకు రాజ్యము లభించుటకూ, శత్రువైన రాముని అప్పుడే పురమునుండి వెడలగొట్టుటకూ ఉపాయ మాలోచింపుము. 39

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో అష్టమసర్గ సమాప్తము.

## అథ నవమః సర్గః

[మంథర దుర్బోధ తలకెక్కగా కైక కోపగృహమున ప్రవేశించుట.]

మూ. ఏవముక్తా తు కైకేయీ కోపేన జ్వలితాననా,
దీర్ఘముష్ణం వినిఃశ్వస్య మన్థరామిదమబ్రవీత్. 1

ప్ర. అ. ఏవమ్=ఇట్లు, ఉక్తా=పలకబడిన, కైకేయీ=కైకేయి, కోపేన=కోపముచేత, జ్వలితాననా=మండిపడుచున్న ముఖము కలదై, దీర్ఘమ్=దీర్ఘముగాను, ఉష్ణమ్ =వేడిగాను, వినిఃశ్వస్య=నిట్టూర్చి, మన్థరామ్=మంథరను గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. ఆ మాటలు వినగనే కైకేయి కోపముచే మండిపడుచున్న ముఖముతో దీర్ఘముగను, వేడిగను నిట్టూర్చి, మంథరతో నిట్లనెను. 1

మూ. అద్య రామమితః క్షిప్రం వనం ప్రస్థాపయామ్యహమ్,
యౌవరాజ్యే చ భరతం క్షిప్రమేవాభిషేచయే. 2

ప్ర. అ. అద్య=ఇప్పుడు, అహమ్ = నేను, రామమ్ = రాముని, ఇతః=ఇచటినుండి, క్షిప్రమ్=శీఘ్రముగా, వనమ్ = వనమును గూర్చి, ప్రస్థాపయామి=ప్రయాణము చేయించెదను. భరతం చ=భరతుని గూడ, క్షిప్రమేవ = శీఘ్రముగనే, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేచయామి=అభిషేకింపచేసెదను.

తా. నే నిప్పుడే రాముని శీఘ్రముగా వనమునకు పంపించెదను. భరతునికి గూడ శీఘ్రముగా యౌవరాజ్యమునందు అభిషేకము చేయించెదను. 2

మూ. ఇదం త్విదానీం సంపశ్య కేనోపాయేన మన్థరే,
భరతః ప్రాప్నుయాద్రాజ్యం న తు రామః కథంచన. 3

ప్ర. అ. మన్థరే = మంథరా! కేన ఉపాయేన = ఏ ఉపాయముచేత, భరతః = భరతుడు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రాప్నుయాత్ = పొందును; రామః తు = రాముడైతే, కథంచన = ఏ విధముగనైనను, న = పొందడు; ఇదమ్ = దీనిని, ఇదానీమ్ = ఇపుడు, సంపశ్య = చూడుము.

తా. మంథరా! భరతునకు రాజ్యము లభించుటకూ, రామునకు ఎట్టి పరిస్థితులందును లభింపకుండుటకూ ఉపాయ మేది? అది ఇపు డాలోచింపుము. 3

మూ. ఏవముక్తా తయా దేవ్యా మన్థరా పాపదర్శినీ,
రామార్థముపహింసన్తీ కైకేయీమిదమబ్రవీత్. 4

ప్ర. అ. తయా = ఆ, దేవ్యా = రాణిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడిన, పాపదర్శినీ = పాపపు ఆలోచనలు గల, మన్థరా = మంథర, రామార్థమ్ = రాముని ప్రయోజనమును, ఉపహింసన్తీ = చెడగొట్టుచున్నదై, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆమె మాటలు విని పాపపు ఆలోచనలు గల మంథర రాముని రాజ్యలాభమును చెడగొట్టుటకై, కైకతో ఇట్లు పలికెను. 4

మూ. హన్తేదానీం ప్రవక్ష్యామి కైకేయి శ్రూయతాం చ మే,
యథా తే భరతో రాజ్యం పుత్రః ప్రాప్స్యతి కేవలమ్. 5

ప్ర. అ. హన్త = చాల సంతోషము। కైకేయి = కైకేయా। కేవలమ్ = కేవలము, తే పుత్రః = నీ కుమారుడైన, భరతః = భరతుడే, యథా = ఏ విధముగా, రాజ్యమ్ = రాజ్యమును, ప్రాప్స్యతి = పొందగలడో, ప్రవక్ష్యామి = చెప్పగలను. మే = నా వాక్యము, శ్రూయతాం చ = వినబడుగాక.

తా. కైకేయా! చాల సంతోషము. రాజ్యము నీ కుమారుడైన భరతునకు మాత్రమే లభించు ఉపాయమును చెప్పెదను; వినుము. 5

మూ. కిం న స్మరసి కైకేయి స్మరన్తీ వా నిగూహసే,
యదుచ్యమానమాత్మార్థం మత్తస్త్వం శ్రోతుమిచ్ఛసి. 6

ప్ర. అ. కైకేయి = కైకేయీ! ఉచ్యమానమ్ = చెప్పబడుచున్న, ఆత్మార్థమ్ = నీ ప్రయోజనమును (నీకు లాభకర మైన ఉపాయమును), త్వమ్ = నీవు, మత్తః = నా నుండి, శ్రోతుమ్ = వినుటకు, యత్ ఇచ్ఛసి = కోరుచున్నావు కదా; న స్మరసి కిమ్ = దానిని స్మరించుటలేదా? స్మరసి = స్మరించుచున్నను, నిగూహసే వా = కప్పిపెట్టుచున్నావా?

తా. కైకేయీ! నీకు ప్రయోజనకర మైన ఉపాయమును నా నుండి వినుటకు కోరుచున్నావే-దానిని గూర్చి మరచితివా, మరువకున్నను అట్లు అభినయించుచున్నావా? 6

మూ. మయోచ్యమానం యది తే శ్రోతుం ఛన్దో విలాసిని,
శ్రూయతామభిధాస్యామి శ్రుత్వా చాపి విమృశ్యతామ్. 7

ప్ర. అ. విలాసిని = విలాసవంతురాలా! మయా = నాచే, ఉచ్యమానమ్ = చెప్పబడుచుండగా, శ్రోతుమ్ = వినుటకు, తే = నీకు, ఛన్దః యది = అభిలాష యైనచో, అభిధాస్యామి = చెప్పెదను, శ్రూయతామ్ = వినబడుగాక. శ్రుత్వా = విని, విమృశ్యతామ్ అపి చ = విమర్శ కూడ చేయబడుగాక.

తా. కైకేయీ, నా నోటినుండి వినవలె నని నీ అభిలాష యైనచో చెప్పెదను, వినుము; విని ఆలోచించుకొనుము. 7

మూ. శ్రుత్వైవం వచనం తస్యా మన్థరాయాస్తు కైకయీ,
కించిదుత్థాయ శయనాత్స్వాస్తీర్ణాదిదమబ్రవీత్. 8

ప్ర. అ. కైకయీ = కైకేయి, తస్యాః మన్థరాయాః = ఆ మంథర యొక్క, ఏవమ్ = ఇట్లు, వచనమ్ = వచనమును, శ్రుత్వైవ = వినగనే, స్వాస్తీర్ణాత్ = చక్కగా పరవబడిన, శయనాత్ = శయనమునుండి, కిఞ్చిత్ = కొంచెము, ఉత్థాయ = లేచి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. కైకేయి ఆ మంథర మాటలు వినగనే, చక్కగ పక్కవేసి యున్న శయనమునుండి కొంచెము లేచి ఇట్లు పలికెను. 8

మూ. కథయ త్వం మమోపాయం కేనోపాయేన మన్థరే,
భరతః ప్రాప్నుయాద్రాజ్యం న తు రామః కథంచన. 9

ప్ర. అ. మన్థరే = మంథరా, కేన = ఏ, ఉపాయేన = ఉపాయముచేత, భరతః = భరతుడు, రాజ్యమ్ = రాజ్యమును, ప్రాప్నుయాత్ = పొందును? రామః తు = రాముడైతే, కథంచన = ఏ విధమునను, న = పొందడు? ఉపాయమ్ = అట్టి ఉపాయమును, త్వమ్ = నీవు, మమ = నాకు, కథయ = చెప్పుము.

తా. మంథరా ! ఏ ఉపాయముచేత భరతునకే రాజ్యము లభించునో, రామున కెట్టి పరిస్థితులలో నైనను లభింపదో ఆ ఉపాయము చెప్పుము. 9

మూ. ఏవముక్తా తయా దేవ్యా మన్థరా పాపదర్శినీ,
రామార్థముపహింసన్తీ కుబ్జా వచనమబ్రవీత్. 10

ప్ర. అ. తయా దేవ్యా = ఆ రాణిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడిన, కుబ్జా = గూనుదైన, పాపదర్శినీ = పాపాలోచనచేయు, మన్థరా = మంథర, రామార్థమ్ = రాముని ప్రయోజనమును, ఉపహింసన్తీ = హింసించుచున్నదై, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. కైకేయి ఇట్లు ప్రశ్నింపగా, పాపపు ఆలోచనలు గల, కుబ్జయైన ఆ మంథర రాముని ప్రయోజనమునకు విఘాతము కలిగించుచు ఇట్లు పలికెను.

మూ. తవ దైవాసురే యుద్ధే సహరాజర్షిభిః పతిః,
అగచ్ఛత్త్వాముపాదాయ దేవరాజస్య సాహ్యకృత్. 11

దిశమాస్థాయ వై దేవి దక్షిణాం దణ్డకాన్ ప్రతి,
వైజయన్తమితి ఖ్యాతం పురం యత్ర తిమిధ్వజః. 12

ప్ర. అ. దేవి = ఓ రాణీ! తవ = నీయొక్క, పతిః = భర్త, దైవాసురే = దేవతలకూ అసురులకూ జరిగిన, యుద్ధే = యుద్ధమునందు, దేవరాజస్య = దేవేంద్రునకు, సాహ్యకృత్ = సాహాయ్యము చేయువాడై, త్వామ్ = నిన్ను, ఉపాదాయ = తీసికొని, దక్షిణాం దిశమ్ = దక్షిణదిక్కును, ఆస్థాయ = పొంది, దణ్డకాన్ ప్రతి = దండకారణ్యమును గూర్చి, వైజయన్తమ్ ఇతి = వైజయంత మని, ఖ్యాతమ్ = ప్రసిద్ధ మైనదీ, యత్ర = ఎచట, తిమిధ్వజః = తిమిధ్వజుడు నివసించెడివాడో

అభి, పురమ్ = పురమును గూర్చి, రాజర్షిభిః సహ = రాజర్షులతో కూడ, అగచ్ఛత్ = వెళ్లెను.

తా. కైకేయీ! నీ భర్త యైన దశరథుడు, పూర్వము దేవాసురయుద్ధము జరిగినపుడు ఇంద్రునకు సాహాయ్యము చేయుటకై, ఇతరరాజర్షులతో కలిసి, నిన్ను కూడ తీసికొని, దక్షిణమున, దండకారణ్యప్రాంతమునందు, తిమిధ్వజు డను అసురునకు నివాస మైన వైజయంతపురమునకు వెళ్లినారు. 11, 12

మూ. స శమ్బర ఇతి ఖ్యాతః శతమాయో మహాసురః,
దదౌ శక్రస్య సంగ్రామం దేవసఙ్ఘైరనిర్జితః. 13

ప్ర. అ. శమ్బరః ఇతి = శంబరు డని, ఖ్యాతః = ప్రసిద్ధి గాంచిన, శతమాయః = అనేకమాయలు గల, సః మహాసురః = ఆ మహాసురుడు, దేవసఙ్ఘైః = దేవతల సంఘములచే, అనిర్జితః = జయింపబడనివాడై, శక్రస్య = దేవేంద్రునకు; సంగ్రామమ్ = యుద్ధమును, దదౌ = ఇచ్చెను.

తా. బహువిధములైన మాయలు గల, శంబరు డని ప్రసిద్ధి చెందిన ఆ మహాసురుడు దేవతల నందరిని జయించి ఇంద్రునితో యుద్ధము చేసెను. 13

మూ. తస్మిన్ మహతి సంగ్రామే పురుషాన్ క్షతవిక్షతాన్,
రాత్రౌ ప్రసుప్తాన్ ఘ్నన్తి స్మ తరసాసాద్య రాక్షసాః. 14

ప్ర. అ. మహతి = గొప్పదైన, తస్మిన్ = ఆ, సంగ్రామే = యుద్ధమునందు, క్షతవిక్షతాన్ = బాణములచే కొట్టబడినవారూ, రాత్రౌ = రాత్రియందు, ప్రసుప్తాన్ = నిద్రపోవుచున్నవారూ, అయిన, పురుషాన్ = పురుషులను, రాక్షసాః = రాక్షసులు, ఆసాద్య = సమీపించి, తరసా = బలముచే, ఘ్నన్తి స్మ = చంపిరి.

తా. ఆ మహాయుద్ధమునందు, బాణములచే గాయములు తగిలినవారిని, రాత్రియందు నిద్రపోవుచున్నవారిని బలముచే ఆక్రమించి రాక్షసులు చంపిరి.

మూ. తత్రాకరోన్మహాయుద్ధం రాజా దశరథ స్తదా,
అసురైశ్చ మహాబాహుః శస్త్రైశ్చ శకలీకృతః. 15

ప్ర. అ. తదా=అప్పుడు, దశరథః రాజా = దశరథమహారాజు, తత్ర= అచట, మహాయుద్ధమ్ = మహాయుద్ధమును, అకరోత్=చేసెను. మహాబాహుః = గొప్పబాహువులు గల అతడు. అసురైః చ=రాక్షసులచేత, శస్త్రైః = ఆయుధ ములతో, శకలీకృతః చ = ముక్కముక్కలు చేయబడెను.

తా. అపుడు దశరథమహారాజు గొప్పయుద్ధము చేయగా ఆ మహాబాహు వును, ఆసురులు ఆయుధములతో దేహమంతయు ముక్కముక్కలుగ అగు నట్లు కొట్టిరి. 15

మూ. అపవాహ్య త్వయా దేవి సంగ్రామాన్నష్టచేతనః,
తత్రాపి విక్షతః శస్త్రైః పతిస్తే రక్షిత స్త్వయా. 16

ప్ర. అ. దేవి=రాణీ, నష్టచేతనః = స్మృతి తప్పిన ఆ దశరథుడు, త్వయా=నీచేత, సంగ్రామాత్=యుద్ధరంగమునుండి, అపవాహ్య=దూరముగా తీసికొని వెళ్లి, రక్షితః=రక్షింపబడెను. తత్రాపి = అక్కడ గూడ, శస్త్రైః = ఆయుధముల చేత, విక్షతః=కొట్టబడిన, తే పతిః = నీ భర్త, త్వయా=నీచేత, రక్షితః = రక్షింపబడెను.

తా. కైకేయీః స్మృతి తప్పిన నీ భర్తను, (సారథ్యము చేయుచున్న), నీవు యుద్ధరంగమునుండి తప్పించి కాపాడితివి. అక్కడ కూడ అసురులు వచ్చి ఆయుధములచే అతనిని కొట్టగా మరల రక్షించితివి. 16

మూ. తుష్టేన తేన దత్తౌ తే ద్వౌ వరౌ శుభదర్శనే,
స త్వయోక్తః పతిర్దేవి యదేచ్ఛేయం తదా వరౌ. 17
గృహ్ణీయామితి తత్తేన తథేత్యుక్తం మహాత్మనా.

ప్ర. అ. శుభదర్శనే=శుభకర మైన దర్శనము గలదానా! తుష్టేన = సంతసించిన, తేన=అతనిచేత, తే = నీకు, ద్వౌ=రెండు, వరౌ = వరములు, దత్తౌ = ఇవ్వబడినవి. దేవి=రాణీ! త్వయా=నీచేత, సః పతిః = ఆ భర్త, యదా = ఎప్పుడు, ఇచ్ఛేయమ్ = ఇచ్ఛయింతునో, తదా = అప్పుడు, వరౌ = వరములను, గృహ్ణీయామ్ ఇతి =తీసికొనెదను అని, ఉక్తః = చెప్పబడెను.

తత్ = అది, తథా ఇతి = అటులనే అగుగాక అని, తేన మహాత్మనా = ఆ మహాత్మునిచేత, ఉక్తమ్ = చెప్పబడినది.

తా. మంగళకరమైన దర్శనము గల ఓ కైకేయీ! సంతసించిన అతడు (రెండు పర్యాయములు ప్రాణరక్షణ చేసినందులకు) నీకు రెండు వరముల నిచ్చెను. అపుడు నీవు—"నా కెప్పుడు కావలెనో అప్పుడు కోరుకొనెదను" అని చెప్పితివి. ఆ మహాత్ముడు సరే అనెను. 17

మూ. అనభిజ్ఞా హ్యహం దేవి త్వయైవ కథితా పురా. 18
కథైషా తవ తు స్నేహాన్మనసా ధార్యతే మయా,
రామాభిషేకసంభారాన్నిగృహ్య వినివర్తయ. 19

ప్ర. అ. దేవి = ఓ దేవీ! అహమ్ = నేను, అనభిజ్ఞా హి = ఈ విషయమేమియు తెలియనిదానను కదా! పురా = పూర్వము, త్వయైవ = నీచేతనే, కథితా = చెప్పబడిన, ఏషా కథా = ఈ కథ, తవ = నీయొక్క, స్నేహాత్ తు = స్నేహమువలన, మయా = నాచేత, మనసా = మనస్సుచే, ధార్యతే = ధరింపబడుచున్నది. నిగృహ్య = బలాత్కారము చేసి, రామాభిషేకసంభారాన్ = రాముని అభిషేకసంభారములను, వినివర్తయ = నిలుపుము.

తా. దేవీ! అచట ఏమి జరిగినదో నా కేమియు తెలియదు గదా! నీవే పూర్వ మీ కథను నాకు చెప్పితివి. నీపై నున్న ప్రేమచే నేను మరవకుండ స్మరించుచున్నాను. అందుచే నీవు బలాత్కారము చేసి, రాముని అభిషేకమునకై చేసిన సంభారములను నిలిపివేయుము. 18, 19

మూ. తౌ వరౌ యాచ భర్తారం భరతస్యాభిషేచనమ్,
ప్రవ్రాజనం తు రామస్య త్వం వర్షాణి చతుర్దశ. 20

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, అభిషేచనమ్ = అభిషేచనమును, చతుర్దశ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములను, రామస్య = రామునియొక్క, ప్రవ్రాజనమ్ = సుదూరదేశమునకు పంపివేయుటను, తౌ = ఆ, వరౌ = వరములను, త్వమ్ = నీవు, భర్తారమ్ = భర్తను, యాచ = యాచింపుము.

తా. భరతునికై యౌవరాజ్యపట్టాభిషేకమును, పదునాలుగు సంవత్సరముల పాటు రామునకు సుదూరదేశవాసమును, రెండు వరములుగా భర్తను అడుగుము. 20

మూ. చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్,
ప్రజాభావగతస్నేహః స్థిరః పుత్రో భవిష్యతి. 21

ప్ర. అ. రామే = రాముడు, చతుర్దశ వర్షాణి పదునాలుగు సంవత్సరములపాటు, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రాజితే = పంపివేయబడగా, పుత్రః = నీ కుమారుడు, ప్రజాభావగతస్నేహః = ప్రజల హృదయములందు పొందబడిన స్నేహము కలవాడై, స్థిరః భవిష్యతి = స్థిరుడు కాగలడు.

తా. రాముని పదునాలుగు సంవత్సరములపాటు వనమునకు పంపివేసినచో నీ కుమారుడైన భరతుడు ప్రజల హృదయములలో ప్రేమభావమును సంపాదించుకొని రాజ్యమునందు స్థిరుడై పోవును. 21

మూ. క్రోధాగారం ప్రవిశ్యాద్య క్రుద్ధేవాశ్వపతేః సుతే,
శేష్వానన్తర్హితాయాం త్వం భూమౌ మలినవాసినీ. 22

ప్ర. అ. అశ్వపతేః = అశ్వపతియొక్క, సుతే = కుమార్తె వైన కైకేయీ! అద్య = ఇపుడు, క్రుద్ధేవ = కోపించినదానవు వలె, క్రోధాగారమ్ = కోపగృహమును, ప్రవిశ్య = ప్రవేశించి, మలినవాసినీ = మలినవస్త్రములు ధరించినదానవై, అనన్తర్హితాయామ్ = (వస్త్రాదులచే) అచ్ఛాదింపబడని, భూమౌ = భూమిపీఠ, శేష్వ = శయనించుము.

తా. కైకేయీ! ఇప్పుడు కోపించినదానవు వలె మలినవస్త్రములు ధరించి, కోపగృహమును ప్రవేశించి, కటికనేలపై పండుకొనుము. 22

మూ. మాస్మైనం ప్రత్యుదీక్షేథా మా చైన మభిభాషథాః,
రుదన్తీ చాపి తం దృష్ట్వా జగత్యాం శోకలాలసా. 23

ప్ర. అ. తమ్ = ఆ దశరథుని, దృష్ట్వా = చూచి, శోకలాలసా = దుఃఖసక్తురాలవై, రుదన్తీ = ఏడ్చుచు, ఏనమ్ = ఈతనిని, మా స్మ ప్రత్యుదీక్షేథాః = ఎదురుగా పోయి చూడకుము, ఏనమ్ = ఇతనిని, మా చైవ అభిభాషథాః = ఎదురుగా వెళ్ళి మాట లాడకుము.

తా. దశరథుని చూడగనే దుఃఖించుచు, నేలపై బడి ఏడ్చుచు, ఆతని వైపు చూడకుము; ఆతనితో మాటలాడకుము. 23

మూ. దయితా త్వం సదా భర్తురత్ర మే నాస్తి సంశయః,
త్వత్కృతే స మహారాజో విశేదపి హుతాశనమ్. 24

ప్ర. అ. త్వమ్ = నీవు, సదా = ఎల్లప్పుడును, భర్తుః = భర్తకు, దయితా = ప్రియురాలవు. అత్ర = ఈ విషయమున, మే = నాకు, సంశయః = సంశయము, నాస్తి = లేదు. త్వత్కృతే = నీ నిమిత్తమై, సః మహారాజః = ఆ మహారాజు, హుతాశనమ్ = అగ్నిని, విశేదపి = ప్రవేశించుట కూడా.

తా. నీవు ఎల్లప్పుడును భర్తకు ప్రియురాలవే. ఈ విషయమున నాకు సందేహము లేదు. దశరథమహారాజు నీ కొరకై అగ్నిలో దూక దూక గలడు. 24

మూ. న త్వాం క్రోధయితుం శక్తో న క్రుద్ధాం ప్రత్యుదీక్షితుమ్,
తవ ప్రియార్థం రాజా హి ప్రాణానపి పరిత్యజేత్. 25

ప్ర. అ. రాజా = రాజు, త్వామ్ = నిన్ను, క్రోధయితుమ్ = కోపింప చేయుటకు, న శక్తః = సమర్థుడు కాడు. క్రుద్ధామ్ = కోపించిన నిన్ను, ప్రత్యుదీక్షితుమ్ = చూచుటకు, న = సమర్థుడు కాడు. తవ = నీయొక్క, ప్రియార్థమ్ = ప్రియముకొరకై, ప్రాణానపి = ప్రాణములను కూడ, పరిత్యజేత్ హి = విడచును గదా.

తా. రాజు నీకు ఎక్కుడ కోపము కలుగునోయని భయపడుచుండును. కోపించినచో నిన్ను చూడజాలడు. నీకు ప్రియ మాచరించుటకై ప్రాణములను కూడ పరిత్యజించును. 25

మూ. న హ్యతిక్రమితుం శక్తస్తవ వాక్యం మహీపతిః,
మన్దస్వభావే బుధ్యస్వ సౌభాగ్యబలమాత్మనః. 26

ప్ర. అ. మహీపతిః = రాజు. తవ = నీయొక్క, వాక్యమ్ = మాటను, అతిక్రమితుమ్ = అతిక్రమించుటకు, న శక్తః హి = సమర్థుడు కాడు గదా.

మన్దస్వభావే=మంద మైన స్వభావము కలదానా! ఆత్మనః = నీ యొక్క సౌభాగ్యబలమ్ = సౌభాగ్యముయొక్క బలమును, బుధ్యస్వ = తెలిసికొనుము.

తా. రాజు ఎన్నడును నీమాట జవదాటజాలడు. తెలివితక్కువదానా! నీ సౌభాగ్యబల మెంతటిదో తెలిసికొనుము. 26

మూ. మణిముక్తం సువర్ణాని రత్నాని వివిధాని చ,
దద్యాద్దశరథో రాజా మా స్మ తేషు మనః కృథాః. 27

ప్ర. అ. దశరథః రాజా = దశరథమహారాజు, మణిముక్తమ్ = మణులను, ముత్యాలను, సువర్ణాని = బంగారమును, వివిధాని = అనేక విధము లైన, రత్నాని చ = రత్నములను, దద్యాత్ = ఇవ్వవచ్చును. తేషు = వాటి యందు, మనః = మనస్సును, మా కృథాః = ఉంచకుము.

తా. దశరథమహారాజు నీకు మణులు, ముత్యాలు, బంగారము, వివిధ రత్నాలు ఇవ్వవచ్చును. వాటిపై మాత్రము మనస్సు నుంచకుము. వాటిని తీసికొని సంతృప్తి చెందకుము. 27

మూ. యౌ తౌ దైవాసురే యుద్ధే వరౌ దశరథోఽదదాత్,
తౌ స్మారయ మహాభాగే సోఽర్థో మా త్వామతిక్రమేత్. 28

ప్ర. అ. మహాభాగే = గొప్ప భాగ్యవంతురాలా! దశరథః = దశరథుడు, దైవాసురే యుద్ధే = దేవాసురయుద్ధమునందు, యౌ = ఏ, తౌ = ప్రసిద్ధము లైన, వరౌ = వరములను, అదదాత్ = ఇచ్చెనో, తౌ = వాటిని, స్మారయ = స్మరింపచేయుము. అర్థః = తలచిన ప్రయోజనము, త్వామ్ = నిన్ను, మాతిక్రమేత్ = దాటిపోకుండు గాక.

తా. మంచి అదృష్టవంతురాల వైన కైకేయీ! దశరథుడు దేవాసుర యుద్ధమునందు నీకే వరముల నిచ్చెనో వాటినే అతనికి గుర్తుచేయుము. నీ వనుకొన్న ప్రయోజనము దాటిపోకుండు నట్లు చూచుకొనుము. 28

మూ. యదా తు తే వరం దద్యాత్స్వయముత్థాప్య రాఘవః,
వ్యవస్థాప్య మహారాజం త్వమిమం వృణుయా వరమ్. 29

ప్ర. అ. రాఘవః=దశరథుడు, స్వయమ్=స్వయముగానే, ఉత్థాప్య = నిన్ను నేలపై నుండి లేవదీసి, తే=నీకు, వరమ్=వరమును, యదా=ఎప్పుడు, దద్యాత్=ఇచ్చునో, అప్పుడు, తం మహారాజమ్=ఆ మహారాజును, వ్యవస్థాప్య= కుదుటపరచి, ఇమం వరమ్=ఈ వరమును, వృణుయాః=కోరుము.

తా. దశరథుడు స్వయముగ నిన్ను నేలపైనుండి లేవదీసి నీకు కావలసినది కోరుకొమ్మని చెప్పును. అప్పుడు అతనిని కుదుటపరచి ఈ వరము కోరుము. 29

మూ. రామం ప్రవ్రాజయారణ్యే నవ వర్షాణి పఞ్చ చ,
భరతః క్రియతాం రాజా పృథివ్యాః పార్థివర్షభ. 30

ప్ర. అ. పార్థివర్షభ=మహారాజా! రామమ్ = రాముని, నవ పఞ్చ చ వర్షాణి = పదునాలుగు సంవత్సరములను, అరణ్యే = అరణ్యమునందు, ప్రవ్రాజయ=ప్రవాస ముండు నట్లు చేయుము. భరతః=భరతుడు, పృథివ్యాః= భూమికి, రాజా=రాజుగా, క్రియతామ్=చేయబడుగాక.

తా. "మహారాజా! పదునాలుగు సంవత్సరములు రాముని అరణ్యమునకు పంపివేయుము; భరతుని భూమికి రాజునుగా చేయుము" (అని వరములు కోరుము. 30

మూ. చతుర్దశ హి వర్షాణి రామే ప్రవ్రాజితే వనమ్,
రూఢశ్చ కృతమూలశ్చ శేషం స్థాస్యతి తే సుతః. 31

ప్ర. అ. రామే = రాముడు, చతుర్దశ వర్షాణి = పదునాలుగు సంవత్సరములను, వనమ్=వనమును గూర్చి, ప్రవ్రాజితే=పంపివేయబడగా, తే సుతః= నీ కుమారుడు, రూఢః చ=నిలద్రొక్కుకొన్నవాడుగాను, కృతమూలః చ = వేళ్లుబారినవాడుగానూ, శేషమ్ = మిగిలిన కాలము, స్థాస్యతి = ఉండగలడు.

తా. రాముని పదునాలుగు సంవత్సరములు అరణ్యమునకు పంపివేయగా నీ కుమారుడు వ్రేళ్లు బారుకొని, నిలద్రొక్కుకొని, మిగిలిన కాలము కూడ రాజ్యములో స్థిరముగా ఉండగలడు. 31

మూ. రామప్రవ్రాజనం చైవ దేవి యాచస్వ తం వరమ్,
ఏవం సిధ్యన్తి పుత్రస్య సర్వార్థాస్తవ భామిని. 32

ప్ర. అ. దేవి=ఓ దేవీ! రామప్రవ్రాజనం చైవ = రాముని వనమునకు పంపుటను గూడా, వరమ్=వరముగా, తమ్=అతనిని, యాచస్వ=కోరుము. భామిని=కైకేయీ! ఏవమ్ = ఈ విధముగా, తవ = నీయొక్క, పుత్రస్య = పుత్రునియొక్క, సర్వార్థాః=ప్రయోజనము లన్నియు, సిధ్యన్తి=సిద్ధించును.

తా. కైకేయీ! రాముని వనమునకు పంపుటను గూడ ఒక వరముగా దశరథుని కోరుము. ఈ విధముగ నీ పుత్రుని కార్యము లన్నీ సఫలము లగును. 32

మూ. ఏవం ప్రవ్రాజితశ్చైవ రామోఽరామో భవిష్యతి,
భరతశ్చ హతామిత్రస్తవ రాజా భవిష్యతి. 33.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగ, ప్రవ్రాజితః=వనమునకు పంపివేయబడిన, రామః = రాముడు, అరామః=రాముడు కానివాడుగా, అనగా ప్రజలను రమింపచేయజాలనివాడుగా, భవిష్యతి=కాగలడు. తవ=నీయొక్క, భరతశ్చ= భరతుడు కూడా, రాజా = రాజుగాను, హతామిత్రశ్చ = నశింపచేయబడిన శత్రువులుకలవాడుగను, భవిష్యతి=కాగలడు.

తా. ఈ విధముగా రాముని అరణ్యవాసమునకు పంపివేసినచో ఆ రాముడు, అతనిలో ఉన్న ప్రజలను ఆనందింపచేయుట అనే గుణము నశించి రాముడు కాకుండపోవును. నీ భరతుడు రాజై, శత్రువులు నశింప సుఖముగా నుండును. 33

మూ. యేన కాలేన రామశ్చ వనాత్ప్రత్యాగమిష్యతి,
తేన కాలేన పుత్రస్తే కృతమూలో భవిష్యతి. 34
సుగృహీతమనుష్యశ్చ సుహృద్భిః సార్ధమాత్మవాన్.

ప్ర. అ. యేన కాలేన=ఏ కాలముచే, రామః చ=రాముడు, వనాత్= వనము నుండి, ప్రత్యాగమిష్యతి = తిరిగిరాగలడో, తేన కాలేన=ఆ కాలముచేత,

తే = నీయొక్క, ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, పుత్రః = పుత్రుడు, సుగృహీత మనుష్యః = బాగుగా వశము చేసికొనబడిన మనుష్యులు గలవాడై, సుహృద్భిః = సార్ధమ్ = మిత్రులతో కూడ, కృతమూలః = చేయబడిన మూలముకలవాడు, భవిష్యతి = కాగలడు.

తా. రాముడు వనమునుండి తిరిగి వచ్చునటికి బుద్ధిమంతుడైన నీ కుమారుడు మిత్రులను సంపాదించుకొని, ప్రజల నందరిని వశములో నుంచుకొని శ్రేష్ఠుడన్ని స్థిరముగా నిలువగలడు. 34

మూ. ప్రాప్తకాలం ను మన్యేఽహం రాజానం వీతసాధ్వసా 35
రామాభిషేకసంకల్పాన్నిగృహ్య వినివర్తయ

ప్ర. అ. రాజానమ్ = రాజును, ప్రాప్తకాలం ను = ప్రాప్తించిన కాలము కలవాడు అని, మన్యే = తలచుచున్నాను. వీతసాధ్వసా = పోయిన భయము కలదానవై, నిగృహ్య = బలాత్కరించి, రామాభిషేకసంకల్పాత్ = రాముని అభిషేకము చేయవలె నను సంకల్పమునుండి, వినివర్తయ = మరల్పుము.

తా. రాజునకు అవసానకాలము ఆసన్న మైనదా అని నేనూహించుచున్నాను. నీ వేమాత్రము భయపడక, పట్టు పట్టి, రామాభిషేకము చేయవలెనను అతని సంకల్పమును తొలగింపుము.

వి. "ప్రాప్తకాలం తు తే మన్యే" అను పాఠమున్నది. ఆ పక్షమున "రాజానమ్ = రాజును, రామాభిషేకమునుండి మరల్పుము. తే = నీకు, ప్రాప్తకాలమ్ = సరియైన కాలము వచ్చిన కార్యమునుగా, మన్యే = తలచుచున్నాను. అనగా వరములడుగుటకు సరియైన సమయమిదే అని తలచుచున్నాను" అని అర్థము చెప్పవలెను. 35

మూ. అనర్థమర్థరూపేణ గ్రాహితా సా తత స్తయా, 36
హృష్టా ప్రతీతా కైకేయీ మన్థరామిదమబ్రవీత్.

ప్ర. అ. తయా = ఆమెచేత, అనర్థమ్ = అనర్థమును, అర్థరూపేణ = ఉత్తమ ప్రయోజనమునుగా, గ్రాహితా = గ్రహింపచేయబడిన, సా కైకేయీ =

ఆ కైకేయి, తతః=పిమ్మట, ప్రతీతా=తెలిసికొన్నదై, హృష్టా=సంతసించినదై, మన్థరామ్ = మంథరనుగూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ మంథరచే అనర్థకర మగు విషయమును లాభకర మగు నట్లు బోధింపబడిన కైకేయి, విషయమును గ్రహించి, సంతసించినదై, ఆమెతో ఇట్లనెను. 36

మూ. సా హి వాక్యేన కుబ్జాయాః కిశోరీవోత్పథం గతా,
కైకేయీ విస్మయం ప్రాప్తా పరం పరమదర్శనా. 37

ప్ర. అ. పరమదర్శనా=మంచి ఆలోచనలు గల, సా కైకేయీ = ఆ కైకేయి, కుబ్జాయాః=గూనుదానియొక్క, వాక్యేన=వాక్యముచేత, పరమ్= మిక్కిలి, విస్మయం గతా=ఆశ్చర్యము చెందినదై, కిశోరీవ=చిన్న బాలిక వలె, ఉత్పథమ్=అపమార్గమును, గతా=పొందినది.

తా. ఆ కైకేయి స్వభావముచే మంచి ఆలోచనలు కలదే యైనను, మంథరవాక్యములకు ఆశ్చర్యము చెంది, ఒక చిన్న బాలిక వలె చెడు త్రోవ తొక్కెను. 37

వి. "కిశోరి" అను దానికి "ఆడు గుఱ్ఱము" అని కొందర ర్థము వ్రాసిరి.

మూ. కుబ్జే త్వాం నాభిజానామి శ్రేష్ఠాం శ్రేష్ఠాభిధాయినీమ్,
పృథివ్యామసి కుబ్జానాముత్తమా బుద్ధినిర్ణయే. 38

ప్ర. అ. కుబ్జే=గూనిదాన వైన ఓ మంథరా, శ్రేష్ఠాభిధాయినీమ్ = శ్రేష్ఠము లైన మాటలు చెప్పుచున్న, త్వామ్=నిన్ను, శ్రేష్ఠామ్=శ్రేష్ఠురాలినిగా, నాభిజానామి=నేను గుర్తించలేదు. బుద్ధినిశ్చయే=బుద్ధినిర్ణయమునందు, పృథివ్యామ్=భూమిపై ఉన్న, కుబ్జానామ్=కుబ్జలలో, ఉత్తమా = ఉత్తమురాలవుగా, అసి=అయి ఉన్నావు.

తా. మంథరా! నీ వింత మంచి విషయములను చెప్పుచున్నావు. నీ వింతటి శ్రేష్ఠురాల వని నే నింతవరకును గుర్తింపజాలకపోతిని. బుద్ధిబలముచే కార్యములను నిశ్చయించుటలో నీవు ఈ భూమిపై నున్న కుబ్జ లందరిలోను శ్రేష్ఠురాలవు. 38

మూ. త్వమేవ తు మమార్థేషు నిత్యయుక్తా హితైషిణీ, 39
నాహం సమవబుధ్యేయం కుబ్జే రాజ్ఞశ్చికీర్షితమ్.

ప్ర. అ. కుబ్జే = ఓ మంథరా ! త్వమేవ = నీవే, మమ = నా యొక్క, అర్థేషు = కార్యములందు, నిత్యయుక్తా = ఎల్లపుడును ఆసక్తిగల, హితైషిణీ = నా హితము కోరుదానవు. అహమ్ = నేను, రాజ్ఞః = రాజుయొక్క, చికీర్షితమ్ = చేయదలచిన కార్యమును, న సమవబుధ్యేయమ్ = ఎరుగక పోయెడిదానను.

తా. మంథరా! నీవు నిత్యము నా కార్యములందు ఆసక్తి చూపు నా హితైషిణివి. నీవు చెప్పకున్నచో నాకు రాజు చేయదలచిన వంచన తెలిసి యుండెడిది కాదు. 39

మూ. సన్తి దుఃసంస్థితాః కుబ్జా వక్రాః పరమదారుణాః, 40
త్వం పద్మమివ వాతేన సన్నతా ప్రియదర్శనా.

ప్ర అ. కుబ్జాః = గూనువాళ్లు, దుఃసంస్థితాః = చెడ్డ అవయవనిర్మాణము కలవారుగాను, వక్రాః = వంకరయైన వారుగాను, పరమదారుణాః = మిక్కిలి భయంకర మైనవారుగాను, సన్తి = ఉన్నారు. సంనతా = వంగిన, త్వమ్ = నీవు, వాతేన = గాలిచేత వంగిన, పద్మమివ = పద్మము వలె, ప్రియదర్శనా = ప్రియమైన దర్శనము కలదానవు.

తా. లోకములో ఎందరో కుబ్జ లున్నారు. వారందరి అవయవనిర్మాణము చాల చెడ్డగా ఉండును. వాళ్లు వంకరగా భయంకరముగా ఉందురు. కాని నీవు గాలికి వంగిన పద్మము వలె వంగినను చూపరులకు సొగసుగా అగపడుదువు. 40

మూ. ఉరస్తేఽభినివిష్టం వై యావత్ స్కన్ధాత్సమున్నతమ్, 41
అధస్తాచ్చోదరం శాతం సునాభమివ లజ్జితమ్.

ప్ర. అ. తే ఉరః = నీ వక్షస్థలము, అభినివిష్టమ్ = బిగిసినదై, యావత్స్కన్ధాత్ = మూపువరకుంతము, సమున్నతమ్ = ఎత్తుగా ఉన్నది. అధస్తాత్ = దాని క్రింద నున్న, సునాభమ్ = మంచి నాభి గల, ఉదరం చ = ఉదరము కూడా, లజ్జితమ్ ఇవ = సిగ్గుపడినదా అన్నట్లు, శాతమ్ = సన్నగా ఉన్నది.

తా. మంచి లిగితో ఉన్న నీ వక్షఃస్థలము మూపు వరకును ఎత్తుగా నున్నది. దాని క్రింది నున్న, మంచి నాభిగల ఉదరము, వక్షస్థలమున కున్న బిగువును చూచి, అది తనకు లేనందులకు సిగ్గుపడుచున్నదా అన్నట్లు సన్నగా నున్నది. 41

మూ. పరిపూర్ణం తు జఘనం సుపీనౌ చ పయోధరౌ, 42
విమలేన్దుసమం వక్త్రమహో రాజసి మన్థరే.

ప్ర. అ. జఘనమ్ = జఘనము, పరిపూర్ణమ్ = నిండుగా నున్నది. పయోధరౌ = స్తనములు, సుపీనౌ = చక్కగా బలిసి ఉన్నవి. వక్త్రమ్ = ముఖము, విమలేన్దుసమమ్ = నిర్మల మైన చంద్రునితో సమాన మైనది. మన్థరే = మంథరా ! అహో = ఎంతగా, రాజసి = ప్రకాశించుచున్నావు !

తా. నిండుగా నున్న జఘనముతో, చక్కగా బలిసిన స్తనములతో నిర్మల మైన చంద్రునితో సమాన మైన ముఖముతో, అహా ! మంథరా ! ఎంత గొప్పగా ప్రకాశించుచున్నావు ! 42

మూ. జఘనం తవ నిర్ఘుష్టం రశనాదామశోభితమ్, 43
జఙ్ఘే భృశముపన్యస్తే పాదౌ చాప్యాయతావుభౌ.

ప్ర. అ. తవ = నీయొక్క, రశనాదామశోభితమ్ = వడ్డాణముచే ప్రకాశింప చేయబడిన, జఘనమ్ = మొల, నిర్ఘుష్టమ్ = ధ్వనిచేయుచున్నది. జఙ్ఘే = పిక్కలు, భృశమ్ = మిక్కిలి, ఉపన్యస్తే = వాటము దీరి యున్నది. ఉభౌ = రెండు, పాదౌ చ = పాదములు కూడ, ఆయతౌ = దీర్ఘ మైనవి.

తా. మంథరా ! వడ్డాణముతో అలంకరించిన నీ మొల ధ్వని చేయుచున్నది. పిక్కలు వాటము తీరి ఉన్నవి. పాదములు కూడ పొడవుగా ఉన్నవి. 43

మూ. త్వమాయతాభ్యాం సక్థిభ్యాం మన్థరే క్షౌమవాసినీ,
అగ్రతో మమ గచ్ఛన్తీ రాజహంసేవ భాససే. 44

ప్ర. అ. మన్థరే = మంథరా ! ఆయతాభ్యామ్ = పొడ వైన, సక్థిభ్యామ్ = తొడలతో, త్వమ్ = నీవు, క్షౌమవాసినీ = పట్టుచీర కట్టుకొన్నదాన వై, మమ = నా

యొక్క, అగ్రతః=ఎదట, గచ్ఛన్తీ=నడచుచు, రాజహంసీవ=ఆడు రాజహంస వలె, రాజసే=ప్రకాశించుచున్నావు.

తా. మంథరా! పొడ వైన తొడలు గల నీవు పట్టువస్త్రము ధరించి నా ముందు నడచుచుండగా రాజహంస వలె ప్రకాశించుచున్నావు. 44

మూ. ఆసన్యాః శమ్బరే మాయాః సహస్రమసురాధిపే, 45
సర్వాస్త్వయి నివిష్టాస్తా భూయశ్చాన్యాః సహస్రశః.

ప్ర. అ. అసురాధిపే=అసురుల రాజైన, శమ్బరే=శంబరునియందు, యాః=ఏ, సహస్రం మాయాః=వెయ్యి మాయలు, ఆసన్=ఉండెడివో, తాః=ఆ, సర్వాః=అన్నియును, భూయః=ఇంకను, సహస్రశః=వేలకొలది, అన్యాశ్చ=ఇతర మైన మాయలును, త్వయి=నీయందు, నివిష్టాః=చేరి యున్నవి.

తా. అసురుల ప్రభు వైన శంబరునిలో ఉన్న వేయి మాయలే కాక, ఇంకను వేలకొలది మాయలు నీలో ఉన్నవి. 45

మూ. తవేదం స్థగు యద్దీర్ఘం రథఘోణమివాయతమ్, 46
మతయః క్షత్రవిద్యాశ్చ మాయాశ్చాత్ర వసన్తి తే.

ప్ర. అ. ఆయతమ్=పొడ వైన, రథఘోణమివ=రథముయొక్క నడిమిముట్టె వలె, దీర్ఘమ్=దీర్ఘ మైన, తవ=నీయొక్క, యత్=ఏ, ఇదమ్=ఈ, స్థగు=గూను ఉన్నదో, అత్ర=దీనియందు, తే=నీయొక్క, మతయః=ఆలోచనలూ, క్షత్రవిద్యాః చ=క్షత్రియవిద్యలూ, మాయాః చ=మాయలూ, వసన్తి=ఉంటూన్నవి.

తా. పొడ వైన రథాగ్రభాగము వలె దీర్ఘ మైన నీ గూనులో, నీ ఆలోచనలు, క్షత్రియవిద్యలు, మాయలు నిక్షిప్తములై(దాచి) ఉన్నవి. 46

మూ. అత్ర తే ప్రతిమోక్ష్యామి మాలాం కుబ్జే హిరణ్మయీమ్, 47
అభిషిక్తే చ భరతే రాఘవే చ వనం గతే.

ప్ర. అ. కుబ్జే=మంథరా! రాఘవే = రాముడు, వనమ్ = వనమును గూర్చి, గతే=వెళ్లినవా డగుచుండగా, భరతే చ=భరతుడు, అభిషిక్తే=పట్టాభిషిక్తు డైనవాడగుచుండగా, అత్ర=ఈ గూనుపై, హిరణ్మయీమ్=బంగారము వికార మైన, మాలామ్=మాలను, ప్రతిమోక్ష్యామి=తొడగగలను.

తా. మంథరా! రాము డరణ్యమునకు వెళ్లి, భరతుడు రాజ్యమును పొందిన పిదప ఈ గూనుకు బంగారు మాల తొడిగి అలంకరించెదను. 47

మూ. జాత్యేన చ సువర్ణేన సువిష్టప్తేన మన్థరే, 48
లబ్ధార్థా చ ప్రతీతా చ లేపయిష్యామి తే స్థగు.

ప్ర. అ. మన్థరే=మంథరా! లబ్ధార్థా చ = పొందబడిన ప్రయోజనము కలదాననై, ప్రతీతా చ=సంతోషించినదాననై, జాత్యేన=మంచి జాతికి చెందిన, సువిష్టప్తేన=బాగుగా పుటము వేయబడిన, సువర్ణేన=బంగారముచేత, తే స్థగు=నీ గూనును, లేపయిష్యామి=పూత పెట్టించెదను.

తా. మంథరా! నే ననుకొనిన కార్యము సిద్ధించిన పిదప, సంతుష్టురాలనై, మంచి జాతికి చెందిన, బాగా పుటములు వేసిన బంగారముతో నీ గూనుకు పూత పెట్టించెదను. 48

మూ. ముఖే చ తిలకం చిత్రం జాతరూపమయం శుభమ్, 49
కారయిష్యామి తే కుబ్జే శుభాన్యాభరణాని చ.

ప్ర. అ. కుబ్జే = మంథరా! తే ముఖే = నీ ముఖమునందు, జాతరూపమయమ్=బంగారు వికార మైన, చిత్రమ్ = విచిత్ర మైన, శుభమ్ = మంగళప్రద మైన, తిలకమ్=తిలకమును, శుభాని=అంద మైన, ఆభరణాని చ=అలంకారములను, కారయిష్యామి=చేయించెదను.

తా. మంథరా! నీ నొసటపై శుభ మైన, విచిత్ర మైన బంగారు తిలకమును అంద మైన అలంకారములను చేయించెదను. 49

మూ. పరిధాయ శుభే వస్త్రే దేవతేవ చరిష్యసి. 50
చన్ద్రమాహ్వయమానేన ముఖేనాప్రతిమాననా,
గమిష్యసి గతిం ముఖ్యాం గర్వయన్తీ ద్విషజ్జనే. 51

ప్ర. అ. శుభే=శుభకరము లైన, వస్త్రే = వస్త్రములను, పరిధాయ= ధరించి, దేవతేవ = దేవత వలె, చరిష్యసి = సంచరించగలవు. చన్ద్రమ్ = చంద్రుని, ఆహ్వయమానేన = పోటికి పిలుచుచున్న, ముఖేన = ముఖముతో, అప్రతిమాననా=సాటి లేని ముఖము గల నీవు, ద్విషజ్జనే=శత్రువుల మధ్య, గర్వయన్తీ=గర్వించుచున్నదానవై, ముఖ్యామ్=ప్రధాన మైన, గతిమ్ = గతిని (స్థితిని), గమిష్యసి=పొందగలవు.

తా. మంగళకరము లైన వస్త్రములు ధరించి దేవత వలె సంచరించ గలవు. చంద్రునితో పోటీపడే సాటి లేని ముఖము గల నీవు, గర్వవంతురాలవై, నీ శత్రువుల మధ్య అత్యున్నతస్థానమును పొందగలవు. 50, 51

మూ. తవాపి కుబ్జాః కుబ్జాయాః సర్వాభరణభూషితాః,
పాదౌ పరిచరిష్యన్తి యథైవ త్వం సదా మమ. 52

ప్ర. అ. త్వమ్=నీవు, మమ=నాకు, యథైవ=ఎట్లో, అట్లే, కుబ్జాయాః= కుబ్జ వైన, తవ పాదౌ అపి = నీ పాదములను కూడ, కుబ్జాః = ఇతరు లైన కుబ్జ స్త్రీలు, సర్వాభరణభూషితాః = సమస్త మైన ఆభరణములచే అలంకరింప బడినవారై, సదా = ఎల్లప్పుడును, పరిచరిష్యన్తి = సేవింపగలరు.

తా. నీవు నాకు చేయుచున్నట్లే, సకలాలంకారభూషిత లగు కుబ్జలు నీకు కూడ సర్వదా పాదసేవ చేసెదరు. 52

మూ. ఇతి ప్రశస్యమానా సా కైకేయీమిదమబ్రవీత్,
శయానాం శయనే శుభ్రే వేద్యామగ్నిశిఖామివ. 53

ప్ర. అ. ఇతి = ఇట్లు, ప్రశస్యమానా = ప్రశంసించబడుచున్న, సా = ఆమె, వేద్యామ్ = వేదిలో ఉన్న, అగ్నిశిఖామివ =అగ్నిశిఖ వలె, శుభ్రే = శుభ్ర మైన, శయనే=శయనమునందు, శయానామ్=శయనించి యున్న, కైకేయీమ్= కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా ప్రశంసింపబడుచున్న మంథర, వేదిలో ఉన్న అగ్ని శిఖ వలె, శుభ్ర మైన శయనముపై శయనించి యున్న కైకేయితో ఇట్లనెను. 53

మూ. గతోదకే సేతుబన్ధో న కల్యాణి విధీయతే,
ఉత్తిష్ఠ కురు కల్యాణం రాజానమనుదర్శయ. 53

ప్ర. అ. కల్యాణి = మంగళప్రద యైన కైకేయీ, గతోదకే = పోయిన నీళ్లుగల ప్రదేశమునందు, సేతుబన్ధః = గట్టు కట్టుట, న విధీయతే = చేయబడదు. ఉత్తిష్ఠ = లెమ్ము. కల్యాణమ్ = మంగళకర మైన కార్యమును, కురు = చేయుము. రాజానమ్ = రాజును (నకు), అనుదర్శయ = అట్టి కార్యమును చూపుము.

తా. కైకేయీ ; నీరు పోయిన తరువాత గట్టు కట్టి ప్రయోజనము లేదు వెంటనే లేచి లాభకర మైన కార్యము చేయుటకు పూనుకొని రాజునకు తెలియ జెప్పుము; (లేదా) రాజుకు నీ ప్రభావము చూపుము. 54

మూ. తథా ప్రోత్సాహితా దేవీ గత్వా మన్థరయా సహ,
క్రోధాగారం విశాలాక్షీ సౌభాగ్యమదగర్వితా. 55

అనేకశతసాహస్రం ముక్తాహారం వరాఙ్గనా,
అవముచ్య వరార్హాణి శుభాన్యాభరణాని చ. 56

తతో హేమోపమా తత్ర కుబ్జావాక్యవశంగతా,
సంవిశ్య భూమౌ కైకేయీ మన్థరామిదమబ్రవీత్. 57

ప్ర. అ. విశాలాక్షీ = విశాల మైన నేత్రములుకలదీ, సౌభాగ్యమద గర్వితా = సౌందర్యమదముచే గర్వించినదీ, వరాఙ్గనా = శ్రేష్ఠ మైన అంగనా, దేవీ = రాణీ అయిన, కైకేయీ = కైకేయి, తథా = అట్లు, ప్రోత్సాహితా = ప్రోత్సహింపబడినదై, కుబ్జావాక్యవశంగతా = ఆ మంథర మాటలకు లొంగి పోయినదై, మన్థరయా సహ = మంథరతో కూడ, క్రోధాగారమ్ = కోప గృహమును, గత్వా = పొంది, అనేకశతసాహస్రమ్ = అనేకలక్షల విలుగ గల, ముక్తాహారమ్ = ముత్యాలహారమును, వరార్హాణి = గొప్పవిలువగల, శుభాని = శుభకర మైన, ఆభరణాని చ = అలంకారములను, అవముచ్య = తీసివేసి, తతః = అటుపిమ్మట, హేమోపమా = బంగారమువలె నున్నదై, తత్ర = అచట, భూమౌ = భూమిపై, సంవిశ్య = పండుకొని, మన్థరామ్ = మంథరను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. విశాలమైన నేత్రములు కలదీ, సౌందర్యమదముతో గర్వించినదీ, దేవి అయిన ఆ కైకేయి, మంథర ఆ విధముగా ప్రోత్సహింపగా ఆమె మాటలకు లొంగిపోయి, కొన్ని లక్షల విలువ గల ముత్యాలహారమును, అత్యధికమూల్యము గల, శుభము లైన ఇతరాలంకారములను వంటినుండి తీసివేసి, మంథరతో కూడ కోపగృహములోనికి ప్రవేశించి, బంగారు తీగ వలె అచట నేలపై పడుండి, మంథరతో ఇట్లనెను. 55, 56, 57

మూ. ఇహ వా మాం మృతాం కుబ్జే నృపాయావేదయిష్యసి,
వనం తు రాఘవే ప్రాప్తే భరతః ప్రాప్స్యతి క్షితిమ్. 58

ప్ర. అ. కుబ్జే = మంథరా, రాఘవే = రాముడు, వనం తు = వనమును, ప్రాప్తే = చేరిన వాడగుచుండగా, భరతః = భరతుడు, క్షితిమ్ = భూమిని, ప్రాప్స్యతి = పొందగలండు. వా = లేక, ఇహ = ఇచట, మామ్ = నన్ను, మృతామ్ = మరణించినదానినిగా, నృపాయ = దశరథమహారాజునకు, ఆవేదయిష్యసి = తెలుపగలవు.

తా. రాముడు వనమునకు వెళ్ళిన పిదప భరతుడు రాజ్యము పొందుట యైన జరుగవలెను; లేదా నే నిచటనే మరణించి నట్లు నీవు రాజునకు చెప్పవలెను. 58

మూ. న సువర్ణేన మే హ్యర్థో న రత్నైర్న చ భూషణైః,
ఏష మే జీవితస్యాన్తో రామో యద్యభిషిచ్యతే. 59

ప్ర. అ. సువర్ణేన = బంగారముచేత, మే = నాకు, అర్థః = ప్రయోజనము, న = లేదు. రత్నైః = రత్నములచేత, న = లేదు. భూషణైః చ = భూషణములచేత కూడ, న = లేదు. రామః = రాముడు, అభిషిచ్యతే యది = అభిషేకింపబడినట్లయితే, ఏషః = ఇదియే, మే = నాయొక్క, జీవితస్య = జీవితముయొక్క, అన్తః = అంతము.

తా. నాకు బంగారముతో గాని, రత్నములతో గాని, అలంకారములతో గాని పని లేదు. రాముడు ఏ నాడు అభిషేకింపబడునో ఆ నాడే నా జీవితమునకు అంతము. 59

మూ. అతో పునస్తాం మహిషీం మహీక్షితో
వచోభిరత్యర్థ మహాపరాక్రమైః,
ఉవాచ కుబ్జా భరతస్య మాతరం
హితం వచో రామముపేత్య చాహితమ్. 60

ప్ర. అ. అతో = అటు పిమ్మట, కుబ్జా = మంథర, అత్యర్థమహాపరాక్రమైః = చాల గొప్ప పరాక్రమము గల (చాల తీవ్ర మైన) వచోభిః = మాటలతోగూడిన, మహీక్షితః = రాజుయొక్క, మహిషీమ్ = భార్య అయిన, తామ్ = ఆ, భరతస్య మాతరమ్ = భరతుని తల్లి యైన కైకేయిని గూర్చి, హితమ్ = ఆమెకు హిత మైన, రామమ్ ఉపేత్య = రామునకు సంబంధించి, అహితమ్ = హితము కాని, వచః = వాక్యమును, పునః = మరల, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట ఆ మంథర అతితీవ్రముగా మాటలాడు చున్న భరతమాత యైన ఆ కైకేయితో, ఆమెకు హితకరమూ, రామునకు సంబంధించినంత వరకు అహితమూ అయిన వచనము పలికెను. 60

మూ. ప్రపత్స్యతే రాజ్యమిదం హి రాఘవో
యది ధ్రువం త్వం ససుతా చ తప్స్యసే,
అతో హి కల్యాణి యతస్వ తత్తథా
యథా సుతస్తే భరతోఽభిషేక్ష్యతే. 61

ప్ర. అ. రాఘవః = రాముడు, ఇదమ్ = ఈ, రాజ్యమ్ = రాజ్యమును, ప్రపత్స్యతే యది = పొందినట్లయితే, ససుతా = కుమారునితో గూడిన, త్వమ్ = నీవు, తప్స్యసే = పరితాపము చెందగలవు. ధ్రువమ్ = ఇది సత్యము. కల్యాణి = మంగళప్రదురాలా! అతః = ఆ కారణమువలన, తే సుతః = నీ కుమారు డైన, భరతః = భరతుడు, యథా = ఎట్లు, అభిషేక్ష్యతే = అభిషేకింపబడగలడో, తత్ = ఆ కార్యమును, తథా = ఆ విధముగ, యతస్వ = ప్రయత్నించుము.

తా. రాముడు రాజైనచో నీవు, నీ కుమారుడూ చాల కష్టములం పాలగుదురు. అందుచే, ఓ కల్యాణగుణవంతురాలా! నీ కుమారు డైన భరతుడు రాజ్యాభిషిక్తు డగు నట్లు ప్రయత్నింపుము. 61

మూ. తథాతివిద్ధా మహిషీ తు కుబ్జయా
సమాహతా వాగిషుభిర్ముహుర్ముహుః,
విధాయ హస్తౌ హృదయేఽతివిస్మితా
శశంస కుబ్జాం కుపితా పునః పునః. 62

ప్ర. అ. కుబ్జయా=కుబ్జచేత, ముహుర్ముహుః=మాటిమాటికిని, వాగిషుభిః=వాక్కు లనెడు బాణములచేత, తథా=అట్లు, సమాహతా=కొట్టబడినదీ, అతివిద్ధా=మిక్కిలి దుఃఖించినదీ అయిన, మహిషీ=కైకేయి, కుపితా=కోపించినదై, అతివిస్మితా=చాలా ఆశ్చర్యపడుచున్నదై, హస్తౌ=హస్తములను, హృదయే=హృదయమున, విధాయ=ఉంచి, పునః పునః=మాటిమాటికిని, కుబ్జామ్=కుబ్జను, శశంస=ప్రశంసించెను.

తా. ఆ కుబ్జ మాటిమాటికి వాగ్బాణములను ప్రయోగించి కొట్టగా మిక్కిలి దుఃఖించిన కైకేయి దానిపై కోపించి, గుండెపై చేతులు వేసికొని ఆ కుబ్జ తెలివికి ఆశ్చర్యము ప్రకటించుచు, ఆమెను అనేక విధముల ప్రశంసించెను. 62

మూ. యమస్య వా మాం విషయం గతామితో
నిశామ్య కుబ్జే ప్రతివేదయిష్యసి,
వనం గతే వా సుచిరాయ రాఘవే
సమృద్ధకామో భరతో భవిష్యతి. 63

ప్ర. అ. కుబ్జే=మంథరా! నిశామ్య=చూచి, మామ్=నన్ను, ఇతః=ఇచటినుండి, యమస్య=యమునియొక్క, విషయమ్=దేశమును, గతామ్=వెళ్లినదానినిగా, ప్రతివేదయిష్యసి వా=తెలుప నైన తెలుపగలవు. రాఘవే=రాముడు, వనమ్=వనమును గూర్చి, గతే=వెళ్లినవా డగుచుండగా, భరతః=భరతుడు, సమృద్ధకామః=సఫల మైన కోరికకలవాడుగా, భవిష్యతి వా=కా నైన కాగలడు.

తా. మంథరా! నే నిచటినుండి యమలోకమునకు పోయి నట్లు చూచి నీవు ఆ విషయమును రాజునకు తెలుప నైన తెలుపవలెను, లేదా రాముడు అరణ్యమునకు వెళ్లిన పిదప భరతుని మనోరథము సఫలము కావలెను. 63

మూ. అహం హి వై నాస్తరణాని న స్రజో
న చన్దనం నాఞ్జనపానభోజనమ్,
న కించిదిచ్ఛామి న చేహ జీవితం
న చేదితో గచ్ఛతి రాఘవో వనమ్. 64

ప్ర. అ. రాఘవః = రాముడు, ఇతః = ఇచటినుండి, వనమ్ = వనమును గూర్చి, న గచ్ఛతి చేత్ = వెళ్లనిచో, అహమ్ = నేను, ఆస్తరణాని = అస్తరణము లను, న ఇచ్ఛామి = కోరను. స్రజః = మాలికలను, న = కోరను. చన్దనమ్ = చం దనమును, న = కోరను. అఞ్జనపానభోజనమ్ = కాటుకను, పానమును భోజనమును, న = కోరను. కించిత్ = ఏమియు, న = కోరను. ఇహ = ఇచట, జీవితం చ = జీవితమును కూడ, న = కోరను.

తా. రాము డిచటినుండి అరణ్యమునకు వెళ్లనిచో నాకు అస్తరణము లతో గాని, మాలికలతో గాని, చందనముతో గాని, అంజన-పాన-భోజనాదు లతో గాని మరి దేనితో గాని, చివరకు జీవితముతో గాని పనిలేదు. 64

మూ. అథైతదుక్త్వా వచనం సుదారుణం
నిధాయ సర్వాభరణాని భామినీ,
అసంవృతామాస్తరణేన మేదినీం
తదాధిశిశ్యే పతితేవ కిన్నరీ. 65

ప్ర. అ. భామినీ = ఆ కైకేయి, సుదారుణమ్ = మిక్కిలి క్రూర మైన, ఏతత్ వచనమ్ = ఈ వచనమును, ఉక్త్వా = పలికి, అథ = పిమ్మట, సర్వాభర ణాని = సమస్త మైన అలంకారములను, నిధాయ = తీసి ఒకచో ఉంచి, పతితా = పడిన, కిన్నరీ ఇవ = కిన్నరస్త్రీ వలె, తదా = అప్పుడు, ఆస్తరణేన = అస్తరణము చేత, అసంవృతామ్ = కప్పబడని, మేదినీమ్ = భూమిని, అధిశిశ్యే = అధిష్ఠించి శయనించెను.

తా. కైకేయి ఈ విధముగ అతిదారుణ మైన వాక్యము పలికి, ఆభరణము లన్నియు తీసివేసి, అస్తరణము లేని నేలపై శయనించి, క్రింద పడిన కింనరస్త్రీ వలె, ఉండెను. 65

మూ. ఉదీర్ణసంరమ్భతమోవృతాననా
తదావముక్తోత్తమమాల్యభూషణా,
నరేన్ద్రపత్నీ విమనా బభూవ సా
తమోవృతా ద్యౌరివ మగ్నతారకా. 66

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
నవమః సర్గః,

ప్ర. అ. తదా = అప్పుడు, ఉదీర్ణసంరమ్భతమోవృతాననా = అత్యధికమైన కోప మనెడు చీకటిచే కప్పబడిన ముఖము కలదీ, అవముక్తోత్తమమాల్యభూషణా = తీసివేయబడిన అమూల్యమైన అలంకారములు కలదీ, అయిన, విమనాః = వికారముతో కూడిన మనస్సుగల, నరేన్ద్రపత్నీ = రాజభార్యయైన, సా = కైకేయి, తమోవృతా = చీకటిచే కప్పబడినదీ, మగ్నతారకా = మునిగిపోయిన (కనబడని) నక్షత్రములు కలదీ అయిన, ద్యౌరివ = ఆకాశము వలె, బభూవ = ఉండెను.

తా. అత్యధికమైన కోప మనెడు ఏకటి ముఖమును కప్పివేయగా, అలంకారము లన్నీ తీసివేసి విమనస్కురాలై యున్న ఆ కైకేయి, చీకటి ఆవరించి, నక్షత్రములు కనబడని ఆకాశము వలె నుండెను. 67

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో నవమసర్గ సమాప్తము.

## అథ దశమః సర్గః

[దశరథ మహారాజు కైకేయీభవనమునకు పోవుట, కైక కోపగృహమును ప్రవేశించుట చూచి మిక్కిలి దుఃఖితుడగుట, పలువిధములుగ ఆమె నోదార్చుట.]

మూ. విదర్శితా యదా దేవీ కుబ్జయా పాపయా భృశమ్,
తదా శేతే స్మ సా భూమౌ దిగ్ధవిద్ధేవ కిన్నరీ. 1

ప్ర. అ. సా దేవీ = ఆ కైకేయి, భృశమ్ = మిక్కిలి, పాపయా = పాపాత్మురాలైన, కుబ్జయా = కుబ్జచేత, యదా = ఎప్పుడు, విదర్శితా = విపరీత బోధ చేయబడినదో, తదా = అప్పుడు, దిగ్ధవిద్ధా = విషము పూసిన బాణముచేత కొట్టబడిన, కిన్నరీవ = కిన్నరస్త్రీ వలె, భూమౌ = భూమిపై, శేతే స్మ = శయనించెను.

తా. పాపాత్మురాలైన ఆ కుబ్జ ఈ విధముగ విపరీతబోధలు చేయగా ఆ కైకేయి, విషము పూసిన బాణముతో కొట్టిన కిన్నరస్త్రీ వలె నేలపై పరుండెను. 1

మూ. నిశ్చిత్య మనసా కృత్యం సా సమ్యగితి భామినీ,
మన్థరాయై శనైః సర్వమాచచక్షే విచక్షణా. 2

ప్ర. అ. విచక్షణా = నేర్పరియైన, సా భామినీ = ఆ స్త్రీ, ఇతి = ఈ విధముగా, సమ్యక్ = బాగుగా, మనసా = మనస్సుచేత, కృత్యమ్ = చేయదలంచిన పనిని, నిశ్చిత్య = నిశ్చయించి, సర్వమ్ = అంతను, శనైః = మెల్లగా, మన్థరాయై = మంథరకు, ఆచచక్షే = చెప్పెను.

తా. నేర్పరియైన ఆ కైకేయి, తాను చేయవలసిన పనిని చక్కగా మనస్సులో నిర్ధయించుకొని, దాని నంతను మంథరకు మెల్లగా చెప్పెను. 2

మూ. సా దీనా నిశ్చయం కృత్వా మన్థరావాక్యమోహితా,
నాగకన్యేవ నిఃశ్వస్య దీర్ఘముష్ణం చ భామినీ, 3
ముహూర్తం చిన్తయామాస మార్గమాత్మసుఖావహమ్.

ప్ర. అ. సా భామినీ = ఆ కైకేయి, మన్థరావాక్యమోహితా = మంథర మాటలచే మోహితురాలై, దీనా = దీనురాలై, నిశ్చయం కృత్వా = నిశ్చయము చేసికొని, నాగకన్యేవ = నాగకన్య వలె, దీర్ఘమ్ = దీర్ఘముగాను, ఉష్ణం చ = వేడిగాను, నిఃశ్వస్య = నిట్టూర్చి, ముహూర్తమ్ = క్షణకాలము పాటు, ఆత్మ సుఖావహమ్ = తనకు సుఖమును కలిగించు, మార్గమ్ = మార్గమును గూర్చి, చిన్తయామాస = ఆలోచించెను.

తా. మంథర మాటలు విని మోసపోయిన ఆ కైకేయి దీనురాలై, నిశ్చయము చేసుకొన్నదై, నాగకన్య వలె దీర్ఘముగను, వేడిగను నిట్టూర్చి, తనకు సుఖము కలిగించు మార్గమును గూర్చి క్షణకాల మాలోచించెను. 3

మూ. సా సుహృచ్చార్థకామా చ తం నిశమ్య సునిశ్చయమ్, 4
బభూవ పరమప్రీతా సిద్ధిం ప్రాప్యేవ మన్థరా.

ప్ర. అ. సుహృచ్చ = స్నేహితురాలూ, అర్థకామా చ = కార్యము నెరవేరుటయందు కోరికగలదీ అయిన, సా మన్థరా = ఆ మంథర, తమ్ = ఆ, సునిశ్చయమ్ = దృఢమైన నిశ్చయమును, నిశమ్య = విని, సిద్ధిమ్ = కార్యసిద్ధిని, ప్రాప్యేవ = పొందినవలె, పరమప్రీతా = చాల సంతసించినది, బభూవ = ఆయెను.

తా. కైకకు స్నేహితురాలూ, ప్రయోజనాపేక్షతో కూడినదీ అయిన ఆ మంథర కైకేయి దృఢనిర్ణయమును విని, కార్యము సఫలమైపోయినట్లు, సంతసించెను. 4

మూ. అథ సా రుషితా దేవీ సమ్యక్కృత్వా వినిశ్చయమ్, 5
సంవివేశాబలా భూమౌ నివేశ్య భృకుటిం ముఖే.

ప్ర. అ. అథ = పిమ్మట, దేవీ = రాణియైన, సా అబలా = ఆ స్త్రీ, రుషితా = కోపించినదై, సమ్యక్ = బాగుగా, వినిశ్చయమ్ = నిశ్చయమును,

కృత్వా = చేసి, ముఖే = ముఖమునందు, భ్రుకుటిమ్ = కనుబొమ్మల విరుపును, నివేశ్య = ఉంచి, భూమౌ = భూమిపై, సంవివేశ = శయనించెను.

తా. కైకేయి కుపితురాలై, దృఢనిశ్చయము చేసికొని, కనుబొమ్మలు ముడివెట్టి భూమిపై పండుకొనెను. 5

మూ. తతశ్చిత్రాణి మాల్యాని దివ్యాన్యాభరణాని చ, 6
అపవిద్ధాని కైకేయ్యా తాని భూమిం ప్రపేదిరే.

ప్ర. అ. తతః = పిమ్మట, తాని = ఆ, చిత్రాణి = చిత్ర మైన, మాల్యాని = పుష్పమాలలు, దివ్యాని = శ్రేష్ఠము లైన, ఆభరణాని = అలంకారములు, కైకేయ్యా = కైకేయిచేత, అపవిద్ధాని = విసిరివేయబడినవై, భూమిమ్ = భూమిని, ప్రపేదిరే = పొందినవి.

తా. పిమ్మట ఆమె చిత్రము లైన పుష్పమాలికలను, శ్రేష్ఠము లైన ఆభరణములను నేలపై విసిరివేసెను. 6

మూ. తయా తాన్యపవిద్ధాని మాల్యాన్యాభరణాని చ, 7
అశోభయన్త వసుధాం నక్షత్రాణి యథా నభః.

ప్ర. అ. తయా = ఆమెచేత, అపవిద్ధాని = విసిరివేయబడిన, తాని = ఆ, మాల్యాని = మాలికలు, ఆభరణాని చ = అలంకారములు, నక్షత్రాణి = నక్షత్రములు, నభః = ఆకాశమును, యథా = ఏట్లో అట్లు, వసుధామ్ = భూమిని, అశోభయన్త = ప్రకాశింపచేసినవి.

తా. ఆమె విసిరివేసిన మాలికలు, ఆభరణములు నక్షత్రములు ఆకాశమును ప్రకాశింపచేసి నట్లు భూమిని ప్రకాశింపచేసినవి. 7

మూ. క్రోధాగారే నిపతితా సా బభౌ మలినామ్బరా, 8
ఏకవేణీం దృఢం బద్ధ్వా గతసత్త్వేవ కిన్నరీ.

ప్ర. అ. ఏకవేణీమ్ = ఒకటిగా ఉన్న జడను, దృఢమ్ = దృఢముగా, బద్ధ్వా = కట్టి, క్రోధాగారే = కోపగృహమునందు, నిపతితా = పడి యున్న,

మలినామ్బరా=మలినవస్త్రములను ధరించిన, సా = ఆమె, గతసత్త్వా=పోయిన ప్రాణములు గల. కిన్నరీ ఇవ = కిన్నరస్త్రీ వలె, బభౌ = ప్రకాశించెను-(ఉండెను).

తా- ఒకటిగా ఉన్న వేణిని గట్టిగా ముడివేసి, మలినవస్త్రములను ధరించి కోపగృహములో పడి యున్న ఆ కైకేయి మరణించిన కిన్నరి వలె ఉండెను. 8

మూ. ఆజ్ఞాప్య తు మహారాజో రాఘవస్యాభిషేచనమ్, 9
ఉపస్థానమనుజ్ఞాప్య ప్రవివేశ నివేశనమ్.

ప్ర. అ. మహారాజః తు = దశరథమహారాజు కైతే, రాఘవస్య = రాముని యొక్క, అభిషేచనమ్ = అభిషేకమును, ఆజ్ఞాప్య=ఆజ్ఞాపించి, ఉపస్థానమ్= సన్నిహితులైన వారి సముదాయమును, అనుజ్ఞాప్య=అనుజ్ఞ ఇచ్చునట్లు చేసికొని, నివేశనమ్=గృహమును, ప్రవివేశ =ప్రవేశించెను.

తా. దశరథమహారాజు రాముని పట్టాభిషేకము జరుపుటకై తగు ఏర్పాట్లు చేయవలె నని ఆజ్ఞాపించి, తనకు అతిసన్నిహితులుగా ఉండు అమాత్యపురోహితాదుల అనుజ్ఞ గైకొని గృహములోనికి ప్రవేశించెను. 9

మూ. అద్య రామాభిషేకో వై ప్రసిద్ధ ఇతి జజ్ఞివాన్, 10
ప్రియార్హాం ప్రియమాఖ్యాతుం వివేశాన్తఃపురం వశీ.

ప్ర. అ. వశీ=ఇంద్రియనిగ్రహవంతుడైన లేదా అన్ని కార్యములను తన వశములో నుంచుకొను సమర్థుడైన ఆ దశరథుడు, అద్య = ఇప్పుడు, రామాభిషేకః=రాముని అభిషేకము, ప్రసిద్ధః ఇతి=అందరికిని తెలిసిపోయినది అని, జజ్ఞివాన్ = తెలుసుకున్నవాడై, ప్రియార్హామ్ = ప్రియవార్త చెప్పుటకు యోగ్యురాలైన కైకేయిని గూర్చి, ప్రియమ్ =ప్రియవార్తను, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, అన్తఃపురమ్=అంతఃపురమును, వివేశ = ప్రవేశించెను.

తా. రాజ్యపాలనకు సంబంధించిన అన్ని విషయములను తన చేతిలో ఉంచుకొనగలిగిన ఆ దశరథుడు "రామాభిషేకమును గూర్చి ఇపుడు అందరికిని తెలిసిపోయినది; ఇంక ఈమెకు చెప్ప కున్న బాగుండదు" అను ఉద్దేశ్యముతో లేదా ఈ "విషయము ఇప్పుడే బైటకు వచ్చినది. అందుచే ఈమె కింకను తెలిసి

యుండదు" అను అభిప్రాయముతో, ప్రియవార్త చెప్పదగిన కైకేయికి ఈ ప్రియ
వార్త చెప్పుటకై అంతఃపురమును ప్రవేశించెను. 10

మూ. స కైకేయ్యా గృహం శ్రేష్ఠం ప్రవివేశ మహాయశాః, 11
పాణ్డురాభ్రమివాకాశం రాహుయుక్తం నిశాకరః.

ప్ర. అ. మహాయశాః=గొప్ప కీర్తి గల, సః=అతడు, నిశాకరః= చంద్రుడు, పాణ్డురాభ్రమ్ = తెల్లని మేఘములు కలది, రాహుయుక్తమ్ = రాహువుతో కూడినది అయిన, ఆకాశమివ = ఆకాశమును వలె, శ్రేష్ఠమ్=శ్రేష్ఠమైన, కైకేయ్యాః గృహమ్=కైకేయి గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. గొప్ప కీర్తి గల ఆ దశరథుడు, కైకేయీగృహమును, చంద్రుడు, తెల్లని మేఘములు గల ఆకాశములోనికి ప్రవేశించి నట్లు ప్రవేశించెను. 11

మూ. శుకబర్హిణసంయుక్తం క్రౌఞ్చహంసరుతాయుతమ్, 12
వాదిత్రరవసంఘుష్టం కుబ్జావామనికాయుతమ్.

లతాగృహైశ్చిత్రగృహైశ్చమ్పకాశోకశోభితైః, 13
దాన్తరాజతసౌవర్ణవేదికాభిస్సమాయుతమ్,

నిత్యపుష్పఫలైర్వృక్షైర్వాపీభిశ్చోపశోభితమ్, 14
దాన్తరాజతసౌవర్ణైః సంవృతం పరమాసనైః,

వివిధైరన్నపానైశ్చ భక్ష్యైశ్చ వివిధైరపి, 15
ఉపపన్నం మహార్హైశ్చ భూషితైస్త్రిదివోపమమ్,

తత్ప్రవిశ్య మహారాజః స్వమన్తఃపురమృద్ధిమత్, 16
న దదర్శ ప్రియాం రాజా కైకేయీం శయనోత్తమే.

ప్ర. అ. శుకబర్హిణసంయుక్తమ్=చిలుకలతోను, నెమళ్లతోను కూడినది, క్రౌఞ్చహంసరుతాయుతమ్=క్రౌంచపక్షులయొక్కయు, హంసలయొక్కయు ధ్వనులతో నిండినది, వాదిత్రరవసంఘుష్టమ్ = వాద్యముల ధ్వనిచే మారుమ్రోగు

ఉన్నది, కుబ్జావామనికాయుతమ్ = గూనువాళ్లు పొట్టివాళ్లు అయిన స్త్రీలతో కూడినదీ, చమ్పకాశోకశోభితైః = చంపకవృక్షములతోను, అశోకవృక్షములతోను శోభించుచున్న, లతాగృహైః = లతాగృహములతోను, చిత్రగృహైః చ = చిత్రగృహములతోను, దాన్తరాజతసౌవర్ణవేదికాభిః = దంతముతో, వెండి బంగారములతో నిర్మించిన వేదికలతోను, సమాయుతమ్ = కూడినదీ, నిత్యపుష్పఫలైః = నిత్యము పుష్పములును ఫలములును ఉండు, వృక్షైః = వృక్షములతోను, వాపీభిః చ = దిగుడుబావులతోను, ఉపశోభితమ్ = ప్రకాశించుచున్నదీ, దాన్తరాజతసౌవర్ణైః = దంత, రజత, సువర్ణవికారము లైన, వరమాసనైః = ఉత్తమ మైన ఆసనములతో, ఉపశోభితమ్ = శోభింప చేయబడినదీ, వివిధైః = అనేక విధములైన, అన్నపానైః చ = అన్న పానములతోను, వివిధైః = అనేక విధము లైన, భక్ష్యైః చ = భక్ష్యములతోను, ఉపపన్నమ్ = కూడినదీ, భూషితైః = అలంకరింపబడి, మహార్హైః = శ్రేష్ఠ మైన స్త్రీజనములతో, త్రిదివోపమమ్ = స్వర్గము వలె నున్న, ఋద్ధిమత్ = సమృద్ధ మైన, తత్ = ఆ, స్వమ్ = తన సంబంధ మైన, అన్తఃపురమ్ = అంతఃపురమును, ప్రవిశ్య = ప్రవేశించి, మహారాజః = మహారాజైన, రాజా = దశరథుడు, శయనోత్తమే = శ్రేష్ఠ మైన శయనముపై, ప్రియామ్ = ప్రియురా లైన, కైకేయీమ్ = కైకేయిని, న దదర్శ = చూడలేదు.

తా. దశరథమహారాజు సకలైశ్వర్యసమృద్ధ మైన తన అంతఃపురములోనికి ప్రవేశించెను గాని అచట ఉత్తమ మైన శయనముపై కైకేయి మాత్రము అతనికి కనబడలేదు. ఆ అంతఃపురమునందు చిలుకలు, నెమళ్ళు పెంచబడుచుండెను. క్రౌంచహంసాదుల కూతలు వినవచ్చుచుండెను. ఆ ప్రదేశము వాద్యముల ధ్వనులతో మారుమ్రోగుచుండెను. గూని వాళ్లు, పొట్టివాళ్లు అయిన దాసీజనులు అచటచట సంచరించుచుండిరి. ఒక ప్రక్క చంపకాశోకాదివృక్షముల పొదుగా లతలతో అల్లబడిన చక్కని పొదరిండ్లుండెను. ఒకచోట చిత్రములు చిత్రించిన గృహము లుండెను. అక్కడక్కడ దంతములతోను వెండితోను బంగారముతోను నిర్మించిన చిన్న చిన్న అరుగులు ఒప్పుచుండెను. అన్ని ఋతువులందును పుష్పఫలముల నిచ్చు వృక్షములు, వాటి మధ్య దిగుడుబావులు ఉండెను. అక్కడక్కడ దంత-రజత సువర్ణనిర్మితము లైన అంద మైన ఆసనములు అమర్చబడి యుండెను. అనేకవిధము లైన అన్నములు, మద్యాది

పానీయములు, పిండివంటలు సిద్ధముచేయబడి యుండెను. చక్కగ అలంకరించు కొని యున్న ఉత్తమ మైన స్త్రీలతో ఆ అంతఃపురము స్వర్గలోకము వలె ప్రకాశించుచుండెను. 12-16

మూ. స కామబలసంయుక్తో రత్యర్థం మనుజాధిపః, 17
అపశ్యన్ దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ.

ప్ర. అ. కామబలసంయుక్తః = కామబలముతో కూడిన, సః = ఆ, మనుజాధిపః = రాజు, రత్యర్థమ్ = రతినిమిత్తమై, దయితామ్ = ప్రియురా లైన, భార్యామ్ = భార్యను, అపశ్యన్ = చూడనివాడై, విషసాద = విషణ్ణుడయ్యెను. పప్రచ్ఛ చ = అడిగెనుకూడ.

తా. కామబలముతో రతికై వచ్చిన ఆ దశరథుడు అచట ప్రియురాలైన భార్య కానరాకపోవుటచే విషణ్ణు డై అచట నున్న వారిని అడిగెను. 17.

మూ. న హి తస్య పురా దేవీ తాం వేలామత్యవర్తత, 18
న చ రాజా గృహం శూన్యం ప్రవివేశ కదాచన.

ప్ర. అ. పురా = పూర్వము, దేవీ = రాణి యైన కైకేయి, తస్య = అతని యొక్క, తాం వేలామ్ = ఆ సమయమును, న అత్యవర్తత హి = అతిక్రమింపలేదు. రాజా = రాజు, కదాచన = ఎన్నడును, శూన్యమ్ = శూన్య మైన, గృహమ్ = గృహమును, న ప్రవివేశ చ = ప్రవేశించ లేదు కూడ.

తా. పూర్వ మెన్నడును కైకేయి అతడు వచ్చు అట్టి సమయమున అచట లేకుండపోలేదు. ఆ రాజు ఎన్నడును కైకేయి లేని గృహములోనికి ప్రవేశించలేదు. 18

మూ. తతో గృహగతో రాజా కైకేయీం పర్యపృచ్ఛత, 19
యథాపురమవిజ్ఞాయ స్వార్థలిప్సుమపణ్డితామ్.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, గృహగతః = గృహమును ప్రవేశించిన, రాజా = రాజు, అపణ్డితామ్ = మూర్ఖురా లైన, కైకేయీమ్ = కైకేయిని

గూర్చి, స్వార్థలిప్సామ్=స్వార్థమును సాధింప నిశ్చ కలదానినిగా, అవిజ్ఞాయ= తెలియక, యథాపూర్వమ్ = పూర్వమునందు వలె, పర్యపృచ్ఛత = అడిగెను.

తా. పిమ్మట ఆ రాజు, మూఢురా లైన కైకేయి స్వార్థమును సాధింప కృతనిశ్చయురా లై ఉన్న దను విషయము తెలియక, ఆమెను గూర్చి పూర్వము నందు వలెనే అచట నున్న పరిచారికల నడిగెను. 19

మూ. ప్రతీహారీ త్వథోవాచ సంత్రస్తా తు కృతాఞ్జలిః, 20
దేవ దేవీ భృశం క్రుద్ధా క్రోధాగారమభిద్రుతా.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, సంత్రస్తా = భయపడిన, ప్రతీహారీ = ద్వారపాలకురాలు, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలదై, ఉవాచ = పలికెను. దేవ = మహారాజా ! దేవీ = రాణి, భృశమ్ = మిక్కిలి, క్రుద్ధా = కోపించినదై, క్రోధాగారమ్ = కోపగృహమును గూర్చి, అభిద్రుతా = పరుగెత్తినది.

తా. పిమ్మట ద్వారపాలకురాలు భయపడుచు నమస్కరించి-"మహారాజా! రాణి చాల కోపముతో కోపాగారములోనికి పరుగెత్తినది" అని చెప్పెను. 20

మూ. ప్రతీహార్యా వచః శ్రుత్వా రాజా పరమదుర్మనాః, 21
విషసాద పునర్భూయో లులితవ్యాకులేన్ద్రియః.

ప్ర. అ. పరమదుర్మనాః = మిక్కిలి దుఃఖించుచున్న మనస్సు గల, రాజా = రాజు, ప్రతీహార్యాః = ప్రతీహారియొక్క, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, లులితవ్యాకులేన్ద్రియః = చంచల మైన వ్యాకుల మైన ఇంద్రియములు కలవాడై, పునః = మరల, భూయః = అధికముగ, విషసాద = దుఃఖించెను.

తా. కైకేయి యథాపూర్వముగ కనబడనందులకే విచారగ్రస్తు డై యున్న ఆ దశరథుడు, ప్రతీహారి మాటలు వినగనే ఇంకను విషాదగ్రస్తు డయ్యెను. 21

మూ. తత్ర తాం పతితాం భూమౌ శయానామతథోచితామ్, 22
ప్రతప్త ఇవ దుఃఖేన సోఽపశ్యజ్జగతీపతిః.

ప్ర. అ. జగతీపతిః=భూమికి పతి యైన, సః=ఆ దశరథుడు, తత్ర = ఆ కోపగృహమునందు, పతితామ్ = పడి యున్నదీ, భూమౌ = భూమిపై, శయానామ్ = శయనించినదీ, అతథోచితామ్ = అట్టి పరిస్థితిలో ఉండుటకు తగనిదీ అయిన, తామ్ = ఆమెను, అపశ్యత్ = చూచెను. దుఃఖేన = దుఃఖముచేత, ప్రతప్తః ఇవ = దహింపబడినవాడు వలె అయెను.

తా. దశరథమహారాజు కోపగృహమునందు నేలపై పడి యున్న ఆ కైకేయిని చూచి దుఃఖముచే దహింపబడిన ట్లాయెను. 22

మూ. స వృద్ధస్తరుణీం భార్యాం ప్రాణేభ్యోఽపి గరీయసీమ్, 23
అపాపః పాపసఙ్కల్పాం దదర్శ ధరణీతలే,
లతామివ వినిష్కృత్తాం పతితాం దేవతామివ. 24
కిన్నరీమివ నిర్ధూతాం చ్యుతామప్సరసం యథా,
మాయామివ పరిభ్రష్టాం హరిణీమివ సంయతామ్. 25

ప్ర. అ. వృద్ధః = వృద్ధు డైన, అపాపః=పాపములు లేని, సః=అతడు, తరుణీమ్ = యువతీ, ప్రాణేభ్యోఽపి = ప్రాణములకంటె కూడ, గరీయసీమ్ = గొప్పదీ, పాపసంకల్పామ్ = పాప మైన సంకల్పము కలదీ, వినిష్కృత్తామ్ = ఛేదింపబడిన, లతామివ = లతవలె నున్నదీ, పతితామ్ = పడిపోయిన, దేవతామివ = దేవత వలె నున్నదీ, నిర్ధూతామ్ = క్రిందికి విసరబడిన, కిన్నరీమివ = కిన్నరస్త్రీ వలె నున్నదీ, చ్యుతామ్ = జారిపడిన, అప్సరసం యథా = అప్సరస వలె నున్నదీ, పరిభ్రష్టామ్ = జారి క్రింద పడిన, మాయామివ = మాయవలె నున్నదీ, సంయతామ్ = బంధింపబడిన, హరిణీమివ = ఆడులేడివలె నున్నదీ అయిన, భార్యామ్ = భార్యను, దదర్శ = చూచెను.

తా. ఎట్టి పాపమును చేయని ఆ దశరథుడు పాపసంకల్పముతో నేలపై పడియున్నదీ, ప్రాణములకంటె కూడ ప్రియురాలూ అయిన యువతి యైన ఆ భార్యను చూచెను. ఆ సమయమునం దామె పెరికి పారవేసిన లత వలె, పడిపోయిన దేవత వలె, క్రిందికి విసిరివేసిన కిన్నరస్త్రీ వలె, స్వర్గమునుండి జారి పడిన అప్సరస వలె, క్రింద పడిన మాయ వలె, బంధించిన ఆడులేడి వలె ఉండెను. 23, 24, 25,

మూ. కరేణుమివ దిగ్ధేన విద్ధాం మృగయుణా వనే,
మహాగజ ఇవారణ్యే స్నేహాత్పరిమమర్శ తామ్. 26

ప్ర. అ. వనే = వనమునందు, దిగ్ధేన = విషము పూసిన బాణముచేత, విద్ధామ్ = కొట్టబడిన, కరేణుమివ = ఆడు ఏనుగు వలె నున్న, తామ్ = ఆమెను, (అతడు) అరణ్యే = ఆ అరణ్యమునందు, మహాగజః ఇవ = మహాగజము వలె, స్నేహాత్ = స్నేహమువలన, పరిమమర్శ = స్పృశించెను.

తా. అట్టి స్థితిలో ఉన్న కైకేయిని ఆ దశరథుడు, అరణ్యములో వేటగాడు విషము పూసిన బాణములో కొట్టగా పడి యున్న ఆడ ఏనుగును మహాగజము స్పృశించి నట్లు, స్నేహపూర్వకముగా స్పృశించెను. 26

మూ. పరిమృశ్య చ పాణిభ్యామభిసంత్రస్తచేతనః,
కామీ కమలపత్రాక్షీమువాచ వనితామిదమ్. 27

ప్ర. అ. కామీ = కామపరవశుడు ఐన ఆ దశరథుడు, అభిసంత్రస్తచేతనః = భయపడిన మనస్సు కలవాడై, కమలపత్రాక్షీమ్ = కమలపత్రముల వంటి నేత్రములు గల, వనితామ్ = ఆ వనితను, పాణిభ్యామ్ = హస్తములచేత, పరిమృశ్య = స్పృశించి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. కామోద్రేకములో నున్న ఆ దశరథుడు, భయపడిన మనస్సుతో, కమలపత్రాక్షి యైన ఆ యువతిని హస్తములచే స్పృశించి ఇట్లు పలికెను. 27

మూ. న తేఽహమభిజానామి క్రోధమాత్మని సంశ్రితమ్,
దేవి కేనాభిశప్తాసి కేన వాసి విమానితా. 28
యదిదం మమ దుఃఖాయ శేషే కల్యాణి పాంసుషు.

ప్ర. అ. దేవి = రాణీ! ఆత్మని = నాయందు, సంశ్రితమ్ = (నిన్ను) ఆశ్రయించిన, తే = నీయొక్క, క్రోధమ్ = కోపమును గూర్చి, అహమ్ = నేను, న అభిజానామి = ఎరుగను. కేన = ఎవనిచేత, అభిశప్తా అసి = తిట్టబడితివి? కేన వా = ఎవనిచేత, విమానితా అసి = అవమానింపబడితివి? కల్యాణి = మంచి లక్షణములు కలదానా! పాంసుషు = పరాగములయందు, యత్ శేషే = నీవు

శయనించి యున్నావు అనునది ఏది గలదో, ఇదమ్ = ఇది, మమ = నాయొక్క, దుఃఖాయ = దుఃఖమునకు హేతు వగుచున్నది.

తా. మంగళకరము లైన లక్షణములు గల ఓ దేవీ ! నీకు నాపై కోపము వచ్చిన విషయము నాకు తెలియదు. నిన్ను ఎవరు దూషించినారు లేదా అవమానించినారు ? నీవీ విధముగ నరాగములో శయనించుట నాకు దుఃఖకరముగా నున్నది. 28

మూ. భూమౌ శేషే కిమర్థం త్వం మయి కల్యాణచేతసి,
భూతోపహతచిత్తేవ మమ చిత్తప్రమాథిసి. 29

ప్ర. అ. మయి = నేను, కల్యాణచేతసి = శుభకర మైన మనస్సు కలవాడనై యుండగా, త్వమ్ = నీవు, భూతోపహతచిత్తేవ = భూతములచే అవహింపబడిన చిత్తముకలదానవు వలె, మమ = నాయొక్క, చిత్తప్రమాథినీ = చిత్తమును క్షోభపెట్టుచున్నదానవై, కిమర్థమ్ = ఎందులకు, భూమౌ = భూమిపై, శేషే = శయనించియున్నావు ?

తా. నీకు అన్ని శుభములను చేకూర్చు నే నుండగా, భూతావిష్టురాలవు వలె, నేలపై పరుండి ఎందుచేత నా మనస్సు కష్టపెట్టుచున్నావు ? 29

మూ. సన్తి మే కుశలా వైద్యా స్త్వభితుష్టాశ్చ సర్వశః,
సుఖితాం త్వాం కరిష్యన్తి వ్యాధిమాచక్ష్వ భామిని. 30

ప్ర. అ. భామిని = కైకేయీ ! కుశలాః = నేర్పు కలవారూ, సర్వశః = అన్ని విధముల, అభిష్టుతాః చ = స్తుతింపబడినవారూ అయిన, మే = నా యొక్క, వైద్యాః = వైద్యులు, సన్తి = ఉన్నారు. త్వామ్ = నిన్ను, సుఖితామ్ = సుఖవంతురాలినిగా, కరిష్యన్తి = చేయగలరు. వ్యాధిమ్ = వ్యాధిని, ఆచక్ష్వ = చెప్పుము.

తా. మంచి నేర్పు గల పేరు మోసిన రాజవైద్యు లెందరో ఉన్నారు. వారు నీకు ఆరోగ్యము చేకూర్చగలరు. నీ రోగ మేదియో చెప్పుము. 30

మూ. కస్య వా తే ప్రియం కార్యం కేన వా విప్రియం కృతమ్,
కః ప్రియం లభతామద్య కో వా సుమహదప్రియమ్. 31

ప్ర. అ. కస్య వా = ఎవనికి, ప్రియమ్ = ప్రియము, తే = నీచేత, కార్యమ్ = చేయదగినది? కేన వా = ఎవనిచేత, విప్రియమ్ = అపకారము, కృతమ్ = చేయబడినది? కః = ఎవడు, అద్య = ఇప్పుడు, ప్రియమ్ = ప్రియమును, లభతామ్ = పొందుగాక? కో వా = ఎవడు, సుమహత్ = చాల గొప్పదైన, అప్రియమ్ = అప్రియమును, పొందుగాక?

తా. నీవు ఎవరికి ప్రియమైన కార్యము చేయవలె నని కోరుచున్నావు? నీకు ఎవరు అపకారము చేసినారు? ఇపుడు నే నెవరికి ప్రియమును చేకూర్చవలెనో, ఎవనికి గొప్ప అప్రియమును చేయవలెనో చెప్పుము. 31

మూ. మా రోదీర్మా చ కార్షీస్త్వం దేవి సంపరిశోషణమ్, 32
అవధ్యో వధ్యతాం కో వా కో వా వధ్యో విముచ్యతామ్,
దరిద్రః కో భవేదాఢ్యో ద్రవ్యవాన్వాప్యకిఞ్చనః. 33

ప్ర. అ. దేవి = దేవీ! మా రోదీః = ఏడ్వకుము. త్వమ్ = నీవు, సంపరిశోషణమ్ = శరీరశోషణమును, మా చ కార్షీః = చేయకుము. అవధ్యః = చంపదగనివాడు, కో వా = ఎవడు, వధ్యతామ్ = చంపబడుగాక? వధ్యః = చంపదగిన, కో వా = ఎవడు, విముచ్యతామ్ = విడువబడుగాక? దరిద్రః = దరిద్రుడైన, కో వా = ఎవడు, ఆఢ్యః = ఐశ్వర్యవంతుడుగా, భవేత్ = కావలెను? ద్రవ్యవాన్వాపి = ధనవంతుడైన ఎవడు, అకిఞ్చనః = ఏమియు లేనివాడుగా కావలెను?

తా. కైకేయీ! ఈ విధముగ ఏడ్చి శరీరమును శుష్కింపచేసికొనకుము. నీవు చెప్పినచో చంపదగనివానిని చంపించెదను; చంపదగినవానిని విడిపించెదను. దరిద్రుని ఐశ్వర్యవంతుని చేసెదను, ఐశ్వర్యవంతుని ఏమియు లేని దరిద్రుని చేసెదను. అట్టివా రెవరో చెప్పుము. 32, 33

మూ. అహం చైవ మదీయాశ్చ సర్వే తవ వశానుగాః,
న తే కించిదభిప్రాయం వ్యాహన్తుమహముత్సహే. 34

ప్ర. అ. అహం చైవ = నేనును, మదీయాః = నా వారైన, సర్వే చ = అందరును, తవ = నీయొక్క, వశానుగాః = వశములో నున్నవారము. తే = నీ

యొక్క, అభిప్రాయమ్ = అభిప్రాయమును, కిఞ్చిత్ = కొంచె మైనను, వ్యాహన్తుమ్=చెరగొట్టుటకు, అహమ్=నేను, న ఉత్సహే=ప్రయత్నించను.

తా. నేను, నాకు సంబంధించిన అందరును నీకు వశులమే. నీ అభిప్రాయమునకే మాత్రమును వ్యతిరేకముగ ప్రవర్తించుటకు నే నంగీకరింపను. 34

మూ. ఆత్మనో జీవితేనాపి బ్రూహి యన్మనసేచ్ఛసి,
బలమాత్మని జానన్తీ న మాం శఙ్కితుమర్హసి, 35
కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే.

ప్ర. అ. ఆత్మనః = నాయొక్క, జీవితేనాపి = జీవితముచేత నైనను, యత్=దేనిని, మనసా=మనస్సుచే, ఇచ్ఛసి=కోరుచున్నావో, బ్రూహి=చెప్పుము. ఆత్మని=నా విషయమై, బలమ్=నీ కున్న బలమును, జానన్తీ = తెలిసికొనిన నీవు, మామ్=నన్ను, శఙ్కితుమ్=శంకించుటకు, న అర్హసి=తగవు. సుకృతేనాపి=పుణ్యముచేతను కూడ, తే=నీకు, శపే=ఒట్టుపెట్టుచున్నాను. తవ=నీయొక్క, ప్రీతిమ్=ప్రీతిని, కరిష్యే=చేయగలను.

తా. నా ప్రాణముల నిచ్చి సాధించవలసిన దైనను నీ వేమి కోరుచున్నావో చెప్పుము. నీకు నాపై ఎంత అధికార మున్నదో తెలిసిన నీవు ఏమాత్రము శంకింపరాదు. నేను చేసిన పుణ్యముపై ఒట్టు పెట్టుచున్నాను; నీ కేది ఇష్టమో అది తప్పక చేసెదను. 35

మూ. యావదావర్తతే చక్రం తావతీ మే వసున్ధరా, 36
ప్రాచీనాః సిన్ధుసౌవీరాః సౌరాష్ట్రా దక్షిణాపథాః,
వఙ్గాఙ్గమగధా మత్స్యాః సమృద్ధాః కాశికోసలాః. 37

ప్ర. అ. చక్రమ్ = రథచక్రము, యావత్ = ఎంతవరకు, ఆవర్తతే = తిరుగునో, మే వసున్ధరా = నా భూమి, తావతీ= అంతవరకును ఉన్నది. ప్రాచీనాః = తూర్పుదేశములు, సిన్ధుసౌవీరాః = సింధు - సౌవీరదేశములు, సౌరాష్ట్రాః = సౌరాష్ట్రదేశము, దక్షిణాపథాః = దక్షిణదేశములు, వఙ్గాఙ్గ

మగధాః = వంగ-అంగ-మగధ దేశములు, మత్స్యాః = మత్స్యదేశము, కాశికోసలాః = కాశీ, కోసలదేశము, సమృద్ధాః = సమృద్ధ మైనవి.

తా. రథచక్ర మెంతవరకు తిరుగునో అంతవరకును భూమిపై నాకు అధికార మున్నది. తూర్పున ఉన్న దేశములు, సింధు-సౌవీర-సౌరాష్ట్ర దేశములు దక్షిణాపథమున నున్న దేశములు, వంగ-అంగ-మగధ-మత్స్య దేశములు, కాశీ, కోసల దేశములు. ఇవన్నియు సర్వసంపదలతో నిండి యున్నవి. 36, 37

మూ. తత్ర జాతం బహు ద్రవ్యం ధనధాన్య మజావికమ్,
తతో వృణీష్వ కైకేయి యద్యత్త్వం మనసేచ్ఛసి. 38

ప్ర. అ. తత్ర = అచట, ధనధాన్యమ్ = ధనధాన్యములు, అజావికమ్ = మేకలు గొఱ్ఱెలు, బహు = అధిక మైన, ద్రవ్యమ్ = ద్రవ్యము, జాతమ్ = పుట్టినది, కైకేయి = కైకేయీ! తతః = ఆ ద్రవ్యమునుండి, యద్యత్ = దేనిని దేనిని, త్వమ్ = నీవు, మనసా = మనస్సుతో, ఇచ్ఛసి = కోరుచున్నావో దానిని, వృణీష్వ = కోరుకొనుము.

తా. ధనధాన్యములూ, మేకలు, గొఱ్ఱెలు మొదలగునవీ, ఇంకను అత్యధిక మైన ద్రవ్యము ఆ దేశములలో పుట్టును. కైకేయీ! ఈ ద్రవ్యములలో నీ కేమి కావలెనో కోరుకొనుము. 38

మూ. కిమాయాసేన తే భీరు ఉత్తిష్ఠోత్తిష్ఠ శోభనే,
తత్త్వం మే బ్రూహి కైకేయి యతస్తే భయమాగతమ్,
తత్తే వ్యపనయిష్యామి నీహారమివ రశ్మివాన్.

ప్ర. అ. భీరు = భయస్వభావము కలదానా! తే = నీకు, ఆయాసేన = ఆయాసము చేత, కిమ్ = ఏమి ప్రయోజనము? శోభనే = మంగళకర మైన స్వభావము కలదానా! ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము. కైకేయి = కైకేయీ! తే = నీకు, యతః = ఎచటినుండి, భయమ్ = భయము, ఆగతమ్ = వచ్చినదో, తత్ = దానిని, త్వమ్ = నీవు, మే = నాకు, బ్రూహి = చెప్పుము. తే = నీ యొక్క, తత్ = ఆ భయకారణమును,

సూర్యుడు, నీహారమివ = పొగమంచును వలె, వ్యపనయిష్యామి = తొలగించెదను.

తా. భయస్వభావము కలదానా! ఎందుకిట్లు శ్రమపడెదవు? ఓ శోభనాంగి! లెమ్ము, లెమ్ము. కైకేయీ!. నీకు భయము కలుగుటకు కారణ మేమియో తెలుపుము. సూర్యుడు పొగమంచును తొలగించి నట్లు ఆ భయహేతువును తొలగించెదను. 39

మూ. తథోక్తా సా సమాశ్వస్తా వక్తుకామా తదప్రియమ్, 40
పరిపీడయితుం భూయో భర్తారముపచక్రమే

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
దశమః సర్గః.

ప్ర. అ. తథా = ఆ విధముగా, ఉక్తా = పలకబడిన, సా = ఆమె, సమాశ్వస్తా = ఊరడిల్లినదై, తత్ = ఆ, అప్రియమ్ = అప్రియ మైన మాటను, వక్తుకామా = చెప్పదలచినదై, భర్తారమ్ = భర్తను, భూయః = ఇంకను, పరిపీడయితుమ్ = పీడించుటకు, ఉపచక్రమే = ఉపక్రమించెను.

తా. దశరథుని మాటలు వినిన కైకేయి ఊరడిల్లి, అప్రియ మైన రామ వనవాసాదికమును చెప్ప దలచి, ఆతనిని ఇంకను మాటలచే వేధించుటకుపక్రమించెను. 40

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో దశమసర్గ సమాప్తము.

## అథ ఏకాదశః సర్గః

[కైక రాజును ప్రతిజ్ఞాబద్ధుని చేసి, మున్ను తన కొసగిన రెండు వరములు స్మరింపచేయుట. అందు మొదటివరముచే భరతునకు పట్టాభిషేకము, రెండవదానిచే రామునకు పదునాలుగేండ్లు అరణ్యవాసము కోరుట.]

మూ. తం మన్మథశరైర్విద్ధం కామవేగవశానుగమ్,
ఉవాచ పృథివీపాలం కైకేయీ దారుణం వచః. 1

ప్ర. అ. కైకేయీ = కైకేయి, మన్మథశరైః = మన్మథుని బాణములచే, విద్ధమ్ = కొట్టబడినవాడూ, కామవేగవశానుగమ్ = కామవేగమునకు లొంగిపోయిన వాడూ అయిన, తం పృథివీపాలమ్ = ఆ రాజును గూర్చి, దారుణమ్ = దారుణమైన, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మన్మథుని శరములచే కొట్టబడినవాడై కామవేగమునకు లొంగిపోయిన ఆ రాజుతో కైకేయి దారుణమైన వాక్యము పలికెను. 1

మూ. నాస్మి విప్రకృతా దేవ కేనచి న్నావమానితా,
అభిప్రాయస్తు మే కశ్చిత్త మిచ్ఛామి త్వయా కృతమ్. 2

ప్ర. అ. దేవ = మహారాజా! కేన చిత్ = ఎవనిచేతను గూడ, విప్రకృతా = పీడింపబడినదానను, నాస్మి = కాను. న అవమానితా = అవమానింపబడినదానను కూడా, కాను. తు = కాని, మే=నా యొక్క, కశ్చిత్ ఒకానొక, అభిప్రాయః = అభిప్రాయము ఉన్నది. తమ్ = దానిని, త్వయా= నీచేత, కృతం = చేయబడినదానినిగా, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. మహారాజా! నన్నెవ్వరును పీడింపలేదు; అవమానింపలేదు. కాని నా కొక అభిప్రాయమున్నది. దానిని నీవు సఫలము చేయవలెనని కోరుచున్నాను. 2

మూ. ప్రతిజ్ఞాం ప్రతిజానీష్వ యది త్వం కర్తు మిచ్ఛసి.
అథ తద్వ్యాహరిష్యామి యదభిప్రార్థితం మయా. 3

ప్ర. అ. త్వమ్ = నీవు, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛసి యది = ఇచ్ఛయించిన ట్లయితే; ప్రతిజ్ఞాం ప్రతిజానీష్వ = ప్రతిజ్ఞ చేయుము. అథ = అటుపిమ్మట, మయా = నా చేత, యత్ = ఏది, అభిప్రార్థితమ్ = కోరబడి నదో, తత్ = దానిని, వ్యాహరిష్యామి = చెప్పెదను.

తా. నీవు నా అభిలాషను నెరవేర్చుటకు అంగీకరించినచో నెరవేర్చెద నని ప్రతిజ్ఞ చేయుము. నీవు ప్రతిజ్ఞ చేసిన పిమ్మట నా కోరిక యేదియో తెలిపె దను. 3

మూ. తాముబాచ మహాతేజాః కైకేయీమీషదుత్స్మితః,
కామీ హస్తేన సంగృహ్య మూర్ధజేషు శుచిస్మితామ్. 4

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సుగల, కామీ = కాముకుడైన ఆ దశరథుడు, ఈషత్ = కొంచెము, ఉత్స్మితః = బయల్వెడలిన చిరునవ్వు గలవాడై, శుచిస్మితామ్ = తెల్లని చిరునవ్వుగల, తాం కైకేయీమ్ = ఆ కైకేయిని, మూర్ధజేషు = తలవెండ్రుకలందు, హస్తేన = హస్తముతో, సంగృహ్య = పట్టుకొని, ఉవాచ = పలికెను.

తా. కామావిష్టు డైన మహాతేజశ్శాలి యగు దశరథుడు కొంచెము నవ్వి తెల్లని చిరునవ్వుగల ఆ కైకేయి కేశపాశమును హస్తముతో గ్రహించి ఇట్లనెను.

మూ. అవలిప్తే న జానాసి త్వత్తః ప్రియతరో మమ,
మనుజో మనుజవ్యాఘ్రా ద్రామాదన్యో న విద్యతే 5.

ప్ర. అ. అవలిప్తే = గర్వితురాలా! న జానాసి = నీవు ఎరుగవా? మమ = నాకు, త్వత్తః = నీ కంటె, ప్రియతరః = ఎక్కువ ప్రియమైన వాడు, మనుజవ్యాఘ్రాత్ = మనుష్యులలో శ్రేష్ఠు డైన, రామాత్ = రాముని కంటె, అన్యః = ఇతరు డైన, మనుజః = మనుష్యుడు, న విద్యతే = లేడు.

తా. గర్వితురాలా! ఈ లోకములో నాకు నీ కంటె ఎక్కువ ప్రియ మైన వారు, మనుష్యులలో శ్రేష్ఠుడైన రాముడు తప్ప మరెవ్వరును లేరని నీకు తెలియదా? 5

మూ. తేనాజయ్యేన ముఖ్యేన రాఘవేణ మహాత్మనా,
శపే తే జీవనార్హేణ బ్రూహి యన్మనసేచ్ఛసి. 6

ప్ర. అ. అజయ్యేన = శత్రువులకు జయింప శక్యము కాని వాడూ, ముఖ్యేన = ప్రధానమైన వాడూ, జీవనార్హేణ = అందరును ఆధారపడి జీవించుటకు తగినవాడూ, మహాత్మనా = గొప్ప మనస్సు కలవాడూ అయిన, తేన రాఘవేణ = ఆ రామునిచేత, శపే = ఒట్టు పెట్టుచున్నాను, మనసా = మనస్సుచేత, యత్ = దేనిని, ఇచ్ఛసి = కోరుచున్నావో, బ్రూహి = చెప్పుము.

తా. రాముడు శత్రువులచే జయింప శక్యముకానివాడు. సర్వలోకప్రధానుడు. విశాలహృదయుడు. అందరికిని జీవనాధారభూతుడు. అట్టి రామునిపై ఒట్టు పెట్టుచున్నాను. నీకేమి కావలెనో చెప్పుము. 6

మూ. యం ముహూర్తమపశ్యంస్తు న జీవేయమహం ధ్రువమ్,
తేన రామేణ కైకేయి శపే తే వచనక్రియామ్. 7

ప్ర. అ. కైకేయి = కైకేయీ! యమ్ = ఏ రాముని, అపశ్యన్ = చూడనివాడనై, అహమ్ = నేను, ముహూర్తమ్ = క్షణకాలమైనను, ధ్రువమ్ = నిశ్చయముగా, న జీవేయమ్ = జీవింపజాలనో, తేన రామేణ = అట్టి రామునిచే, తే = నీ యొక్క, వచనక్రియామ్ = మాట ప్రకారము చేయుటను గూర్చి, శపే = ఒట్టు పెట్టుచున్నాను.

తా. కైకేయీ! రాముని చూడనిదే నేను క్షణకాలమైనను జీవింపజాలను. ఇది నిశ్చితము. అట్టి రామునిపై ఒట్టు పెట్టి నీవు చెప్పిన పని చేసెద నని చెప్పుచున్నాను. 7

మూ. ఆత్మనా వాత్మజైశ్చాన్యైర్వృణే యం మనుజర్షభమ్,
తేన రామేణ కైకేయి శపే తే వచనక్రియామ్. 8

ప్ర. అ. కైకేయి = కైకేయీ! ఆత్మనా వా = నాచేతను, అన్యైః = ఇతరు లైన. ఆత్మజైః = పుత్రులచేతను, యమ్ = ఏ, మనుజర్షభమ్ = మనుష్యశ్రేష్ఠుని, వృణే = కోరుచుందునో, తేన రామేణ = అట్టి రామునిచే, తే = నీయొక్క, వచనక్రియాయామ్ = మాట ప్రకారము చేయుటను గూర్చి, శపే = ఒట్టుపెట్టుచున్నాను.

తా. నా ప్రాణముల నైనను, నా ఇతర కుమారుల ప్రాణముల నైనను ఒడ్డి పురుషశ్రేష్ఠు డైన రాముని క్షేమమును సంపాదింప కోరుచుందును. అట్టి రామునిపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. నీ వచనము ప్రకారము చేసెదను. 8

మూ. భద్రే హృదయమప్యేతదనుమృశ్యోద్ధరస్వ మే,
ఏతత్సమీక్ష్య కైకేయి బ్రూహి యత్సాధు మన్యసే. 9

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా! మే = నా యొక్క, ఏతత్ = ఈ, హృదయమ్ = హృదయమును, అనుమృశ్య = స్పృశించి, ఉద్ధరస్వ = ఉద్ధరింపుము. కైకేయి = కైకేయీ; ఏతత్ = దీనిని, సమీక్ష్య = చూచి, యత్ = దేనిని, సాధు = మంచిదానినిగా, మన్యసే = తలచుచున్నావో, అది, బ్రూహి = చెప్పుము.

తా. మంగళప్రదురాలా! నా హృదయము క్రుంగిపోవుచున్నది. దీనిని స్పృశించి ఉద్ధరింపుము. కైకేయీ! దీని సంతను పరిశీలించి నీ వేది మంచి దని భావించుచున్నావో అది చెప్పుము. 9

మూ. బలమాత్మని జానన్తీ న మాం శఙ్కితుమర్హసి,
కరిష్యామి తవ ప్రీతిం సుకృతేనాపి తే శపే 10

ప్ర. అ. ఆత్మని = నా విషయమై, బలమ్ = నీ కున్న బలమును; జానన్తీ = తెలిసికొనిన నీవు, మామ్ = నన్ను, శఙ్కితుమ్ = శంకించుటకు, న అర్హసి = తగవు, సుకృతేనాపి = పుణ్యముచేత గూడ, తే = నీకు, శపే = ఒట్టు పెట్టుచున్నాను. తవ = నీ యొక్క, ప్రీతిమ్ = ప్రీతిని, కరిష్యే = చేయగలను.

తా. నీకు నాపై ఎంత అధికారమున్నదో తెలిసిన నీవు ఏ మాత్రము శంకింపరాదు. నేను చేసిన పుణ్యముపై ఒట్టు పెట్టుచున్నాను. నీ కేది ఇష్టమో అది తప్పక చేసెదను. 10

మూ. సా తదర్థమనా దేవీ తమభిప్రాయమాగతమ్,
నిర్మాధ్యస్థ్యాచ్చ హర్షాచ్చ బభాషే దుర్వచం వచః. 11

ప్ర. అ. తదర్థమనాః=భరతరాజ్యాభిషేకము, రామవనవాసము అను ఆ విషయములే మనస్సులో నున్న, దేవీ = కైకేయి, ఆగతమ్=తన మనస్సులో వచ్చిన, తమ్ అభిప్రాయమ్ = ఆ అభిప్రాయమును, (ఆవేదయన్తీ = తెలుపుచు), నిర్మాధ్యస్థ్యాత్ = మధ్యస్థత్వము లేకపోవుటవలనను, అనగా పక్షపాతము వలనను, హర్షాత్ చ=ఆనందమువలనను, దుర్వచమ్=చెప్పుటకు కూడ శక్యము కాని, వచః=వాక్యమును, బభాషే=పలికెను.

తా. భరతుని రాజ్యాభిషేకము, రామవనవాసము అను విషయములపై తీవ్రమైన ఇచ్ఛ గల ఆ కైకేయి తన మనస్సులో ఉన్న ఆ అభిప్రాయమును తెలుపుచు పక్షపాతబుద్ధితోను, ఆనందముతోను కూడినదై, ఉచ్చరించుటకు కూడ తగని వచనమును పలికెను. 11

మూ. తేన వాక్యేన సంహృష్టా తమభిప్రాయమాగతమ్,
వ్యాజహార మహాఘోరమభ్యాగతమివాన్తకమ్. 12

ప్ర. అ. తేన వాక్యేన = ఆ మాటలచేత, సంహృష్టా = సంతసించిన కైకేయి, అభ్యాగతమ్=హఠాత్తుగా వచ్చిపడిన, అన్తకమివ = మృత్యువు వలె, మహాఘోరమ్ = చాలఘోరమైన, ఆగతమ్ = తన మనస్సునకు వచ్చిన (మనస్సులో నున్న), తమ్ అభిప్రాయమ్ = ఆ అభిప్రాయమును, వ్యాజహార = పలికెను.

తా. దశరథుని మాటలకు సంతోషించి, కైకేయి, హఠాత్తుగా వచ్చిపడిన మృత్యువు వలె అతిభయంకరమైన తన మనస్సులోని అభిప్రాయమును అతనికి తెలిపెను. 12

మూ. యథా క్రమేణ శపసి వరం మమ దదాసి చ,
తచ్ఛృణ్వన్తు త్రయస్త్రింశద్దేవాః సాగ్నిపురోగమాః. 13

ప్ర. అ. సాగ్నిపురోగమాః=అగ్నిదేవుడు ముందుగా గల, త్రయస్త్రింశద్దేవాః=ముప్పదిముగ్గురు దేవతలు, క్రమేణ = క్రమముచేత, యథా = ఏ విధముగా, శపసి=ఒట్టుపెట్టుచున్నావో, మమ = నాకు, వరమ్ = వరమును, దదాసి చ = ఇచ్చుచున్నావో, తత్ = దానిని, శృణ్వన్తు=విందురు గాక.

తా. నీవు వరుసగా ఒట్టులు పెట్టుచు నాకు వరముల నిచ్చుచు పలికిన ఈ మాటలను, అగ్నిదేవునితో సహా ముప్పదిముగ్గురు దేవతలు వినెదరు గాక. 13

మూ. చన్ద్రాదిత్యౌ నభశ్చైవ గ్రహా రాత్ర్యహనీ దిశః,
జగచ్చ పృథివీ చేయం సగన్ధర్వా సరాక్షసా. 14

నిశాచరాణి భూతాని గృహేషు గృహదేవతాః,
యాని చాన్యాని భూతాని జానీయుర్భాషితం తవ. 15

ప్ర. అ. చన్ద్రాదిత్యౌ=చంద్రసూర్యులు, నభః చ ఏవ = ఆకాశము, గ్రహాః=గ్రహములు, రాత్ర్యహనీ = రాత్రులు, పగళ్లు, దిశః = దిక్కులు, జగచ్చ = ఈ జగత్తు, సగన్ధర్వా = గంధర్వులతో కూడినదీ, సరాక్షసా=రాక్షసులతో కూడినదీ అయిన, ఇయమ్ = ఈ, పృథివీ = భూమి, నిశాచరాణి=రాత్రులందు సంచరించు, భూతాని = భూతములూ, గృహేషు=గృహములలో నున్న, గృహదేవతాః = గృహదేవతలూ, అన్యాని = ఇతర మైన, యాని = ఏ, భూతాని=భూతములు కలవో, అవియు, తవ = నీయొక్క, భాషితమ్ = మాటను, జానీయుః=తెలిసికొందురు గాక.

తా. సూర్యచంద్రులు, ఆకాశము, గ్రహములు, రాత్రి, పగలు, దిక్కులు, జగత్తు, ఈ భూమి, గంధర్వులు, రాక్షసులు, రాత్రి సంచరించు భూతములు, గృహదేవతలు, ఇంకను ఇతర మైన భూతములు నీ మాటలను వినెదరు గాక. 14, 15

మూ. సత్యసన్ధో మహాతేజా ధర్మజ్ఞః సుసమాహితః,
వరం మమ దదాత్యేష తన్మే శృణ్వన్తు దేవతాః. 16

ప్ర. అ. సత్యసన్ధః=సత్యమైన ప్రతిజ్ఞ కలవాడూ, మహాతేజాః=గొప్ప తేజస్సు కలవాడూ, ధర్మజ్ఞః=ధర్మముల నెరిగినవాడూ, సుసమాహితః=బాగుగా సావధానచిత్తము కలవాడూ అయిన, ఏషః=ఈ దశరథమహారాజు, మమ=నాకు, వరమ్=వరమును, దదాతి=ఇచ్చుచున్నాడు. దేవతాః=దేవతలు, తత్=దానిని, మే=నా నిమిత్తమై, శృణ్వన్తు=వినెదరుగాక.

తా. సత్యసంధుడూ, మహాతేజశ్శాలీ, ధర్మముల నెరిగినవాడూ సావధానచిత్తుడూ అయిన ఈ దశరథమహారాజు నాకు వర మిచ్చుచున్నాడు. నా నిమిత్తమై (అనగా నాకు సాక్షులుగా ఉండుటకై) దేవత లందరును, ఈ వరప్రదానవచనమును విందురు గాక. 16

మూ. ఇతి దేవీ మహేష్వాసం పరిగృహ్యాభిశస్య చ,
తతః పరమువాచేదం వరదం కామమోహితమ్. 17

ప్ర. అ. దేవీ=కైకేయి, మహేష్వాసమ్=గొప్ప ధనస్సు గల ఆ దశరథుని, పరిగృహ్య=ఎట్లు పట్టవలెనో అట్లు పట్టి, అభిశస్య చ=ఎక్కువగా ప్రశంస చేసి, తతః పరమ్=అటు పిమ్మట, వరదమ్=వరముల నిచ్చువాడూ, కామమోహితమ్=కామముచేత మోహింపచేయబడినవాడూ అయిన అతని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. కైకేయి ఆ దశరథుడు తన మాట విను నట్లు చేసికొని, అతనిని ఉబ్బవేసి, అటు పిమ్మట, వరము లిచ్చుటకు సిద్ధముగా నున్న, కామమోహితు డైన అతనితో ఇట్లనెను. 17

మూ. స్మర రాజన్ పురా వృత్తం తస్మిన్ దైవాసురే రణే,
తత్ర చాచ్యావయచ్ఛత్రు స్తవ జీవితమన్తరా. 18

ప్ర. అ. రాజన్=రాజా! పురా=పూర్వము, తస్మిన్=ఆ, దైవాసురే=దేవతలకూ అసురులకూ సంబంధించిన, రణే=యుద్ధమునందు, వృత్తమ్=

జరిగిన విషయమును, స్మర=జ్ఞప్తికి తెచ్చుకొనుము. తత్ర=ఆ యుద్ధమునందు, శత్రుః=శత్రువు, తవ=నీయొక్క, జీవితమ్ అన్తరా=జీవితము తక్క మిగిలిన ఆయుధబలాదికమును, అచ్యావయత్=తొలగించెను.

తా. రాజా! పూర్వము దేవాసురయుద్ధమునందు ఏమయినదో జ్ఞప్తికి తెచ్చుకొనుము. అచట శత్రువు నీ ప్రాణములు తప్ప రథతురగాయుధాదుల నన్నింటిని నశింపచేసెను. 18

మూ. తత్ర చాపి మయా దేవ యత్త్వం సమభిరక్షితః,
జాగ్రత్యా యతమానాయా స్తతో మే ప్రాదదా వరౌ. 19

ప్ర. అ. దేవ=మహారాజా! తత్ర చ=అచట, యత్=ఏ కారణము వలన, త్వమ్=నీవు, మయా=నాచేత, సమభిరక్షితః=రక్షింపబడితివో, తతః=ఆ కారణమువలన, జాగ్రత్యాః=జాగరూకతతో ఉన్న, యతమానాయాః=నిన్ను రక్షించుటకై ప్రయత్నించుచున్న, మే=నాకు, వరౌ=రెండు వరములను, ప్రాదదాః=ఇచ్చితివి.

తా. మహారాజా! అచట నేను నిన్ను రక్షించితిని. అందువలన, నీవు నిన్ను రక్షించుటకై అతిజాగరూకతతో ప్రయత్నించిన నాకు వరము నిచ్చియున్నావు. 19

మూ. తౌ తు దత్తౌ వరౌ దేవ నిక్షేపౌ మృగయామ్యహమ్,
తవైవ పృథివీపాల సకాశే సత్యసంగర. 20

ప్ర. అ. పృథివీపాల=భూమిని రక్షించువాడా! సత్యసంగర=సత్యమైన ప్రతిజ్ఞ కలవాడా! దేవ=ఓ మహారాజా! తవ=నీయొక్క, సకాశే ఏవ=సమీపమునందే, నిక్షేపౌ=నిక్షేపముగా ఉంచిన, (దాచి కాలాంతరమునం దిచ్చుటకై ఉంచిన), తౌ=ఆ, దత్తౌ=ఇవ్వబడిన, వరౌ తు=వరములనే, అహమ్=నేను, మృగయామి=వెదకుచున్నాను (అడుగుచున్నాను.)

తా. సత్యప్రతిజ్ఞుడవు, పృథివీపాలకుడవు అయిన మహారాజా! నీ దగ్గరనే దాచుటకై ఉంచిన నీ విచ్చిన ఆ వరములనే ఇపుడు కోరుచున్నాను. 20

మూ. తత్ప్రతిశ్రుత్య ధర్మేణ న చేద్దాస్యసి మే వరమ్,
అద్యైవ హి ప్రహాస్యామి జీవితం త్వద్విమానితా 21

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, ప్రతిశ్రుత్య = ప్రతిజ్ఞ చేసి, మే = నాయొక్క, వరమ్ = వరమును, ధర్మేణ = ధర్మానుసారముగా, న దాస్యసి చేత్ = ఇవ్వకున్నచో, త్వద్విమానితా = నీచే అవమానింపబడిన నేను, అద్యైవ = ఇప్పుడే, జీవితమ్ = జీవితమును, ప్రహాస్యామి హి = విడువగలను.

తా. నీవు ప్రతిజ్ఞ చేసిన ఆ వరమును ధర్మానుసారముగా ఇవ్వవలెను. అట్లు ఇవ్వక నన్నవమానించినచో ఇప్పుడే ప్రాణములు విడచెదను. 21

మూ. వాఙ్మాత్రేణ తదా రాజా కైకేయ్యా స్వవశే కృతః,
ప్రచస్కన్ద వినాశాయ పాశం మృగ ఇవాత్మనః. 22

ప్ర. అ. తదా = అప్పుడు, కైకేయ్యా = కైకేయిచేత, వాఙ్మాత్రేణ = మాటలచేతనే, స్వవశే = తన వశమునందు, కృతః = చేసికొనబడిన, రాజా = దశరథుడు, మృగః ఇవ = లేడి వలె, ఆత్మనః = తనయొక్క, వినాశాయ = వినాశమునకు, పాశమ్ = ఆమె పన్నిన మాయాపాశమును, ప్రచస్కన్ద = ప్రవేశించెను.

తా. ఈ విధముగ కైకేయి మాటల మాత్రమునకే లొంగిపోయిన ఆ దశరథుడు, లేడి పాశములో దూరి నట్లు, ఆమె పన్నిన మాయాపాశములో, ఆత్మవినాశమునకై, దూరెను. అనగా అట్లే ఇచ్చెద నని చెప్పెను. 22

మూ. తతః పరమువాచేదం వరదం కామమోహితమ్,
వరౌ యౌ మే త్వయా దేవ తదా దత్తౌ మహీపతే. 23
తౌ తావదహమద్యైవ వక్ష్యామి శృణు మే వచః.

ప్ర. అ. తతః పరమ్ = అటు పిమ్మట, కామమోహితమ్ = కామమోహితుడై, వరదమ్ = వరముల నిచ్చుచున్న దశరథుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను. మహీపతే = భూమికి ప్రభు వైన, దేవ = మహారాజా। తదా = అప్పుడు, మే = నాకు, త్వయా = నీచేత, యౌ = ఏ, వరౌ =

వరములు, దత్తౌ = ఇవ్వబడినవో, తౌ = వాటిని గూర్చి, అద్యైవ తావత్ = ఇప్పుడే, వక్ష్యామి = చెప్పగలను. మే వచః = నా వాక్యమును, శృణు = వినుము.

తా. పిమ్మట, కామమోహితుడై వరముల నిచ్చుటకు అంగీకరించిన ఆ దశరథునితో కైకేయి ఇట్లనెను. "పృథివీపతి వైన మహారాజా! అనాడు నీవు నా కిచ్చిన వరములను ఇప్పుడే కోరెదను; వినుము." 23

మూ. అభిషేకసమారమ్భో రాఘవస్యోపకల్పితః, 24
అనేనైవాభిషేకేణ భరతో మేఽభిషిచ్యతామ్.

ప్ర. అ. రాఘవస్య=రామునియొక్క, అభిషేకసమారమ్భః=అభిషేక సామగ్రి, ఉపకల్పితః = కల్పింపబడినది. అనేన = ఈ, అభిషేకే ణైవ = అభిషేకసామగ్రిచేతనే, మే = నాయొక్క, భరతః = భరతుడు, అభిషిచ్యతామ్ = అభిషేకింపబడుగాక.

తా. రాముని రాజ్యాభిషిక్తుని చేయుటకై సంభారము లన్నియు సమకూర్చ బడినవి కదా! ఈ అభిషేకసంభారములతోనే నా కుమారుడైన భరతుని రాజ్యాభిషిక్తుని చేయవలెను. 24

మూ. యో ద్వితీయో వరో దేవ దత్తః ప్రీతేన మే త్వయా, 25
తదా దైవాసురే యుద్ధే తస్య కాలోఽయ మాగతః.

ప్ర. అ. తదా=అప్పుడు, దైవాసురే యుద్ధే=దేవాసుర యుద్ధమునందు, ప్రీతేన = సంతోషించిన, త్వయా = నీచేత, మే = నాకు, యః = ఏ, ద్వితీయః = రెండవ, వరః = వరము, దత్తః = ఇవ్వబడినదో, తస్య = దానికి, అయమ్ = ఇది, కాలః = కాలము, ఆగతః = వచ్చినది.

తా. అనాడు దేవాసురయుద్ధమునందు సంతోషించిన నీవు నా కిచ్చిన రెండవ వరమునకు తగు సమయ మిపుడు వచ్చినది. 25

మూ. నవ పఞ్చ చ వర్షాణి దణ్డకారణ్యమాశ్రితః, 26
చీరాజినజటాధారీ రామో భవతు తాపసః.

ప్ర. అ. రామః = రాముడు, నవ పఞ్చ చ వర్షాణి = తొమ్మిది మరియు ఐదు (పదునాలుగు) సంవత్సరములు, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును,

ఆశ్రితః = ఆశ్రయించినవాడై, చీరాజినజటాధారీ=నారచీరలను, కృష్ణాజినమును, జటలను ధరించుచు, తాపసః = మునిగా, భవతు = అగుగాక.

తా. రాముడు పదునాలుగు సంవత్సరములపాటు దండకారణ్యములో నివసించుచు, నారచీరలు, మృగాజినము, జటలు ధరించి, మునివృత్తి నవలంబించుగాక. 26

మూ. భరతో భజతామద్య యౌవరాజ్యమకణ్టకమ్. 27
ఏష మే పరమః కామో దత్తమేవ వరం వృణే,
అద్య చైవ హి పశ్యేయం ప్రయాన్తం రాఘవం వనమ్. 28

ప్ర. అ. అద్య = ఇపుడు, భరతః = భరతుడు, అకణ్టకమ్=శత్రువులు లేని, యౌవరాజ్యమ్ = యౌవరాజ్యమును, భజతామ్ = పొందుగాక. ఏషః = ఇది, మే = నాయొక్క, పరమః గొప్పదైన, కామః = కోరిక. దత్తం వరమేవ = పూర్వమివ్వబడిన వరమునే, వృణే = కోరుచున్నాను, అద్య చైవ = ఇప్పుడే, వనమ్ = వనమును గూర్చి, ప్రయాన్తమ్ = వెళ్ళుచున్న, రాఘవమ్ = రాముని, పశ్యేయమ్ = చూచెదను గాక.

తా. భరతునకు ఇపుడే శత్రుబాధ లేపియు లేని యౌవరాజ్యము లభింపవలెను. ఇదే నా గొప్పదైన కోరిక. పూర్వము నీ విచ్చిన వరమునే ఇపుడు కోరుచున్నాను. రాము డీనాడే వనమునకు వెళ్ళుచుండగా నేను చూడవలెను. 27, 28

మూ. స రాజరాజో భవ సత్యసంగరః
కులం చ శీలం చ హి రక్ష జన్మ చ,
పరత్ర వాసే హి వదన్త్యనుత్తమం
తపోధనాః సత్యవచో హితం నృణామ్. 29

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకాదశః సర్గః.

ప్ర. అ. రాజరాజః = రాజులకు రాజైన, సః = అట్టి నీవు, సత్యసంగరః = సత్యప్రతిజ్ఞ కలవాడవు, భవ = అగుము. కులం చ = కులమును,

శీలం చ = శీలమును, జన్మ చ = జన్మను, రక్ష హి = రక్షింపుము. నృణామ్ = మానవులకు, పరత్ర = పరలోకమునందు, వాసే = నివాసము విషయమున, సత్య వచః = సత్యవాక్యమే, అనుత్తమమ్ = అత్యుత్తమ మైన, హితమ్ = హితకర మైన దానినిగా, తపోధనాః = మహర్షులు, వదన్తి హి = చెప్పుచున్నారు గదా.

తా. రాజులకు రాజు వైన దశరథమహారాజా। నీ ప్రతిజ్ఞను నిలబెట్టు కొని, కులమును, శీలమును, జన్మను రక్షించుకొనుము. సత్యవాక్యమే మానవు లకు పరలోకవాసమునందు సౌఖ్యము కలిగించు నది అని తపోధనులు చెప్పుదురు కదా. 29

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ఏకాదశసర్గ సమాప్తము.

# అథ ద్వాదశః సర్గః

[*దశరథమహారాజు చింతించుట, దశరథ విలాపము, కైకేయిని నిందించుట, పరిస్థితిని వివరించి, అట్టి వరములు కోరవలదని ప్రార్థించుట.*]

మూ. తతః శ్రుత్వా మహారాజః కైకేయ్యా దారుణం వచః,
చిన్తామభిసమాపేదే ముహూర్తం ప్రతతాప చ. 1

ప్ర. అ. మహారాజః = మహారాజు, కైకేయ్యాః = కైకేయియొక్క, దారుణమ్ = భయంకర మైన, వచః = వాక్యమును, శ్రుత్వా = విని, తతః = అటు పిమ్మట, చిన్తామ్ = చింతను, అభిసమాపేదే = పొందెను. ముహూర్తమ్ = క్షణకాలము, ప్రతతాప చ = అత్యధికముగ తపించిపోయెను.

తా. అతిదారుణ మైన కైకేయి మాటలు విని దశరథమహారాజు చింతాక్రాంతుడై, క్షణకాలము పాటు తపించిపోయెను. 1

మూ. కిం ను మే యది వా స్వప్నశ్చిత్తమోహోఽపి వా మమ,
అనుభూతోపసర్గో వా మనసో వాప్యుపద్రవః. 2

ప్ర. అ. మే = నాయొక్క, స్వప్నః కిం ను = స్వప్నమా। యది వా = లేక, మమ = నాయొక్క, చిత్తమోహోఽపి వా = చిత్తమోహమా? అనుభూతోపసర్గో వా = అనుభవముయొక్క (జ్ఞానముయొక్క) నాశనమా? మనసః = మనస్సుయొక్క, ఉపద్రవః (అపి) వా = ఉపద్రవమా?

తా. ఇది ఏమి ! స్వప్నమా ? నాకు చిత్తమోహము కలిగినదా? నా కున్న జ్ఞానము నశించినదా? లేక నా మనస్సున కేదియేని వ్యాధి వచ్చినదా ! 2

మూ. ఇతి సంచిన్త్య తద్రాజా నాధ్యగచ్ఛత్తదా సుఖమ్,
ప్రతిలభ్య చిరాత్సంజ్ఞాం కైకేయీవాక్యతాడితః. 3

వ్యథితో విక్లబశ్చైవ వ్యాఘ్రీం దృష్ట్వా యథా మృగః,
అసంవృతాయామాసీనో జగత్యాం దీర్ఘముచ్ఛ్వసన్. 4

మణ్డలే పన్నగో రుద్ధో మన్త్రైరివ మహావిషః,
అహో ధిగితి సామర్షో వాచముక్త్వా నరాధిపః, 5
మోహమాపేదివాన్భూయః శోకోపహతచేతనః.

ప్ర. అ. రాజా = రాజు, ఇతి = ఈ విధముగా, తత్ = దానిని గూర్చి, సంచిన్త్య = ఆలోచించి, తదా = అప్పుడు, సుఖమ్=సుఖమును, నాభ్యగచ్ఛత్= పొందలేదు. కైకేయీవాక్యతాడిత = కైకేయి మాటలచేత కొట్టబడిన, నరాధిపః= ఆ రాజు, చిరాత్ = చాలకాలమునకు, సంజ్ఞామ్ = సంజ్ఞను, ప్రతిలభ్య = పొంది, వ్యాఘ్రీమ్ = ఆడుపులిని, దృష్ట్వా = చూచి, మృగః యథా = లేడి వలె, వ్యథితః=వ్యథ చెందినవాడై, విక్లబః చ ఏవ=వ్యాకులుడై, అసంవృతాయామ్= కప్పబడని, జగత్యామ్ = భూమిపై, ఆసీనః = కూర్చున్నవాడై, మణ్డలే = మండలమునందు, మన్త్రైః = మంత్రములచేత, రుద్ధః=కట్టివేయబడిన, మహా విషః=గొప్ప విషము గల, పన్నగః ఇవ=సర్పము వలె, దీర్ఘమ్=దీర్ఘముగా, ఉచ్ఛ్వసన్=నిట్టూర్చుచు, సామర్షః=కోపముతో కూడినవాడై, అహో=అయ్యో ! ధిక్=నింద యగు గాక, ఇతి = అని, వాచమ్ = మాటను, ఉక్త్వా = పలికి, శోకోపహతచేతనః = శోకముచే కొట్టబడిన చైతన్యము కలవాడై, భూయః = మరల, మోహమ్ = మోహమును, ఆపేదివాన్ = పొందెను.

తా. దశరథుడు ఈ విధముగ ఆలోచించి అపుడు సుఖమును పొంద జాలకపోయెను. కైకేయి మాటలచే కొట్టబడిన ఆ రాజు చాలసేపటికి స్పృహ వచ్చి, ఆడుపులిని చూచిన లేడి వలె వ్యథ చెంది వ్యాకులుడై, ఆచ్ఛాదనము లేని నేలపై కూర్చుండి, రేఖలతో గీసిన మండలమునందు మంత్రములచే బంధింప బడిన మహావిషసర్పము వలె దీర్ఘముగా నిట్టూర్చుచు, "అయ్యో ! ఛీ ఛీ" అని కోపముతో పలికి, శోకముచే మరల స్పృహ తప్పగా మూర్ఛపడెను. 4-5

మూ. చిరేణ తు నృపః సంజ్ఞాం ప్రతిలభ్య సుదుఃఖితః, 6
కైకేయీమబ్రవీత్క్రుద్ధః ప్రదహన్నివ చక్షుషా.

ప్ర. అ. నృపః = రాజా, చిరేణ = చిరకాలముచేత, సంజ్ఞామ్ = సంజ్ఞను, ప్రతిలభ్య = పొంది, సుదుఃఖితః = చాల దుఃఖించినవాడై, క్రుద్ధః = కోపగించినవాడై, చక్షుషా = నేత్రముతో, కైకేయీమ్ = కైకేయిని, ప్రదహన్నివ = కాల్చివేయుచున్నవాడు వలె, అబ్రవీత్ = పలికెను.

తా. మిక్కిలి దుఃఖితుడైన దశరథుడు చాల సేపటికి సంజ్ఞను పొంది, కోపించినవాడై, నేత్రములతో కాల్చివేయుచున్నట్లు చూచుచు, కైకేయితో ఇట్లు పలికెను. 6

మూ. నృశంసే దుష్టచారిత్రే కులస్యాస్య వినాశిని, 7
కిం కృతం తవ రామేణ పాపం పాపే మయాపి వా.

ప్ర. అ. నృశంసే = క్రూరురాలా ! దుష్టచారిత్రే = దుష్టమైన చరిత్ర కలదానా, అస్య కులస్య = ఈ కులమునకు, వినాశిని = వినాశకురాలా ! పాపే = పాపాత్మురాలా ! రామేణ = రామునిచేత గాని, మయాపి వా = నాచేత గాని, తవ = నీకు, కిం కృతమ్ = ఏమి చేయబడినది.

తా. క్రూరురాలా ! దుష్టచరిత్రగలదానా ! ఈ కులమును నశింపచేయుచున్న పాపాత్మురాలా ! రాముడు గాని, నేను గాని నీ కేమి అపకారము చేసినాము? 7

మూ. యదా తే జననీతుల్యాం వృత్తిం వహతి రాఘవః, 8
తస్యైవ త్వమనర్థాయ కిం నిమిత్తమిహోద్యతా.

ప్ర. అ. రాఘవః = రాముడు, యదా = ఎప్పుడు, తే = నీ విషయమై, జననీతుల్యామ్ = తల్లితో సమానమైన, వృత్తిమ్ = ప్రవర్తనను, వహతి = అవలంబించుచున్నాడో, అప్పుడు, తస్యైవ = అతనికే, అనర్థాయ = అనర్థము చేయుటకై, త్వమ్ = నీవు, కింనిమిత్తమ్ = ఎందుచేత, ఇహ = ఇపుడు, ఉద్యతా = ఉద్యమించినావు ?

తా. రాముడు నిన్ను తల్లిని వలె చూచుకొనుచున్నాడు కదా; అట్టి రామునకే నీ విపుడు అనర్థము తలపెట్టితి వేమి ? 8

మూ. త్వం మమాత్మవినాశార్థం భవనం స్వం ప్రవేశితా, 9
అవిజ్ఞానాన్నృపసుతా వ్యాళీ తీక్ష్ణవిషా యథా.

ప్ర. అ. త్వమ్ = నీవు, నృపసుతా = రాజకుమారి కదా అని, మయా = నాచేత, తీక్ష్ణవిషా = తీక్ష్ణ మైన విషము గల, వ్యాళీవ = ఆడు సర్పము వలె, అవిజ్ఞానాత్ = తెలియకపోవుటవలన, స్వం భవనమ్ = నా గృహమును, ఆత్మ వినాశార్థమ్ = ఆత్మనాశముకొరకే, ప్రవేశితా = ప్రవేశపెట్టబడితివి.

తా. రాజకుమారివి కదా యని తలచి, నీ దుష్టస్వభావము తెలియక నేను నిన్ను తీవ్రవిషము గల ఆడు సర్పమును తీసికొనివచ్చినట్లు నా గృహము నకు తీసికొని వచ్చుటతో నా వినాశమును నేనే కోరి చేసికొనిన ట్లయినది. 9

మూ. జీవలోకో యదా సర్వో రామస్యాహ గుణస్తవమ్, 10
అపరాధం కముద్దిశ్య త్యక్ష్యామీష్టమహం సుతమ్.

ప్ర. అ. యదా = ఎప్పుడు, సర్వః = సమస్త మైన, జీవలోకః = ప్రాణి సముదాయము, రామస్య = రామునియొక్క, గుణస్తవమ్ = గుణముల స్తోత్రమును, ఆహ = చెప్పుచున్నదో, అప్పుడు, కమ్ = ఏ, అపరాధమ్ = అపరాధమును, ఉద్దిశ్య = ఉద్దేశించి, అహమ్ = నేను, ఇష్టం సుతమ్ = ఇష్ట మైన కుమారుని, త్యక్ష్యామి = విడతును.

తా. ప్రపంచములోని జీవకోటి యంతయు రాముని గుణగణములను స్తుతించుచుండగా అతనిలో ఏమి దోషమున్న దని నే నాతనిని వనమునకు పంపుదును ? 10

మూ. కౌసల్యాం వా సుమిత్రాం వా త్యజేయమపి వా శ్రియమ్,
జీవితం వాత్మనో రామం న త్వేవ పితృవత్సలమ్

ప్ర. అ. కౌసల్యాం వా = కౌసల్యను గాని, సుమిత్రాం వా = సుమిత్రను గాని, శ్రియమపి వా = ఐశ్వర్యమును గాని, ఆత్మనః = నాయొక్క, జీవితం వా = జీవితమును గాని, త్యజేయమ్ = త్యజింతును. పితృవత్సలమ్ = తండ్రి యందు ప్రేమగల, రామం తు = రామునైతే, న = విడువజాలను.

తా. కౌసల్య నైనను, సుమిత్ర నైనను, రాజ్యలక్ష్మి నైనను, చివరకు నా ప్రాణముల నైనను విడువగలను గాని పితృభక్తు డైన రాముని మాత్రము విడువజాలను. 11

మూ. పరా భవతి మే ప్రీతిర్దృష్ట్వా తనయమగ్రజమ్. 12
అపశ్యతస్తు మే రామం నష్టా భవతి చేతనా.

ప్ర. అ. అగ్రజమ్ = జ్యేష్ఠు డైన, తనయమ్ = కుమారుని, దృష్ట్వా = చూచి, మే = నాకు, పరా = గొప్ప, ప్రీతిః = ఆనందము, భవతి = అగును. రామమ్ = రాముని, అపశ్యతస్తు = చూడకున్న ట్లయితే మాత్రము, మే = నా యొక్క, చేతనా = చైతన్యము, నష్టా భవతి = నశించును.

తా. జ్యేష్ఠకుమారు డైన రాముని చూడగనే నాకు పరమానందము కలుగును. ఆతనిని చూడకున్నచో నా చైతన్యమే నశించును. 12

మూ. తిష్ఠేల్లోకో వినా సూర్యం సస్యం వా సలిలం వినా, 13
న తు రామం వినా దేహే తిష్ఠేత్తు మమ జీవితమ్.

ప్ర. అ. లోకః = లోకము, సూర్యం వినా = సూర్యుడు లేకుండగ, తిష్ఠేత్ = ఉండవచ్చును. సస్యమ్ = సస్యము, సలిలం వినా వా = నీరు లేక పోయినను, ఉండవచ్చును. తు = కాని, రామం వినా = రాముడు లేకుండగ, మమ దేహే = నా దేహమునందు, జీవితమ్ = జీవితము, న తిష్ఠేత్ = ఉండ జాలదు.

తా. సూర్యుడు లేకుండ ఈ లోకము మనవచ్చును; నీరు లేకుండ సస్యము ఉండవచ్చును. కాని రాముడు లేకుండ నా దేహములో ప్రాణ ముండ జాలదు. 13

మూ. తదలం త్యజ్యతామేష నిశ్చయః పాపనిశ్చయే, 14
అపి తే చరణౌ మూర్ధ్నా స్పృశామ్యేష ప్రసీద మే.

ప్ర. అ. పాపనిశ్చయే = పాప మైన నిశ్చయము కలదానా, తత్ = ఆ కారణమువలన, అలమ్ = చాలును. ఏషః = ఈ, నిశ్చయః = నిశ్చయము,

మూ. న హి కించిదయుక్తం వా విప్రియం వా పురా మమ,
అకరోస్త్వం విశాలాక్షి తేన న శ్రద్దధామ్యహమ్. 20

ప్ర. అ. విశాలాక్షి = విశాలం మైన నేత్రములు గల ఓ కైకేయీ ! పురా = పూర్వము, మమ = నాకు, కించిత్ = ఏదియు, అయుక్తం వా = అయుక్త మైన దానిని గాని, విప్రియం వా = అపకారమును గాని, త్వమ్ = నీవు, న అకరోః = చేయలేదు. తేన = ఆ కారణముచేత, అహమ్ = నేను, న శ్రద్దధామి = విశ్వ సించుటలేదు.

తా. కైకేయీ ! పూర్వము నీ వెన్నడును నా విషయమున కొంచె మైనను అయుక్త మైన పని గాని, అప్రియ మైన కార్యము గాని చేయలేదు. అందుచేతనే ఇపుడు నీవు చెప్పుచున్న మాటలు నమ్మజాలకున్నాను. 20

మూ. నను తే రాఘవస్తుల్యో భరతేన మహాత్మనా,
బహుశో హి స్మ బాలే త్వం కథాః కథయసే మమ. 21

ప్ర. అ. తే = నీకు, రాఘవః = రాముడు, మహాత్మనా = గొప్ప బుద్ధి గల, భరతేన = భరతునితో, తుల్యః నను = సమానుడు కదా ? బాలే = ఓ కైకేయీ ! త్వమ్ = నీవు, బహుశః = అనేక పర్యాయములు, మమ = నాకు, కథాః = కథలను, కథయసే స్మ హి = చెప్పితివి కదా ?

తా. కైకేయీ ! "నాకు రాముడు మహాత్ముడైన భరతునితో సమానుడే" అని నీవు అనేక పర్యాయములు ఎన్నియో కథలు చెప్పుచుండెడిదానవు కదా ? 21

మూ. తస్య ధర్మాత్మనో దేవి వనవాసం యశస్వినః,
కథం రోచయసే భీరు నవ వర్షాణి పఞ్చ చ. 22

ప్ర. అ. భీరు = భయస్వభావము గల, దేవి = కైకేయీ ! ధర్మాత్మనః = ధర్మాత్ముడూ, యశస్వినః = కీర్తికలవాడూ అయిన, తస్య = ఆ రాముని యొక్క, నవ పఞ్చ చ వర్షాణి = పదునాలుగు సంవత్సరములు, వనవాసమ్ = వనవాసమును, కథమ్ = ఎట్లు, రోచయసే = ఇష్టపడుచున్నావు ?

తా. కైకేయీ ! అట్టి, ధర్మాత్ముడూ, కీర్తిమంతుడూ అయిన రాముడు పదు నాలుగు సంవత్సరములు వనములో నివసించవలె నని నీవు ఎట్లు కోరు చున్నావు ? 22

మూ. అత్యన్తసుకుమారస్య తస్య ధర్మే ధృతాత్మనః,
కథం రోచయసే వాసమరణ్యే భృశదారుణే. 23

ప్ర. అ. అత్యన్తసుకుమారస్య = మిక్కిలి సుకుమారుడూ, ధర్మే = ధర్మమునందు, ధృతాత్మనః = నిలుపబడిన బుద్ధి కలవాడూ అయిన, తస్య = ఆ రామునియొక్క, భృశదారుణే = మిక్కిలి భయంకర మైన, అరణ్యే = అరణ్యమునందు, వాసమ్ = నివాసమును, కథమ్ = ఎట్లు, రోచయసే = ఇష్ట పడుచున్నావు ?

తా. అత్యంతము సుకుమారుడూ, ధర్మమునందు స్థిర మైన బుద్ధి కల వాడూ అయిన ఆ రాముడు, అతిభయంకర మైన అరణ్యములో నివసింపవలె నని ఏల కోరుచున్నావు ? 23

మూ. రోచయస్యభిరామస్య రామస్య శుభలోచనే,
తవ శుశ్రూషమాణస్య కిమర్థం విప్రవాసనమ్. 24

ప్ర. అ. శుభలోచనే = మంగళకర మైన నేత్రములు కలదానా ! తవ = నీకు, శుశ్రూషమాణస్య = శుశ్రూష చేయుచున్నవాడూ, అభిరామస్య = మనో హరుడూ అయిన, రామస్య = రామునియొక్క, విప్రవాసనమ్ = దూరముగా పంపివేయుటను, కిమర్థమ్ = ఎందుకు, రోచయసి = అభిలషించుచున్నావు ?

తా. నీయందు భక్తితో సేవలు చేయు, మనోహరు డైన రాముని దూర ముగా పంపివేయవలె నని ఎందుకు కోరుచున్నావు ? 24

మూ. రామో హి భరతాద్భూయ స్తవ శుశ్రూషతే సదా,
విశేషం త్వయి తస్మాత్తు భరతస్య న లక్షయే. 25

ప్ర. అ. రామః = రాముడు, భరతాత్ = భరతుని కంటె, భూయః = అధికముగా, సదా = ఎల్లప్పుడును, తవ = నీకు, శుశ్రూషతే = సేవచేయు చున్నాడు కదా ? తస్మాత్తు = ఆ కారణమువలన కూడా, త్వయి = నీ విషయ మున, భరతస్య = భరతునియొక్క, విశేషమ్ = విశేషమును, న లక్షయే = గు ర్తించను.

తా. భరతునికంటె అధికముగా రాముడే నీకు శుశ్రూష చేయుచున్నాడు కదా ! అందుచేత కూడ నీకు రామునికంటె భరతునిపై ఎక్కువ ప్రేమ ఉండుటకు కారణ మేదియు నా కగపడుటలేదు. 25

మూ. శుశ్రూషాం గౌరవం చైవ ప్రమాణం వచనక్రియామ్,
కస్తే భూయ స్తరం కుర్యాదన్యత్ర మనుజర్షభాత్ 26
బహూనాం స్త్రీసహస్రాణాం బహూనాం చోపజీవినామ్.

ప్ర. అ. బహూనామ్ = అనేక మైన, స్త్రీసహస్రాణామ్ = వేలకొలది స్త్రీలలో, బహూనామ్ = అనేకు లైన, ఉపజీవినామ్ = సేవకులలో, మనుజర్షభాత్, అన్యత్ర = మనుజులలో శ్రేష్ఠ డైన రాముడు కాక, కః = ఎవడు, తే = నీకు, భూయ స్తరమ్ = అధికముగా, శుశ్రూషామ్ = శుశ్రూషను, గౌరవమ్ = గౌరవమును, ప్రమాణం చైవ = అధిక పూజను, వచనక్రియామ్ = ఆజ్ఞానిర్వాహమును, కుర్యాత్ = చేయును.

తా. అంతఃపురములో, వేలకొలది స్త్రీ లున్నారు. చాలమంది సేవకులున్నారు. కాని, నీకు సేవలు చేయుచు, నీపై గౌరవభావముతో పూజలు చేయుచు, నీవు చెప్పిన పనులు చేయువాడు రాముడు తక్క మరెవ్వరున్నారు ? 26

మూ. పరివాదోఽపవాదో వా రాఘవే నోపపద్యతే, 27
సాన్త్వయన్ సర్వభూతాని రామః శుద్ధేన చేతసా,
గృహ్ణాతి మనుజవ్యాఘ్రః ప్రియైర్విషయవాసినః. 28

ప్ర. అ. రాఘవే = రాముని విషయమున, పరివాదః = పరివాదము గాని, అపవాదో వా = అపవాదము గాని, నోపపద్యతే = సంభావ్యము కాదు. మనుజవ్యాఘ్రః = మనుష్యులలో శ్రేష్ఠ డైన, రామః = రాముడు, శుద్ధేన = పరిశుద్ధ మైన, చేతసా = చిత్తముతో, సర్వభూతాని = సమస్తప్రాణులను, సాన్త్వయన్ = మంచి చేసికొనుచు, విషయవాసినః = దేశములో నున్నవారిని, ప్రియైః = వారికి ప్రియ మైన కార్యములచే, గృహ్ణాతి = స్వాధీనులను చేసికొనుచున్నాడు.

తా. మనుజశ్రేష్ఠు డైన రాముడు, పరిశుద్ధ మైన చిత్తముతో సర్వప్రాణులతో, మంచి చేసికొనుచు, దేశములోని ప్రజల నందరిని ప్రియకార్యములచే తన

అనుకూలురను చేసికొనుచున్నాడు. అందుచే రాముని విషయమున పరివాదము గాని, అపవాదము గాని ఉండుటకు అవకాశము లేదు.

వి. ఏదైన అకార్యమును చేయుటచే వచ్చిన నింద పరివాదము. అకార్య మేమియు చేయక పోయినను వచ్చిన నింద అపవాదము. 27, 28

మూ. సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః,
గురూన్ శుశ్రూషయా వీరో ధనుషా యుధి శాత్రవాన్. 29

ప్ర. అ. వీరః = దానవీరుడూ, దయావీరుడూ, ధర్మవీరుడూ, పరాక్రమ వీరుడూ అయిన, రాఘవః = రాముడు, సత్యేన = సత్యముచేత, లోకాన్ = జనులను, లేదా పుణ్యలోకములను, జయతి = జయించుచున్నాడు. దానేన = దానము చేత, దీనాన్ = దీనులను, జయతి=వశపరచుకొనుచున్నాడు. శుశ్రూషయా= శుశ్రూషచేత, గురూన్=పెద్దలను, జయతి=వశము చేసుకొనుచున్నాడు, యుధి= యుద్ధమునందు, ధనుషా=ధనస్సుతో, శాత్రవాన్=శత్రువులను, జయతి = జయించుచున్నాడు.

తా. రాముడు మహావీరుడు. ధర్మవీరత్వము, దయావీరత్వము, దాన వీరత్వము, యుద్ధవీరత్వము అను నాల్గు విధము లైన వీరత్వము కలవాడు. సత్యవ్రతముచే అతడు ప్రజల విశ్వాసము చూరగొని, వారి నందరిని వశమునం దుంచుకొనుచున్నాడు. లేదా పరలోకములను సంపాదించుకొనుచున్నాడు. దానము చేసి దీనులను తన యధీనములో ఉంచుకొనుచున్నాడు. శుశ్రూష చేసి గురువుల మన్ననలు పొందుచున్నాడు. యుద్ధమునందు పరాక్రమముచే శత్రువులను జయించుచున్నాడు. 29

మూ. సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచమార్జవమ్,
విద్యా చ గురుశుశ్రూషా ధ్రువాణ్యేతాని రాఘవే. 30

ప్ర. అ. సత్యమ్=సత్యము, దానమ్ = దానము, తపః = తపస్సు, త్యాగః=స్వీయసుఖాదిపరిత్యాగము, శౌచమ్=పరిశుద్ధత్వము, ఆర్జవమ్=నిష్కాపట్యము, విద్యా చ=విద్యయు, గురుశుశ్రూషా=గురుసేవాసక్తి, ఏతాని=ఇవి, రాఘవే=రామునియందు, ధ్రువాణి=స్థిర మైనవి.

తా. సత్యము, దానము, తపస్సు, పరులకొరకై స్వీయసుఖాదిత్యాగము, త్రికరణ పరిశుద్ధి, నిష్కాపట్యము, విద్య, గురుశుశ్రూష ఇవి రామునియందు స్థిర మైన గుణములు. 30

మూ. తస్మిన్నార్జవసంపన్నే దేవి దేవోపమే కథమ్,
పాపమాశంససే రామే మహర్షిసమతేజసి. 31

ప్ర. అ. దేవి=కైకేయీ! ఆర్జవసంపన్నే=ఋజుత్వముతో కూడినవాడూ, దేవోపమే=దేవతతో సమానుడూ; మహర్షిసమతేజసి=మహర్షితో సమానమైన తేజస్సు కలవాడూ అయిన, తస్మిన్ రామే=ఆ రాముని విషయమున, కథమ్=ఎట్లు, పాపమ్=పాపమును, ఆశంససే=కోరుచున్నావు?

తా. కైకేయీ! రాముడు కపటము ఎరుగనివాడు. దేవతలతో సమానుడు. మహర్షుల తేజస్సు వంటి తేజస్సు కలవాడు. అట్టి రాముని విషయమునందు కూడ నీకు ఈ పాపపు బుద్ధి ఎట్లు కలిగినది? 31

మూ. న స్మరామ్యప్రియం వాక్యం లోకస్య ప్రియవాదినః,
స కథం త్వత్కృతే రామం వక్ష్యామి ప్రియమప్రియమ్.

ప్ర. అ. లోకస్య=లోకమునకు, ప్రియవాదినః=ప్రియమును పలుకు ఆ రామునియొక్క, అప్రియమ్=అప్రియమైన, వాక్యమ్=వాక్యమును, న స్మరామి=స్మరింపను. సః=అట్టి నేను, ప్రియమ్=నాకు అత్యంతప్రేమపాత్రుడైన, రామమ్=రాముని గూర్చి, త్వత్కృతే=నీ నిమిత్తమై, అప్రియమ్=అప్రియవాక్యమును, కథమ్=ఎట్లు, వక్ష్యామి=పలికెదను.

తా. రాముడు జను లందరితోడను ప్రియముగనే మాటలాడు స్వభావము గలవాడు. అట్టి రాముడు ఎన్నడును అప్రియమైన వాక్యము పలికినట్లు నా స్మృతిపథములో లేదు. ప్రేమపాత్రుడైన అట్టి రామునితో, నీ కొరకై అప్రియవాక్యమెట్లు చెప్పగలను? 32

మూ. క్షమా యస్మిన్ దమస్త్యాగః సత్యం ధర్మః కృతజ్ఞతా,
అప్యహింసా చ భూతానాం తమృతే కా గతిర్మమ. 33

ప్ర. అ. యస్మిన్=ఏ రామునియందు, క్షమా=ఓర్పు, దమః=ఇంద్రియనిగ్రహము, త్యాగః=త్యాగము, సత్యమ్=సత్యము, ధర్మః=ధర్మము,

కృతజ్ఞతా = కృతజ్ఞత్వము, అపి చ = మరియు, భూతానామ్ = ప్రాణుల యొక్క, అహింసా = అహింసయు ఉన్నవో, తమ్ ఋతే = అట్టి రాముని విడచి, మమ = నాకు, కా గతిః = ఏమి గతి యున్నది?

తా. ఓర్పు, ఇంద్రియనిగ్రహము, త్యాగము, సత్యము, ధర్మము, కృతజ్ఞత్వము, సకలభూతాహింస అను గుణములు రాముని యందున్నవి. అట్టి రాముడు తప్ప నాకు వేరెవ్వరు గతి ఉన్నారు? 33

మూ. మమ వృద్ధస్య కైకేయి గతాన్తస్య తపస్వినః,
దీనం లాలప్యమానస్య కారుణ్యం కర్తుమర్హసి. 34

ప్ర. అ. కైకేయి = కైకేయీ! వృద్ధస్య = వృద్ధుడను, గతాన్తస్య = పొందబడిన ఆయుర్దాయము యొక్క అంతము కలవాడను, తపస్వినః = దీనుడను, దీనమ్ = దీనముగా, లాలప్యమానస్య = విలపించుచున్న వాడను అయిన, మమ = నా విషయమున, కారుణ్యమ్ = కారుణ్యమును, కర్తుమ్ = చేయుటకు, అర్హసి = తగియున్నావు.

తా. కైకేయీ! నేను ఆయువు చివరిభాగమున నున్న ముసలివాడను. దీనుడను. దైన్యముతో విలపించుచున్నాను. నాపై కరుణ చూపుము. 34

మూ. పృథివ్యాం సాగరాన్తాయాం యత్కిఞ్చిదధిగమ్యతే,
తత్సర్వం తవ దాస్యామి మా చ త్వాం మన్యురావిశేత్.

ప్ర. అ. సాగరాన్తాయామ్ = సముద్రము అంతముగా గల, పృథివ్యామ్ = భూమియందు, యత్కిఞ్చిత్ = ఏది, అధిగమ్యతే = పొందబడుచున్నదో, తత్ సర్వమ్ = దాని నంతను, తవ = నీకు, దాస్యామి = ఇవ్వగలను. త్వామ్ = నిన్ను, మన్యుః = కోపము, మా ఆవిశేత్ = ఆవేశింపకుండుగాక.

తా. సముద్రమువరకు వ్యాపించియున్న ఈ పృథివిలో ఉన్న దంతయు నీకు ఇచ్చెదను. నీవు కోపము చెందకుము. 35

మూ. అఞ్జలిం కుర్మి కైకేయి పాదౌ చాపి స్పృశామి తే,
శరణం భవ రామస్య మాఽధర్మో మామిహ స్పృశేత్. 36

ప్ర. అ. కైకేయి = ఓ కైకేయీ! అఞ్జలిం కుర్మి = దోసిలి యొగ్గుచున్నాను. తే = నీయొక్క, పాదౌ = పాదములను, స్పృశామి చాపి = స్పృశించుచు కూడ. రామస్య = రామునకు, శరణమ్ = రక్షకురాలవు, భవ = అగుము. మామ్ = నన్ను, అధర్మః = అధర్మము, ఇహ = ఈ విషయమున, మా స్పృశేత్ = స్పృశింపకుండు గాక.

తా. కైకేయీ! చేతులు జోడించి నమస్కరించుచున్నాను. నీ పాదములు కూడ పట్టుకొనెదను. రాముని రక్షింపుము. ఈ విషయమున నాకు అధర్మము కలుగకుండ చూడుము. 86

మూ. ఇతి దుఃఖాభిసన్తప్తం విలపన్తమచేతనమ్,
ఘూర్ణమానం మహారాజం శోకేన సమభిప్లుతమ్. 87
పారం శోకార్ణవస్యాశు ప్రార్థయన్తం పునః పునః,
ప్రత్యువాచాథ కైకేయీ రౌద్రా రౌద్రతరం వచః. 88

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రౌద్రా = క్రూరస్వభావురాలైన, కైకేయీ = కైకేయి, ఇతి = ఈ విధముగా, దుఃఖాభిసన్తప్తమ్ = దుఃఖముచే పీడింపబడిన వాడూ, విలపన్తమ్ = విలపించుచున్నవాడూ, అచేతనమ్ = చైతన్యములేనివాడూ, ఘూర్ణమానమ్ = తిరిగిపోవుచున్నవాడూ, శోకేన = శోకముచేత, సమభిప్లుతమ్ = నిండినవాడూ, పునః పునః = మాటి మాటికిని, శోకార్ణవస్య = శోకసముద్రము యొక్క, పారమ్ = అవలిఒడ్డును, ఆశు = శీఘ్రముగా, ప్రార్థయన్తమ్ = కోరుచున్న వాడూ అయిన, రాజానమ్ = రాజును గూర్చి, రౌద్రతరమ్ = మిక్కిలి భయంకరమైన, వచః = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. పిమ్మట, క్రూరురాలైన కైకేయి, దుఃఖముతో తపించుచున్నవాడూ, విలపించుచున్నవాడూ, చైతన్యము కోల్పోయి అల్లాడుచున్నవాడూ, శోకముతో నిండినవాడూ, శీఘ్రముగా ఆ శోకసముద్రము దాటవలెనని మాటిమాటికిని కోరుచున్నవాడూ అయిన ఆ దశరథునితో ఇంకను క్రూరమైన మాట పలికెను. 87, 88

మూ. యది దత్వా వరౌ రాజన్ పునః ప్రత్యనుతప్యసే,
ధార్మికత్వం కథం వీర పృథివ్యాం కథయిష్యసి 89

ప్ర. అ. రాజన్ = రాజా! వరౌ = వరములను, దత్త్వా = ఇచ్చి, పునః = మరల, ప్రత్యనుతప్యసే యది = ఈ విధముగ పశ్చాత్తాపముతో దుఃఖించు చున్నట్లయితే, వీర = వీరుడా! పృథివ్యామ్ = భూమియందు, ధార్మికత్వమ్ = ధార్మికత్వమును, కథమ్ = ఎట్లు, కథయిష్యసి = చెప్పగలవు.

తా. వీరుడ వైన మహారాజా! రెండు వరముల నిచ్చి ఇపు డీ విధముగ పశ్చాత్తాపముతో దుఃఖించుచున్నచో నేను ధార్మికుడ నని లోకములో ఎట్లు చాటుకొనగలవు? 39

మూ. యదా సమేతా బహవస్త్వయా రాజర్షయన్నృప,
కథయిష్యన్తి ధర్మజ్ఞ తత్ర కిం ప్రతివక్ష్యసి. 40

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మముల నెరిగినవాడా! త్వయా = నీతో, సమేతాః = కలిసినవారై, బహవః = అనేకులైన, రాజర్షయః = రాజర్షులు, యదా = ఎప్పుడు, కథయిష్యన్తి = ముచ్చటింతురో, తత్ర = అపుడు, కిమ్ = ఏమి, ప్రతి వక్ష్యసి = బదులు చెప్పెదవు?

తా. సర్వధర్మముల నెరిగినవాడా! అనేక రాజర్షులు నిన్ను కలిసి నీతో ఈ విషయము ముచ్చటించి నపుడు నీ వేమి సమాధానము చెప్పెదవు? 40

మూ. యస్యాః ప్రసాదే జీవామి యా చ మామభ్యపాలయత్,
తస్యాః కృతం మయా మిథ్యా కైకేయ్యా ఇతి వక్ష్యసి.

ప్ర. అ. యస్యాః = ఏ కైకేయి యొక్క, ప్రసాదే = అనుగ్రహమునందు (చేత), జీవామి = జీవించుచున్నానో, యా = ఏ కైకేయి, మామ్ = నన్ను, అభ్యపాలయత్ = రక్షించినదో, తస్యాః = అట్టి, కైకేయ్యాః = కైకేయి విషయమున, మయా = నా చేత, మిథ్యాకృతమ్ = అసత్యప్రవర్తనము చేయబడినది, ఇతి = అని, వక్ష్యసి = చెప్పగలవా?

తా. "ఏ కైకేయి అనుగ్రహముచేత నే నింకను జీవించుచున్నానో, ఏ కైకేయి నన్ను రక్షించినదో అట్టి కైకేయికి మాట ఇచ్చి వెను కాడితిని" అని చెప్పెదవా? 41

మూ. కిల్బిషం త్వం నరేన్ద్రాణాం కరిష్యసి నరాధిప,
యో దత్త్వా వరమద్యైవ పునరన్యాని భాషసే. 42

ప్ర. అ. నరాధిప = మహారాజా! యః = ఏ నీవు, అద్యైవ = ఇప్పుడే. వరమ్ = వరమును, దత్త్వా = ఇచ్చి, పునః = మరల, అన్యాని = మరొక విధముగు మాటలను, భాషసే = పలుకుచున్నావో, త్వమ్ = అట్టి నీవు, నరేన్ద్రాణామ్ = రాజులకు, కిల్బిషమ్ = అపనిందను, కరిష్యసి = కల్పించగలవు.

తా. మహారాజా! వర మిచ్చెద నని ఇప్పుడే చెప్పి, మరల ఏవేవో మాట లాడుచున్న నీవు భూపతులకే కళంకము తెచ్చుచున్నావు. 42

మూ. శైబ్యః శ్యేనకపోతీయే స్వమాంసం పక్షిణే దదౌ,
అలర్కశ్చక్షుషీ దత్త్వా జగామ గతిముత్తమామ్. 43

ప్ర. అ. శ్యేనకపోతీయే = డేగకును, పావురమునకు విరోధము కలిగినపుడు, శైబ్యః = శైబ్యుడు, పక్షిణే = డేగకు, స్వమాంసమ్ = తన మాంసమును, దదౌ = ఇచ్చెను. అలర్కః = అలర్కమహారాజు, చక్షుషీ = నేత్రములను, దత్త్వా = ఇచ్చి, ఉత్తమాం గతిమ్ = ఉత్తమ మైన గతిని, జగామ = పొందెను.

తా. డేగకును పావురమునకు మధ్య విరోధము కలిగినపుడు శైబ్యుడు, డేగకు తన మాంసము నిచ్చివేసెను. అలర్కుడను రాజు తన నేత్రములు దానము చేసి ఉత్తమగతి పొందెను.

వి. ఒకప్పుడు ఇంద్రాగ్నులు శైబ్యుని ఔదార్యమును పరీక్షింపగోరిరి. ఇంద్రుడు డేగ రూపమును అగ్ని పావురము రూపమును ధరించెను. డేగ పావురమును చంపుటకై దానిని తరుముకొని రాగా అది శైబ్యునిచేరి అభయము కోరెను. అతడు దానికి అభయ మిచ్చి పావురము ఎత్తు మాంసమును తన శరీరమునుండి కోసి ఇచ్చెను. ఇంద్రాగ్నులు ప్రత్యక్ష మై అతని ఔదార్యమును ప్రశంసించిరి.

అలర్కుడను రాజు తనను యాచింపవచ్చిన ఒక గ్రుడ్డి బ్రాహ్మణునితో వరము కోరుకొమ్మని చెప్పగా అతడు "నీ నేత్రములను ఇమ్ము" అని కోరెను. ఆ రాజు వెంటనే తన నేత్రములను అతనికి దానము చేసెను. 43

మూ. సాగరః సమయం కృత్వా న వేలామతివర్తతే,
సమయం మాఽనృతం కార్షీః పూర్వవృత్తమనుస్మరన్.

ప్ర. అ. సాగరః = సముద్రము, సమయమ్ = ప్రతిజ్ఞను, కృత్వా = చేసి, వేలామ్ = చెలియలికట్టను, న అతివర్తతే = దాటుటలేదు. పూర్వవృత్తమ్ = పూర్వరాజాదుల చరిత్రను, అనుస్మరన్ = స్మరించుచున్నవాడవై, సమయమ్ = ప్రతిజ్ఞను, అనృతమ్ = అసత్యమునుగా, మా కార్షీః = చేయకుము.

తా. సముద్రము తాను పూర్వము దేవతల కిచ్చిన మాటపై నిలబడి చెలియలికట్టను దాటుటలేదు. అట్టి పూర్వపురుషుల చరిత్రను మనస్సులో నుంచుకొని చేసిన ప్రతిజ్ఞను అసత్యము చేయకుము. 44

మూ. స త్వం ధర్మం పరిత్యజ్య రామం రాజ్యేఽభిషిచ్య చ,
సహ కౌసల్యయా నిత్యం రన్తుమిచ్ఛసి దుర్మతే. 45

ప్ర. అ. దుర్మతే = దుష్టబుద్ధి కలవాడా! సః త్వమ్ = అట్టి నీవు, ధర్మమ్ = ధర్మమును, పరిత్యజ్య = విడచి, రామమ్ = రాముని, రాజ్యే = రాజ్యమునందు, అభిషిచ్య చ = అభిషేకించి, కౌసల్యయా సహ = కౌసల్యతో కూడ, నిత్యమ్ = నిత్యము, రన్తుమ్ = క్రీడించుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. ఓ దుష్టబుద్ధీ! నీవు ధర్మమును విడచి, రాముని రాజ్యాభిషిక్తుని చేసి, నిత్యము కౌసల్యతో క్రీడింపవలె నని కోరుచున్నావు. 45

మూ. భవత్వధర్మో ధర్మో వా సత్యం వా యది వానృతమ్,
యత్త్వయా సంశ్రుతం మహ్యం తస్య నాస్తి వ్యతిక్రమః.

ప్ర. అ. అధర్మః = అధర్మముగాని, ధర్మో వా = ధర్మము గాని, సత్యం వా = సత్యము గాని, యది వా = లేక, అనృతమ్ = అసత్యము గాని, భవతు = అగుగాక, త్వయా = నీచేత, మహ్యమ్ = నా కొరకు, యత్ = ఏది, ప్రతిశ్రుతమ్ = ప్రతిజ్ఞ చేయబడినదో, తస్య = దానికి, వ్యతిక్రమః = మార్పు, నాస్తి = లేదు.

తా. నేను కోరినది అధర్మము కానిమ్ము, ధర్మము కానిమ్ము, సత్యము కానిమ్ము, అసత్యము కానిమ్ము. నీవు నాకిచ్చిన వరమును కాదనుటకు వీలు లేదు. 46

మూ. అహం హి విషమద్యైవ పీత్వా బహు తవాగ్రతః,
పశ్యతస్తే మరిష్యామి రామో యద్యభిషిచ్యతే. 47

ప్ర. అ. రామః=రాముడు, అభిషిచ్యతే యది = అభిషేకింపబడినట్లైతే, అహమ్ = నేను, అద్యైవ = ఇప్పుడే, తవ = నీయొక్క, అగ్రతః = ఎదుట బహు = అధిక మైన, విషమ్ = విషమును, పీత్వా = త్రాగి, తే పశ్యతః = నీవు చూచుచుండగనే, మరిష్యామి హి = మరణించెదను గదా.

తా. రాముడు పట్టాభిషిక్తు డైనచో నేను నీ ఎదుటనే విషము త్రాగి, ఆపుడే నీవు చూచుచుండగనే మరణించెదను. 47

మూ. ఏకాహమపి పశ్యేయం యద్యహం రామమాతరమ్,
అఞ్జలిం ప్రతిగృహ్ణన్తీం శ్రేయో నను మృతిర్మమ. 48

ప్ర. అ. అహమ్=నేను, ఏకాహమపి = ఒక్క దివసమునం దైనను, రామ మాతరమ్ = రాముని తల్లి యైన కౌసల్యను, అఞ్జలిమ్ = నా దోసిలిని, ప్రతి గృహ్ణన్తీమ్=స్వీకరించుచున్న దానినిగా, పశ్యేయం యది = చూడవలసినదానను అయినట్లైతే, మమ = నాకు, మృతిః=మరణమే, శ్రేయః నను = శ్రేయస్కరము గదా.

తా. రాముని తల్లి యైన కౌసల్యకు ఒక్కనా డైనను నమస్కరింపవలసి యుండుటకంటె మరణమే నాకు శ్రేయస్కరము కదా। 48

మూ. భరతేనాత్మనా చాహం శపే తే మనుజాధిప,
యథా నాన్యేన తుష్యేయమృతే రామవివాసనాత్. 49

ప్ర. అ. మనుజాధిప = రాజా! భరతేన = భరతునిచేతను (మీదను), ఆత్మనా చ = నాచేతను (మీదను), తే=నీకు, శపే=ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. యథా = ఏమనగా, రామవివాసనాత్ ఋతే = రాముని ప్రవాసము పంపుట తప్ప, అన్యేన = మరి దేనిచేతను కూడ, న తుష్యేయమ్ = సంతసింపను.

తా. రాజా! భరతునిపైనను, నా పైనను ఒట్టు పెట్టి చెప్పుచున్నాను- రాముని ప్రవాసమునకు పంపుట తప్ప మరి దేనివలనను నేను సంతసింపను. 49

మూ. ఏతావదుక్త్వా వచనం కైకేయీ విరరామ హ,
విలపన్తం చ రాజానం న ప్రతివ్యాజహార సా. 50

ప్ర. అ. కైకేయీ = కైకేయి, ఏతావత్ = ఇంత, వచనమ్=వచనమును, ఉక్త్వా = పలికి, విరరామ హ = విరమించెను. విలపన్తమ్ = విలపించుచున్న, రాజానమ్ = రాజును గూర్చి, సా = ఆమె, న ప్రతివ్యాజహార = మారుమాటాడ లేదు.

తా. కైకేయి ఈ విధముగ పలికి ఊరకుండెను. దశరథుడు ఎంత విలపించినను మారుమాటాడలేదు. 50

మూ. శ్రుత్వా తు రాజా కైకేయ్యా వృతం పరమశోభనమ్,
రామస్య చ వనే వాసమైశ్వర్యం భరతస్య చ, 51
నాభ్యభాషత కైకేయీం ముహూర్తం వ్యాకులేన్ద్రియః.

ప్ర. అ. రాజా తు = దశరథమహారాజైతే, కైకేయ్యా = కైకేయిచేత, వృతమ్ = కోరబడినదీ, పరమ్ = మిక్కిలి, అశోభనమ్ = చెడ్డదీ అయిన, రామస్య = రామునకు, వనే వాసమ్ = వనమునందు నివాసమును, భరతస్య = భరతునకు, ఐశ్వర్యం చ = ఐశ్వర్యమునూ, శ్రుత్వా = విని, ముహూర్తమ్ = క్షణకాలము, వ్యాకులేన్ద్రియః = వ్యాకులమైన ఇంద్రియములు కలవాడై, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, నాభ్యభాషత = మాటలాడ లేదు.

తా. కైకేయి కోరిన చాల చెడ్డదైన రామవనవాసమునూ భరతుని రాజ్యాభిషేకమునూ వినగానే దశరథమహారాజు క్షణకాలము పాటు నిశ్చేష్టుడై పోయెను. కైకేయితో ఏమీ మాట్లాడలేదు. 51

మూ. ప్రైక్షతానిమిషో దేవీం ప్రియామప్రియవాదినీమ్. 52
తాం హి వజ్రసమాం వాచమాకర్ణ్య హృదయాప్రియామ్,
దుఃఖశోకమయీం ఘోరాం రాజా న సుఖితోఽభవత్. 53

ప్ర. అ. అప్రియవాదినీమ్=అప్రియముగా మాటలాడుచున్న, ప్రియామ్= ప్రియురాలైన, దేవీమ్ = దేవిని, అనిమిషః = రెప్పపాటు లేనివాడై, ప్రైక్షత=

చూచెను. వజ్రసమామ్ = పిడుగుపాటుతో సమానమైనదీ, హృదయాప్రియామ్ = హృదయానికి ప్రియముకానిదీ, దుఃఖశోకమయీమ్ = దుఃఖశోకములతో నిండినదీ, ఘోరామ్ = ఘోర మైనదీ అయిన, తాం వాచమ్ = ఆ మాటను, ఆకర్ణ్య = విని, రాజా = రాజు, సుఖితః = సుఖము కలవాడు, న అభూత్ = కాలేదు.

తా. అతడు అప్రియముగా మాటలాడుచున్న ఆ ప్రియురా లైన కైక వైపు రెప్పపాటు వేయకుండా చూచెను. పిడుగుపాటు వలె ఉన్నదీ, హృదయానికి అనిష్టమైనదీ, దుఃఖశోకాలను కలిగించేదీ, ఘోరమూ, అయిన ఆ మాట విన్న ఆ రాజుకు ఏ మాత్రమూ సుఖము కలగలేదు. 53

మూ. స దేవ్యా వ్యవసాయం చ ఘోరం చ శపథం కృతమ్,
ధ్యాత్వా రామేతి నిశ్శ్వస్య ఛిన్నస్తరురివాపతత్. 54

ప్ర. అ. సః = అతడు, దేవ్యాః = కైకయొక్క, వ్యవసాయం చ = నిర్ణయమునూ, కృతమ్ = చేయబడిన, ఘోరమ్ = ఘోరమైన, శపథం చ = శపథమునూ, ధ్యాత్వా = తలచుకొని, నిశ్శ్వస్య = నిట్టూర్చి, రామ ఇతి = "రామా" అని పలికి, ఛిన్నః = ఛేదింపబడిన, తరురివ = వృక్షము వలె, అపతత్ = పడిపోయెను.

తా. కైక నిర్ణయమూ, ఆమె చేసిన శపథమూ తలచుకొనుచు, అతడు నిట్టూర్చి, తెగగొట్టిన చెట్టు వలె నేలమీద వ్రాలిపోయెను. 54

మూ. నష్టచిత్తో యథోన్మత్తో విపరీతో యథాతురః,
హృతతేజా యథా సర్పో బభూవ జగతీపతిః. 55

ప్ర. అ. జగతీపతిః = భూమికి ప్రభు వైన ఆ రాజు, నష్టచిత్తః = నష్టమైన చిత్తముగలు, ఉన్మత్తః ఇవ = పిచ్చివాడు వలె, విపరీతః = విపరీతముగా ప్రవర్తించుచున్న, ఆతురః ఇవ = రోగి వలె, హృతతేజాః = హరింపబడిన తేజస్సుగలు, సర్పః ఇవ = సర్పము వలె, బభూవ = అయినాడు.

తా. అప్పు డా రాజు మతి చలించిన పిచ్చివాడు వలె, విపరీతముగా ప్రవర్తించుచున్న రోగి వలె, మంత్రాదులచేత శక్తి తొలగించిన సర్పము వలె అయిపోయెను. 55

మూ. దీనయా తు గిరా రాజా ఇతి హోవాచ కైకయీమ్,
అనర్థమిదమర్థాభం కేన త్వముపదర్శితా. 56
భూతోపహతచిత్తేవ బ్రువన్తీ మాం న లజ్జసే.

ప్ర. అ. రాజా = రాజు, దీనయా = దీనమైన, గిరా = వాక్కుతో, కైకయీమ్ = కైకను గూర్చి, ఇతి = ఈ విధంగా, ఉవాచ హ = పలికెను. అర్థాభమ్ = ప్రయోజనకరము వలె ఉన్న, అనర్థమ్ = ఈ అనర్థమును, కేన = ఎవని చేత, త్వమ్ = నీవు, ఉపదర్శితా = చూపబడితివి? భూతోపహతచిత్తేవ = భూతముచేత పాడుచేయబడిన మనస్సు కలదానవు వలె, మామ్ = నన్ను గూర్చి, బ్రువన్తీ = మాటలాడుచూ, న లజ్జసే = సిగ్గుపడకుండా ఉన్నావు?

తా. ఆ రాజు కైకేయితో దీనముగా ఇట్లు అనెను. "పైకి లాభకరము వలె కనబడే ఈ అనర్థకరమైన ఆలోచన నీకు ఎవరు చెప్పినారు? పిశాచము ఆవహించి చెడిన మనస్సు కలదానవు వలె నాతో మాటలాడుచున్నావు! సిగ్గు లేదా? 56

మూ. శీలవ్యసనమేతత్తే నాభిజానామ్యహం పురా,
బాలాయాస్తత్త్విదానీం తే లక్షయే విపరీతవత్. 57

ప్ర. అ. పురా = పూర్వము, బాలాయాః = చిన్నదానవుగా ఉన్న, తే = నీ యొక్క, ఏతత్ = ఈ, శీలవ్యసనమ్ = శీలభ్రంశమును, అహమ్ = నేను, నాభిజానామి = గుర్తించలేదు. తు = కాని, ఇదానీమ్ = ఇప్పుడు, తే = నీకు, తత్ = దానిని, లక్షయే = చూచుచున్నాను. విపరీతవత్ = విపరీతము వలె ఉన్నది.

తా. పూర్వము నీ చిన్నతనములో ఇలాంటి బుద్ధి వైపరీత్యము ఉన్నట్లు నేనెన్నడూ చూడలేదు. అయితే ఇపుడట్టి వైపరీత్యము కనబడుచున్నది. 57

మూ. కుతో వా తే భయం జాతం యా త్వమేవంవిధం వరమ్,
రాష్ట్రే భరతమాసీనం వృణీషే రాఘవం వనే. 58

ప్ర. అ. తే = నీకు, కుతః వా = ఎవరినుండి, భయమ్ = భయము, జాతమ్ = కలిగినది? యా = ఏ నీవు, భరతం = భరతుని, రాష్ట్రే = రాష్ట్రములో,

ఆసీనం = కూర్చుండే వానినిగానూ, రాఘవమ్=రాముని, వనే = వనమునందు ఉండేవానిని గానూ, ఏవంవిధం = ఈ విధ మైన, వరమ్ = వరమును, వృణీషే = కోరుచున్నావో?

తా. భరతుడు రాజ్యము పొంది రాష్ట్రములో ఉండవలెననీ, రాముడు అడవులకు వెళ్లవలెననీ. ఇట్టి వరాలు కోరుతున్నావు; నీకు ఎవరి వల్ల భయము కలిగినది? 58

మూ. విరమైతేన భావేన త్వమేతేనానృతేన వా, 59
యది భర్తుః ప్రియం కార్యం లోకస్య భరతస్య చ.

ప్ర. అ. భర్తుః = భర్తకూ, లోకస్య = లోకానికీ, భరతస్య చ = భరతునకూ, ప్రియమ్ = ప్రియము, కార్యం యది=చేయదగినదైతే, ఏతేన భావేన = భరతునకు రాజ్యము కావా లనే ఈ భావముతోనూ, అనృతేన = పాపమైన, ఏతేన వా = రామవనవాస మనే అభిప్రాయముతోనూ, త్వమ్ = నీవు, విరమ= విరమించుము.

తా. నీ భర్తకూ, లోకానికీ, భరతునికీ, ప్రియము చేయవలె నని అనుకున్నచో భరతునికి రాజ్యము ఇవ్వవలెను, రాముడు అడవులకు వెళ్లవలెను. అనే ఈ భావాలను విడిచిపెట్టుము. 59

మూ. నృశంసే పాపసంకల్పే క్షుద్రే దుష్కృతకారిణి, 60
కిం ను దుఃఖమలీకం వా మయి రామే చ పశ్యసి.

ప్ర. అ. నృశంసే=క్రూరురాలా! పాపసంకల్పే=పాప మైన ఆలోచనలు కలదానా! క్షుద్రే=నీచురాలా! దుష్కృతకారిణి = పాపము చేయుదానా! మయి= నాయందు, రామే చ = రామునియందు, కిం ను = ఏ, దుఃఖమ్ = దుఃఖకర మైన విషయము కాని, అలీకం వా = అపరాధమును గాని, పశ్యసి = చూచుచున్నావు?

తా. క్రూరురాలా! పాపసంకల్పురాలా! నీచురాలా! పాపకృత్యాలు ఆచరించేదానా! నాలోనూ, రామునిలోనూ, నీకు ఏమి దుఃఖకరవిషయాలు గానీ, అపరాధాలు గాని కనబడినాయి? 60

మూ. న కథంచి దృతే రామాద్భరతో రాజ్యమావసేత్, 61
రామాదపి హి తం మన్యే ధర్మతో బలవత్తరమ్.

ప్ర. అ. రామాదృతే=రాముని విడచి, భరతః=భరతుడు, కథంచిత్= ఏ విధంగానూ కూడ, రాజ్యమ్=రాజ్యమును, న ఆవసేత్=అధిష్ఠించడు. హి=ఎందు వలన అనగా, తమ్=వానిని, రామాదపి=రామునికంటె కూడా, ధర్మతః=ధర్మమువలన, బలవత్తరమ్=ఎక్కువ బలము కలవానినిగా, మన్యే=తలచుచున్నాను.

తా. రాముని కాదని భరతుడు ఏ విధంగానూ కూడా రాజ్యము అంగీకరించడు. ఎందుచేత ననగా ధర్మము విషయములో రామునికంటె కూడా భరతుడు ఎక్కువ పట్టుదలకలవా డని నా అభిప్రాయము. 61

మూ. కథం ద్రక్ష్యామి రామస్య వనం గచ్ఛేతి భాషితే, 62
ముఖవర్ణం వివర్ణం తం యథైవేన్దుముపప్లుతమ్.

ప్ర. అ. వనం గచ్ఛ=అడవికి వెళ్లుము, ఇతి=అని, భాషితే=చెప్పగానే, ఉపప్లుతమ్=గ్రహణము పట్టిన, ఇన్దుమివ=చంద్రుడు వలె ఉన్నదీ, వివర్ణమ్=మారిపోయిన రంగు గలదీ అయిన, రామస్య=రామునియొక్క, ముఖమ్=ముఖమును, కథమ్=ఎట్లు, ద్రక్ష్యామి=చూడగలను ?

తా. "అడవికి వెళ్లుము" అని చెప్పగానే వివర్ణ మైపోయి, గ్రహణము పట్టిన చంద్రుడు వలె ఉన్న రాముని ముఖము ఎలా చూడగలను ? 62

మూ. తాం హి మే సుకృతాం బుద్ధిం సుహృద్భిః సహ నిశ్చితామ్ 63
కథం ద్రక్ష్యామ్యపావృత్తాం పరైరివ హతాం చమూమ్,
కిం మాం వక్ష్యన్తి రాజానో నానాదిగ్భ్యః సమాగతాః, 64
బాలో బతాయ మైక్ష్వాకశ్చిరం రాజ్యమకారయత్.

ప్ర. అ. సుకృతామ్=చక్కగా చేయబడినదీ, సుహృద్భిః సహ=మిత్రులతో గూడ ఆలోచించి, నిశ్చితామ్=నిశ్చయింపబడినదీ అయిన, మే=నా, తాం బుద్ధిమ్=ఆ బుద్ధిని, పరైః=శత్రువులచేత, హతామ్=త్రిప్పి

కొట్టబడిన, చమూమివ = సేనను వలె, అపావృత్తామ్ = తారుమారు చేయబడు చుండగా, కథమ్=ఎట్లు, ద్రక్ష్యామి=చూడగలను? నానాదిగ్భ్యః=అనేకదిక్కులం నుండి, సమాగతాః=వచ్చిన, రాజానః=రాజులు, మామ్=నన్ను గూర్చి, కిమ్= ఏమి, వక్ష్యన్తి=పలుక గలరు? బాలః=మూర్ఖుడైన, అయమ్ ఐక్ష్వాకః=ఈ దశరథుడు, చిరమ్=చాలకాలము, రాజ్యమ్=రాజ్యమును, అకారయత్=చేసినాడు.

తా. నేను స్నేహితులతో ఆలోచించి ఒక చక్కని నిర్ణయము తీసుకున్నాను. అట్టి నిర్ణయమును, శత్రువులు సేనను త్రిప్పి కొట్టినట్లు నీవు విఫలము చేయుచుండగా నే నెట్లు చూడగలను? అనేకప్రాంతాలనుండి వచ్చిన రాజులందరును నన్నే మందురు: "ఈ మూర్ఖుడైన దశరథుడు ఇంతకాలము ఎలా రాజ్యం చేసినాడో!" అని అనరా?

మూ. యదా తు బహవో వృద్ధా గుణవన్తో బహుశ్రుతాః, 65
పరిప్రక్ష్యన్తి కాకుత్స్థం వక్ష్యామి కిమహం తదా.

ప్ర. అ. గుణవన్తః=గుణవంతులూ, బహుశ్రుతాః=బాగా చదువుకున్న వారూ, ఆయిన, బహవః వృద్ధాః=చాల మంది పెద్దలు, కాకుత్స్థమ్ = రాముని గూర్చి, యదా=ఎప్పుడు, మామ్=నన్ను, పరిప్రక్ష్యన్తి=అడుగుదురో, తదా= అప్పుడు, అహమ్=నేను, కిం వక్ష్యామి=ఏమి చెప్పుదును?

తా. గుణవంతులూ విద్యావంతులూ ఆయిన పెద్దలు వచ్చి రాము డేమైనా డని అడిగినచో నే నేమి చెప్పవలెను? 65

మూ. కైకేయ్యా క్లిశ్యమానేన రామః ప్రవ్రాజితో మయా, 66
యది సత్యం బ్రవీమ్యేత త్తదసత్యం భవిష్యతి.

ప్ర. అ. కైకేయ్యా=కైకేయిచేత, క్లిశ్యమానేన=బాధపెట్టబడిన, మయా= నాచేత, రామః=రాముడు, వనమ్=వనమును గూర్చి, ప్రవ్రాజితః = పంపబడి నాడు అని, ఏతత్=ఈ, సత్యమ్=సత్యమును, బ్రవీమి యది = చెప్పినట్లైతే, తత్=అది, అసత్యమ్=అసత్యము, భవిష్యతి=కాగలదు.

తా. "కైకేయి నిర్బంధించటంచేత రాముని అరణ్యానికి పంపినాను" అని నిజమే చెప్పినను దానిని ఎవ్వరూ నమ్మరు. అసత్యము అనుకొందురు. 67

వి. "ఇట్లు చెప్పినట్లైతే రాముని రాజ్యాభిషిక్తుని చేయాలనే నిర్ణయం అసత్యము అవుతుంది" అనే ప్రాచీనవ్యాఖ్య చింత్యము. అది అసత్యం అవటం చెప్పినట్లు చేయకపోవటంచేత గాని, ఇట్లా చెప్పటం చేత కాదు కదా ?

మూ. కిం మాం వక్ష్యతి కౌసల్యా రాఘవే వనమాస్థితే, 67
కిం చైనాం ప్రతివక్ష్యామి కృత్వా చాప్రియమీదృశమ్.

ప్ర. అ. రాఘవే=రాముడు, వనమ్=వనమును, ఆస్థితే=పొందిన వాడగుచుండగా, కౌసల్యా=కౌసల్య, మామ్=నన్ను గూర్చి, కిం వక్ష్యతి=ఏమి పలుకగలదు ? ఈదృశమ్=ఇట్టి, అప్రియమ్=అప్రియమును, కృత్వా చ = చేసి, ఏనామ్=ఈమెను గూర్చి, కిమ్=ఏమి, ప్రతివక్ష్యామి=మారు చెప్పగలను ?

తా. రాముడు అరణ్యానికి వెళ్లినతో కౌసల్య నన్నేమనును ? ఇంతటి అప్రియము చేసి నేనామెకు ఏమి బదులు చెప్పగలను ? 67

మూ. యదా యదా హి కౌసల్యా దాసీవచ్చ సఖీవ చ, 68
భార్యావద్భగినీవచ్చ మాతృవచ్చోపతిష్ఠతి.
సతతం ప్రియకామా మే ప్రియపుత్రా ప్రియంవదా, 69
న మయా సత్కృతా దేవి సత్కారార్హా కృతే తవ.

ప్ర. అ. దేవి = ఓ కైకేయీ! సతతమ్ = ఎల్లప్పుడూ, మే ప్రియకామా =నా ప్రియమునే కోరేదీ, ప్రియపుత్రా = ప్రియమైన పుత్రుడు కలదీ, ప్రియంవదా = ప్రియముగా మాటలాడేదీ అయిన, కౌసల్యా=కౌసల్య, యదా యదా హి =ఎప్పుడెప్పుడు, దాసీవచ్చ=సేవకురాలు వలె, సఖీ వచ్చ = సఖురాలు వలె, భార్యావత్=భార్య వలె, భగినీ వచ్చ=సోదరి వలె, మాతృవచ్చ=తల్లి వలె, ఉపతిష్ఠతి=సమీపించుచుండెడిదో అప్పుడు, సత్కారార్హా=సత్కారాలు పొందుటకు అర్హురాలైన ఆమె, తవ కృతే = నీకొరకై, (నీ మూలంగా), మయా = నా చేత, న సత్కృతా = సత్కరింపబడలేదు.

తా. కౌసల్య సర్వదా నా ప్రియమునే కోరును. పుత్రప్రేమ గలది. ప్రియమైన మాటలే మాటలాడును. అట్టి కౌసల్య ఒక దాసి వలె, సఖురాలు వలె,

భార్య వలె, సోదరి వలె, తల్లి వలె, నా సంతోషము కొరకై నా వద్దకు వచ్చి నపుడు కూడా, నీకు కోపము కలుగుననే భయం చేత, ఆమె సత్కారానికి అర్హురా లైనా, నేను ఆమెను సత్కరించలేదు. 68, 69

మూ. ఇదానీం తత్తపతి మాం యన్మయా సుకృతం త్వయి, 70
అపథ్యవ్యఞ్జనోపేతం భుక్తమన్నమివాతురమ్.

ప్ర. అ. మయా = నాచేత, త్వయి = నీ విషయంలో, సుకృతం ఇతి యత్ = మంచి చేయబడినది అను విషయమేది యున్నదో, తత్ = అది, అపథ్య వ్యంజనోపేతమ్ = అపథ్య మైన వ్యంజనాలతో గూడిన, భుక్తమ్ = తినబడిన, అన్నమ్ = అన్నము, ఆతురమివ = రోగిని వలె, ఇదానీమ్ = ఇప్పుడు, మామ్ = నన్ను, తపతి = బాధించుచున్నది.

తా. నీకు ఎన్నో మంచి ఉపకారాదులు చేసి ఉన్నాను. అది ఈనాడు, అపథ్య మైన వ్యంజనాలు (కూరలు మొ.) కలిపి తిన్న అన్నము రోగిని పీడించి నట్లుగా, నన్ను పీడించుచున్నది. 70

మూ. విప్రకారం చ రామస్య సంప్రయాణం వనస్య చ, 71
సుమిత్రా ప్రేక్ష్య వై భీతా కథం మే విశ్వసిష్యతి.

ప్ర. అ. రామస్య = రామునియొక్క, విప్రకారమ్ = అపకారమునూ, వనస్య = వనానికి, సంప్రయాణం చ = ప్రయాణమునూ, ప్రేక్ష్య = చూచి, భీతా = భయపడిన, సుమిత్రా = సుమిత్ర, కథమ్ = ఎట్లు, మే = నా విషయమున, విశ్వ సిష్యతి = విశ్వసించగలదు?

తా. రాముడు నేను చేసిన అపకారముచే అడవికి వెళ్లిపోవుచుండగా చూచి భయపడిన సుమిత్రకు నామీద విశ్వాసము ఏమి ఉండును? 71

మూ. కృపణం బత వైదేహీ శ్రోష్యతి ద్వయమప్రియమ్, 72
మాం చ పఞ్చత్వమాపన్నం రామం చ వనమాశ్రితమ్.

ప్ర. అ. వైదేహీ = సీత, మామ్ = నన్ను, పఞ్చత్వమ్ ఆపన్నమ్ = మరణము పొందిన వానినిగాను, రామమ్ = రాముని, వనమ్ ఆశ్రితమ్ = వనమును

చేరినవానిని గాను, అప్రియమ్=అప్రియ మైన, ద్వయమ్=రెండు వార్తలను, కృపణమ్=దీనముగా, శ్రోష్యతి=విన గలదు. బత=ఎంత కష్టము.

రా. నేను మరణించినట్లు, రాముడు అరణ్యానికి వెళ్లినట్లు రెండు చెడు వార్తలను సీత, దైన్యముతో వినవలసివచ్చును. ఎంత కష్టము। 72

మూ. వైదేహీ బత మే ప్రాణాన్ శోచన్తీ క్షపయిష్యతి, 73
హీనా హిమవతః పార్శ్వే కిన్నరేణేవ కిన్నరీ.

ప్ర. అ. హిమవతః పార్శ్వే=హిమవత్పర్వతము ప్రక్క, కిన్నరేణ=కిన్నరునితో, హీనా=హీనురాలైన, కిన్నరీవ=కిన్నరి వలె, శోచన్తీ=దుఃఖించుచున్న, వైదేహీ=సీత, మే ప్రాణాన్=నా ప్రాణములను, క్షపయిష్యతి=పోవునట్లు చేయును. బత=ఎంత కష్టము (ఇచట సీత నాకోసమై ప్రాణాలు విడుచుననే వ్యాఖ్య అసంగతము).

రా. హిమవత్పర్వతప్రాంతాన, కింనరుని పోగొట్టుకొన్న కిన్నరి వలె సీత నా ప్రక్కనే ఉండి దుఃఖించుచుండగా నా ప్రాణాలు పోవును. 73

మూ. న హి రామమహం దృష్ట్వా ప్రవసన్తం మహావనే, 74
చిరం జీవితుమాశంసే రుదతీం చాపి మైథిలీమ్.

ప్ర. అ. అహమ్=నేను, మహావనే=గొప్ప అరణ్యమందు, ప్రవసన్తమ్=ప్రవాసము చేయుచున్న, రామమ్=రాముని, రుదతీమ్=విలపించుచున్న, మైథిలీంచ=సీతను, దృష్ట్వా=చూచి, చిరమ్=చిరకాలము, జీవితుమ్=జీవించుటకు, న ఆశంసే హి=కోరను కదా।

రా. రాముడు అరణ్యానికి ప్రవాసానికి వెళ్లుచుండగాను, సీత విలపించుచుండగానూ చూచిన తరవాత నేను జీవించవలెనని ఏ మాత్రము కోరుకొనను గదా। 74

మూ. సా నూనం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి, 75
న హి ప్రవాజితే రామే దేవి జీవితుముత్సహే.

ప్ర. అ. సా=అలాంటి నీవు, విధవా=భర్త లేనిదానవై, సపుత్రా=పుత్రసహితురాలవై, నూనమ్=తప్పక, రాజ్యం కారయిష్యసి=రాజ్యము ఏం

గలవు. దేవి=ఓ కైకా, రామే ప్రవ్రాజితే=రాముడు ప్రవాసానికి వెళ్లిపోగా, జీవితుమ్=జీవించుటకు, న ఉత్సహే=ఉత్సాహపడను కదా?

తా. కైకా : నీవు తప్పక విధవ వై, పుత్రునితో కలిసి రాజ్యము ఏలెదవు లెమ్ము. రాముడు ప్రవాసము వెళ్లిన తరవాత నేను జీవించుట కల్ల. 75

మూ. సతీం త్వామహమత్యన్తం వ్యవస్యామ్యసతీం సతీమ్, 76
రూపిణీం విషసంయుక్తాం పీత్వేవ మదిరాం నరః.

ప్ర. అ. రూపిణీమ్=సౌందర్యము కలదానవు, అత్యన్తమ్=మిక్కిలి, అసతీం సతీమ్=చెడ్డదానవూ అయిన, త్వామ్=నిన్ను, నరః=నరుడు, విష సంయుక్తామ్=విషముతో కూడిన, మదిరామ్=మద్యమును, పీత్వేవ=త్రాగి వలె, సతీమ్=ఉత్తమురాల వని, వ్యవస్యామి=నిశ్చయించుచున్నాను.

తా. నరుడు విషము కలిసిన మద్యము మంచి దనుకొని త్రాగి నట్లు రూపవంతురాలవూ, కాని చాల చెడ్డదానవూ అయిన నువ్వు మంచిదాన వని ఇంతవరకును అనుకొన్నాను. 76

వి. 'పూర్వము మంచిదానవుగా ఉన్న నీవు చెడ్డదానవని ఇపుడు గ్రహించినాను' అనే వ్యాఖ్యకంటె పై వ్యాఖ్య యుక్తము.

మూ. అనృతైర్బహు మాం సాన్త్వైః సాన్త్వయన్తీ స్మ భాషసే, 77
గీతశబ్దేన సంరుధ్య లుబ్ధో మృగమివావధీః.

ప్ర. అ. అనృతైః=అసత్యము లైన, సాన్త్వైః=మంచి మాటలతో, మామ్=నన్ను, బహు=ఎక్కువగా, సాన్త్వయన్తీ=బుజ్జగించుచు, భాషసే స్మ=మాటలాడేదానవు. లుబ్ధః=బోయవాడు, గీతశబ్దేన=సంగీత ధ్వని చేత, సంరుధ్య =కట్టివేసి, మృగమ్ ఇవ =లేడిని వలె, అవధీః =(నన్ను) చంపినావు.

తా. పూర్వము అసత్య మైన మంచి మాట లాడుచు నన్ను చాలా బుజ్జగించుచు, మాటలాడేదానవు. ఇప్పుడు వేటగాడు గీతము పాడి లేడిని కట్టి చంపి నట్లు చంపుచున్నావు. 77

మూ. అనార్య ఇతి మామార్యాః పుత్రవిక్రాయికం ధ్రువమ్, 78
ధిక్కరిష్యన్తి రథ్యాసు సురాపం బ్రాహ్మణం యథా.

ప్ర. అ. ఆర్యాః=పూజ్యులందరూ, పుత్రవిక్రాయికమ్=పుత్రుని అమ్ము కొన్న, మామ్=నన్ను, సురాపమ్=మద్యము త్రాగిన, బ్రాహ్మణం యథా=బ్రాహ్మణుని వలె, అనార్య ఇతి=చెడ్డవాడు అని, రథ్యాసు=వీధులలో, ధ్రువమ్=తప్పక, ధిక్కరిష్యన్తి=నిందించగలరు.

తా. పెద్దలందరూ వీధులలో గుమిగూడి, పుత్రుని అమ్ముకొన్న నన్ను, ఇతడు చాలా చెడ్డవాడు అని అనుచు, మద్యపానము చేసిన బ్రాహ్మణుని నిందించి నట్లు నిందించెదరు. తప్పదు. 78

మూ. అహో దుఃఖమహో కృచ్ఛ్రం యత్ర వాచః క్షమే తవ. 79
దుఃఖమేవంవిధం ప్రాప్తం పురాకృతమివాశుభమ్.

ప్ర. అ. అహో దుఃఖమ్=ఏమి దుఃఖము! అహో కృచ్ఛ్రమ్=ఎంత కష్టము! యత్ర=ఏ పరిస్థితులలో, తవ=నీ, వాచః=వాక్కులను, క్షమే=సహించుచున్నాను. పురాకృతమ్=పూర్వము చేయబడిన, అశుభమ్ ఇవ=పాపము వలె, ఏవంవిధమ్=ఈవిధమైన, దుఃఖమ్=దుఃఖము, ప్రాప్తమ్=ప్రాప్తించినది.

తా. నీ మాటలు విని సహించవలసిన పరిస్థితు లేర్పడినవి! ఏమి దుఃఖము వచ్చి పడినది! ఎంత కష్టము వచ్చిపడినది! పూర్వజన్మలో చేసిన పాపము వలె ఈ దుఃఖము వచ్చిపడినది కదా! 79

మూ. చిరం ఖలు మయా పాపే త్వం పాపేనాభిరక్షితా, 80
అజ్ఞానాదుపసంపన్నా రజ్జురుద్బంధినీ యథా.

ప్ర. అ. పాపే=పాపాత్మురాలా! పాపేన=పాపాత్ముడనైన, మయా=నాచేత, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, చిరమ్=చాలకాలము, అభిరక్షితా=పోషింపబడిన, త్వమ్=నీవు, ఉద్బన్ధినీ=ఉరివేసే, రజ్జుః యథా=త్రాడు వలె, ఉపసంపన్నా=అయినావు.

తా. పాపాత్మురాలా! పూర్వము ఏదో పాపము చేసిన నేను, నీ స్వభావము తెలియక చాలాకాలము పోషించినాను. చివరికి నువ్వు నా మెడకు ఉరిత్రాడైనావు.

వి: "మెడకు తగులుకొన్న ఉరిత్రాడును రక్షించి నట్లు నిన్ను చాలా కాలం రక్షించాను" అనే పూర్వవాక్యము చింత్యము. ఉరిత్రాడును చాలాకాలము పాటు ఎవరూ సంరక్షించరు కదా? 80

మూ. రమమాణస్త్వయా సార్ధం మృత్యుం త్వా నాభిలక్షయే, 81
బాలో రహసి హస్తేన కృష్ణసర్పమివాస్పృశమ్.

ప్ర. అ. త్వయా సార్ధమ్ = నీతో, రమమాణః = క్రీడించుచూ ఉన్న నేను, త్వా = నిన్ను, మృత్యుమ్ = మృత్యువునుగా, నాభిలక్షయే = గుర్తించలేక పోయినాను. బాలః = బాలుడు, రహసి = రహస్యమునందు, హస్తేన = చేతితో, కృష్ణసర్పమివ = త్రాచుపామును వలె, అస్పృశమ్ = నిన్ను స్పృశించినాను.

తా. ఇంతకాలమూ నీతో విహరించుచు నువ్వు మృత్యుదేవత వనే విషయము గుర్తించజాలక పోయితిని. ఎవ్వరూ లేనిచోట, చిన్న పిల్లవాడు త్రాచు పాము మీద చెయ్యి వేసి నట్లు నిన్ను దగ్గరకు చేరదీసినాను. 81

మూ. మయా హ్యపితృకః పుత్రః స మహాత్మా దురాత్మనా, 82
తం తు మాం జీవలోకోఽయం నూనమాక్రోష్టుమర్హతి.

ప్ర. అ. మహాత్మా = మహాత్ము డైన, సః = ఆ రాముడు, దురాత్మనా = దురాత్ముడ నైన, మయా = నాచేత, అపితృకః = తండ్రి లేనివాడే. తమ్ = అట్టి, మామ్ = నన్ను, అయమ్ = ఈ, జీవలోకః = ప్రపంచక మంతయు, నూనమ్ = నిశ్చయముగా, ఆక్రోష్టుమ్ = నిందించుటకు, అర్హతి = తగి ఉన్నది.

తా. మహాత్ము డైన ఆ రామునికి దురాత్ముడ నైన నేను తండ్రిని అని చెప్పుట కూడా తప్పే. ఈ ప్రపంచము అంతా నన్ను తప్పక దూషించును; దూషించినను తప్పులేదు. 82

మూ. బాలిశో బత కామాత్మా రాజా దశరథో భృశమ్, 83
యః స్త్రీకృతే ప్రియం పుత్రం వనం ప్రస్థాపయిష్యతి.

ప్ర. అ. యః = ఏ దశరథుడు, స్త్రీకృతే = స్త్రీనిమిత్తమై, ప్రియమ్ = ప్రియు డైన, పుత్రమ్ = పుత్రుని, వనం ప్రస్థాపయిష్యతి = వనానికి పంపు

చున్నాడో, అస్తి, కామాత్మా = కామబుద్ధి గల, రాజా దశరథః = దశరథరాజు, కృశమ్ = మిక్కిలి, బాలిశః = మూర్ఖుడు. బత = ఎంత కష్టము.

తా. "కామానికి లొంగిపోయి, స్త్రీ మాట విని, ప్రియపుత్రుని అరణ్యానికి పంపుచున్నాడు ఈ దశరథుడు; ఎంత మూర్ఖుడు" అని లోకులు నిందించెదరు.

మూ. వ్రతైశ్చ బ్రహ్మచర్యైశ్చ గురుభిశ్చోపకర్శితః, 84
భోగకాలే మహత్కృచ్ఛ్రం పునరేవ ప్రపత్స్యతే.

ప్ర. అ. వ్రతైః చ = వ్రతాలచేతను, బ్రహ్మచర్యైశ్చ = బ్రహ్మచర్య ధర్మాలచేతను, గురుభిశ్చ = గురువులచేతను, ఉపకర్శితః = చిక్కిపోయేటట్లు చేయబడిన రాముడు, భోగకాలే = భోగాలను అనుభవించు కాలమున, పునః ఏవ = మరల, మహత్ = గొప్ప, కృచ్ఛ్రమ్ = కష్టమును, ప్రపత్స్యతే = పొందగలడు

తా. చిన్నతనమునుండి ఇంతవరకు రాముడు వ్రతాలతోనూ, బ్రహ్మచర్య ధర్మాలతోను, గురువులు విధించిన నియమాలతోనూ, చాలా శ్రమపడినాడు. ఇప్పుడింక భోగాలు అనుభవించవలసిన కాలము వచ్చిన తరవాత కూడా మరల చాలా కష్టాలు పడవలసి వచ్చినది. 84

మూ. నాలం ద్వితీయం వచనం పుత్రో మాం ప్రతి భాషితుమ్,
స వనం ప్రవ్రజేత్యుక్తో బాఢమిత్యేవ వక్ష్యతి.

ప్ర. అ. పుత్రః = నా కుమారుడు, మాం ప్రతి = నన్ను గూర్చి, ద్వితీయమ్ = రెండవ, వచనమ్ = వచనమును, భాషితుమ్ = పలుకుటకు, నాలమ్ = సమర్థుడు కాడు. వనం ప్రవ్రజ = వనానికి వెళ్లుము, ఇతి = అని, ఉక్తః = పలుకబడినవాడై, సః = అతడు, బాఢమ్ ఇత్యేవ = తప్పక అట్లే అని, వక్ష్యతి = చెప్పగలడు.

తా. నా కుమారుడైన రాముడు నా మాటకు ఎదురు చెప్పజాలడు. వనానికి వెళ్లుమని నేను చెప్పగానే తప్పక అట్లే చేసెద నని అనగలడు. 85

మూ. యది మే రాఘవః కుర్యాద్వనం గచ్ఛేతి చోదితః, 86
ప్రతికూలం ప్రియం మే స్యాన్న తు వత్సః కరిష్యతి.

ప్ర. అ. రాఘవః = రాముడు. వనం = అడవిని గూర్చి, గచ్ఛ = పొమ్ము, ఇతి = అని, చోదితః = ఆజ్ఞాపింపబడినవాడై, మే = నాకు, ప్రతికూలం = విరుద్ధముగా, కుర్యాత్ యది = చేయునేని, తత్ = అది (అట్లు చేయుట), మే = నాకు, ప్రియం = ఇష్టము, స్యాత్ = అగును. వత్సః తు = బిడ్డ డగు రాముడు మాత్రము, న కరిష్యతి = (అట్లు) చేయడు.

తా. నేను వనమునకు పొమ్మని రాము నాజ్ఞాపించగానే, అతడు 'నేను పోజాలను' అని చెప్పి, నా ఆజ్ఞ నతిక్రమించునేని నా కది ప్రియముగా నుండును. రాముడు మాత్రము అట్లు ఎన్నడికిని నా ఆజ్ఞను అతిక్రమింపడు. 86

మూ. శుద్ధభావో హి భావం మే న తు జ్ఞాస్యతి రాఘవః, 87
స వనం ప్రవ్రజే త్యుక్తో బాఢ మిత్యేవ వక్ష్యతి.

ప్ర. అ. శుద్ధభావః = పరిశుద్ధ మగు హృదయము కల, రాఘవః = రాముడు, మే = నాయొక్క, భావం తు = అభిప్రాయమును, న జ్ఞాస్యతి హి = తెలిసికొనలేడు కదా. సః = అతడు, వనం = అడవిని గూర్చి, ప్రవ్రజ = వెళ్లుము, ఇతి = అని, ఉక్తః = చెప్పబడినవాడై, బాఢం = మంచిది, ఇతి ఏవ = అనియే, వక్ష్యతి = చెప్పును.

తా. రాము డెంత మాత్రము కపటము లేని పరిశుద్ధమగు హృదయము కలవాడు. కావున అతడు 'నే నతడు నా యాజ్ఞ నతిక్రమించుట నా కిష్టమే' అను విషయమును తెలిసికొన జాలడు. కావున రాముని చూచి నేను 'నీవు అడవికి పొమ్ము' అని ఆజ్ఞాపింపగానే అందు కతడు 'మంచిది' అని చెప్పునే కాని వేరు మాట పలుకడు. 87

మూ. రాఘవే హి వనం ప్రాప్తే సర్వలోకస్య ధిక్కృతమ్, 88
మృత్యురక్షమణీయం మాం నయిష్యతి యమక్షయమ్.

ప్ర. అ. రాఘవే = రాముడు, వనం ప్రాప్తే = వనము చేరగానే, సర్వలోకస్య = సమస్తలోకానికి, ధిక్కృతమ్ = నింద్యుడనూ, అక్షమణీయమ్ = క్షమింపతగనివాడనూ, అయిన, మామ్ = నన్ను, మృత్యుః = మృత్యువు, యమక్షయమ్ = యమలోకమును, నయిష్యతి = పొందించగలదు.

తా. రాముడు అరణ్యానికి వెళ్ళగానే, సర్వలోకనింద్యుడనూ, క్షమింప తగనివాడనూ అయిన నన్ను మృత్యువు యమలోకానికి తీసికొనిపోవును. 88

మూ. మృతే మయి గతే రామే వనం మనుజపుఙ్గవే, 89
ఇష్టే మమ జనే శేషే కిం పాపం ప్రతిపత్స్యసే.

ప్ర. అ. మనుజపుఙ్గవే = మనుష్యులలో శ్రేష్ఠుడైన, రామే = రాముడు, వనం గతే = వనానికి వెళ్ళగా, మయి = నేను, మృతే = మరణించగా, శేషే = మిగిలిన, మమ ఇష్టే జనే = నా ఇష్టజనుల విషయములో, కమ్ = ఏమి, పాపమ్ = పాపకృత్యమును, ప్రతిపత్స్యసే = ఆలోచించగలవో గదా।

తా. మానవశ్రేష్ఠుడైన రాముడు అరణ్యానికి వెళ్ళగానే నేను మరణించెదను. ఇంక మిగిలిన నా స్వజనం విషయంలో ఏమి ఘోరకృత్యము చేయనున్నావో। 89

మూ. కౌసల్యా మాం చ రామం చ పుత్రౌ చ యది హాస్యతి,
దుఃఖాన్యసహతీ దేవీ మామేవానుమరిష్యతి.

ప్ర. అ. దేవీ కౌసల్యా = కౌసల్యాదేవి, మాం చ = నన్ను, రామం చ = రాముని, పుత్రౌ చ = పుత్రులైన లక్ష్మణశత్రుఘ్నులను, హాస్యతి యది = కోల్పోయినచో, దుఃఖాని = దుఃఖములను, అసహతీ = సహించనిదై, మామేవ = నన్నే, అనుమరిష్యతి = అనుసరించి మరణించగలదు.

తా. నన్నూ, రామునీ, లక్ష్మణశత్రుఘ్నులనూ కోల్పోయిన కౌసల్యాదేవి దుఃఖము సహించజాలక నన్ను అనుసరించి మరణించును.

వి. 'కౌసల్యాం' 'హాస్యసి' అనే పాఠాలకంటే పై పాఠం (గోరఖ్‌పూర్ ప్రతిలో ఉన్నది) బాగుండుటచేత అది గ్రహింపబడినది. "ఇష్టే మమ జనే శేషే కిం పాపం ప్రతిపత్స్యసే" అని వెనుక చెప్పినట్లు మిగిలిన లక్ష్మణశత్రుఘ్నులు, వారి తల్లి అడ్డు లేకుండా ఉండుటకోసం నువ్వు వాళ్ళను కూడా ఏదో చేసెదవు అని ఊహించుకొని మీ మందరమూ పోవటంతో కౌసల్య కూడా మరణించును అని ఇక్కడ చెప్పబడినది. 90

మూ. కౌసల్యాం చ సుమిత్రాం చ మాం చ పుత్రైస్త్రిభిః సహ,
ప్రక్షిప్య నరకే సా త్వం కైకేయి సుఖితా భవ.

ప్ర. అ. కైకేయి=కైకేయీ, కౌసల్యాం చ=కౌసల్యను, సుమిత్రాం చ, =సుమిత్రను, త్రిభిః = ముగ్గురు, పుత్రైః సహ=పుత్రులతో కూడ, మాం చ= నన్నూ, నరకే=నరకములో, ప్రక్షిప్య=పడద్రోసి, సా=అట్టి, త్వమ్=నీవు, సుఖితా భవ = సుఖపడుము.

తా. ఓ కైకేయీ! ఈ విధంగా కౌసల్యనూ, సుమిత్రనూ, నన్నూ, రామలక్ష్మణశత్రుఘ్నులనూ నరకములో సమానమైన కష్టాలలో పడవేసి నీవు సుఖముగా ఉండుము। 91

మూ. మయా రామేణ చ త్యక్తం శాశ్వతం సత్కృతం గుణైః,
ఇక్ష్వాకుకులమక్షోభ్యమాకులం పాలయిష్యసి. 92

ప్ర. అ. మయా=నాచేతను, రామేణ చ=రామునిచేతను, త్యక్తమ్ =విడువబడినదీ, శాశ్వతమ్=శాశ్వతమైనదీ, గుణైః=గుణాలచేత, సత్కృతమ్ =సత్కరింపబడినదీ, అక్షోభ్యమ్=క్షోభింపశక్యము కానిదీ అయిన, ఇక్ష్వాకు కులమ్=ఇక్ష్వాకువంశమును, ఆకులమ్=వ్యాకులము చేసి, పాలయిష్యసి= పాలించగలవు.

తా. శాశ్వతమూ, గుణాలచే పూజితమూ అయిన ఇక్ష్వాకువంశము నేటి వరకు క్షోభింపచేయ శక్యము కాకుండా ఉన్నది. అలాంటి వంశమును నేనూ, రాముడూ విడిచివేసిన తరువాత వ్యాకులము చేసి నీవు పాలించెదవు లెమ్ము. 92

మూ. ప్రియం చేద్భరతస్యైతద్రామప్రవ్రాజనం భవేత్, 93
మా స్మ మే భరతః కార్షీత్ ప్రేతకృత్యం గతాయుషః.

ప్ర. అ. ఏతత్=ఈ, రామప్రవ్రాజనమ్=రాముని వనానికి పంపివేయుట, భరతస్య=భరతునికి, ప్రియం భవేత్ చేత్=ఇష్టమైన దైతే, గతాయుషః= మరణించిన, మే=నాకు, భరతః=భరతుడు, ప్రేతకృత్యమ్=ప్రేతకార్యమును, మా స్మ కార్షీత్=చేయకుండుగాక.

తా. ఈ రామవనవాసము భరతునికి కూడా ఇష్టమైనదైతే, నా మరణానంతరము అతడు నాకు ప్రేతకార్యాలు చేయవద్దు. 93

మూ. హన్తానార్యే మమామిత్రే సకామా భవ కైకయి, 94
మృతే మయి గతే రామే వనం పురుషపుఙ్గవే,
సేదానీం విధవా రాజ్యం సపుత్రా కారయిష్యసి. 95

ప్ర. అ. హన్త = ఎంత కష్టము! మమ అమిత్రే = నా శత్రువైనదానా! అనార్యే = చెడ్డదానా! కైకయి = కైకా! సకామా = నిండిన కోరికలు కలదానవు, భవ = అగుము. పురుషపుఙ్గవే = పురుషశ్రేష్ఠుడైన, రామే = రాముడు, వనం గతే = వనానికి వెళ్లిన వాడగుచుండగా, మయి = నేను, మృతే = మరణించగా, విధవా = విధవవై, సపుత్రా = పుత్రునితో కూడినదానవై, సా = అట్టి నీవు, ఇదానీమ్ = ఇప్పుడు, రాజ్యం కారయిష్యసి = రాజ్యము చేయగలవు.

తా. ఓసీ! అనార్యురాలా! నా శత్రువైనదానా! కైకేయీ! నీ కోరిక తీరును. మనుష్యశ్రేష్ఠుడైన రాముడు అరణ్యానికి వెళ్లగా నేను మరణించిన పిమ్మట, విధవవై పుత్రునితో కలసి అపుడు రాజ్యము చేసెదవు! 94, 95

మూ. త్వం రాజపుత్రీవాదేన న్యవసో మమ వేశ్మని,
అకీర్తిశ్చాతులా లోకే ధ్రువః పరిభవశ్చ మే, 96
సర్వభూతేషు చావజ్ఞా యథా పాపకృతస్తథా.

ప్ర. అ. త్వమ్ = నీవు, రాజపుత్రీవాదేన = రాజపుత్రి అనే పేరుతో, మమ వేశ్మని = నా ఇంటిలో, న్యవసః = నివసించినావు. మే = నాకు, లోకే = లోకములో, అతులా = సాటిలేని, అకీర్తిః = అపకీర్తి, పరిభవశ్చ = పరాభవమూ, ధ్రువః = నిశ్చిత మైనది. పాపకృతః = పాపముచేసినవానికి, యథా = ఎట్లో, తథా = అట్లు, సర్వభూతేషు = సర్వప్రాణులందు. అవజ్ఞా = అనాదరము, (తప్పక కలుగును).

తా. ఇంతకాలమూ, నీవు రాజపుత్రి అనే పేరుతో నా యింటిలో నివసించినావు. నీ మూలాన నాకు గొప్ప అపకీర్తి, అవమానము తప్పవు. సకలప్రాణులూ కూడా నన్ను ఏదో పాపం చేసినవానిని వలె అనాదరముతో చూడగలవు. 96

మూ. కథం రథైర్విభుర్గత్వా గజాశ్వైశ్చ ముహుర్ముహుః, 97
పద్భ్యాం రామో మహారణ్యే వత్సో మే విచరిష్యతి.

ప్ర. అ. మే వత్సః=నా కుమారుడు, రామః=రాముడు, ముహుర్ముహుః =మాటిమాటికి, విభుః=ఒక ప్రభువుగా, రథైః=రథములమీదను, గజాశ్వైః చ =గజములమీదను, అశ్వములమీదను, యాత్వా=వెళ్లి, మహారణ్యే=గొప్ప అరణ్యంలో, పద్భ్యామ్ = పాదాలతో, కథమ్=ఎట్లు, విచరిష్యతి= సంచరించ గలడు?

తా. ఇంతవరకూ ఒక ప్రభువుగా రథాలమీదను, గజాశ్వాలమీదను ఎక్కి ప్రయాణముచేయుటకు అలవాటు పడిన నా ముద్దులకుమారుడు, రాముడు, మహారణ్యములో పాదాలతో ఎట్లు సంచరించును? 97

మూ. యస్య త్వాహారసమయే సూదాః కుణ్డలధారిణః, 98
అహంపూర్వాః పచన్తి స్మ ప్రశస్తం పానభోజనమ్,
స కథన్ను కషాయాణి తిక్తాని కటుకాని చ, 99
భక్షయన్వన్యమాహారం సుతో మే వర్తయిష్యతి.

ప్ర. అ. యస్య=ఎవని, ఆహారసమయే = భోజనసమయములో, కుణ్డలధారిణః = కుండలాలు ధరించిన, సూదాః=వంటవాళ్లు, అహంపూర్వాః = నేను ముందు నేను ముందు అని, ప్రశస్తమ్ = ప్రశస్తమైన, పానభోజనమ్ = పానమును, భోజనమునూ, పచన్తి స్మ =వండుచూ ఉండేవారో, సః=అట్టి, మే సుతః= నా కుమారుడు, కషాయాణి=వగరైనవాటిని, తిక్తాని=చేదైనవాటిని, కటుకాని= కారంగా ఉన్నవాటిని, వన్యమ్ ఆహారమ్ = వనంలో లభించే ఆహారమును, భక్షయన్ = భక్షించుచు, కథమ్ = ఎట్లు, వర్తయిష్యతి ను =జీవించగలడో?

తా. రాముని భోజనసమయం కాగానే, చక్కగా అలంకరించుకొన్న వంటవాళ్లు, "నేను ముందు నేను ముందు" అని పోటీలు పడుచు శ్రేష్ఠమైన పేయములూ, ఆహారమూ వండి పెట్టెడివారు. అట్టి నా కుమారుడు, అరణ్యములో వగరుగాను, చేదుగాను, కారంగాను ఉండే ఆహారము తినుచు ఎట్లు జీవించునో గదా! 98, 99

మూ. మహార్హవస్త్రసంవీతో భూత్వా చిరసుఖోషితః, 100
కాషాయపరిధానస్తు కథం భూమౌ నివత్స్యతి

ప్ర. అ. మహార్హవస్త్రసంవీతః భూత్వా = చాలా వెల గల వస్త్రాలు ధరించినవాడై, చిరసుఖోషితః = చిరకాలము సుఖముగా ఉన్న రాముడు, కాషాయపరిధానః = కాషాయవస్త్రాలు ధరించినవాడై, కథం వా = ఎట్లు, భూమౌ = నేలమీద, నివత్స్యతి = నివసించగలడు?

తా. అమూల్యమైన వస్త్రాలు ధరించి చాలకాలము సుఖముగా ఉన్న రాముడు ఇటుపై కాషాయవస్త్రాలు ధరించి నేలమీద ఎట్లు ఉండగలడు? 100

మూ. కస్యైతద్దారుణం వాక్యమేవంవిధమచిన్తితమ్, 101
రామస్యారణ్యగమనం భరతస్యాభిషేచనమ్.

ప్ర. అ. రామస్య = రాముని యొక్క, అరణ్యగమనమ్ = అరణ్యానికి వెళ్లుటా, భరతస్య = భరతుని యొక్క, అభిషేచనమ్ = రాజ్యాభిషేకమూ, అను, ఏవంవిధమ్ = ఈ విధమైన, ఏతత్ = ఈ, దారుణమ్ = దారుణమైన, అచిన్తితమ్ = ఆలోచన లేని, వాక్యమ్ = వాక్యము, కస్య = ఎవనిది?

తా. రాముడు అరణ్యానికి వెళ్లవలెను; భరతునికి రాజ్యాభిషేకము చేయవలెను అనే ఈ, ఆలోచన లేని, దారుణమైన వాక్యము ఎవరు నీకు చెప్పినారు? 101

మూ. ధిగస్తు యోషితో నామ శఠాః స్వార్థపరాస్సదా, 102
న బ్రవీమి స్త్రియః సర్వా భరతస్యైవ మాతరమ్.

ప్ర. అ. యోషితః నామ = స్త్రీ లనగా, శఠాః = రహస్యముగా కీడు తలపెట్టేవారు. సదా = ఎల్లప్పుడూ, స్వార్థపరాః = స్వార్థచింత మాత్రము కలవారు. ధిక్ అస్తు = వారిని గూర్చి నింద అగుగాక; సర్వాః = సమస్తమైన, స్త్రియః = స్త్రీలను గూర్చి, న బ్రవీమి = నేను అనను. భరతస్య = భరతుని యొక్క, మాతరమ్ ఏవ = తల్లిని గూర్చి మాత్రమే అనుచున్నాను.

తా. ఈ ఆడవాళ్లందరూ రహస్యముగా అపకారము చేసేవాళ్లే, సర్వదా స్వలాభముకోసమే చూచుకొందురు. అతే నేను అందరి స్త్రీలను గూర్చి అనుట లేదు. కేవలము భరతుని తల్లిని గూర్చే అనుచున్నాను. 102

మూ. అనర్థభావేఽర్థపరే నృశంసే
మమానుతాపాయ నివిష్టభావే,
కిమప్రియం పశ్యసి మన్నిమిత్తం
హితానుకారిణ్యథవాపి రామే. 103

ప్ర. అ. అనర్థభావే = అనర్థకర మైన భావము కలదానా, అర్థపరే = స్వార్థపరురాలా, నృశంసే = క్రూరురాలా, మమ = నా యొక్క, అనుతాపాయ = సంతాపముకొరకు, నివిష్టభావే = నిశ్చిత మైన అభిప్రాయము కలదానా, మన్నిమిత్తమ్ = నేను నిమిత్తముగా గల, కిమ్ = ఏమి, అప్రియమ్ = అప్రియమును, అథవాపి = లేదా, హితానుకారిణి = హితము నాచరించు, రామే = రామునియందు గాని, (ఏమి అప్రియమును), పశ్యసి = చూచుచున్నావు?

తా. అనర్థము కలిగించే భావము కలదానా, స్వార్థపరురాలా, క్రూరురాలా, నాకు బాధ కలిగించవలెనని నిర్ణయము చేసుకున్నదానా, నీకు నావలన గాని ఎప్పుడూ హితమే కోరే రాముని వలన గాని ఏమి అప్రియము జరగబోవును అని అనుకొనుచున్నావు? 103

మూ. పరిత్యజేయుః పితరో హి పుత్రాన్
భార్యాః పతీంశ్చాపి కృతానురాగాః,
కృత్స్నం హి సర్వం కుపితం జగత్స్యా
ద్దృష్ట్వైవ రామం వ్యసనే నిమగ్నమ్. 104

ప్ర. అ. వ్యసనే = కష్టములో, నిమగ్నమ్ = మునిగిపోయిన, రామమ్ = రాముని, దృష్ట్వైవ = చూడగానే, పితరః = తండ్రులు, పుత్రాన్ = పుత్రులను, పరిత్యజేయుః = విడిచివేయుదురు. కృతానురాగాః = చేయబడిన అనురాగముగల, భార్యాః = భార్యలు, పతీంశ్చాపి = భర్తలను (విడిచివేయుదురు). కృత్స్నమ్ =

సమస్త మైన, జగత్=జగత్తు, సర్వమ్ = అంతయు, కుపితం స్యాత్ = ప్రకోపించును.

తా. రాముడు కష్టాలలో చిక్కుకొనుట చూచి, ఈ ప్రపంచము అంతా ఎదురు తిరుగును. తండ్రులు కుమారులనూ, ఇంతవరకూ ప్రేమగా ఉన్న స్త్రీలు భర్తలనూ విడచివేయుదురు. 104

మూ. అహం పునర్దేవకుమారరూప
మలంకృతం తం సుతమాప్రజన్తమ్,
నన్దామి పశ్యన్నపి దర్శనేన
భవామి దృష్ట్వా చ పునర్యువేవ. 105

ప్ర. అ. అహం పునః = నేనైతే, దేవకుమారరూపమ్=దేవతాకుమారుని వంటి రూపము కలవాడూ, అలంకృతమ్ = అలంకరింపబడినవాడూ అయిన, తం సుతమ్=ఆ కుమారుని, ఆవ్రజన్తమ్=వచ్చుచుండగా, పశ్యన్ = చూచుచు, దర్శనేనాపి = దర్శనమాత్రముచేత గూడా, నన్దామి = ఆనందించుచుందును. దృష్ట్వా = చూచి, పునః=మరల, యువేవ = యువకుడువలె, భవామి చ = అపుడును కూడా.

తా. చక్కగా అలంకరించుకొని దేవతాకుమారుడు వలె వచ్చుచున్న నా కుమారుని చూచినంతమాత్రముచేతనే నాకు చాలా ఆనందము కలుగును. మరల యౌవనము లభించి నట్లు అనిపించును. 105

మూ. వినాపి సూర్యేణ భవేత్ప్రవృత్తి
రవర్షతా వజ్రధరేణ వాపి,
రామం తు గచ్ఛన్తమితః సమీక్ష్య
జీవేన్న కశ్చిత్త్వితి చేతనా మే. 106

ప్ర. అ. సూర్యేణ వినాపి = సూర్యుడు లేకపోయినను, వజ్రధరేణ = ఇంద్రుడు, అవర్షతా వాపి=వర్షించకున్నను, ప్రవృత్తిః = లోకవ్యవహారము, భవేత్ = జరగవచ్చును. తు = కాని, ఇతః = ఇక్కడినుండి, గచ్ఛన్తమ్=వెళ్లి

పోవుచున్న, రామం=రాముని, సమీక్ష్య=చూచి, కశ్చిత్ = ఒక్కడును, న జీవేత్ = జీవించడు, ఇతి = అని, మే చేతనా=నా అభిప్రాయము.

తా. సూర్యుడు లేకపోయినను, ఇంద్రుడు వర్షం కురిపించకపోయినను, లోకవ్యవహారము నడచిపోవచ్చును. కాని రాముడు ఇక్కడినుండి వెళ్లిపోవుచుండగా చూచినచో నెవ్వడూ జీవించడని నా అభిప్రాయము. 106

మూ. వినాశకామామహితామమిత్రా
మావాసయం మృత్యుమివాత్మనస్త్వామ్,
చిరం బతాఙ్కేన ధృతాసి సర్పీ
మహావిషా తేన హతోఽస్మి మోహాత్. 107

ప్ర. అ. వినాశకామామ్=నా వినాశమును కోరుచున్నదానవూ, అహితామ్= కీడుచేయుదానవూ, అమిత్రామ్=శత్రువూ అయిన, త్వామ్ = నిన్ను, ఆత్మనః= తనయొక్క, మృత్యుమివ=మృత్యువును వలె, ఆవాసయమ్ = దగ్గర నివసింప చేసికొంటిని. బత = ఎంత కష్టము! మహావిషా = గొప్ప విషముగల, సర్పీ = ఆడసర్పమైన నీవు, చిరమ్ = చిరకాలము, అఙ్కేన = ఒడిలో, ధృతాసి = ధరింపబడినావు. తేన = ఆ కారణముచేత, మోహాత్=అజ్ఞానమువలన, హతః అస్మి = చంపబడుచున్నాను.

తా. నా వినాశమును కోరేదానవూ, అహితము ఆచరించేదానవూ, శత్రువూ అయిన నిన్ను మృత్యువును దగ్గర ఉంచుకొన్నట్లు ఇన్నినాళ్లూ దగ్గర ఉంచుకొన్నాను. మహావిషముగల ఆడసర్పమును ఒడిలో చాలకాలము, ఉంచుకొంటిని. అందుచేత చేసిన పొరబాటుకి ఈనాడు చంపబడుతున్నాను. అయ్యో! 107

మూ. మయా చ రామేణ సలక్ష్మణేన
ప్రశాస్తు హీనో భరతస్త్వయా సహ,
పురం చ రాష్ట్రం చ నిహత్య బాన్ధవాన్,
మమాహితానాం చ భవాభిహర్షిణీ. 108

ప్ర. అ. భరతః = భరతుడు, మయా = నాతోటి, సలక్ష్మణేన=లక్ష్మణ సమేతుడైన, రామేణ = రామునితోడ, హీనః=లేనివాడై, త్వయా సహ = నీతో

కలిసినవాడై, బాంధవాన్ = బంధువులను, నిహత్య = చంపి, పురం చ = పురమునూ, రాష్ట్రం చ = రాష్ట్రమునూ, ప్రశాస్తు = పాలించు గాక; మమ = నాయొక్క, అహితానామ్ = శత్రువులకు, అభిహర్షిణీ = ఆనందము కలిగించుదానవు, భవ = అగుము.

తా. నాకూ రామలక్ష్మణులకూ దూరమైన భరతుడు నీతో చేరి బంధువుల నందరినీ చంపి నగరమునూ, రాష్ట్రమునూ, పాలించుగాక; నీవు నా శత్రువులకు ఆనందము కలగచేసేదానవు అయ్యెదవు గాక;

వి. "నా శత్రువుల విషయమై సంతోషముకలదానవు అగుము" అను ప్రాచీనవ్యాఖ్యకంటె "నీవు చేసే పనికి నా శత్రువులు సంతోషించెదరు" అనే అర్థము యుక్త మని తోచును. 108

మూ. నృశంసవృత్తే వ్యసనప్రహారిణి
ప్రసహ్య వాక్యం యదిహాద్య భాషసే,
న నామ తే కేన ముఖాత్పతన్త్యధో
విశీర్యమాణా దశనా స్సహస్రధా. 109

ప్ర. అ. నృశంసవృత్తే = క్రూరమైన ప్రవృత్తి కలదానా। వ్యసనప్రహారిణి = కష్టాలలో దెబ్బ తీయుచున్నదానా। అద్య = ఇపుడు, ప్రసహ్య = బలాత్కరించి, యత్ = ఏ, వాక్యమ్ = వాక్యమును, భాషసే = పలుకుచున్నావో (దానిచే), తే = నీయొక్క, ముఖాత్ = ముఖమునుండి, దశనాః = దంతములు, సహస్రధా = వేయి ముక్కలుగా, విశీర్యమాణాః = విరిగి పోవుచు, కేన = ఏ కారణముచే, అధః = క్రింద, న నామ పతన్తి = పడుట లేదో కదా;

తా. క్రూరప్రవృత్తి కలదానా; కష్టాలలో దెబ్బతీయుదానా। ఇప్పుడు నీవు ఈ విధంగా మాటలాడినందుకు నీ దంతా లన్నీ వేయి ముక్కలుగా విరిగి ఎందుకు రాలటం లేదో కదా। 109

మూ. న కించిదాహాహితమప్రియం వచో
న వేత్తి రామః పరుషాణి భాషితుమ్,
కథన్ను రామే హ్యభిరామవాదిని
బ్రవీషి దోషాన్ గుణనిత్యసమ్మతే. 110

ప్ర. అ. రామః=రాముడు, కించిత్=కొంచెమైనను, అహితమ్=హితము కాని, అప్రియమ్=ప్రియము కాని, వచః=మాట, న ఆహ=పలకడు. పరుషాణి=పరుషవాక్యములను, భాషితుమ్=పలుకుటకు, న వేత్తి=ఎరుగడు. అభిరామవాదిని=మనోహరముగా మాటలాడేవాడూ, గుణనిత్యసమ్మతే=గుణాలచేత నిత్యము గౌరవింపబడినవాడూ అయిన, రామే=అట్టి, రాముని విషయములో, దోషాన్=దోషాలను, కథం ను=ఎట్లు, బ్రవీషి=చెప్పుచున్నావు?

తా. రాముడు ఏ మాత్రమూ అహితముగాను, అప్రియముగాను మాటలాడడు. పరుషముగా మాటలాడుట అనేది అతనికి తెలియనే తెలియదు. ఈ విధముగా మనోహరముగా మాటలాడేవాడూ, సద్గుణాలను బట్టి అందరి మన్ననలు పొందేవాడూ అయిన రాముని విషయములో దోషాలు ఎలా చెప్ప కలుగుతున్నావు? 110

మూ. ప్రతామ్య వా ప్రజ్వల వా ప్రణశ్య వా
సహస్రశో వా స్ఫుటితా మహీం వ్రజ,
న తే కరిష్యామి వచః సుదారుణం
మమాహితం కేకయరాజపాంసని. 111

ప్ర. అ. కేకరాజపాంసని=కేకయరాజులకు కళంకమైనదానా! ప్రతామ్య వా=దుఃఖించుము. ప్రజ్వల వా=లేదా కాలిపొమ్ము. ప్రణశ్య వా=లేదా నశించుము. సహస్రశః=వేయిముక్కలుగా, స్ఫుటితా=విరిగినదానవై, మహీమ్=భూమిని, వ్రజ వా=పొందుము. సుదారుణమ్=చాలా దారుణమైనదీ, మమ=నాకు, అహితమ్=హితము కానిదీ, అయిన, తే=నీయొక్క, వచః=వాక్కును, న కరిష్యామి=చేయను.

తా. కేకయవంశానికే కళంకమైనదానా! నీ వేడ్చినా, మండిపోయినా, నశించినా, వేయి ముక్కలై నేలమీద పడినా, అతిదారుణమూ, నాకు అహితమూ అయిన నీ మాట చేయను. 111

మూ. క్షురోపమాం నిత్యమసత్ప్రియంవదాం
ప్రదుష్టభావాం స్వకులోపఘాతినీమ్,
న జీవితుం త్వాం విషహేఽమనోరమాం
దిధక్షమాణాం హృదయం సబన్ధనమ్. 112

ప్ర. అ. క్షురోపమామ్=మంగలికత్తి వంటిదానవూ, నిత్యమ్=ఎల్లప్పుడూ, అసత్ప్రియంవదామ్ = అసత్యమైన ప్రియవాక్యము పలికేదానవూ, ప్రదుష్ట భావామ్ = దుష్టస్వభావురాలవూ, స్వకులోపఘాతినీమ్=నీ కులాన్నే నాశనము చేసేదానవూ, అమనోరమామ్ = మనస్సుకు సంతోషము కలిగించనిదానవూ, సబన్ధనమ్=ఆధారముతో కూడిన, హృదయమ్=హృదయమును, దిధక్షమాణామ్= కాల్చివేయ దలచుచున్నదానవూ అయిన, త్వామ్ = నిన్ను, జీవితుం = జీవించుటకు, న విషహే=సహించను.

తా. నువ్వు మంగలికత్తి వంటిదానవు. నిత్యమూ అసత్యమైన ప్రియ వాక్యాలు మాటలాడేదానవు. దుష్టస్వభావురాలవు. నీ కులానికే చిచ్చు పెట్టు దానవు. మనస్సుకు క్లేశము కలిగించేదానవు. సమూలముగా నా హృదయమును కాల్చివేయడానికి పూనుకున్నావు. అలాంటి నీవు జీవించి ఉండుట నాకు ఇష్టము లేదు. 112

మూ. న జీవితం మేఽస్తి పునః కుతః సుఖమ్
వినాత్మజేనాత్మవతః కుతో రతిః,
మమాహితం దేవి న కర్తుమర్హసి
స్పృశామి పాదావపి తే ప్రసీద మే. 113

ప్ర. అ. ఆత్మజేన వినా = కుమారుడు లేకుండా, మే = నాకు, జీవితమ్= జీవితము, నాస్తి = లేదు. పునః=మరల, సుఖమ్ = సుఖము, కుతః = ఎట్లు ఉండును? ఆత్మవతః = జీవించి ఉండగా, రతిః = ఆనందము, కుతః = ఎట్లు? దేవి=దేవీ! మమ=నాకు, అహితమ్ = అహితమైన కార్యము,కర్తుమ్ =' చేయుటకు, న అర్హసి = తగవు. తే = నీయొక్క, పాదౌ=పాదములను, స్పృశా మ్యపి=స్పృశించెదను కూడా. మే=నా విషయములో, ప్రసీద=అనుగ్రహించుము.

తా. రాముడు లేనిదో నాకు జీవితమే లేదు. ఇంక సుఖము మాట చెప్ప వలెనా? బ్రతికి ఉండగా నా కింక ఆనందము ఎక్కడిది? ఓ దేవీ! నాకు అహిత మైన ఈ కార్యము చేయవద్దు. నీ కాళ్ళు కూడా పట్టుకొనెదను. నన్ను అను గ్రహించుము. 113

మూ. స భూమిపాలో విలపన్ననాథవత్
స్త్రియా గృహీతో హృదయేఽతిమాత్రయా,
పపాత దేవ్యాశ్చరణౌ ప్రసారితా
వుభావసంప్రాప్య యథాతురస్తథా. 114.

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వాదశః సర్గః.

ప్ర. అ. అతిమాత్రయా=మర్యాదను అతిక్రమించిన, స్త్రియా=భార్యచేత, హృదయే=హృదయమునందు, గృహీతః=పట్టుకొనబడిన, సః=ఆ, భూమి పాలః=రాజు, అనాథవత్=సంరక్షకుడు లేనివాడు వలె, విలపన్=విలపించుచు, ప్రసారితౌ=దూరముగా చాపబడిన, దేవ్యాః=కైకేయియొక్క, ఉభౌ చరణౌ= రెండు పాదాలను, అసంప్రాప్య=చేరకుండగనే, ఆతురః=రోగి, యథా=ఎట్లో, తథా=అట్లే, పపాత=పడిపోయెను.

తా. మర్యాదను అతిక్రమించిన భార్య ఈ విధముగా హృదయానికి ఆఘాతము కలిగించగా, దశరథుడు అనాథుడు వలె విలపించుచు, తన పాదాలు ఎక్కడ స్పృశించునో అని కైకేయి దూరము చేసిన ఆమె పాదాలు చేరకుండానే, రోగగ్రస్తుడు వలె నేల మీద పడిపోయెను.

వి. "ఉభావసంస్పృశ్య" అనే పాఠముకంటె 'ఉభావసంప్రాప్య' అనే పాఠము యుక్తముగా తోచుటచేత అది గ్రహించబడినది. 124

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో పన్నెండవసర్గ సమాప్తము.

# అథ త్రయోదశః సర్గః

[రాజు విలపించుట, కైక ననునయించుట]

మూ. అతదర్హం మహారాజం శయానమతథోచితమ్,
యయాతిమివ పుణ్యాన్తే దేవలోకాత్పరిచ్యుతమ్, 1
అనర్థరూపా సిద్ధార్థా హ్యభీతా భయదర్శినీ
పునరాకారయామాస తమేవ వరమఙ్గనా. 2

ప్ర. అ. అనర్థరూపా = మూర్తీభవించిన అనర్థమైనదీ, సిద్ధార్థా = సిద్ధించిన ప్రయోజనము కలదీ అయిన, అఙ్గనా = ఆ కైకేయి, అతదర్హమ్ = దానికి తగని వాడూ, అతథోచితమ్ = అట్లు ఉండే అలవాటు లేనివాడూ, పుణ్యాన్తే = పుణ్యము అయిపోయిన పిమ్మట, దేవలోకాత్ = దేవలోకమునుండి, పరిచ్యుతమ్ = జారి పడిపోయిన, యయాతిమివ = యయాతి వలె ఉన్నవాడూ అయిన, శయానమ్ = క్రిందపడి ఉన్న, మహారాజమ్ = మహారాజును, అభీతా = భయపడనిదై, భయదర్శినీ = భయము చూపుచు, పునః = మరల, తమేవ వరమ్ = ఆ వరమునే (పురస్కరించుకొని), ఆకారయామాస = పిలచెను (తెలిపెను).

తా. దశరథుడు అట్టి దీనస్థితికి తగినవాడు గాని, అలవాటుపడ్డవాడు గాని కాడు. పుణ్యము అంతా వ్యయము అయిపోయిన తరవాత స్వర్గలోకము నుండి భూమిపై పడిన యయాతి చక్రవర్తి వలె అతడు నేలపై పడి ఉన్నాడు. అలాంటి మహారాజుకు సాక్షాత్తు మూర్తీభవించిన అనర్థమా అన్నట్లు ఉన్నదీ, తన పని సాధించుకున్నదీ అయిన కైకేయి, ఏ మాత్రమూ జంకు గొంకు లేక, భయపెట్టుచూ మరల ఆ వరాలే కోరినది. 1, 2

మూ. త్వం కత్థసే మహారాజ సత్యవాదీ దృఢవ్రతః,
మమ చేమం వరం కస్మాద్విధారయితుమిచ్ఛసి. 3

ప్ర. అ. మహారాజ = మహారాజా!, సత్యవాదీ = సత్యమే పలుకువాడనని, దృఢవ్రతః = స్థిరమైన వ్రతము (ప్రతిజ్ఞ) కలవాడ నని, త్వమ్ = నీవు,

కత్థసే=ఇదాయి చెప్పుకొనుచు ఉందువు కదా। మమ = నాయొక్క, ఇమం వరమ్ = ఈ వరమును, కస్మాత్ = ఎందువలన, నివారయితుమ్ = అడ్డుపెట్టుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు?

తా. మహారాజా! "నేను సత్యవంతుడను; చేసిన ప్రతిజ్ఞ విడవను" అని అనుచు ఇదాయి చెప్పుకొనుచు ఉందువు కదా! ఇప్పుడు నా వరమును ఎందుకు కాదనుచున్నావు? 3

మూ. ఏవముక్తస్తు కైకేయ్యా రాజా దశరథస్తదా,
ప్రత్యువాచ తతః క్రుద్ధో ముహూర్తం విహ్వలన్నివ. 4

ప్ర. అ. తదా = అప్పుడు, కైకేయ్యా = కైకేయిచేత, ఏవమ్=ఇట్లు, ఉక్తః = పలుకబడిన, రాజా దశరథః = దశరథమహారాజు, క్రుద్ధః=కోపించిన వాడై, ముహూర్తమ్ = కొంతకాలము పాటు, విహ్వలన్నివ=స్మృతి తప్పి నట్లు అయి, తతః = అటుపిమ్మట, ప్రత్యువాచ =తిరిగి పలికెను.

తా. కైకేయి ఇట్లు అనగానే దశరథుడు చాలా కోపించి కొంత సేపు స్మృతి తప్పిన ట్లయి ఇట్లు అనెను. 4

మూ. మృతే మయి గతే రామే వనం మనుజపుఙ్గవే,
హన్తానార్యే మమామిత్రే సకామా సుఖినీ భవ. 5

ప్ర. అ. మనుజపుఙ్గవే=మానవశ్రేష్ఠు డైన, రామే = రాముడు, వనం గతే=వనానికి వెళ్లగా, మయి = నేను, మృతే = మరణించగా, అనార్యే = ఓ దుష్టురాలా! మమ అమిత్రే = నా శత్రువా! సకామా = తీరిన కోరికగలదానవై, సుఖినీ=సుఖవంతురాలవు, భవ = అగుము. హన్త = ఎంత కష్టము!

తా. దుష్టురాలా! నా శత్రు వైన దానా! మనుజశ్రేష్ఠు డైన రాముడు అరణ్యానికి వెళ్లిన పిదప, నేను మరణించగా, కోరిక తీరి సుఖముగా ఉండెదవు లెమ్ము. అయ్యో! ఎంత కష్టము! 5

మూ. స్వర్గేఽపి ఖలు రామస్య కుశలం దైవతైరహమ్,
ప్రత్యాదేశాదభిహితం ధారయిష్యే కథం బత. 6

ప్ర. అ. స్వర్గేఽపి = స్వర్గములో కూడా, అహమ్ = నేను, ప్రత్యాదేశాత్ = తప్పిపుచ్చుటవలన, అభిహితమ్ = చెప్పబడిన, రామస్య = రాముని యొక్క, కుశలమ్ = క్షేమమును, దైవతైః = దేవతలచేత, కథం ఖలు = ఎట్లు, ధారయిష్యే = ధరింపచేయగలను (వారిచే ఆ కుశలవార్తను ఎట్లు గ్రహింపచేయగలను? అనగా నమ్మింపగలను?) బత = ఎంత కష్టము!

తా. నేను స్వర్గానికి వెళ్లినపుడు "రాముడు కుశలముగా ఉన్నాడా?" అని దేవతలు అడిగినపుడు, అసలు విషయము తప్పిపుచ్చి, క్షేమముగానే ఉన్నాడు అని చెప్పి వారిని ఎట్లు నమ్మింపచేయగలను?

వి. నేను స్వర్గానికి వెళ్లిన తరవాత 'రాముని క్షేమవార్తను నాకు దేవతలు అనాదరపూర్వకముగా చెప్పుచుండగా నే నెట్లు సహించగలను-అనే ప్రాచీనవ్యాఖ్య చింత్యము. రాబోయే శ్లోకమును బట్టి కూడా రాముని కుశలవార్తను గూర్చి ప్రశ్నించేవారు దేవతలే అని స్పష్టము అవుతున్నది. అందుచేత రాముని కుశలవార్తను దశరథునకు దేవతలు చెప్పే ప్రసక్తి ఏ మున్నది? 6

మూ. కైకేయ్యాః ప్రియకామేన రామః ప్రవ్రాజితో మయా,
యది సత్యం బ్రవీమ్యేతత్త దసత్యం భవిష్యతి. 7

ప్ర. అ. ఈ శ్లోకము వెనుకటి సర్గలో ౧౧వ శ్లోకముగా వచ్చినది. అక్కడ ఉన్న "ప్రియకామేన" (ప్రియమును కోరిన) అనే పదానికి బదులు అక్కడ "క్లిశ్యమానేన" అని ఉన్నది.

తా. అసలు విషయము దాచకుండా కైకేయికి ప్రియము చేయుట కోసం నేను రాముని అరణ్యానికి పంపినాను అని చెప్పినా అది ఎవ్వరూ నమ్మరు.

వి. ఆ శ్లోకము దగ్గర వ్రాసినట్లే ఇక్కడ కూడా ప్రాచీనవ్యాఖ్యాతలు "నేను ఈ విధముగా చెప్పినచో రామునికి రాజ్యము ఇచ్చెదనని మొదట చెప్పిన మాట అసత్యము అవుతుంది." అని భావము చెప్పినారు. ఈ వ్యాఖ్య అసంగత మని వెనుకనే సూచించి ఉన్నాము. అది అసత్యము అగుట ఇట్లు చెప్పుటవల్ల, కాదు; చేయుట వల్ల. వాస్తవానికి ఆ సత్యానికి కట్టుబడి ఉండడమే ధర్మసంమతము అయితే దశరథుడు కైకేయి మాటలు వినవలసిన పనే లేదు కదా.

రామునికి రాజ్యము ఇద్దా మని దశరథుడు అనుకొని అందరికీ చెప్పినాడు కాని, ఎవరికిని ప్రతిజ్ఞ చేయలేదు కదా. అథవా అలా చేసినా, అంతకు పూర్వము చేసిన వరదానప్రతిజ్ఞచేత ఇది ఉపహరము అవుతుంది. 7

మూ. అపుత్రేణ మయా పుత్రః శ్రమేణ మహతా మహాన్,
రామో లబ్ధో మహాబాహుః స కథం త్యజ్యతే మయా 8

ప్ర. అ. అపుత్రేణ=పుత్రులు లేని, మయా=నాచేత, మహతా=గొప్ప, శ్రమేణ=శ్రమచేత, మహాన్=గొప్పవాడూ, మహాబాహుః=గొప్ప బాహువులు గలవాడూ అయిన, రామః=రాముడు, పుత్రః=పుత్రుడుగా, లబ్ధః=పొందబడి నాడు. సః=అట్టి రాముడు, మయా=నాచేత, కథమ్=ఎట్లు, త్యజ్యతే=విడవ బడతాడు.

తా. పుత్రులు లేని నేను ఎంతో శ్రమపడి, గొప్పవాడూ మహాపరాక్రమ శాలీ అయిన రాముని పుత్రునిగా పొందితిని. అట్టి రాముని ఎట్లు విడవగలను? 8

మూ. శూరశ్చ కృతవిద్యశ్చ జితక్రోధః క్షమాపరః,
కథం కమలపత్రాక్షో మయా రామో వివాస్యతే. 9

ప్ర. అ. శూరః=శూరుడూ, కృతవిద్యశ్చ=చేయ (నేర్వ) బడిన విద్యలు కలవాడూ, జితక్రోధః=జయింపబడిన క్రోధము కలవాడూ, క్షమాపరః=ఓర్పు నందు ఆసక్తి గలవాడూ, కమలపత్రాక్షః=కమలపత్రాల వంటి నేత్రాలు కల వాడూ అయిన, రామః=రాముడు, మయా=నా చేత, కథమ్=ఎట్లు, వివా స్యతే=వెళ్లగొట్టబడును?

తా. శూరుడూ, విద్య లన్నీ అభ్యసించినవాడూ, కోపము జయించిన వాడూ, ఓర్పు కలవాడూ, తామరరేకుల వంటి నేత్రాలు కలవాడూ అయిన రాముని నేను అరణ్యానికి ఎట్లు పంపగలను? 9

మూ. కథమిన్దీవరశ్యామం దీర్ఘబాహుం మహాబలమ్,
అభిరామమహం రామం ప్రేషయిష్యామి దణ్డకాన్. 10

ప్ర. అ. ఇన్దీవరశ్యామమ్=నల్లకలువ వలె శ్యామవర్ణము కలవాడూ, దీర్ఘబాహుమ్=దీర్ఘ మైన బాహువులు కలవాడూ, మహాబలమ్=గొప్ప బలము

కలవాడూ, అభిరామమ్=మనోహరుడూ అయిన, రామమ్=రాముని, అహమ్ = నేను, దణ్డకాన్=దండకార(ణ్యంగూర్చి) ణ్యానికి, కథమ్=ఎట్లు, ప్రేషయిష్యామి=పంపుదును?

తా. నల్లకలువ వలె శ్యామవర్ణము కలవాడూ, దీర్ఘబాహుడూ, మహాబలశాలీ, మనోహరుడూ అయిన రాముని నేను దండకారణ్యానికి ఎట్లు పంపగలను? 10

మూ. సుఖానాముచితస్యైవ దుఃఖైరనుచితస్య చ,
దుఃఖం నామానుపశ్యేయం కథం రామస్య ధీమతః. 11

ప్ర. అ. సుఖానామ్ = సుఖాలకు, ఉచితస్య = అలవాటు పడ్డవాడూ (తగినవాడు అని ప్రా.వ్యా), దుఃఖైః=దుఃఖాలతో (కు), అనుచితస్య చ = అలవాటు లేనివాడూ, ధీమతః=ధీమంతుడూ అయిన, రామస్య=రామునియొక్క, దుఃఖమ్ = దుఃఖమును, కథం నామ = ఎట్లు, అనుపశ్యేయమ్ = చూడగలను? (ఊహించగలను?)

తా. రాముడు సుఖాలకు అలవాటు పడ్డవాడు. కష్టపడి ఎరుగడు. అట్టి బుద్ధిమంతుడైన రాముడు కష్టపడుచుండగా నే నెట్లు ఊహించగలను? 'నే నెట్లు చూడగలను' అనే అర్థము అయుక్తము. ఎక్కడో రాముడు దుఃఖపడుచుండగా దశరథుడు చూడడు కదా? 12

మూ. యది దుఃఖమకృత్వాఽద్య మమ సంక్రమణం భవేత్,
అదుఃఖార్హస్య రామస్య తతః సుఖమవాప్నుయామ్. 12

ప్ర. అ. అదుఃఖార్హస్య = దుఃఖానికి తగని, రామస్య = రామునకు, దుఃఖమ్ = దుఃఖమును, అకృత్వా=కలిగించకుండగా, మమ = నాకు, సంక్రమణమ్ = మరణము, అద్య = ఇప్పుడు, భవేత్ = వచ్చినట్లైతే, తతః = అందువలన, సుఖమ్ = సుఖమును, అవాప్నుయామ్ = పొందెదను.

తా. దుఃఖాలకు తగని రామునికి దుఃఖము కలిగించకుండగా నేను ఇప్పుడే మరణించిన ట్లైతే నాకు సుఖము కలుగును. 12

మూ. నృశంసే పాపసంకల్పే రామం సత్యపరాక్రమమ్,
కిం విప్రియేణ కైకేయి ప్రియం యోజయసే మమ. 13
అకీర్తిరతులా లోకే ధ్రువః పరిభవశ్చ మే.

ప్ర. అ. నృశంసే = క్రూరురాలా ; పాపసంకల్పే = పాప మైన ఆలోచన కలదానా ; కైకేయి = కైకేయీ, మమ = నాకు, ప్రియమ్ = ఇష్టుడూ, సత్యపరాక్రమమ్ = సత్య మైన పరాక్రమము కలవాడూ అయిన, రామమ్ = రాముని, విప్రియేణ = కీడుతో, కిమ్ = ఎందువలన, యోజయసే = కూర్చుచున్నావు? లోకే = లోకములో, మే = నాకు, అతులా = సాటి లేని, అకీర్తిః = అపకీర్తి కలుగును, పరిభవశ్చ = పరాభవంకూడా, ధ్రువః = నిశ్చితము.

తా. ఓ క్రూరురాలా ; పాప మైన ఆలోచనలు గలదానా ; ఓ కైకేయీ ; సత్యపరాక్రమవంతుడూ, నాకు చాల ఇష్టుడూ అయిన రామునికి ఎందుచేత కీడు కలిగించుచున్నావు? నా కీ లోకములో గొప్ప అపకీర్తి, పరాభవమూ తప్పవు. 13

మూ. తథా విలపత స్తస్య పరిభ్రమితచేతసః. 14
అస్తమభ్యగమత్సూర్యో రజనీ చాభ్యవర్తత.

ప్ర. అ. పరిభ్రమితచేతసః = తిరిగిపోవుచున్న చిత్తము గల, తస్య = ఆ దశరథుడు, తథా = ఆ విధంగా, విలపతః = విలపించుచుండగా, సూర్యః = సూర్యుడు, అస్తమగమత్ = అస్త్రాద్రి చేరెను, రజనీ = రాత్రి, అభ్యవర్తత చ = వచ్చినది కూడ.

తా. మనస్సు చెదిరిపోయిన దశరథుడు ఆ విధముగా విలపించుచుండగా, సూర్యు డస్తమించి రాత్రి వచ్చెను. 14

మూ. సా త్రియామా తథార్తస్య చన్ద్రమణ్డలమణ్డితా. 15
రాజ్ఞో విలపమానస్య న వ్యభాసత శర్వరీ.

ప్ర. అ. తథా = ఆ విధముగా, ఆర్తస్య = పీడింపబడినవాడూ, విలపమానస్య = విలపించుచున్నవాడూ అయిన, రాజ్ఞః = రాజునకు, త్రియామా = మూడుయామాలు గల, సా = ఆ, శర్వరీ = రాత్రి, చన్ద్రమణ్డలమణ్డితా = చంద్రమండలముచేత అలంకృత మైనను, న వ్యభాసత = ప్రకాశించలేదు.

తా. ఆర్తు డై ఆ విధముగా విలపించుచున్న దశరథునికి, రాత్రి చంద్రమండలముతో ప్రకాశించుచున్నను, చీకటిగానే ఉండెను. 15.

మూ. తథైవోష్ణం వినిశ్వస్య వృద్ధో దశరథో నృపః. 16
విలలాపార్తవద్దుఃఖం గగనాసక్తలోచనః.

ప్ర. అ. వృద్ధః=వృద్ధుడైన, దశరథః నృపః = దశరథమహారాజు, తథైవ=అట్లే, ఉష్ణమ్=వేడిగా, వినిశ్వస్య=నిట్టూర్చి, ఆర్తవత్=రోగపీడితుడు వలె, గగనాసక్తలోచనః=ఆకాశమునందు లగ్నము చేయబడిన నేత్రములు కలవాడై, దుఃఖమ్=దుఃఖభరితముగా, విలలాప=విలపించెను.

తా. వృద్ధుడైన దశరథమహారాజు వేడి నిట్టూర్పులు విడచుచు, రోగపీడితుడు వలె ఆకాశము వైపే చూచుచు అతిదీనముగా విలపించెను. 16.

మూ. న ప్రభాతం త్వయేచ్ఛామి నిశే నక్షత్రభూషణే. 17
క్రియతాం మే దయా భద్రే మయాయం రచితోఽఞ్జలిః.

ప్ర. అ. నక్షత్రభూషణే=నక్షత్రాలు అలంకారాలుగా గల, భద్రే=మంగళప్రదురాలవైన, నిశే=ఓ రాత్రీ! త్వయా = నీచేత, ప్రభాతమ్ = తెల్లవారుటను, న ఇచ్ఛామి = కోరను. మే=నా విషయమై, దయా=దయ, క్రియతామ్ = చేయబడుగాక, మయా=నాచేత, అయమ్=ఈ, అఞ్జలిః=దోసిలి, రచితః = కట్టబడినది.

తా. నక్షత్రా లనే అలంకారాలు ధరించిన మంగళకరి వైన ఓ రాత్రీ నువ్వు తెల్లవారవద్దు. నామీద దయ ఉంచుము. ఇదిగో దోసిలి కట్టుచున్నాను. 17

మూ. అథ వా గమ్యతాం శీఘ్రం నాహమిచ్ఛామి నిర్ఘృణామ్, 18
నృశంసాం కైకయీం ద్రష్టుం యత్కృతే వ్యసనం మహత్.

ప్ర. అ. అథవా = లేదా, శీఘ్రమ్ = శీఘ్రముగా, గమ్యతామ్ = వెళ్లబడు గాక (వెళ్లిపోవుగాక). యత్కృతే = ఏ కైకేయి నిమిత్తమై, మహత్ = గొప్ప, వ్యసనమ్ = ఆపద వచ్చినదో, అట్టి, నిర్ఘృణామ్ = జాలి లేనిదీ, నృశంసామ్ = క్రూరురాలూ అయిన, కైకయీమ్ = కైకేయిని, ద్రష్టుమ్=చూచుటకు, అహమ్= నేను, నేచ్ఛామి = కోరను.

తా. లేదా ఓ రాత్రీ! శీఘ్రముగా తొలగిపొమ్ము. ఇంత ఆపదకు కారణ భూతురాలూ, దయావిహీనురాలూ, క్రూరురాలూ అయిన కైకేయిని చూచుట నాకేమాత్రమూ ఇష్టము లేదు. 18

మూ. ఏవముక్త్వా తతో రాజా కైకేయీం సంయతాఞ్జలిః, 19
ప్రసాదయామాస పునః కైకేయీం చేదమబ్రవీత్.

ప్ర. అ. రాజా = రాజు, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, తతః = పిమ్మట, సంయతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, కైకేయీమ్ = కైకేయిని, ప్రసాదయామాస = బ్రతిమిలాడెను. పునః = మరల, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదం చ = ఈమాట కూడ, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాజు ఈ విధముగా పలికి, పిదప నమస్కరించుచు కైకేయిని బ్రతిమిలాడెను. మరల ఆమెతో ఇట్లు అనెను. 19

మూ. సాధువృత్తస్య దీనస్య త్వద్గతస్య గతాయుషః, 20
ప్రసాదః క్రియతాం దేవి భద్రే రాజ్ఞో విశేషతః

ప్ర. అ. భద్రే = మంగళప్రదురాలా! దేవి = ఓ రాణీ! సాధువృత్తస్య = మంచి చరిత్రకలవాడనూ, దీనస్య = దీనుడనూ, త్వద్గతస్య = నిన్నాశ్రయించిన వాడనూ, గతాయుషః = గడచిపోయిన ఆయుర్దాయము కలవాడనూ, విశేషతః = ప్రధానముగా, రాజ్ఞః = రాజనూ అయిన నా విషయంలో, ప్రసాదః = అనుగ్రహము, క్రియతామ్ = చేయబడుగాక.

తా. శుభప్రదురాల వైన ఓ రాణీ! నేను మంచి నడవడిక కలవాడను. దీనుడను. నిన్ను ఆశ్రయించుచున్నాను. ముసలివాడను. విశేషించి రాజును. అలాంటి నన్ను అనుగ్రహించుము. 20

మూ. శూన్యే న ఖలు సుశ్రోణి మయేదం సముదాహృతమ్, 21
కురు సాధు ప్రసాదం మే బాలే సహృదయా హ్యసి.

ప్ర. అ. సుశ్రోణి = ఓ సుశ్రోణీ, మయా = నాచేత, ఇదమ్ = ఇది అంతయు, శూన్యే = శూన్యప్రదేశములో (ఆకాశంలో), న ఖలు సముదాహృతమ్ =

చెప్పుఁడ లేదు కదా, బాలే = ఓ బాలా ! మే=నా విషయంలో, సాధు=బాగుగా, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురు = చెయ్యుము. సహృదయా = హృదయము కలదానవు, అసి హి = అయి ఉన్నావు కదా !

తా. ఓ సుశ్రోణీ ! నేను చెప్పినదంతా ఆకాశములో కలిసిపోవుటలేదు కదా! ఓ బాలా! నా విషయములో అనుగ్రహించుము. నీవు మంచి హృదయము కలదానవు కదా!

వి. ప్రాచీనవ్యాఖ్యలు: ఇదమ్ = రామునికి అభిషేకముచేయుదుననే మాట, శూన్యే = ఎవ్వరూ లేని ప్రదేశములో, చెప్పుఁడలేదు. అనగా పెద్దవాళ్ల అందరి ఎదుటా చెప్పినాను. అందుచేత అనుగ్రహించు, ఇది ఒక అర్థము. శూన్యేన = బుద్ధి విహీనుఁడ నైన, మయా = నాచేత, రామునికి అభిషేకముచేసెద ననే మాట చెప్ప బడింది. అది అసత్యం కాకుండా నన్ను అనుగ్రహించుము. 'ఇదమ్' అనే దానికి 'రామునికి అభిషేకము చేసెద ననే మాట' అని అంతదూరము నుంచి ఎట్లు వచ్చినదో తెలియదు. దశరథుఁడు ఆ విధముగా బ్రతిమాలుతూండగా ఆమె నిర్లక్ష్యముగా విన నట్లు ఉండుట చూచి "నేను చెప్పేదంతా ఆకాశములో కలిసి పోవుటలేదు కదా" అని దశరథు డన్నట్లు చెప్పుట యుక్తము. 21

మూ. ప్రసీద దేవి రామో మే త్వద్దత్తం రాజ్యమవ్యయమ్, 22
లభతామసితాపాఙ్గే యశః పరమవాప్నుహి.

ప్ర. అ. దేవి = ఓ దేవీ! ప్రసీద = అనుగ్రహించుము. రామః = రాముఁడు, త్వద్దత్తమ్ = నీచేత ఇవ్వఁబడిన, మే రాజ్యమ్ = నా రాజ్యమును, లభతామ్ = పొందుగాక. అసితాపాఙ్గే = నల్లని నేత్రాంతాలు కలదానా! పరమ్ = గొప్ప, యశః = కీర్తిని, అవాప్నుహి = పొందుము.

తా. నల్లనినేత్రాంతాలు గల ఓ దేవీ! అనుగ్రహించుము. నా రాజ్యము రామునికి నీవే ఇమ్ము. ఆ విధముగా కీర్తి సంపాదించుకొనుము. 22

మూ. మమ రామస్య లోకస్య గురూణాం భరతస్య చ, 23
ప్రియమేతద్గురుశ్రోణి కురు చారుముఖేక్షణే.

ప్ర. అ. గురుశ్రోణి = విశాల మైన శ్రోణిప్రదేశము కలదానా! చారుము-ఖేక్షణే = అంద మైన ముఖమూ నేత్రాలూ కలదానా! మమ = నాకూ, రామస్య = రామునకూ, లోకస్య = లోకానికీ, గురూణామ్ = గురువులకూ, భరతస్య చ = భరతునికీ, ప్రియమ్ = ప్రియ మైన, ఏతత్ = ఈ పని, కురు = చెయ్యుము.

తా. ఓ విశాలశ్రోణీ! సుందరముఖీ, చారునేత్రీ! ఈ పని చెయ్యుము. ఇది నాకూ, రామునికీ, లోకానికీ, గురువులకూ, భరతునికీ కూడా ప్రియ మైనది. 23.

మూ. విశుద్ధభావస్య సుదుష్టభావా
దీనస్య తామ్రాశ్రుకలస్య రాజ్ఞః।
శ్రుత్వా విచిత్రం కరుణం విలాపం
భర్తుర్నృశంసా న చకార వాక్యమ్. 24

ప్ర. అ. సుదుష్టభావా = చాల దుష్ట మైన అభిప్రాయము గల, నృశంసా = ఆ క్రూరురాలు, విశుద్ధభావస్య = పరిశుద్ధ మైన హృదయము కలవాడూ, దీనస్య = దీనుడూ, తామ్రాశ్రుకలస్య = ఎఱ్ఱ నైన కన్నీటి బిందువులు కలవాడూ, భర్తుః = భర్త అయిన, రాజ్ఞః = రాజుయొక్క, విచిత్రమ్ = వివిధరూపాలలో ఉన్న, కరుణం విలాపమ్ = దీనవిలాపమును, శ్రుత్వా = విని, వాక్యం = ఆ వాక్యమును, న చకార = చెయ్యలేదు.

తా. విశుద్ధ మైన హృదయము గల, రాజైన ఆ భర్త దీనుడై, ఎఱ్ఱని కన్నీటి బిందువులు కార్చుచు అనేకవిధాల దీనముగా విలపించుచుండగా విని, దుష్టభావము గల ఆ క్రూరురాలు అతని మాట ప్రకారము చెయ్యలేదు.

వి. "తామ్రేక్షణస్యాశ్రుకలస్య" అనే పాఠముకంటె "దీనస్య తామ్రాశ్రుకలస్య" అనే పాఠము యుక్తముగా ఉన్నట్లు తోచుటచేత అది గ్రహింపబడినది. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎఱ్ఱబడుటచేత కన్నీటి బిందువులు కూడ ఎఱ్ఱగా కనబడును. కాబట్టి అట్లు చెప్పబడినది. క్రుద్ధు డైన రావణుని కళ్లనుంచి ఎఱ్ఱని కన్నీళ్ళు రాలినవి అని సుందరకాండాదులలో వర్ణింపబడింది. 24.

మూ. తతః స రాజా పునరేవ మూర్ఛిత
ప్రియామతుష్టాం ప్రతికూలభాషిణీమ్,
సమీక్ష్య పుత్రస్య వివాసనం ప్రతి
క్షితౌ విసంజ్ఞో నిపపాత దుఃఖితః. 25

ప్ర. అ. పుత్రస్య = పుత్రునియొక్క, వివాసనం ప్రతి = అరణ్యానికి పంపుటను గూర్చి, ప్రతికూలభాషిణీమ్ = ప్రతికూలముగా మాటలాడుచున్నదీ, అతుష్టామ్ = సంతసించనిదీ అయిన, ప్రియామ్ = భార్యను, సమీక్ష్య = చూచి, దుఃఖితః = దుఃఖితుడై, తతః = పిమ్మట, సః రాజా = ఆ రాజు, పునరేవ = మరల, మూర్ఛితః = మూర్ఛ చెందు, విసంజ్ఞః = స్పృహ తప్పినవాడై, క్షితౌ = నేలపై, నిపపాత = పడెను.

తా. ఎంత చెప్పినా సంతోషించక, రాముని అరణ్యానికి పంపవలె నని ప్రతికూలముగా మాటలాడుతూన్న భార్యను చూచిన ఆ రాజు దుఃఖితుడై మరల మూర్ఛితుడై, నేలమీద పడిపోయెను.

వి. 'అదుష్టామ్' అనే పాఠముకంటె 'అతుష్టామ్' అనే పాఠము యుక్తమైనది. 25

మూ. ఇతీవ రాజ్ఞో వ్యథితస్య సా నిశా
జగామ ఘోరం శ్వసతో మనస్వినః,
విబోధ్యమానః ప్రతిబోధనం తదా
నివారయామాస స రాజసత్తమః. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రయోదశః సర్గః.

ప్ర. అ. ఇతీవ = ఈ విధముగా, వ్యథితస్య = వ్యథ చెందిన, మనస్వినః = మానవంతు డైన, రాజ్ఞః = రాజు, ఘోరమ్ = ఘోరముగా, శ్వసతః = నిట్టూర్పు చుండగా, సా నిశా = ఆ రాత్రి, జగామ = గడచెను. సః రాజసత్తమః = ఆ రాజశ్రేష్ఠుడు, విబోధ్యమానః = మేల్కొల్పబడుచు, తదా = అప్పుడు, విబోధనమ్ = అట్టు మేల్కొల్పుటను, నివారయామాస = నివారించెను.

తా. ఆత్మాభిమానవంతుడైన దశరథుడు ఈ విధముగా దుఃఖించుచు, తీవ్రమైన నిట్టూర్పులు విడుచుచు ఉండగానే రాత్రి గడచిపోయినది. ప్రాతఃకాలమున వందిమాగధులు వచ్చి మేల్కొల్పుటకు ప్రారంభించిరి. అయితే ఆ రాజశ్రేష్ఠుడు వాళ్లను నివారించెను. 26

"తాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో పదమూడవసర్గ సమాప్తము.

# అథ చతుర్దశః సర్గః

[కైకేయి దశరథుని సత్యము తప్పకుమని ప్రేరించుట. తాను కోరిన వరములను ఇమ్మని నిర్బంధించుట, వసిష్ఠమహర్షి అంతఃపుర ద్వారము కడకు వచ్చి, సుమంత్రుని రాజుకడకు పంపుట, రాజాజ్ఞచే సుమంత్రుడు రాముని కొనివచ్చుటకై వెడలుట.]

మూ. పుత్రశోకార్దితం పాపా విసంజ్ఞం పతితం భువి,
విచేష్టమానముద్వీక్ష్య సైక్ష్వాకమిదమబ్రవీత్. 1

ప్ర. అ. సా పాపా=ఆ పాపాత్మురాలు, పుత్రశోకార్దితమ్=పుత్రశోకముచేత పీడింపబడినవాడూ, విసంజ్ఞమ్=సంజ్ఞ లేకుండా, భువి=నేలమీద, పతితమ్=పడినవాడై, విచేష్టమానమ్=దొర్లుతూన్న వాడూ అయిన, ఐక్ష్వాకమ్=ఇక్ష్వాకు వంశములో పుట్టిన దశరథుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పుత్రశోకముతో బాధపడుచు సంజ్ఞ లేక, నేలపై పడి, దొర్లుతున్న ఆ దశరథునితో ఆ పాపాత్మురాలు ఇట్లు పలికినది. 1

మూ. పాపం కృత్వేవ కిమిదం మమ సంశ్రుత్య సంశ్రవమ్,
శేషే క్షితితలే సన్నః స్థిత్యాం త్వం స్థాతుమర్హసి. 2

ప్ర. అ. మమ=నాయొక్క (నాకు నీవు చేసిన), సంశ్రవమ్=ప్రతిజ్ఞను, సంశ్రుత్య=విని, పాపం కృత్వా ఇవ=పాపము చేసి వలె, సన్నః=దుఃఖితుడవై, క్షితితలే=నేలమీద, శేషే=పండుకున్నావు; ఇదమ్=ఇది, కిమ్=ఏమిటి। త్వమ్=నీవు, స్థిత్యామ్=మర్యాదయందు, స్థాతుమ్=ఉండుటకు, అర్హసి=తగెదవు.

తా. ఏమిటిది, నా కిచ్చిన ప్రతిజ్ఞ వినగానే ఏదో మహాపాపం చేసినవాడు వలె దుఃఖించుచు నేలమీద పడి ఉన్నావు। నీవు మర్యాద పాటించుము.

వి. 'పాపం కృత్వైవ' అనే పాఠము అయుక్తము. "సంశ్రవమ్=ప్రతిజ్ఞను, సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి, పాపం కృత్వైవ = పాపమే చేసి" అనగా ప్రతిజ్ఞచేసి, అపుడు కాదని పాపము చేసి"- ఇత్యాది వ్యాఖ్య కూడా అస్తి. ౨

మూ. ఆహుః సత్యం హి పరమం ధర్మం ధర్మవిదో జనాః,
సత్యమాశ్రిత్య హి మయా త్వం చ ధర్మం ప్రచోదితః.

ప్ర. అ. ధర్మవిదః=ధర్మవేత్తలైన, జనాః=జనులు, సత్యమ్=సత్యమును, పరమం ధర్మమ్=గొప్ప ధర్మమునుగా, ఆహుః హి=చెప్పుచున్నారు కదా. మయా చ = నాచేత కూడ, సత్యమ్ = సత్యమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, త్వమ్ = నీవు, ధర్మమ్=ధర్మమునుగూర్చి, ప్రచోదితః = ప్రేరేపించబడితివి.

తా. ధర్మవేత్తలైన జనులు సత్యమే ధర్మమని అందురు కదా! నేను కూడా ఆ సత్యాన్నే ఆశ్రయించి నిన్ను ధర్మమును గూర్చి ప్రేరేపించుచున్నాను.

వి. నేను "సత్యం ధర్మమ్ ఆశ్రిత్య = సత్యమనే ధర్మాన్ని ఆశ్రయించి" అని ప్రాచీన వ్యాఖ్య. ౩

మూ. సంశ్రుత్య శైబ్యః శ్యేనాయ స్వాం తనుం జగతీపతిః,
ప్రదాయ పక్షిణే రాజన్ జగామ గతిముత్తమామ్. ౪

ప్ర. అ. రాజన్=రాజా! జగతీపతిః = భూపతియైన, శైబ్యః=శైబ్యుడు, శ్యేనాయ పక్షిణే=డేగ అనే పక్షికి, స్వామ్=తనసంబంధమైన, తనుమ్=శరీరమును, సంశ్రుత్య=ప్రతిజ్ఞ చేసి, ఉత్తమామ్ = ఉత్తమమైన, గతిమ్ =గతిని, జగామ=పొందెను.

తా. రాజా! శైబ్యమహారాజు, తన దేహమును డేగకు ఇచ్చెద నని ప్రతిజ్ఞ చేసి (ఇచ్చి) ఉత్తమలోకాలు పొందినాడు. ౪

మూ. తథా హ్యలర్కస్తేజస్వీ బ్రాహ్మణే వేదపారగే,
యాచమానే స్వకే నేత్రే ఉద్ధృత్యావిమనా దదౌ. ౫

ప్ర. అ. తథా=అట్లు, తేజస్వీ=తేజశ్శాలి యైన, అలర్కః=అలర్కుడు, వేదపారగే=వేదపారంగతు డైన, యాచమానే=యాచించుచున్న, బ్రాహ్మణే=బ్రాహ్మణునియందు (నికి), స్వకే=తన, నేత్రే=నేత్రములను, ఉద్ధృత్య=పెకలించి, అవిమనాః=ఏవిధ వైమనస్యమూ లేనివాడై, దదౌ హి=ఇచ్చెను కదా.

తా. తేజశ్శాలి యైన అలర్కుడు, వేదపారంగతు డైన బ్రాహ్మణుడు వచ్చి కోరగా నిస్సంకోచముగా తన నేత్రాలు పెకలించి ఇచ్చివేసినాడు. 5

మూ. సరితాం తు పతిః స్వల్పాం మర్యాదాం సత్యమన్వితః,
సత్యానురోధాత్సమయేఽస్వాం వేలాం నాతివర్తతే. 6

ప్ర. అ. సరితాం పతిః తు=నదుల పతి యైన సముద్రు డైతే, సత్యమ్ అన్వితః=సత్యమును అనుసరించుచున్నవాడై, స్వల్పామ్=స్వల్ప మైన, మర్యాదామ్=సరిహద్దుగా ఉన్న, స్వామ్=తన, వేలామ్=ఒడ్డును, సమయే=వృద్ధి సమయములో కూడా, సత్యానురోధాత్=సత్యమును అనుసరించుటవలన, నాతివర్తతే=దాటుటలేదు.

తా. సముద్రుడు కూడా సత్యమును అనుసరించుచు, వృద్ధి సమయాలలో కూడా తన అతిస్వల్ప మైన సరిహద్దుగా ఉన్న చెలియలికట్ట దాటుట లేదు. 6

మూ. సత్యమేకపదం బ్రహ్మ సత్యే ధర్మః ప్రతిష్ఠితః,
సత్యమేవాక్షయా వేదాః సత్యేనైవాప్యతే పరమ్. 7

ప్ర. అ. సత్యమ్=సత్యమే, ఏకపదమ్=ఒక్క పదము రూపములో ఉన్న, బ్రహ్మ=బ్రహ్మ. సత్యే=సత్యముపైననే, ధర్మః=ధర్మము, ప్రతిష్ఠితః=స్థిరముగా నిలచి ఉన్నది. సత్యమేవ=సత్యమే, అక్షయాః=వినాశములేని, వేదాః=వేదాలు; సత్యేనైవ = సత్యముచేతనే, పరమ్ = ఉత్తమస్థానము, ఆప్యతే = పొందబడును.

తా. 'సత్యమ్' అనే ఒక్క పదము బ్రహ్మరూపము. ధర్మము సత్యముపైననే ఆధారపడి ఉన్నది. సత్యమే అక్షయవేదాలు. సత్యము ద్వారానే పరమపదమును చేరకలుగుతారు. 7

వి. ఏకపదమ్=ఏకైక గమ్యస్థానము, లేదా 'ఓం' అను ఏకపదరూపము అయిన బ్రహ్మ అని ప్రాచీన వ్యాఖ్య. కఠోపనిషదాదులలో ఓంకారము బ్రహ్మ రూపమూ, బ్రహ్మప్రతీకమూ అని చెప్పుట చేత ఈ వ్యాఖ్య శాస్త్రసంమతమే. ఏకైకగమ్యస్థానము అనేది కూడా యుక్తమే. కాని ఇక్కడ సత్యాన్ని స్తుతించే ప్రసంగములో 'సత్యమ్' అనే ఒక్క పదమే 'బ్రహ్మ' అని చెప్పుటలో ఔచిత్యం ఉన్నదని నా అభిప్రాయం. అనగా సత్యము బ్రహ్మస్వరూపము అని అర్థము.

మూ. సత్యం సమనువర్తస్వ యది ధర్మే ధృతా మతిః,
సఫలః స వరో మేఽస్తు వరదో హ్యసి సత్తమ. 8

ప్ర. అ. సత్తమ=ఓ శ్రేష్ఠుడా! మతిః=నీ బుద్ధి, ధర్మే=ధర్మముమీద, ధృతా యది=స్థిరముగా ఉంచబడినదైతే, సత్యమ్=సత్యమును, సమనువర్తస్వ=అనుసరింపుము. మే=నాయొక్క, వరః=వరము, సఫలః=సఫలము, అస్తు=అగుగాక. వరదః=వరాలు ఇచ్చినవాడవు, అసి హి=అయి ఉన్నావు కదా!

తా. ఓ పురుషశ్రేష్ఠా! నీ బుద్ధి ధర్మముమీదనే స్థిరముగా నిలచి ఉన్న పక్షంలో సత్యము పాలింపుము. నా వరాలు సఫలము లయేటట్లు చేయుము. ఆ వరాలిచ్చినవాడవు నీవే కదా! 8

వి. 'నీ వందఱికిని వరంబుల నిచ్చువాడవు కదా' అని ప్రాచీన వ్యాఖ్య.

మూ. ధర్మస్యేహాభికామార్థం మమ చైవాభిచోదనాత్,
ప్రవ్రాజయ సుతం రామం త్రిః ఖలు త్వాం బ్రవీమ్యహమ్.

ప్ర. అ. ఇహ=ఈ విషయమున, ధర్మస్య=ధర్మముయొక్క, అభికామార్థమ్=కోరుట (నిలుపుట) కోసమూ, మమ=నాయొక్క, అభిచోదనాత్=ప్రేరణవలననూ, సుతమ్=పుత్రుడైన, రామమ్=రాముని, ప్రవ్రాజయ=దూరముగా పంపుము. త్వామ్=నిన్ను గూర్చి, త్రిః=మూడు పర్యాయాలు, అహమ్=నేను, బ్రవీమి=చెప్పుచున్నాను.

తా. నీవు నీ ధర్మమును నిలుపుకోవలెను. నేను కూడా ప్రేరేపించుచున్నాను. ఈ రెండు కారణాలచేత రాముని అడవులకు పంపుము. మూడు పార్లు చెప్పుచున్నాను (పంపుము పంపుము పంపుము).

మూ. సమయం చ మమార్యేమం యది త్వం న కరిష్యసి,
అగ్రతస్తే పరిత్యక్తా పరిత్యక్ష్యామి జీవితమ్. 10

ప్ర. అ. ఆర్య = ఓ పూజ్యుడా! త్వమ్ = నువ్వు, మమ = నాయొక్క, ఇమమ్ = ఈ, సమయమ్ = ఒప్పందమును, న కరిష్యసి యది = చేయకపోయినచో, పరిత్యక్తా = (నీచే ఈ విధముగా) విడవబడిన నేను, తే అగ్రతః = నీ ఎదుటనే, జీవితమ్ = జీవితమును, పరిత్యక్ష్యామి = విడవగలను.

తా. ఆర్యా! నీవు మన ఒప్పందము ప్రకారము చేయకపోయినచో నన్ను విడిచివేసినట్లే. అందుచేత నీ ఎదుటనే ప్రాణాలు విడచెదను. 10

మూ. ఏవం ప్రచోదితో రాజా కైకేయ్యా నిర్విశఙ్కయా,
నాశకత్పాశమున్మోక్తుం బలిరిన్ద్రకృతం యథా. 11

ప్ర. అ. నిర్విశఙ్కయా = ఎట్టి శంకయు లేని, కైకేయ్యా = కైకేయిచేత, ఏవమ్ = ఈ విధముగా, ప్రచోదితః = ప్రేరేపింపబడిన, రాజా = రాజు, బలిః = బలిచక్రవర్తి, ఇన్ద్రకృతం యథా = ఇంద్రుని చేత (ఉపేంద్రుని ద్వారా) ప్రయోగింపబడిన పాశమును వలె, పాశమ్ = ఆ ధర్మపాశమును, మోక్తుమ్ = విడుచుటకు, నాశకత్ = సమర్థుడు కాలేదు.

తా. ఏ మాత్రమూ జంకూ గొంకూ లేక కైకేయి ఈ విధముగా నిర్బంధించుటతో దశరథుడు, ఇంద్రుడు వామనునిద్వారా ప్రయోగించిన ధర్మపాశమును బలిచక్రవర్తి విడిపించుకొనలేకపోయినట్లే విడిపించుకొనలేకపోయెను. 11

మూ. ఉద్భ్రాన్తహృదయశ్చాపి వివర్ణవదనోఽభవత్,
స ధుర్యో వై పరిస్పన్దన్ యుగచక్రాన్తరం యథా. 12

ప్ర. అ. సః = దశరథుడు, యుగచక్రాన్తరమ్ = కాడికిని చక్రానికి మధ్య, పరిస్పన్దన్ = కొట్టుకొనుచున్న, ధుర్యః యథా = కాడికి కట్టిన ఎద్దు వలె, ఉద్భ్రాన్త హృదయః = తిరిగిపోవుచున్న హృదయము కలవాడై, వివర్ణవదనః చాపి = రంగు మారిన ముఖము కలవాడు, అభవత్ = అయెను.

తా. కాడికి చక్రానికి మధ్య పడి నలిగిపోతూన్న ఎద్దుకువలె దశరథునికి హృదయము తిరిగిపోయినది. ముఖము పాలిపోయినది. 12

మూ॥ విహ్వలాభ్యాం చ నేత్రాభ్యామపశ్యన్నివ భూపతిః,
కృచ్ఛ్రాద్ధైర్యేణ సంస్తభ్య కైకేయీమిదమబ్రవీత్. 13

ప్ర. అ. భూపతిః = రాజు, విహ్వలాభ్యామ్ = వ్యాకులం బైన, నేత్రాభ్యామ్ = నేత్రాలతో, అపశ్యన్నివ = చూడని వాడు వలె, కృచ్ఛ్రాత్ = కష్టముగా, ధైర్యేణ = ధైర్యముచేత, సంస్తభ్య = నిలద్రొక్కుకొని, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈవాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథుడు వ్యాకులముగా ఉన్న నేత్రాలతో ఏమీ చూడలేకపోయెను. అట్టి స్థితిలో అతికష్టముగా ధైర్యముతో నిలద్రొక్కుకొని కైకేయితో ఇట్లు అనెను. 13

మూ. యస్తే మన్త్రికృతః పాణిరగ్నౌ పాపే మయా ధృతః,
తం త్యజామి స్వజం చైవ తవ పుత్రం త్వయా సహ. 14

ప్ర. అ. పాపే = పాపాత్మురాలా! అగ్నౌ = అగ్నిసమీపమునందు, మన్త్రికృతః = మంత్రాలచే సంస్కరించబడిన, తే = నీయొక్క, యః పాణిః = ఏ హస్తము, మయా = నాచేత, ధృతః = ధరించబడినదో, తమ్ = దానిని, స్వజమ్ = నావలన జనించిన, తవ పుత్రం చైవ = నీ పుత్రుని, త్వయాసహ = నీతో కూడ, త్యజామి = విడిచివేయుచున్నాను.

తా. ఓ పాపాత్మురాలా! అగ్నిసాక్షిగా మంత్రసంస్కృత మైన నీ హస్తము గ్రహించితిని. ఆ హస్తమునూ, నీకు నావలన పుట్టిన కుమారునీ, నిన్నూ కూడా విడచివేసెదను. 14

మూ॥ ప్రయాతా రజనీ దేవి సూర్యస్యోదయనం ప్రతి,
అభిషేకం గురుజనస్త్వరయిష్యతి మాం ధ్రువమ్, 15
రామాభిషేకసంభారైస్తదర్థముపకల్పితైః.

ప్ర. అ. దేవి = ఓ దేవీ! రజనీ = రాత్రి, సూర్యస్య = సూర్యునియొక్క, ఉదయనం ప్రతి = ఉదయమును గూర్చి, ప్రయాతా = వెళ్ళినది. తదర్థమ్ = అభిషేకముకొరకు, ఉపకల్పితైః = ఏర్పరుపబడిన, రామాభిషేకసంభారైః = రాముని కు అభిషేకము చేసే సామగ్రితో, అభిషేకమ్ = రామాభిషేకమును గూర్చి,

గురుజనః = గురుజనము, మామ్ = నన్ను, ద్రుతమ్ = తప్పక, త్వరయిష్యతి = తొందర చేయగలదు.

తా. దేవీ! రాత్రి గడచిపోయి సూర్యోదయము కానున్నది. ఇంతకు పూర్వమే సిద్ధము చేసిన అభిషేకసంభారాలతో రామునికి అభిషేకము చేయుమని వసిష్ఠాదిగురువులు నన్ను తప్పక తొందర పెట్టెదరు. 15

మూ. రామః కారయితవ్యో మే మృతస్య సలిలక్రియామ్. 16
త్వయా సపుత్రయా నైవ కర్తవ్యా సలిలక్రియా.
వ్యాహన్త్యస్యశుభాచారే యది రామాభిషేచనమ్. 17

ప్ర. అ. అశుభాచారే = చెడ్డ ప్రవృత్తి కలదానా! రామాభిషేచనమ్ = రాముని అభిషేకమును, వ్యాహన్త్యసి యది = నీవు అడ్డగించినట్లయితే, సపుత్రయా = పుత్రునితో కూడిన, త్వయా = నీచేత, సలిలక్రియా = తర్పణము, నైవ కర్తవ్యా = చేయదగినదికాదు. మృతస్య = మరణించిన, మే = నాకు, రామః = రాముడు, సలిలక్రియామ్ = జలతర్పణమును, కారయితవ్యః = చేయించదగినవాడు.

తా. ఓ దురాచారవంతురాలా! నీవు రామాభిషేకానికి విఘ్నము కలిగించే పక్షమున నీవు గాని నీ కుమారుడు గాని నాకు ఉదకక్రియలు చేయవద్దు. నేను మరణించిన పిమ్మట రాముడే నాకు ఉదకక్రియలు చేయవలెను.

వి. 16వ శ్లోకము పూర్వార్థమును, 17వ శ్లోకముతో కలిపి అర్థం వ్రాయబడింది. అట్లు కాకుండా రాముని పట్టాభిషేకానికి ఏర్పరచిన జలాదులతో రాముడు నా మరణానంతరం నాకు ఉత్తరక్రియలు చేయుగాక అనే అర్థం చెప్పినా బాగుండును. దశరథుని దుఃఖావేశానికి సూచకంగా ఉండును. 17

మూ. న చ శక్నోమ్యహం ద్రష్టుం దృష్ట్వా పూర్వం తథా సుఖమ్,
హతహర్షం నిరానన్దం పునర్జనమవాఙ్ముఖమ్. 18

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, తథా సుఖమ్ = ఆ విధముగా ఆనందముగా ఉన్న, జనమ్ = జనమును, దృష్ట్వా = చూచి, పునః = మరల, హతహర్షమ్ = కొల్లగొట్టబడిన సంతోషముకలదై, నిరానన్దమ్ = ఆనందరహిత మై, అవాఙ్ముఖమ్ =

వంచబడిన ముఖము కలదానినిగా, ద్రష్టుమ్ = చూచుటకు, అహమ్ = నేను, న శక్నోమి చ = సమర్థుడను గాను.

తా. పూర్వము అంత ఆనందముతో ఉన్న ఆననము చూచిన నేను, ఇపుడు ఆ ఆననమే సంతోషము లేక, ఆనందము నశించి, తలలు వంచి దుఃఖించు చుండగా చూడలేను. 18

మూ. తాం తథా బ్రువత స్తస్య భూమిపస్య మహాత్మనః,
ప్రభాతా శర్వరీ పుణ్యా చన్ద్రనక్షత్రశాలినీ. 19

ప్ర. అ. మహాత్మనః = మహాత్ము డైన, తస్య భూమిపస్య = ఆ రాజు, తామ్ = ఆమెను గూర్చి, తథా = అట్లు, బ్రువతః = మాటలాడుచుండగానే, చన్ద్రనక్షత్రశాలినీ = చంద్రునితోను నక్షత్రాలతోను ప్రకాశించుచున్నది, పుణ్యా = పుణ్యమూ అయిన, శర్వరీ = రాత్రి, ప్రభాతా = తెల్లవారినది.

తా. ఆ మహాత్ము డైన దశరథుడు ఆమెతో ఇట్లు మాటలాడుచుండగానే చంద్రనక్షత్రాలతో ప్రకాశిస్తూ పవిత్ర మైన రాత్రి తెల్లవారినది. 19

మూ. తతః పాపసమాచారా కైకేయీ పార్థివం పునః,
ఉవాచ పరుషం వాక్యం వాక్యజ్ఞా రోషమూర్ఛితా. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పాపసమాచారా = పాప మైన ప్రవర్తన కలదీ, వాక్యజ్ఞా = మాటలు నేర్చినదీ అయిన, కైకేయీ = కైకేయి, రోషమూర్ఛితా = కోపముతో నిండినదై, పునః = మరల, పార్థివమ్ = రాజును గూర్చి, పరుషమ్ = పరుష మైన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పాప మైన ప్రవృత్తి కలదీ, మాటలు నేర్చినదీ అయిన కైకేయి, కోపా విష్టు రాలై రాజుతో మరల పరుషముగా ఇట్లు పలికెను. 20

మూ. కిమిదం భాషసే రాజన్ వాక్యం గరరుజోపమమ్,
ఆనాయయితు మక్లిష్టం పుత్రం రామమిహార్హసి. 21

ప్ర. అ. రాజన్ = రాజా! గరరుజోపమమ్ = విషబాధతో సమానమైన ("విషవ్యాధితో పోలికగల" అని ప్రా. వ్యా.) వాక్యమ్ = వాక్యమును, భాషసే

= మాటలాడుచున్నావు. ఇదం కిమ్ = ఇది యేమి? అక్లిష్టం = శీఘ్రముగా, పుత్రమ్ = పుత్రు డైన, రామమ్ = రాముని, ఇహ = ఇచటికి, ఆనాయయితుమ్ = రప్పించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. రాజా! విషము వలె తీవ్రబాధాకర మైన మాటలు మాట్లాడుచున్నావు; ఏమి టిది? ఇంక ఆలస్యము చేయకుండా నీ పుత్రుడైన రాముని ఇచటికి రప్పించుము. 21

మూ. స్థాప్య రాజ్యే మమ సుతం కృత్వా రామం వనేచరమ్,
నిఃసపత్నాం చ మాం కృత్వా కృతకృత్యో భవిష్యసి. 22

ప్ర. అ. మమ సుతమ్ = నా కుమారుని, రాజ్యే = రాజ్యమునందు, స్థాప్య = స్థాపించి, రామమ్ = రాముని, వనేచరమ్ = వనంలో తిరిగే వానినిగా, కృత్వా = చేసి, మామ్ = నన్ను, నిఃసపత్నామ్ = శత్రువులు లేనిదానినిగా, కృత్వా = చేసి, కృతకృత్యః భవిష్యసి = కృతకృత్యుడవు కాగలవు.

తా. నా కుమారునికి రాజ్యము ఇచ్చి, రాముని వనానికి పంపి, నాకు శత్రువు లెవ్వరూ లేకుండా చేసి నట్లయితే కృతకృత్యుడవు అయెదవు. 22

మూ. స నున్న ఇవ తీక్ష్ణేన ప్రతోదేన హయోత్తమః,
రాజా ప్రచోదితోఽభీక్ష్ణం కైకేయీమిద మబ్రవీత్. 23

ప్ర. అ. సః రాజా = ఆ రాజు, తీక్ష్ణేన = తీక్ష్ణ మైన, ప్రతోదేన = కొరడాతో, నున్నః = కొట్టబడిన, హయోత్తమః ఇవ = శ్రేష్ఠాశ్వము వలె, అభీక్ష్ణమ్ = మిక్కిలి, ప్రచోదితః = ప్రేరేపించబడ్డవాడై, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యము, అబ్రవీత్ = పలికెను.

తా. కొరడాతో గట్టిగా కొట్టిన ఉత్తమాశ్వము వలె ఆ రాజు ఆ విధముగా మాటలచే ప్రేరేపబడ్డ వాడై కైకేయితో ఇట్లనెను. 23

మూ. ధర్మబంధేన బద్ధోఽస్మి నష్టా చ మమ చేతనా,
జ్యేష్ఠం పుత్రం ప్రియం రామం ద్రష్టుమిచ్ఛామి ధార్మికమ్.

ప్ర. అ. ధర్మబన్ధేన = ధర్మపాశముచేత, బద్ధః అస్మి = కట్టబడితిని, మమ చేతనా చ = నా బుద్ధి కూడా, నష్టా = నశించినది. ధార్మికమ్ = ధర్మాత్ముడూ, జ్యేష్ఠమ్ = జ్యేష్ఠుడూ, ప్రియమ్ = ప్రియుడూ, పుత్రమ్ = పుత్రుడూ అయిన రామమ్ = రాముని, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుతున్నాను.

తా. "ధర్మపాశానికి కట్టుబడిపోయినాను. నా బుద్ధి కూడ పనిచేయుట లేదు. ధర్మాత్ముడూ, నా ప్రియ జ్యేష్ఠ కుమారుడూ అయిన రాముని చూడ గోరుతున్నాను. 24

మూ. తతః ప్రభాతాం రజనీముదితే చ దివాకరే,
పుష్యే నక్షత్రయోగే చ ముహూర్తే చ సమాహితే, 25
వసిష్ఠో గుణసంపన్నః శిష్యైః పరివృతస్తదా,
ఉపగృహ్యాశు సంభారాన్ ప్రవివేశ పురోత్తమమ్ 26

ప్ర. అ. తతః = పిదప, ప్రభాతామ్ = తెల్లవారిన, రజనీమ్ = రాత్రిని అనుసరించి, దివాకరే = సూర్యుడు, ఉదితే = ఉదయించగా, పుష్యే = పుష్యమైన, నక్షత్రయోగే చ = నక్షత్రయోగమునందు, ముహూర్తే = ముహూర్తము, సమాహితే = సమీపించగా, తదా = అప్పుడు, గుణసంపన్నః = మంచి గుణములు గల, వసిష్ఠః = వసిష్ఠుడు, శిష్యైః = శిష్యులతో, పరివృతః = కూడినవాడై, సంభారాన్ = అభిషేకసంభారాలను, ఉపగృహ్య = గ్రహించి, ఆశు = శీఘ్రముగా, పురోత్తమమ్ = ఆ పురశ్రేష్ఠమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. తెల్లవారి సూర్యుడుదయించెను. పుష్యనక్షత్రముతో కూడిన శుభ ముహూర్తము సమీపించుచుండెను. అపుడు సద్గుణసంపన్నుడైన వసిష్ఠుడు శిష్య పరివృతుడై, అభిషేకసంభారాలతో అయోధ్యలో ప్రవేశించెను. 25, 26

మూ. సిక్తసంమార్జితపథాం పతాకోత్తమభూషితామ్,
విచిత్రకుసుమాకీర్ణాం నానాస్రగ్భిర్విరాజితామ్, 27
సంహృష్టమనుజోపేతాం సమృద్ధవిపణాపణామ్,
మహోత్సవసమాకీర్ణాం రాఘవార్థే సముత్సుకామ్, 28

చన్దనాగురుధూపైశ్చ సర్వతః ప్రతిధూపితామ్,
తాం పురీం సమతిక్రమ్య పురన్దరపురోపమామ్. 29
దదర్శాన్తఃపురశ్రేష్ఠం నానాద్విజగణాయుతమ్
పౌరజానపదాకీర్ణం బ్రాహ్మణైరుపశోభితమ్, 30
యజ్ఞవిద్భిః సుసంపూర్ణం సదస్యైః పరమద్విజైః.

ప్ర. అ. సిక్తసంమార్జితపథామ్ = తడుపబడి ఊడ్వబడిన వీథులు కలదీ, పతాకోత్తమభూషితామ్ = శ్రేష్ఠము లైన పతాకలచేత అలంకరింపబడినదీ, విచిత్రకుసుమాకీర్ణామ్ = వివిధవర్ణాలు గల పుష్పాదులచే వ్యాప్తమైనదీ, నానాస్రగ్భిః = అనేక విధా లైన పుష్పమాలాదులచే, విరాజితామ్ = ప్రకాశింపచేయబడినదీ, సంహృష్టమనుజోపేతామ్ = సంతసించిన మనుష్యులతో కూడినదీ, సమృద్ధవిపణాపణామ్ = సమృద్ధాలుగా ఉన్న కొట్లు, బజారులు కలదీ, (విపణము అనగా దుకాణము; ఆపణము అనగా బజారు), మహోత్సవసమాకీర్ణామ్ = మహోత్సవాలతో నిండినదీ, రాఘవార్థే = రాముని కొరకై, సముత్సుకామ్ = ఆసక్తితో ఎదురుచూచుచున్నదీ, సర్వతః = అంతటా, చన్దనాగరుధూపైః = చందనముచేత, అగరుధూపాలచేత, ప్రతిధూపితామ్ = పరిమళింప చేయబడినదీ, పురన్దరపురోపమామ్ = ఇంద్రపురి యైన, అమరావతితో సమానమైనదీ అయిన, తాం పురీమ్ = ఆ పట్టణమును, సమతిక్రమ్య = దాటి (ఆ నగరములో కొంత దూరము నడచి వెళ్లి), నానాద్విజగణాయుతమ్ = చాలామంది ద్విజాల సమూహాంతో కూడినదీ, పౌరజానపదాకీర్ణమ్ = నాగరికులతోను, గ్రామీయులతోను నిండినదీ, బ్రాహ్మణైః = బ్రాహ్మణులతో, ఉపశోభితమ్ = ప్రకాశింపచేయబడినదీ, యజ్ఞవిద్భిః = యజ్ఞాలను గూర్చి తెలిసినవారూ, సదస్యైః = సభలో ఉండుటకు అర్హులూ అయిన, పరమద్విజైః = ఉత్తమ బ్రాహ్మణులతో, సంపూర్ణమ్ = నిండినదీ అయిన; అన్తఃపురశ్రేష్ఠమ్ = శ్రేష్ఠ మైన అంతఃపురమును, దదర్శ = చూచెను.

తా. అయోధ్యలోని వీథులన్నీ తుడిచి నీళ్లు చల్లి ఉండెను. వాటిని అందమైన పతాకలచే అలంకరించిరి. అనేక మైన రంగుల పువ్వులు చల్లిరి. అనేకవిధాలైన మాలికలు కట్టిరి. అక్కడ మనుష్యులందరూ ఆనందోత్సాహాలతో ఉండిరి. దుకాణాలు, బజారులూ కూడా వివిధవస్తువులతో సమృద్ధములుగా ఉండెను. ఎక్కడ చూచినా మహోత్సవాలు జరుగుచుండెను. ప్రజలందరూ రాముని

కోసం ఉత్కంఠతో ఎదురు చూచుచుండిరి. నలుమూలలా చందనసువాసనలూ, అగురుధూపాలూ వ్యాపించుచుండెను. సాక్షాత్తు దేవేంద్రుని నగర మైన అమరావతి వలె ఉండెను. అట్టి నగరములో ప్రవేశించిన వసిష్ఠుడు కొంతదూరంలో శ్రేష్ఠ మైన రాజాంతఃపురము చూచెను. అక్కడ ఎందరో ద్విజులు గుంపులు గుంపులుగా చేరి ఉండిరి. పట్టణాల జనులు, గ్రామాల నుండి వచ్చిన జనులూ కిక్కిరిసి ఉండిరి. యజ్ఞవేత్తలూ, సభాస్తులూ అయిన ఉత్తమద్విజులు వచ్చి ఉండిరి. 27-30

మూ. తదన్తఃపురమాసాద్య వ్యతిచక్రామ తం జనమ్, 31
వసిష్ఠః పరమప్రీతః పరమర్షిర్వివేశ చ.

ప్ర. అ. పరమర్షిః=మహర్షియైన, వసిష్ఠః = వసిష్ఠుడు, పరమప్రీతః = చాలా సంతోషించినవాడై, తత్ అన్తఃపురమ్ = ఆ అంతఃపురమును, ఆసాద్య = పొంది, తం జనమ్ = ఆ జనమును, వ్యతిచక్రామ = దాటి వెళ్లెను. వివేశ చ = అంతఃపురములో ప్రవేశించెనుకూడ.

తా. మహర్షి యైన ఆ వసిష్ఠుడు ఆ అంతఃపురము చూచి చాల సంతోషించి అక్కడ ఉన్న జనమును దాటి వెళ్లి లోపల ప్రవేశించెను. 31

మూ. స త్వపశ్యద్వినిష్క్రాన్తం సుమన్త్రిం నామ సారథిమ్,
ద్వారే మనుజసింహస్య సచివం ప్రియదర్శనమ్.

ప్ర. అ. సః తు = ఆ వసిష్ఠమహర్షి, మనుజసింహస్య=మనుష్యశ్రేష్ఠుడైన దశరథునియొక్క, ద్వారే = ద్వారమునందు, వినిష్క్రాన్తమ్ = వెలుపటికి వచ్చినవాడూ, సచివమ్=మంత్రీ, ప్రియదర్శనమ్ = ప్రియ మైన దర్శనము కలవాడూ అయిన, సుమన్త్రిం నామ = సుమంత్రు డనే, సారథిమ్ = సారథిని, అపశ్యత్ = చూచెను.

తా. అంతలో రాజద్వారమునుండి వెలుపలు వచ్చుచున్న, రాజసచివుడూ, చూడగానే ఆనందము కలిగించే వాడూ అయిన సుమంత్రు డనే సారథి వసిష్ఠమునికి కనబడెను. 32

మూ. తమువాచ మహాతేజాః సూతపుత్రం విశారదమ్, 33
వసిష్ఠః క్షిప్రమాచక్ష్వ నృపతే ర్మామిహాగతమ్.

ప్ర. అ. మహాతేజాః = గొప్పతేజస్సు గల, వసిష్ఠః = వసిష్ఠుడు, విశారదమ్ = బుద్ధిమంతుడైన, తం సూతపుత్రమ్ = సూతపుత్రుడైన ఆ సుమంత్రుని గూర్చి, ఆహ = పలికెను. మామ్ = నన్ను, ఇహ = ఇచటికి, ఆగతమ్ = వచ్చిన వానినిగా, నృపతేః = రాజునకు, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆచక్ష్వ = చెప్పుము.

తా. మహాతేజశ్శాలియైన వసిష్ఠుడు ఆ పండితుడైన సుమంత్రునితో ఇట్లు అనెను- "నేను వచ్చినట్లుగా రాజుతో శీఘ్రముగా వెళ్లి చెప్పుము". 33

మూ. ఇమే గఙ్గోదకఘటాః సాగరేభ్యశ్చ కాఞ్చనాః, 34
ఔదుమ్బరం భద్రపీఠమభిషేకార్థమాగతమ్,
సర్వబీజాని గన్ధాశ్చ రత్నాని వివిధాని చ. 35

క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భాః సుమనసః పయః,
అష్టౌ చ కన్యా రుచిరా మత్తశ్చ వరవారణః. 36

చతురశ్వో రథః శ్రీమాన్ నిస్త్రింశో ధనురుత్తమమ్,
వాహనం నరసంయుక్తం ఛత్రం చ శశిసన్నిభమ్. 37

శ్వేతే చ వాలవ్యజనే భృఙ్గారశ్చ హిరణ్మయః,
హేమదామపినద్ధశ్చ కకుద్మాన్ పాణ్డురో వృషః. 38

కేసరీ చ చతుర్దంష్ట్రో హరిశ్రేష్ఠో మహాబలః,
సింహాసనం వ్యాఘ్రతనుః సమిద్ధశ్చ హుతాశనః. 39

సర్వవాదిత్రసంఘాశ్చ వేశ్యాశ్చాలంకృతాః స్త్రియః,
ఆచార్యా బ్రాహ్మణా గావః పుణ్యాశ్చ మృగపక్షిణః. 40

పౌరజానపదశ్రేష్ఠా నైగమాశ్చ గణైః సహ,
ఏతే చాన్యే చ బహవో నీయమానాః ప్రియంవదాః, 41
అభిషేకాయ రామస్య సహ తిష్ఠన్తి పార్థివైః.

ప్ర. అ. ఇమే = ఈ, గఙ్గోదకఘటాః = గంగోదకము నింపిన కలశలూ, సాగరేభ్యః చ = సాగరాలనుండి, కాఞ్చనాః = బంగారు కలశలూ, ఔదుమ్బరమ్ = మేడి కఱ్ఱతో చేసిన, భద్రపీఠమ్ = భద్రపీఠము, (రాజు కూర్చునే పీఠమూ), అభిషేకార్థమ్ = అభిషేకముకొరకు, ఆగతమ్ = వచ్చినది (వి). సర్వబీజాని = సమస్తధాన్యములు, గన్ధాః = గంధములూ, వివిధాని = అనేక విధా లైన, రత్నాని చ = రత్నాలు, క్షౌద్రమ్ = తేనె, దధి = పెరుగు, ఘృతమ్ = నెయ్యి, లాజాః = పేలాలు, దర్భాః = దర్భలు, సుమనసః = పుష్పాలు, పయః = పాలు, రుచిరాః = అంద మైన, అష్టౌ = ఎనమండుగురు, కన్యాః = కన్యలు, మత్తః = మదించిన, వారణః = ఏనుగ, చతురశ్వః = నాలుగు గుఱ్ఱాలు గల, శ్రీమాన్ = శోభాయుక్త మైన, రథః = రథమూ, నిస్త్రింశః = ఖడ్గమూ, ఉత్తమమ్ = ఉత్తమ మైన, ధనుః = ధనస్సూ, నరసంయుక్తమ్ = మనుష్యులతో గూడిన, వాహనమ్ = వాహనమూ (పల్లకీ), శశిసన్నిభమ్ = చంద్రునితో సమాన మైన, ఛత్రం చ = ఛత్రమూ, శ్వేతే = తెల్లని, వాలవ్యజనే = వింజామరలూ, హిరణ్మయః = బంగారు, భృఙ్గారః = పాత్రా, హేమదామపినద్ధః = బంగారు పగ్గములతో కట్టబడిన, కకుద్మాన్ = పెద్ద మూపురము గల, పాణ్డురః = తెల్లని, వృషః = ఎద్దు, కేసరీ = అంద మైన జూలు కలదీ, చతుర్దంష్ట్రః = నాలుగు పెద్ద పండ్లు కలదీ, మహాబలః = గొప్ప బలము కలదీ అయిన, హరిశ్రేష్ఠః = శ్రేష్ఠ మైన గుఱ్ఱమూ, సింహాసనమ్ = సింహాసనమూ, వ్యాఘ్రతనుః = వ్యాఘ్రచర్మమూ, సమిద్ధః = ప్రజ్వలించుచున్న, హుతాశనః = అగ్ని, సర్వవాదిత్రసంఘః చ = సకలవాద్యముల సముదాయమూ, వేశ్యాః = వేశ్యలు, అలంకృతాః = అలంకరించబడిన, స్త్రియః = స్త్రీలూ, ఆచార్యాః = ఆచార్యులూ, బ్రాహ్మణాః = బ్రాహ్మణులూ, గావః = గోవులూ, పుణ్యాః = పుణ్య మైన, మృగపక్షిణః = మృగాలూ, పక్షులూ, పౌరజానపదశ్రేష్ఠాః = శ్రేష్ఠు లైన పౌరులూ, జానపదులూ, గణైః సహ = ఆ యా శిల్పిగణాలతో, నైగమాః చ = వర్తకులూ, ఏతే = వీరందరూ, ప్రియంవదాః = ప్రియముగా మాటలాడే, నీయమానాః = తీసికొనిరాబడుచున్న, బహవః = చాలమంది, అన్యే చ = ఇతరులూ, పార్థివైః సహ = రాజులతో కూడ, రామస్య = రామునికి, అభిషేకాయ = అభిషేకము కొరకు, తిష్ఠన్తి = ఉన్నారు.

తా. గంగాజలమూ నింపిన కలశలూ, సముద్రజలాలతో బంగారు కలశలు, ఉదుంబరదారువుతో చేసిన భద్రపీఠమూ, అభిషేకముకొరకు వచ్చి ఉన్నాయి.

అన్ని ధాన్యాలూ, గంధాలూ, వివిధ రత్నాలూ, తేనె, పెరుగు, నెయ్యి, పేలాలూ, దర్భలూ, పుష్పాలూ, పాలు. అంద మైన ఎనమండుగురు కన్యలు, మదించిన ఏనుగ, నాలుగు గుఱ్ఱాలు కట్టి అందముగా ఉన్న రథము, ఖడ్గము, ఉత్తమ మైన ధనస్సు, పల్లకీ, చంద్రసదృశ మైన ఛత్రమూ, తెల్లని వింజామరలూ, బంగారు పాత్ర, బంగారు పగ్గాలతో కట్టబడినదీ, పెద్దమూపురము కలదీ అయిన తెల్లని ఎద్దు, అంద మైన జూలు గలదీ, నాలుగు పెద్ద దంతాలు కలదీ, మంచి బలం గలదీ అయిన శ్రేష్ఠ మైన గుఱ్ఱమూ, సింహాసనమూ, వ్యాఘ్రచర్మమూ, ప్రజ్వలించుచున్న అగ్ని, సకలవాద్యసమూహాలూ, వేశ్యలు, అలంకరించుకున్న స్త్రీలు, ఆచార్యులూ, బ్రాహ్మణులూ, గోవులూ, పవిత్ర మైన మృగాలూ, పశులూ, శ్రేష్ఠు లైన నాగరికులూ, గ్రామీణులు, వివిధశిల్పిగణాలూ, వర్తకులూ, ఇంకనూ ఎంతో మంది ప్రియముగా మాటలాడే జనులూ, రాజులూ, రామాభిషేకము కొరకై వచ్చి ఉన్నారు. 34-41

మూ. త్వరయస్వ మహారాజం యథా సముదితేఽహని, 42
పుష్యే నక్షత్రయోగే చ రామో రాజ్యమవాప్నుయాత్.

ప్ర. అ. అహని=దివసము, సముదితే=ఉదయించగానే (ప్రారంభము కాగానే) పుష్యే=పుష్య మైన, నక్షత్రయోగే చ=నక్షత్రయోగమునందు, రామః=రాముడు, యథా=ఏ విధముగా, రాజ్యమ్=రాజ్యమును, అవాప్నుయాత్=పొందునో, ఆ విధముగా, మహారాజమ్=మహారాజును, త్వరయస్వ=తొందర పెట్టుము.

తా. సూర్యోదయము అయిన వెంటనే, పుష్య మైన నక్షత్రమునందు రామునికి పట్టాభిషేకము చేయుటకై మహారాజును తొందర పెట్టుము. 42

మూ. ఇతి తస్య వచః శ్రుత్వా సూతపుత్రో మహాత్మనః. 43
స్తువన్నృపతిశార్దూలం ప్రవివేశ నివేశనమ్.

ప్ర. అ. సూతపుత్రః=సుమంత్రుడు, తస్య మహాత్మనః=మహాత్ము డైన ఆ వసిష్ఠునియొక్క, ఇతి=ఇట్టి, వచః=మాటను, శ్రుత్వా=విని, నృపతిశార్దూలమ్=ఆ రాజశ్రేష్ఠుని, స్తువన్=స్తుతించుచు, నివేశనమ్=గృహమును, ప్రవివేశ=ప్రవేశించెను.

తా. మహాత్ముడైన ఆ వసిష్ఠుని మాటలు విని, సుమంత్రుడు ఆ రాజ శ్రేష్ఠుని స్తుతించుచు అంతఃపురములో ప్రవేశించెను. 43

మూ. తం తు పూర్వోదితం వృద్ధం ద్వారస్థా రాజసమ్మతమ్, 44
న శేకురభిసంరోద్ధుం రాజ్ఞః ప్రియచికీర్షవః.

ప్ర. అ. ద్వారస్థాః = ద్వారపాలకులు, రాజ్ఞః = రాజునకు, ప్రియచికీర్షవః = ప్రియము చేయ దలచినవారై, పూర్వోదితమ్ = ముందుగా వచ్చినవాడూ, వృద్ధమ్ = వృద్ధుడూ, రాజసంమతమ్ = రాజుకు ఇష్టుడూ అయిన, తం తు = అతనిని, అభిసంరోద్ధుమ్ = అడ్డుపెట్టుటకు, న శేకుః = సమర్థులు కాలేదు.

తా. అందరికంటె ముందుగా వచ్చినవాడూ, వృద్ధుడూ, రాజప్రియుడూ అయిన సుమంత్రుని ద్వారపాలకులు, రాజునకు ప్రియము చేయగోరువారై, అడ్డు పెట్టలేక పోయినారు.

వి. 'పూర్వోదితమ్' అను దానికి "మునుపు చెప్పబడినవాడు అనగా ఈ సుమంత్రుడు లోనికి వచ్చునపుడు వీని నడ్డగింపవలదు. యథేచ్ఛముగా విడువుడు అని దశరథునిచే చెప్పబడినవాడు" అని ప్రా.వ్యా. 44

మూ. స సమీపస్థితో రాజ్ఞస్తామవస్థామజజ్ఞివాన్, 45
వాగ్భిః పరమతుష్టాభిరభిష్టోతుం ప్రచక్రమే.

ప్ర. అ. సః = అతడు, రాజ్ఞః = రాజునకు, సమీపస్థః = దగ్గర ఉన్నవాడై, తామ్ = ఆ, అవస్థామ్ = అవస్థను, అజజ్ఞివాన్ = తెలియనివాడై, పరమతుష్టాభిః = మిక్కిలి సంతోషముగల, వాగ్భిః = వాక్కులతో, అభిష్టోతుమ్ = స్తుతించుటకు, ప్రచక్రమే = ఉపక్రమించెను.

తా. రాజు దగ్గరకు వెళ్లిన ఆ సుమంత్రుడు అత డున్న పరిస్థితి తెలియక ఆనందకరము లైన మాటలతో స్తుతించుట ప్రారంభించెను. 45

మూ. తతః సూతో యథాకాలం పార్థివస్య నివేశనే,
సుమన్త్రః ప్రాఞ్జలిర్భూత్వా తుష్టావ జగతీపతిమ్. 46

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సూతః = సారథి యైన, సుమన్త్రః = సుమంత్రుడు, పార్థివస్య = రాజుయొక్క, నివేశనే = గృహమునందు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, యథాకాలమ్ = కాలానుగుణముగా, జగతీపతిమ్ = రాజును, తుష్టావ = స్తుతించెను.

తా. సారథి యైన సుమంత్రుడు రాజాంతఃపురములో, రాజుకు నమస్కరించుచు కాలానుగుణముగా ఈ విధముగా స్తుతించెను. 46

మూ. యథా నన్దతి తేజస్వీ సాగరో భాస్కరోదయే,
ప్రీతః ప్రీతేన మనసా తథానన్దఘనః స్వతః. 47

ప్ర. అ. స్వతః = సహజముగా, ఆనన్దఘనః = ఆనందముతో నిండిన నీవు, తేజస్వీ = తేజఃశాలి యైన, సాగరః = సముద్రుడు, భాస్కరోదయే = సూర్యోదయసమయమునందు, యథా = ఏ విధముగా, నన్దతి = ఆనందించునో, తథా = ఆ విధముగా, ప్రీతేన = సంతోషించిన, మనసా = మనస్సుతో, ప్రీతః = ఆనందించుచున్నవాడవు (అగుము).

తా. సహజముగా ఆనందముతో నిండిన నీవు సూర్యోదయ సమయములో తేజఃశాలి యైన సముద్రుడు ఆనందించి నట్లు, సంతోషభరిత మైన మనస్సుతో ఆనందించుము. 47

మూ. ఇన్ద్రమస్యాం తు వేలాయామభితుష్టావ మాతలిః, 48
సోఽజయద్దానవాన్సర్వాంస్తథా త్వాం బోధయామ్యహమ్.

ప్ర. అ. మాతలిః = మాతలి, అస్యాం వేలాయామ్ = ఈ సమయమునందు, ఇన్ద్రమ్ = ఇంద్రుని, అభితుష్టావ = స్తుతించెను. సః = ఆ ఇంద్రుడు, సర్వాన్ = సమస్త మైన, దానవాన్ = దానవులను, అజయత్ = జయించెను. తథా = అవిధముగానే, అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, బోధయామి = మేల్కొలుపుచున్నాను.

తా. ఇట్టి ప్రాతఃకాలమునందే మాతలి దేవేంద్రుని స్తుతించెను. ఇంద్రుడు సకలదానవులను జయించెను. నేను కూడ నిన్ను అట్లే మేల్కొలుపుచున్నాను. 48

మూ. వేదాః సహాఙ్గవిద్యాశ్చ యథాహ్యాత్మభువమ్ విభుమ్, 49
బ్రహ్మాణం బోధయన్త్యద్య తథా త్వాం బోధయామ్యహమ్

ప్ర. అ. సహాఙ్గవిద్యాః=అంగవిద్యలతో కూడిన, వేదాః=వేదాలు, ఆత్మభువమ్=స్వయముగానే పుట్టినవాడూ, విభుమ్=ప్రభువూ అయిన, బ్రహ్మాణమ్=బ్రహ్మను, యథా=ఏ విధముగా, బోధయన్తి=బోధింతురో, తథా=ఆవిధముగానే అహమ్=నేను, అద్య=ఇప్పుడు, త్వామ్=నిన్ను, బోధయామి=మేల్కొలుపుచున్నాను.

తా. వేదాలూ, వాటి అంగవిద్యలూ, తనంతటతానే పుట్టినవాడూ, ప్రభువూ అయిన బ్రహ్మదేవుని మేల్కొల్పినట్లు నేను నిన్ను మేల్కొల్పుచున్నాను.

మూ. ఆదిత్యః సహ చన్ద్రేణ యథా భూతధరాం శుభామ్, 50
బోధయత్యద్య పృథివీం తథా త్వాం బోధయామ్యహమ్

ప్ర. అ. సహ చన్ద్రేణ=చంద్రునితో కూడిన, ఆదిత్యః=సూర్యుడు, భూతధరామ్=ప్రాణులను ధరించేది, శుభామ్=శుభకర మైనదీ అయిన, పృథివీమ్=భూమిని, యథా=ఎట్లు, బోధయతి=మేల్కొల్పునో, తథా=ఆ విధముగా, అహమ్=నేను, త్వామ్=నిన్ను, బోధయామి=మేల్కొల్పుచున్నాను.

తా. సూర్యచంద్రులు సమస్తప్రాణులను ధరించేదీ, మంగళకర మైనదీ అయిన పృథివిని మేల్కొల్పినట్లు నిన్ను మేల్కొలుపుచున్నాను. 50

మూ. ఉత్తిష్ఠాశు మహారాజ కృతకౌతుకమఙ్గళః, 51
విరాజమానో వపుషా మేరోరివ దివాకరః.

ప్ర. అ. మహారాజ=మహారాజా! కృతకౌతుకమఙ్గళః=చేయబడిన ఉత్సవ మంగళవేషము కలవారవై, వపుషా=దేహముతో, విరాజమానః=ప్రకాశించు, మేరోః=మేరుపర్వతమునుండి, దివాకరః ఇవ=సూర్యుడు వలె, ఆశు=శీఘ్రముగా, ఉత్తిష్ఠ=లెమ్ము.

తా. మహారాజా! ఉత్సవానుగుణ మైన మంగళవేషము ధరించి, ప్రకాశించుచున్న శరీరముతో మేరుపర్వతమునుండి సూర్యుడు లేచినట్లు వెంటనే లెమ్ము. 51

మూ. సోమసూర్యౌ చ కాకుత్స్థ శివవైశ్రవణావపి, 52
వరుణశ్చాగ్నిరిన్ద్రశ్చ విజయం ప్రదిశన్తు తే.

ప్ర. అ. కాకుత్స్థ = కకుత్స్థవంశోద్భవా! సోమసూర్యౌ చ = చంద్రసూర్యులు, శివవైశ్రవణావపి = శివకుబేరులు, వరుణః చ = వరుణుడు, అగ్నిః = అగ్ని, ఇన్ద్రః చ = ఇంద్రుడూ, తే = నీకు, విజయమ్ = సర్వోన్నతిని, ప్రదిశన్తు = ఇచ్చెదరుగాక.

తా. దశరథమహారాజా! సోమసూర్యులూ, శివకుబేరులూ, వరుణుడూ, అగ్ని, ఇంద్రుడూ నీకు సర్వోన్నతిని ఇచ్చెదరుగాక. 52

మూ. గతా భగవతీ రాత్రిః కృతకృత్య మిదం తవ, 53
బుద్ధ్యస్వ నృపశార్దూల కురు కార్యమనన్తరమ్,
ఉదతిష్ఠత రామస్య సమగ్రమభిషేచనమ్. 54

ప్ర. అ. నృపశార్దూల = రాజశ్రేష్ఠా, భగవతీ = పూజించ దగిన, రాత్రిః = రాత్రి, గతా = గడచినది. తవ = నీయొక్క, ఇదమ్ = ఈ, కృతకృత్యమ్ = చేయబడిన పనిని, బుద్ధ్యస్వ = తెలుసుకొనుము. అనన్తరమ్ = తరువాతి, కార్యమ్ = కార్యమును, కురు = చేయుము. రామస్య = రామునియొక్క, సమగ్రమ్ = సంపూర్ణ మైన, అభిషేచనమ్ = అభిషేకసంభారము, ఉదతిష్ఠత = సిద్ధమైనది.

తా. రాజశ్రేష్ఠా! పూజ్య మైన రాత్రి గడచిపోయినది. ఇంతవరకు జరిగిన పనులు తెలిసికొని, ఇటుపై చేయదగిన పనులు చేయుము. రామాభిషేకానికి కావలసిన దంతయు సిద్ధము చేయబడినది.

వి. "తవ నీకు, ఇదమ్ = ఇది, కృతకృత్యమ్ = చేయబడిన చేయదగిన పని గలది" అని పూర్వ వ్యాఖ్య. 'ఇదమ్' అనే నపుంసకలింగపదము రాత్రిః అనే దానికి పరామర్శకము. "ఈ రాత్రి కాలంబునందు చేయవలసిన కార్యంబులు నెరవేర్చినావు" అని భావము. 53.54

మూ. పౌరజానపదైశ్చాపి నైగమైశ్చ కృతాఞ్జలిః,
స్వయం వసిష్ఠో భగవాన్ బ్రాహ్మణైః సహ తిష్ఠతి. 55

ప్ర. అ. భగవాన్ = పూజ్యుడైన, వసిష్ఠః = వసిష్ఠుడు, పౌరజానపదైశ్చాపి = పౌరులచేతనూ, జానపదులచేతనూ, నైగమైశ్చ = వర్తకులచేతను, కృతాఞ్జలిః = చేయబడిన నమస్కారము కలవాడై, బ్రాహ్మణైః సహ = బ్రాహ్మణులతో గూడ, స్వయమ్ = స్వయముగా, తిష్ఠతి = ఉన్నాడు.

తా. పూజ్యుడైన వసిష్ఠుడు బ్రాహ్మణసమేతుడై పౌరులూ, జానపదులూ, వర్తకులూ నమస్కరించుచుండగా ద్వారము వద్ద వేచి ఉన్నాడు. 55

మూ. క్షిప్రమాజ్ఞాప్యతాం రాజన్ రాఘవస్యాభిషేచనమ్.
యథా హ్యపాలాః పశవో యథా సేనా హ్యనాయకా. 56
యథా చన్ద్రం వినా రాత్రిర్యథా గావో వినా వృషమ్,
ఏవం హి భవితా రాష్ట్రం యత్ర రాజా న దృశ్యతే.

ప్ర. అ. రాజన్ = రాజా, రాఘవస్య = రామునియొక్క, అభిషేచనమ్ = అభిషేకము, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆజ్ఞాప్యతామ్ = ఆజ్ఞాపించబడుగాక. అపాలాః = పాలకుడు లేని, పశవః = పశువులు, యథా = ఎట్లో, అనాయకా = నాయకుడు లేని, సేనా = సేన, యథా = ఎట్లో, చన్ద్రం వినా = చంద్రుడు లేకుండా, రాత్రిః = రాత్రి, యథా = ఎట్లో, వృషం వినా = వృషభము లేకుండా, గావః = గోవులు, యథా = ఎట్లో, యత్ర = దేనియందు, రాజా = రాజు, న దృశ్యతే = చూడబడడో, అట్టి, రాష్ట్రమ్ = రాష్ట్రము, ఏవమ్ = ఈ విధముగా, భవితా హి = కాగలదు కదా।

తా. మహారాజా! రామాభిషేకమును గూర్చి శీఘ్రముగా ఆజ్ఞ ఇమ్ము. రాజులేని రాజ్యము పాలకుడు లేని పశువులు వలె, నాయకుడు లేని సేన వలె, చంద్రుడు లేని రాత్రి వలె, వృషభము లేని గోవుల వలె అయిపోవును గదా!

మూ. ఇతి తస్య వచః శ్రుత్వా సాన్త్వపూర్వమివార్థవత్,
అభ్యకీర్యత శోకేన భూయ ఏవ మహీపతిః. 58

ప్ర. అ. మహీపతిః = దశరథుడు, ఇతి = ఈ విధముగా, సాన్త్వపూర్వమివ = ప్రతిమాటలతో కూడినదీ, అర్థవత్ = అర్థము కలదీ అయిన, తస్య వచః

= వాని వాక్యమును, శ్రుత్వా=విని, భూయః ఏవ=మరల, శోకేన = శోకము చేత, అభ్యకీర్యత = వ్యాపింపబడెను.

తా. మంచి అర్థము కలదీ, ప్రతిమాటలు తూన్నట్లు ఉన్నదీ అయిన సుమంత్రుని మాటను విని దశరథుడు ఇంకను శోకాక్రాంతు డైనాడు. 58

మూ. తతః స రాజా తం సూతం సన్నహర్షః సుతం ప్రతి,
శోకరక్తేక్షణః శ్రీమానుద్వీక్ష్యోవాచ ధార్మికః, 59
వాక్యైస్తు ఖలు మర్మాణి మమ భూయో నికృన్తసి.

ప్ర. అ. ధార్మికః=ధార్మికు డైన, శ్రీమాన్=శ్రీమంతు డైన, సః రాజా = ఆ రాజా, సుతం ప్రతి = కుమారుని గూర్చి, సన్నహర్షః = నశించిన సంతోషము గలవాడై, శోకరక్తేక్షణః=శోకముచేత ఎఱ్ఱ నైన నేత్రాలు కల వాడై, ఉద్వీక్ష్య = పైకి చూచి, తం సూతమ్=ఆ సారథిని గూర్చి, ఉవాచ = పలికెను. వాక్యైః = మాటలతో, మమ=నాయొక్క, మర్మాణి=మర్మస్థానాలను, భూయః ఏవ=ఇంకనూ, నికృన్తసి = ఛేదించుచున్నావు.

తా. ధార్మికుడూ, శ్రీమంతుడూ అయిన ఆ దశరథుడు కుమారుని గూర్చిన ఆలోచనతో సంతోషము సన్నగిలి, దుఃఖంచేత ఎఱ్ఱనైన నేత్రాలతో ఆ సూతుని వైపు చూచి- "నీ మాటలతో ఇంకను నా మర్మాలు ఛేదించుచున్నావు" అని పలికెను. 59

మూ. సుమన్త్రః కరుణం శ్రుత్వా దృష్ట్వా దీనం చ పార్థివమ్,
ప్రగృహీతాఞ్జలిః కిఞ్చిత్తస్మాద్దేశాదపాక్రమత్

ప్ర. అ. సుమన్త్రః=సుమంత్రుడు, కరుణమ్=కరుణమైన ఆ మాటను, శ్రుత్వా=విని, దీనమ్=దీను డైన, పార్థివమ్=రాజును, దృష్ట్వా చ=చూచి, ప్రగృహీతాఞ్జలిః = గ్రహింపబడిన దోసిలి కలవాడై, తస్మాత్ దేశాత్=ఆ ప్రదేశంనుండి, కిఞ్చిత్=కొంచెము, అపాక్రమత్=తొలగెను.

తా. దీను డైన ఆ దశరథుని చూచి, కరుణాభరిత మైన అతని మాటలు వినగానే సుమంత్రుడు అంజలి ఘటించి ఆ ప్రదేశమునుంచి కొంచెము దూరముగా జరిగినాడు. 60

మూ. యదా వక్తుం స్వయం దైన్యాన్న శశాక మహీపతిః, 61
తదా సుమన్త్రిం మన్త్రజ్ఞా కైకేయీ ప్రత్యువాచ హ.

ప్ర. అ. మహీపతిః = రాజు, దైన్యాత్ = దైన్యమువల్ల, స్వయమ్ = స్వయముగా, వక్తుమ్ = చెప్పుటకు, యదా = ఎప్పుడైతే, న శశాక = సమర్థుడు కాలేదో, తదా = అప్పుడు, మన్త్రజ్ఞా = ఆలోచనలు ఎరిగిన, కైకేయీ = కైకేయి, సుమన్త్రిమ్ = సుమంత్రుని గూర్చి, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను.

తా. దైన్యవశముచేత దశరథుడు స్వయముగా ఏమీ ప్రత్యుత్తరము చెప్పలేకపోయెను. అప్పుడు ఆలోచనలలో సమర్థురాలైన కైకేయి సుమంత్రునితో ఇట్లు అనెను. 61

మూ. సుమన్త్ర రాజా రజనీం రామహర్షసముత్సుకః, 62
ప్రజాగరపరిశ్రాన్తో నిద్రావశముపేయివాన్.

ప్ర. అ. సుమన్త్ర = ఓ సుమంత్రా! రాజా = రాజు, రామహర్షసముత్సుకః = రామునికి సంబంధించిన ఆనందముచేత ఆవేశము చెందినవాడై, రజనీమ్ = రాత్రి అంతా, ప్రజాగరపరిశ్రాన్తః = మేల్కొనుటచేత అలసిపోయినవాడై, నిద్రావశమ్ = నిద్రకు వశమును, ఉపేయివాన్ = పొందినాడు.

తా. సుమంత్రా! రామునికి రాజ్యాభిషేకము జరుగుననే ఆనందావేశముతో రాజు రాత్రి అంతా నిద్ర లేక అలసిపోయి ఇపుడు నిద్రపోవుచున్నాడు. 62

మూ. తద్గచ్ఛ త్వరితం సూత రాజపుత్రం యశస్వినమ్, 63
రామమానయ భద్రం తే నాత్ర కార్యా విచారణా.

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, సూత = ఓ సుమంత్రా! త్వరితమ్ = శీఘ్రముగా, గచ్ఛ = వెళ్లుము. యశస్వినమ్ = కీర్తిమంతుడూ, రాజపుత్రమ్ = రాజకుమారుడూ అయిన, రామమ్ = రాముని, ఆనయ = తీసికొని రమ్ము. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. అత్ర = ఈ విషయములో, విచారణా = ఆలోచన, న కార్యా = చేయదగినది కాదు.

తా. సుమంత్రా! అందుచేత నువ్వు శీఘ్రంగా వెళ్లి రాజకుమారుడూ, ధురశ్శాలీ అయిన రాముని తీసికొని రమ్ము. నీకు మంగళ మగుగాక. ఈ విషయములో ఏమీ ఆలోచించవలసిన పని లేదు. 63

మూ. స మన్యమానః కల్యాణం హృదయేన ననన్ద చ, 64
నిర్జగామ చ సంప్రీత్యా త్వరితో రాజశాసనాత్.

ప్ర. అ. సః = అతడు, హృదయేన = హృదయముచేత, కల్యాణమ్ = కల్యాణమును, మన్యమానః = తలంచుచున్నవాడై, ననన్ద చ = ఆనందించినాడు. రాజశాసనాత్ = రాజాజ్ఞవలన, త్వరితః = తొందరపడుచున్నవాడై, సంప్రీత్యా = సంతోషముతో, నిర్జగామ చ = బయలుదేరెను.

తా. అతడు ఇంక మంగళకార్యము జరగనున్న దని మనస్సులో అనుకొనుచు, ఆనందించి, సంతోషించుచు రాజాజ్ఞ ప్రకారము తొందరగా బయలు దేరెను. 64

మూ. సుమన్త్రశ్చిన్తయామాస త్వరితం చోదితస్తయా, 65
వ్యక్తం రామోఽభిషేకార్థమిహాయాస్యతి ధర్మవిత్.

ప్ర. అ. తయా = ఆమెచేత, చోదితః = ప్రేరేపింపబడిన, సుమన్త్రః = సుమంత్రుడు, చిన్తయామాస = ఆలోచించెను. ధర్మవిత్ = ధర్మవేత్త యైన, రామః = రాముడు, వ్యక్తమ్ = నిశ్చయముగా, అభిషేకార్థమ్ = అభిషేకము కొరకు, ఇహ = ఇక్కడకు, ఆయాస్యతి = రాగలడు.

తా. ఆమెచేత ప్రేరితు డైన సుమంత్రుడు- "ధర్మాత్ము డైన రాముడు అభిషేకార్థము ఇచటికి తప్పక రానున్నాడు" అని అనుకొనెను. 65

మూ. ఇతి సూతో మతిం కృత్వా హర్షేణ మహతా వృతః, 66
నిర్జగామ మహాబాహో రాఘవస్య దిదృక్షయా.

ప్ర. అ. సూతః = సుమంత్రుడు, ఇతి = ఇట్లు, మతిం కృత్వా = ఆలోచించి, మహతా = గొప్ప, హర్షేణ = సంతోషముతో, వృతః = కూడినవాడై, మహాబాహో!

=గొప్ప బాహువులు గల, రాఘవస్య=రాముని యొక్క, దిదృక్షయా=దర్శనేచ్ఛ చేత, నిర్జగామ=బయలుదేరెను.

తా. సుమంత్రు డీ విధమైన ఆలోచనలతో చాలా సంతోషించుచు, మహాబాహువైన రాముని చూడవలె ననే కోరికతో బయలుదేరెను. 66

మూ. సాగరహ్రదసంబాధాత్సుమన్త్రోఽన్తఃపురాచ్ఛుభాత్, 67
నిష్క్రమ్య జనసంబాధం దదర్శ ద్వారమగ్రతః.

ప్ర. అ. సుమన్త్రః=సుమంత్రుడు, సాగరహ్రదసంబాధాత్=సాగరము లోని లోతైన ప్రదేశముతో సమానమైన, శుభాత్=శుభమైన, అన్తఃపురాత్=అంతఃపురమునుంచి, నిష్క్రమ్య=బయల్వెడలి, అగ్రతః=ఎదుట, జనసంబాధమ్=జనులతో ఇరుకుగా ఉన్న, ద్వారమ్=ద్వారమును, దదర్శ=చూచెను.

తా. సాగరములో లోతైన ప్రదేశముతో సమానమైన అంతఃపురము నుండి బైటకు వచ్చిన సుమంత్రుడు ఎదుట, జనముతో కిక్కిరిసి ఉన్న ద్వారము చూచెను. 67

మూ. తతః పురస్తాత్సహసా వినిర్గతో
మహీపతీన్ ద్వారగతో విలోకయన్,
దదర్శ పౌరాన్ వివిధాన్మహాధనా
నుపస్థితాన్ ద్వారముపేత్య విష్ఠితాన్. 68

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుర్దశః సర్గః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సహసా=శీఘ్రముగా, పురస్తాత్=ముందుకు, వినిర్గతః=బయలుదేరినవాడై, ద్వారగతః=ద్వారము చేరినవాడై, విలోకయన్=చూచుచూ, ద్వారమ్=ద్వారమును, ఉపేత్య=సమీపించి, విష్ఠి

తాన్ = ఉన్న, మహీపతీన్ = రాజులనూ, ఉపస్థితాన్ = వచ్చియున్న, మహాధనాన్ = మహాధనవంతు లైన, పౌరాన్ = పౌరులనూ, దదర్శ = చూచెను.

తా. వెంటనే అక్కడినుండి బయలుదేరిన సుమంత్రుడు ద్వారము సమీపించి, అప్పటికే వచ్చి చేరి యున్న రాజులను, మహాధనవంతు లైన వివిధ శ్రేణులకు చెందిన పౌరులనూ చూచెను. 68

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో చతుర్దశసర్గ సమాప్తము.

## అథ పంచదశః సర్గః

[రాజాజ్ఞచే సుమంత్రుడు రాముని పిలుచుకొని వచ్చుటకు ఆయన గృహమున కేగుట.]

మూ. తే తు తాం రజనీముష్య బ్రాహ్మణా వేదపారగాః,
ఉపతస్థురుపస్థానం సహరాజపురోహితాః. 1

ప్ర. అ. వేదపారగాః = వేదపారంగతు లైన, తే = ఆ, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, తాం రజనీమ్ = ఆ రాత్రి అంతా, ఉష్య = ఉండి, సహ రాజపురోహితాః = రాజపురోహితు డైన వసిష్ఠునితో కూడినవారై, ఉపస్థానమ్=సమీపములో ఉన్న ప్రదేశమును, ఉపతస్థుః = చేరిరి.

తా. సకలవేదపారంగతు లైన బ్రాహ్మణులు ఆ రాత్రి అంతా అక్కడనే ఉండి తెల్లవారగానే వసిష్ఠసహితులై, (అభిషేకమంటపానికి) దగ్గరగా ఉన్న ప్రదేశము చేరిరి. 1

మూ. అమాత్యా బలముఖ్యాశ్చ ముఖ్యా యే నిగమస్య చ,
రాఘవస్యాభిషేకార్థే ప్రీయమాణాస్తు సంగతాః. 2

ప్ర. అ. అమాత్యాః = మంత్రులూ, బలముఖ్యాశ్చ = సేనానాయకులూ, నిగమస్య = నగరముయొక్క లేదా వర్తకసంఘంయొక్క, యే=ఏ, ముఖ్యాః= ప్రధాను లైనవారు కలరో వారూ, రాఘవస్య = రాముని యొక్క, అభిషేకార్థే = అభిషేకముకొరకై, ప్రీయమాణాః = సంతోషించుచున్నవారై, సంగతాః = కలిసినారు.

తా. మంత్రులూ, సేనాధిపతులూ, నగరముఖ్యులూ (వర్తకులతో ప్రముఖులూ) రామాభిషేకము విషయంతో అత్యానందభరితు లై అక్కడ చేరిరి. 2

మూ. ఉదితే విమలే సూర్యే పుష్యే చాభ్యాగతేఽహని,
లగ్నే కర్కటకే ప్రాప్తే జన్మ రామస్య చ స్థితే, 3
అభిషేకాయ రామస్య ద్విజేన్ద్రైరుపకల్పితమ్.

ప్ర. అ. విమలే=స్వచ్ఛ మైన, సూర్యే=సూర్యుడు, ఉదితే = ఉదయించగా, అహని = పగటియందు, పుష్యే చ=పుష్యనక్షత్రము, అభ్యాగతే=రాగా, రామస్య = రామునియొక్క, జన్మ = జన్మలగ్నముగా, స్థితే = ఉన్న, కర్కటకే లగ్నే = కర్కటలగ్నము, ప్రాప్తే = రాగా, రామస్య = రామునియొక్క, అభిషేకాయ = అభిషేకముకొరకు, ద్విజేన్ద్రైః = బ్రాహ్మణశ్రేష్ఠులచేత, ఉపకల్పితమ్ = నిర్ణయము చేయబడినది.

తా. స్వచ్ఛముగా సూర్యోదయము అయిన పిమ్మట పగటిభాగమున పుష్యమీ నక్షత్రమునందు, రాముని జన్మలగ్న మైన కర్కటలగ్నము వచ్చిన తరువాత రామునికి రాజ్యాభిషేకము చేయవలె నని బ్రాహ్మణశ్రేష్ఠులు నిర్ణయించిరి. 3

మూ. కాఞ్చనా జలకుమ్భాశ్చ భద్రపీఠం స్వలఙ్కృతమ్, 4
రథశ్చ సమ్యగాస్తీర్ణో భాస్వతా వ్యాఘ్రచర్మణా.

ప్ర. అ. కాఞ్చనాః = బంగారు, జలకుమ్భాశ్చ = ఉదకకుంభములు, స్వలఙ్కృతమ్ = బాగుగా అలంకరింపబడిన, భద్రపీఠమ్ = రాజాసనము, (మంగళాసనము), భాస్వతా = ప్రకాశించుచున్న, వ్యాఘ్రచర్మణా = వ్యాఘ్రచర్మము చేత, సమ్యక్ = చక్కగా, ఆస్తీర్ణః = కప్పబడిన, రథశ్చ = రథమూ, (భాన్తి = ప్రకాశించుచున్నవి.)

తా. సువర్ణమయా లైన పూర్ణకుంభాలూ, బాగా అలంకరించిన మంగళపీఠమూ, అంద మైన వ్యాఘ్రచర్మ చక్కగా పరచిన రథమూ ప్రకాశించుచున్నవి. 4

మూ. గఙ్గాయమునయోః పుణ్యాత్సఙ్గమాదాహృతం జలమ్, 5
యాశ్చాన్యాః సరితః పుణ్యా హ్రదాః కూపాః సరాంసి చ.

ప్రాగ్వాహాశ్చోర్ధ్వవాహాశ్చ తిర్యగ్వాహాః సమాహితాః, 6
తాభ్యశ్చైవాహృతం తోయం సముద్రేభ్యశ్చ సర్వశః.

ప్ర. అ. పుణ్యాత్ = పవిత్ర మైన, గఙ్గాయమునయోః సఙ్గాత్ = గంగా యమునాసంగమునుండి, పుణ్యాః = పుణ్య మైన, అన్యాః = ఇతరము లైన, యాః = ఏ, సరితః = నదు లున్నవో, వాటినుండి, (ఏ) హ్రదాః = హ్రదములు, కూపాః = కూపములూ, సరాంసి చ = సరస్సులూ ఉన్నవో వాటినుండి, ఆహృతమ్ = తీసికొనిరాబడిన, జలమ్ = ఉదకమూ, ప్రాగ్వాహాః = తూర్పుగా ప్రవహించేవీ, ఊర్ధ్వవాహాః = పైకి ప్రవహించేవీ, తిర్యగ్వాహాః = అడ్డంగా ప్రవహించేవీ, సమాహితాః = పరస్పరమూ కలిసినవీ అయిన ఏ నదు లున్నవో, తాభ్యః చ = వాటినుండి, సర్వశః = నలువైపులా ఉన్న, సముద్రేభ్యః చ = సముద్రాలనుండి, ఆహృతమ్ = తీసికొని రాబడిన, తోయమ్ = ఉదకమూ, (ప్రకాశించుచున్నది).

తా. పవిత్ర మైన గంగాయమునాసంగమంనుంచీ, పుణ్య మైన ఇతర నదులనుంచీ, హ్రదాల (పెద్ద చెరువుల) నుంచీ, కూపాలనుంచీ, సరస్సులనుంచీ, తూర్పుగానూ, పడమటగాను, అడ్డంగానూ ప్రవహించే నదులనుంచీ, ఒకదానితో ఒకటి కలిసిన నదులనుంచీ, నాలుగు సముద్రాలనుంచీ తీసికొని వచ్చిన ఉదకము ప్రకాశించుచున్నది.

వి. 'సమాహితాః = పొంగకుండ నిలిచి యున్న (నదులు) వియును' అని ప్రాచీన వ్యాఖ్య. 5, 6

మూ. సలాజాః క్షీరిభిశ్ఛన్నా ఘటాః కాఞ్చనరాజతాః, 7
పద్మోత్పలయుతా భాన్తి పూర్ణాః పరమవారిణా.

ప్ర. అ. సలాజాః = పేలాలతో కూడినవీ, క్షీరిభిః = పాలుకారే చెట్ల ఆకులచేత, ఛన్నాః = కప్పబడినవీ, పద్మోత్పలయుతాః = పద్మాలతోటీ కలువల తోటీ కూడినవీ, పరమవారిణా = ఉత్తమజలముతో, పూర్ణాః = నిండినవీ, కాఞ్చన రాజతాః = సువర్ణరజతమయాలూ ఐన, ఘటాః = కలశలు భాన్తి = ప్రకాశిస్తున్నవి.

తా. పేలాలు పోసి, పొంగబెట్టి ఆకులూ పద్మాలూ కలువలూ కప్పి, పవిత్ర మైన జలాంతో నింపిన బంగారు కలశలూ, వెండి కలశలూ అక్కడ ప్రకాశించుతున్నవి.

మూ. క్షౌద్రం దధి ఘృతం లాజా దర్భాః సుమనసః పయః, 8
వేశ్యాశ్చైవ శుభాచారాః సర్వాభరణభూషితాః.

ప్ర. అ. క్షౌద్రమ్ = తేనె, దధి = పెరుగు, ఘృతమ్ = నెయ్యి, లాజాః = పేలాలు, దర్భాః = దర్భలు, సుమనసః = పుష్పాలు, పయః = పాలు (ప్రకాశిస్తూన్నవి). శుభాచారాః = శుభ మైన ఆచారము (నడవడిక) కలవారూ, సర్వాభరణభూషితాః = సమస్త మైన అలంకారాలంచేత అలంకరించబడినవారూ అయిన, వేశ్యాః చ ఏవ = వేశ్యాస్త్రీలూ, ప్రకాశించుచున్నారు.

తా. తేనె, పెరుగు, నెయ్యి, లాజలు, దర్భలు, పుష్పాలు, పాలు-ఇవన్నీ సిద్ధముచేయబడి ప్రకాశించుచున్నవి. శుభాచారవతులైన, చక్కగా, అన్ని అలంకారాలు అలంకరించుకొన్న వేశ్యాస్త్రీలు కూడా అక్కడ ప్రకాశించుచున్నారు. 8

మూ. చన్ద్రాంశువికచప్రఖ్యం కాఞ్చనం రత్నభూషితమ్, 9
సజ్జం తిష్ఠతి రామస్య వాలవ్యజనముత్తమమ్.

ప్ర. అ. చన్ద్రాంశువికచప్రఖ్యమ్ = వికసించిన (ప్రసరించిన) చంద్ర కిరణములతో సమాన మైనదీ, కాఞ్చనమ్ = బంగారముతో చేసినదీ, రత్నభూషితమ్ = రత్నాలచేత అలంకరించబడినదీ అయిన, రామస్య = రాముని యొక్క, ఉత్తమమ్ = ఉత్తమ మైన, వాలవ్యజనమ్ = వింజామర, సజ్జమ్ = సిద్ధముగా, తిష్ఠతి = ఉన్నది.

తా. వికసించిన చంద్రకిరణపుంజము వలె ఉన్నదీ, బంగారముతో నిర్మించబడినదీ, రత్నాలచేత అలంకరించబడినదీ అయిన, ఉత్తమ మైన వింజామర రామునికొరకై సిద్ధము చేయబడి ఉన్నది.

వి. "చన్ద్రాంశువికచప్రఖ్యమ్" అనుదానికి "చంద్రకిరణముల వలె అధిక మైన కాంతి గలది" అని ప్రాచీనవ్యాఖ్య. 'ప్రఖ్య' శబ్దానికి 'కాంతి' అనే అర్థము

లేదు గాన విశేష్యపూర్వపదకర్మధారయముగా గ్రహించి పై అర్థము చెప్పుట యుక్తము. 9

మూ. చన్ద్రమణ్డలసంకాశమాతపత్రం చ పాణ్డురమ్, 10
సజ్జం ద్యుతికరం శ్రీమదభిషేకపురస్కృతమ్.

ప్ర. అ. చన్ద్రమణ్డలసంకాశమ్ = చంద్రమండలంతో సమాన మైనదీ, పాణ్డురమ్ = తెల్లనిదీ, ద్యుతికరమ్ = కాంతిని కలిగించునదీ, అభిషేకపురస్కృతమ్ = అభిషేకసమయమునందు ముందుగా ఉంచబడినదీ, శ్రీమత్ = శోభాయుక్త మైనదీ అయిన, ఆతపత్రం చ = ఛత్రము కూడ, సజ్జమ్ = సిద్ధముగా ఉన్నది.

తా. చంద్రమండలము వలె ఉన్నదీ, శోభాకర మైనదీ, శోభతో కూడినదీ, అభిషేకసమయమునందు ముందుగా అమర్చబడినదీ అయిన శ్వేతచ్ఛత్రము కూడ సిద్ధముగా ఉన్నది. 10.

మూ. పాణ్డురశ్చ వృషః సజ్జః పాణ్డురోఽశ్వశ్చ సుస్థితః, 11
ప్రస్రుతశ్చ గజః శ్రీమానౌపవాహ్యః ప్రతీక్షతే.

ప్ర. అ. పాణ్డురః = తెల్లని, వృషః చ = వృషభము కూడా, సజ్జః = సిద్ధముగా ఉన్నది. పాణ్డురః = తెల్లని, అశ్వః చ = గుఱ్ఱము కూడా, సుస్థితః = చక్కగా ఉన్నది. ప్రస్రుతః = మదోదకమును స్రవించుచున్నదీ, శ్రీమాన్ = శోభాయుక్త మైనదీ, ఔపవాహ్యః = రాజులు అధిరోహించుటకు తగినదీ అయిన, గజః చ = ఏనుగు కూడా, ప్రతీక్షతే = వేచి ఉన్నది.

తా. తెల్లని వృషభమూ, తెల్లని అశ్వమూ, మదోదకము స్రవించుచున్నదీ, రాజులు ఎక్కుటకు తగినదీ అయిన శోభాయుక్త మైన గజమూ సిద్ధముగా వేచి ఉన్నవి. 11

మూ. అష్టౌ చ కన్యా మాఙ్గల్యాః సర్వాభరణభూషితాః, 12.
వాదిత్రాణి చ సర్వాణి వన్దినశ్చ తథాపరే.

ప్ర. అ. సర్వాభరణభూషితాః=సమస్తమైన ఆభరణములచేత అలంకరింపబడినవారూ, మాఙ్గల్యాః=మంగళప్రదలూ అయిన, అష్టౌ=ఎనమండుగురు, కన్యాః=కన్యలూ, సర్వాణి=సమస్తమైన, వాదిత్రాణి=వాద్యాలూ, వన్దినః చ=స్తుతిపాఠకులూ, తథా=మరియు, పరే=ఇతరులూ, (ప్రతీక్షన్తే=నిరీక్షించుచున్నారు.)

తా. సమస్తమైన ఆభరణములు అలంకరించుకొని, మంగళప్రదలైన ఎనమండుగురు కన్యలూ, అన్ని విధాలైన వాద్యాలూ, స్తోత్రపాఠకులూ, తదితరులూ కూడా నిరీక్షించుచున్నారు. 12

మూ. ఇక్ష్వాకూణాం యథా రాజ్యే సంభ్రియేతాభిషేచనమ్, 13
తథాజాతీయమాదాయ రాజపుత్రాభిషేచనమ్,
తే రాజవచనాత్తత్ర సమవేతా మహీపతిమ్, 14
అపశ్యన్తోఽబ్రువన్ కో ను రాజ్ఞో నః ప్రతిపాదయేత్.

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్ = ఇక్ష్వాకువంశీయులయొక్క, రాజ్యే=రాజ్యములో, అభిషేచనమ్=అభిషేకము చేసే ద్రవ్య సముదాయము, యథా=ఎట్లు, సంభ్రియేత=సమకూర్చబడునో, తథాజాతీయమ్=ఆ జాతికి సంబంధించిన, రాజపుత్రాభిషేచనమ్=రాజకుమారుని అభిషేకద్రవ్యసముదాయమును, ఆదాయ=గ్రహించి, రాజవచనాత్=రాజాజ్ఞవలన, తత్ర=అచ్చట, సమవేతాః=కూడిన, తే=వారు, మహీపతిమ్=రాజును, అపశ్యన్తః=చూడనివారై, నః=మనలను గూర్చి, కః ను=ఎవ్వడు, రాజ్ఞః=రాజుకు, ప్రతిపాదయేత్=తెలుపును, అని, అబ్రువన్=పలికిరి.

తా. ఇక్ష్వాకువంశీయుల రాజ్యములో ఎట్టి అభిషేకద్రవ్యసముదాయమును సమకూర్చుదురో ఆ జాతికి చెందిన రాజపుత్రాభిషేకానికి ఉపయోగించే అభిషేకద్రవ్యాలను రాజాజ్ఞప్రకారము సమకూర్చుకొని అచటకు చేరిన వారందరూ, రాజు కనబడకపోవుటతో "మన మందరమూ వచ్చినట్లుగా రాజుకు ఎవరిద్వారా తెలియపరచవలెను" అని అనుకొనిరి.

వి. "అభిషేచనమ్=అభిషేకమును గూర్చి, యథా=ఎట్లు, వస్తుజాతమ్' (అధ్యాహృతము) పదార్థసమూహము,........తథా=అట్లు, జాతీయమ్=

శ్రేష్ఠ మైన రత్నాదిసమూహమును..........రాజపుత్రాభిషేచనమ్ = ... రాముని పట్టాభిషేకము పర్యవేక్షించి.........." అని వ్రాసినవ్యాఖ్య. అభిషేచనమ్ అనే పదానికి "కేసిచేత అభిషేకం చేయబడుతుందో అది" అని అర్థం చెప్పవచ్చు. "కరణాధికరణయోశ్చ" అనే సూత్రము ప్రకారము కరణార్థంలో కూడా ల్యుట్ ప్రత్యయము వచ్చి 'అభిషిచ్యతే అనేన' అని 'అభిషేచనమ్' అనే పదానికి అభిషేకద్రవ్యము అనే అర్థం చెప్పవచ్చు గాన ఆ వ్యాఖ్య అనావశ్యకము. అదే విధముగా 'జాతీయమ్' అనే దానికి శ్రేష్ఠ మైన రత్నాదిసమూహము అనే అర్థము కూడా అసంగతము. ఇక్కడ చెప్పిన వాటిలో రత్నం ప్రసక్తియే లేదు. అందుచేత 'తజ్జాతీయమ్' అనే దానిని ఒకే పదముగా గ్రహించి 'ఆ తెగకు చెందిన' అనే అర్థము చెప్పుట యుక్తము. 'జాతిమత్' ఇత్యాదులకు ఆ అర్థము చెప్పవచ్చునేమో కాని 'జాతీయమ్' అనేదానికి వారు చెప్పిన అర్థము కాదు. 13, 14

మూ. న పశ్యామశ్చ రాజానముదితశ్చ దివాకరః, 15
యౌవరాజ్యాభిషేకశ్చ సజ్జో రామస్య ధీమతః.

ప్ర. అ. రాజానమ్ = రాజును, న చ పశ్యామః = (మనము) చూచుట లేదు. దివాకరః చ = సూర్యుడు కూడ, ఉదితః = ఉదయించినాడు. ధీమతః = బుద్ధిమంతు డైన, రామస్య = రాముని యొక్క, యౌవరాజ్యాభిషేకః చ = యౌవరాజ్యాభిషేకము కూడ, సజ్జః = సిద్ధ మైనది"

తా. "రాజు కనబడుట లేదు. సూర్యుడు ఉదయించినాడు. ధీమంతు డైన రామునికి యౌవరాజ్యాభిషేకానికి అంతా సిద్ధముగా ఉన్నది. 15

మూ. ఇతి తేషు బ్రువాణేషు సార్వభౌమాన్ మహీపతీన్. 16
అబ్రవీత్తానిదం సర్వాన్సుమన్త్రో రాజసత్కృతః.

ప్ర. అ. తేషు = వారు, ఇతి = ఇట్లు, బ్రువాణేషు = పలుకుచుండగా, రాజసత్కృతః = రాజు చేత సత్కరించ బడిన, సుమన్త్రః = సుమంత్రుడు, తాన్ = ఆ, సర్వాన్ = సమస్త మైన, సార్వభౌమాన్ = అన్ని దేశములకును సంబంధించిన, మహీపతీన్ = రాజులను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథమహారాజు సత్కారము లందుకొను ఆ సుమంత్రుడు వారం దరును, ఆ విరముగా మాటలాడుచుండగా విని సకల దేశములనుండి వచ్చిన ఆ రాజులతో ఇట్లు అనెను.

వి. 'సార్వభౌమాన్' అనుదానికి 'చక్రవర్తులు' అని పూర్వవ్యాఖ్య. రామాయణము ప్రకారము దశరథు డొక్కడే ఆ నాడు చక్రవర్తి. మిగిలిన వాళ్లందరూ ఆ యా చిన్న దేశాల అధిపతులే. 16

మూ. రామం రాజ్ఞో నియోగేన త్వరయా ప్రస్థితోఽస్మ్యహమ్, 17
పూజ్యా రాజ్ఞో భవన్తస్తు రామస్య చ విశేషతః.

ప్ర. అ. అహమ్=నేను, రాజ్ఞః = రాజుయొక్క, నియోగేన = ఆజ్ఞ చేత, రామమ్=రాముని గూర్చి, త్వరయా=తొందరతో, ప్రస్థితః అస్మి =ప్రయాణ మైనాను. భవన్తః తు=మీరైతే, రాజ్ఞః=రాజునకు, పూజ్యాః = పూజనీయులు. విశేషతః = ఎక్కువగా, రామస్య చ = రామునకు పూజ్యులు.

తా. నేను రాజాజ్ఞ ప్రకారము రాముని వద్దకు వెళ్లుచున్నాను. మీరంద రును దశరథునకు, విశేషించి రామునకు పూజనీయులు. 17

మూ. అయం పృచ్ఛామి వచనాత్ సుఖమాయుష్మతామహమ్,
రాజ్ఞః సంప్రతిబుద్ధస్య చానాగమనకారణమ్.

ప్ర. అ. అయమ్ అహమ్=ఈ నేను, ఆయుష్మతామ్=ఆయుష్మంతు లైన మీ యొక్క, వచనాత్=మాటవలన, సంప్రతిబుద్ధస్య = మేల్కొన్న, రాజ్ఞః = రాజుయొక్క, సుఖమ్=సుఖమును, అనాగమనకారణం చ = రాక పోవుటకు కారణమును, పృచ్ఛామి=అడిగెదను.

తా. మేల్కొన్న రాజు సుఖముగానే ఉన్నాడా అనే విషయమునూ, ఇవ టికి రాకపోవుటకు కారణమునూ, మీ మాటగా నేను అడిగెదను.

వి. "రాజ్ఞః సంప్రతి బుద్ధస్య యదాగమనకారణమ్" అని ప్రాచీన పుస్తకములో ఉన్న పాఠము "సంప్రతి = ఇపుడు,.... బుద్ధస్య = మేల్కొన్న, ఆగమనకారణమ్ = రాకపోవుటకు కారణము, యత్=ఏదో" అని దాని వ్యాఖ్య.

'సంప్రతిబుద్ధస్య' అనేది ఒకే పదముగా గ్రహించుట యుక్తము. 'ఇప్పుడు లేచిన' అనే అర్థము బాగుగా లేదు. అట్లే 'అగమకారణమ్' అనే దానికి 'రాకుండుటకు కారణము' అనే అర్థం రాదు. వచ్చుటకు కారణము అనే అర్థము చెప్పవలసి ఉండును. అందుచేత గోరఖ్‌పూర్ ప్రతి పాఠం గ్రహించబడినది. 18

మూ. ఇత్యుక్త్వాఽన్తఃపురద్వారమాజగామ పురాణవిత్, 19
సదాసక్తం చ తద్వేశ్మ సుమన్త్రః ప్రవివేశ హ.

ప్ర. అ. పురాణవిత్=పురాణవేత్త యైన, సుమన్త్రః=సుమంత్రుడు, ఇతి=ఇట్లు, ఉక్త్వా=పలికి, అన్తఃపురద్వారమ్=అంతఃపురద్వారమును, ఆజగామ=పొందెను. సదా=ఎల్లప్పుడును, సక్తమ్=మూయబడి యున్న, తత్=ఆ, వేశ్మ=గృహమును, ప్రవివేశ హ=ప్రవేశించెను.

తా. పురాణవేత్త యైన ఆ సుమంత్రుడు ఈ విధముగా పలికి, అంతఃపుర ద్వారము సమీపించి, సర్వదా మూసియుండే అంతఃపురములోనికి ప్రవేశించినాడు.

వి. ''సదా అసక్తమ్=ఎల్లప్పుడు అడ్డులేని' అని ప్రాచీనవ్యాఖ్య. 19

మూ. తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాం పతేః, 20
శయనీయం నరేన్ద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత.

ప్ర. అ. తదా=అప్పుడు, సః=అతడు, ప్రవిశ్య=ప్రవేశించి, అస్య=ఈ, విశాంపతేః=రాజుయొక్క, వంశమ్=వంశమును, తుష్టావ=స్తుతించెను. నరేన్ద్రస్య=రాజుయొక్క, తత్ శయనీయమ్=ఆ శయ్యాగారమును, ఆసాద్య=సమీపించి, వ్యతిష్ఠత=నిలచెను.

తా. అతడు అంతఃపురము ప్రవేశించి, ఆ రాజు వంశమును స్తుతించెను. ఆ రాజశయనాగారము సమీపించి అక్కడ నిలచెను. 20

మూ. సోఽత్యాసాద్య తు తద్వేశ్మ తిరస్కరిణి మన్తరా, 21
ఆశీర్భిర్గుణయుక్తాభిరభితుష్టావ రాఘవమ్.

ప్ర. అ. సః = ఆతడు, తత్ వేశ్మ = ఆ శయనాగారమును, తిరస్కరిణీమ్ అన్తరా = తెరకు దగ్గరగా '(తెరను విడచి' ప్రా. వ్యా.), ఆసాద్య = సమీపించి, గుణయుక్తాభిః = గుణములతో కూడిన, ఆశీర్భిః = ఆశీస్సులతో, రాఘవమ్ = దశరథుని, అభితుష్టావ = స్తుతించెను.

తా. ఆతడు తెరకు దగ్గరగా ఉండునట్లు ఆ శయ్యాగారములోనికి ప్రవేశించి, దశరథుని గుణవర్ణనము చేయుచు స్తుతించెను. 21

మూ. సోమసూర్యౌ చ కాకుత్స్థ శివవైశ్రవణావపి, 22
వరుణశ్చాగ్నిరిన్ద్రశ్చ విజయం ప్రదిశన్తు తే.

ప్ర. అ. కాకుత్స్థ = దశరథమహారాజా! సోమసూర్యౌ = చంద్రసూర్యులూ, శివవైశ్రవణౌ అపి = మహేశ్వరుడు కుబేరుడూ, వరుణః చ = వరుణుడూ, అగ్నిః = అగ్ని, ఇన్ద్రః చ = ఇంద్రుడూ, తే = నీకు, విజయమ్ = జయమును, ప్రదిశన్తు = ఇచ్చెదరు గాక.

తా. దశరథమహారాజా! సూర్యచంద్రులు, మహేశ్వరకుబేరులు, వరుణుడు, అగ్ని, ఇంద్రుడు, వీరందరూ నీకు విజయము (సర్వోత్కర్షను) ఇచ్చెదరుగాక. 22

మూ. గతా భగవతీ రాత్రిరహః శివముపస్థితమ్. 23
బుద్ధ్యస్వ నృపశార్దూల కురు కార్యమనన్తరమ్.

ప్ర. అ. భగవతీ = పూజ్యురాలైన, రాత్రిః = రాత్రి, గతా = గడచి పోయినది. శివమ్ = మంగళకర మైన, అహః = పగలు, ఉపస్థితమ్ = వచ్చినది. నృపశార్దూల = రాజశ్రేష్ఠా! బుద్ధ్యస్వ = మేల్కొనుము; అనన్తరమ్ = తరువాతి, కార్యమ్ = కార్యమును, కురు = చేయుము.

తా. రాజశ్రేష్ఠా! పూజనీయ మైన రాత్రి గడచినది. మంగళకర మైన పగలు వచ్చినది. మేల్కొని తరువాత చేయవలసిన కార్యములు చేయుము.

వి. 'కృతకృత్యమిదం తవ' అను పూర్వవ్యాఖ్యాతధృతపాఠము కంటె గో. పు. పాఠము బాగున్నది. దానిని గ్రహించినాము. 23

మూ. బ్రాహ్మణా బలముఖ్యాశ్చ నైగమాశ్చాగతా నృప, 24
దర్శనం ప్రతికాఙ్క్షన్తే ప్రతిబుధ్యస్వ రాఘవ.

ప్ర. అ. రాఘవ = రఘువంశమునందు జన్మించిన, నృప = రాజా! బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, బలముఖ్యాః చ = సేనానాయకులు, నైగమాః చ = వర్తకులు, ఆగతాః = వచ్చినవారై, దర్శనమ్ = నీ దర్శనమును, ప్రతికాఙ్క్షన్తే = కోరుచున్నారు. ప్రతిబుధ్యస్వ = మేల్కొనుము.

తా. దశరథమహారాజా! బ్రాహ్మణులూ, సేనాధిపతులూ, నైగములూ, వచ్చి నీ దర్శనంకొరకు వేచి యున్నారు. మేల్కొనుము. 24

మూ. స్తువన్తం తం తదా సూతం సుమన్త్రం మన్త్రకోవిదమ్. 25
ప్రతిబుద్ధ్య తతో రాజా ఇదం వచనమబ్రవీత్.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, రాజా = రాజు, ప్రతిబుద్ధ్య = మేల్కొని, తదా = అప్పుడు, స్తువన్తమ్ = స్తోత్రము చేయుచున్న, మన్త్రకోవిదమ్ = మంత్రమునందు (ఆలోచనయందు) సమర్థుడైన, సూతమ్ = సారథి యైన, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అపుడు దశరథుడు మేల్కొని ఆ విధముగా స్తోత్రము చేయుచున్న మంత్రవేత్తా, తన సారథీ అయిన సుమంత్రునితో ఈ మాట పలికెను. 25

మూ. రామమానయ సూతేతి యదస్యభిహితోఽనయా, 26
కిమిదం కారణం యేన మమాజ్ఞా ప్రతిహన్యతే.

ప్ర. అ. సూత = ఓ సారథీ! రామమ్ = రాముని, ఆనయ = తీసికొని రమ్ము, ఇతి = అని, అనయా = ఈమెచేత, యత్ అభిహితః అసి = చెప్పబడితివి కదా; యేన = దేనిచేత, మమ ఆజ్ఞా = నా ఆజ్ఞ, ప్రతిహన్యతే = నిరాకరింపబడుచున్నదో, ఇదం కారణమ్ = ఈ కారణము, కిమ్ = ఏమి?

తా. "రాముని తీసికొని రమ్ము" అని ఈమె చెప్పినది కదా; అయినను నా ఆజ్ఞను పాలించకుండుటకు కారణము ఏమి?

వి. ఈ ఘట్టంలో కొన్ని పాఠాంతరాలు ఉన్నవి. ఇక్కడ ఇచ్చినది వావిళ్లవారిది. వెనుకటి సర్గలో ౬౬ వ శ్లోకములోని "రామమానయ శీఘ్రం తే నాత్ర కార్యా విచారణా" అనే ఏకైక వాక్యము తరవాత—

"అశ్రుత్వా రాజవచనం కథం గచ్ఛామి భామిని.
తచ్ఛ్రుత్వా మన్త్రిణో వాక్యం రాజా మన్త్రిణమబ్రవీత్,
సుమన్త్ర రామం ద్రక్ష్యామి శీఘ్రమానయ సున్దరమ్".

అను వాక్యాలు ఉన్నవి. 'రాజు చెప్పకుండగా ఎట్లు వెళ్లగలను'? అని సుమంత్రు డనగా ఆ మాట విని "సుమంత్రా, రాముని చూడవలె నని అనుకొనుచున్నాను. శీఘ్రముగా తీసికొని రమ్ము" అని రాజు పలికెను. అని వాటి భావము. అందు చేతనే సుమంత్రుడు ద్వారము దగ్గర వేచి యున్న రాజులతో-"రాజాజ్ఞప్రకారము రాముని దగ్గరకు వెళ్లుచున్నాను" అని చెప్పినాడు. పై శ్లోకములో కూడా— ''రామమానయ సూతేతి యదస్మ్యభిహితో మయా'' అను పాఠం ఉన్నది (గో. పూ.) 26

మూ. న చైవ సంప్రసుప్తోఽహమానయేహాశు రాఘవమ్, 27
ఇతి రాజా దశరథః సూతం తత్రాన్వశాత్పునః.

ప్ర. అ. అహమ్=నేను, న చ ఏవ సంప్రసుప్తః=నిద్రించుటలేదు. ఆశు=శీఘ్రముగా, రామమ్=రాముని, ఇహ=ఇచటకి, ఆనయ=తీసికొనిరమ్ము. ఇతి=ఇట్లు, రాజా దశరథః=దశరథమహారాజు, తత్ర=అక్కడ, సూతమ్=సారథిని, పునః=మరల, అన్వశాత్=ఆజ్ఞాపించెను.

తా. 'నేను నిద్రపోవుట లేదు. వెంటనే రాముని ఇక్కడికి తీసికొని రమ్ము' అని దశరథమహారాజు ఆ సుమంత్రుని ఆదేశించెను. 27

మూ. స రాజవచనం శ్రుత్వా శిరసా ప్రతిపూజ్య తమ్, 28
నిర్జగామ నృపావాసాన్మన్యమానః ప్రియం మహత్.

ప్ర. అ. సః=అతడు, రాజవచనమ్=రాజు మాటలను, శ్రుత్వా=విని, తమ్=అతనిని, శిరసా=శిరస్సుతో, ప్రతిపూజ్య=పూజించి, మహత్=

గాన్ని, ప్రియమ్ = ప్రియమును. మన్యమానః = తలచుచు. నృపాలయాత్ = రాజగృహమునుండి, నిర్జగామ = బయల్వెడలెను.

తా. అతడు రాజు మాటలు విని, అతనికి శిరస్సు వంచి నమస్కరించి, ప్రియము కలుగవలె నని మనసా చింతించుచు, రాజగృహమునుండి బైటకు వచ్చెను. 28

మూ. ప్రసన్నో రాజమార్గం చ పతాకాధ్వజశోభితమ్, 29
హృష్టః ప్రముదితః సూతో జగామాశు విలోకయన్.

ప్ర. అ. సూతః = సారథి, ప్రసన్నః = ప్రసన్నుడై, పతాకాధ్వజశోభితమ్ = పతాకలచేతను, ధ్వజములచేతను శోభింపబడిన, రాజమార్గం చ = రాజమార్గమును, విలోకయన్ = చూచుచు, హృష్టః = హర్షించినవాడై, ప్రముదితః = చాల ఆనందించినవాడై, జగామ = వెళ్లెను.

తా. ఆ సుమంత్రుడు ప్రసన్నచిత్తుడై పతాకాధ్వజములతో శోభించుచున్న ఆ రాజమార్గమును చూచి పరమానందభరితు డగుచు వెళ్లెను. 29

మూ. స సూతస్తత్ర శుశ్రావ రామాధికరణాః కథాః, 30
అభిషేచనసంయుక్తాస్సర్వలోకస్య హృష్టవత్.

ప్ర. అ. సః సూతః = ఆ సూతుడు, తత్ర = అచట, హృష్టవత్ = ఆనందించిన, సర్వలోకస్య = సకలజనులయొక్క, అభిషేచనసంయుక్తాః = అభిషేకమునకు సంబంధించిన, రామాధికరణాః = రాముని గూర్చిన, కథాః = సంలాపములను, శుశ్రావ = వినెను.

తా. సుమంత్రుడు, అక్కడ, సంతసించిన ప్రజ లందరూ చెప్పుకొనుచున్న రామునికి, రామాభిషేకానికి సంబంధించిన మాటలు వినెను. 30

మూ. తతో దదర్శ రుచిరం కైలాసశిఖరప్రభమ్, 31
రామవేశ్మ సుమన్త్రస్తు శక్రవేశ్మసమప్రభమ్,

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సుమన్త్రః తు = సుమంత్రుడు, కైలాసశిఖరప్రభమ్ = కైలాసశిఖరము వంటి కాంతి కలది, శక్రవేశ్మసమప్రభమ్ =

ఇంద్రభవనమువంటి సౌందర్యము కలదీ, రుచిరమ్=అందమైనదీ అయిన, రామవేశ్మ=రాముని గృహమును, దదర్శ=చూచెను.

తా. పిమ్మట సుమంత్రుడు, కైలాసశిఖరమువలె ఎత్తుగాను, ఇంద్రభవనము వలె మనోహరముగాను ఉన్న అందమైన రామభవనము చూచెను.

మూ. మహాకవాటపిహితం వితర్దిశతశోభితమ్, 32
కాఞ్చనప్రతిమైకాగ్రం మణివిద్రుమతోరణమ్,
శారదాభ్రఘనప్రఖ్యం దీప్తం మేరుగుహోపమమ్. 33

మణిభిర్వరమాల్యానాం సుమహద్భిరలంకృతమ్,
ముక్తామణిభిరాకీర్ణం చన్దనాగురుధూపితమ్, 34

గన్ధాన్మనోజ్ఞాన్ విసృజద్దార్దురం శిఖరం యథా,
సారసైశ్చ మయూరైశ్చ వినదద్భిర్విరాజితమ్, 35

సుకృతేహామృగాకీర్ణం సుకీర్ణం భక్తిభిస్తథా,
మనశ్చక్షుశ్చ భూతానామాదదత్తిగ్మతేజసా, 36

చన్ద్రభాస్కరసంకాశం కుబేరభవనోపమమ్,
మహేన్ద్రధామప్రతిమం నానాపక్షిసమాకులమ్, 37

మేరుశృఙ్గసమం సూతో రామవేశ్మ దదర్శ హ,
ఉపస్థితైః సమాకీర్ణం జనైరఞ్జలికారిభిః, 38

ఉపాదాయ సమాక్రాన్తైస్తథా జానపదైర్జనైః,
రామాభిషేకసుముఖైరున్ముఖైః సమలంకృతమ్, 39

మహామేఘసమప్రఖ్యముదగ్రం సువిభూషితమ్,
నానారత్నసమాకీర్ణం కుబ్జకైరాతకావృతమ్. 40

ప్ర. అ. సూతః=సుమంత్రుడు, మహాకవాటపిహితమ్=పెద్ద తలుపులచే కప్పబడినది, వితర్దిశతశోభితమ్=వందలకొలది తిన్నెలచేత అలంకరించబడినది, కాఞ్చనప్రతిమైకాగ్రమ్=బంగారు బొమ్మలు గల ఒక శిఖరము కలది, మణి

చిత్రమణితోరణమ్=మాణిక్యములతోను, పగడములతోను నిర్మించిన తోరణము గలది, శారదాభ్రఘనప్రఖ్యమ్=శరత్కాలాకాశమునందలి మేఘము వంటి కాంతి గలది, దీప్తమ్ = ప్రకాశించుచున్నది, మేరుగుహోపమమ్ = మేరుపర్వత గుహతో సమాన మైనది, సుమహద్భిః=చాల పెద్ద వైన, వరమాల్యానామ్=శ్రేష్ఠ మైన మాలికలయొక్క, మణిభిః=మాణిక్యములచేత, అలంకృతమ్ = అలంకరింపబడినది, ముక్తామణిభిః=ముత్యములతో, ఆకీర్ణమ్=వ్యాప్తమైనది, చన్దనాగురుభూషితమ్ = మంచిగంధముచేతను, అగురువుచేతను అలంకరించబడినది, దార్దురమ్=దర్దుర పర్వత సంబంధ మైన, శిఖరం యథా=శిఖరము వలె, మనోజ్ఞాన్=మనోహరము లైన, గన్ధాన్=గంధములను, విసృజత్=విడచుచున్నది, వినదద్భిః=కూయుచున్న, సారసైః=సారసపక్షులచేతను, మయూరైశ్చ=నెమళ్లచేతను, విరాజితమ్=ప్రకాశింప చేయబడినది, సుకృతేహామృగాకీర్ణమ్=చక్కగా ఏర్పరుపబడిన తోడేళ్లచే వ్యాప్త మైనది, తథా=మరియు, భక్తిభిః=చెక్కడములతో, సుకీర్ణమ్=చాల వ్యాప్త మైనది, తిగ్మతేజసా=మంచి కాంతిచే, భూతానామ్=ప్రాణులయొక్క, మనః=మనస్సును, చక్షుశ్చ=దృష్టిని, ఆదదత్=ఆకర్షించుచున్నది, చన్ద్రభాస్కరసంకాశమ్=చంద్రునితోను సూర్యునితోను సమాన మైనది, కుబేరభవనోపమమ్ = కుబేరుని భవనముతో సమాన మైనది, మహేన్ద్రధామప్రతిమమ్=మహేంద్రుని గృహముతో సమానమైనది, నానాపక్షిసమాకులమ్=అనేక విధము లైన పక్షులతో వ్యాకుల మైనది, మేరుశృఙ్గసమమ్=మేరుపర్వతశిఖరముతో సమానముగా ఉన్నది, ఉపస్థితైః=వచ్చియున్న, అఞ్జలికారిభిః=దోసిళ్ళు కట్టియున్న, జనైః=జనులచేత, సమాకీర్ణమ్=వ్యాప్త మైనది, తథా=మరియు, ఉపాదాయ=కానుకలు, మొదలగువానిని గ్రహించి, సమాక్రాన్తైః=ఆ ప్రదేశమును ఆక్రమించి ఉన్న, రామాభిషేకసుముఖైః = రాముని అభిషేకము విషయమున సుముఖులును, ఉన్ముఖైః=వేడుకతో ఎదురుచూచుచున్నవారును అయిన, జానపదైః జనైః=జనపదమునుండి వచ్చిన జనులచే, అలంకృతమ్=అలంకరించబడినది, మహామేఘసమప్రఖ్యమ్=గొప్ప మేఘముతో సమానముగా, ఉదగ్రమ్=ఉన్నత మైనది, సువిభూషితమ్=చక్కగా అలంకరించబడినది, నానారత్నసమాకీర్ణమ్=అనేక రత్నములతో నిండినది, కుబ్జకైరాతకావృతమ్ = కుబ్జులచేతను, కిరాతులచేతను వ్యాప్తము అయిన, రామవేశ్మ=రాముని గృహమును, దదర్శ హ=చూచెను.

తా. శ్రీరాముని గృహము పెద్ద పెద్ద తలుపులతో వందలకొలది అరుగులతో అందముగా ఉన్నది. ఒక శిఖరము మీద బంగారు ప్రతిమలు చెక్కబడి

నవి. మణులతోను, పొగడాలతోను, ద్వారాలు అలంకరించబడినవి. శరత్కాలము నందు మేఘము వలె, మేరుపర్వతగుహ వలె ప్రకాశించుచు అనేకమణులతోను, ఉత్తమమాలలతోను అలంకరింపబడి ఉన్నది. ముత్యాలు చల్లబడి ఉన్నవి. చందనాగురుసమలంకృతమై దర్దురపర్వతశిఖరము వలె మనోహర మైన సువాసనలు వెదజల్లుచున్నది. సారసపక్షులూ, నెమళ్లూ మధురముగా కూయు చున్నవి. ఈహామృగాలూ ఎన్నో నగిషీలు అక్కడక్కడ చెక్కబడి ఉన్నవి. తీవ్ర మైన తేజస్సుతో ప్రాణుల మనస్సునూ, చూపునూ కూడా ఆకర్షించుచున్నది. చంద్ర-సూర్యమండలాల వలె దేదీప్యమానముగా ఉన్నది. కుబేరభవనము వలె మహేంద్రుని ప్రాసాదము వలె ప్రకాశించుచున్నది. అనేక పక్షులతో వ్యాకులముగా ఉన్నది. మేరుశృంగము వలె ఉన్నతముగా ఉన్నది. అట్టి రామప్రాసాదమును సూతుడు చూచెను. వివిధగ్రామప్రాంతాలనుండి వచ్చిన జనులు రామాభిషేకము కొరకు ఎదురుచూచుచు, ఉపాయనాలు చేతపట్టుకొని వినీతులై నిలచి ఉండిరి. మహామేఘము వలె ఉన్నతముగా ఉన్నదీ, వివిధరత్నాలంకృతమూ అయిన ఆ గృహము పరిచారకు లైన కుబ్జులు, కిరాతులు మొదలైనవారితో వ్యాప్తమై యున్నది. 32—40

మూ. స వాజియుక్తేన రథేన సారథి
ర్నరాకులం రాజకులం విరాజయన్,
వరూథినా రామగృహాభిపాతినా
పురస్య సర్వస్య మనాంసి హర్షయన్. 41

ప్ర. అ. సః=ఆ, సారథిః=సారథి, రామగృహాభిపాతినా = రాముని గృహమును గూర్చి వెళ్లుచున్నదీ, వరూథినా = పై కప్పుకలదీ, వాజియుక్తేన= గుర్రములతో గూడినదీ అయిన, రథేన=రథముతో, నరాకులం= జనులతో నిండియున్న, రాజకులమ్ = రాజగృహమును, విరాజయన్=ప్రకాశింపచేయుచు, సర్వస్య=సమస్త మైన, పురస్య = పట్టణముయొక్క, మనాంసి = మనస్సులను, హర్షయన్ =సంతోషపెట్టుచు (వెళ్లెను).

తా. ఆ సుమంత్రుడు రామగృహము వైపు వెళ్లుచున్న, ఆచ్ఛాదనయుక్త మైన, అశ్వములు కట్టిన రథము నెక్కి జనసమ్మర్దముతో నిండిన ఆ రాజ

కులమును ప్రకాశింపచేయుచు, అందరి పౌరుల మనస్సును సంతోషపెట్టుచు వెళ్ళెను. 41

మూ. తతస్సమాసాద్య మహాధనం మహత్
ప్రహృష్టరోమా స బభూవ సారథిః ।
మృగైర్మయూరైశ్చ సమాకులోల్బణం
గృహం వరార్హస్య శచీపతేరివ. 42

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = ఆ, సారథిః = సారథి, మహాధనం = గొప్ప ధనము కలది, మహత్ = గొప్పది, మృగైః = వివిధమృగములతోను, మయూరైశ్చ = నెమళ్ళతోను, సమాకులోల్బణం = వ్యాకులమై అందముగా నున్నది, శచీపతేః ఇవ = దేవేంద్రుని గృహము వలె ఉన్న, వరార్హస్య = శ్రేష్ఠుడైన రామునియొక్క, గృహం = గృహమును, సమాసాద్య = సమీపించి, ప్రహృష్టరోమా = గగుర్పాటు పొందినవాడుగ, బభూవ = ఆయెను.

తా. మహాత్ముడైన ఆ శ్రీరాముని ప్రాసాదము దేవేంద్రుని భవనము వలె మహైశ్వర్యసంపన్నముగా నున్నది. అనేకమైన మృగములతోనూ నెమళ్ళతోనూ నిండి ఉన్నది. ఆ గృహం సమీపించగానే సుమంత్రునికి గగుర్పాటు కలిగినది. 42

మూ. స తత్ర కైలాసనిభాః స్వలంకృతాః
ప్రవిశ్య కక్ష్యాస్త్రిదశాలయోపమాః ।
ప్రియాన్ వరాన్ రామమతే స్థితాన్ బహూన్
వ్యపోహ్య శుద్ధాంతముపస్థితో రథీ. 43

ప్ర. అ. సః = ఆ, రథీ = సుమంత్రుడు, తత్ర = అచట, కైలాసనిభాః = కైలాసముతో సమానమైనవీ, స్వలంకృతాః = చక్కగా అలంకరింపబడినవీ, త్రిదశాలయోపమాః = దేవతాగృహములతో సమానములూ అయిన, కక్ష్యాః = వాకిళ్లను, ప్రవిశ్య = ప్రవేశించి, రామమతే = రాముని అభిమతమునందు, స్థితాన్ = ఉన్నవారు, బహూన్ = అనేకులు అయిన. వరాన్ = శ్రేష్ఠులైన, ప్రియాన్ = మిత్రులను, వ్యపోహ్య = అతిక్రమించి, శుద్ధాంతమ్ = అంతఃపురమును, ఉపస్థితః = సమీపించెను.

తా. ఆ రాముని గృహములోని వాకిళ్లు, కైలాసము వలె ఉన్నతము లై వర్ణముగ అలంకరింపబడి దేవతాగృహముం వలె ఉన్నవి. సుమంత్రుడు అచట ప్రవేశించి, రాముని హితమును కోరే మిత్రులను అనేకులను దాటుకొనుచు అంతః పురమును సమీపించెను. 43

మూ. స తత్ర శుశ్రావ చ హర్షయుక్తా
రామాభిషేకార్థకృతా జనానాం,
నరేంద్రసూనోరభిమంగళార్థాః
సర్వస్య లోకస్య గిరః ప్రహృష్టః. 44

ప్ర. అ. తత్ర = అచట, సః = అతడు, జనానాం = జనులయొక్క, రామాభిషేకార్థకృతాః = రాముని అభిషేకమును గూర్చి చేయబడినవి, హర్షయుక్తాః = ఆనందముతో కూడినవి అయిన, నరేంద్రసూనోః = రామునియొక్క, అభిమంగళార్థాః = మంగళప్రయోజనము కలవి, సర్వస్య = సమస్త మైన, లోకస్య = జనులయొక్క, ప్రహృష్టాః = ఆనందభరితము లైన, గిరః = మాటలను, శుశ్రావ = వినెను.

తా. అక్కడ ఆ సుమంత్రుడు శ్రీరాముని అభిషేకము గూర్చి, రాముని మంగళముకొరకై చేయబడు క్రియలను గూర్చి, ఆనందభరితము లైన సకల జనులు చెప్పుకొనుచున్న మాటలను వినెను. 44

మూ. మహేంద్రసద్మప్రతిమం తు వేశ్మ
రామస్య రమ్యం మృగపక్షిజుష్టం,
దదర్శ మేరోరివ శృంగముచ్చం
విభ్రాజమానం ప్రభయా సుమంత్రః. 45

ప్ర. అ. సుమంత్రః = సుమంత్రుడు, మహేంద్రసద్మప్రతిమమ్ = మహేంద్రుని గృహముతో సమాన మైనదీ, మృగపక్షిజుష్టమ్ = మృగములతోను పక్షులతోను కూడినదీ, మేరోః = మేరుపర్వతముయొక్క, ఉచ్చం = ఉన్నత మైన, శృంగమ్ ఇవ = శిఖరము వలె ఉన్నదీ, ప్రభయా = కాంతితో, విభ్రాజ

మానమ్=ప్రకాశించుచున్నది, రమ్యమ్=సుందరమూ అయిన, రామస్య వేశ్మ= రాముని ప్రాసాదమును, దదర్శ=చూచెను.

తా. రాముని ప్రాసాదము మేరుశిఖరము వలె ఉన్నతముగా కాంతితో ప్రకాశించుచున్నది. మృగపక్షులతో నిండి ఉన్నది. మహేంద్రుని భవనము వలె, అద్భుతముగా నున్నది. అట్టి రాముని గృహమును సుమంత్రుడు చూచెను. ౪౫

మూ. ఉపస్థితై రఞ్జలికారిభిశ్చ
సోపాయనైర్జానపదైర్జనైశ్చ,
కోట్యా పరార్ధైశ్చ విముక్తయానైః
సమాకులం ద్వారపదం దదర్శ. 46

ప్ర. అ. ఉపస్థితైః=సమీపించినవారును, అంజలికారిభిశ్చ = చేతులు జోడించినవారును, సోపాయనైః = ఉపాయనములతో కూడినవారును, విముక్తయానైః = విడువబడిన వాహనములు కలవారును, కోట్యా = కోటిసంఖ్య గలవారును, పరార్ధైశ్చ = పరార్ధసంఖ్య కలవారును అగు, జానపదైః = జానపదులతోను, జనైశ్చ = జనులతోను, సమాకులం = నిండి ఉన్న, ద్వారపదమ్ = ద్వారస్థానమును, దదర్శ = చూచెను.

తా. కోట్ల కొలది, పరార్ధముల కొలది జానపదులు, ఇతరజనులు, ఉపాయనములతో వచ్చి, తమ తమ వాహనములను విడచి, చేతులు కట్టుకొని, ఆ ద్వారప్రదేశము దగ్గర నిలచి ఉండిరి. అట్టి ద్వారప్రదేశమును సుమంత్రుడు చూచెను. 100,000,000,000,000,000 పరార్ధము. 46

మూ. తతో మహామేఘమహీధరాభం
ప్రభిన్నమత్యఙ్కుశమత్యసహ్యమ్,
రామోపవాహ్యం రుచిరం దదర్శ
శత్రుంజయం నాగముదగ్రకాయమ్. 47

ప్ర. అ. తతః = అటుపిమ్మట, మహామేఘమహీధరాభమ్ = గొప్ప మేఘముతోను పర్వతముతోను సమాన మైనదియు, ప్రభిన్నమ్=మదము స్రవించు

మున్నదియు, అత్యఙ్కుశమ్ = అంకుశమును లెక్క చేయనిదియు, అసహ్యమ్ = సహింపరానిదియు, ఉదగ్రకాయం = ఉన్నత మైన శరీరము కలదియు, రామోపవాహ్యమ్ = రాముడు ఎక్కదగినదియు అగు, రుచిరమ్ = అంద మైన, శత్రుంజయమ్ = శత్రుంజయ మను పేరు గల, నాగమ్ = ఏనుగును, దదర్శ = చూచెను.

తా. అక్కడ రాము డెక్కవలసిన అత్యున్నత మైన శరీరము కల శత్రుంజయ మనే సుందర మైన గజమును చూచెను. అది మేఘము వలె, పర్వతము వలె ఉన్నది. మదము స్రవించుచు, అంకుశమును కూడ లెక్కచేయక సహింపరానిదై ఉన్నది. 47

మూ. స్వలంకృతాన్ సాశ్వరథాన్ సకుంజరా
సమాత్యముఖ్యాంశ్చ దదర్శ వల్లభాన్,
వ్యపోహ్య సూతః సహితాన్సమంతతః
సమృద్ధమంతఃపుర మావివేశ హ. 48

ప్ర. అ. స్వలంకృతాన్ = చక్కగా అలంకరింపబడినవారు, సాశ్వరథాన్ = అశ్వరథములతో కూడినవారూ, సకుంజరాన్ = ఏనుగులతో గూడిన వారూ, వల్లభాన్ = రాజప్రియులూ అయిన, అమాత్యముఖ్యాంశ్చ = ప్రధానులైన అమాత్యులను కూడ, దదర్శ = చూచెను. సూతః = సుమంత్రుడు, సమంతతః = నలువైపుల, సహితాన్ = గుమిగూడిన ఆ జనులను, వ్యపోహ్య = తొలగించుకొని, సమృద్ధమ్ = సమృద్ధి కల, అంతఃపురం = అంతఃపురమును, ఆవివేశ హ = ప్రవేశించెను.

తా. రాజప్రియు లైన అమాత్యముఖ్యులు చక్కగా అలంకరించుకొని, అశ్వ, రథ, కుంజరములను ఎక్కి అచటకు వచ్చి యుండిరి. సుమంత్రుడు గుమికూడి యున్న వారి నందరిని తప్పించుకొని ఐశ్వర్యసమృద్ధ మగు రాముని అంతఃపురములోనికి ప్రవేశించెను. 48

మూ. తతోఽద్రికూటాచలమేఘసన్నిభం
మహావిమానోపమవేశ్మసంయుతమ్,

అవార్యమాణః ప్రవివేశ సారథిః
ప్రభూతరత్నం మకరో యథార్ణవమ్. 49

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చదశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సారథిః = సారథి, అద్రికూటాచల మేఘసన్నిభం = పర్వతశిఖరముతోను, నిశ్చల మైన మేఘముతోను సమాన మైనదియు, మహావిమానోపమవేశ్మసంయుతమ్ = గొప్ప విమానములతో సమాన మైన గృహములతో కూడియున్నదియు అయిన, ఆ రాముని గృహమును, మకరః = మొసలి, ప్రభూతరత్నం = అధిక మైన రత్నములు గల, అర్ణవం యథా = సముద్రమును వలె, అవార్యమాణః = ఎవరిచేతను అడ్డుకొనబడనివాడై, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. పిమ్మట ఆ సుమంత్రుడు పర్వతశిఖరము వలె నిశ్చల మైన మేఘము వలె ఉన్నదియు, దట్టను గొప్ప విమానముల వంటి గృహములు కలదియు అయిన, రాముని భవనమును మొసలి రత్నభరిత మైన అర్ణవమును ప్రవేశించినట్లు ప్రవేశించెను. అతనిని ఎవ్వరును అడ్డుకొనలేదు. 49.

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో పదునైదవసర్గ సమాప్తము.

# అథ షోడశః సర్గః

[సుమంత్రుడు శ్రీరామభవనము చేరి మహారాజు సందేశము వినిపించుట, శ్రీరాముడు సీత యనుమతితో, లక్ష్మణసమేతుడై రథారూఢుడై మంగళవాద్యములతో, మార్గమున స్త్రీపురుషుల మాటలు వినుచు పోవుట.]

మూ. స తదంతఃపురద్వారః సమతీత్య జనాకులమ్,
ప్రవివిక్తాం తతః కక్ష్యామాససాద పురాణవిత్. 1
ప్రాసకార్ముకబిభ్రద్భిర్యువభిర్మృష్టకుండలైః,
అప్రమాదిభిరేకాగ్రైః స్వనురక్తైరధిష్ఠితామ్. 2

ప్ర. అ. పురాణవిత్ = పురాణకథల నెరిగిన, సః = సుమంత్రుడు, జనాకులం = జనులతో వ్యాకుల మైన, తద్ = ఆ, అంతఃపురద్వారమ్ = అంతఃపురద్వారమును, సమతీత్య = దాటి, తతః = అటుపిమ్మట, ప్రాసకార్ముకబిభ్రద్భిః = ప్రాసలను, ధనస్సులను ధరించినవారును, మృష్టకుండలైః = పరిశుభ్రము లైన కుండలములు కలవారును, అప్రమాదిభిః = అప్రమత్తులును, ఏకాగ్రైః=ఏకాగ్రచిత్తము కలవారును, స్వనురక్తైః=మంచి రాజభక్తి కలవారును అగు, యువభిః=యువకులచేత, అధిష్ఠితామ్=అధిష్ఠింపబడిన, ప్రవివిక్తామ్ = జనసమ్మర్దములేని, కక్ష్యామ్ = వాకిలిని, ఆససాద = పొందెను.

తా. పురాణవేత్త యైన ఆ సుమంత్రుడు జనులు నిండి యున్న ఆ అంతఃపురద్వారమును దాటి జనసమ్మర్దములేని వాకిలిని చేరుకొనెను. ఆ కక్ష్యాప్రాంతములో కొందరు యువకులు ప్రాసలు ధనస్సులు ధరించి, అప్రమత్తు లై ఏకాగ్రచిత్తు లై, రక్షణకార్యమును నిర్వర్తించుచుండిరి. వా రందరును గొప్ప రాజభక్తి కలవారు, అంద మైన కుండలాద్యలంకారములను ధరించినవారు. 1-2

మూ. తత్ర కాషాయిణో వృద్ధాన్ వేత్రపాణీన్ స్వలంకృతాన్,
దదర్శ విష్ఠితాన్ ద్వారి స్త్ర్యధ్యక్షాన్ సుసమాహితాన్. 3

ప్ర. అ. తత్ర=అచట, కాషాయిణః=కాషాయవస్త్రములు ధరించినవారూ, వృద్ధాన్ = వృద్ధులూ, వేత్రపాణీన్=వేత్రములు హస్తములందు కలవారూ, స్వలంకృతాన్ = చక్కగా అలంకరించుకొన్నవారూ, సుసమాహితాన్ = సావధానులై ఉన్నవారూ, ద్వారి = ద్వారమునందు, విష్ఠితాన్ = నియుక్తులూ అయిన స్త్ర్యధ్యక్షాన్ = అంతఃపురాధ్యక్షులను, దదర్శ = చూచెను.

తా. అక్కడ కాషాయవస్త్రములు ధరించి చక్కగా అలంకరించుకొని, చేత బెత్తములు ధరించి, నాగరీకతతో ఉన్న ద్వారనియుక్తులైన అంతఃపురాధ్యక్షులైన వృద్ధులను చూచెను. 3

మూ. తే సమీక్ష్య సమాయాన్తం రామప్రియచికీర్షవః,
సహసోత్పతితాః సర్వే హ్యాసనేభ్యః ససంభ్రమాః 4

ప్ర. అ. రామప్రియచికీర్షవః = రామునకు ప్రియమును చేయగోరు, తే సర్వే = వారందరును, సమాయాన్తమ్ = వచ్చుచున్న అతనిని, సమీక్ష్య=చూచి, ససంభ్రమాః = తొందరతో కూడినవారై. సహసా=వెంటనే, ఆసనేభ్యః=తమ ఆసనముల నుండి, ఉత్పతితాః = లేచిరి.

తా. వచ్చుచున్న ఆ సుమంత్రుని చూడగానే రాముని ప్రియమునే, సర్వదా చింతించుచుండెడు వారందరు తొందరపడుచు వెంటనే తమ ఆసనములనుండి లేచిరి. 4

మూ. తానువాచ వినీతాత్మా సూతపుత్రః ప్రదక్షిణః,
క్షిప్ర మాఖ్యాత రామాయ సుమన్త్రో ద్వారి తిష్ఠతి. 5

ప్ర. అ. వినీతాత్మా=వినయముతో కూడిన బుద్ధి గల, సూతపుత్రః=ఆ సుమంత్రుడు, ప్రదక్షిణః = మిక్కిలి దాక్షిణ్యముతో గూడినవాడై, తాన్=వారిని గూర్చి, ఉవాచ=పలికెను. సుమన్త్రః=సుమంత్రుడు, ద్వారి = ద్వారమునందు, తిష్ఠతి=ఉన్నాడు అని, క్షిప్రం=శీఘ్రముగ, రామాయ = రామునకు, ఆఖ్యాత= చెప్పండి.

తా. వినయశీలుడైన ఆ సుమంత్రుడు "దాక్షిణ్యపూర్వకముగా- సుమంత్రుడు ద్వారములో నిలిచి యున్నాడు అని శీఘ్రముగా వెళ్లి రామునితో చెప్పుడు" అని వారితో పలికెను. 5

మూ. తే రామముపసంగమ్య భర్తుః ప్రియచికీర్షవః,
సహభార్యాయ రామాయ క్షిప్రమేవాచచక్షిరే. 6

ప్ర. అ. భర్తుః = ప్రభువునకు, ప్రియచికీర్షవః = ప్రియమును చేయగోరు, తే = వారు, రామమ్ = రాముని, ఉపసంగమ్య = సమీపించి, క్షిప్రమేవ = శీఘ్రము గనే, సహభార్యాయ = భార్యాసమేతు డైన, రామాయ = రామునకు, ఆచచక్షిరే = చెప్పిరి.

తా. ప్రభువునకు ప్రియము చేయ కోరికగల వారు రాముని దగ్గరకు వెళ్లి భార్యాసమేతు డగు అతనికి వెంటనే తెలిపిరి. 6

మూ. ప్రతివేదితమాజ్ఞాయ సూతమభ్యంతరం పితుః,
తత్రైవానాయయామాస రాఘవః ప్రియకామ్యయా. 7

ప్ర. అ. రాఘవః = రాముడు, పితుః = తండ్రికి, అభ్యంతరం = అంత రంగికుడు, ప్రతివేదితం = వారిచే తెలుపబడినవాడూ అయిన, సూతమ్ = సుమం త్రుని, ఆజ్ఞాయ = తెలుసుకొని, ప్రియకామ్యయా = ప్రియముచేయవలయు ననే కోరికచే, తత్రైవ = అచ్చటికే, ఆనాయయామాస = రప్పించెను.

తా. తన తండ్రికి అంతరంగికమిత్రు డైన, సుమంత్రుడు వచ్చి నట్లు తెలిసి రాముడు అతనికి ప్రియము చేయవలె నను కోరికతో తనవద్దకే పిలి పించెను. 7

మూ. తం వైశ్రవణసంకాశముపవిష్టం స్వలంకృతమ్,
దదర్శ సూతః పర్యంకే సౌవర్ణే సోత్తరచ్ఛదే. 8
వరాహరుధిరాభేణ శుచినా చ సుగంధినా,
అనులిప్తం పరార్ధ్యేన చందనేన పరంతపమ్, 9
స్థితయా పార్శ్వతశ్చాపి వాలవ్యజనహస్తయా,
ఉపేతం సీతయా భూయః చిత్రయా శశినం యథా. 10

ప్ర. అ. వైశ్రవణసంకాశమ్ = కుబేరునితో సమానుడును, స్వలం కృతం = చక్కగ అలంకరింపబడినవాడును, వరాహరుధిరాభేణ = వరాహ

రక్తము వలె ఉన్న, శుచినా = పరిశుద్ధమైన, సుగన్ధినా = మంచి సువాసన గల, వరార్హేణ = శ్రేష్ఠమైన, చందనేన = చందనముచేత, అనులిప్తం = పూయబడినవాడును, పరంతపం = శత్రువులను తపింపచేయువాడును, చిత్రయా = చిత్రానక్షత్రముతో కూడ, శశినం యథా = చంద్రుడు వలె, పార్శ్వతః = ప్రక్కన, స్థితయా = నిలబడి యున్న, వాలవ్యజనహస్తయా = వింజామర హస్తమునందు గల, సీతయా చాపి = సీతతో, ఉపేతమ్ = కూడియున్నవాడును, సూత్తరచ్ఛదే = మంచి ఆచ్ఛాదనముతో కూడిన, సౌవర్ణే = సువర్ణవికారమైన, పర్యఙ్కే = మెత్తని ఆసనముపై, ఉపవిష్టమ్ = కూర్చుని యున్న, తమ్ = ఆ రాముని, సూతః = సుమంత్రుడు, దదర్శ = చూచెను.

తా. ఆ సుమంత్రుడు శ్రేష్ఠమైన ఆచ్ఛాదనముగల బంగారు పర్యంకముపై కూర్చొని కుబేరుని వలె ఉన్న ఆ రాముని చూచెను. అతడు చక్కగా అలంకరించుకొని, వరాహరక్తము వలె నున్న 'పవిత్రమైన' సుగంధము గల శ్రేష్ఠమైన చందనమును శరీరమునకు పూసుకొని యుండెను. ప్రక్కనే నిలచి వింజామర చేత ధరించియున్న సీతతో, ఆ పరంతపుడు చిత్రానక్షత్రముతో గూడిన చంద్రుని వలె ప్రకాశించుచుండెను. 8-10

మూ. తం తపన్తమివాదిత్యముపపన్నం స్వతేజసా,
వవన్దే వరదం వన్దీ వినయజ్ఞో వినీతవత్. 11

ప్ర. అ. వినయజ్ఞః = వినయము తెలిసిన, వన్దీ = సుమంత్రుడు, వినీతవత్ = వినీతుడై, స్వతేజసా = తన తేజస్సుతో, ఉపపన్నమ్ = కూడినవాడును, తపన్తమ్ = ప్రకాశించుచున్న, ఆదిత్యమ్ ఇవ = సూర్యుడు వలె ఉన్న, వరదమ్ = వరములనిచ్చు, తమ్ = ఆ రాముని, వవన్దే = నమస్కరించెను.

తా. వినయశీలుడైన ఆ సుమంత్రుడు, వినీతుడై మహాతేజస్సంపన్నుడూ, సూర్యుని వలె ప్రకాశించుచున్నవాడూ, కోరికలు తీర్చువాడూ అయిన, ఆ రామునికి నమస్కారము చేసెను. 11

మూ. ప్రాఞ్జలిః సుముఖం దృష్ట్వా విహారశయనాసనే,
రాజపుత్రమువాచేదం సుమన్త్రో రాజసత్కృతః. 12

ప్ర. అ. రాజసత్కృతః = రాజాచే సత్కరింపబడిన. సుమన్త్రః = సుమంత్రుడు, విహారశయనాసనే = విహారార్థ మై ఉపయోగించు శయనరూప మైన ఆసనముపై (సోఫాపై), సుముఖమ్ = అంద మైన ముఖము గల, రాజపుత్రమ్ = రాజకుమారుని, దృష్ట్వా = చూచి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. దశరథునివలన అనేక సత్కారములు పొందు ఆ సుమంత్రుడు సుఖాసనముపై కూర్చుని యున్న రమణీయవదను డైన ఆ రాజకుమారుని చూచి చేతులు జోడించి ఇట్లు పలికెను. 12

మూ. కౌసల్యాసుప్రజా రామ పితా త్వాం ద్రష్టుమిచ్ఛతి,
మహిష్యా సహ కైకేయ్యా గమ్యతాం తత్ర మా చిరమ్. 13

ప్ర. అ. కౌసల్యాసుప్రజాః = కౌసల్యాసుపుత్రుడ వైన, రామ = ఓ రామా! మహిష్యా = రాణి యైన, కైకేయ్యా సహ = కైకేయితో కూడ, పితా = నీ తండ్రి, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. తత్ర = అచటికి, గమ్యతామ్ = వెళ్లెదవు గాక. మా చిరమ్ = ఆలస్యము చేయవద్దు.

తా. కౌసల్య సుపుత్రుడ వైన ఓ రామా! నీ తండ్రి, రాణి యైన కైకేయీ నిన్ను చూడవలె నని కోరుచున్నారు. అచటికి వెంటనే వెళ్లుము. 13

మూ. ఏవముక్తస్తు సంహృష్టో నరసింహో మహాద్యుతిః,
తతస్సమ్మానయామాస సీతామిదమువాచ హ. 14

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఏవమ్ = ఈ విధముగ, ఉక్తః = పలుకబడిన, మహాద్యుతిః = మహాతేజస్సు గల, నరసింహః = ఆ నరశ్రేష్ఠుడు, సంహృష్టః = సంతోషించినవాడై, సమ్మానయామాస = అతనిని గౌరవించెను. సీతామ్ = సీతను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ నరశ్రేష్ఠుడు ఆ మాటలు విని సంతోషించి అతనిని గౌరవించి సీతతో ఇట్లనెను. 14

మూ. దేవి దేవశ్చ దేవీ చ సమాగమ్య మదంతరే,
మంత్రయేతే ధ్రువం కించి దభిషేచనసంహితమ్. 15

ప్ర. అ. దేవి=ఓ సీతాదేవీ, దేవశ్చ=రాజు, దేవీ చ = రాణియు, సమాగమ్య=కలసి, మదంతరే=నన్ను గూర్చి, అభిషేచనసంహితమ్=అభిషేకము నకు సంబంధించిన, కించిత్=ఏదో విషయమును, మంత్రయేతే = ఆలోచించు చున్నారు. ధ్రువమ్ = నిశ్చయము.

తా. సీతా! మహారాజు, మహారాణియు కలిసి నన్ను గూర్చి, నా రాజ్యాభి షేకమునకు సంబంధించిన ఏదో విషయము ఆలోచించుచున్నారు. నిశ్చయము.

మూ. లక్షయిత్వా హ్యభిప్రాయం ప్రియకామా సుదక్షిణా,
సంచోదయతి రాజానం మదర్థ మసితేక్షణా. 16

ప్ర. అ. అసితేక్షణా = నల్లని నేత్రములు కలదీ, సుదక్షిణా = మంచి నేర్పు కలదీ, ప్రియకామా=ప్రియమును కోరునదీ యైన కైకేయి, అభిప్రాయమ్ =అభిప్రాయమును, లక్షయిత్వా=ఊహించి, రాజానమ్=రాజును, మదర్థమ్ = నా విషయమై, సంచోదయతి = ప్రేరేపించుచున్నది.

తా. మంచి నేర్పుగల నల్లని నేత్రములు గల ఆ కైకేయి రాజు అభి ప్రాయమును ఊహించి అతనికి ప్రియము చేయ గోరుచు నా నిమిత్తమై అతనిని ప్రేరేపించుచున్నది. 16

మూ. సా ప్రహృష్టా మహారాజం హితకామానువర్తినీ,
జననీ చార్థకామా మే కేకయాధిపతేస్సుతా. 17

ప్ర. కేకయాధిపతేః సుతా=కేకయరాజుయొక్క కుమార్తెయు, జననీ చ =నాతల్లియు యైన, సా=ఆమె, ప్రహృష్టా=సంతోషించినదై, హితకామా = నా హితమును కోరుచున్నదై, మహారాజమ్ = మహారాజును, అనువర్తినీ = అనుస రించుచు, మే=నాయొక్క, అర్థకామా=ప్రయోజనమును కోరుచున్నది. 17

తా. నా తల్లి యైన ఆ కైకేయి మహారాజు మనస్సును అనుసరించుచు, సంతోషించి నా హితమును లాభమును కోరుచున్నది. 17

మూ. దిష్ట్యా ఖలు మహారాజో మహిష్యా ప్రియయా సహ,
సుమన్త్రం ప్రాహిణోద్దూత మర్థకామకరం మమ. 18

ప్ర. అ. మహిష్యా = రాణి యైన, ప్రియయా సహ = భార్యతో, మహారాజః = మహారాజు, దిష్ట్యా = అదృష్టవశముచేత, మమ = నాకు, అర్థకామకరం = అర్థకామములను సంపాదించు, సుమన్త్రమ్ = సుమంత్రుని, దూతమ్ = దూతగా, ప్రాహిణోత్ = పంపెను.

తా. మన అదృష్టముచే మహారాజు, రాణియు, నాకు అర్థకామములను సంపాదించి ఇచ్చు సుమంత్రుని దూతగా పంపినారు. 18

మూ. యాదృశీ పరిషత్తత్ర తాదృశో దూత ఆగతః,
ధ్రువమద్యైవ మాం రాజా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి. 19

ప్ర. అ. తత్ర = అచట, యాదృశీ = ఎట్టి, పరిషత్ = పరిషత్తు ఉన్నదో, తాదృశః = అట్టి, దూతః = దూత, ఆగతః = వచ్చినాడు. ధ్రువమ్ = తప్పక, అద్యైవ = నేడే, రాజా = రాజు, మామ్ = నన్ను, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేక్ష్యతి = అభిషిక్తుని చేయగలడు.

తా. అక్కడ కలిసి యున్న పరిషత్తుకు (నా తల్లిదండ్రులకు) తగిన దూత వచ్చినాడు. నేడే రాజు నన్ను తప్పక యౌవరాజ్యాభిషిక్తుని చేయగలడు. 19

మూ. హన్త శీఘ్రమితో గత్వా ద్రక్ష్యామి చ మహీపతిమ్,
సహ త్వం పరివారేణ సుఖమాస్స్వ రమస్వ చ. 20

ప్ర. అ. హన్త = ఏమి ఆనందము! ఇతః = ఇక్కడినుండి, శీఘ్రం = శీఘ్రముగా, గత్వా = వెళ్లి, మహీపతిమ్ = మహారాజును, ద్రక్ష్యామి చ = చూచెదను. త్వమ్ = నీవు, పరివారేణ సహ = పరివారముతో కూడ, సుఖమ్ = సుఖముగా, ఆస్స్వ = ఉండుము. రమస్వ చ = విహరించుము.

తా. నేను వెంటనే వెళ్లి రాజును చూచెదను. నీవు ఈ పరివారముతో సుఖముగా నుండి విహరింపుము. 20

మూ. పతిసమ్మానితా సీతా భర్తారమసితేక్షణా,
ఆద్వారమనువవ్రాజ మంగళాన్యభిదధ్యుషీ. 21

ప్ర. అ. పతిసమ్మానితా = భర్తచే గౌరవింపబడినది, అసితేక్షణా = నల్లని నేత్రములు కలది యైన, సీతా = ఆ సీత, మంగళాని = మంగళములను, అభిదధ్యుషీ = తలచుకొనుచు, భర్తారమ్ = భర్తను, ఆ ద్వారమ్ = ద్వారము వరకు, అనువవ్రాజ = అనుసరించి వెళ్ళెను.

తా. పతిగౌరవమునకు పాత్రురాలు, నల్లని నేత్రములు కలది యైన సీత, మనస్సులో మంగళములను తలచుకొనుచు భర్తను ద్వారమువరకు సాగనంపెను. 21

మూ. రాజ్యం ద్విజాతిభిర్జుష్టం రాజసూయాభిషేచనమ్,
కర్తుమర్హతి తే రాజా వాసవస్యేవ లోకకృత్. 22

ప్ర. అ. రాజా = దశరథ మహారాజు, ద్విజాతిభిః = ద్విజులచే, జుష్టం = సేవింపబడిన, రాజసూయాభిషేచనమ్ = రాజసూయాభిషేకమును, కల్పింప గల, రాజ్యమ్ = రాజ్యమును, తే = నీకు, లోకకృత్ = బ్రహ్మ, వాసవస్యేవ = దేవేంద్రునకు వలె, కర్తుమ్ = చేయుటకు, అర్హతి = తగి యున్నాడు.

తా. బ్రహ్మ దేవేంద్రునకు ఇచ్చి నట్లుగా దశరథమహారాజు, రాజసూయాభిషేకమునకు యోగ్యత్వమును కల్గించు ద్విజసేవిత మైన రాజ్యమును నీకు ఇచ్చును. 22

మూ. దీక్షితం వ్రతసంపన్నం వరాజినధరం శుచిం,
కురఙ్గశృఙ్గపాణిం చ పశ్యన్తీ త్వాం భజామ్యహమ్. 23

ప్ర. అ. దీక్షితమ్ = దీక్ష గైకొన్నవాడు, వ్రతసంపన్నమ్ = వ్రతముతో కూడినవాడు, వరాజినధరమ్ = శ్రేష్ఠ మైన కృష్ణాజినమును ధరించినవాడు, శుచిమ్ = పవిత్రుడు, కురఙ్గశృఙ్గపాణిం చ = లేడి కొమ్ము చేతియందు కలవాడు ఐన, త్వామ్ = నిన్ను, పశ్యన్తీ = చూచుచు, అహమ్ = నేను, భజామి = సేవించెదను.

తా. నీవు దీక్షితుడవై వ్రతము పాలించుచు, కృష్ణాజినమును ధరించి శుచివై చేతిలో లేడికొమ్ము ధరించి యుండగా నేను చూచి ఆనందించెదను. 23

మూ. పూర్వాం దిశం వజ్రధరో దక్షిణాం పాతు తే యమః,
వరుణః పశ్చిమామాశాం ధనేశస్తూత్తరాం దిశమ్. 24

ప్ర. అ. తే = నీయొక్క, పూర్వాం దిశమ్ = తూర్పు దిక్కును, వజ్రధరః = ఇంద్రుడు, దక్షిణామ్ = దక్షిణ దిక్కును, యమః = యముడు, పశ్చిమామాశామ్ = పశ్చిమ దిక్కును, వరుణః = వరుణుడు, ఉత్తరాం దిశం తు = ఉత్తరదిక్కును, ధనేశః = కుబేరుడు, పాతు = రక్షించుగాక.

తా. నిన్ను తూర్పుదిక్కున ఇంద్రుడు, దక్షిణమున యముడు, పశ్చిమమున వరుణుడు, ఉత్తరమున కుబేరుడు రక్షించెదరు గాక. 24

మూ. అథ సీతామనుజ్ఞాప్య కృతకౌతుకమంగళః,
నిశ్చక్రామ సుమన్త్రేణ సహ రామో నివేశనాత్. 25

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కృతకౌతుకమంగళః = ఉత్సవ సమయమున ధరించే మంగళాలంకారములు గల, రామః = రాముడు, సీతామ్ = సీతను, అనుజ్ఞాప్య = అనుజ్ఞ ఇచ్చు నట్లు చేసి, సుమన్త్రేణ సహ = సుమంత్రునితో కూడ, నివేశనాత్ = గృహమునుండి, నిశ్చక్రామ = బయలుదేరెను.

తా. ఉత్సవమంగళాలంకారములు ధరించి యున్న రాముడు, సీత అనుజ్ఞ తీసుకొని సుమంత్రునితో కలసి గృహమునుండి బయలుదేరెను. 25

మూ. పర్వతాదివ నిష్క్రమ్య సింహో గిరిగుహాశయః,
లక్ష్మణం ద్వారి సోఽపశ్యత్ ప్రహ్వాఞ్జలిపుటం స్థితమ్. 26

ప్ర. అ. సః = ఆ రాముడు, గిరిగుహాశయః = పర్వతగుహలో శయనించు, సింహః = సింహము, పర్వతాత్ ఇవ = పర్వతమునుండి వలె, నిష్క్రమ్య = గృహమునుండి బయటకు వచ్చి, ద్వారి = ద్వారమునందు, స్థితమ్ = ఉన్న, ప్రహ్వాఞ్జలిపుటమ్ = వంగి దోసిలి కట్టి యున్న, లక్ష్మణమ్ = లక్ష్మణుని, అపశ్యత్ = చూచెను.

తా. పర్వతగుహలో నివసించు సింహము, పర్వతమునుండి బయటకు వచ్చినట్లు, తన భవనమునుండి బయటకు వచ్చిన ఆ రాముడు, సవినయముగ చేతులు కట్టి ద్వారమునందు నిలబడి యున్న లక్ష్మణుని చూచెను. 26

మూ. అథ మధ్యమకక్ష్యాయాం సమాగచ్ఛత్ సుహృజ్జనైః,
స సర్వానర్థినో దృష్ట్వా సమేత్య ప్రతినన్ద్య చ, 27
తతః పావకసంకాశమారురోహ రథోత్తమమ్,
వైయాఘ్రం పురుషవ్యాఘ్రో రాజితం రాజనందనః. 28

ప్ర. అ. అథ = పిమ్మట, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడైన, సః = ఆ, రాజనన్దనః = రాజకుమారుడు, మధ్యమకక్ష్యాయాం = మధ్య నున్న సాలియందు, సుహృజ్జనైః = మిత్రులతో, సమాగచ్ఛత్ = కలిసెను. సర్వాన్ = సమస్తమైన, అర్థినః = తన దర్శనము కోరు జనులను, దృష్ట్వా = చూచి, సమేత్య = దగ్గరకు వెళ్లి, ప్రతినన్ద్య చ = అభినందించి, పావకసంకాశమ్ = అగ్నితో సమానమైనది, వైయాఘ్రమ్ = వ్యాఘ్రచర్మముతో కప్పబడిన, రాజితమ్ = ప్రకాశించుచున్న; రథోత్తమమ్ = శ్రేష్ఠమైన రథమును, ఆరురోహ = ఎక్కెను.

తా. పిదప పురుషశ్రేష్ఠుడైన ఆ రాజకుమారుడు మధ్యమకక్ష్యలో మిత్రులను కలుసుకొనెను. తన దర్శనము కోరి, అచటకు వచ్చిన అందరిని చూచి దగ్గరకు వెళ్ళి అభినందించి అగ్నితో సమానమైనది, వ్యాఘ్రచర్మము కప్పినది, ప్రకాశించుచున్నది యైన శ్రేష్ఠరథమును ఎక్కెను. 27, 28

మూ. మేఘనాదమసంబాధం మణిహేమవిభూషితం,
ముష్ణన్తమివ చక్షూంషి ప్రభయా మేరువర్చసమ్, 29
కరేణుశిశుకల్పైశ్చ యుక్తం పరమవాజిభిః,
హరియుక్తం సహస్రాక్షో రథమిన్ద్ర ఇవాశుగమ్, 30
ప్రయయౌ తూర్ణమాస్థాయ రాఘవో జ్వలితః శ్రియా.

ప్ర. అ. శ్రియా = శోభతో, జ్వలితః = ప్రకాశించుచున్న, రాఘవః = రాముడు, మేఘనాదమ్ = మేఘము వంటి ధ్వని కలది, అసంబాధమ్ = ఇరుకు

లేనిది, మణిహేమవిభూషితం = రత్నములతోను, బంగారముతోను అలంకరించబడినది, ప్రభయా = కాంతిచేత, చక్షూంషి = నేత్రములను, ముష్ణన్తమివ = అపహరించుచున్నట్లున్నది, మేరువర్చసం = మేరుపర్వతము వంటి కాంతి కలది, కరేణుశిశుకల్పైః = ఏనుగు పిల్లల వలె నున్న, వరవాజిభిః = గొప్ప అశ్వములతో, యుక్తమ్ = కూడినది, ఆశుగమ్ = శీఘ్రముగా పోవునది, అయిన, రథమ్ = రథమును, సహస్రాక్షః = వేయి నేత్రములు గల, ఇన్ద్రః = ఇంద్రుడు, హరియుక్తమ్ ఇవ = గుఱ్ఱములతో కూడిన రథమును వలె, ఆస్థాయ = అధిష్ఠించి, తూర్ణమ్ = శీఘ్రముగా, ప్రయయౌ = వెళ్లెను.

తా. ఆ రథము ధ్వని మేఘధ్వనివలె యుండెను. విశాలమైన దానిని, మణులతోను, బంగారముతోను, అలంకరించిరి. కాంతిచే అది కండ్లకు మిరుమిట్లు గొల్పుచు మేరుపర్వతము వలె నుండెను. ఆ రథమునకు ఏనుగుపిల్లల వలె నున్న ఉత్తమమైన అశ్వములు కట్టబడి యున్నవి. అట్టి రథమును దేవేంద్రుడు వలె అధిష్ఠించి తేజస్సుతో ప్రజ్వలించుచున్న ఆ రాముడు శీఘ్రముగ బయలుదేరెను. 29 30

మూ. స పర్జన్య ఇవాకాశే స్వనవానభినాదయన్, 31
నికేతాన్నిర్యయౌ శ్రీమాన్ మహాభ్రాదివ చన్ద్రమాః.

ప్ర. అ. ఆకాశే = ఆకాశమునందు, పర్జన్య ఇవ = మేఘము వలె, స్వనవాన్ = ధ్వని గల, శ్రీమాన్ = శోభాయుక్తమైన, సః = ఆ రథము, అభినాదయన్ = ధ్వనింపచేయుచు, మహాభ్రాత్ = గొప్ప మేఘమునుండి, చన్ద్రమా ఇవ = చంద్రుడు వలె, నికేతాత్ = గృహమునుండి, నిర్యయౌ = బయలుదేరెను.

తా. శోభాయుక్తమైన ఆ రథము, ఆకాశమునందు ధ్వనించుచున్న మేఘము వలె ధ్వనిచేయుచు, మహామేఘమునుండి, చంద్రుడు బయటకు వచ్చినట్లు గృహమునుండి బయలుదేరెను. 31

మూ. ఛత్రచామరపాణిస్తు లక్ష్మణో రాఘవానుజః, 32
జుగోప భ్రాతరం భ్రాతా రథమాస్థాయ పృష్ఠతః.

ప్ర. అ. రాఘవానుజః = రాముని తమ్ముడు, భ్రాతా = సోదరుడు అయిన లక్ష్మణః = లక్ష్మణుడు, ఛత్రచామరపాణిః = ఛత్రచామరములు హస్తమున కల

గాత్రే, పృష్ఠతః=వెనుక భాగమున, రథమ్=రథమును, ఆస్థాయ = అధిష్ఠించి. భ్రాతరమ్=సోదరుని, అగోపత=రక్షించెను.

తా. లక్ష్మణుడు చేతులలో ఛత్రచామరములను ధరించి, రథ మెక్కి వెనుక నిలచి సోదరుని రక్షించుచుండెను. ౩౨

మూ. తతో హలహలాశబ్దస్తుములః సమజాయత, ౩౩
తస్య నిష్క్రమమాణస్య జనౌఘస్య సమన్తతః.

ప్ర. అ. తతః=పిమ్మట, సమన్తతః=నలు వైపుల, నిష్క్రమమాణస్య=బయలుదేరుచున్న, తస్య=ఆ, జనౌఘస్య=జనసముదాయము యొక్క, తుములః=వ్యాకుల మైన, హలహలాశబ్దః=కలకల ధ్వని, సమజాయత=పుట్టెను.

తా. అపుడు, నలు వైపులనుండియు, జనసముదాయము బయలుదేరగానే అత్యధిక మైన కలకలశబ్దము పుట్టెను. ౩౩

మూ. తతో హయవరా ముఖ్యా నాగాశ్చ గిరిసన్నిభాః, ౩౪
అనుజగ్ముస్తదా రామం శతశోఽథ సహస్రశః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ముఖ్యాః = ముఖ్య మైన, హయవరాః = శ్రేష్ఠ మైన అశ్వములు, (అశ్వికులు), గిరిసన్నిభాః = పర్వతములతో సమాన మైన, నాగాః = గజములు (గజారూఢులు), శతశః = వందలకొలది, సహస్రశః = వేలకొలది, తదా = అప్పుడు, రామమ్ = రాముని, అనుజగ్ముః = అనుసరించి వెళ్లిరి.

తా. పిమ్మట ప్రధాను లైన అశ్వారూఢులు, గజారూఢు లైన సైనికులు వందలకొలది వేలకొలది ఆ సమయమున రాముని అనుసరించి వెళ్లిరి. ౩౪

మూ. అగ్రతశ్చాస్య సన్నద్ధాశ్చన్దనాగురుభూషితాః, ౩౫
ఖడ్గచాపధరాః శూరా జగ్మురాశంసవో జనాః.

ప్ర. అ. సన్నద్ధాః=కవచాదులు ధరించినవారును, చన్దనాగురుభూషితాః=చందనముచేత అగురువుచేత అలంకరింపబడినవారును, ఖడ్గచాపధరాః=

అస్త్రములను, ధనుస్సులను ధరించినవారును, ఆశంసవః = రామాగమనమును ఘోషించువారును ఐన, శూరాః జనాః = శూరు లైన రాజభటులు, అస్య = రాముని యొక్క, అగ్రతః = ఎదుట, జగ్ముః = వెళ్లిరి.

తా. చందనాగురువులచే అలంకృతులై, కవచములను తొడిగి అస్త్రచాపములను ధరించి యున్న శూరులైన భటులు రాముని ఆగమనమును ఘోషించుచు అతని ఎదుట నడచి వెళ్లిరి. ౩౫

మూ. తతో వాదిత్రశబ్దాశ్చ స్తుతిశబ్దాశ్చ వన్దినామ్, ౩౬
సింహనాదాశ్చ శూరాణాం తథా శుశ్రువిరే పథి.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తదా = అపుడు, పథి = మార్గమునందు, వాదిత్రశబ్దాశ్చ = వాద్యధ్వనులు, వన్దినామ్ = వందిమాగధుల, స్తుతిశబ్దాశ్చ = స్తోత్రధ్వనులు, శూరాణామ్ = శూరులయొక్క, సింహనాదాశ్చ = సింహనాదములు, శుశ్రువిరే = వినబడినవి.

తా. ఆ సమయమున వాద్యధ్వనులు వందిమాగధుల స్తోత్రధ్వనులు శూరుల సింహనాదములు ఆ మార్గమునందు వ్యాపించినవి. ౩౬

మూ. హర్మ్యవాతాయనస్థాభిర్భూషితాభిః సమన్తతః, ౩౭
కీర్యమాణః సుపుష్పౌఘైర్యయౌ స్త్రీభిరరిందమః.

ప్ర. అ. అరిందమః = శత్రునాశకు డైన ఆ రాముడు, హర్మ్యవాతాయనస్థాభిః = మేడల వాతాయనములందు నిలబడిన, భూషితాభిః = అలంకరింపబడిన, స్త్రీభిః = స్త్రీలచేత, సమన్తతః = అంతటను, సుపుష్పౌఘైః = మంచి పుష్పసముదాయములచే, కీర్యమాణః = చల్లబడుచు, యయౌ = వెళ్ళెను.

తా. శత్రువినాశకు డగు ఆ రాముడు వెళ్ళుచున్నపుడు చక్కగా అలంకరించుకొనిన స్త్రీలు మేడల కిటికీల వద్ద నిలబడి నలువైపులనుండి అతనిపై మంచి పుష్పములను చల్లిరి. ౩౭

మూ. రామం సర్వానవద్యాఙ్గ్యో రామపిప్రీషయా తతః, ౩౮
వచోభిరగ్ర్యైర్హర్మ్యస్థాః క్షితిస్థాశ్చ వవన్దిరే.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, హర్మ్యస్థాః = మేడలందుయున్న, క్షితి స్థాశ్చ = భూమిపై నున్న, సర్వానవద్యాఙ్గ్యః = నిర్దుష్ట మైన సకల అవయవములు గల స్త్రీలు, రామప్రియేప్సయా = రాముని సంతోషింప చేయవలె నను కోరికతో, అగ్ర్యైః = శ్రేష్ఠ మైన, వచోభిః = మాటలతో, రామం = రాముని, వవన్దిరే = నమస్కరించిరి.

తా. మేడల పైనను, భూమి పైనను ఉన్న ఉత్తమ స్త్రీలు రామునకు ప్రీతిని కల్గించుటకై మంచి మాటలు పలుకుచు రాముని నమస్కరించిరి. (స్తుతించిరి). 38

మూ. నూనం నన్దతి తే మాతా కౌసల్యా మాతృనన్దన, 39
పశ్యన్తీ సిద్ధయాత్రం త్వాం పిత్ర్యం రాజ్యముపస్థితమ్.

ప్ర. అ. మాతృనన్దన = తల్లికి ఆనందము కల్గించువాడా! సిద్ధయాత్రం = సఫలం మైన యాత్ర కలవారవును, పిత్ర్యం రాజ్యమ్ = తండ్రికి సంబంధించిన రాజ్యమును, ఉపస్థితమ్ = పొందినవాడవు అైన, త్వామ్ = నిన్ను, పశ్యన్తీ = చూచు చున్నదై, తే = నీయొక్క, మాతా = తల్లి యైన, కౌసల్యా = కౌసల్య, నూనమ్ = తప్పక, నన్దతి = సంతోషించుచున్నది.

తా. తల్లికి ఆనందము కల్గించు ఓ రామా! సఫలం మైన యాత్ర కలిగి తండ్రి రాజ్యము పొందు నిన్ను చూచి నీ తల్లియైన కౌసల్య తప్పక ఆనందించును.

మూ. సర్వసీమన్తినీభ్యశ్చ సీతాం సీమన్తినీం వరామ్, 40
అమన్యన్త హి తా నార్యో రామస్య హృదయప్రియామ్.

ప్ర. అ. తాః = ఆ, నార్యః = స్త్రీలు, రామస్య = రామునియొక్క, హృదయప్రియామ్ = హృదయమునకు ప్రియురా లైన, సీతామ్ = సీతను, సర్వసీమన్తినీభ్యః = సకల స్త్రీలకంటె, వరామ్ = శ్రేష్ఠ మైన, సీమన్తినీమ్ = స్త్రీనిగా, అమన్యన్త హి = తలచిరి.

తా. రాముని హృదయప్రియురా లగు సీత సకలస్త్రీలలో ఉత్తమురా లని ఆ స్త్రీలు భావించిరి. 40

మూ. తయా సుచరితం దేవ్యా పురా నూనం మహత్తపః, 41
రోహిణీవ శశాఙ్కేన రామసంయోగమాప యా.

ప్ర. అ. యా=ఏ సీతాదేవి, శశాఙ్కేన = చంద్రునితో, రోహిణీ ఇవ = రోహిణి వలె, రామసంయోగమ్ = రామునితో సంబంధమును, అవ=పొందెనో, తయా = ఆట్టి, దేవ్యా=సీతాదేవిచేత, పురా=పూర్వము, నూనమ్ = తప్పక, మహత్ = గొప్ప, తపః=తపస్సు, సుచరితమ్ = బాగుగా చేయబడినది.

తా. రోహిణి చంద్రునితో కలిసి నట్లు రాముని భర్తగా పొందిన సీతాదేవి పూర్వము గొప్ప తపస్సు చేసి యున్నది. సందేహము లేదు. 41

మూ. ఇతి ప్రాసాదశృఙ్గేషు ప్రమదాభిర్నరోత్తమః, 42
శుశ్రావ రాజమార్గస్థః ప్రియా వాచ ఉదాహృతాః.

ప్ర. అ. రాజమార్గస్థః=రాజమార్గమునం దున్న, నరోత్తమః = నరశ్రేష్ఠుడైన, ఆ రాముడు, ఇతి=ఈ విధముగ, ప్రాసాదశృఙ్గేషు = ప్రాసాదశిఖరములం దున్న, ప్రమదాభిః = స్త్రీలచేత, ఉదాహృతాః = పలకబడిన, ప్రియాః వాచః = ప్రియ మైన వాక్యములను, శుశ్రావ = వినెను.

తా. ప్రాసాదశిఖరములు ఎక్కి యున్న స్త్రీలు పలికిన ఆ ప్రియవచనములను రాజమార్గమున వెళ్ళుచున్న శ్రీరాముడు వినెను. 42

మూ. స రాఘవస్తత్ర తదా ప్రలాపాన్
శుశ్రావ లోకస్య సమాగతస్య,
ఆత్మాధికారా వివిధాశ్చ వాచః
ప్రహృష్టరూపస్య పురే జనస్య. 43

ప్ర. అ. తదా = అపుడు, సః=ఆ, రాఘవః = రాముడు, తత్ర=అచట, సమాగతస్య = కలసిన, లోకస్య=లోకముయొక్క, ప్రలాపాన్ = మాటలను, శుశ్రావ = వినెను. ప్రహృష్టరూపస్య = చాల సంతసించిన, పురే జనస్య = పట్టణమునందలి జనముయొక్క, ఆత్మాధికారాః = తనకు సంబంధించిన, వివిధాః = అనేకవిధము లైన, వాచః చ = వాక్యములను కూడ, వినెను.

తా. అపుడు ఆ రాముడు అచట గుమిగూడిన జనుల మాటలను, మిక్కిలి సంతసించిన పౌరులు తనను గూర్చి చెప్పుకొనుచున్న అనేకవిధములగు వాక్యములను వినెను. 43

మూ. ఏష శ్రియం గచ్ఛతి రాఘవోఽద్య
రాజప్రసాదా ద్విపులాం గమిష్యన్,
ఏతే వయం సర్వసమృద్ధకామా
యేషామయం నో భవితా ప్రశాస్తా. 44

ప్ర. అ. రాజప్రసాదాత్ = దశరథుని అనుగ్రహమువలన, విపులామ్ = భూమిని, గమిష్యన్ = పొందనున్న, ఏషః = ఈ. రాఘవః = రాముడు, అద్య = ఇపుడు, శ్రియమ్ = ఐశ్వర్యమును, గచ్ఛతి = పొందనున్నాడు. యేషామ్ = యే. నః = మనకు, అయమ్ = ఇతడు, ప్రశాస్తా = పాలకుడుగా, భవితా = కానున్నాడో. ఏతే వయమ్ = అట్టి మనము, సర్వసమృద్ధకామాః = సమృద్ధ మైన సకల కామములు కలవారము.

తా. ఈ రాముడు నేడు రాజానుగ్రహమువలన ఈ భూమిని, రాజ్యలక్ష్మిని పొందనున్నాడు. ఇట్టి రాముడు మనకు పాలకుడు కానున్నాడు కాన మన కోరిక లన్నియు సఫలములు కానున్నవి. 44

మూ. లాభో జనస్యాస్య యదేష సర్వం
ప్రపత్స్యతే రాష్ట్రమిదం చిరాయ,
న హ్యప్రియం కించన జాతు కశ్చిత్
పశ్యేన్న దుఃఖం మనుజాధిపేఽస్మిన్. 45

ప్ర. అ. ఏషః = ఈ రాముడు, యత్ = ఎందువలన, సర్వమ్ = సమస్త మైన, ఇదం రాష్ట్రమ్ = ఈరాష్ట్రమును, చిరాయ = చిరాకాలము, ప్రపత్స్యతే = పొందనున్నాడో (అందువలన), అస్య జనస్య = ఈ జనమునకు, లాభః = గొప్ప లాభము. అస్మిన్ = ఈ రాముడు, మనుజాధిపే = రాజగుచుండగ, కశ్చిత్ = ఎవ్వడును, జాతు = ఎన్నడును, అప్రియమ్ = అప్రియ మైన, కించన = దేనిని, న పశ్యేత్ హి = చూడడు. దుఃఖమ్ = దుఃఖమును, న = చూడడు.

తా. ఈ రాముడు ఈ రాష్ట్రము నంతను చాలా కాలము పరిపాలింప నున్నా డనునది ప్రజలకు గొప్ప లాభము. ఇతడు రాజైనచో ఎవ్వడును, ఎన్న డును, అప్రియమును గాని, దుఃఖమును గాని చూడడు. 45

మూ. స ఘోషవద్భిశ్చ హయైః సనాగైః
పురస్సరైః స్వస్తికసూతమాగధైః,
మహీయమానః ప్రవరైశ్చ వాదకై
రభిష్టుతో వైశ్రవణో యథా యయౌ. 46

ప్ర. అ. సః=రాముడు, ఘోషవద్భిః=ధ్వనులు కల, సనాగైః= ఏనుగులతో కూడిన, హయైః=అశ్వములతో, పురస్సరైః=ముందు నడచుచున్న, స్వస్తిక సూతమాగధైః=స్వస్తి వాక్యములను పలుకు సూతమాగధులచే, మహీయమానః= పూజింపబడుచు, ప్రవరైః= శ్రేష్ఠ మైన, వాదకైః = వాద్యములు ప్రయోగించువారిచే, అభిష్టుతః= స్తుతింపబడుచు, వైశ్రవణో యథా=కుబేరుని వలె యయౌ=వెళ్ళెను.

తా. ముందు నడచుచున్న సూతులు, మాగధులు, స్వస్తివాక్యములు పలుకుచు, పూజించుచుండగా, శ్రేష్ఠ మైన వాద్యములను ప్రయోగించువారు స్తుతించుచుండగా, ఆ రాముడు ధ్వని చేయుచున్న గజహయములతో కూడి కుబేరుడు వలె, బయలుదేరి వెళ్ళెను. 46

మూ. కరేణుమాతఙ్గరథాశ్వసంకులం
మహాజనౌఘైః పరిపూర్ణచత్వరమ్,
ప్రభూతరత్నం బహుపణ్యసంచయం
దదర్శ రామో విమలం మహాపథమ్. 47

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షోడశః సర్గః.

ప్ర. అ. రామః=రాముడు, కరేణుమాతఙ్గరథాశ్వసంకులమ్ = ఆడ యేనుగులతో, ఏనుగులతో, రథములతో, అశ్వములతో కిక్కిరిసియున్నది, మహాజనౌఘైః= గొప్ప జనసముదాయములతో, పరిపూర్ణచత్వరమ్=నిండిన చతుష్పథములు కలది, ప్రభూతరత్నమ్=అధిక మైన రత్నములు కలది, బహుపణ్యసంచయమ్=అమ్మ జూపిన అనేక మైన వస్తువులు కలది, విమలమ్=

పరిశుద్ధ మైనది ఐన, మహాపథమ్ = విశాల మైన మార్గమును, దదర్శ = చూచెను.

తా. రాముడు అనేక మైన రత్నములు, వివిధము లైన అమ్మజూపిన వస్తువులు గల పరిశుద్ధముగ నున్న మహారాజమార్గమును చూచెను. అది ఏనుగుల తోను అశ్వములతోను కిక్కిరిసి యుండెను. అచట నున్న చతుష్పథములన్నియు (మధ్యప్రదేశములు) జనసముదాయములతో నిండి యుండెను. 47

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో పదునారవసర్గ సమాప్తము.

# అథ సప్తదశః సర్గః

*[ శ్రీరాముడు రాజమార్గపు శోభను చూచుచు, మిత్రుల వచనములు వినుచు తండ్రి యింట ప్రవేశించుట. ]*

మూ. స రామో రథమాస్థాయ సంప్రహృష్టసుహృజ్జనః,
పతాకాధ్వజసంపన్నం మహార్హాగురుధూపితమ్, 1
అపశ్యన్నగరం శ్రీమాన్ నానాజనసమన్వితమ్.

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడును, సంప్రహృష్టసుహృజ్జనః = సంతోషించినమిత్రులు కలవాడును ఐన, సః రామః = ఆ రాముడు, రథమ్ = రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, పతాకాధ్వజసంపన్నమ్ = పతాకలతోను (చిన్న జెండా) ధ్వజములతోనూ కూడినదీ, మహార్హాగురుధూపితమ్ = శ్రేష్ఠమైన అగరుధూపముచే సువాసనకలదిగా చేయబడినదీ, నానాజనసమన్వితం = అనేకవిధములైన జనులతో కూడినదీ, ఐన, నగరమ్ = నగరమును, అపశ్యత్ = చూచెను.

తా. సంతోషించుచున్న మిత్రులతో కూడిన శ్రీమంతుడైన ఆ రాముడు రథ మధిష్ఠించి, పతాకలతోను, ధ్వజములతోను, అలంకరింపబడినదీ, ఉత్తమమైన అగరువుచే ధూపము వేయబడినదీ చాలమంది జనులతో నిండినదీ యైన నగరమును చూచెను. 1

మూ. స గృహైరభ్రసఙ్కాశైః పాండురైరుపశోభితమ్, 2
రాజమార్గం యయౌ రామో మధ్యేనాగరుధూపితమ్.

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, అభ్రసఙ్కాశైః = మేఘముల వలె నున్న, పాణ్డురైః = తెల్లని, గృహైః = గృహములతో, ఉపశోభితమ్ = ప్రకాశించుచున్న, అగరుధూపితమ్ = అగురుధూపముగల, రాజమార్గం మధ్యేన = రాజమార్గము మధ్యయందు, యయౌ = వెళ్లెను.

తా. ఆ రాముడు అగరుధూపితమైన రాజమార్గము మధ్యనుండి ప్రయాణము చేసెను. ఆ రాజమార్గము మేఘముల వలె ఉన్నతములైన, తెల్లని భవనములతో ప్రకాశించుచుండెను. 2

మూ. చన్దనానాం చ ముఖ్యానామగురూణాం చ సంచయైః, 3
ఉత్తమానాం చ గన్ధానాం క్షౌమకౌశాంబరస్య చ,
అవిద్ధాభిశ్చ ముక్తాభిరుత్తమైః స్ఫాటికైరపి, 4
శోభమానమసమ్బాధం తం రాజపథముత్తమమ్,
సంవృతం వివిధైః పుష్పైర్భక్ష్యైరుచ్చావచైరపి. 5

ప్ర. అ. చన్దనానామ్ = చందనములయొక్క, ముఖ్యానామ్ = ఉత్తమమైన, అగురూణామ్ = అగురులయొక్క, ఉత్తమానామ్ = ఉత్తమమైన, గన్ధానాం = సుగంధద్రవ్యములయొక్క, క్షౌమకౌశాంబరస్య చ = తెల్లపట్టుబట్టలయొక్క పట్టుబట్టలయొక్క, సంచయైః = ప్రోగులతోను, అవిద్ధాభిః = రంధ్రము చేయని, ముక్తాభిః = ముత్యములతోను, ఉత్తమైః = శ్రేష్ఠమైన, స్ఫాటికైరపి = స్ఫటికమాణిక్యరచితములైన వస్తువులతోను, శోభమానమ్ = ప్రకాశించుచున్నదియు, అసంబాధమ్ = ఇరుకు లేనిదియు, వివిధైః = అనేకవిధములైన, పుష్పైః = పుష్పములతోను, ఉచ్చావచైః = అనేకవిధములైన, భక్ష్యైః = భక్ష్యములతోను, సంవృతమ్ = కూడిన, తమ్ = ఆ, ఉత్తమమ్ = ఉత్తమమైన, రాజపథమ్ = రాజమార్గమును (ప్రవేశించెను).

తా. రాముడు చందనములు, శ్రేష్ఠమైన అగురు, ఉత్తమమైన సుగంధద్రవ్యములు, తెల్లని పట్టువస్త్రములు, పట్టువస్త్రములు, వీటితో నిండినదీ, రంధ్రము చేయని ముత్యములు, ఉత్తమమైన స్ఫటికనిర్మిత వస్తువులు అనేకవిధములగు పుష్పములు భక్ష్యములు మొదలగువాటితో ప్రకాశించుచున్నదీ, విశాలముగనున్నదీ యైన ఆ ఉత్తమరాజమార్గమును ప్రవేశించెను. 3-5

మూ. దదర్శ తం రాజపథం దివి దేవపథం యథా,
దధ్యక్షతహవిర్లాజైర్ధూపైరగురుచందనైః, 6
నానామాల్యోపగంధైశ్చ సదాభ్యర్చితచత్వరమ్.

ప్ర అ. దివి = స్వర్గమునందు, దేవపథం యథా = దేవమార్గము వలె నున్నదీ, దధ్యక్షతహవిర్లాజైః = పెరుగులతోను, అక్షతలతోను, హవిస్సులతోను, లాజలతోను; ధూపైః = ధూపములతోను, అగురుచందనైః = అగురుచందన

ములతోను, నానామాల్యోపగంధైశ్చ = వివిధములగు మాలికలతోను, గంధ
ములతోను, సదా = ఎల్లపుడు, అభ్యర్చితచత్వరమ్ = పూజింపబడిన మధ్య
ప్రదేశములు గల, తం రాజపథమ్ = ఆ రాజమార్గమును, దదర్శ = చూచెను.

తా. రాముడు చూచిన ఆ రాజమార్గము స్వర్గమునందు దేవమార్గము వలె ఉండెను అక్కడ నున్న విశాలప్రదేశము లన్నియు పెరుగు, అక్షతలు, హవిస్సు, పేలాలు, ధూపములు, అగురు, చందనము, అనేకవిధము లగు మాల్యములు సుగంధద్రవ్యములు వీటితో సర్వదా పూజింపబడుచుండెను. 6

మూ. ఆశీర్వాదాన్ బహూన్ శృణ్వన్ సుహృద్భిః సముదీరితాన్,
యథార్హం చాపి సంపూజ్య సర్వానేవ నరాన్ యయౌ.

ప్ర. అ. సుహృద్భిః = స్నేహితులచేత, సముదీరితాన్ = పలుకబడిన, బహూన్ = అనేకమైన, ఆశీర్వాదాన్ = ఆశీర్వాదములను, శృణ్వన్ = వినుచు, సర్వానేవ = సమస్తమైన, నరాన్ = నరులను, యథార్హమ్ = తగు విధముగ, సంపూజ్య చ = సత్కరించి (గౌరవించి), యయౌ = వెళ్ళెను.

తా. స్నేహితులు పలుకుచున్న అనేక ఆశీర్వాదవాక్యములు వినుచు, అక్కడ నున్నవా రందరిని తగు విధమున గౌరవించుచు వెళ్లెను. 7

మూ. పితామహైరాచరితం తథైవ ప్రపితామహైః, 8
అద్యోపాదాయ తం మార్గమభిషిక్తోఽనుపాలయ.

ప్ర. అ. అద్య = నేడు. అభిషిక్తః = అభిషిక్తుడవై, పితామహైః = నీ పితామహులచేతను, తథైవ = అట్లే, ప్రపితామహైః = ప్రపితామహులచేతను, ఆచరితమ్ = సంచరింపబడిన, తం మార్గం = ఆ మార్గమును, ఉపాదాయ = గ్రహించి, అనుపాలయ = పాలింపుము.

తా. "నేడు రాజ్యాభిషిక్తుడవై నీ తాతలును, ముత్తాతలును అనుసరించిన మార్గమునే అనుసరించుచు రాజ్యమును పాలింపుము." 8

మూ. యథా స్మ పోషితాః పిత్రా యథా సర్వైః పితామహైః, 9
తతస్సుఖతరం రామే వత్స్యామః సతి రాజని.

ప్ర. అ. పిత్రా = తండ్రి యైన దశరథునిచేత, యథా = ఏ విధముగా, పోషితాః స్మ = పాలింపబడితిమో, సర్వైః = సమస్త మైన, పితామహైః = పితామహులచేత, యథా = ఏ విధముగా పాలింపబడితిమో, రామే = రాముడు, రాజని సతి = రాజు కాగా, తతః = అంతకంటే, సుఖతరమ్ = ఎక్కువ సుఖముగ, వత్స్యామః = నివసించెదము.

తా. "రాముడు రాజైనచో అతని తండ్రి పరిపాలించినప్పటికంటెను, అతని తాతలు పాలించినప్పటికంటెను, ఎక్కువ సుఖముగా ఉండగలము." 9

మూ. అలమద్య హి భుక్తేన పరమార్థైరలం చ నః, 10
యది పశ్యామ నిర్యాన్తం రామం రాజ్యే ప్రతిష్ఠితమ్.

ప్ర. అ. అద్య = నేడు, రాజ్యే = రాజ్యమునందు, ప్రతిష్ఠితమ్ = ప్రతిష్ఠింపబడినవాడై, నిర్యాన్తమ్ = ఊరేగుచున్న, రామమ్ = రాముని, పశ్యామ యది = మనము చూడగలిగినట్లైతే, భుక్తేన = భోజనముచేత, అలమ్ = చాలును, పరమార్థైః = ఇతర మైన పరమప్రయోజనములచేత కూడ, అలమ్ = చాలును.

తా. "మనము నేడు రాజ్యాభిషిక్తుడై ఊరేగుచున్న రాముని చూడగల్గినచో మనకు భోజనముతో గాని ఇతరకార్యముతో గాని పని లేదు." 10

మూ. తతో హి న ప్రియతరం నాన్యత్కించిద్భవిష్యతి, 11
యథాఽభిషేకో రామస్య రాజ్యేనామితతేజసః.

ప్ర. అ. అమితతేజసః = గొప్ప తేజస్సు గల, రామస్య = రామునియొక్క, రాజ్యేన = రాజ్యముచే, అభిషేకః = అభిషేకము, యథా = ఎంత ప్రియమో, తతః = దానికంటె, ప్రియతరమ్ = ఎక్కువ ప్రియ మైనది, అన్యత్ = ఇతర మైనది, కించిత్ = ఏదియు, నః = మనకు, న భవిష్యతి = కాజాలదు.

తా. "మనకు మహాతేజశ్శాలి యైన రాముని రాజ్యాభిషేకమునకు మించిన ప్రియ మేదియు ఉండదు." 11

మూ. ఏతాశ్చాన్యాశ్చ సుహృదాముదాసీనః శుభాః కథాః. 12
ఆత్మసంపూజనీః శృణ్వన్ యయౌ రామో మహాపథమ్.

ప్ర. అ. రామః=రాముడు, సుహృదామ్ = మిత్రులయొక్క, ఏతాః = ఈ, అన్యాశ్చ = ఇతరములును అగు, ఆత్మసంపూజనీః = తనను పూజించు, శుభాః = శుభ మైన, కథాః = కథలను, శృణ్వన్ = వినుచు, ఉదాసీనః = ఉదాసీనుడై, మహాపథమ్ = రాజమార్గమును, యయౌ = పొందెను.

తా. రాముడు తన మిత్రులు తనను ప్రశంసించుచు పలుకుచున్న ఈ మంచి మాటలను విన్నను సంతోషమును ప్రకటింపక రాజమార్గమునందు వెళ్ళెను. 12

మూ. న హి తస్మాన్మనః కశ్చిచ్చక్షుషీ వా నరోత్తమాత్, 13
నరః శక్నోత్యపాక్రష్టుమతిక్రాన్తేఽపి రాఘవే.

ప్ర. అ. రాఘవే = రాముడు, అతిక్రాన్తేఽపి = దూరముగా వెళ్ళిపోయినను, కశ్చిత్ నరః = ఏ మనుష్యుడును, తస్మాత్ = ఆ, నరోత్తమాత్ = నరశ్రేష్ఠుడైన రామునినుండి, మనః = మనస్సును, చక్షుషీ = నేత్రములను, అపాక్రష్టుమ్ = వెనుకకు తీసుకొనుటకు, న శక్నోతి హి = సమర్థుడు కాడు కదా!

తా. ఆ రాముడు దూర మైపోయినను ఏ ఒక్కడును, తన మనస్సును, దృష్టిని, ఆ నరశ్రేష్ఠునినుండి వెనుకకు మరలింపజాలక పోయెను. 13

మూ. యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి, 14
నిన్దితః సర్వలోకేషు స్వాత్మాప్యేనం విగర్హతే.

ప్ర. అ. యశ్చ = ఎవడు, రామమ్ = రాముని, న పశ్యేత్తు = చూడడో, (అతడును), యం చ = ఎవనిని, రామః = రాముడు, న పశ్యతి = చూడడో (అతడును), సర్వలోకేషు = సమస్తజనులయందు, నిన్దితః = నిందింపబడును. స్వాత్మాఽపి = తన మనస్సు కూడ, ఏనమ్ = వీనిని, విగర్హతే = నిందించును.

తా. రాముని చూడనివానిని, రామునిచే చూడబడనివానిని, లోకులందరును నిందింతురు. అతడు తనను తానే నిందించుకొనును. 14

మూ. సర్వేషు స హి ధర్మాత్మా వర్ణానాం కురుతే దయామ్, 15
చతుర్ణాం హి వయస్థానాం తేన తే తమనువ్రతాః.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆ రాముడు, చతుర్ణామ్ = నాలుగు, వర్ణానామ్ = వర్ణములకు సంబంధించిన, సర్వేషు = అందరియందును, వయస్థానామ్ = వయోవృద్ధులవిషయమునందును, దయామ్ = దయను, కురుతే = చేయును. తేన = ఆ కారణముచే, తే = వారు, తమ్ = ఆతనిని, అనువ్రతాః = అనుసరించి యుందురు.

తా. ధర్మాత్ముడైన ఆ రాముడు నాలుగు వర్ణములకు చెందిన సర్వజనులందును, వయోవృద్ధులందును, దయ చూపును. కావుననే వారందరు ఆతనిపై అంత ప్రేమ కలిగి యుండిరి. 15

మూ. చతుష్పథాన్ దేవపథాంశ్చైత్యాన్యాయతనాని చ, 16
ప్రదక్షిణం పరిహరన్ జగామ నృపతేస్సుతః.

ప్ర. అ. నృపతేః సుతః = రాజకుమారుడైన ఆ రాముడు, చతుష్పథాన్ = చతుష్పథములను, దేవపథాన్ = దేవమార్గములను, చైత్యాన్ = చైత్యములను, ఆయతనాని చ = దేవాలయములను, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణముగా, పరిహరన్ = దాటుచు, జగామ = వెళ్ళెను.

తా. ఆ రాముడు చతుష్పథములు, దేవాలయమార్గములు, చైత్యములు, దేవాలయములు, తనకు కుడి ప్రక్కకు వచ్చునట్లుగా, వాటిని దాటుచు వెళ్ళెను. 16

మూ. స రాజకులమాసాద్య మేఘసంఘోపమైః శుభైః, 17
ప్రాసాదశృఙ్గైర్వివిధైః కైలాసశిఖరోపమైః.
ఆవారయద్భి ర్గగనం విమానైరివ పాణ్డురైః, 18
వర్ధమానగృహైశ్చాపి రత్నజాలపరిష్కృతైః,
తత్పృథివ్యాం గృహవరం మహేన్ద్రసదనోపమమ్, 19
రాజపుత్రః పితుర్వేశ్మ ప్రవివేశ శ్రియా జ్వలన్.

ప్ర. అ. సః రాజపుత్రః = ఆ రాముడు, రాజకులమ్ = రాజకులమును, ఆసాద్య = సమీపించి, మేఘసంఘోపమైః = మేఘసంఘములతో సమాన మైన, శుభైః = మంగళకర మైన, కైలాసశిఖరోపమైః = కైలాసశిఖరమువలె నున్న, పాణ్డురైః = తెల్లని, విమానైరివ = విమానముల వలె, గగనమ్ = ఆకాశమును, అపారయద్భిః = కప్పుచున్న, వివిధైః = అనేకవిధము లైన, ప్రాసాదశృఙ్గైః = ప్రాసాదశిఖరములతోను, రత్నజాలపరిష్కృతైః = రత్నసముదాయముతో అలంకరింపబడిన, వర్ధమానగృహైశ్చాపి = వర్ధమానము లను రాజగృహముల తోను, పృథివ్యామ్ = భూలోకమునందున్న, మహేంద్రసదనోపమమ్ = మహేంద్రభవనముతో సమాన మైన, గృహవరమ్ = గృహశ్రేష్ఠ మైన, తత్ = ఆ, పితుః వేశ్మ = తండ్రియొక్క గృహమును, శ్రియా = కాంతితో, జ్వలన్ = ప్రజ్వలించుచు, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. రాముడు రాజకులమును ప్రవేశించి తేజస్సుతో ప్రజ్వలించుచు భూలోకమునం దున్న దేవేంద్రుని భవనము వలె, సర్వగృహశ్రేష్ఠ మైన తండ్రి గారి గృహములోనికి ప్రవేశించెను. ఆ గృహము చుట్టును, మేఘముల వలె, కైలాసశిఖరముల వలె, తెల్లని విమానముల వలె, ఆకాశమును అంటుచున్న అనేకవిధము లైన ప్రాసాదశృంగములును, రత్నాలంకృతము లైన రాజార్హము లైన వర్ధమానగృహములును ఉండెను. 17-19

మూ. స కక్ష్యా ధన్విభిర్గుప్తాస్తిస్రోఽతిక్రమ్య వాజిభిః, 20
పదాతిరపరే కక్ష్యే ద్వే జగామ నరోత్తమః.

ప్ర. అ. నరోత్తమః = నరశ్రేష్ఠు డైన, సః = రాముడు, ధన్విభిః = ధనుర్ధరులచేత, గుప్తాః = రక్షింపబడిన, తిస్రః కక్ష్యాః = మూడు కక్ష్యలను, వాజిభిః = గుర్రములచేత, అతిక్రమ్య = దాటి, అపరే = మిగిలిన, ద్వే కక్ష్యే = రెండు కక్ష్యలను, పదాతిః = పాదచారి యై, జగామ = పొందెను.

తా. ఆ నరశ్రేష్ఠుడు ధనుర్ధరులు రక్షించుచున్న మూడు కక్ష్యలను, రథముతో దాటి, మిగిలిన రెండు కక్ష్యలను పాదచారియై దాటి వెళ్ళెను. 20

మూ. స సర్వాః సమతిక్రమ్య కక్ష్యా దశరథాత్మజః, 21
సంనివర్త్య జనం సర్వం శుద్ధాన్తఃపురమభ్యగాత్.

ప్ర. అ. సః దశరథాత్మజః = ఆ రాముడు, సర్వాః = సమస్తమైన, కక్ష్యాః = కక్ష్యలను, సమతిక్రమ్య = దాటి, సర్వం జనమ్ = సకలజనులను, సంనివర్త్య = వెనుకకు పంపి, శుద్ధాన్తఃపురమ్ = అంతఃపురమును, అభ్యగాత్ = చేరెను.

తా. ఆ రాముడు ఆ వాకిళ్లన్నియు దాటి, తన పరివారమును వెనుకకు పంపివేసి అంతఃపురములో ప్రవేశించెను. 21

మూ. తస్మిన్ ప్రవిష్టే పితురన్తికం తదా,
జనః స సర్వో ముదితో నృపాత్మజే.
ప్రతీక్షతే తస్య పునః స్మ నిర్గమం,
యథోదయం చన్ద్రమసః సరిత్పతిః. 22

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తదశః సర్గః.

ప్ర. అ. తస్మిన్ = ఆ, నృపాత్మజే = రాజకుమారుడు, తదా = అప్పుడు, పితుః = తండ్రియొక్క, అన్తికమ్ = సమీపమును, ప్రవిష్టే = ప్రవేశించగా, సః = ఆ, సర్వః = సమస్తమైన, జనః = జనసముదాయము, ముదితః = సంతోషించినదై, సరిత్పతిః = సముద్రము, చన్ద్రమసః = చంద్రునియొక్క, ఉదయం యథా = ఉదయమును వలె, తస్య = అతనియొక్క, పునః నిర్గమమ్ = తిరిగి బయటకు వచ్చుటను, ప్రతీక్షతే స్మ = నిరీక్షించెను.

తా. అపుడు రాముడు తండ్రి దగ్గరకు వెళ్లగా అక్కడ ఉన్న వారందరు సంతోషించుచు, సముద్రుడు చంద్రోదయమునకై వేచి యున్నట్లు అతడు తిరిగి వచ్చుటకై వేచి యుండిరి. 22

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో పదునేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాదశః సర్గః

[*శ్రీరాముడు తన తండ్రి యేల చింతాక్రాంతు డయ్యెనని కైక నడుగుట. కైక కఠినచిత్తయై తాను కోరిన రెండువరములను గూర్చి తెలిపి, రాముని వనవాసమునకు ప్రేరించుట.*]

మూ. స దదర్శాసనే రామో నిషణ్ణం పితరం శుభే,
కైకేయీసహితం దీనం ముఖేన పరిశుష్యతా. 1

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, శుభే = మంగళకర మైన, ఆసనే = ఆసనమునందు, నిషణ్ణమ్ = కూర్చుని యున్న వాడును, కైకేయ్యా = కైకేయితో, సహితమ్ = కూడినవాడును, పరిశుష్యతా = ఎండిపోవుచున్న, ముఖేన = ముఖముతో, దీనమ్ = దీనుడును ఐన, పితరమ్ = తండ్రిని, దదర్శ = చూచెను.

తా. రాముడు మంగళకర మగు ఆసనముపై కూర్చొని యున్న తండ్రిని చూచెను. ఆతడు ఎండిన ముఖముతో, దీను డై యుండెను. ఆ ప్రక్కనే కైకేయి యుండెను. 1

మూ. స పితుశ్చరణౌ పూర్వమభివాద్య వినీతవత్,
తతో వవన్దే చరణౌ కైకేయ్యాః సుసమాహితః. 2

ప్ర. అ. సః = రాముడు, వినీతవత్ = వినయవంతు డై, సుసమాహితః = సావధానచిత్తు డై, పూర్వమ్ = ముందుగా, పితుః = తండ్రియొక్క, చరణౌ = పాదములను, అభివాద్య = నమస్కరించి, తతః = అటు పిమ్మట, కైకేయ్యాః = కైకేయియొక్క, చరణౌ = పాదములను, వవన్దే = నమస్కరించెను.

తా. రాముడు వినయవంతు డై సావధాన మగు చిత్తముతో ముందుగా తండ్రికి పాదాభివందనము చేసి పిదప కైకేయి పాదములకు నమస్కరించెను. 2

మూ. రామేత్యుక్త్వా తు వచనం బాష్పపర్యాకులేక్షణః,
శశాక నృపతిర్దీనో నేక్షితుం నాభిభాషితుమ్. 3

ప్ర. అ. నృపతిః = రాజు, రామ ఇతి = ఓ రామా! అని, వచనమ్ = మాటను, ఉక్త్వా = పలికి, బాష్పపర్యాకులేక్షణః = కన్నీటితో వ్యాకులం బైన నేత్రములు కలవాడై, దీనః = దీనుడై, ఈక్షితుమ్ = చూచుటకు, న శశాక = సమర్థుడు కాలేదు. అభిభాషితుమ్ = మాటలాడుటకును, న = సమర్థుడు కాలేదు.

తా. దశరథుడు "రామా!" అని ఒక్క మాట మాత్రము పలికి కన్నీరు నిండిన నేత్రములతో దీనుడై, చూచుటకు గాని, మరొక మాట పలుకుటకు గాని సమర్థుడు కాకపోయెను. 3

మూ. తదపూర్వం నరపతేర్దృష్ట్వా రూపం భయావహమ్,
రామోఽపి భయమాపన్నః పదా స్పృష్ట్వేవ పన్నగమ్. 4

ప్ర. అ. అపూర్వమ్ = పూర్వ మెన్నడు లేని, భయావహమ్ = భయంకర మైన, నరపతేః = రాజుయొక్క, తత్ రూపమ్ = ఆ రూపమును, దృష్ట్వా = చూచి, రామోఽపి = రాముడుకూడ, పన్నగమ్ = సర్పమును, పదా = పాదముతో, స్పృష్ట్వేవ = స్పృశించి వలె, భయమ్ ఆపన్నః = భయము పొందెను.

తా. పూర్వ మెన్నడు చూడని భయంకర మైన తండ్రి ఆకారము చూచి రాముడు కూడ పాము త్రొక్కినవాడు వలె భయపడెను. 4

మూ. ఇంద్రియైరప్రహృష్టైస్తం శోకసంతాపకర్శితమ్,
నిఃశ్వసన్తం మహారాజం వ్యథితాకులచేతసమ్, 5
ఊర్మిమాలినమక్షోభ్యం క్షుభ్యన్తమివ సాగరమ్,
ఉపప్లుతమివాదిత్యముక్తానృతమృషిం యథా. 6

ప్ర. అ. అప్రహృష్టైః = సంతోషము లేని, ఇంద్రియైః = ఇంద్రియములతో, శోకసంతాపకర్శితమ్ = దుఃఖసంతాపములతో కృశించినవానిని, వ్యథితాకులచేతసమ్ = వ్యథ చెంది వ్యాకుల మైన చిత్తముకలవానిని, నిఃశ్వసన్తమ్ =

నిట్టూర్చుచున్న వాడును, ఊర్మిమాలినమ్ = తరంగపంక్తులు కలదియు, అక్షోభ్యమ్ = క్షోభింప శక్యముకాని, క్షుభ్యన్తమ్ = క్షోభ చెందిన, సాగరమ్ ఇవ = సముద్రము వలె నున్న వాడును, ఉపప్లుతమ్ = గ్రహణము పట్టిన, ఆదిత్యమ్ ఇవ = సూర్యుని వలె నున్నవాడును, ఉక్తానృతమ్ = చెప్పబడిన అసత్యము గల, ఋషిం యథా = ఋషి వలె నున్న వాడును అగు, తం మహారాజమ్ = ఆ దశరథమహారాజును (చూచి భయపడెను.)

తా. ఆ దశరథమహారాజు సంతోషశూన్యము లైన ఇంద్రియములతో, శోకసంతాపములతో కృశించి, వ్యథ చెంది వ్యాకుల మైన చిత్తము కలవాడై, నిట్టూర్చుచుండెను. క్షోభింప శక్యము కాని సాగరము, క్షోభ చెంది, తరంగ పంక్తులతో వ్యాకులముగా నున్న ట్లుండెను. గ్రహణము పట్టిన సూర్యుని వలె, అసత్య మాడిన ఋషి వలె, తేజోవిహీను డై ఉండెను. అతనిని చూచి రాముడు కూడ భయపడెను. 5-6

మూ. అచిన్త్యకల్పం నృపతేస్తం శోకముపధారయన్,
బభూవ సంరబ్ధతరః సముద్ర ఇవ పర్వణి. 7

ప్ర. అ. అచిన్త్యకల్పమ్ = ఊహింపశక్యము గాని, నృపతేః = రాజు యొక్క, తం శోకమ్ = ఆ శోకమును గూర్చి, ఉపధారయన్ = ఊహించుకొనుచు, పర్వణి = పూర్ణిమయందు, సముద్ర ఇవ = సముద్రము వలె, సంరబ్ధతరః = మిక్కిలి క్షోభ చెందినవాడుగ, బభూవ = అయెను.

తా. రాజునకు కలిగిన ఊహింప శక్యము కాని ఆ శోకమును గూర్చి ఆలోచించుచు, పూర్ణిమ నాటి సముద్రము వలె, మిక్కిలి కలత చెందెను. 7

మూ. చిన్తయామాస చతురో రామః పితృహితే రతః,
కింస్విదద్యైవ నృపతిర్న మాం ప్రత్యభినన్దతి. 8

ప్ర. అ. పితృహితే = తండ్రియొక్క హితమునందు, రతః = ఆసక్తు డైన, చతురః = నేర్పు గల, రామః = రాముడు, చిన్తయామాస = ఆలోచించెను. అద్యైవ = నేడే, నృపతిః = రాజు, కిం స్విత్ = ఏకారణముచేతనో, మామ్ = నన్ను, న ప్రత్యభినన్దతి = సంతోషపూర్వకముగ పలుకరించుటలేదు.

తా. తండ్రి హితమును గోరు, బుద్ధిశాలి యగు రాముడు ఈ విధముగ చింతించెను. "ఎందుచేతనో తండ్రిగారు ఈనాడు, నన్ను సంతోష పూర్వకముగా పలుకరించుటలేదు" 8

మూ. అన్యదా మాం పితా దృష్ట్వా కుపితోఽపి ప్రసీదతి,
తస్య మామద్య సంప్రేక్ష్య కిమాయాసః ప్రవర్తతే. 9

ప్ర. అ. అన్యదా = ఇతర కాలములలో, పితా = తండ్రి, కుపితోఽపి = కోపముగా నున్నను, మామ్ = నన్ను, దృష్ట్వా = చూచి, ప్రసీదతి = ప్రసన్ను డగు చుండెడివాడు. తస్య = అట్టి తండ్రికి, అద్య = నేడు, మామ్ = నన్ను, సంప్రేక్ష్య = చూచి, కిం = ఎందువలన, ఆయాసః = దుఃఖము, ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది?

తా. "పూర్వము కోపముగా నున్నపుడు కూడ, నన్ను చూడగనే తండ్రి ప్రసన్ను డగుచుండెడివాడు. అట్టి తండ్రి ఈనాడు నన్ను చూచి ఎందుచే దుఃఖించుచున్నారో" 9

మూ. స దీన ఇవ శోకార్తో విషణ్ణవదనద్యుతిః,
కైకేయీమభివాద్యైవ రామో వచనమబ్రవీత్. 10

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, దీన ఇవ = దీనుడు వలె, శోకార్తః = శోక పీడితుడై, విషణ్ణవదనద్యుతిః = విషాదము చెందిన ముఖకాంతి కలవాడై, కైకేయీమ్ = కైకేయిని, అభివాద్యైవ = నమస్కరించి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు దీనుడై, శోకార్తుడై, ముఖకాంతి తగ్గి, కైకేయికి నమస్కరించి ఇట్లు పలికెను. 10

మూ. కచ్చిన్మయా నాపరాద్ధమజ్ఞానాద్యేన మే పితా,
కుపితస్తన్మమాచక్ష్వ త్వమేవైనం ప్రసాదయ. 11

ప్ర. అ. మయా = నాచేత, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, నాపరాద్ధం కచ్చిత్ = అపరాధ మేమియు చేయబడలేదు గదా? యేన = దేనిచేత, పితా = తండ్రి

మే = నా విషయమున, కుపితః = కోపగించెనో, తత్ = దానిని, మమ = నాకు, ఆచక్ష్వ = చెప్పుము. త్వమేవ = నీవే, ఏనమ్ = ఈతనిని, ప్రసాదయ = నాపై ప్రసన్నుని చేయుము.

తా. "నేను అజ్ఞానముచే అపరాధ మేదియు చేయలేదు కదా! తండ్రి నాపై ఎందుకు కోపించినాడో చెప్పుము. నీవే ఈయనకు నాపై అనుగ్రహము కలిగింపుము" 11

మూ. అప్రసన్నమనాః కిం ను సదా మాం ప్రతి వత్సలః,
వివర్ణవదనో దీనో న హి మామభిభాషతే. 12

ప్ర. అ. సదా = ఎల్లప్పుడును, మాం ప్రతి = నన్ను గూర్చి, వత్సలః = ప్రేమ గల, (నా తండ్రి), అప్రసన్నమనాః కిం ను = ఎందుచే అప్రసన్న మైన మనస్సు కలవాడు ఆయెను? వివర్ణవదనః = రంగు మారిన ముఖము కలవాడై, దీనః = దీనుడై, మామ్ = నన్నుగూర్చి, నాభిభాషతే హి = మాటలాడుటలేదు.

తా. "ఎల్లప్పుడు నా విషయమై వాత్సల్యము చూపు నా తండ్రికి నాపై కోపము వచ్చినదా. వాడిపోయిన ముఖముతో దీనుడై నాతో మాటలాడుటలేదు."

మూ. శారీరో మానసో వాపి కచ్చిదేనం న బాధతే,
సంతాపో వాఽభితాపో వా దుర్లభం హి సదా సుఖమ్ 13

ప్ర. అ. శారీరః = శరీరమునకు సంబంధించిన, సంతాపో వాఽపి = వ్యాధి కాని, మానసః = మనస్సునకు సంబంధించిన, అభితాపో వా = చింతగాని, ఏనమ్ = ఇతనిని, న బాధతే కచ్చిత్ = బాధించుట లేదు కదా। సదా = ఎల్లప్పుడును, సుఖమ్ = సుఖము, దుర్లభం హి = దుర్లభము కదా।

తా. "శారీరమైన వ్యాధి కాని, మానసిక మైన చింత కాని, ఈయనను బాధించుట లేదు కదా? సుఖ మనునది ఎల్లప్పుడును లభించదు కదా।" 13

మూ. కచ్చిన్న కించిద్భరతే కుమారే ప్రియదర్శనే,
శత్రుఘ్నే వా మహాసత్త్వే మాతౄణాం వా మమాశుభమ్

ప్ర. అ. ప్రియదర్శనే=ప్రియదర్శను డైన, భరతే=భరతుని విషయమున గాని, మహాసత్త్వే=గొప్ప బలము గల, శత్రుఘ్నే=శత్రుఘ్నుని విషయము నందు కాని, మమ=నాయొక్క, మాతౄణాం వా=తల్లుల విషయమున గాని, కించిత్=ఏదియు, అప్రియమ్=అప్రియము, న కచ్చిత్=జరగలేదు కదా।

తా. "చూచుటకు ఆనందమును కలిగించు కుమారుడైన భరతునికి గాని, మహాబలశాలి యైన శత్రుఘ్నునకు గాని, నా తల్లులకు గాని, అప్రియ మేదియు జరగలేదు కదా।" 14

మూ. అతోషయన్ మహారాజమకుర్వన్వా పితుర్వచః,
ముహూర్తమపి నేచ్ఛేయం జీవితుం కుపితే నృపే. 15

ప్ర. అ. మహారాజమ్=మహారాజైన తండ్రిని, అతోషయన్=సంతోష పెట్టని వాడనై, పితుః=తండ్రియొక్క, వచః=వచనమును, అకుర్వన్= చేయనివాడనై, నృపే కుపితే=తండ్రి కోపగించగా, ముహూర్తమపి= ముహూర్త కాల మైనను, జీవితుమ్=జీవించుటకు, నేచ్ఛేయమ్=కోరను.

తా. "మా తండ్రికి కోపము వచ్చినచో ఆయనను సంతోషపెట్టకుండా గాని, ఆయన ఆజ్ఞను పాలింపకుండ గాని, ముహూర్త మైనను జీవించవలె నను కోరిక నాకు లేదు". 15

మూ. యతోమూలం నరః పశ్యేత్ప్రాదుర్భావమిహాత్మనః,
కథం తస్మిన్న వర్తేత ప్రత్యక్షే సతి దైవతే. 16

ప్ర. అ. నరః=మానవుడు, ఇహ=ఈ లోకమున, ఆత్మనః= తనయొక్క, ప్రాదుర్భావమ్=జన్మను, యతోమూలమ్=ఎవ్వడు మూలము కల దానినిగా, పశ్యేత్=చూచునో, ప్రత్యక్షే=ప్రత్యక్ష మగు, దైవతే = దేవత యైన, తస్మిన్=అట్టి తండ్రి, సతి=ఉండగా, కథమ్=ఎట్లు, న వర్తేత = ప్రవర్తించడు.

తా. "మానవుడు ఇహలోకమున తన జన్మకు మూలకారణ మైన తండ్రి ప్రత్యక్షదేవతగా ఉండగా అతని విషయమున అట్లు ప్రవర్తించక ఎట్లుండగలడు"? 16

మూ. కచ్చిత్తే పరుషం కించిదభిమానాత్పితా మమ,
ఉక్తో భవత్యా కోపేన యేనాస్య లుళితం మనః. 17

ప్ర. అ. మమ పితా = నా తండ్రి, తే = నీయొక్క, అభిమానాత్ = అభిమానమువలన, భవత్యా = నీచేత, కోపేన = కోపముతో, పరుషమ్ = పరుష మైన, కించిత్ = ఏదైన వాక్యమును, కచ్చిత్ ఉక్తః = చెప్పబడినాడా? యేన = దేనిచే, అస్య = ఈతని, మనః = మనస్సు, లుళితమ్ = పీడింపబడినదో.

తా. "నీవు గర్వముతో కోపావిష్టురాల వై మా తండ్రి మనస్సు బాధ పడు నట్లు ఏమియు అనలేదు కదా?" 17

మూ. ఏతదాచక్ష్వ మే దేవి! తత్త్వేన పరిపృచ్ఛతః,
కింనిమిత్తమపూర్వోఽయం వికారో మనుజాధిపే. 18

ప్ర. అ. దేవి = ఓ దేవీ! పరిపృచ్ఛతః = ప్రశ్నించుచున్న, మే = నాకు, ఏతత్ = ఈ విషయమును, తత్త్వేన = యథార్థముగా, ఆచక్ష్వ = చెప్పుము. మనుజాధిపే = రాజునందు, అయమ్ = ఈ, అపూర్వః = క్రొత్త దైన, వికారః = వికారము, కింనిమిత్తమ్ = ఏ కారణమువలన వచ్చినది.

తా. "పూర్వ మెన్నడును లేని వికారము, మా తండ్రి యైన మహారాజునకు ఎందువలన వచ్చినదో అడుగుచున్నాను. యథార్థముగా చెప్పుము." 18

మూ. ఏవముక్తా తు కైకేయీ రాఘవేణ మహాత్మనా,
ఉవాచేదం సునిర్లజ్జా ధృష్టమాత్మహితం వచః. 19

ప్ర. అ. మహాత్మనా = మహాత్ము డైన, రాఘవేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడిన, కైకేయీ = కైకేయి, సునిర్లజ్జా = ఏ మాత్రము సిగ్గు లేనిదై, ధృష్టమ్ = ధార్ష్ట్యముతో కూడినది, ఆత్మహితమ్ = తనకు హితకరము అయిన, ఇదం వచః = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. మహాత్ము డైన రాము డిట్లు అడుగగా కైకేయి లజ్జ లేనిదై, తనకు లాభకర మైన మాటలను నిర్భయముగా పలికినది. 19

మూ. న రాజా కుపితో రామ వ్యసనం నాస్య కించన,
కించిన్మనోగతం త్వస్య త్వద్భయాన్నాభిభాషతే. 20

ప్ర. అ. రామ = రామా! రాజా = రాజు, న కుపితః = కోపగించలేదు. అస్య = ఈతనికి, కించన = కొంచె మైనను, వ్యసనమ్ = కష్టము, న = లేదు. తు = కాని, అస్య = ఈతనికి, కించిత్ = ఒకానొక విషయము, మనోగతమ్ = = మనస్సులో ఉన్నది. త్వద్భయాత్ = నీనుండి భయమువలన, నాభిభాషతే = చెప్పుటలేదు.

తా. రామా! రాజుకు కోపము రాలేదు. కష్ట మేదీ రాలేదు. కాని ఈ యన మనస్సులో ఉన్న ఒక విషయము నీకు భయపడి చెప్పజాలకున్నాడు. 20

మూ. ప్రియం త్వామప్రియం వక్తుం వాణీ నాస్యోపవర్తతే,
తదవశ్యం త్వయా కార్యం యదనేనాశ్రుతం మమ. 21

ప్ర. అ. ప్రియమ్ = ప్రియుడ వైన, త్వామ్ = నిన్ను గూర్చి, అప్రియమ్ = అప్రియమును, వక్తుమ్ = చెప్పుటకు, అస్య = ఈతని, వాణీ = వాక్కు, నోప వర్తతే = ప్రవర్తించుటలేదు. అనేన = ఈతనిచే, యత్ = ఏది, మమ = నాకు, ఆశ్రుతమ్ = ప్రతిజ్ఞ చేయబడినదో, తత్ = అది, త్వయా = నీచేత, అవశ్యమ్ = తప్పక, కార్యమ్ = చేయదగినది.

తా. ప్రియపుత్రుడ వైన నీకు ఒక అప్రియ విషయము చెప్పుటకు ఈయ నకు నోరు రాకున్నది. ఈయన నాకు మాట ఇచ్చి ఉన్నాడు. అది నీవు తప్పక చేయవలెను. 21

మూ. ఏష మహ్యం వరం దత్త్వా పురా మామభిపూజ్య చ,
స పశ్చాత్తప్యతే రాజా యథాన్యః ప్రాకృతస్తథా. 22

ప్ర. అ. సః = అట్టి, ఏషః రాజా = ఈ రాజు, పురా = పూర్వము, మామ్ = నన్ను, అభిపూజ్య చ = గౌరవించి, వరమ్ = వరమును, దత్త్వా = ఇచ్చి, అన్యః ఇతరు డైన, ప్రాకృతః = సామాన్యుడు, యథా = ఎట్లో, తథా = అట్లు, పశ్చా త్తప్యతే = పశ్చాత్తాపము చెందుచున్నాడు.

తా. మహారాజా నన్ను ఆదరించి, పూర్వము నా కొక వరము ఇచ్చి యున్నాడు. ఇప్పుడు ఒక సామాన్య మానవుడు వలె తానట్టు వరము ఇచ్చినందుకు పశ్చాత్తాపము చెందుచున్నాడు. 22

మూ. అతిసృజ్య దదానీతి వరం మమ విశాంపతిః,
స నిరర్థం గతజలే సేతుం బన్ధితుమిచ్ఛతి. 23

ప్ర. అ. సః విశాంపతిః = ఆ రాజు, దదాని ఇతి = ఇచ్చెదను అని, మమ = నాకు, వరమ్ = వరమును, అతిసృజ్య = ప్రతిజ్ఞ చేసి, గతజలే = పోయిన జలము గల ప్రదేశమునందు, సేతుమ్ = సేతువును, నిరర్థమ్ = వ్యర్థముగ, బన్ధితుమ్ = కట్టుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు.

తా. ఈ మహారాజు నాకు వర మిచ్చెద నని ప్రతిజ్ఞ చేసి ఇప్పుడు నీరు ప్రవహించి బైటకు వెళ్లిన చోట వ్యర్థముగా సేతువు కట్టవలె నని కోరుచున్నాడు.

మూ. ధర్మమూలమిదం రామ విదితం చ సతామపి,
తత్సత్యం న త్యజేద్రాజా కుపితస్త్వత్కృతే యథా. 24

ప్ర. అ. రామ = రామా, ఇదమ్ = ఈ సత్యము, ధర్మమూలమ్ = ధర్మమునకు మూలము. సతామపి = సత్పురుషులకు గూడ, విదితమ్ = ఈ విధముగ తెలియబడినది. కుపితః = కోపగించిన, రాజా = రాజు, తత్ సత్యమ్ = అట్టి సత్యమును, యథా = ఎట్లు, త్వత్కృతే = నిమిత్తమై, న త్యజేత్ = త్యజించకుండుగాక.

తా. రామా! సత్యము అన్ని ధర్మములకును మూల మని సత్పురుషు లందరును అంగీకరించిన విషయము. రాజు కోపగించి, నీ నిమిత్తమై అట్టి సత్యమును విడవకుండు నట్లు చూడుము. 24

మూ. యది తద్వక్ష్యతే రాజా శుభం వా యది వాఽశుభమ్,
కరిష్యసి తతః సర్వమాఖ్యాస్యామి పునస్త్వహమ్. 25

ప్ర. అ. శుభం వా = శుభ మైనను, అశుభం యది వా = అశుభ మైనను, తత్ = ఆ సత్యమును, రాజా = రాజు, వక్ష్యతే = (నీకు) చెప్పగలడు. కరిష్యసి

యది = నీవు దానిని చేసినచో, అహం పునస్తు = నేను, తతః = అటు పిమ్మట, సర్వమ్ = అంతయు, ఆఖ్యాస్యామి = చెప్పెదను.

తా. "రాజు చెప్పనున్నది నాకు ప్రియ మైనను అప్రియ మైనను నేను చేసెదను" అని నీ వన్నచో అది అంతా నీకు నేను చెప్పెదను. 25

మూ. యది త్వభిహితం రాజ్ఞా త్వయి తన్న విపత్స్యతే,
తతోఽహమభిధాస్యామి న హ్యేష త్వయి వక్ష్యతి. 26

ప్ర. అ. రాజ్ఞా = రాజుచేత, అభిహితమ్ = చెప్పబడిన, తత్ = అది, త్వయి = నీ యందు, న విపత్స్యతే = ఆపద చెంద కున్నచో (నిష్ఫలము కాకున్నచో); తతః = అప్పుడు, అహమ్ = నేను, అభిధాస్యామి = చెప్పెదను. ఏషః = ఈ రాజు, త్వయి = నీయందు (నీకు), న వక్ష్యతి హి = చెప్పడు కదా.

తా. రాజు చెప్పిన దానిని తప్పక మన్నించెద నని నీవు మాట ఇచ్చినచో ఆ విషయము నేనే చెప్పెదను. ఈయన స్వయముగా నీకు చెప్పజాలడు. 26

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా కైకేయ్యా సముదాహృతమ్,
ఉవాచ వ్యథితో రామస్తాం దేవీం నృపసన్నిధౌ. 27

ప్ర. అ. కైకేయ్యా = కైకేయిచేత, సముదాహృతమ్ = పలుకబడిన, ఏతత్ = ఈ, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, రామః = రాముడు, వ్యథితః = వ్యథ చెందినవాడై, నృపసన్నిధౌ = రాజుసమీపమున, తాం దేవీమ్ = ఆ దేవిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. కైకేయి మాటలు విన్న రాముడు మనస్సులో చాలా బాధపడుచు, రాజసమక్షమున ఆమెతో ఇట్లనెను. 27

మూ. అహో ధిఙ్నార్హసే దేవి వక్తుం మామీదృశం వచః,
అహం హి వచనాద్రాజ్ఞః పతేయమపి పావకే, 28
భక్షయేయం విషం తీక్ష్ణం మజ్జేయమపి చార్ణవే,
నియుక్తో గురుణా పిత్రా నృపేణ చ హితేన చ. 29

ప్ర. అ. దేవి = ఓ దేవీ! అహో = అయ్యో! ధిక్ = (నిందయగు గాక) చీ! మామ్ = నన్ను గూర్చి, ఈదృశమ్ = ఈవిధ మైన, వచః = వాక్యమును, వక్తుమ్ = పలుకుటకు, నార్హసి = తగవు. హి = ఎందువలన అనగా, అహమ్ = నేను, రాజ్ఞః = రాజుయొక్క, వచనాత్ = మాటవలన, పావకేఽపి = అగ్నిలో కూడా, పతేయమ్ = దుమికెదను. నృపేణ = రాజు, హితేన చ = నా హితము కోరువాడు అయిన, గురుణా = పూజ్యు డైన, పిత్రా = తండ్రిచేత, నియుక్తః = ఆజ్ఞాపించబడినవాడ నై, తీక్ష్ణమ్ = తీక్ష్ణ మైన, విషమ్ = విషమును, భక్షయేయమ్ = భక్షించెదను. అపి చ = మరియు, అర్ణవే = సముద్రము నందు, మజ్జేయమ్ = మునిగెదను.

తా. చీ! ఎంతకష్టము! దేవీ! నా విషయమున నీవు ఇట్లు మాట్లాడవద్దు. తండ్రిగారు చెప్పినచో నేను అగ్నిలో దుమికెదను. మహారాజు, పూజ్యుడు, నా హితము కోరువాడూ అయిన తండ్రి ఆజ్ఞాపించినచో భయంకర మైన విషమును తినెదను. సముద్రములో మునిగెదను. 28, 29

మూ. తద్బ్రూహి వచనం దేవి రాజ్ఞో యదభికాంక్షితమ్,
కరిష్యే ప్రతిజానే చ రామో ద్విర్నాభిభాషతే. 30

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, దేవి = ఓ దేవీ! రాజ్ఞః = రాజునకు, యత్ = ఏది, అభికాంక్షితమ్ = ఇష్టమో దానిని గూర్చి, వచనమ్ = వచనమును, బ్రూహి = చెప్పుము. కరిష్యే = చేయగలను. ప్రతిజానే చ = ప్రతిజ్ఞ కూడ చేయుచున్నాను. రామః = రాముడు, ద్విః = రెండు పర్యాయములు, నాభిభాషతే = పలుకడు.

తా. దేవీ! దశరథుని అభిలషిత మైన విషయము ఏదియో చెప్పుము. తప్పక చేసెదను. ప్రతిజ్ఞ చేయుచున్నాను. రామునివద్ద రెండు మాటలు లేవు. 30

మూ. తమార్జవసమాయుక్తమనార్యా సత్యవాదినమ్,
ఉవాచ రామం కైకేయీ వచనం భృశదారుణమ్. 31

ప్ర. అ. అనార్యా = దుష్టురా లైన, కైకేయీ = కైకేయి, ఆర్జవసమాయుక్తం = ఋజుస్వభావము కలవాడును, సత్యవాదినమ్ = సత్యము పలుకువాడును

అయిన, తం రామమ్ = ఆ రాముని గూర్చి, భృశదారుణమ్ = చాల దారుణ మైన, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. దుష్టురా లైన ఆ కైకేయి, ఋజుస్వభావము కలవాడు, సత్యవాదీ అయిన ఆ రామునితో చాల దారుణ మైన మాట పలికెను. 31

మూ. పురా దైవాసురే యుద్ధే పిత్రా తే మమ రాఘవ,
రక్షితేన వరౌ దత్తౌ సశల్యేన మహారణే. 32

ప్ర. అ. రాఘవ = రామా, పురా = పూర్వము, దైవాసురే యుద్ధే = దేవాసురుల మధ్య జరిగిన యుద్ధమునందు, మహారణే = గొప్ప రణమునందు, సశల్యేన = శత్రువుల బాణశల్యములు దూరి ఉన్న దేహము కలవాడూ, రక్షితేన = (నాచే) రక్షింపబడినవాడూ అయిన, తే పిత్రా = నీ తండ్రిచేత, మమ = నాకు, వరౌ = రెండు వరములు, దత్తౌ = ఇవ్వబడినవి.

తా. రామా! పూర్వము దేవాసురుల మధ్య జరిగిన మహారణమునందు నీ తండ్రి బాణశల్యములు గ్రుచ్చుకొని బాధపడుచుండగా నేను రక్షించితిని. అప్పు డాయన నాకు రెండు వరములు ఇచ్చినాడు. 32

మూ. తత్ర మే యాచితో రాజా భరతస్యాభిషేచనమ్,
గమనం దణ్డకారణ్యే తవ చాద్యైవ రాఘవ. 33

ప్ర. అ. రాఘవ = రామా! తత్ర = ఆ వరములకుసంబంధించి, రాజా = రాజు, భరతస్య = భరతునియొక్క, అభిషేచనమ్ = అభిషేకమును, అద్యైవ = ఇప్పుడే, దణ్డకారణ్యే = దండ కారణ్యమునందు (నకు), తవ = నీయొక్క, గమనమ్ = గమనమును, యాచితః = కోరబడినాడు.

తా. రామా! ఆ వరముల ప్రకారము, భరతుని రాజ్యాభిషిక్తుని చేయవలె ననీ, నీవు నేడే దండకారణ్యమునకు వెళ్ల వలె ననీ నేను రాజును కోరినాను. 33

మూ. యది సత్యప్రతిజ్ఞం త్వం పితరం కర్తుమిచ్ఛసి,
ఆత్మానం చ నరశ్రేష్ఠ మమ వాక్యమిదం శృణు. 34

ప్ర. అ. నరశ్రేష్ఠ = నరులలో శ్రేష్ఠుడ వైన ఓ రామా! త్వమ్=నీవు, పితరమ్ = తండ్రిని, ఆత్మానం చ=తనను (నిన్ను), సత్యప్రతిజ్ఞమ్=సత్య మైన ప్రతిజ్ఞకలవారినిగా, కర్తుమ్=చేయుటకు, ఇచ్ఛసి యది=ఇచ్ఛయించినచో, మమ=నాయొక్క, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, శృణు=వినుము.

తా. రామా! నీ తండ్రి మాటలను, నీ మాటలను నిలబెట్టుకొనవలె నన్నచో నే చెప్పినట్లు చేయుము. 34

మూ. సన్నిదేశే పితు స్తిష్ఠ యథా తేన ప్రతిశ్రుతమ్,
త్వయారణ్యం ప్రవేష్టవ్యం నవ వర్షాణి పఞ్చ చ. 35

ప్ర. అ. పితుః = తండ్రియొక్క, సన్నిదేశే = ఆజ్ఞ యందు, తిష్ఠ= ఉండుము. తేన=అతనిచే, యథా=ఎట్లు, ప్రతిశ్రుతమ్=ప్రతిజ్ఞ చేయబడి నదో; (ఆ విధముగ), త్వయా=నీచేత, నవ పంచ చ=పదునాలుగు, వర్షాణి=సంవ త్సరములు, అరణ్యమ్=అరణ్యము, ప్రవేష్టవ్యమ్=ప్రవేశింపదగినది.

తా. తండ్రి ఆజ్ఞ పాలింపుము. ఆయన ప్రతిజ్ఞ చేసిన ప్రకారము నీవు పదునాలుగు సంవత్సరములు అరణ్యములో ఉండవలెను. 35

మూ. భరత స్త్వభిషిచ్యేత యదేతదభిషేచనమ్,
త్వదర్థే విహితం రాజ్ఞా తేన సర్వేణ రాఘవ. 36

ప్ర. అ. రాఘవ = రామా! రాజ్ఞా=రాజుచేత, త్వదర్థే = నీ నిమిత్తమై, యత్ = ఏ, ఏతత్ = ఈ, అభిషేచనమ్ = అభిషేకసామగ్రి, విహితమ్ = ఏర్పరుపబడినదో, తేన సర్వేణ = ఆ సకలసామగ్రిచేత, భరతః = భరతుడు, అభిషిచ్యేత = అభిషేకముచేయబడవలెను.

తా. నీ కొరకై రాజు ఏర్పరచిన అభిషేకసామగ్రితో భరతునకు పట్టాభి షేకము జరుగవలెను. 36

మూ. సప్త సప్త చ వర్షాణి దణ్డకారణ్యమాశ్రితః,
అభిషేకమిమం త్యక్త్వా జటాజినధరో వస. 37

ప్ర. అ. ఇమమ్ అభిషేకమ్ = ఈ అభిషేకమును, త్యక్త్వా = విడచి, జటాజినధరః = జటాజినములను ధరించిన వాడవై, దణ్డకారణ్యమ్ ఆశ్రితః = దండకారణ్యమును ఆశ్రయించినవాడవై, సప్త సప్త చ వర్షాణి = పదునాలుగు సంవత్సరములు, వస = నివసించుము.

తా. నీవు ఈ అభిషేకము త్యజించి, జటాజినధారివై, పదునాలుగు సంవత్సరములు దండకారణ్యములో నివసించవలెను. ౩౭

మూ. భరతః కోసలపురే ప్రశాస్తు వసుధామిమామ్,
నానారత్నసమాకీర్ణాం సవాజిరథకుఞ్జరామ్. ౩౮.

ప్ర. అ. భరతః = భరతుడు, కోసలపురే = కోసలదేశ రాజధాని యైన ఈ అయోధ్యయందు, నానారత్నసమాకీర్ణామ్ = అనేక విధము లైన శ్రేష్ఠ వస్తువులతో కూడినదీ, సవాజిరథకుఞ్జరామ్ = అశ్వరథగజములతో నిండి యున్నదీ అయిన, ఇమాం వసుధామ్ = ఈ భూమిని, ప్రశాస్తు = పరిపాలించు గాక.

తా. భరతుడు అయోధ్యలో నివసించుచు, అనేక శ్రేష్ఠవస్తువులతోను, గజాశ్వరథాలతోను ప్రకాశించుచున్న ఈ రాజ్యమును పరిపాలించవలెను.

వి. "జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్నమితి కీర్త్యతే"- ఆ యా జాతులకు చెందిన వస్తువులలో ఏది శ్రేష్ఠమో అది రత్నము. ౩౮.

మూ. ఏతేన త్వాం నరేన్ద్రోఽయం కారుణ్యేన సమాప్లుతః,
శోకసంక్లిష్టవదనో న శక్నోతి నిరీక్షితుమ్. ౩౯

ప్ర. అ. ఏతేన = ఈ కారణముచేత, అయం నరేన్ద్రః = ఈ రాజు, కారుణ్యేన = జాలితో, సమాప్లుతః = నిండినవాడై, శోకసంక్లిష్టవదనః = శోకముతో వాడిపోయిన ముఖము కలవాడై, త్వామ్ = నిన్ను, నిరీక్షితుమ్ = చూచుటకు, న శక్నోతి = సమర్థుడు కాకున్నాడు.

తా. ఈ కారణముచేత నీపై జాలి గల ఈ దశరథమహారాజు, దుఃఖముతో ముఖము వాడిపోయి, నిన్ను చూడజాలకున్నాడు. ౩౯

మూ. ఏతత్కురు నరేన్ద్రస్య వచనం రఘునన్దన,
సత్యేన మహతా రామ తారయస్వ నరేశ్వరమ్. 40

ప్ర. అ. రఘునన్దన=రామా! నరేన్ద్రస్య=రాజుయొక్క. ఏతత్ వచనమ్ = ఈ వచనమును, కురు=చేయుము. రామ=రామా, మహతా = గొప్ప, సత్యేన = సత్యముచేత, నరేశ్వరమ్ = రాజును, తారయస్వ=తరింపచేయుము.

తా. రామా! రాజు చెప్పిన విధముగా చేసి, మీ తండ్రి సత్యపాలనము చేయు అవకాశము కల్పించి ఆయనను తరింపచేయుము. 40

మూ. ఇతీవ తస్యాం పరుషం వదన్త్యాం
న చైవ రామః ప్రవివేశ శోకమ్,
ప్రవివ్యథే చాపి మహానుభావో
రాజా తు పుత్రవ్యసనాభితప్తః. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టాదశః సర్గః.

ప్ర. అ. ఇతీవ = ఈ విధముగా, తస్యామ్ = ఆమె, పరుషమ్ = పరుషమైన వచనము, వదన్త్యామ్ = పలుకుచుండగా, రామః = రాముడు, శోకమ్ = దుఃఖమును, నచైవ ప్రవివేశ=ప్రవేశించనే లేదు. మహానుభావః = మహానుభావుడైన, రాజా తు = రాజైతే, పుత్రవ్యసనాభితప్తః=పుత్రునకు వచ్చిన వ్యసనముచే తపించబడిన వాడై, ప్రవివ్యథే = చాల బాధపడెను.

తా. ఆమె ఆ విధముగా పరుషవాక్యములు పలుకుచున్నను రామునకు ఏ మాత్రము దుఃఖము కలుగలేదు. కాని మహానుభావు డైన దశరథుడు మాత్రము పుత్రవ్యసనపీడితు డై చాల బాధపడెను. 41

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో పదునెనిమిదవ సర్గ సమాప్తము.

## అథ ఏకోనవింశః సర్గః

*[శ్రీరాముడు కైకతో మాటలాడి, వనవాసమునకు అంగీకరించుట. తన తల్లి కౌసల్య అనుమతి పొందుటకై వెడలుట.]*

మూ. తదప్రియమమిత్రఘ్నో వచనం మరణోపమమ్,
శ్రుత్వా న వివ్యథే రామః కైకేయీం చేదమబ్రవీత్. 1

ప్ర. అ. అమిత్రఘ్నః = శత్రువినాశకుడైన, రామః = రాముడు, అప్రియమ్=ప్రియము కానిదీ, మరణోపమమ్=మరణముతో సమానమైనదీ అయిన, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, న వివ్యథే = వ్యథ చెందలేదు. కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. శత్రుసంహారకుడైన ఆ రాముడు మరణశాసనము వంటి, అప్రియమైన ఆ మాటలు విని ఏ మాత్రము వ్యథ చెందక కైకేయితో ఇట్లనెను. 1

మూ. ఏవమస్తు గమిష్యామి వనం వస్తుమహం త్వితః,
జటాజినధరో రాజ్ఞః ప్రతిజ్ఞామనుపాలయన్. 2

ప్ర. అ. ఏవమ్ = ఇట్లే, అస్తు = అగుగాక. అహమ్ = నేను, రాజ్ఞః = రాజుయొక్క, ప్రతిజ్ఞామ్ = ప్రతిజ్ఞను, అనుపాలయన్=మన్నించుచు, జటాజినధరః = జటాజినములను ధరించినవాడనై, ఇతః = ఇక్కడినుండి, వనమ్ = వనమును గూర్చి, వస్తుమ్=నివసించుటకు, గమిష్యామి = వెళ్ళగలను.

తా. నీవు చెప్పినట్లే అగుగాక. నేను రాజు చేసిన ప్రతిజ్ఞ మన్నించి, ఇటనుండి వనమునకు వెళ్లి అచట జటాజినధారినై నివసించగలను. 2

మూ. ఇదం తు జ్ఞాతుమిచ్ఛామి కిమర్థం మాం మహీపతిః,
నాభినన్దతి దుర్ధర్షో యథాపురమరిన్దమః. 3

ప్ర. అ. దుర్ధర్షః = ఎదురింప శక్యము కానివాడూ, అరిన్దమః = శత్రు
సంహారకుడూ అయిన, మహీపతిః = రాజు, యథాపురమ్ = పూర్వమునందు
వలె, మామ్ = నన్ను, కిమర్థమ్ = ఎందువలన, నాభినన్దతి = అభినందించుట
లేదు? ఇదం తు = ఈ విషయమును, జ్ఞాతుమ్ = తెలుసుకొనుటకు, ఇచ్ఛామి =
కోరుచున్నాను.

తా. కాని, శత్రుసంహారకుడూ, ఎదిరింప శక్యముకానివాడూ అయిన
రాజు వెనుకటి వలె నన్నినాడు ఎందుచే అభినందించుటలేదో తెలుసుకొన గోరు
చున్నాను. 3

మూ. మన్యుర్న చ త్వయా కార్యో దేవి బ్రూమి తవాగ్రతః,
యాస్యామి భవ సుప్రీతా వనం చీరజటాధరః. 4

ప్ర. అ. దేవి = ఓ దేవీ! త్వయా = నీచేత, మన్యుః = దుఃఖము, న
కార్యః = చేయదగినది కాదు. తవ = నీయొక్క, అగ్రతః = ఎదుట, బ్రూమి =
చెప్పుచున్నాను. చీరజటాధరః = నారచీరలను జటలను ధరించినవాడనై,
వనమ్ = వనమును గూర్చి, యాస్యామి = వెళ్ళగలను. సుప్రీతా = బాగ సంతో
షించినదానవు, భవ = అగుము.

తా. దేవీ! నీ వేమాత్రము చింతింపకుము. నీ ఎదుటనే చెప్పుచున్నాను.
నారచీరలు, జటలు ధరించి అడవికి వెళ్ళెదను, సంతోషింపుము. 4

మూ. హితేన గురుణా పిత్రా కృతజ్ఞేన నృపేణ చ,
నియుజ్యమానో విస్రబ్ధః కిం న కుర్యామహం ప్రియమ్. 5

ప్ర. అ. హితేన = హితము కోరువాడూ, గురుణా = పూజ్యుడూ, కృత
జ్ఞేన = కృతజ్ఞుడూ, నృపేణ చ = రాజు కూడ అయిన, పిత్రా = తండ్రిచేత,
నియుజ్యమానః = ఆజ్ఞాపింపబడినవాడనై, అహమ్ = నేను, విస్రబ్ధః = విశ్వాస
వంతుడనై, ప్రియమ్ = అతనికి ప్రియముగు కార్యమును, న కుర్యాం కిమ్ =
చేయకుందునా?

తా. నా హితము కోరువాడూ, పూజ్యుడూ, కృతజ్ఞుడూ, అన్నింటిని మించి రాజుకూడ అయిన తండ్రి ఆజ్ఞాపింపగా, నేను విశ్వాసపూర్వకముగ అతనికి ప్రియ మగు కార్యము చేయకుందునా? 5

మూ. అలీకం మానసం త్వేకం హృదయం దహతీవ మే,
స్వయం యన్నాహ మాం రాజా భరతస్యాభిషేచనమ్. 6

ప్ర. అ. భరతస్య = భరతునియొక్క, అభిషేచనమ్ = అభిషేకమును గూర్చి, రాజా = రాజు, స్వయమ్ = స్వయముగా, మామ్ = నన్ను గూర్చి (నాతో), యత్ న ఆహ = చెప్పుటలేదను, ఏకమ్ = ఒక్క, మానసమ్ = మనోగత మైన, అలీకమ్ = దుఃఖము, మే = నాయొక్క హృదయమ్ = హృదయమును, దహతీవ = కాల్చివేయుచున్న ట్లున్నది.

తా. రాజు, భరతుని రాజ్యాభిషేకమును గూర్చి నాకు స్వయముగా చెప్ప లే దను మనోవ్యథ ఒక్కటే నా హృదయమును కాల్చివేయుచున్నది. 6

మూ. అహం హి సీతాం రాజ్యం చ ప్రాణానిష్టాన్ ధనాని చ,
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయాప్రచోదితః. 7

ప్ర. అ. అహమ్ = నేను, అప్రచోదితః = ప్రేరేపింపబడకుండగనే, హృష్టః = సంతోషించినవాడ నై, భ్రాత్రే = సోదరు డైన, భరతాయ = భరతునకు, సీతామ్ = సీతను, రాజ్యమ్ = రాజ్యమును, ప్రాణాన్ = ప్రాణములను, ఇష్టాన్ = ఇష్టజనులను, ధనాని చ = ధనములను, స్వయమ్ = స్వయముగా, దద్యామ్ = ఇచ్చెదను.

తా. నన్నెవ్వరును ప్రేరేపింప కున్నను నేనే స్వయముగ, సోదరు డైన భరతునకు (అతని కభిలాష యున్న దని తెలిసినచో) సీతను, రాజ్యమును, ప్రాణాలను, ఇష్టజనులను, ధనములను కూడ సంతోషపూర్వకముగా ఇచ్చి యుండెడి వాడను. 7

మూ. కిం పునర్మనుజేన్ద్రేణ స్వయం పిత్రా ప్రచోదితః,
తవ చ ప్రియకామార్థం ప్రతిజ్ఞామనుపాలయన్. 8

ప్ర. అ. పిత్రా = తండ్రి యైన, మనుజేన్ద్రేణ = రాజుచేత, స్వయమ్ = స్వయముగ, ప్రచోదితః = ప్రేరేపింపబడినవాడవై, తవ = నీయొక్క, ప్రియకామార్థమ్ = ప్రియ మైన కోరికకొరకై, ప్రతిజ్ఞామ్ = (తండ్రిచేసిన) ప్రతిజ్ఞను, అనుపాలయన్ = పాలించుచు, కిం పునః = (నే నిచ్చెద నని) చెప్పవలెనా?

తా. తండ్రి యైన దశరథమహారాజు స్వయముగ కోరుచుండగా నీ ప్రియ మగు కోరికను తీర్చుటకై తండ్రి చేసిన ప్రతిజ్ఞను మన్నించుచు నేను సర్వస్వమును భరతున కీయగల నని వేరుగా చెప్పవలెనా? ౮

మూ. తదాశ్వాసయ హీమం త్వం కిం న్విదం యన్మహీపతిః,
వసుధాసక్తనయనో మన్దమశ్రూణి ముఞ్చతి. ౯

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, ఇమమ్ = ఈయనను, ఆశ్వాసయ = ఓదార్చుము. మహీపతిః = రాజు, వసుధాసక్తనయనః = నేలపై ప్రసరింపబడిన నేత్రములు కలవాడై, మన్దమ్ = మందముగా, అశ్రూణి = కన్నీళ్లను, ముఞ్చతి ఇతి యత్ = విడచుచున్నాడు అను, ఇదమ్ = ఇది, కిం ను = ఎందు చేతనో?

తా. అందుచే నీవు ఈయనను ఓదార్చుము. ఏమి ఇది— మహారాజు నేల వైపుచూచుచు మెల్ల మెల్లగా కన్నీళ్లు కార్చుచున్నాడు? ౯

మూ. గచ్ఛన్తు చైవానయితుం దూతాః శీఘ్రజవైర్హయైః,
భరతం మాతులకులాదద్యైవ నృపశాసనాత్. 10

ప్ర. అ. నృపశాసనాత్ = రాజాజ్ఞవలన, మాతులకులాత్ = మేనమామ ఇంటినుండి, భరతమ్ = భరతుని, ఆనయితుమ్ = తీసికొనివచ్చుటకు, దూతాః = దూతలు, శీఘ్రజవైః = శీఘ్రవేగము గల, హయైః = గుఱ్ఱములతో, అద్యైవ = ఇప్పుడే, గచ్ఛన్తు = వెళ్లెదరుగాక.

తా. రాజాజ్ఞ ప్రకారము మేనమామ ఇంటినుండి భరతుని తీసికొని వచ్చుటకై, దూతలు, ఇప్పుడే, వేగము గల గుఱ్ఱములపై బయలుదేరి వెళ్లుదురుగాక. 10

మూ. దణ్డకారణ్యమేషోఽహమితో గచ్ఛామి సత్వరః,
అవిచార్య పితుర్వాక్యం సమా వస్తుం చతుర్దశ. 11

ప్ర. అ. ఏషః అహమ్=ఈ నేను, పితుః=తండ్రియొక్క, వాక్యమ్=వాక్యమును గూర్చి, అవిచార్య=ఆలోచించకుండగనే, సత్వరః = తొందరతో కూడినవాడనై, చతుర్దశ=పదనాలుగు, సమాః=సంవత్సరములను, వస్తుమ్=నివసించుటకు, ఇతః=ఇచటనుండి, దండకారణ్యమ్=దండకారణ్యమును గూర్చి గచ్ఛామి=వెళ్లెదను.

తా. నేను తండ్రి మాటలలోని, యుక్తాయుక్తత్వవిచారణ చేయక, పదునాలుగు సంవత్సరముల పాటు దండకారణ్యములో నివసించుటకై వెంటనే వెళ్లిపోయెదను. 11

మూ. సా హృష్టా తస్య తద్వాక్యం శ్రుత్వా రామస్య కైకయీ,
ప్రస్థానం శ్రద్దధానా హి త్వరయామాస రాఘవమ్. 12

ప్ర. అ. సా కైకయీ = ఆ కైకేయి, తస్య రామస్య = ఆ రాముని యొక్క, తత్ వాక్యమ్=ఆ వాక్యమును, శ్రుత్వా=విని, హృష్టా=సంతోషించినదై, ప్రస్థానమ్=ఆతని ప్రయాణమును, శ్రద్దధానా=నమ్ముచున్నదై, రాఘవమ్=రాముని, త్వరయామాస=తొందరపెట్టెను.

తా. రాముని వాక్యము విన్న కైకేయి, అతడు తప్పక వెళ్లగలడని తెలుసుకొని, సంతోషించి, అతనిని తొందరపెట్టెను. 12

మూ. ఏవం భవతు యాస్యన్తి దూతాః శీఘ్రజవైర్హయైః,
భరతం మాతులకులాదుపావర్తయితుం నరాః. 13

ప్ర. అ. ఏవం=ఇట్లే, భవతు=అగుగాక. మాతులకులాత్=మేనమామ గృహమునుండి, భరతమ్ = భరతుని, ఉపావర్తయితుమ్ = తిరిగి తీసుకొని వచ్చుటకు, దూతాః=దూతలైన, నరాః=మనుష్యులు, శీఘ్రజవైః=శీఘ్రమైన వేగము గల, హయైః=గుఱ్ఱములచే, యాస్యన్తి=వెళ్లగలరు.

తా. నీవు చెప్పినట్లే అగుగాక! భరతుని, మేనమామ ఇంటినుండి తీసుకొనివచ్చుటకై దూతలు మహావేగము గల అశ్వములపై వెళ్లెదరు. 13

మూ. తవ త్వహం క్షమం మన్యే నోత్సుకస్య విలంబనమ్,
రామ! తస్మాదితః శీఘ్రం వనం త్వం గన్తుమర్హసి. 14

ప్ర. అ. తు=కాని, ఉత్సుకస్య = అడవికి వెళ్లుటకు ఆసక్తి గల, తవ= నీయొక్క, విలంబనమ్=ఆలస్యము చేయుటను, క్షమమ్ = తగిన దానినిగా, అహమ్ = నేను, న మన్యే = తలపను. రామ = ఓ రామా! తస్మాత్ = ఆ కారణమువలన, త్వమ్ = నీవు, ఇతః = ఇచటినుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, వనమ్ = వనమును గూర్చి, గన్తుమ్=వెళ్లుటకు, అర్హసి=తగియున్నావు.

తా. కాని వనమునకు పోవుటకు ఉత్సాహము గల నీవు ఆలస్యము చేయుట యుక్తము కా దని నా అభిప్రాయము. అందుచే వెంటనే నీవు అరణ్యమునకు వెళ్ళుము. 14

మూ. వ్రీడాన్వితః స్వయం యచ్చ నృపస్త్వాం నాభిభాషతే,
నైతత్కించిన్నరశ్రేష్ఠ మన్యురేషోఽపనీయతామ్. 15

ప్ర. అ. నరశ్రేష్ఠ=ఓ రామా! వ్రీడాన్వితః=సిగ్గుతో కూడిన, నృపః= రాజు, స్వయమ్ = స్వయముగా, త్వామ్ = నిన్ను, యత్ నాభిభాషతే = పలకరించుటలేదు అను, ఏతత్ = ఇది, న కించిత్ = ఏమియు కాదు. ఏషః = ఈ, మన్యుః = దుఃఖము, అపనీయతామ్ = తొలగింపబడుగాక!

తా. రాజు సిగ్గుచే, స్వయముగా నీతో చెప్పజాల కున్నాడు అనునది అంత ప్రధానవిషయము కాదు. నరశ్రేష్ఠుడ వైన ఓ రామా దీనికి నీవు విచారించవద్దు. 15

మూ. యావత్త్వం న వనం యాతః పురాదస్మాదభిత్వరన్,
పితా తావన్న తే రామ స్నాస్యతే భోక్ష్యతేఽపి వా. 16

ప్ర. అ. రామ = ఓ రామా! త్వమ్ = నీవు, అభిత్వరన్ = తొందర పడుచు, అస్మాత్ = ఈ, పురాత్ = పట్టణమునుండి, యావత్ = ఎంతవరకు,

వనమ్ = వనమును, గూర్చి, న యాతః = వెళ్లవో, తావత్ = అంతవరకు, తే పితా = నీ తండ్రి, న స్నాస్యతే = స్నానము చేయడు; భోక్ష్యతేపి వా = భోజనము చేయడు.

తా. రామా! నీవు శీఘ్రముగా, ఈ పట్టణము విడిచి అడవికి పోనంత వరకు నీ తండ్రి స్నానము కాని, భోజనము కాని చేయడు. 16

మూ. ధిక్ కష్టమితి నిఃశ్వస్య రాజా శోకపరిప్లుతః,
మూర్ఛితో న్యపతత్తస్మిన్ పర్యఙ్కే హేమభూషితే. 17

ప్ర. అ. రాజా = రాజు, ధిక్ = ఛీ, కష్టమ్ = ఎంత కష్టము; ఇతి = అని, నిఃశ్వస్య = నిట్టూర్చి, శోకపరిప్లుతః = శోకముతో నిండినవాడై, మూర్ఛితః = మూర్ఛ చెందినవాడై, హేమభూషితే = బంగారముతో అలంకరింపబడిన, తస్మిన్ పర్యఙ్కే = ఆ పర్యంకమునందు, న్యపతత్ = పడెను.

తా. ఈ మాటలు విన్న రాజు, "ఛీ ఎంత కష్టము వచ్చినది" అని పలుకుచు, శోకాక్రాంతుడై మూర్ఛ చెంది ఆ సువర్ణమయమైన, పర్యంకముపై పడిపోయెను. 17

మూ. రామోఽప్యుత్థాప్య రాజానం కైకేయ్యాభిప్రచోదితః,
కశయేవాహతో వాజీ వనం గన్తుం కృతత్వరః.

ప్ర. అ. కైకేయ్యా = కైకచేత, అభిప్రచోదితః = ప్రేరేపింపబడిన, రామోఽపి = రాముడు, రాజానమ్ = రాజును, ఉత్థాప్య = లేవదీసి, కశయా = కొరడాతో, ఆహతః = కొట్టబడిన, వాజీవ = గుఱ్ఱము వలె, వనమ్ = వనమును గూర్చి, గన్తుమ్ = వెళ్ళుటకు, కృతత్వరః = చేయబడిన తొందర గలవాడు (అయెను).

తా. రాముడు ఆ రాజును లేవదీసి, కొరడాతో గుఱ్ఱమును కొట్టినట్లు, కైకేయి మరల ప్రేరేపింపగా, వెంటనే అడవికి పోవుటకు తొందరపడెను. 18

మూ. తదప్రియమనార్యాయా వచనం దారుణోదయమ్,
శ్రుత్వా గతవ్యథో రామః కైకేయీం వాక్యమబ్రవీత్. 19

ప్ర. అ. రామః = రాముడు, అనార్యాయాః = దుష్టురాలైన ఆమెయొక్క, దారుణోదయమ్ = భయంకర మైన ఫలము గల, అప్రియమ్ = అప్రియ మైన, తత్ వచనమ్ = ఆ వచనమును, శ్రుత్వా = విని, గతవ్యథః = వ్యథలేని వాడై, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. భయంకర మగు ఫలము గల అప్రియ మైన ఆ దుష్టురాలి వాక్యము విన్న రాముడు ఏమియు వ్యథ చెందక ఆమెతో ఇట్లనెను. 19

మూ. నాహమర్థపరో దేవి లోకమావస్తుముత్సహే,
విద్ధి మామృషిభిస్తుల్యం కేవలం ధర్మమాస్థితమ్. 20

ప్ర. అ. దేవి = ఓ దేవీ, అహమ్ = నేను, అర్థపరః = ధనమునందు ఆసక్తి కలవాడను, న = కాను. లోకమ్ = లోకమును, ఆ వస్తుమ్ = అధిష్ఠించుటకు (లోక మర్యాద పాటించుటకు), ఉత్సహే = కోరుచున్నాను. కేవలమ్ = కేవలము, ధర్మమ్ = ధర్మమును, ఆస్థితమ్ = అవలంబించియున్న, మామ్ = నన్ను, ఋషిభిః = ఋషులతో, తుల్యమ్ = సమానునిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. దేవీ! నేను ధనప్రధానుడను కాను. లోక మర్యాదను అనుసరించవలె నని మాత్రమే కోరుచున్నాను. కేవలము ధర్మమును అవలంబించిన నేను ఋషితుల్యుడ నని తెలుసుకొనుము. 20

మూ. యదత్రభవతః కించిచ్ఛక్యం కర్తుం ప్రియం మయా,
ప్రాణానపి పరిత్యజ్య సర్వథా కృతమేవ తత్. 21

ప్ర. అ. మయా = నాచేత, అత్రభవతః = పూజ్యు డైన నా తండ్రికి, కించిత్ = ఏదైన, యత్ ప్రియమ్ = ఏ ప్రియకార్యము, కర్తుమ్ = చేయుటకు, శక్యమ్ = శక్యమో, తత్ = అది, ప్రాణాన్ = ప్రాణములను, పరిత్యజ్యాపి = విడిచి యైనను, సర్వథా = అన్ని విధముల, కృతమేవ = చేయబడినదే.

తా. పూజ్యు డైన మా తండ్రికి ప్రియమైన యే పని యైనను నేను చేయవలసి యున్నచో దానిని ప్రాణములు విడిచి యైనను చేసినట్లే తెలిసికొనుము. 21

మూ. న హ్యతో ధర్మచరణం కించిదస్తి మహత్తరమ్,
యథా పితరి శుశ్రూషా తస్య వా వచనక్రియా. 22

ప్ర. అ. పితరి=తండ్రియందు, శుశ్రూషా=సేవ గాని, తస్య=అతని యొక్క, వచనక్రియా వా=ఆజ్ఞను నిర్వర్తించుట గాని, యథా=ఎట్లో, అతః=దీనికంటె, మహత్తరమ్=గొప్పదైన, ధర్మచరణమ్=ధర్మానుష్ఠానము, కించిత్=ఏదియు, నాస్తి హి=లేదు కదా.

తా. తండ్రికి శుశ్రూష చేయుటను, ఆయన ఆజ్ఞను పాలించుటను మించిన ధర్మాచరణ మేదియు లేదు కదా. 22

మూ. అనుక్తోఽప్యత్రభవతా భవత్యా వచనాదహమ్,
వనే వత్స్యామి విజనే వర్షాణీహ చతుర్దశ. 23

ప్ర. అ. అహమ్=నేను, అత్రభవతా=పూజ్యుడగు ఈయనచే, అనుక్తోఽపి=చెప్పబడకున్నను, భవత్యాః=నీ యొక్క, వచనాత్=మాటవలన. ఇహ=ఇపుడు, చతుర్దశ వర్షాణి=పదునాలుగు సంవత్సరములు, విజనే=జనశూన్య మైన, వనే=వనమునందు, వత్స్యామి=నివసించగలను.

తా. పూజ్యు డైన మా తండ్రిగారు చెప్పకున్నను, నీ వచనము ప్రకారము పదునాలుగు సంవత్సరములు జనశూన్యమైన అరణ్యములో నివసించెదను. 23

మూ. న నూనం మయి కైకేయి కించిదాశంససే గుణమ్,
యద్రాజానమవోచస్త్వం మమేశ్వరతరా సతీ. 24

ప్ర. అ. కైకేయి=ఓ కైకేయీ, త్వమ్=నీవు, మమ=నా విషయమున ఈశ్వరతరా సతీ=అధిక మైన అధికారము కలదానివై యుండి గూడ, రాజానమ్=రాజును గూర్చి, యత్ అవోచః=ఏ కారణమున పలికితివో, (ఆ కారణము వలన) మయి=నాయందు, కించిత్=కొంచె మైనను, గుణమ్=గుణమును, న ఆశంససే=చూచుటలేదు. నూనమ్=నిశ్చయము.

తా. నాపై అధికారము కలదానివై యుండి కూడ నీవు భరతరాజ్యాభిషేక విషయమున నాతో చెప్పక దశరథునితో చెప్పియున్నావు. దీనిని బట్టి నీకు నా గుణములపై నమ్మకము లేదని తెలియుచున్నది. నిశ్చయము. 24

మూ. యావన్మాతరమాపృచ్ఛే సీతాంచానునయామ్యహమ్,
తతోఽద్యైవ గమిష్యామి దణ్డకానాం మహద్వనమ్. 25

ప్ర. అ. మాతరమ్=తల్లిని, యావత్ ఆపృచ్ఛే=వీడ్కోలు చెప్పెదను. సీతాం చ=సీతను గూడ, అహమ్=నేను, అనునయామి=ఊరడించెదను. తతః=అటుపిమ్మట, అద్యైవ=నేడే, మహత్=గొప్పదైన, దణ్డకానాం వనమ్=దండకారణ్యమును గూర్చి, గమిష్యామి=వెళ్ళెదను.

తా. నేను మా తల్లికి వీడ్కోలు చెప్పి, సీతను ఊరడించి, నేడే దండకారణ్యమునకు వెళ్ళెదను. 25

మూ. భరతః పాలయే ద్రాజ్యం శుశ్రూషేచ్చ పితుర్యథా,
తథా భవత్యా కర్తవ్యం స హి ధర్మః సనాతనః. 26

ప్ర. అ. భరతః=భరతుడు, యథా=ఎట్లు, రాజ్యమ్=రాజ్యమును, పాలయేత్=పాలించునో, పితుః=తండ్రికి, శుశ్రూషేచ్చ=శుశ్రూషచేయునో, తథా=అట్లు, భవత్యా=నీచేత, కర్తవ్యమ్=చేయదగినది. సః=అది, సనాతనః=అతిప్రాచీనమైన, ధర్మః హి=ధర్మము కదా.

తా. భరతుడు రాజ్యమును పాలించుచు తండ్రికి శుశ్రూష చేయునట్లు నీవు చేయవలెను. అది సనాతనమైన ధర్మము కదా. 26

మూ. స రామస్య వచః శ్రుత్వా భృశం దుఃఖహతః పితా,
శోకాదశక్నువన్ వక్తుం ప్రరురోద మహాస్వనమ్. 27

ప్ర. అ. రామస్య=రామునియొక్క, వచః=మాటను, శ్రుత్వా=విని, పితా=తండ్రియైన, సః=ఆ దశరథుడు, భృశమ్=మిక్కిలి, దుఃఖహతః=దుఃఖముచే కొట్టబడినవాడై, శోకాత్=శోకమువలన, వక్తుమ్=మాటలాడుటకు, అశక్నువన్=అసమర్థుడై, మహాస్వనమ్=గొప్ప ధ్వని కలుగునట్లుగా, ప్రరురోద=ఏడ్చెను.

తా. రాముని మాటలు విన్న దశరథుడు, మిక్కిలి దుఃఖపీడితుడై, ఏమియు మాటలాడ జాలక బిగ్గరగా ఏడ్చెను. 27

మూ. వన్దిత్వా చరణౌ రామో విసంజ్ఞస్య పితు స్తథా,
కైకేయ్యాశ్చాప్యనార్యాయాః నిష్పపాత మహాద్యుతిః. 28

ప్ర. అ. మహాద్యుతిః = గొప్ప కాంతి కల, రామః = రాముడు, విసంజ్ఞస్య = మూర్ఛితు డైన, పితుః = తండ్రియొక్క, చరణౌ = పాదములను, తథా = మరియు, అనార్యాయాః = దుష్టురా లైన, కైకేయ్యాశ్చాపి = కైకేయియొక్క పాదములను, వన్దిత్వా = నమస్కరించి, నిష్పపాత = బయటకు వచ్చెను.

తా. మహాతేజశ్శాలి యైన ఆ రాముడు మూర్ఛ చెందిన తండ్రి పాదములకు, దుష్టురా లగు కైక పాదములకు నమస్కారము చేసి బయటకు వచ్చెను. 28

మూ. స రామః పితరం కృత్వా కైకేయీం చ ప్రదక్షిణమ్,
నిష్క్రమ్యాన్తఃపురాత్తస్మాత్స్వం దదర్శ సుహృజ్జనమ్ 29

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, పితరమ్ = తండ్రిని, కైకేయీం చ = కైకేయిని, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, తస్మాత్ = ఆ, అన్తఃపురాత్ = అంతఃపురమునుండి, నిష్క్రమ్య = నిష్క్రమించి, స్వమ్ = తన సుహృజ్జనమ్ = మిత్రజనమును, దదర్శ = చూచెను.

తా. ఆ రాముడు తండ్రికిని, కైకేయికిని, ప్రదక్షిణపూర్వకముగ నమస్కరించి, అంతఃపురమునుంచి నిష్క్రమించి తన మిత్రులను కలుసుకొనెను. 29

మూ. తం బాష్పపరిపూర్ణాక్షః పృష్ఠతోఽనుజగామ హ,
లక్ష్మణః పరమక్రుద్ధః సుమిత్రానన్దవర్ధనః. 30

ప్ర. అ. సుమిత్రానన్దవర్ధనః = సుమిత్రయొక్క ఆనందమును వృద్ధి పొందించు, లక్ష్మణః = లక్ష్మణుడు, పరమక్రుద్ధః = మిక్కిలి కోపగించినవాడై, బాష్ప పరిపూర్ణాక్షః = కన్నీటితో నిండిన నేత్రములు కలవాడై, తమ్ = రాముని, పృష్ఠతః = వెనుక, అనుజగామ హ = అనుసరించి వెళ్ళెను.

తా. సుమిత్ర కుమారు డైన లక్ష్మణుడు చాల కోపగించి, కన్నీరు నిండిన నేత్రములతో రాముని అనుసరించి వెళ్లెను. 30

మూ. అభిషేచనికం భాణ్డం కృత్వా రామః ప్రదక్షిణమ్,
శనైర్జగామ సాపేక్షో దృష్టిం తత్రావిచాలయన్. ౩౧

ప్ర. అ. రామః=రాముడు, అభిషేచనికమ్=అభిషేకమునకు సంబంధించిన, భాణ్డమ్=సామగ్రిని, ప్రదక్షిణం కృత్వా=ప్రదక్షిణము చేసి, సాపేక్షః = శ్రద్ధావంతుడై, తత్ర = దానియందు, దృష్టిమ్ = దృష్టిని, అవిచాలయన్ = చలింపచేయక, శనైః = మెల్లగా, జగామ = వెళ్ళెను.

తా. రాముడు అభిషేకసామగ్రికి ప్రదక్షిణము చేసి, శ్రద్ధాపూర్వకముగ తన దృష్టిని ఆ మంగళ ద్రవ్యములందు నిలిపి మెల్లగా వెళ్లెను. ౩౧

మూ. న చాస్య మహతీం లక్ష్మీం రాజ్యనాశోఽపకర్షతి,
లోకకాన్తస్య కాన్తత్వాచ్ఛీతరశ్మేరివ క్షపా. ౩౨

ప్ర. అ. కాన్తత్వాత్ = సౌందర్యవంతుడగుటవలన, లోకకాన్తస్య = లోకమునకు మనోహరుడైన, అస్య = ఈతనియొక్క, మహతీమ్=గొప్పదైన, లక్ష్మీమ్ = శోభను, శీత రశ్మేః=చంద్రుని శోభను, క్షపా ఇవ = రాత్రి వలె, రాజ్యనాశః=రాజ్యముయొక్క నాశనమున, న అపకర్షతి=తగ్గించలేదు.

తా. రాముడు మహాసౌందర్యశాలి యగుటచే లోకమనోహరుడు; అట్టి రాముని గొప్ప శోభను, చంద్రుని శోభను రాత్రి వలె, రాజ్యనాశము తగ్గింపలేక పోయెను. ౩౨

మూ. న వనం గన్తుకామస్య త్యజతశ్చ వసుంధరామ్,
సర్వలోకాతిగస్యేవ లక్ష్యతే చిత్తవిక్రియా ౩౩

ప్ర. అ. వనమ్=వనమును గూర్చి, గన్తుకామస్య=వెళ్ల నిశ్చయించిన వాడును, వసుంధరామ్ = భూమిని, త్యజతశ్చ= విడచుచున్న వాడును అయిన ఆ రామునకు, సర్వలోకాతిగస్యేవ = సమస్తలోకాతీతుడైన యోగికి వలె, చిత్తవిక్రియా = చిత్తవికారము, న లక్ష్యతే=చూడబడుటలేదు.

తా. రాజ్యమును విడచి, అరణ్యమునకు వెళ్లనున్న ఆ రామునిలో, లోకము నందలి సుఖదుఃఖాలకు అతీతుడైన యోగియందువలె చిత్తవికారమేదియు కనబడలేదు. ౩౩

మూ. ప్రతిషిధ్య శుభం ఛత్రం వ్యజనే చ స్వలంకృతే,
విసర్జయిత్వా స్వజనం రథం పౌరాంస్తథా జనాన్. ౩౪
ధారయన్ మనసా దుఃఖమిన్ద్రియాణి నిగృహ్య చ,
ప్రవివేశాత్మవాన్వేశ్మ మాతురప్రియశంసివాన్. ౩౫

ప్ర. అ. ఆత్మవాన్ = మనోధైర్యము కల రాముడు, శుభమ్ = శుభ మైన, ఛత్రమ్ = ఛత్రమును, స్వలంకృతే = బాగుగ అలంకరింపబడిన, వ్యజనే చ = వింజామరలను, ప్రతిషిధ్య = నిషేధించి, స్వజనమ్ = తన మిత్రులను, రథమ్ = రథమును, తథా = మరియు, పౌరాన్ = పౌరులైన, జనాన్ = జనులను, విసర్జయిత్వా = విడచి, మనసా = మనస్సు చేత, దుఃఖమ్ = దుఃఖమును, ధారయన్ = నిలుపుకొనుచు, ఇన్ద్రియాణి = ఇంద్రియములను, నిగృహ్య చ = నిగ్రహించుకొని, అప్రియశంసివాన్ = అప్రియమును చెప్ప నున్నవాడై, మాతుః = తల్లియొక్క, వేశ్మ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. గొప్ప మనోధైర్యము కల ఆ రాముడు, ఛత్రచామరములను వదలి, మిత్రులను, రథమును, పౌరులను, పంపివేసి, దుఃఖమును మనస్సులోనే అణచు కొనుచు, ఇంద్రియములను నిగ్రహించుకొని ఆ అప్రియవార్త చెప్పటకై తల్లి గృహమునకు వెళ్ళెను. ౩౪-౩౫

మూ. సర్వో హ్యభిజనః శ్రీమాన్ శ్రీమతః సత్యవాదినః,
నాలక్షయత రామస్య కించిదాకారమాననే. ౩౬

ప్ర. అ. శ్రీమాన్ = శోభ గల, సర్వః = సమస్త మైన, అభిజనః = చుట్టు ప్రక్కల ఉన్న జనము, శ్రీమతః = శ్రీమంతుడు, సత్యవాదినః = సత్యమువలుకు వాడు అగు, రామస్య = రామునియొక్క, ఆననే = ముఖమునందు, కించిత్ = కొంచె మైనను, ఆకారమ్ = మార్పును, నాలక్షయత = చూడలేదు.

తా. ఆ రాముని ప్రక్కనున్నవారికి శోభాయుక్తుడూ, సత్యవాదీ యైన ఆ రాముని ముఖములో ఏట్టి మార్పు కనబడలేదు. ౩౬

మూ. ఉచితం చ మహాబాహుర్న జహౌ హర్షమాత్మవాన్,
శారదః సముదీర్ణాంశుశ్చన్ద్రస్తేజ ఇవాత్మజమ్. ౩౭

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కల ఆ రాముడు, సము దీర్ణాంశుః=అధిక మైన కిరణములు గల, శారదః=శరత్కాలమునకు సంబంధించిన, చంద్రః=చంద్రుడు, ఆత్మజమ్=తనకు సహజ మైన, తేజ ఇవ= తేజస్సును వలె. ఆత్మనః=తనకు, ఉచితమ్=అలవాటుగా నున్న, హర్షమ్= సంతోషమును, న జహౌ=విడువలేదు.

తా. అధిక మైన కాంతులు గల శరత్కాలచంద్రుడు, తన సహజ మైన కాంతిని ఎట్లు విడువడో అట్లే ఆ రాముడు తనకు సహజముగా నున్న హర్షమును విడువలేదు. 37

మూ. వాచా మధురయా రామః సర్వం సమ్మానయన్ జనమ్,
మాతుస్సమీపం ధీరాత్మా ప్రవివేశ మహాయశాః. 38

ప్ర. అ. ధీరాత్మా=ధీర మైన మనస్సు కలవాడు, మహాయశాః=గొప్ప కీర్తి కలవాడు అయిన, రామః = రాముడు, మధురయా=మధుర మైన, వాచా= వాక్కుతో, జనమ్ = జనమును, సమ్మానయన్ = గౌరవించుచు, మాతుః = తల్లియొక్క, సమీపమ్ = సమీపమును, ప్రవివేశ = వెళ్ళెను.

తా. ధైర్యముతో కూడిన మనస్సు కలవాడూ, మహాయశశ్శాలి యైన ఆ రాముడు, మధురము లైన మాటలతో అక్కడ నున్న జనులను గౌరవించుచు తల్లి దగ్గరకు వెళ్ళెను. 38

మూ. తం గుణైస్సమతాం ప్రాప్తో భ్రాతా విపులవిక్రమః,
సౌమిత్రిరనువవ్రాజ ధారయన్ దుఃఖమాత్మజమ్. 39

ప్ర. అ. గుణైః=గుణములచే, సమతాం=(రామునితో) సమానత్వమును, ప్రాప్తః = పొందినవాడును, విపులవిక్రమః = అధిక మైన పరాక్రమము కల వాడునూ, భ్రాతా = సోదరుడును అన, సౌమిత్రిః = లక్ష్మణుడు, ఆత్మజమ్ = మనస్సులో పుట్టిన, దుఃఖమ్=దుఃఖమును, ధారయన్ = నిలుపుకొనుచు, తమ్ =ఆ రాముని, అనువవ్రాజ = అనుసరించి వెళ్లెను.

తా. రాముని గుణములంటివి గుణములు కలవాడును, మహోత్తరాక్రమ శాలియు, సోదరుడూ అయిన, లక్ష్మణుడు మనస్సులోని దుఃఖమును అణచు కొనుచు; రాముని వెనుకనే వెళ్ళెను. 39

మూ. ప్రవిశ్య వేశ్మాతిభృశం ముదాన్వితం
సమీక్ష్య తాం చార్థవిపత్తిమాగతామ్,
న చైవ రామోఽత్ర జగామ విక్రియాం
సుహృజ్జనస్యాత్మవిపత్తిశఙ్కయా. 40

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనవింశః సర్గః.

ప్ర. అ. రామః=రాముడు, అతిభృశమ్ = చాల ఎక్కువగ, ముదా = ఆనందముతో, అన్వితమ్ = కూడిన, వేశ్మ = గృహమును, ప్రవిశ్య=ప్రవేశించి, ఆగతామ్=వచ్చిన, తామ్=ఆ, అర్థవిపత్తిమ్ = కార్యవిఘాతమును, సమీక్ష్య= చూచి, అత్ర = ఇచట, సుహృజ్జనస్య = మిత్రులకు, ఆత్మవిపత్తిశఙ్కయా= ఆత్మకు (మనస్సుకు) ఆపద కలుగు నను శంకచేత, విక్రియామ్ = వికారమును, న చైవ జగామ = పొందలేదు.

తా. రాముడు ప్రవేశించు సమయమున కౌసల్య భవన మంతయు గొప్ప ఆనందముతో నిండి యుండెను. అట్టి సమయమున, వచ్చిపడిన కార్య విఘాత మును గూర్చి రాముడు వికార మేమియు చూపలేదు. ఆ నేమైన వికారమును చూపినచో అక్కడ ఉన్న తనవారికి ప్రాణభయమే కలుగవచ్చు నని సందేహించి అతడట్లు ప్రవర్తించెను. 40

"బాలానన్దిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో పందొమ్మిదవ సర్గ సమాప్తము.

# అథ వింశః సర్గః

[దశరథుని తక్కిన రాణులు విలపించుట, శ్రీరాముడు కౌసల్యా భవనమునకు పోవుట, ఆమెకు తన వనవాసమును గూర్చి తెలుపుట, కౌసల్య తెలివిదప్పి పడుట, శ్రీరాము డామెను లేవనెత్తగా, ఆయన ముఖము చూచి కౌసల్య విలపించుట.]

మూ. తస్మింస్తు పురుషవ్యాఘ్రే నిష్క్రామతి కృతాఞ్జలౌ,
ఆర్తశబ్దో మహాన్ జజ్ఞే స్త్రీణామన్తఃపురే తదా. 1

ప్ర. అ. తదా = అపుడు, పురుషవ్యాఘ్రే = పురుషశ్రేష్ఠు డైన, తస్మిన్ = ఆ రాముడు, కృతాఞ్జలౌ = చేయబడిన దోసిలి కలవాడై, నిష్క్రామతి = నిష్క్రమించుచుండగా, అన్తఃపురే = అంతఃపురమునందు, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, మహాన్ = గొప్ప దైన, ఆర్తశబ్దః = ఏడ్పు, జజ్ఞే = కలిగెను.

తా. పురుషశ్రేష్ఠు డైన ఆ రాముడు, తండ్రికి నమస్కరించి, నిష్క్రమించుచుండగా, అంతఃపురములోని స్త్రీలు బిగ్గరగా విలపించిరి. 1

మూ. కృత్యేష్వచోదితః పిత్రా సర్వస్యాన్తఃపురస్య చ,
గతిర్యః శరణం చాసీత్ స రామోఽద్య ప్రవత్స్యతి. 2

ప్ర. అ. యః = ఏ రాముడు, పిత్రా = తండ్రిచేత, కృత్యేషు = ఆ యా పనులయందు, అచోదితః = ప్రేరేపింపబడకపోయినను, సర్వస్య = సమస్తమైన, అంతఃపురస్య = అంతఃపురమునకు, గతిః = గతిగాను, శరణం చ = రక్షకుడు గాను, ఆసీత్ = ఆయెనో, సః రామః = అట్టి రాముడు, అద్య = ఇపుడు, ప్రవత్స్యతి = ప్రవాసము వెళ్లనున్నాడు.

తా. ఏ రాముడు తండ్రి చెప్పకున్నను ఆ యా కార్యములు నిర్వర్తించుచు తండ్రిని, సమస్త మైన అంతఃపురమునకును సంరక్షణ చేయుచుండెడివాడో అట్టి రాముడు ఇపుడు ప్రవాసమునకు వెళ్లిపోవుచున్నాడు. 2

మూ. కౌసల్యాయాం యథా యుక్తో జనన్యాం వర్తతే సదా,
తథైవ వర్తతేఽస్మాసు జన్మప్రభృతి రాఘవః. ౩

ప్ర. అ. జన్మప్రభృతి = పుట్టినది మొదలు, రాఘవః = రాముడు, జనన్యామ్ = తల్లి యైన, కౌసల్యాయామ్ = కౌసల్యయందు, సదా = ఎల్లపుడు, యుక్తః = భక్తి కలవాడై, యథా = ఎట్లు, వర్తతే = ప్రవర్తించుచున్నాడో, అస్మాసు = మన విషయములో కూడ, తథైవ = అట్లే, వర్తతే = ప్రవర్తించుచున్నాడు.

తా. రాముడు పుట్టినది మొదలు, తల్లి యైన కౌసల్య విషయమున ఎట్టి భక్తి శ్రద్ధలు చూపుచున్నాడో, అట్లే మన విషయమున కూడ చూపుచున్నాడు. ౩

మూ. న క్రుధ్యత్యభిశస్తోఽపి క్రోధనీయాని వర్జయన్,
క్రుద్ధాన్ ప్రసాదయన్ సర్వాన్ స ఇతోఽద్య ప్రవత్స్యతి. 4

ప్ర. అ. క్రోధనీయాని = కోపము కలిగించు కార్యములను, వర్జయన్ = విడచుచు, క్రుద్ధాన్ = కోపగించిన, సర్వాన్ = అందరిని, ప్రసాదయన్ = ప్రసన్నులను చేసికొనుచు, అభిశస్తోఽపి = నిందింపబడినను, న క్రుధ్యతి = కోపగింపడు. సః = అట్టి రాముడు, అద్య = నేడు, ఇతః = ఇచటినుండి, ప్రవత్స్యతి = ప్రవాసము పోనున్నాడు.

తా. కోపము కలిగించు పనుల చేయక; కోపగించినవారి కోపము తొలగించుచు రాముడు తన్నెవ రైన నిందించినను కోపగించెడివాడు కాదు. అట్టి రాముడు ఈనాడు ప్రవాసము పోవుచున్నాడు. 4

మూ. అబుద్ధిర్బత నో రాజా జీవలోకం చరత్యయమ్,
యో గతిం సర్వభూతానాం పరిత్యజతి రాఘవమ్. ౫

ప్ర. అ. యః = ఏ దశరథమహారాజు, సర్వభూతానామ్ = సమస్తప్రాణులకు, గతిమ్ = గతి యైన, రాఘవమ్ = రాముని, పరిత్యజతి = విడుచుచున్నాడో, అయమ్ = ఈ, నః రాజా = మన రాజు, అబుద్ధిః = బుద్ధి లేనివాడై, జీవలోకమ్ = ప్రాణిసముదాయమును, చరతి = భక్షించివేయుచున్నాడు.

తా. ఉద్ధిలేని మన రాజు సమస్త ప్రాణులకు గతి యైన రాముని పరిత్యజించుట ద్వారా సకల ప్రాణులను నశింపజేయుచున్నారు. 5

మూ. ఇతి సర్వా మహిష్యస్తా వివత్సా ఇవ ధేనవః,
పతిమాచుక్రుశుశ్చైవ సస్వరం చాపి చుక్రుశుః. 6

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, సర్వాః = సమస్త మైన, తాః = ఆ, మహిష్యః = రాజభార్యలు, వివత్సాః = దూడలు పోయిన, ధేనవః ఇవ = ఆవులు వలె, సస్వరమ్ = సస్వరముగా, చుక్రుశుః చ అపి = ఏడ్చిరి. పతిమ్ = భర్తను, ఆచుక్రుశుః ఏవ = నిందించిరి కూడ.

తా. ఈ విధముగా, తమ దూడలను కోల్పోయిన ఆవులు వలె, ఆ రాజభార్య లందరును గట్టిగా ఏడ్చుచు భర్తను నిందించిరి. 6

మూ. స హి చాన్తఃపురే ఘోరమార్తశబ్దం మహీపతిః,
పుత్రశోకాభిసన్తప్తః శ్రుత్వా వ్యాలీయతాసనే. 7

ప్ర. అ. సః మహీపతిః = ఆ రాజు, అన్తఃపురే = అంతఃపురమునందు, ఘోరమ్ = ఘోర మైన, ఆర్తశబ్దమ్ = ఆర్తధ్వనిని, శ్రుత్వా = విని, పుత్రశోకాభిసంతప్తః = పుత్రశోకముచే పీడింపబడినవాడై, ఆసనే = ఆసనమునందు, వ్యాలీయత = ఒఱగిపోయెను.

తా. దశరథుడు అంతఃపురములో బయలుదేరిన ఆ భయంకర మైన రోదనధ్వని విని పుత్రశోకపీడితు డై తన ఆసనముపై పడి ఒఱగి యుండెను. 7

మూ. రామస్తు భృశమాయస్తో నిఃశ్వసన్నివ కుఞ్జరః,
జగామ సహితో భ్రాత్రా మాతురన్తఃపురం వశీ. 8

ప్ర. అ. వశీ = ఇంద్రియనిగ్రహవంతు డైన, రామస్తు = రాము డైతే, భృశమ్ = మిక్కిలి, ఆయస్తః = దుఃఖమును పొందినవాడై, కుఞ్జరః ఇవ = ఏనుగు వలె, నిఃశ్వసన్ = నిట్టూర్చుచు, భ్రాత్రా = సోదరునితో, సహితః = కూడినవా డై, మాతుః = తల్లియొక్క, అన్తఃపురమ్ = అంతఃపురమును గూర్చి, జగామ = వెళ్లెను.

తా. పిమ్మట దుఃఖితు డైన రాముడు, ఏనుగు వలె నిట్టూర్చుచు, ఇంద్రియములను నిగ్రహించుకొని, లక్ష్మణసమేతు డై తల్లి అంతఃపురమునకు వెళ్ళెను. 8

మూ. సోఽపశ్యత్పురుషం తత్ర వృద్ధం పరమపూజితమ్,
ఉపవిష్టం గృహద్వారి తిష్ఠతశ్చాపరాన్బహూన్. 9

ప్ర. అ. సః = రాముడు, తత్ర = అక్కడ, గృహద్వారి = గృహద్వారము నందు, ఉపవిష్టమ్ = కూర్చున్న, పరమపూజితమ్ = మిక్కిలి పూజింపబడిన, వృద్ధం పురుషమ్ = ఒక వృద్ధపురుషుని, తిష్ఠతః = నిలబడియున్న, బహూన్ = అనేక మైన, అపరాంశ్చ = ఇతరులను, అపశ్యత్ = చూచెను.

తా. రాముడు ఆ గృహద్వారమున కూర్చొని యున్న ఒక పూజనీయు డగు వృద్ధుని, నిలబడి యున్న మరికొంతమందిని చూచెను. 9

మూ. దృష్ట్వైవ తు తదా రామం తే సర్వే సహసోత్థితాః,
జయేన జయతాం శ్రేష్ఠం వర్ధయన్తి స్మ రాఘవమ్. 10

ప్ర. అ. తదా = అపుడు, రామమ్ = రాముని, దృష్ట్వైవ = చూడగానే, తే సర్వే = వారందరును, సహసా = శీఘ్రముగా, ఉత్థితాః = లేచినవారై, జయతామ్ = జయించువారిలో, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠు డైన, రాఘవమ్ = రాముని, జయేన = జయముచేత, వర్ధయన్తి స్మ = వృద్ధి పొందించిరి.

తా. రాముని చూడగానే వారందరును వెంటనే లేచి, విజయవంతులలో శ్రేష్ఠు డైన అతనిని "నీకు జయము కలుగుగాక" అని పలుకుచు అభినందించిరి. 10

మూ. ప్రవిశ్య ప్రథమాం కక్ష్యాం ద్వితీయాయాం దదర్శ సః,
బ్రాహ్మణాన్ వేదసంపన్నాన్ వృద్ధాన్ రాజ్ఞాభిసత్కృతాన్.

ప్ర. అ. సః = ఆ రాముడు, ప్రథమాం కక్ష్యామ్ = మొదటివాకిలిని, ప్రవిశ్య = ప్రవేశించి, ద్వితీయాయామ్ = రెండవ వాకిలియందు, వేదసంపన్నాన్ = వేదవిద్యాసంపన్నులును, రాజ్ఞా = రాజుచేత, అభిసత్కృతాన్ = సత్కరింపబడినవారును, వృద్ధాన్ = వృద్ధులును అయిన, బ్రాహ్మణాన్ = బ్రాహ్మణులను, దదర్శ = చూచెను.

తా. రాముడు మొదటి వాకిలి దాటి, రెండవ వాకిలిలో, వేదసంపన్నులు, రాజగౌరవమును పొందువారు, వృద్ధులు అయిన బ్రాహ్మణులను చూచెను. 11

మూ. ప్రణమ్య రామస్తాన్విప్రాన్ తృతీయాయాం దదర్శ సః,
స్త్రియో వృద్ధాస్తథా బాలా ద్వారరక్షణతత్పరాః, 12

ప్ర. అ. సః రామః=రాముడు, తాన్=ఆ, విప్రాన్=బ్రాహ్మణులను, ప్రణమ్య=నమస్కరించి, తృతీయాయామ్=మూడవవాకిలియందు, ద్వారరక్షణతత్పరాః=ద్వారమును రక్షించుటయం దాసక్తిగల, వృద్ధాః స్త్రియః=వృద్ధలైన స్త్రీలను, తథా=మరియు, బాలాః=బాలలను, దదర్శ=చూచెను.

తా. రాముడు ఆ బ్రాహ్మణులకు నమస్కరించి, మూడవ కక్ష్యలో ద్వారమును రక్షించుచున్న వృద్ధస్త్రీలను, బాలస్త్రీలను చూచెను. 12

మూ. వర్ధయిత్వా ప్రహృష్టాస్తాః ప్రవిశ్య చ గృహం స్త్రియః,
న్యవేదయన్త త్వరితా రామమాతుః ప్రియం తదా. 13

ప్ర. అ. తదా=అపుడు, తాః=ఆ, స్త్రియః=స్త్రీలు, ప్రహృష్టాః=సంతోషించినవారై, వర్ధయిత్వా=రాముని, జయశబ్దముచే వర్ధింపచేసి, త్వరితాః=తొందరపడుచున్నవారై, గృహమ్=గృహమును, ప్రవిశ్య=ప్రవేశించి, రామమాతుః=రామమాత యైన కౌసల్యకు, ప్రియమ్=ప్రియమును, న్యవేదయన్త=తెలిపిరి.

తా. ఆ స్త్రీలు సంతోషించి, రాముని జయశబ్దముతో అభినందించి, శీఘ్రముగ గృహములోనికి వెళ్లి కౌసల్యకు ప్రియ మైన రామాగమనవార్తను చెప్పిరి. 13

మూ. కౌసల్యాపి తదా దేవీ రాత్రిం స్థిత్వా సమాహితా,
ప్రభాతే త్వకరోత్పూజాం విష్ణోః పుత్రహితైషిణీ. 14

ప్ర. అ. తదా=అపుడు, కౌసల్యా=కౌసల్య, రాత్రిమ్=రాత్రి యంతయు, సమాహితా = నియమవంతురాలై, స్థిత్వా=ఉండి, ప్రభాతే=ప్రాతఃకాలమున, పుత్రహితైషిణీ = పుత్రుని హితమును కోరుచు, విష్ణోః = విష్ణువుయొక్క, పూజామ్=పూజను, అకరోత్=చేసెను.

తా. అపుడు కౌసల్య రాత్రి అంతయు నియమపూర్వకముగ, జాగరము చేసి, పుత్రుని క్షేమము కోరుచు ప్రాతఃకాలమున విష్ణుపూజ చేయుచుండెను. 14

మూ. సా క్షౌమవసనా హృష్టా నిత్యం వ్రతపరాయణా,
అగ్నిం జుహోతి స్మ తదా మన్త్రవత్కృతమఙ్గళా. 15

ప్ర. అ. నిత్యమ్ = ఎల్లపుడును, వ్రతపరాయణా = వ్రతములం దాసక్తి గల, సా = ఆమె, క్షౌమవసనా = తెల్లని పట్టుచీర ధరించినదై, హృష్టా = సంతోషించి, కృతమఙ్గళా = చేయబడిన మంగళము కలదై, మన్త్రవత్ = మంత్రపూర్వకముగ, అగ్నిమ్ = అగ్నిని, జుహోతి స్మ = హోమము చేయుచుండెను.

తా. ఎల్లపుడు వ్రతములను ఆచరించుటయం దాసక్తి గల, ఆ కౌసల్య తెల్లని పట్టుచీర ధరించి, మంగళకరమగు వేషముతో మంత్రపూర్వకముగా సంతోషముతో అగ్నిలో హోమము చేయుచుండెను. 15

మూ. ప్రవిశ్య చ తదా రామో మాతురన్తఃపురం శుభమ్,
దదర్శ మాతరం తత్ర హావయన్తీం హుతాశనమ్ 16

ప్ర. అ. తదా = అపుడు, రామః = రాముడు, శుభమ్ = మంగళకరమైన, మాతుః అన్తఃపురమ్ = తల్లియొక్క అంతఃపురమును, ప్రవిశ్య = ప్రవేశించి, తత్ర = అక్కడ, హుతాశనమ్ = అగ్నిని, హావయన్తీమ్ = హోమము చేయించుచున్న, మాతరమ్ = తల్లిని, దదర్శ = చూచెను.

తా. రాముడు మంగళకరమైన ఆ తల్లి అంతఃపురము ప్రవేశించి అక్కడ అగ్నిలో హోమము చేయించుచున్న తల్లిని చూచెను. 16

మూ. దేవకార్యనిమిత్తం చ తత్రాపశ్యత్ సముద్యతమ్,
దధ్యక్షతం ఘృతం చైవ మోదకాన్ హవిషస్తదా. 17
లాజాన్ మాల్యాని శుక్లాని పాయసం కృసరం తథా,
సమిధః పూర్ణకుంభాంశ్చ దదర్శ రఘునన్దనః. 18

ప్ర. అ. రఘునన్దనః = రాముడు, తత్ర = అచట, దేవకార్యనిమిత్తమ్ = దేవకార్యము కొరకై, సముద్యతమ్ = సిద్ధము చేయబడిన సామగ్రిని, అపశ్యత్

= చూచెను. దధ్యక్షతమ్ = పెరుగును అక్షతలను, ఘృతం చైవ = నెయ్యిని, మోదకాన్ = మధుర భక్ష్యములను, తథా = మరియు, హవిషః = హవిస్సులను, లాజాన్ = పేలాలను, శుక్లాని = తెల్లని, మాల్యాని = పుష్పమాలికలను, పాయసమ్ = పాయసమును, కృసరమ్ = పులగమును, సమిధః = సమిధలను, పూర్ణకుంభాంశ్చ = పూర్ణకుంభములను, దదర్శ = చూచెను.

తా. రాముడు అచట దేవకార్యము నిమిత్తమై సిద్ధము చేసి ఉంచిన పెరుగు, అక్షతలు, నెయ్యి, మోదకములు, హవిస్సులు, పేలాలు, తెల్లని పుష్పమాలలు, పాయసము, పులగము, సమిధలు, పూర్ణకుంభములు, మొదలగు సామాగ్రిని చూచెను. 17, 18

మూ. తాం శుక్లక్షౌమసంవీతాం వ్రతయోగేన కర్శితామ్,
తర్పయన్తీం దదర్శాద్భిః దేవతాం దేవవర్ణినీమ్. 19

ప్ర. అ. శుక్లక్షౌమసంవీతామ్ = తెల్లని పట్టుచీరను ధరించినదియు, వ్రతయోగేన = వ్రతముచే, కర్శితామ్ = కృశించినదియు, దేవవర్ణినీమ్ = దేవతల వంటి ఆకారము కలదియు, అద్భిః = ఉదకముతో, దేవతామ్ = దేవతను, తర్పయన్తీమ్ = తృప్తిపొందించుచున్నదియు అగు, తామ్ = కౌసల్యను, దదర్శ = చూచెను.

తా. వ్రతములు చేయుటచే కృశించిన ఆ కౌసల్య తెల్లని పట్టుచీర ధరించి దేవతాస్త్రీ వలె ప్రకాశించుచు, దేవతలకు జలతర్పణము లిచ్చుచుండెను. 19

మూ. సా చిరస్యాత్మజం దృష్ట్వా మాతృనన్దనమాగతమ్,
అభిచక్రామ సంహృష్టా కిశోరం బడబా యథా. 20

ప్ర. అ. సా = ఆమె, చిరస్య = చిరకాలమునకు, ఆగతమ్ = వచ్చిన, మాతృనన్దనమ్ = తల్లికి ఆనందమును కలిగించు, ఆత్మజమ్ = కుమారుని, దృష్ట్వా = చూచి, సంహృష్టా = సంతోషించినదై, బడబా = ఆడగుఱ్ఱము, కిశోరం యథా = తన పిల్లను వలె, అభిచక్రామ = ఎదురుగా వెళ్ళి సమీపించెను.

తా. చాల కాలమునకు వచ్చిన వాడును, తల్లికి ఆనందము కల్గించు వాడును అగు ఆ కుమారుని చూచి, సంతోషించి, ఆ కౌసల్య, ఆడగుఱ్ఱము తన పిల్లను సమీపించి నట్లు సమీపించెను. 20

మూ. స మాతరమభిక్రాన్తాముపసంగృహ్య రాఘవః,
పరిష్వక్తశ్చ బాహుభ్యాముపాఘ్రాతశ్చ మూర్ధని. 21

ప్ర. అ. సః రాఘవః = ఆ రాముడు, అభిక్రాన్తామ్ = దగ్గరకు వచ్చిన, మాతరమ్ = తల్లిని, ఉపసంగృహ్య = పాదస్పర్శచే నమస్కరించి, బాహుభ్యామ్ = బాహువులచేత, పరిష్వక్తః = కౌగలింపబడెను. మూర్ధని = శిరస్సునందు, ఉపాఘ్రాతశ్చ = వాసన చూడబడెను.

తా. రాముడు ఎదురుగా వచ్చిన తల్లికి పాదములు స్పృశించి నమస్కరించెను. అప్పు డామె అతనిని బాహువులతో కౌగలించుకొని అతని శిరస్సుపై వాసనచూచెను. 21

మూ. తమువాచ దురాధర్షం రాఘవం సుతమాత్మనః,
కౌసల్యా పుత్రవాత్సల్యాదిదం ప్రియహితం వచః. 22

ప్ర. అ. కౌసల్యా = కౌసల్య, దురాధర్షమ్ = ఎదురింపశక్యము కానివాడును, ఆత్మనః = తనయొక్క, సుతమ్ = కుమారుడును అగు, తం రాఘవమ్ = ఆ రామునిగూర్చి, పుత్రవాత్సల్యాత్ = పుత్రునిపై ఉన్న వాత్సల్యమువలన, ప్రియహితమ్ = ప్రియము హితము అయిన, ఇదమ్ = ఈ, వచః = వచనమును, ఉవాచ = పలికెను.

తా. కౌసల్య శత్రువులచే ఎదురింపశక్యము గాని తన కుమారుడైన రామునితో వాత్సల్యపూర్వకముగా ప్రియములు హితములు అయిన ఈ మాటలు చెప్పెను. 22.

మూ. వృద్ధానాం ధర్మశీలానాం రాజర్షీణాం మహాత్మనామ్,
ప్రాప్నుహ్యాయుశ్చ కీర్తిం చ ధర్మం చోపహితం కులే.

ప్ర. అ. వృద్ధానామ్ = వృద్ధులును, ధర్మశీలానామ్ = ధర్మము చేయు స్వభావము కలవారును, మహాత్మనామ్ = మహాత్ములును అయిన, రాజర్షీణామ్ = రాజర్షులయొక్క, ఆయుశ్చ = ఆయుర్దాయమును, కీర్తిం చ = కీర్తిని, కులే =

వంశమునందు, ఉపహితమ్ = చిరకాలమునుండి ఉన్న, ధర్మం చ = ధర్మమును, ప్రాప్నుహి = పొందుము.

తా. నీవు వృద్ధులును, ధర్మశీలులును, మహాత్ములును అయిన రాజర్షులకు, ఎంత ఆయుర్దాయము, కీర్తి ఉండునో అంత ఆయుర్దాయమూ కీర్తి లభించు గాక. నీ వంశధర్మమును పాలించెదవు గాక. 23

మూ. సత్యప్రతిజ్ఞం పితరం రాజానం పశ్య రాఘవ,
అద్యైవ హి త్వాం ధర్మాత్మా యౌవరాజ్యేఽభిషేక్ష్యతి.

ప్ర. అ. రాఘవ = ఓ రామా, సత్యప్రతిజ్ఞమ్ = సత్యమైన ప్రతిజ్ఞ కల, పితరమ్ = తండ్రియైన, రాజానమ్ = రాజును, పశ్య = చూడుము. ధర్మాత్మా = ఆ ధర్మాత్ముడు, త్వామ్ = నిన్ను, అద్యైవ = నేడే, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషేక్ష్యతి = అభిషిక్తుని చేయగలడు.

తా. రామా! నీ తండ్రియైన దశరథమహారాజు చేసిన ప్రతిజ్ఞను తప్పడు. ధర్మాత్ముడైన నీ తండ్రి నేడే నిన్ను యౌవరాజ్యమునందు అభిషిక్తుని చేయగలడు. 24

మూ. దత్తమాసనమాలభ్య భోజనేన నిమన్త్రితః,
మాతరం రాఘవః కించిత్ ప్రసార్యాఞ్జలిమబ్రవీత్. 25

ప్ర. అ. భోజనేన = భోజనముచేత, (కొరకు), నిమన్త్రితః = పిలువబడిన, రాఘవః = రాముడు, దత్తమ్ = ఇవ్వబడిన, ఆసనమ్ = ఆసనమును, ఆలభ్య = స్పృశించి, కించిత్ = కొంచెము, అఞ్జలిమ్ = దోసిలిని, ప్రసార్య = పైకి ఎత్తి, మాతరమ్ = తల్లిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. కౌసల్య ఈ విధముగ పలుకుచు భోజనము చేయుము అని కోరగా రాముడు ఆమె ఇచ్చిన ఆసనమును స్పృశించి ఆమెకు నమస్కరించుచు ఇట్లనెను.

మూ. స స్వభావవినీతశ్చ గౌరవాచ్చ తదా నతః,
ప్రస్థితో దణ్డకారణ్యమాప్రష్టుముపచక్రమే. 26

ప్ర. అ. స్వభావవినీతః = స్వభావము చేతనే వినయవంతుడు, తదా = అపుడు, గౌరవాత్ = తల్లిపై నున్న గౌరవము వలన, నతః చ = నమ్రుడునూ అయిన, సః = ఆ రాముడు, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును గూర్చి, ప్రస్థితః = ప్రయాణ మైన వాడై, ఆప్రష్టుమ్ = అనుజ్ఞ తీసుకొనుటకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

తా. స్వభావముచేతనే వినయవంతు డైన ఆ రాముడు ఆ సమయమున తల్లిపై నున్న గౌరవముచే ఇంకను నమ్రుడై దండకారణ్యమునకు ప్రయాణమై తల్లి యనుజ్ఞను పొందుటకు ఆమెను ప్రార్థింప ప్రారంభించెను. 26

మూ. దేవి నూనం న జానీషే మహద్భయముపస్థితమ్,
ఇదం తవ చ దుఃఖాయ వైదేహ్యా లక్ష్మణస్య చ. 27

ప్ర. అ. దేవి = ఓ తల్లీ! నూనమ్ = నిశ్చయముగా, ఉపస్థితమ్ = వచ్చి పడిన, మహత్ = గొప్ప దైన, భయమ్ = భయమును, న జానీషే = నీవు ఎరుగవు. ఇదమ్ = ఇది, తవ చ = నీకును, వైదేహ్యాః = సీతకును, లక్ష్మణస్య చ = లక్ష్మణునకును, దుఃఖాయ = దుఃఖము కల్గించుటకు వచ్చినది.

తా. తల్లీ! ఇపుడు ఒక గొప్ప ఆపద వచ్చి పడిన విషయము నీకు తెలియదు. దీనివలన నీకును, సీతకును, లక్ష్మణునకును చాల దుఃఖము కలుగ నున్నది. 27

మూ. గమిష్యే దణ్డకారణ్యం కిమనేనాసనేన మే,
విష్టరాసనయోగ్యో హి కాలోఽయం మాముపస్థితః. 28

ప్ర. అ. దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును గూర్చి, గమిష్యే = వెళ్ల గలను. మే = నాకు, అనేన ఆసనేన = ఈ ఆసనముచే, కిమ్ = ఏమి ప్రయోజనము? విష్టరాసనయోగ్యః = దర్భాసనమునకు తగిన, అయమ్ = ఈ, కాలః = కాలము, ఉపస్థితః = సమీపించినది.

తా. నేను దండకారణ్యమునకు వెళ్ల నున్నాను. నాకు ఈ ఆసన మెందుకు? నేను దర్భాసనముపై కూర్చుండవలసిన కాలము వచ్చినది. 28

మూ. చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే,
మధుమూలఫలైర్జీవన్ హిత్వా మునివదామిషమ్. 29

ప్ర. అ. ఆమిషమ్=మాంసమును, హిత్వా=విడచి, మునివత్=ముని వలె, మధుమూలఫలైః=తేనె, దుంపలు, ఫలములు — వీటితో, జీవన్=జీవించుచు, చతుర్దశ=పదునాలుగు, వర్షాణి=సంవత్సరములను, విజనే = జనశూన్యమైన, వనే=వనమునందు, వత్స్యామి = నివసింపగలను.

తా. నేను మాంసాహారమును విడచి, తేనె దుంపలు పండ్లు తినుచు, పదునాలుగు సంవత్సరములు ముని వలె జనశూన్య మైన అరణ్యములో నివసింపవలసి యున్నది. 29

మూ. భరతాయ మహారాజో యౌవరాజ్యం ప్రయచ్ఛతి,
మాం పునర్దణ్డకారణ్యే వివాసయతి తాపసమ్. 30

ప్ర. అ. మహారాజః=మహారాజు, భరతాయ = భరతునకు, యౌవరాజ్యమ్=యౌవరాజ్యమును, ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాడు. మాం పునః = నన్నైతే, తాపసమ్=మునినిగా, దణ్డకారణ్యే=దండకారణ్యమునందు, వివాసయతి=దూరముగా నివసింప చేయుచున్నాడు.

తా. మహారాజు యౌవరాజ్యమును భరతునకు ఇచ్చి, నన్నైతే మునిని వలె దండకారణ్యములో నివసించునట్లు చేయుచున్నాడు. 30

మూ. స షట్చాష్టౌ చ వర్షాణి వత్స్యామి విజనే వనే,
ఆసేవమానో వన్యాని ఫలమూలైశ్చ వర్తయన్. 31

ప్ర. అ. సః = అట్టి నేను, వన్యాని = వనమునకు సంబంధించిన వస్తువులను, ఆసేవమానః= సేవించుచు, ఫలమూలైః = పండ్లతోను, దుంపలతోను, వర్తయన్=జీవననిర్వాహము చేయుచు, షట్ చ అష్టౌ చ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములను, విజనే వనే = జనులు లేని అరణ్యమునందు, వత్స్యామి=నివసించగలను.

తా. నేను వనములో లభించు వస్తువులను సేవించుచు, ఫలమూలములతో జీవనము గడుపుచు, పదునాలుగు సంవత్సరములు జనశూన్య మైన అరణ్యములో నివసించవలసి యున్నది. 31

మూ. సా నికృత్తేవ సాలస్య యష్టిః పరశునా వనే,
పపాత సహసా దేవీ దేవతేవ దివశ్చ్యుతా. 32

ప్ర. అ. సా దేవీ = ఆ కౌసల్యాదేవి, పరశునా = గొడ్డలిచే. వనే = వనమునందు, నికృత్తా = ఖండింపబడిన, సాలస్య = సాలవృక్షముయొక్క, యష్టిః ఇవ = దండము వలె, దివః = స్వర్గమునుండి, చ్యుతా = జారిన, దేవతేవ = దేవత వలె, సహసా = వెంటనే, పపాత = నేలపై పడెను.

తా. ఆ కౌసల్యాదేవి గొడ్డలితో ఛేదించిన సాలవృక్షదండము వలె, స్వర్గమునుండి పడిన దేవత వలె వెంటనే నేలపై పడెను. 32

మూ. తామదుఃఖోచితాం దృష్ట్వా పతితాం కదళీమివ,
రామస్తూత్థాపయామాస మాతరం గతచేతనమ్. 33

ప్ర. అ. అదుఃఖోచితామ్ = దుఃఖమునకు తగనిదియు, పతితామ్ = నేలపై పడిన, కదళీమివ = అరటి చెట్టువలె ఉన్నదియు, గతచేతనమ్ = స్పృహ తప్పినదియు అయిన, తాం మాతరమ్ = ఆ తల్లిని, దృష్ట్వా = చూచి, రామః = రాముడు, ఉత్థాపయామాస = పైకి లేవదీసెను.

తా. మూర్ఛ చెంది అరటి చెట్టు వలె, నేలపై పడిన, దుఃఖమునకు తగని ఆ తల్లిని చూచి రాముడు పైకి లేవదీసెను. 33

మూ. ఉపావృత్త్యోత్థితాం దీనాం బడబామివ వాహితామ్,
పాంసుకుంఠితసర్వాంగీం విమమర్శ చ పాణినా. 34

ప్ర. అ. ఉపావృత్త్య = దొర్లి, ఉత్థితామ్ = లేచినదియు, వాహితామ్ = బరువు మోయింపచేసిన, బడబామివ = ఆడు గుఱ్ఱము వలె నున్నదియు, దీనామ్ = దీనురాలును, పాంసుకుంఠితసర్వాంగీం = పరాగముతో కప్పబడిన సమస్త అవయవములు కలదియు అయిన, కౌసల్యను, పాణినా = హస్తముతో, విమమర్శ = స్పృశించెను.

తా. నేలపై దొరలి లేచిన బరువుమోసిన గుఱ్ఱము వలె పరాగముతో నిండిన సకల శరీరము గల ఆ దీనురాలిని హస్తముతో స్పృశించెను. 34

మూ. సా రాఘవముపాసీనమసుఖార్తా సుఖోచితా,
ఉవాచ పురుషవ్యాఘ్రముపశృణ్వతి లక్ష్మణే. ౩౫

ప్ర. అ. అసుఖార్తా = దుఃఖముచే పీడింపబడినదీ, సుఖోచితా = సుఖమునకు తగినదీ యైన, సా = కౌసల్య, లక్ష్మణే = లక్ష్మణుడు, ఉపశృణ్వతి = వినుచుండగా, ఉపాసీనమ్ = సమీపమున కూర్చొనియున్న (తనకు సేవ చేయుచున్న), పురుషవ్యాఘ్రమ్ = పురుషశ్రేష్ఠుడైన, రాఘవమ్ = రాముని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. సుఖమునకు తగినదీ, దుఃఖముతో బాధపడుచున్నదీ యైన ఆ కౌసల్య, లక్ష్మణుడు వినుచుండగా, తన సమీపము నందున్న పురుషశ్రేష్ఠుడైన రామునితో ఇట్లు పలికెను. ౩౫

మూ. యది పుత్ర న జాయేథా మమ శోకాయ రాఘవ,
న స్మ దుఃఖమతో భూయః పశ్యేయమహమప్రజాః. ౩౬

ప్ర. అ. పుత్ర = కుమారా! రాఘవ = రామా, మమ = నాకు, శోకాయ = దుఃఖము కల్గించుటకై, న జాయేథాః యది = నీవు జన్మించక పోయినచో, అహమ్ = నేను, అప్రజాః = సంతానము లేనిదాననై, అతః = దీనికంటె, భూయః = అధికమైన, దుఃఖమ్ = దుఃఖమును, న స్మ పశ్యేయమ్ = చూడకుండెడిదానను.

తా. రామా! నాకు సంతానమే లేకున్నచో ఇంత దుఃఖ ముండెడిది కాదు. నీవు నాకు దుఃఖమును కల్గించుటకు మాత్రమే పుట్టినావు. ౩౬

మూ. ఏక ఏవ హి వన్ధ్యాయాః శోకో భవతి మానసః,
అప్రజాస్మీతి సంతాపో న హ్యన్యః పుత్ర విద్యతే. ౩7

ప్ర. అ. పుత్ర = కుమారా! వన్ధ్యాయాః = గొడ్రాలికి, అప్రజాః = సంతానము లేనిదానను, అస్మి = అయియున్నాను, ఇతి = అని, మానసః = మనస్సునకు సంబంధించిన, ఏకః = ఒక్కటే, శోకః ఏవ = శోకము మాత్రమే, భవతి హి = ఉండును కదా; అన్యః = మరొక, సంతాపః = సంతాపము, న విద్యతే హి = ఉండదు కదా!

తా. కుమారా! గొడ్రాలికి "నాకు సంతానము లేకపోయెనే" అను మానస మైన శోకము తప్ప మరి యే సంతాపము ఉండదు కదా! 37

మూ. న దృష్టపూర్వం కల్యాణం సుఖం వా పతిపౌరుషే,
అపి పుత్రేఽపి పశ్యేయమితి రామాస్థితం మయా. 38

ప్ర. అ. రామ! = ఓ రామా!, పతిపౌరుషే = భర్తయొక్క పురుషాధి కారము నందు, కల్యాణమ్ = మంగళముగాని, సుఖం వా = సుఖము గాని, న దృష్టపూర్వమ్=పూర్వ మెన్నడును చూడబడలేదు. పుత్రేఽపి=కొడుకు నందైన, అపి పశ్యేయమ్ = చూడ కల్గుదునా! ఇతి=అని, మయా=నాచేత, ఆస్థితమ్ = కోరబడినది.

తా. రామా! భర్త అధికారములో నున్నపుడు పూర్వము నే నెన్నడును మంగళమును గాని, సుఖమును గాని, చూచి ఎరుగను. పుత్రుడు అధికారమునకు వచ్చిన తరువాత చూచెదనులే అని నేను కోరుకొనుచుంటిని. 38

మూ. సా బహూన్యమనోజ్ఞాని వాక్యాని హృదయచ్ఛిదామ్,
అహం శ్రోష్యే సపత్నీనామవరాణాం వరా సతీ. 39

ప్ర. అ. సా అహమ్ = అట్టి నేను, వరా సతీ = అందరికన్న శ్రేష్ఠురాలం నై ఉండి, అవరాణామ్ = నా కంటె తక్కువ వారైన, హృదయచ్ఛిదామ్ = హృదయము ఛేదించువా రైన, సపత్నీనామ్=సవతులయొక్క, అమనోజ్ఞాని= దుఃఖకరము లైన, బహూని = అనేక మైన, వాక్యాని=వాక్యములను, శ్రోష్యే =వినగలను.

తా. అట్టి నేను, అందరికంటె శ్రేష్ఠురాల నై యుండి, మాటలచే హృదయ మును ఛేదించువారూ, నాకంటె తక్కువ వారూ అయిన, సవతులు పలుకు ఎన్నో చెడ్డమాటలను వినవలసియున్నది. 39

మూ. అతో దుఃఖతరం కిం ను ప్రమదానాం భవిష్యతి,
మమ శోకో విలాపశ్చ యాదృశోఽయమనన్తకః. 40

ప్ర, అ. మమ = నాకు, అనంతకః = అంతము లేని, యాదృశః = పెద్ద, శోకః = దుఃఖము, విలాపశ్చ = విలాపము (వచ్చినదో), అతః = దీనికంటే, ప్రమదానామ్ = స్త్రీలకు, దుఃఖతరమ్ = ఎక్కువ దుఃఖమును కల్గించునది, కిం ను = ఏది, భవిష్యతి = ఉండగలదు.

తా. నా కిపుడు అనంత మైన పెద్ద శోకవిలాపములు సంప్రాప్తించినవో ఇంతకు మించిన దుఃఖము స్త్రీలకు ఏమి యుండును? 40

మూ. త్వయి సన్నిహితేఽప్యేవమహమాసం నిరాకృతా,
కిం పునః ప్రోషితే తాత ధ్రువం మరణమేవ మే. 41

ప్ర. అ. తాత! = తండ్రీ, త్వయి = నీవు, సన్నిహితేఽపి = దగ్గర ఉండగానే, అహమ్ = నేను, ఏవమ్ = ఈ విధముగా, నిరాకృతా ఆసమ్ = తిరస్కరింపబడితిని. ప్రోషితే = నీవు ప్రవాసమునకు వెళ్లగా, కిం పునః = చెప్ప నేల, మే = నాకు, మరణమ్ = మరణమే, ధ్రువమ్ = నిశ్చితము.

తా. నాయనా! నీవు దగ్గర ఉండగనే నన్నిట్లు తిరస్కరించుచున్నారు. నీవు ప్రవాసమునకు వెళ్లిన పిమ్మట ఇక చెప్పవలెనా! నాకు మరణము తప్పదు. 41

మూ. అత్యన్తనిగృహీతాస్మి భర్తుర్నిత్యమతన్త్రితా,
పరివారేణ కైకేయ్యాః సమా వాప్యథవాఽవరా. 42

ప్ర. అ. కైకేయ్యాః = కైకేయియొక్క, పరివారేణ = దాసీజనముతో, సమా వా = సమాన మైన దాసనుగా గాని, అథవా = లేక, అవరా = తక్కువ దాసనుగా గాని, అతన్త్రితా = స్వాతంత్ర్యవిహీనురాలుగా చేయబడి, నిత్యమ్ = ఎల్లపుడు, భర్తుః = భర్తకు (భర్తచే), అత్యన్తనిగృహీతా = మిక్కిలి నిగ్రహింప బడినదానను, అస్మి = అయితిని.

తా. కైకేయియొక్క దాసీజనముతో సమానముగాను, అంతకంటె తక్కువగాను కూడ నన్ను చూచుచు స్వాతంత్ర్యము లేనిదానినిగా చేసి భర్త నన్ను మిక్కిలి నిగ్రహించినాడు. 42

మూ. యో హి మాం సేవతే కశ్చిదథవాప్యనువర్తతే,
కైకేయ్యాః పుత్రమన్వీక్ష్య స జనో నాభిభాషతే. 43

ప్ర. అ. యః = ఏ, కశ్చిత్ = ఒకానొక వ్యక్తి యైనను, మామ్ = నన్ను, సేవతే = సేవించుచున్నాడో, అథవా = లేక, అనువర్తతే = అనుసరించుచున్నాడో, సః జనః = ఆ జనుడు, కైకేయ్యాః = కైకేయియొక్క, పుత్రమ్ = పుత్రుని, అన్వీక్ష్య = చూచి, నాభిభాషతే హి = పలుకడు కదా.

తా. ఇపుడు నన్ను సేవించుచున్నవారును, అనుసరించి యున్న వారును ఇటుపై భరతుని చూచి (భరతునికి భయపడి) నన్ను పలుకరించరు. 43

మూ. నిత్యక్రోధతయా తస్యాః కథం ను ఖరవాది తత్,
కైకేయ్యా వదనం ద్రష్టుం పుత్ర శక్ష్యామి దుర్గతా. 44

ప్ర. అ. పుత్ర = కుమారా! దుర్గతా = కష్టములలో పడిన నేను, నిత్యక్రోధతయా = నిత్యమైన కోపము కలదగుటచే, ఖరవాది = పరుషముగా మాటలాడు, తస్యాః కైకేయ్యాః = ఆ కైకేయియొక్క, వదనమ్ = ముఖమును, ద్రష్టుమ్ = చూచుటకు, కథం ను = ఎట్లు, శక్ష్యామి = సమర్థురాల నగుదును.

తా. కైకేయి సర్వదా కోపముతో మండిపడుచుండును. కష్టములలో తగుల్కొన్న నేను, పరుషములగు మాటలనే పలుకు ఆమె ముఖమును ఎట్లు చూడగలను? 44

మూ. దశ సప్త చ వర్షాణి తవ జాతస్య రాఘవ,
అసితాని ప్రకాంక్షన్త్యా మయా దుఃఖపరిక్షయమ్. 45

ప్ర. అ. రాఘవ = రామా! తవ జాతస్య = ఉపనయనసంస్కారమైన పిదప, నీవు ద్వితీయజన్మ పొందిన తరువాత, దశ సప్త చ = పదునేడు, వర్షాణి = సంవత్సరములు, దుఃఖపరిక్షయమ్ = దుఃఖనాశమును, ప్రకాంక్షన్త్యా = కోరుచున్న, మయా = నాచేత, అసితాని = గడపబడినవి.

తా. రామా! నీకు ఉపనయనము జరిగిన పిదప ఎప్పటికైన ఈ దుఃఖములు తొలగును అను ఆశతో పదునేడు సంవత్సరములు నేను నిరీక్షించుచుంటిని.

వి. ఈ శ్లోకమునకు అక్షరార్థమును మాత్రము గ్రహించినచో, "నీకు పదునేడు సంవత్సరముల వయస్సు వచ్చువరకు నేను వేచియున్నాను" అని అర్థము వచ్చును. కాని అక్కడక్కడ సూచించిన రాముని వయస్సు ప్రకారము ఆ అర్థము ఇచట కుదరదు. అందుచే నీవు పుట్టిన తరువాత అనగా నీకు ఉపనయనమై నీవు రెండవమారు పుట్టిన తరువాత అను అర్థమును వ్యాఖ్యాతలు చెప్పిరి. 45

మూ. తదక్షయం మహద్దుఃఖం నోత్సహే సహితుం చిరమ్,
విప్రకారం సపత్నీనామేవం జీర్ణాపి రాఘవ. 46

ప్ర. అ. రాఘవ = రామా, తత్ = ఆ కారణమువలన, ఏవమ్ = ఈ విధముగ, జీర్ణాపి = ముసలిదాన నైనను, అక్షయమ్ = అంతము లేని, మహత్ = గొప్ప, దుఃఖమ్ = దుఃఖమును, సపత్నీనామ్ = సవతుల, విప్రకారమ్ = అవమానమును, చిరమ్ = చిరకాలము, సహితుమ్ = సహించుటకు, నోత్సహే = కోరను.

తా. అందుచే ఓ రామా! సవతులు చేయు అవమానమును, అంతము లేని ఈ మహాదుఃఖమును, ఈ వృద్ధావస్థలో నేను చాలాకాలము సహింపజాలను. 46

మూ. అపశ్యన్తీ తవ ముఖం పరిపూర్ణశశిప్రభమ్,
కృపణా వర్తయిష్యామి కథం కృపణజీవికామ్. 47

ప్ర. అ. కృపణా = దీనురాల నైన నేను, తవ = నీయొక్క, పరిపూర్ణశశిప్రభమ్ = పూర్ణచంద్రుని వంటి కాంతి గల, ముఖమ్ = ముఖమును, అపశ్యన్తీ = చూడనిదాన నై, కృపణజీవికామ్ = దైన్యముతో గూడిన జీవనమును, కథమ్ = ఎట్లు, వర్తయిష్యామి = చేయుదును.

తా. పరిపూర్ణచంద్రుని వంటి నీ ముఖము కనబడక, దుఃఖాక్రాంతురాల నైన నేను దైన్యముతో నిండిన జీవనమును ఎట్లు గడపగలను? 47

మూ. ఉపవాసైశ్చ యోగైశ్చ బహుభిశ్చ పరిశ్రమైః,
దుఃఖం సంవర్ధితో మోఘం త్వం హి దుర్గతయా మయా 48

ప్ర. అ. త్వమ్ = నీవు, దుర్గతయా = దురదృష్టవంతురాల నైన, మయా = నాచేత, ఉపవాసైశ్చ = ఉపవాసములతోను, యోగైశ్చ = దేవతా ధ్యానములతోను, బహుభిః = అనేక మైన, పరిశ్రమైశ్చ = వ్రతాదిశ్రమలతోను, దుఃఖమ్ = అతికష్టముగా, మోఘమ్ = వ్యర్థముగా, సంవర్ధితః = పెంచబడితివి.

తా. దురదృష్టవంతురాలం నగు నేను, ఎన్నియో ఉపవాసములు, దేవతా ధ్యానములు, శ్రమకరము లైన వ్రతాదులు చేసి, ఎంతో కష్టపడి పెంచితిని. అది యంతయు వ్యర్థ మైపోయినది. 48

మూ. స్థిరం తు హృదయం మన్యే మమేదం యన్న దీర్యతే,
ప్రావృషీవ మహానద్యాః స్పృష్టం కూలం నవామ్భసా. 49

ప్ర. అ. ప్రావృషి = వర్షకాలమునందు, నవామ్భసా = క్రొత్త నీటిచే, స్పృష్టమ్ = స్పృశింపబడిన, మహానద్యాః = మహానదియొక్క, కూలమ్ ఇవ = ఒడ్డువలె, మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, హృదయమ్ = హృదయము, యత్ = ఏకారణమువలన, న దీర్యతే = బ్రద్దలుచేయబడ కున్నదో (ఆ కారణము వలన), స్థిరమ్ = గట్టిదానినిగా, మన్యే = తలచుచున్నాను.

తా. ఈ వార్త విని కూడ నా హృదయము వర్షకాలమునందు క్రొత్త నీరు తగిలిన మహానదీతీరము వలె బ్రద్దలగుట లేదు. అందుచే ఇది చాల గట్టి దని అనుకొనుచున్నాను. 49

మూ. మమైవ నూనం మరణం న విద్యతే
న చావకాశోఽస్తి యమక్షయే మమ,
యదన్తకోఽద్యైవ న మాం జిహీర్షతి
ప్రసహ్య సింహో రుదతీం మృగీమివ. 50

ప్ర. అ. సింహః = సింహము, రుదతీమ్ = ఏడ్చుచున్న, మృగీమివ = ఆడ లేడిని వలె, మామ్ = నన్ను, అన్తకః = యముడు, ప్రసహ్య = బలాత్కారముగా, అద్యైవ = ఇపుడే, యత్ = ఏకారణమువలన, న జిహీర్షతి = హరించుటకు ఇచ్ఛయించుట లేదో (ఆ కారణమువలన), మమ = నాకు, నూనమ్ = నిశ్చయముగ,

మరణమ్=మరణము, న విద్యతే=లేదు. మమ=నాకు, యమక్షయే=యమ లోకమునందు, అవకాశః=అవకాశము, నాస్తి=లేదు.

తా. నిజముగా నాకు మరణమే లేదు. యమలోకములో నాకు చోటు లేదు. అందువలననే యముడు నన్ను, ఏడ్చుచున్న ఆడలేడిని సింహము వలె, ఇప్పుడే బలాత్కారముగా లాగికొని పోవుట లేదు. 50

మూ. స్థిరం హి నూనం హృదయం మమాయసం
న భిద్యతే యద్భువి నావదీర్యతే,
అనేన దుఃఖేన చ దేహమర్పితం
ధ్రువం హ్యకాలే మరణం న విద్యతే. 51

ప్ర. అ. నూనమ్=నిజముగా, మమ=నాయొక్క, స్థిరమ్=గట్టిదైన, హృదయమ్=హృదయము, ఆయసమ్=ఇనుముతో చేసినది. యత్=ఏ కారణము వలన, న భిద్యతే=బద్దలగుటలేదో, భువి=నేలపై, నావదీర్యతే=ముక్కలై పడిపోవుట లేదు. అనేన=ఈ, దుఃఖేన=దుఃఖముచేత, దేహమ్=దేహమును, అర్పితమ్=అర్పింపబడినది (వ్యాపింపబడినది). అకాలే=సమయము కాని సమయమున, మరణమ్=మరణము, న విద్యతే=లేదు. ధ్రువమ్=ఇది నిశ్చితము.

తా. ఈ దుఃఖము దేహమునందును వ్యాపించియున్నది. ఐనను, నా హృదయము స్థిరముగా నున్నది. బద్దలై నేలమీద పడిపోవుటలేదు. ఇది నిజముగా ఇనుముతో చేయబడినది. అకాలమునందు మరణము రాదు; ఇది నిశ్చయము. 51

మూ. ఇదం తు దుఃఖం యదనర్థకాని మే
వ్రతాని దానాని చ సంయమాశ్చ హి,
తపశ్చ తప్తం యదపత్యకారణాత్,
సునిష్ఫలం బీజమివోప్త మూషరే. 52

ప్ర. అ. మే=నాయొక్క, వ్రతాని=వ్రతములు, దానాని చ=దానములు, సంయమాశ్చ=నియమములు, అనర్థకానీతి యత్=వ్యర్థము లైనవి

యను మాట ఏది కలదో, ఇదమ్ = ఇది, దుఃఖమ్ = దుఃఖము. అపత్యకాఙ్క్షిణా = సంతానముకొరకై, తప్తమ్ = చేయబడిన, యత్ = ఏ, తపః = తపస్సు కలదో (అది), ఊషరే = చవిటినేలపై, ఉప్తమ్ = నాటబడిన, బీజమ్ ఇవ = విత్తనము వలె, సునిష్ఫలమ్ = పూర్తిగ వ్యర్థ మైనది.

తా. నేను చేసిన వ్రతములు దానములు నియమములు ఇవి అన్నియు, వ్యర్థ మై పోయినవి కదా యని చాల దుఃఖము కలుగుచున్నది. సంతానము కొరకై నేను చేసిన తపస్సు కూడ ఊషరక్షేత్రమునందు నాటిన విత్తనము వలె నిష్ఫలం మై పోయినది. ६२

మూ. యది హ్యకాలే మరణం స్వయేచ్ఛయా
లభేత కశ్చిద్గురుదుఃఖకర్శితః,
గతాహమద్యైవ పరేతసంపదం
వినా త్వయా ధేనురివాత్మజేన వై. ६३

ప్ర. అ. కశ్చిత్ = ఎవ డైన, గురుదుఃఖకర్శితః = అధిక మైన దుఃఖముచే పీడింపబడినవాడై, స్వయా = తన సంబంధ మైన, ఇచ్ఛయా = కోరికచేత, అకాలే = అకాలమునందు, మరణమ్ = మరణమును, లభేత యది = పొంది నట్లైతే, అహమ్ = నేను, అద్యైవ = ఇప్పుడే, ఆత్మజేన వినా = దూడలేని, ధేనురివ = ఆవు వలె, త్వయా వినా = నీవు లేకపోవుటచే, పరేతసంపదమ్ = యమలోకమును, గతా = పొందెడిదానను.

తా. అధిక మైన కష్టములలో నున్నవారు అకాలమునందు కూడ తన ఇష్టము ప్రకారము, మరణింపగల్గినచో, నీవు లేని నేను, దూడలేని ఆవు వలె, ఇప్పుడే యములోకమునకు వెళ్లియుండెడిదానను. ६३

మూ. అథాపి కిం జీవిత మద్య మే వృథా
త్వయా వినా చన్ద్రనిభాననప్రభ!
అనువ్రజిష్యామి వనం త్వయైవ గౌః
సుదుర్బలా వత్సమివానుకాఙ్క్షయా. ६४

ప్ర. అ. అథాపి = అయినను. చన్ద్రనిభాననప్రభ = చంద్రునితో సమానమైన ముఖకాంతి కలవాడా! త్వయా వినా = నీవు లేక, మే = నాయొక్క, జీవితమ్ = జీవితమున, కిమ్ = ఏమి జీవితము? వృథా = వ్యర్థమైనదే. సుదుర్బలా = చాల దుర్బలమైన, గౌః = ఆవు, వత్సమ్ ఇవ = లేగదూడను వలె, అనుకాఙ్క్షయా = వాత్సల్యముతో, త్వయైవ = నీ తోడనే, అద్య = ఇపుడు, వనమ్ = వనమును గూర్చి, అనుప్రవేక్ష్యామి = అనుసరించి వెళ్లగలను.

తా. అనను ఈ జీవితముతో ఏమి ప్రయోజనము? చంద్రసమానమైన ముఖకాంతి గల ఓ రామా! నీవు లేనిచో నా జీవితము వ్యర్థము. దుర్బలమైన గోవు లేగదూడ వెనుక వెళ్లినట్లు, నేను వాత్సల్యముతో నిన్నే అనుసరించి అరణ్యమునకు వచ్చెదను. 54

మూ. భృశమసుఖమమర్షితా తదా
బహు విలలాప సమీక్ష్య రాఘవమ్,
వ్యసనముపనిశామ్య సా మహత్
సుతమివ బద్ధమవేక్ష్య కిన్నరీ. 55

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
వింశః సర్గః.

ప్ర. అ. సా = ఆ కౌసల్య, రాఘవమ్ = రాముని, సమీక్ష్య = చూచి, మహత్ = గొప్పదైన, వ్యసనమ్ = దుఃఖమును, ఉపనిశామ్య = చూచి, బద్ధమ్ = కట్టబడిన, సుతమ్ = కుమారుని, అవేక్ష్య = చూచి, కిన్నరీవ = కిన్నరస్త్రీ వలె, తదా = అపుడు, అసుఖమ్ = దుఃఖపూర్వకముగా, అమర్షితా = కోపముతో కూడినదై, భృశమ్ = అధికముగా, బహు = బహువిధములుగా, విలలాప = విలపించెను.

తా. అపు డా కౌసల్య రాముని చూచి వచ్చిన ఆ గొప్ప ఆపదను గూర్చి ఆలోచించుచు, దుఃఖక్రోధములతో బంధింపబడిన కుమారుని చూచి కిన్నరస్త్రీ వలె బహువిధముల మిక్కిలి విలపించెను. 55

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఇరువదవ సర్గ సమాప్తము.

## అథ ఏకవింశః సర్గః

*[లక్ష్మణుని క్రోధము, శ్రీరాముని బలాత్కారముగ రాజ్యము చేజిక్కించుకొమ్మని అతడు శ్రీరాముని ప్రేరించుట, రాముడు పితృాజ్ఞా పాలనయే ధర్మమని తల్లికిని, లక్ష్మణునికిని నచ్చజెప్పుట.]*

మూ. తథా తు విలపన్తీం తాం కౌసల్యాం రామమాతరమ్,
ఉవాచ లక్ష్మణో దీనస్తత్కాలసదృశం వచః 1

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, దీనః = దీనుడై, తథా = ఆ విధముగ, విలపన్తీమ్ = విలపించుచున్న, రామమాతరమ్ = రాముని తల్లి యైన, తాం కౌసల్యామ్ = ఆ కౌసల్యను గూర్చి, తత్కాలసదృశమ్ = ఆ కాలమునకు తగిన, వచః = మాటను, ఉవాచ = పలికెను.

తా. ఈ విధముగ విలపించుచున్న రాముని తల్లి యైన కౌసల్యతో లక్ష్మణుడు దీనుడై, ఆ సమయమునకు తగి నట్లు ఈ విధముగా పలికెను. 1

మూ. న రోచతే మమాప్యేతదార్యే యద్రాఘవో వనమ్,
త్యక్త్వా రాజ్యశ్రియం గచ్ఛేత్ స్త్రియా వాక్యవశం గతః.

ప్ర. అ. ఆర్యే = పూజ్యురాలా, రాఘవః = రాముడు, స్త్రియాః = ఒక ఆడుదానియొక్క, వాక్యవశం గతః = మాటలకు లొంగిపోయినవా డై, రాజ్యశ్రియమ్ = రాజ్యలక్ష్మిని, త్యక్త్వా = విడచి, వనమ్ = వనమును గూర్చి, గచ్ఛేత్ ఇతి యత్ = వెళ్లవలెను అనునది ఏది కలదో, ఏతత్ = ఇది, మమాపి = నాకు కూడ, న రోచతే = ఇష్టము కాదు.

తా. అమ్మా! రాముడు ఒక ఆడుదాని మాటలకు లొంగి, రాజ్యలక్ష్మిని విడచి అరణ్యమునకు వెళ్లుట నాకు కూడ ఇష్టము కాదు. 2

మూ. విపరీతశ్చ వృద్ధశ్చ విషయైశ్చ ప్రధర్షితః,
నృపః కిమివ న బ్రూయాచ్చోద్యమానః సమన్మథః. 3

ప్ర. అ. విపరీతశ్చ = విపరీతబుద్ధి కలవాడు, వృద్ధశ్చ = వృద్ధుడు, విషయైః = భోగములందే, ప్రధర్షితః చ = లొంగదీసుకొనబడినవాడు, సమన్మథః = కామముతో కూడినవాడు అన, నృపః = రాజు, చోద్యమానః = (కైకచే) ప్రేరేపింపబడుచున్న వాడై, కిమివ = దేనిని, న బ్రూయాత్ = పలుకడు.

తా. విపరీతబుద్ధి కలవాడు, వృద్ధుడు, భోగాసక్తుడు, కామపీడితుడు అన రాజు కైక ప్రేరేపింపగా ఏ మైనను మాటలాడవచ్చును. 3

మూ. నాస్యాపరాధం పశ్యామి నాపి దోషం తథావిధమ్,
యేన నిర్వాస్యతే రాష్ట్రాద్వనవాసాయ రాఘవః. 4

ప్ర. అ. రాఘవః = రాముడు, యేన = దేనిచే, రాష్ట్రాత్ = రాష్ట్రము నుండి, వనవాసాయ = వనవాసముకొరకు, నిర్వాస్యతే = వెడలగొట్టబడుచున్నాడో, తథావిధమ్ = అట్టి, అస్య = ఈ రాముని, అపరాధమ్ = అపరాధమును, న పశ్యామి = చూడను. దోషమ్ అపి = దోషమును కూడ, న = చూడను.

తా. ఈ రామునిలో రాష్ట్రమునుండి వెడలగొట్టి వనవాసమునకు పంప దగిన అపరాధము గాని దోషము గాని, నా కేదియు కనబడుటలేదు. 4

మూ. న తం పశ్యామ్యహం లోకే పరోక్షమపి యో నరః,
స్వమిత్రోఽపి నిరస్తోఽపి యోఽస్య దోషముదాహరేత్. 5

ప్ర. అ. స్వమిత్రోఽపి = మిక్కిలి శత్రువైనను, నిరస్తోఽపి = తిరస్కరింపబడినవాడైనను, యః నరః = ఏ నరుడు, పరోక్షమపి = పరోక్షముగానైనను, అస్య = ఈ రాముని, దోషమ్ = దోషమును, ఉదాహరేత్ = చెప్పునో, తమ్ = అట్టివానిని, అహమ్ = నేను, లోకే = లోకమునందు, న పశ్యామి = చూడను.

తా. ఎంత శత్రువైనను, తిరస్కరింపబడిన వాడైనను, ఏ ఒక్కడును, పరోక్షముగా నైన, రాముని గూర్చి చెడ్డగా మాటలాడగా నేను ఈ లోకములో చూడలేదు. 5

మూ. దేవకల్పమృజుం దాన్తం రిపూణామపి వత్సలమ్,
అవేక్షమాణః కో ధర్మం త్యజేత్పుత్రమకారణాత్. 6

ప్ర. అ. ధర్మమ్ = ధర్మమును, అవేక్షమాణః = చూచు, కః = ఎవరు, దేవకల్పమ్ = దేవతలతో సమానుడును, ఋజుమ్ = కపటము లేనివాడును, దాన్తమ్ = ఇంద్రియనిగ్రహము కలవాడును, రిపూణామపి = శత్రువులం విషయమునందు కూడ, వత్సలమ్ = ప్రేమకలవాడును అయిన, పుత్రమ్ = పుత్రుని, అకారణాత్ = కారణము లేకుండగ, త్యజేత్ = త్యజించును ?

తా. ధర్మబుద్ధి కలవా డెవ్వ డైన, కారణ మేమియు లేకుండ దేవతాతుల్యుడు, కపటములేనివాడు, ఇంద్రియనిగ్రహవంతుడు, శత్రువులపై కూడ వాత్సల్యము కలవాడు ఐన కుమారుని పరిత్యజించునా ? 6

మూ. తదిదం వచనం రాజ్ఞః పునర్బాల్యముపేయుషః,
పుత్రః కో హృదయే కుర్యా ద్రాజవృత్తమనుస్మరన్. 7

ప్ర. అ. రాజవృత్తమ్ = రాజధర్మమును, అనుస్మరన్ = స్మరించు, కః పుత్రః = ఏ పుత్రుడు, పునః = మరల, బాల్యమ్ = బాల్యమును, ఉపేయుషః = పొందిన, రాజ్ఞః = రాజుయొక్క, తత్ ఇదం వచనమ్ = అట్టి ఈ మాటను, హృదయే = హృదయమునందు, కుర్యాత్ = చేయును.

తా. మరల బాల్యము పొందినవాడు వలె ప్రవర్తించుచున్న ఈ రాజు మాటలను రాజధర్మము తెలిసిన కుమారు డెవ్వ డైనా అంగీకరించునా. 7

మూ. యావదేవ న జానాతి కశ్చిదర్థ మిమం నరః,
తావదేవ మయా సార్ధమాత్మస్థం కురు శాసనమ్. 8

ప్ర. అ. కశ్చిత్ = ఎవ్వ డైన, నరః = నరుడు, ఇమమ్ అర్థమ్ = ఈ విషయమును, యావదేవ = ఎంతలో, న జానాతి = తెలుసుకొనడో, తావదేవ = అంతలో, మయా సార్ధం = నాతో కలసి, శాసనమ్ = అధికారమును, ఆత్మస్థమ్ = నీకుచెందినదానినిగా, కురు = చేయుము.

తా. ఈ విషయము ఇతరు లెవ్వరికి తెలియకముందే నా సహాయముతో రాజ్యాధికారమును చేత చిక్కించుకొనుము. 8

మూ. మయా పార్శ్వే సధనుషా తవ గుప్తస్య రాఘవ,
కః సమర్థోఽధికం కర్తుం కృతాన్తస్యేవ తిష్ఠతః 9

ప్ర. అ. రాఘవ = ఓ రామా! పార్శ్వే = పార్శ్వమునందు, సధనుషా = ధనుస్సుతో కూడిన, మయా = నాచేత, గుప్తస్య = రక్షింపబడినవాడ వై, కృతాంత స్యేవ = యముడు వలె, తిష్ఠతః = నిలిచియున్న నీకు, అధికమ్ = అధికము, కర్తుం = చేయుటకు, కః = ఎవడు, సమర్థః = సమర్థుడు.

తా. రామా! ధనుర్ధారి నై నేను, ప్రక్క నిలిచి రక్షించుచుండగా, యముని వలె నిలిచి యున్న నీకు హెచ్చుతగ్గులు చేయువా డెవ్వడు? 9

మూ. నిర్మనుష్యామిమాం కృత్స్నామయోధ్యాం మనుజర్షభ,
కరిష్యామి శరైస్తీక్ష్ణైర్యది స్థాస్యతి విప్రియే. 10

ప్ర. అ. మనుజర్షభ = ఓ మానవశ్రేష్ఠా! విప్రియే = నీకు అపకారము చేయుట యందు, స్థాస్యతి యది = నిలిచినట్లైతే, ఇమామ్ = ఈ, కృత్స్నామ్ = సమస్త మైన, అయోధ్యామ్ = అయోధ్యను, తీక్ష్ణైః = తీక్ష్ణము లైన, శరైః = బాణములతో, నిర్మనుష్యామ్ = మనుష్యులు లేనిదానినిగా, కరిష్యామి = చేసెదను.

తా. మనుష్యులలో శ్రేష్ఠుడ వైన ఓ రామా! ఈ అయోధ్యానగరము నీకు ఎదురు తిరిగినచో దీనిని తీక్ష్ణ మైన బాణములతో మనుష్యశూన్యముగా చేసెదను. 10

మూ. భరతస్యాథ పక్ష్యో వా యో వాస్య హితమిచ్ఛతి,
సర్వాంస్తాన్ వధిష్యామి మృదుర్హి పరిభూయతే. 11

ప్ర. అ. అథ = మరియు, (ఎవడు), భరతస్య = భరతునియొక్క, పక్ష్యో వా = పక్షమునకు చెందినవాడో, యో వా = ఎవడు, అస్య = ఈతనియొక్క, హితమ్ = హితమును, ఇచ్ఛతి = కోరుచున్నాడో, ఏతాన్ సర్వాన్ = వీరి నందరిని, వధిష్యామి = చంపెదను. మృదుః = మెత్తనివాడు, పరిభూయతే హి = తిరస్కరింపబడును గదా!

తా. భరతుని పక్షమునకు చెందినవారిని, అతని హితము కోరువారిని, అందరిని వధించెదను. లోకములో మెత్తనివానిని అందరు తిరస్కరించు చుందురు. 11

మూ. ప్రోత్సాహితో౽యం కైకేయ్యా స దుష్టో యది నః పితా,
అమిత్రభూతో నిస్సఙ్గం వధ్యతాం బధ్యతామపి. 12

ప్ర. అ. కైకేయ్యా=కైకేయిచేత, ప్రోత్సాహితః=ప్రోత్సాహింపబడినవాడై, సః=అట్టి, దుష్టః=దుష్టు డైన, నః పితా=మన తండ్రి, అమిత్రభూతః యది=శత్రు వైనచో, నిస్సఙ్గం=ప్రేమ లేకుండగా, అయమ్=ఇతడు, బధ్యతామ్=బంధింపబడుగాక, వధ్యతామపి=వధింపబడుగాక.

తా. దుష్టు డైన మన తండ్రి కైకేయి ప్రోత్సాహముతో మనకు శత్రువుగా ప్రవర్తించినచో ఎట్టి ప్రేమయు చూపక అతనిని బంధించెదను. అవసరమైనచో వధించెదను. 12

మూ. గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః,
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్. 13

ప్ర. అ. అవలిప్తస్య=గర్వించినవాడును, కార్యాకార్యమ్=కార్యాకార్యములను, అజానతః=తెలియనివాడును, ఉత్పథమ్=అమార్గమును, ప్రతిపన్నస్య=పొందినవాడును అగు, గురోరపి=(తండ్రి) మొదలగు గురువులయొక్క కూడ, శాసనమ్=శాసనము, కార్యమ్=చేయదగినది, భవతి=అగును.

తా. గురు వైనను దృప్తు డై మంచి చెడ్డలు తెలియక అమార్గము నవలంబించినచో అతనిని శిక్షింపవలెను. 13

మూ. బలమేష కిమాశ్రిత్య హేతుం వా పురుషర్షభ,
దాతుమిచ్ఛతి కైకేయ్యై రాజ్యం స్థితమిదం తవ. 14

ప్ర. అ. పురుషర్షభ=ఓ పురుషశ్రేష్ఠుడా, తవ=నీదిగా, స్థితమ్=ఉన్న, ఇదమ్=ఈ, రాజ్యమ్=రాజ్యమును, ఏషః=ఇతడు, కిమ్=ఏ, బలమ్ = బలమును గాని, హేతుం వా=కారణమును గాని, ఆశ్రిత్య=ఆశ్రయించి, కైకేయ్యై=కైకేయికొరకు, దాతుమ్=ఇచ్చుటకు, ఇచ్ఛతి=కోరుచున్నాడు.

తా. పురుషశ్రేష్ఠు డైన ఓ రామా! ఈతడు ఏ బలమును చూచుకొని, ఏ కారణముచే నీకు చెందిన ఈరాజ్యమును కైకేయికి ఇవ్వదలచుచున్నాడు? 14

మూ. త్వయా చైవ మయా చైవ కృత్వా వైరమనుత్తమమ్,
కాస్య శక్తిః శ్రియం దాతుం భరతాయారిశాసన. 15

ప్ర. అ. అరిశాసన=శత్రువులను శాసించువాడా! త్వయా చైవ=నీతోను, మయా చైవ=నాతోను, అనుత్తమమ్=గొప్ప, వైరమ్=వైరమును, కృత్వా=చేసి, అస్య=ఇతనికి, భరతాయ=భరతునకు, శ్రియమ్=ఐశ్వర్యమును, దాతుమ్=ఇచ్చుటకు, కా శక్తిః=ఏమి శక్తి ఉన్నది.

తా. శత్రుసంహారచతురుడ వైన ఓ రామా! నీతోనూ, నాతోనూ గొప్ప వైరము పెట్టుకొని, భరతునికి రాజ్య మీయ గల శక్తి ఇతనికి ఎక్కడిది? 15

మూ. అనురక్తోఽస్మి భావేన భ్రాతరం దేవి తత్త్వతః,
సత్యేన ధనుషా చైవ దత్తేనేష్టేన తే శపే. 16

ప్ర. అ. దేవి=ఓ దేవీ, తత్త్వతః=యథార్థముగా, భావేన = మనోభావముతో, భ్రాతరమ్=సోదరు డైన రాముని గూర్చి, అనురక్తః అస్మి=అనురాగము కలవాడ నై ఉన్నాను. సత్యేన=సత్యముచేతను, ధనుషా చైవ=ధనుస్సుచేతను, దత్తేన=దానముచేతను, ఇష్టేన= యాగముచేతను, తే=నీకు, శపే= ఒట్టు పెట్టుచున్నాను.

తా. తల్లీ! యథార్థముగ నేను సోదరు డైన రామునిపై మనఃపూర్వకముగ అనురాగవంతుడ నై ఉన్నాను. సత్యముమీదను, ధనస్సుమీదను, దానయాగముల మీదను ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 16

మూ. దీప్తమగ్నిం మరణ్యం వా యది రామః ప్రవేక్ష్యతి,
ప్రవిష్టం తత్ర మాం దేవి త్వం పూర్వమవధారయ. 17

ప్ర. అ. దేవి = ఓ తల్లీ! రామః=రాముడు, దీప్తమ్ = ప్రజ్వరించుచున్న, అగ్నిమ్ = అగ్నిని గాని, అరణ్యం వా = అరణ్యమును గాని, ప్రవేక్ష్యతి యది=ప్రవేశింపగలవా డైనచో, పూర్వమ్=ముందుగనే, మామ్=నన్ను, తత్ర = అచట, ప్రవిష్టమ్=ప్రవేశించిన వానినిగా, త్వమ్ = నీవు, అవధారయ=నిశ్చయించుము.

తా. ఓ తల్లీ రామును ప్రజ్వరిల్లుచున్న అగ్నిలో గాని, అరణ్యములో గాని ప్రవేశింపగలడు, అను స్థితి ఏర్పడి నపుడు నేను ముందుగానే దానిలో ప్రవేశించెదను. ఇది నిశ్చయము 17

మూ. హరామి వీర్యాద్దుఃఖం తే తమస్సూర్య ఇవోదితః,
దేవీ పశ్యతు మే వీర్యం రాఘవశ్చైవ పశ్యతు. 18

ప్ర. అ. ఉదితః=ఉదయించిన, సూర్యః=సూర్యుడు, తమ ఇవ=చీకటిని వలె, వీర్యాత్ నా పరాక్రమమువలన, తే దుఃఖమ్=నీ దుఃఖమును, హరామి=హరించెదను. దేవీ=తల్లి యైన నీవు, మే వీర్యమ్=నా పరాక్రమమును, పశ్యతు=చూచుగాక. రాఘవశ్చైవ = రాముడు కూడ, పశ్యతు = చూచుగాక.

తా. ఉదయించిన సూర్యుడు చీకటిని తొలగించి నట్లు నా పరాక్రమమును చూపి నీ దుఃఖమును తొలగించెదను. నీవును రామునును నా పరాక్రమమును చూడుడు. 18

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా లక్ష్మణస్య మహాత్మనః,
ఉవాచ రామం కౌసల్యా రుదతీ శోకలాలసా. 19

ప్ర. అ. మహాత్మనః=మహాత్ము డైన, లక్ష్మణస్య=లక్ష్మణునియొక్క, ఏతత్ వచనమ్=ఈ మాటను, శ్రుత్వా = విని, కౌసల్యా=కౌసల్య, రుదతీ=ఏడ్చుచు, శోకలాలసా=శోకముచే దుఃఖవ్యాప్తురాలై, రామమ్=రాముని గూర్చి, ఉవాచ=పలికెను.

తా. మహాపరాక్రమ శాలి యైన లక్ష్మణుని మాటలు విని కౌసల్య శోకాక్రాంతురాలై ఏడ్చుచు రామునితో ఇట్లనెను. 19

మూ. భ్రాతుస్తే వదతః పుత్ర లక్ష్మణస్య శ్రుతం త్వయా,
యదత్రానన్తరం కార్యం కురుష్వ యది రోచతే. 20

ప్ర. అ. పుత్ర=ఓ పుత్రా!, తే=నీయొక్క, భ్రాతుః = సోదరు డైన, లక్ష్మణస్య=లక్ష్మణుడు, వదతః= మాటలాడుచుండగా, త్వయా = నీచేత, శ్రుతమ్=వినబడినది రోచతే యది=నీకు ఇష్ట మైనచో, అత్ర= ఈ విషయ

మున, అనన్తరమ్=అనంతరము, యత్=ఏది, కార్యమ్=చేయదగినదో, దానిని (కురుష్వ=చేయుము).

తా. కుమారా! లక్ష్మణుని మాటలు విన్నావు గదా! నీ కిష్టమైనచో ఈ విషయమున చేయ దగిన తరువాతి పనులను చేయుము. 20

మూ. న చాధర్మ్యం వచః శ్రుత్వా సపత్న్యా మమ భాషితమ్,
విహాయ శోకసంతప్తాం గన్తుమర్హసి మామితః. 21

ప్ర. అ. మమ=నాయొక్క, సపత్న్యా=సవతిచేత, భాషితమ్=పలుక బడిన, అధర్మ్యమ్=ధర్మవిరుద్ధమైన, వచః=వచనమును, శ్రుత్వా=విని, శోకసన్తప్తామ్=శోకముతో బాధపడు చున్న, మామ్=నన్ను, విహాయ=విడచి, ఇతః=ఇచటినుండి, గన్తుమ్=వెళ్లిపోవుటకు, నార్హసి=తగవు.

తా. ధర్మవిరుద్ధమైన నా సవతి మాటలు విని శోకపీడితురాలనైన నన్ను విడచి, నీవు వెళ్లిపోవుట తగదు. 21

మూ. ధర్మజ్ఞ యది ధర్మిష్ఠో ధర్మం చరితుమిచ్ఛసి,
శుశ్రూష మామిహస్థస్త్వం చర ధర్మమనుత్తమమ్. 22

ప్ర. అ. ధర్మజ్ఞ=ధర్మములు తెలిసిన ఓ రామా! ధర్మిష్ఠః=ధార్మికుడవై, ధర్మమ్=ధర్మమును, చరితుమ్=ఆచరించుటకు, ఇచ్ఛసి యది=కోరు చున్నట్లైతే, త్వమ్=నీవు, ఇహస్థః=ఇచటనే ఉన్నవాడవై, మామ్=నన్ను శుశ్రూష=సేవించుము. అనుత్తమమ్=శ్రేష్ఠమైన, ధర్మమ్=ధర్మమును, చర=ఆచరించుము.

తా. రామా! నీవు ధర్మములు తెలిసినవాడవు. ధర్మిష్ఠుడవై ధర్మము లాచరించ వలె నను కోరిక ఉన్నచో ఇచటనే ఉండి నాకు శుశ్రూష చేయుచు మాతృశుశ్రూషారూప మగు ఉత్తమధర్మమును ఆచరించుము. 22

మూ. శుశ్రూషమాణో జననీం పుత్ర స్వగృహే నియతో వసన్,
పరేణ తపసా యుక్తః కాశ్యపస్త్రిదివం గతః. 23

ప్ర. అ. పుత్ర=కుమారా! కాశ్యపః=కాశ్యపుడు, జననీమ్=తల్లిని, శుశ్రూషః=సేవించుచు, నియతః=నియమవంతుడై, స్వగృహే=తన గృహము

నందే, వసన్ = నివసించుచు, పరమ్ = గొప్ప, తపసా = తపస్సుతో, యుక్తః = కూడినవాడై, త్రిదివమ్ = స్వర్గమును, గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. పుత్రా! పూర్వము కాశ్యపుడు నియమవంతుడై గృహము నందే నివసించుచు, తల్లికి శుశ్రూష చేయుచు ఆ విధముగ గొప్ప తపస్సు చేసి స్వర్గమునకు వెళ్ళినాడు. 23

మూ. యథైవ రాజా పూజ్యస్తే గౌరవేణ తథా హ్యహమ్,
త్వాం నాహమనుజానామి న గన్తవ్యమితో వనమ్ 24

ప్ర. అ. రాజా = రాజు, గౌరవేణ = గురుభావముచే, తే = నీకు, యథైవ = ఏ విధముగ, పూజ్యః = పూజింపదగినవాడో, అహమ్ = నేనుకూడ, తథా హి = అట్లే కదా। అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, నానుజానామి = అనుమతించుటలేదు. ఇతః = ఇచటనుండి, వనమ్ = వనమును గూర్చి, న గన్తవ్యమ్ = వెళ్లదగినదికాదు.

తా. గురువగుటచే (తండ్రి) రాజు నీ కే విధముగ పూజ్యుడో, తల్లి నగుటచే నేను గూడ అట్లే పూజ్యురాలను. నేను నీకు అనుమతి ఇచ్చుట లేదు. అందుచే అరణ్యమునకు వెళ్లవద్దు. 24

మూ. త్వద్వియోగాన్న మే కార్యం జీవితేన సుఖేన వా,
త్వయా సహ మమ శ్రేయ స్తృణానామపి భక్షణమ్. 25

ప్ర. అ. త్వద్వియోగాత్ = నీ వియోగమువలన, మే = నాకు, జీవితేన = జీవితముచేత గాని, సుఖేన వా = సుఖముచేత గాని, కార్యమ్ = కార్యము, న = లేదు. త్వయా సహ = నీతో కూడ ఉండి, మమ = నాకు, తృణానామ్ = తృణముల యొక్క, భక్షణమ్ అపి = భక్షణ మైనను, శ్రేయః = మంచిదే.

తా. నీవు దూర మైపోయిన పిమ్మట, ఈ జీవితముతో గాని, సుఖము లతో గాని, నా కేమియు ప్రయోజనము లేదు. నీ దగ్గర ఉండి, తృణములు భక్షించుచు జీవించినను మంచిదే. 25

మూ. యది త్వం యాస్యసి వనం త్యక్త్వా మాం శోకలాలసామ్,
అహం ప్రాయమిహాసిష్యే న హి శక్ష్యామి జీవితుమ్. 26

ప్ర. అ. శోకలాలసామ్ = శోకముతో వ్యాకులురాల నై ఉన్న, మామ్ = నన్ను, త్యక్త్వా = విడచి, త్వమ్ = నీవు, వనమ్ = వనమునుగూర్చి, యాస్యసి యది = వెళ్ళిన ట్లైతే, అహమ్ = నేను, ఇహ = ఇచట, ప్రాయమ్ ఆసిష్యే = ప్రాయోపవేశము చేసెదను. జీవితుమ్ = జీవించుటకు. న శక్ష్యామి హి = సమర్థురాలను కాజాలను కదా।

తా. శోకముచే బాధపడు చున్న నన్ను విడచి నీవు అరణ్యమునకు వెళ్ళి పోయినచో నేను జీవింపజాలను. ఇచటనే ప్రాయోపవేశము (ఆహారపానీయాది విసర్జనము) చేసెదను. 26

మూ. తతస్త్వం ప్రాప్స్యసే పుత్ర! నిరయం లోకవిశ్రుతమ్,
బ్రహ్మహత్యామివాధర్మాత్సముద్రః సరితాం పతిః. 27

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పుత్ర = ఓ కుమారా। త్వమ్ = నీవు, సరితాం పతిః = నదులకు భర్త యైన, సముద్రః = సముద్రుడు, అధర్మాత్ = అధర్మమువలన, బ్రహ్మహత్యామివ = బ్రహ్మహత్యను వలె, లోకవిశ్రుతమ్ = లోకములో ప్రసిద్ధ మైన, నిరయమ్ = దుర్గతిని, ప్రాప్స్యసే = పొందగల వు.

తా. నేను నీ నిమిత్తమై ప్రాణత్యాగము చేసినచో సముద్రుడు పిప్పలాద ముని విషయమున అధర్మముగ ప్రవర్తించి, అతని కోపమువలన కష్టమును పొందినట్లు, నీవు కూడ లోకప్రసిద్ధ మైన దుర్గతిని పొందెదవు. 27

మూ. విలపన్తీం తథా దీనాం కౌసల్యాం జననీం తతః,
ఉవాచ రామో ధర్మాత్మా వచనం ధర్మసంహితమ్. 28

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ధర్మాత్మా = ధర్మాత్ము డైన, రామః = రాముడు, దీనామ్ = దీనురాలైన, తథా = ఆ విధముగా, విలపన్తీమ్ = విలపించు చున్న, జననీమ్ = తల్లి యైన, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి, ధర్మసంహితమ్ = ధర్మముతో కూడిన, వచనమ్ = వచనమును, ఉవాచ = పలికెను.

తా. ధర్మాత్ము డైన రాముడు దీనురా లై ఆ విధముగ విలపించుచున్న తల్లి యైన కౌసల్యతో ధర్మసమ్మత మగు వచనము నిట్లు పలికెను. 28

మూ. నాస్తి శక్తిః పితుర్వాక్యం సమతిక్రమితుం మమ,
ప్రసాదయే త్వాం శిరసా గన్తుమిచ్ఛామ్యహం వనమ్. 29

ప్ర. అ. పితుః = తండ్రియొక్క, వాక్యమ్ = వాక్యమును, సమతిక్రమితుమ్ = అతిక్రమించుటకు, మమ = నాకు, శక్తిః = శక్తి, నాస్తి = లేదు. అహమ్ = నేను, శిరసా = శిరస్సుతో, త్వామ్ = నిన్ను, ప్రసాదయే = వేడుకొనుచున్నాను వనమ్ = వనమునుగూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. తండ్రి యాజ్ఞను అతిక్రమించు సామర్థ్యము నాకు లేదు. శిరస్సు వంచి నిన్ను వేడుకొనుచున్నాను. నేను అరణ్యమునకు వెళ్లవలసియున్నది. 29

మూ. ఋషిణా చ పితుర్వాక్యం కుర్వతా వ్రతచారిణా,
గౌర్హతా జానతా ధర్మం కణ్డునాపి విపశ్చితా. 30

ప్ర. అ. ఋషిణా = ఋషియు, వ్రతచారిణా = వ్రతమునాచరించువాడు, ధర్మమ్ = ధర్మమును, జానతా = ఎరిగినవాడు, విపశ్చితా = పండితుడు అగు, కణ్డునా = కండువుచేత, పితుః = తండ్రియొక్క, వాక్యమ్ = వాక్యమును, కుర్వతా = చేయుచు, గౌః అపి = గోవు కూడ, హతా = చంపబడినది.

తా. ధర్మములు తెలిసినవాడూ, వ్రతములు ఆచరించువాడూ, పండితుడూ అయిన కండు మహర్షి తండ్రి యాజ్ఞను పాలించుచు గోవును కూడ చంపినాడు. 30

మూ. అస్మాకన్తు కులే పూర్వం సగరస్యాజ్ఞయా పితుః.
ఖనద్భిః సాగరైర్భూమిమవాప్తః సుమహాన్వధః. 31

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, అస్మాకమ్ = మనయొక్క, కులే చ = కులమునందు కూడ, పితుః = తండ్రి యైన, సగరస్య = సగరచక్రవర్తియొక్క, ఆజ్ఞయా = ఆజ్ఞచేత, భూమిమ్ = భూమిని, ఖనద్భిః = త్రవ్వుచున్న, సాగరైః = సగరకుమారులచేత, సుమహాన్ = చాల గొప్ప దైన, (భయంకర మైన) వధః = వధ, అవాప్తః = పొందబడినది.

తా. మన కులమునందే పుట్టిన సగరకుమారులు పూర్వము తండ్రి యాజ్ఞచే భూమిని త్రవ్వుచు భయంకర మైన సంహారమును పొందిరి. 31

మూ. జామదగ్న్యేన రామేణ రేణుకా జననీ స్వయమ్,
కృత్తా పరశునాఽరణ్యే పితుర్వచనకారిణా. 32

ప్ర. అ. పితుః = తండ్రియొక్క, వచనకారిణా = వచనమును చేసిన, జామదగ్న్యేన = జమదగ్నికుమారు డైన, రామేణ = పరశురాముని చేత, జననీ = తల్లి యైన, రేణుకా = రేణుక, స్వయమ్ = స్వయముగా, అరణ్యే = అరణ్యమునందు, పరశునా = గొడ్డలితో, కృత్తా = ఛేదింపబడినది.

తా. జమదగ్నికుమారు డైన పరశురాముడు తండ్రి యాజ్ఞను అనుసరించి అరణ్యములో గండ్రగొడ్డలితో తల్లి యైన రేణుకను స్వయముగా నరికినాడు. 32

మూ. ఏతైరన్యైశ్చ బహుభిర్దేవి దేవసమైః కృతమ్,
పితుర్వచనమక్లీబం కరిష్యామి పితుర్హితమ్. 33

ప్ర. అ. దేవి = ఓ దేవీ, ఏతైః = వీరిచేతను, దేవసమైః = దేవతాసమాను లైన, బహుభిః = అనేకు లైన, అన్యైశ్చ = ఇతరులచేతను, పితుః = తండ్రి యొక్క, వచనమ్ = వచనము, అక్లీబమ్ = వ్యర్థము కానిదిగా, కృతమ్ = చేయబడినది. పితుః = తండ్రియొక్క, హితమ్ = హితమును, కరిష్యామి = చేసెదను.

తా. తల్లీ! వీరును, దేవతాసమాను లగు ఎందరో ఇతరులును, తమ తండ్రి ఆజ్ఞను వ్యర్థముగాకుండునట్లు చేసిరి. నేను కూడ నా తండ్రి కిష్ట మైన కార్యమును చేసెదను. 33

మూ. న ఖల్వేతన్మయైకేన క్రియతే పితృశాసనమ్,
ఏతైరపి కృతం దేవి యే మయా తవ కీర్తితాః. 34

ప్ర. అ. దేవి = ఓ దేవీ! మయా = నాచే, ఏకేన = ఒక్కనిచేతనే, ఏతత్ = ఈ, పితృశాసనమ్ = తండ్రి యాజ్ఞ, న క్రియతే = చేయబడుటలేదు. మయా = నాచే, యే = ఎవరు, తవ = నీకు, కీర్తితాః = చెప్పబడినారో, ఏతైరపి = వీరిచే కూడ, కృతమ్ = చేయబడినది.

తా. తల్లీ! తండ్రి యాజ్ఞను నే నొక్కడనే చేయుటలేదు. నేను నీకు చెప్పిన వీ రందరును, తండ్రి యాజ్ఞను పరిపాలించినారు. 34

మూ. నాహం ధర్మమపూర్వం తే ప్రతికూలం ప్రవర్తయే,
పూర్వైరయమభిప్రేతో గతో మార్గోఽనుగమ్యతే. 85

ప్ర. అ. అహమ్ = నేను, ప్రతికూలమ్ = పూర్వాచారవిరుద్ధ మైన, అపూర్వమ్ = క్రొత్త, ధర్మమ్ = ధర్మమును, తే = నీ కొరకై, న ప్రవర్తయే = ప్రవర్తింప చేయుటలేదు. పూర్వైః = పూర్వులచే, అభిప్రేతః = అంగీకరింపబడిన, గతః = వారిచే అనుసరింపబడిన, అయమ్ = ఈ, మార్గః = మార్గము, అనుగమ్యతే = అనుసరించబడుచున్నది.

తా. నేను పూర్వాచారవిరుద్ధ మైన క్రొత్త ధర్మమును చేసినీ నీ కొరకై చెప్పుటలేదు. పూర్వులు అందరును అంగీకరించి, అనుసరించిన మార్గమునే నేను అనుసరించుచున్నాను. 85

మూ. తదేతత్తు మయా కార్యం క్రియతే భువి నాన్యథా,
పితుర్హి వచనం కుర్వన్ న కశ్చిన్నామ హీయతే. 86

ప్ర. అ. భువి = భూలోకమునందు, కార్యమ్ = చేయదగిన, తత్ ఏతత్ = అట్టి ఈ, పితృ వాక్యపాలనము, మయా = నా చేత, అన్యథా = మరి యొక విధముగ, న క్రియతే = చేయబడుటలేదు. పితుః = తండ్రియొక్క, వచనమ్ = వచనమును, కుర్వన్ = చేయు, కశ్చిత్ = ఎవ్వడును, న హీయతే నామ = నాశనము పొందడు కదా।

తా. భూలోకములో ప్రచారములో నున్న ఈ పితృవాక్యపరిపాలన రూప మగు కార్యమును నేను మరియొక్క విధముగ చేయజాలను. తండ్రి యాజ్ఞ పాలించినవానికి యెవ్వనికిని దోషము కలుగదు. 86

మూ. తామేవముక్త్వా జననీం లక్ష్మణం పునరబ్రవీత్,
వాక్యం వాక్యవిదాం శ్రేష్ఠః శ్రేష్ఠః సర్వధనుష్మతామ్. 87

ప్ర. అ. వాక్యవిదామ్ = మాటలు తెలిసినవారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడును, సర్వధనుష్మతామ్ = సకలధనుర్ధారులలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడును అన రాముడు,

తాం జననీమ్ = ఆ తల్లిని గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, పునః = తిరిగి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మాటలాడుటయందు నేర్పు కలవారిలోను, ధనుర్ధారులలోను శ్రేష్ఠుడైన ఆ రాముడు తల్లితో ఇట్లు పలికి పిదప లక్ష్మణునితో ఇట్లనెను. 37

మూ. తవ లక్ష్మణ జానామి మయి స్నేహమనుత్తమమ్,
విక్రమం చైవ సత్త్వం చ తేజశ్చ సుదురాసదమ్. 38

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! తవ = నీయొక్క, మయి = నాయందున్న, అనుత్తమమ్ = అత్యధిక మైన, స్నేహమ్ = స్నేహమును, విక్రమం చైవ = పరాక్రమమును, సత్త్వం చ = బలమును, సుదురాసదమ్ = సమీపింప శక్యము కాని, తేజశ్చ = తేజస్సును, జానామి = ఎరుగుదును.

తా. లక్ష్మణా! నీకు నాపై నున్న అత్యధిక మైన స్నేహమును, నీ పరాక్రమమును, బలమును, దగ్గరకు చేర శక్యము కాని నీ తేజస్సును కూడ నేను ఎరుగుదును. 38

మూ. మమ మాతుర్మహద్దుఃఖమతులం శుభలక్షణ,
అభిప్రాయమవిజ్ఞాయ సత్యస్య చ శమస్య చ. 39

ప్ర. అ. శుభలక్షణ = మంగళకరము లైన లక్షణములు గల ఓ లక్ష్మణా! సత్యస్య చ = సత్యముయొక్కయు, శమస్య చ = శాంతియొక్కయు, అభిప్రాయమ్ = రహస్యమును, అవిజ్ఞాయ = తెలియక, మమ మాతుః = నా తల్లికి, అతులమ్ = సాటి లేని, మహత్ దుఃఖమ్ = గొప్ప దుఃఖము కలుగుచున్నది.

తా. శుభలక్షణములు కల ఓ లక్ష్మణా! మా తల్లి సత్యముయొక్కయు, శాంతియొక్కయు, రహస్యము తెలియక పోవుటచే సాటిలేని గొప్ప దుఃఖమును పొందుచున్నది. 39

మూ. ధర్మో హి పరమో లోకే ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్,
ధర్మసంశ్రితమేతచ్చ పితుర్వచనముత్తమమ్. 40

ప్ర. అ. ధర్మః = ధర్మమే, లోకే = లోకమునందు, పరమో హి = శ్రేష్ఠమైనది కదా। ధర్మే = ధర్మమునందు, సత్యమ్ = సత్యము, ప్రతిష్ఠితమ్ = నిలిచియున్నది. ఏతత్ = ఈ, ఉత్తమమ్ = ఉత్తమ మైన, పితుః = తండ్రియొక్క, వచనం చ = వచనము కూడ, ధర్మసంశ్రితమ్ = ధర్మమును ఆశ్రయించి యున్నది.

తా. లోకములో అన్నింటికంటెను శ్రేష్ఠ మైనది ధర్మమే. ధర్మమునందే సత్యము నిలిచియున్నది. తండ్రిగారు చెప్పిన ఈ ఉత్తమ మైన వచనము కూడ ధర్మమును ఆశ్రయించి యున్నది. 40

మూ. సంశ్రుత్య చ పితుర్వాక్యం మాతుర్వా బ్రాహ్మణస్య వా,
న కర్తవ్యం వృథా వీర ధర్మమాశ్రిత్య తిష్ఠతా. 41

ప్ర. అ. వీర = వీరుడ వైన లక్ష్మణా। పితుః = తండ్రికి గాని, మాతుర్వా = తల్లికి గాని, బ్రాహ్మణస్య వా = బ్రాహ్మణునకు గాని, సంశ్రుత్య = ప్రతిజ్ఞ చేసి, ధర్మమ్ = ధర్మమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, తిష్ఠతా = ఉన్నవానిచేత, వాక్యమ్ = ప్రతిజ్ఞ చేసిన వాక్యము, వృథా = వ్యర్థముగా, న కర్తవ్యమ్ = చేయదగినది కాదు.

తా. ధర్మమును ఆశ్రయించినవాడు తండ్రికి గాని, తల్లికి గాని బ్రాహ్మణునకు గాని ఇచ్చిన మాటను వృథా చేయరాదు. 41

మూ. సోఽహం న శక్ష్యామి పితుర్నియోగమతివర్తితుమ్,
పితుర్హి వచనాద్వీర కైకేయ్యాహం ప్రచోదితః. 42

ప్ర. అ. వీర = ఓ వీరుడా, సః అహమ్ = అట్టి నేను, పితుః = తండ్రియొక్క, నియోగమ్ = ఆజ్ఞను, అతివర్తితుమ్ = అతిక్రమించుటకు, న శక్ష్యామి = సమర్థుడను కాజాలను. పితుః = తండ్రియొక్క, వచనాత్ = మాటవలననే, అహమ్ = నేను, కైకేయ్యా = కైకేయిచేత, ప్రచోదితో హి = ప్రేరేపింపబడితిని కదా।

తా. నేను తండ్రి యాజ్ఞను అతిక్రమింపజాలను. కైకేయి తండ్రి వచనము ప్రకారమే కదా నన్ను వనమునకు వెళ్ళుమని ప్రేరేపించినది. 42

మూ. తదేనాం విసృజానార్యాం క్షత్రధర్మాశ్రితాం మతిం,
ధర్మమాశ్రయ మా తైక్ష్ణ్యం మద్బుద్ధిరనుగమ్యతామ్. 43

ప్ర. అ. తత్ = ఆ కారణమువలన, అనార్యామ్ = చెడ్డదైన, క్షత్ర ధర్మాశ్రితామ్ = క్షత్రియధర్మము నాశ్రయించిన, మతిమ్ = బుద్ధిని, విసృజ = విడిచిపెట్టుము. ధర్మమ్ = ధర్మమును, ఆశ్రయ = ఆశ్రయించుము. తైక్ష్ణ్యమ్ = తీక్ష్ణత్వమును, మా = ఆశ్రయించవద్దు. మద్బుద్ధిః = నాయొక్క బుద్ధి, అనుగమ్యతామ్ = అనుసరింపబడు గాక.

తా. కావున క్షత్రియధర్మమునకు సంబంధించిన ఈ చెడు ఆలోచనను మాని, ధర్మమును ఆశ్రయింపుము. క్రౌర్యమును విడువుము. నా ఆలోచనను అనుసరించుము. 43

మూ. తమేవముక్త్వా సౌహార్దాద్భ్రాతరం లక్ష్మణాగ్రజః,
ఉవాచ భూయః కౌసల్యాం ప్రాంజలిః శిరసా నతః. 44

ప్ర. అ. లక్ష్మణాగ్రజః = లక్ష్మణుని అన్న యైన రాముడు, తమ్ = ఆ, భ్రాతరమ్ = సోదరుని గూర్చి, సౌహార్దాత్ = స్నేహమువలన, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా = పలికి, ప్రాంజలిః = కట్టబడిన దోసిలికలవాడై, శిరసా = శిరస్సుచేత, నతః = వంగినవాడై, భూయః = మరల, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాముడు స్నేహపూర్వకముగా సోదరునితో ఇట్లు పలికి తల్లికి శిరస్సుతో నమస్కరించుచు దోసిలి కట్టి మరల ఇట్లు పలికెను. 44

మూ. అనుమన్యస్వ మాం దేవి గమిష్యన్తమితో వనమ్,
శాపితాఽసి మమ ప్రాణైః కురు స్వస్త్యయనాని మే. 45

ప్ర. అ. దేవి = ఓ తల్లీ, ఇతః = ఇచటనుండి, వనమ్ = వనమును గూర్చి, గమిష్యన్తమ్ = వెళ్లనున్న, మామ్ = నన్ను, అనుమన్యస్వ = అనుమతింపుము. మమ = నాయొక్క, ప్రాణైః = ప్రాణములచేత, శాపితా అసి =

ఒట్టు పెట్టబడినదానవు. మే = నాకు, స్వస్త్యయనాని = స్వస్తికర మగు పనులను కురు = చేయుము.

తా. ఓ తల్లీ! నేను వనమునకు పోవ నిశ్చయించినాను. నాకు అనుజ్ఞ నిమ్ము. నా ప్రాణములపై ఒట్టు పెట్టుచున్నాను. ప్రయాణసమయమున చేయు మంగళకరము లగు విధానము లన్నియు నాకు చేయుము. 45

మూ. తీర్ణప్రతిజ్ఞశ్చ వనాత్పునరేష్యామ్యహం పురీమ్,
యయాతిరివ రాజర్షిః పురా హిత్వా పునర్దివమ్. 46

ప్ర. అ. పురా = పూర్వము, యయాతిః = యయాతి అను, రాజర్షిః = రాజర్షి, దివమ్ = స్వర్గమును, హిత్వా = విడచి, పునః = మరల, దివమ్ ఇవ = స్వర్గమును చేరి నట్లు, అహమ్ = నేను, తీర్ణప్రతిజ్ఞః = దాటబడినప్రతిజ్ఞ కలవాడ నై, వనాత్ = వనమునుండి, పునః = మరల, పురీమ్ = పట్టణమును గూర్చి, ఏష్యామి = రాగలను.

తా. పూర్వము యయాతిచక్రవర్తి ఒక పర్యాయము స్వర్గము విడచి వచ్చి మరల స్వర్గమును చేరి నట్లు, నేను ప్రతిజ్ఞను, పూర్తి చేసుకొని వనము నుండి మరలి పట్టణమునకు వచ్చెదను. 46

మూ. శోకస్సంధార్యతాం మాతర్హృదయే సాధు మా శుచః,
వనవాసాదిహైష్యామి పునః కృత్వా పితుర్వచః. 47

ప్ర. అ. మాతః = తల్లీ! శోకః = దుఃఖము, హృదయే హృదయము నందు, సాధు = బాగుగ, సంధార్యతామ్ = అణగద్రొక్కబడు గాక. మా శుచః = దుఃఖింపకుము. పితుః = తండ్రియొక్క, వచః = వచనమును, కృత్వా = చేసి, వనవాసాత్ = వనవాసమునుండి, పునః = మరల, ఇహ = ఇచటకు, ఏష్యామి = వచ్చెదను.

తా. తల్లీ! నీవు విచారించవద్దు. దుఃఖమును నీ హృదయమునందే అణచి వేసికొనుము. తండ్రి యాజ్ఞను నిర్వర్తించి వనవాసమునుండి తిరిగి మరల ఇక్కడకు రాగలను. 47

మూ. త్వయా మయా చ వైదేహ్యా లక్ష్మణేన సుమిత్రయా,
పితుర్నియోగే స్థాతవ్యమేష ధర్మః సనాతనః. 48

ప్ర. అ. త్వయా = నీచేతను, మయా చ = నాచేతను, వైదేహ్యా = సీత చేతను, లక్ష్మణేన = లక్ష్మణునిచేతను, సుమిత్రయా = సుమిత్రచేతను, పితుః = మా తండ్రియొక్క, నియోగే = ఆజ్ఞయందు, స్థాతవ్యమ్ = ఉండవలసి యున్నది. ఏషః = ఇది, సనాతనః = సనాతన మైన, ధర్మః = ధర్మము.

తా. నీవు, నేను, సీత, లక్ష్మణుడు, సుమిత్ర మన మందరము కూడ మా తండ్రిగారి మాటను అనుసరించి ఉండవలెను. ఇదియే మనము చేయవలసిన సనాతనధర్మము. 48

మూ. అమ్బ సంహృత్య సంభారాన్ దుఃఖం హృది నిగృహ్య చ
వనవాసకృతా బుద్ధిర్మమ ధర్మ్యానువర్త్యతామ్. 49

ప్ర. అ. అమ్బ = తల్లీ! సంభారాన్ = అభిషేకసంభారములను, సంహృత్య = తొలగించి, దుఃఖమ్ = దుఃఖమును, హృది = హృదయమునందు, నిగృహ్య చ = నిగ్రహించుకొని, వనవాసకృతా = వనవాసమునకు సంబంధించిన, ధర్మ్యా = ధర్మ సంబద్ధ మైన, మమ బుద్ధిః = నా బుద్ధి, అనువర్త్యతామ్ = అనుసరింపబడుగాక!

తా. తల్లీ! అభిషేకసంభారము లన్నిండిని ఉపసంహరించి, దుఃఖమును మనస్సులో అణచుకొని నీవు ధర్మసమ్మత మైన వనవాసమునకు వెళ్లవలె నను నా ఆలోచనను అంగీకరింపుము. 49

మూ. ఏతద్వచ స్తస్య నిశమ్య మాతా
సుధర్మ్యమవ్యగ్రమవిక్లబం చ,
మృతేవ సంజ్ఞాం ప్రతిలభ్య దేవీ
సమీక్ష్య రామం పునరిత్యువాచ. 50

ప్ర. అ. మాతా = తల్లి యైన, దేవీ = కౌసల్యాదేవి, తస్య = ఆ రాముని యొక్క, సుధర్మ్యమ్ = ధర్మమునకు సమ్మత మైనదియు, అవ్యగ్రమ్ = తొందర పాటు లేనిదియు, అవిక్లబం చ = వ్యాకులము కానిదియు నగు, ఏతత్ = ఈ

వచః = వచనమును, నిశమ్య = విని, మృతేవ = మరణించినది వలె, సంజ్ఞామ్ = సంజ్ఞను, ప్రతిలభ్య = పొంది, రామమ్ = రాముని, సమీక్ష్య = చూచి, పునః = మరల, ఇతి = ఇట్లు, ఉవాచ = పలికెను.

తా. తల్లి యైన కౌసల్య ధర్మమునకు అనుకూలముగాను, తొందరపాటు, వ్యాకులత్వము లేకుండగాను, ఆ రాముడు పలికిన మాటలు విని, మరణించి మరల స్పృహ వచ్చినట్లు తేరి రాముని చూచి మరల ఇట్లు పలికెను. 50

మూ. యథైవ తే పుత్ర పితా తథాహం
గురుః స్వధర్మేణ సుహృత్తయా చ,
న త్వానుజానామి న మాం విహాయ
సుదుఃఖితామర్హసి గన్తుమేవమ్. 51

ప్ర. అ. పుత్ర = ఓ కుమారా! స్వధర్మేణ = స్వధర్మముచేతను, సుహృత్తయా చ = స్నేహముచేతను, తే = నీకు, పితా = తండ్రి, యథైవ = ఎట్లో, తథా = అట్లే, అహమ్ = నేను కూడ, గురుః = గురువును. త్వా = నిన్ను, న అనుజానామి = అనుమతించను. సుదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖించుచున్న, మామ్ = నన్ను, విహాయ = విడచి, ఏవమ్ = ఇట్లు, గన్తుమ్ = వెళ్ళుటకు, నార్హసి = తగవు.

తా. కుమారా! స్వధర్మముచేతను, స్నేహమును బట్టియు, నీ తండ్రి ఎట్లు గురువో నేను కూడ అట్లే గురువును. నీకు అనుజ్ఞ ఇవ్వను. ఇంతగా దుఃఖించుచున్న నన్ను విడచి ఈ విధముగా వెళ్లవద్దు. 51

మూ. కిం జీవితేనేహ వినా త్వయా మే
లోకేన వా కిం స్వధయాఽమృతేన,
శ్రేయో ముహూర్తం తవ సన్నిధానం
మమేహ కృత్స్నాదపి జీవలోకాత్. 52

ప్ర. అ. త్వయా వినా = నీవు లేకుండగా, మే = నాకు, ఇహ = ఇచట, జీవితేన = జీవితముచేత, కిమ్ = ఏమి ప్రయోజనము, లోకేన = పరలోకముచేత

గాని, స్వధయా = పితృదేవతలకు అర్పించు స్వధచేతగాని, అమృతేన వా = దేవతలకు లభించు అమృతముచేత గాని, కిమ్ = ఏమి ప్రయోజనము? మమ = నాకు, ఇహ = ఇచట, కృత్స్నాత్ = సమస్తమైన, జీవలోకాత్ అపి = ప్రాణి సముదాయముకంటె గూడ, ముహూర్తమ్ = క్షణ కాలమైనను, తవ = నీయొక్క, సన్నిధానమ్ = సాహిత్యము, శ్రేయః = శ్రేష్ఠము.

తా. నీవు లేకుండగ నేను ఈ లోకమున జీవించి ఏమి ప్రయోజనము? పరలోకమువలనగాని, పితృదేవతలకు అర్పింపబడు స్వధవలన గాని, దేవతలకు లభించు అమృతమువలన గాని నా కేమియు ప్రయోజనము లేదు. క్షణకాలమైనను నీవు నా దగ్గర ఉండుట సమస్తమైన ప్రాణిలోకముకంటెను నాకు ఆనందమును కల్గించును. 52

మూ. నరైరివోల్కాభిరపోహ్యమానో
మహాగజోఽధ్వానమనుప్రవిష్టః.
భూయః ప్రజజ్వాల విలాపమేవం
నిశమ్య రామః కరుణం జనన్యాః. 53

ప్ర. అ. రామః = రాముడు, ఏవమ్ = ఈ విధముగా, కరుణమ్ = దీనమైన, జనన్యాః = తల్లియొక్క, విలాపమ్ = విలాపమును, నిశమ్య = విని, నరైః = మనుష్యులచేత, ఉల్కాభిః = కొరవులతో, అపోహ్యమానః = అడ్డగింపబడుచున్నదీ, అధ్వానమ్ = మార్గమును, అనుప్రవిష్టః = ప్రవేశించినది యైన, మహాగజః ఇవ = గొప్ప ఏనుగు వలె, భూయః = మరల, ప్రజజ్వాల = పరితపించెను.

తా. అతిదీనమైన తల్లి ఏడ్పు విన్న రాముడు, దారిలో నడచుచు మనుష్యులచే కొరవులతో అడ్డగింపబడిన మహాగజము వలె, మిక్కిలి పరితపించెను. 53

మూ. స మాతరం చైవ విసంజ్ఞకల్పా-
మార్తాం చ సౌమిత్రిమభిప్రతప్తమ్,
ధర్మే స్థితో ధర్మ్యమువాచ వాక్యం
యథా స ఏవార్హతి తత్ర వక్తుమ్. 54

ప్ర. అ. ధర్మే = ధర్మమునందు, స్థితః = నిలచి యున్న, సః = ఆ రాముడు, విసంజ్ఞకల్పామ్ = స్మృతి తప్పినది వలె నున్న, మాతరం చైవ = తల్లిని గూర్చియు, ఆర్తమ్ = పీడితుడు, అభిప్రతప్తమ్ = పరితపించుచున్నవాడు ఐన, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చియు, తత్ర = ఆ సమయమున, యథా = ఏ విధముగా, వక్తుమ్ = చెప్పుటకు, స ఏవ = అతడు మాత్రమే, అర్హతి = తగియుండునో (ఆ విధముగ), ధర్మ్యమ్ = ధర్మసంబద్ధమైన, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ధర్మమునందు స్థిరబుద్ధి గల ఆ రాముడు, స్మృతి తప్పినది వలె నున్న తల్లితోను, దుఃఖితుడై పరితపించుచున్న లక్ష్మణునితోను, ధర్మసంబద్ధమైన వచనము పలికెను. ఆ సమయమున అతడొక్కడే అట్లు పలుకుటకు సమర్థుడు. 54

మూ. అహం హి తే లక్ష్మణ నిత్యమేవ
జానామి శక్తిం చ పరాక్రమం చ,
మమ త్వభిప్రాయ మసన్నిరీక్ష్య
మాత్రా సహాభ్యర్దసి మా సుదుఃఖమ్. 55

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! అహమ్ = నేను, నిత్యమేవ = ఎల్లప్పుడును, తే = నీయొక్క, శక్తిం చ = శక్తిని, పరాక్రమం చ = పరాక్రమమును, జానామి = ఎరుగుదును. తు = కాని, మమ = నాయొక్క, అభిప్రాయమ్ = అభిప్రాయమును, అసన్నిరీక్ష్య = చూడకుండగనే, మాత్రా సహ = తల్లితో కూడ, మామ్ = నన్ను, సుదుఃఖమ్ = మిక్కిలి దుఃఖము కలుగునట్లు, అభ్యర్దసి = పీడించుచున్నావు.

తా. లక్ష్మణా! సర్వదా నీకు నాయందున్న శక్తిని, పరాక్రమమును నేను ఎరుగుదును. కాని నీవిపుడు నా అభిప్రాయమును తెలిసికొనకుండగనే తల్లితో చేరి, నాకు చాల కష్టము కలుగునట్లు బాధించుచున్నావు. 55

మూ. ధర్మార్థకామాః ఖలు తాత లోకే
సమీక్షితా ధర్మఫలోదయేషు,

తే తత్ర సర్వే స్స్యురసంశయం మే
భార్యేవ వశ్యాభిమతా సుపుత్రా. 56

ప్ర. అ. తాత = నాయనా! లోకే = లోకమునందు, ధర్మఫలోదయేషు = ధర్మఫలముయొక్క ప్రాప్తి విషయమున, ధర్మార్థకామాః = ధర్మార్థకామములు, సమీక్షితాః = చూడబడినవి. వశ్యా = వశములోనుండునది, అభిమతా = ప్రియురాలూ, సుపుత్రా = మంచిపుత్రులు కలదియైన, భార్యేవ = భార్య వలె, తత్ర = ఆ ధర్మమునందు, తే సర్వే = ధర్మార్థకామము లన్నియు, స్యుః = ఉండును. మే = నాకు, అసంశయమ్ = సంశయము లేదు.

తా. నాయనా! ధర్మఫలమును కల్గించు విషయమున ధర్మమునకు విరుద్ధములు కాని ధర్మార్థకామములు లోకములో చూడబడుచున్నవి; అనగా ధర్మార్థకామములు ధర్మసమ్మత మగు ఫలమును ఇచ్చును. వశములో నుండునదీ, ప్రియ మైనదీ, మంచి పుత్రులు కలదీ యైన భార్య వలె ఆ ధర్మమునందు ధర్మార్థకామము లన్నియు చేరి యుండును. అనగా ఒక భార్య వశ్యురాలై ఇష్టురాలై, సుపుత్రయై ఉన్నట్లు ధర్మము ధర్మార్థకామఫలములను సంపాదించిని కూడ ఇచ్చును. ఈ విషయమున నా కేమాత్రము సంశయము లేదు. 56

మూ. యస్మింస్తు సర్వే స్స్యురసన్నివిష్టా
ధర్మో యతః స్యాత్ తదుపక్రమేత,
ద్వేష్యో భవత్యర్థపరో హి లోకే,
కామాత్మతా ఖల్వపి న ప్రశస్తా. 57

ప్ర. అ. యస్మిన్ = దేనియందు, సర్వే = ఇవన్నియు, అసన్నివిష్టాః స్యుః = కలిసియుండవో (అట్టి స్థితియందు), యతః = దేనివలన, ధర్మః = ధర్మము, స్యాత్ = కలుగునో, తత్ = దానిని, ఉపక్రమేత = ప్రారంభింపవలెను. లోకే = లోకమునందు, అర్థపరః = అర్థము నందే ఆసక్తి కలవాడు, ద్వేష్యః = ద్వేషింపదగినవాడుగా, భవతి హి = అగును కదా! కామాత్మతాపి = కామపరత్వముకూడ, న ప్రశస్తా ఖలు = ప్రశస్తము కాదు కదా!

తా. ధర్మార్థకామము లన్నియు కూడి ఉండని కార్యమును పరిత్యజించి, ధర్మము దేనియం దుండునో అట్టి కార్యముచే ప్రారంభింపవలెను. అర్థమునకు

మాత్రమే ప్రాధాన్య మిచ్చువాడు లోకములో ద్వేషపాత్రు డగును. కామపరత్వము కూడ ప్రశస్తము కాదు కదా! 57

మూ. గురుశ్చ రాజా చ పితా చ వృద్ధః
క్రోధాత్ప్రహర్షా ద్యది వాపి కామాత్,
యద్వ్యాదిశేత్ కార్యమవేక్ష్య ధర్మం
కస్తన్న కుర్యాదనృశంసవృత్తిః. 58

ప్ర. అ. గురుశ్చ = పూజ్యుడు, రాజా చ=రాజు, వృద్ధః చ = వృద్ధుడును అయిన, పితా=తండ్రి, క్రోధాత్ = కోపమువలనగాని, ప్రహర్షాత్ = సంతోషము వలనగాని, యదివా = లేక కామాత్ అపి = కామమువలన గాని, యత్ = ఏ, కార్యమ్=కార్యమును, వ్యాదిశేత్=ఆజ్ఞాపించునో, తత్=దానిని, ధర్మమ్= ధర్మమును, అవేక్ష్య=చూచి, అనృశంసవృత్తిః=క్రూరమైన ప్రవృత్తి లేనివాడు, కః = ఎవడు, న కుర్యాత్=చేయకుండును.

తా. పూజ్యుడు, రాజు, వృద్ధుడు నైన తండ్రి కోపమువలనగాని, సంతోషమువలన గాని, కామమువలన గాని, ఒక కార్యము నాజ్ఞాపించి నప్పుడు దానిని ధర్మదృష్టి కలవా డెవ్వడైన చేయకుండునా! క్రూరప్రవృత్తి కలవాడు మాత్రమే ఆ కార్యమును చేయడు. 58

మూ. స వై న శక్నోమి పితుః ప్రతిజ్ఞా
మిమామకర్తుం సకలాం యథావత్,
స హ్యావయోస్తాత గురుర్నియోగే
దేవ్యాశ్చ భర్తా స గతిస్స ధర్మః. 59

ప్ర. అ. సః=అట్టి నేను, పితుః=తండ్రియొక్క, సకలామ్ = సమస్తమైన, ఇమాం ప్రతిజ్ఞామ్=ఈ ప్రతిజ్ఞను, యథావత్=సరిగా, అకర్తుమ్=చేయకుండుటకు, న శక్నోమి వై = సమర్థుడను కాను. తాత = నాయనా, సః = అతడు, నియోగే=ఆజ్ఞాపించువిషయమున, ఆవయోః = మన ఇద్దరకు, గురుః హి = గురువు కదా! దేవ్యాశ్చ=తల్లికి గూడ, సః=అతడు, భర్తా = భర్త, సః= అతడే, గతిః = గతి, ధర్మః=ధర్మము.

తా. తండ్రి ఆజ్ఞను పూర్తిగా యథావిధిగా నిర్వర్తింపకుండగ నే నుండ జాలను. నాయనా! ఆతడు మన ఇద్దరిని ఆజ్ఞాపింపదగిన గురువు. తల్లి యైన కౌసల్యాదేవికి కూడ ఆయన భర్త, గతి; ఆయనే ధర్మము. 59

మూ. తస్మిన్ పునర్జీవతి ధర్మరాజే
విశేషతః స్వే పథి వర్తమానే,
దేవీ మయా సార్ధమితో౽పగచ్ఛేత్
కథం స్విదన్యా విధవేవ నారీ. 60

ప్ర. అ. ధర్మరాజే = ధర్మమునకు అధిపతి యైన, తస్మిన్ = ఆతడు, జీవతి = జీవించియుండగా, విశేషతః = విశేషించి, స్వే = తన, పథి = మార్గము నందు, వర్తమానే = ప్రవర్తించుచుండగా, దేవీ = తల్లి యైన కౌసల్యాదేవి, అన్యా = ఇతర మైన, విధవా = భర్త లేని, నారీవ = స్త్రీ వలె, మయా సార్ధం = నాతో కూడ, కథం స్విత్ = ఎట్లు, ఇతః = ఇక్కడినుండి, అపగచ్ఛేత్ = వెడలి పోవును.

తా. ధర్మాధికారి యైన దశరథమహారాజు జీవించి యుండగా, విశేషించి, ఆయన తన ధర్మమార్గమున ప్రవర్తించుచుండగా తల్లి యైన కౌసల్యాదేవి, భర్త లేని ఒక సామాన్య స్త్రీ వలె, ఈ నగరము విడిచి నాతో ఎట్లు బయటకు వెళ్ళ గలదు. 60

మూ. సా మానుమన్యస్వ వనం వ్రజన్తం
కురుష్వ నః స్వస్త్యయనాని దేవి,
యథా సమాప్తే పునరావ్రజేయం
యథా హి సత్యేన పునర్యయాతిః. 61

ప్ర. అ. దేవి = ఓ దేవీ! సా = అట్టి నీవు, వనమ్ = వనమును గూర్చి, వ్రజన్తమ్ = వెళ్ళుచున్న, మా = నన్ను, అనుమన్యస్వ = అనుమతింపుము. సత్యేన = సత్యబలముచేత, యయాతిః = యయాతి, యథా = ఏ విధముగా, పునః = మరల వచ్చినాడో (ఆ విధముగా), సమాప్తే = వనవాసము సమాప్త మగుచుండగా, యథా = ఎట్లు, పునః = మరల, ఆవ్రజేయమ్ = తిరిగివచ్చెదనో (ఆ విధముగా) స్వస్త్యయనాని = స్వస్త్యయనములను, కురుష్వ = చేయుము.

తా. వట్టపురాణి వైన ఓ తల్లీ! నేను అడవికి వెళ్ళుటకు అనుమతి నిమ్ము. సత్యబలముచేత యయాతి తిరిగి స్వర్గమునకు వెళ్ళి నట్లు, నేను కూడ వనవాసము సమాప్త మైన పిమ్మట వచ్చు నట్లు ఆశీర్వదింపుము. స్వస్త్యయనములు చేయుము. 61

మూ. యశో హ్యహం కేవలరాజ్యకారణాత్
న పృష్ఠతః కర్తుమలం మహోదయమ్,
అదీర్ఘకాలే న తు దేవి జీవితే
వృణేఽవరామద్య మహీమధర్మతః. 62

ప్ర. అ. కేవలరాజ్యకారణాత్ = కేవలము రాజ్యము కొరకై, అహమ్ = నేను, మహోదయమ్ = గొప్ప సత్ఫలము గల, యశః = కీర్తిని, పృష్ఠతః కర్తుమ్ = వెనుక ఉంచుటకు, న అలమ్ = సమర్థుడను కాను. దేవి = ఓ తల్లీ, అదీర్ఘకాలే = దీర్ఘకాలము లేని, జీవితే = ఈ జీవితమునందు, అద్య = ఇపుడు, అవరామ్ = తుచ్ఛ మైన, మహీమ్ = భూమిని, అధర్మతః = ధర్మవిరుద్ధముగ, న వృణే = కోరను.

తా. కేవలము రాజ్యముకొరకై గొప్ప సత్ఫలముల నిచ్చు యశస్సును నేను విడువజాలను. ఈ జీవితము, చాల స్వల్పకాలిక మైనది. దీనికై తుచ్ఛ మైన రాజ్యమును, ధర్మవిరుద్ధముగా సంపాదించుటకు అభిలషించను. 62

మూ. ప్రసాదయన్నరవృషభస్స మాతరం
పరాక్రమాజ్జిగమిషురేవ దండకాన్,
అథానుజం భృశమనుశాస్య దర్శనం
చకార తాం హృది జననీం ప్రదక్షిణమ్. 63

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
ఏకవింశః సర్గః.

ప్ర. అ. సః = ఆ, నరవృషభః = నరశ్రేష్ఠుడు, పరాక్రమాత్ = పరాక్రమము వలన, దణ్డకాన్ = దండకారణ్యమునుగూర్చి, జిగమిషురేవ = వెళ్ళవలె ననే

ఇచ్ఛ కలవాడై, మాతరమ్ = తల్లిని, ప్రసాదయన్ = ఓదార్చుచు, అథ = పిమ్మట, అనుజమ్ = తమ్ముని, భృశమ్ = ఎక్కువగా, దర్శనమ్ = మంచి ఆలోచనము, అనుశాస్య = బోధించి, హృది = మనస్సులో, తాం జననీమ్ = తల్లిని, ప్రదక్షిణం చకార = ప్రదక్షిణము చేసెను.

తా. నరశ్రేష్ఠుడైన ఆ రాముడు తన పరాక్రమముతో నిర్భయముగా దండకారణ్యమునకు వెళ్ళవలె నని నిశ్చయించి, తల్లిని ఓదార్చి, తమ్మునకు మంచి ఆలోచనను ఉపదేశించి మనసా తల్లికి ప్రదక్షిణము చేసెను.

“బాలానందిని” యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఇరువదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్వావింశః సర్గః

*[శ్రీరాముడు లక్ష్మణునికి నచ్చచెప్పి. దైవమే తన వనవాసమునకు కారణ మనుట, అభిషేకసంభారములు తీసివేయ నాజ్ఞాపించుట].*

మూ. అథ తం వ్యథయాదీనం సవిశేషమమర్షితమ్,
శ్వసన్తమివ నాగేన్ద్రం రోషవిస్ఫారితేక్షణమ్,
ఆసాద్య రామస్సౌమిత్రిం సుహృదం భ్రాతరం ప్రియమ్,
ఉవాచేదం స ధైర్యేణ ధారయన్ సత్త్వమాత్మవాన్. 1-2

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ఆత్మవాన్ = ధృత మైన చిత్తము కల, సః రామః = ఆ రాముడు, ధైర్యేణ = ధైర్యముచేత, సత్త్వమ్ = మనోభావమును, ధారయన్ = అణచుకొనుచు, వ్యథయా = మానసికదుఃఖముచేత, దీనమ్ = దీనుడు, సవిశేషమ్ = ఎక్కువగా, అమర్షితమ్ = కోపించినవాడు, నాగేన్ద్రమివ = సర్పరాజు వలె, శ్వసన్తమ్ = బుసలు కొట్టుచున్నవాడు, రోషవిస్ఫారితేక్షణమ్ = కోపముచే పెద్దవి చేయబడిన నేత్రములు కలవాడు, సుహృదమ్ = మంచి హృదయము కలవాడు, ప్రియం భ్రాతరమ్ = ప్రియ మైన సోదరుడు అయిన, సౌమిత్రిమ్ = లక్ష్మణుని, ఆసాద్య = సమీపించి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పిదప ధృతచిత్తు డైన ఆ రాముడు, ధైర్యముతో తన మనోభావమును అణచుకొనుచు, మానసికదుఃఖముచే దీనుడు, ఎక్కువ కోపగించినవాడు, కోపముచే పెద్ద వైన నేత్రములు కలవాడు, నాగేంద్రుడు వలె బుసలుకొట్టుచున్న వాడు, మంచి హృదయము కలవాడు, ప్రియసోదరుడు అయిన లక్ష్మణుని సమీపించి ఇట్లు పలికెను. 1-2

మూ. నిగృహ్య రోషం శోకం చ ధైర్యమాశ్రిత్య కేవలమ్,
అవమానం నిరస్యేమం గృహీత్వా హర్షముత్తమమ్,

ఉపక్లుప్తం హి యత్కించిదభిషేకార్థమద్య మే,
సర్వం విసర్జయ క్షిప్రం కురు కార్యం నిరత్యయమ్. 3-4

ప్ర. అ. రోషమ్ = రోషమును, శోకం చ = శోకమును, నిగృహ్య = నిగ్రహించుకొని, కేవలమ్ = కేవలము, ధైర్యమ్ = ధైర్యమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, ఇమమ్ = ఈ, అవమానమ్ = అవమానమును, నిరస్య = లెక్కచేయక, ఉత్తమమ్ = ఉత్తమ మైన, హర్షమ్ = హర్షమును, గృహీత్వా = అవలంబించి, అద్య = నేడు, మే = నాయొక్క, అభిషేకార్థమ్ = అభిషేకముకొరకై, యత్కించిత్ = యేది, ఉపక్లుప్తమ్ = ఏర్పరుపబడినదో, సర్వమ్ = దాని నంతను, విసర్జయ = విడిచివేయుము. క్షిప్రమ్ = శీఘ్రముగా, నిరత్యయమ్ = బాధాకరము గాని, కార్యమ్ = కార్యమును, కురు = చేయుము.

తా. నీవు రోషమును, శోకమును విడిచిపెట్టుము. కేవలము ధైర్యము నాశ్రయించి ఈ అవమానమును మరచిపొమ్ము. గొప్ప ఆనందమును పొందుము. ఈనాడు, నా అభిషేకముకొరకై చేసిన దానినంతను విడచి, ఆపాయరహిత మగు కార్యమును వెంటనే చేయుము. 3-4

మూ. సౌమిత్రే! యోఽభిషేకార్థే మమ సంభారసంభ్రమః,
అభిషేకనివృత్త్యర్థే సోఽస్తు సంభారసంభ్రమః. 5

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా, మమ = నాయొక్క, అభిషేకార్థే = అభిషేకముకొరకై. యః = ఏ, సంభారసంభ్రమః = సంభారములను కూర్చుకొనుటయందు ఉత్సాహ మున్నదో, సః = ఆ, సంభారసంభ్రమః = సంభారము కూర్చుకొనుటయందు ఉత్సాహము. అభిషేకనివృత్త్యర్థే = అభిషేకనివృత్తికొరకై, అస్తు = అగుగాక.

తా. ఓ లక్ష్మణా! నా రాజ్యాభిషేకముకొరకై ఇంతవరకు సంభారసంపాదనమునందు చూపిన ఉత్సాహమును, నా అభిషేకము జరగకుండుటకై చూపుము. ఆ సంభారములను తొలగించుటకు ఉత్సాహమును చూపుము. 5

మూ. యస్యా మదభిషేకార్థే మానసం పరితప్యతే,
మాతా మే సా యథా న స్యాత్ సవిశంకా తథా కురు. 6

ప్ర. అ. మదభిషేకార్థే = నా రాజ్యాభిషేకవిషయమున, యస్యాః = ఏ తల్లియొక్క, మానసమ్ = మనస్సు, పరితప్యతే = బాధపడుచున్నదో, సా = అట్టి, మే మాతా = నా తల్లి (కైకేయి), సవిశంకా = శంకకలదై, యథా = ఎట్లు, న స్యాత్ = కాకుండునో, తథా = అట్లు, కురు = చేయుము.

తా. నాకు అభిషేకము జరుగ నున్న దని, మనస్సులో బాధపడుచున్న నా తల్లి యైన కైకకు, శంక ఏమియు కలుగకుండు నట్లు ప్రవర్తించుము. 6

మూ. తస్యాశ్శంకామయం దుఃఖం ముహూర్తమపి నోత్సహే,
మనసి ప్రతిసంజాతం సౌమిత్రేఽహముపేక్షితుమ్. 7

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా, అహమ్ = నేను, తస్యాః = ఆమెయొక్క, మనసి = మనస్సునందు, ప్రతిసంజాతమ్ = పుట్టిన, శంకామయమ్ = శంకారూప మైన, దుఃఖమ్ = దుఃఖమును, ముహూర్తమపి = క్షణకాల మైనను, ఉపేక్షితుమ్ = ఉపేక్షించుటకు, నోత్సహే = కోరను.

తా. లక్ష్మణా! ఆమె మనస్సులో, క్షణకాలముపా త్రైనను, శంకారూప మగు దుఃఖము కలుగుటకు, నే నంగీకరించను. 7

మూ. న బుద్ధిపూర్వం నాబుద్ధం స్మరామీహ కదాచన,
మాతౄణాం వా పితుర్వాహం కృతమల్పం చ విప్రియమ్. 8

ప్ర. అ. అహమ్ = నేను, మాతౄణాం వా = తల్లులకు గాని, పితుర్వా = తండ్రికి గాని, ఇహ = ఇచట, కదాచన = ఎన్నడును, బుద్ధిపూర్వమ్ = బుద్ధిపూర్వకముగా, కృతమ్ = చేయబడిన, అల్పమ్ = అల్ప మైన, విప్రియం చ = అనిష్ట కార్యమును కూడ, న స్మరామి = స్మరించను. అబుద్ధమ్ = తెలియక చేసిన దానిని కూడ, న = స్మరించను.

తా. నేను తెలిసికాని, తెలియక గాని, ఎన్నడును, తల్లులకు గాని తండ్రికి గాని కొంచె మైనను అప్రియము చేసి నట్లు నాకు గుర్తు లేదు. 8

మూ. సత్యః సత్యాభిసన్ధశ్చ నిత్యం సత్యపరాక్రమః,
పరలోకభయాద్భీతః నిర్భయోఽస్తు పితా మమ. 9

ప్ర. అ. సత్యః=సత్యమునే మాట్లాడువాడును, సత్యపరాక్రమః=సత్య మైన పరాక్రమము కలవాడును, పరలోకభయాత్ = పరలోకభయమువలన, భీతః=భయపడినవాడును అగు, మమ పితా=నా తండ్రి, నిత్యమ్ = ఎల్లప్పుడు, సత్యప్రతిజ్ఞః=సత్యప్రతిజ్ఞ కలవాడును, నిర్భయః=భయరహితుడును, అస్తు= అగుగాక.

తా. సత్యమే మాట్లాడువాడును, సత్య మైన పరాక్రమము కలవాడును, పరలోకభీతి కలవాడును అయిన నా తండ్రి చేసిన ప్రతిజ్ఞ సత్య మగుగాక. అతనికి ఎట్టి భయము లేకుండుగాక. 9

మూ. తస్యాపి హి భవేదస్మిన్ కర్మణ్యప్రతిసంహృతే,
సత్యం నేతి మనస్తాపస్తస్య తాపస్తపేచ్చ మామ్. 10

ప్ర. అ. అస్మిన్ కర్మణి=ఈ పట్టాభిషేకము, అప్రతిసంహృతే=ఉప సంహరింపబడని దగుచుండగా, తస్యాపి=అతనికి కూడ, సత్యం న=తన మాట సత్యము కాలేదు, ఇతి=అని, మనస్తాపః=మనస్సునకు తాపము, భవేత్= కలుగును. తస్య=అతని, తాపః=తాపము, మామ్=నన్ను, తపేచ్చ=తపింప చేయును.

తా. ఈ పట్టాభిషేకము మాన కున్నచో నా మాట అసత్య మైనది కదా! అని మన తండ్రికి మనస్తాపము కలుగును. ఆయనకు కలిగిన మనస్తాపము నాకు బాధ కల్గించును. 10

మూ. అభిషేకవిధానం తు తస్మాత్సంహృత్య లక్ష్మణ,
అన్వగేవాహమిచ్ఛామి వనం గన్తుమితః పునః. 11

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! తస్మాత్ = ఆ కారణమువలన, అభి షేకవిధానమ్ = అభిషేకకార్యమును, సంహృత్య = ఉపసంహరించి, అహమ్ = నేను, అన్వగేవ = వెంటనే, ఇతః = ఇచటనుండి, వనమ్ = వనమునుగూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. లక్ష్మణా! ఆ కారణముచే ఈ అభిషేకమును నిలిపివేసి, నేను వెంటనే ఇచట నుండియే వనమునకు వెళ్ళవలె నని తలచుచున్నాను. 11

మూ. మమ ప్రవ్రాజనాదద్య కృతకృత్యా నృపాత్మజా,
సుతం భరతమవ్యగ్రమభిషేచయితా తతః. 12

ప్ర. అ. నృపాత్మజా = కైకేయి, అద్య = ఇపుడు, మమ = నాయొక్క, ప్రవ్రాజనాత్ = అడవికి పోవుటవలన, కృతకృత్యా = నెరవేరిన పని కలదై, తతః = పిమ్మట, అవ్యగ్రమ్ = ఎట్టి బాధయు లేకుండ, సుతమ్ = కుమారుడైన, భరతమ్ = భరతుని, అభిషేచయితా = అభిషిక్తుని చేయగలదు.

తా. నే నిపుడు అరణ్యమునకు వెళ్ళగనే కైకేయి కృతకృత్యురాలై నిర్భయముగ, తన కుమారునకు రాజ్యాభిషేకము చేయించగలదు. 12

మూ. మయి చీరాజినధరే జటామణ్డలధారిణి,
గతేఽరణ్యం చ కైకేయ్యా భవిష్యతి మనస్సుఖమ్. 13

ప్ర. అ. మయి = నేను, చీరాజినధరే = నారచీరలను, కృష్ణాజినము ధరించి, జటామణ్డలధారిణి = జటామండలమును ధరించినవాడనై, అరణ్యమ్ = అరణ్యమును గూర్చి, గతే = వెళ్ళిన వాడ నగుచుండగా. కైకేయ్యాః = కైకేయికి, మనస్సుఖమ్ = మనస్సునకు సుఖము, భవిష్యతి = కాగలదు.

తా. నేను నారచీరలను, కృష్ణాజినమును, జటలను ధరించి, అరణ్యమునకు వెళ్ళినచో కైకేయికి మనశ్శాంతి కలుగును. 13

మూ. బుద్ధిః ప్రణీతా యేనేయం మనశ్చ సుసమాహితమ్,
తం తు నార్హామి సంక్లేష్టుం ప్రవ్రజిష్యామి మా చిరమ్.

ప్ర. అ. యేన = ఏ తండ్రిచేత, ఇయమ్ = ఈ, బుద్ధిః = బుద్ధి (నిర్ణయము) ప్రణీతా = చేయబడినదో, మనశ్చ = మనస్సు, సుసమాహితమ్ = బాగుగ స్థిరము చేసుకొనబడినదో, తమ్ = అట్టి తండ్రిని, సంక్లేష్టుమ్ = బాధపెట్టుటకు, నార్హామి = తగను. ప్రవ్రజిష్యామి = అడవికి పోయెదను. చిరమ్ = చిరకాలము, (ఆలస్యము) మా = వద్దు.

తా. మనస్సు గట్టి పరచుకొని, ఈ నిర్ణయము తీసుకొన్న మన తండ్రికి క్లేశమును కల్గించుట నాకు ఇష్టము కాదు. అందుచే వెంటనే అడవికి వెళ్ళెదను.

మూ. కృతాన్తస్త్వేవ సౌమిత్రే ద్రష్టవ్యో మత్ప్రవాసనే,
రాజ్యస్య చ వితీర్ణస్య పునరేవ నివర్తనే. 15

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! మత్ప్రవాసనే = నన్ను అడవికి పంపి వేయుటయందును, వితీర్ణస్య = ఇవ్వబడిన, రాజ్యస్య = రాజ్యముయొక్క, పునరేవ = మరల, నివర్తనే చ = తిరిగి తీసుకొనుటయందును, కృతాన్తస్త్వేవ = దైవమే (కారణముగ), ద్రష్టవ్యః = చూడదగినది.

తా. లక్ష్మణా! ఇచ్చిన రాజ్యమును వెనుకకు తీసుకొని నన్ను అరణ్యమునకు పంపుటకు దైవమే కారణ మని తెలిసికొనుము. 15

మూ. కైకేయ్యాః ప్రతిపత్తిర్హి కథం స్యాన్మమ పీడనే,
యది తస్యా న భావోఽయం కృతాన్తవిహితో భవేత్. 16

ప్ర. అ. అయమ్ = ఈ, భావః = భావము, తస్యాః = ఆమెకు, కృతాన్తవిహితః = దైవముచే చేయబడినది, న భవేత్ యది = కాకున్నచో, కైకేయ్యాః = కైకేయికి, మమ = నాయొక్క, పీడనే = పీడించుటయందు, ప్రతిపత్తిః = బుద్ధి, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగును?

తా. దైవమే కైకేయికి ఈ భావమును కల్గింప కున్నచో నాకు బాధ కల్గింపవలె నని ఆమెకు బుద్ధి ఎట్లు కలుగును? 16

మూ. జానాసి వా యథా సౌమ్య న మాతృషు మమాన్తరమ్,
భూతపూర్వం విశేషో వా తస్యా మయి సుతేఽపి వా. 17

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా, మాతృషు = తల్లుల విషయమున, మమ = నాకు, యథా = ఎట్లు, అన్తరమ్ = భేదబుద్ధి, న భూతపూర్వమ్ = పూర్వము ఎన్నడునూ కలుగలేదో దానిని, తస్యాః = ఆమెకు (కైకేయికి), మయి = నాయందు కాని, సుతేఽపి వా = తన కుమారుడైన భరతుని యందు కాని, విశేషః = భేదము (పూర్వ మెట్లు లేదో) జానాసి = నీ వెరుగుదువు.

తా. పూర్వ మెన్నడును తల్లుల విషయమున నాకు భేదబుద్ధి ఏమియు లేదను అంశమును, కైకేయికి నాయందు కాని, తన కుమారుడైన భరతుని యందు కాని, ఎట్టి భేదబుద్ధియు లేదను అంశమునూ నీవు ఎరుగుదువు కదా! 17

మూ. సోఽభిషేకనివృత్త్యర్థైః ప్రవాసార్థైశ్చ దుర్వచైః,
ఉగ్రైర్వాక్యైరహం తస్యా నాన్యద్దైవాత్సమర్థయే. 18

ప్ర. అ. సః అహమ్=అట్టి నేను, అభిషేకనివృత్త్యర్థైః = అభిషేక నివృత్తియే ప్రయోజనముగా కలవి, ప్రవాసార్థైశ్చ = నా ప్రవాసము ప్రయోజనముగా కలవి, దుర్వచైః=చెప్పకూడనివి, ఉగ్రైః=ఉగ్రమైనవి యైన, తస్యాః= ఆమెయొక్క, వాక్యైః=వాక్యములచే, దైవాత్=దైవముకంటె, అన్యత్=వేరైన దానిని, నసమర్థయే=నిశ్చయింపను.

తా. కైకేయి నా అభిషేకమును నిలిపివేయవలె ననియు, నన్ను ప్రవాసమునకు పంపవలె ననియు, పలుకరాని, ఉగ్రమైన మాటలు, పలికిన దన్నచో దానికి దైవము తప్ప మరొక హేతువు ఏదియు నాకు అగపడుట లేదు. 18

మూ. కథం ప్రకృతిసంపన్నా రాజపుత్రీ తథాగుణా,
బ్రూయాత్సా ప్రాకృతేవ స్త్రీ మత్పీడాం భర్తృసన్నిధౌ.

ప్ర. అ. ప్రకృతిసంపన్నా=ఉత్తమ స్వభావ సంపన్నురాలును, తథా గుణా=అట్టి సద్గుణములు కలదియు, రాజపుత్రీ=రాజకుమార్తెయు అయిన, సా =ఆమె, ప్రాకృతా=సామాన్యురాలైన, స్త్రీ ఇవ=స్త్రీవలె, భర్తృ సన్నిధౌ= భర్త దగ్గర, మత్పీడామ్=నా పీడను గూర్చి, కథమ్=ఎట్లు, బ్రూయాత్ = చెప్పును.

తా. ఇందుకు దైవమే కారణము కాకున్నచో ఉత్తమ మైన స్వభావము కలది, రాజవంశ సంభూతురాలు అయిన ఆ కైకేయి ఒక సామాన్య స్త్రీ వలె తన భర్త యెదుట నాకు బాధ కల్గింపవలె నని పలుకునా? 19

మూ. యదచిన్త్యం తు తద్దైవం భూతేష్వపి న హన్యతే,
వ్యక్తం మయి చ తస్యాం చ పతితో హి విపర్యయః. 20

ప్ర. అ. అచిన్త్యమ్=ఊహింప శక్యము కాని, యత్=ఏ, దైవమ్= దైవమున్నదో, తత్=అది, భూతేష్వపి=సమస్త భూతములందును, న హన్యతే=

నివారింపబడదు. మయి చ=నాయందును; తస్యాం చ = ఆమెయందును, విపర్యయః = ప్రతికూలదైవము, పతితః = పడినది. వ్యక్తమ్ = స్పష్టము.

తా. దైవప్రభావము ఊహింప శక్యముకానిది. ఏ ప్రాణులందును, దాని ప్రభావమును అడ్డుకొనువారు లేరు. ఇపుడు నాయందును కైకేయియందును దైవవైపరీత్యము వచ్చి పడినది. ఈ విషయము స్పష్టము. 20

మూ. కశ్చ దైవేన సౌమిత్రే యోద్ధుముత్సహతే పుమాన్,
యస్య న గ్రహణం కించిత్ కర్మణోఽన్యత్ర దృశ్యతే.

ప్ర. అ. సౌమిత్రే=ఓ లక్ష్మణా! పుమాన్=కః ఏ పురుషుడు, దైవేన=దైవముతో, యోద్ధుమ్=యుద్ధము చేయుటకు, ఉత్సహతే=ప్రయత్నించును? యస్య=ఏ దైవముయొక్క, గ్రహణమ్=నిగ్రహోపాయము, కర్మణః=దాని ప్రకారము చేయుటకంటె, అన్యత్ర=మరియొకటి, కించిత్=ఏదియు, న దృశ్యతే=చూడబడుటలేదో.

తా. లక్ష్మణా! దైవము నడిపించునట్లు ప్రవర్తించుట తప్ప దానిని నిగ్రహించుటకు మరి యొక ఉపాయము ఏదియు లేదు. అట్టి దైవమును ఎవడు ఎదుర్కొనగలడు? 21

మూ. సుఖదుఃఖే భయక్రోధౌ లాభాలాభౌ భవాభవౌ,
యచ్చ కించిత్ తథాభూతం నను దైవస్య కర్మ తత్. 22

ప్ర. అ. సుఖదుఃఖే=సుఖదుఃఖములు, భయక్రోధౌ = భయక్రోధములు, లాభాలాభౌ=లాభనష్టములు, భవాభవౌ=జన్మమరణములు, తథాభూతమ్=అట్టిదే యైన, యచ్చ కించిత్=ఇతరమైన దేది కలదో. తత్ = అదియు, దైవస్య=దైవముయొక్క, కర్మ నను=కర్మయే కదా!

తా. సుఖదుఃఖములు, భయక్రోధములు, లాభనష్టములు, ఉత్పత్తివినాశములు, ఈ విధమైన వన్నియు దైవచేష్టితములే. 22

మూ. ఋషయో ప్యుగ్రతపసో దైవేనాభిప్రపీడితాః,
ఉత్సృజ్య నియమాం స్తీవ్రాన్ భ్రశ్యన్తే కామమన్యుభిః. 23

ప్ర. అ. ఉగ్రతపసః=ఉగ్ర మైన తపస్సు కల, ఋషయోఽపి=ఋషులు కూడ, దైవేన=దైవముచేత, అభిప్రపీడితాః=పీడింపబడినవారై, తీవ్రాన్=తీవ్రము లైన, నియమాన్=నియమములను, ఉత్సృజ్య=విడచి, కామమన్యుభిః=కామక్రోధములచేత, భ్రశ్యన్తే=భ్రష్టు లగుచున్నారు.

తా. ఉగ్రమైన తపస్సు గల ఋషీశ్వరులు కూడ దైవపీడితు లై తీవ్ర మైన నియమములను విడచి కామక్రోధములచే భ్రష్టు లగుచుందురు. 23

మూ. అసంకల్పితమేవేహ యదకస్మాత్ ప్రవర్తతే,
నివర్త్యారంభమారబ్ధం నను దైవస్య కర్మ తత్. 24

ప్ర. అ. ఇహ=ఈ లోకమున, ఆరబ్ధమ్=ప్రారంభింపబడిన, ఆరంభమ్=కార్యమును, నివర్త్య=నిలిపివేసి, అసంకల్పితమ్ ఏవ=ఊహించకుండగనే, అకస్మాత్=హఠాత్తుగా, యత్=యేది, ప్రవర్తతే=ప్రవర్తించునో, తత్=అది, దైవస్య=దైవముయొక్క, కర్మ నను=కర్మయే కదా.

తా. ప్రారంభించిన పనికి అడ్డుగా, ఊహింపరాని విధమున, అకస్మాత్తుగా ఏదైన వచ్చిపడినచో అది దైవవిలసితమే. 24

మూ. ఏతయా తత్త్వయా బుద్ధ్యా సంస్తభ్యాత్మానమాత్మనా,
వ్యాహతేఽప్యభిషేకే మే పరితాపో న విద్యతే. 25

ప్ర. అ. అభిషేకే=నా అభిషేకము, వ్యాహతేఽపి=అడ్డుకొనబడినప్పటికి, తత్త్వయా=యదార్థ మైన, ఏతయా బుద్ధ్యా=ఈ బుద్ధిచేత, ఆత్మానమ్=మనస్సును (తనను), ఆత్మనా=తనచేతనే, సంస్తభ్య=నిగ్రహించుకొని, మే=నాకు, పరితాపః=దుఃఖము, న విద్యతే=లేదు.

తా. నా అభిషేకమునకు అడ్డము వచ్చినను ఈ యదార్థబుద్ధితో నన్ను నేనే నిగ్రహించుకొనుటచే నాకు మనస్సులో దుఃఖ మేమియు లేదు. 25

మూ. తస్మాదపరితాపస్సంస్త్వమప్యనువిధాయ మామ్,
ప్రతిసంహారయ క్షిప్రమాభిషేచనికీం క్రియామ్. 26.

ప్ర. అ. తస్మాత్=ఆ కారణమువలన, త్వమపి=నీవు కూడ, మామ్=నన్ను, అనువిధాయ = అనుసరించి, అపరితాపః = పరితాపము లేనివాడవై, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆభిషేచనికీమ్ = అభిషేకమునకు సంబంధించిన, క్రియామ్ = క్రియను, ప్రతిసంహారయ = ఉపసంహరింపచేయుము.

తా. అందుచే నీవుకూడ నా వలెనే పరితాపమును విడిచి వెంటనే అభిషేకమునకు సంబంధించిన ఏర్పాట్లను నిలిపివేయుము. 26

మూ. ఏభిరేవ ఘటైః సర్వైరభిషేచనసంభృతైః,
మమ లక్ష్మణ తాపస్యే వ్రతస్నానం భవిష్యతి. 27

ప్ర. అ. లక్ష్మణ=ఓ లక్ష్మణా, అభిషేచనసంభృతైః=అభిషేకముకొరకు ఏర్పరుపబడిన, ఏభిః=ఈ, సర్వైః=సమస్తమైన, ఘటైరేవ=ఘటములతోనే, మమ=నాకు, తాపస్యే=తపస్సుకు తగిన కర్మమునందు, వ్రతస్నానమ్=వ్రతస్నానము, భవిష్యతి=కాగలదు.

తా. లక్ష్మణా! అభిషేకముకొరకు ఏర్పరచిన ఈ ఘటోదకములతోనే, నేను తపోవ్రతమును అవలంబించు సందర్భమున వ్రతస్నానము చేసెదను. 27.

మూ. అథవా కిం మమైతేన రాజద్రవ్యమయేన తు,
ఉద్ధృతం మే స్వయం తోయం వ్రతాదేశం కరిష్యతి. 28

ప్ర. అ. అథవా = లేదా, రాజద్రవ్యమయేన=రాజద్రవ్యమైన, ఏతేన= ఈ ఘటోదకముతో, మమ = నాకు, కిమ్ = ఏమి ప్రయోజనము? స్వయమ్ = స్వయముగా, ఉద్ధృతమ్ = పైకి తీయబడిన, తోయమ్ = ఉదకము, మే=నాకు, వ్రతాదేశమ్ = వ్రతనియమమును, కరిష్యతి = చేయగలదు.

తా. లేదా రాజద్రవ్యమైన ఈ ఘటములలోని ఉదకమా నా కెందుకు? నేనే స్వయముగా తోడుకొనిన ఉదకము నాకు ప్రశస్తమునకై ఉపయోగింపగలదు. 28

మూ. మా చ లక్ష్మణ సంతాపం కార్షీర్లక్ష్మ్యా విపర్యయే,
రాజ్యం వా వనవాసో వా వనవాసో మహోదయః. 29

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! లక్ష్మ్యాః = లక్ష్మియొక్క, విపర్యయే = వైపరీత్యము విషయమున, సంతాపమ్ = దుఃఖమును, మా కార్షీః = చేయకుము. రాజ్యం వా = రాజ్యమా, వనవాసో వా = వనవాసమా? (అనునపుడు) వనవాసః = వనవాసమే, మహోదయః = గొప్ప ఫలము కలది.

తా. లక్ష్మణా! ఈ లక్ష్మీవైపరీత్యమును గూర్చి, సంతాపము చెందకుము, రాజ్యమా వనవాసమా అన్నచో వనవాసమే ఉత్తమఫలప్రదము. 29

మూ. న లక్ష్మణాస్మిన్ఖలు కర్మవిఘ్నే
మాతా యవీయస్యతిశంకనీయా,
దైవాభిపన్నా హి వదత్యనిష్టం
జానాసి దైవం చ తథాప్రభావమ్. 30

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వావింశః సర్గః.

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! అస్మిన్ = ఈ, కర్మవిఘ్నే = రాజ్యాభిషేకవిఘ్నమునందు, యవీయసీ మాతా = మన చిన్న తల్లి, నఅతిశంకనీయా ఖలు = శంకింపదగినది కాదు. దైవాభిపన్నా = దైవముచే ఆక్రమింపబడినదై, అనిష్టమ్ = అనిష్టమును, వదతి హి = పలుకుచున్నది కదా! దైవం చ = దైవమును కూడ, తథాప్రభావమ్ = అట్టి ప్రభావము కలదానినిగా, జానాసి = ఎరుగుదువు.

తా. ఓ లక్ష్మణా! అభిషేకమునకు విఘ్నము కల్గినందులకు మన తల్లిని దూషింపరాదు. ఆమె దైవముచే ప్రేరితురాలై ఈ విధముగా అనిష్టవాక్యము లను పలుకుచున్నది. దైవమునకు ఎంతటి ప్రభావమున్నదో నీకు తెలియును కదా! 30

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ఇరువదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రయోవింశః సర్గః

[లక్ష్మణుని ప్రతాపోక్తులు, అతడు దైవమును త్రోసిపుచ్చి పౌరుషమును ప్రతిపాదించుట, రామాభిషేకమునకై విరోధులతో యుద్ధము నకై తలపడుటకు సిద్ధమగుట.]

మూ. ఇతి బ్రువతి రామే తు లక్ష్మణోఽధశ్శిరా ముహుః,
శ్రుత్వా మధ్యం జగామేవ మనసా దుఃఖహర్షయోః. 1

ప్ర. అ. రామే = రాముడు, ఇతి = ఈ విధముగా, బ్రువతి = వలుకు చుండగా, శ్రుత్వా = విని, లక్ష్మణః = లక్ష్మణుడు, అధశ్శిరాః = వంచబడిన శిరస్సు గలవాడై, మనసా = మనస్సుతో, ముహుః = మాటి మాటికి, దుఃఖ హర్షయోః = దుఃఖసంతోషములయొక్క, మధ్యమ్ = మధ్యమును, జగామేవ = పొంది నట్లుండెను.

తా. రాముడు ఇట్లు పలుకుచుండగా, లక్ష్మణుడు విని తల వంచి మనస్సుతో మాటి మాటికిని దుఃఖసంతోషముల మధ్య ప్రవేశించిన ట్లుండెను. 1

మూ. తదా తు బద్ధ్వా భ్రుకుటీం భ్రువోర్మధ్యే నరర్షభః,
నిశశ్వాస మహాసర్పో బిలస్థ ఇవ రోషితః. 2

ప్ర. అ. నరర్షభః = నరశ్రేష్ఠుడైన లక్ష్మణుడు, తదా తు = అపుడు, భ్రువోః = కనుబొమలయొక్క, మధ్యే = మధ్యయందు, భ్రుకుటీమ్ = భ్రుకుటిని, బద్ధ్వా = కట్టి, బిలస్థః = బిలమునం దున్న, రోషితః = కోపించిన, మహాసర్పః ఇవ = గొప్ప సర్పము వలె, నిశశ్వాస = నిట్టూర్పెను.

తా. లక్ష్మణు డపుడు కనుబొమలు ముడిచి బిలములో నున్న వగపట్టిన మహాసర్పము వలె నిట్టూర్పులు విడచెను. 2

మూ. తస్య దుష్ప్రతివీక్షం తద్భ్రుకుటీసహితం తదా,
బభౌ క్రుద్ధస్య సింహస్య ముఖస్య సదృశం ముఖమ్. ౩

ప్ర. అ. తదా = అపుడు, దుష్ప్రతివీక్షమ్ = చూచుటకు శక్యము కాని, భ్రుకుటీసహితమ్ = భ్రుకుటితో కూడిన, తత్ = ఆ, తస్య = అతని, ముఖమ్ = ముఖము, క్రుద్ధస్య = కోపించిన, సింహస్య = సింహమునకు, సదృశమ్ = సమానమైనదై, బభౌ = ప్రకాశించెను.

తా. కనుబొమలు విరిచి చూచుటకు భయంకరముగా నున్న అతని ముఖము అపుడు కోపించిన సింహము ముఖము వలె కనబడెను. ౩

మూ. అగ్రహస్తం విధూన్వంస్తు హస్తీ హస్తమివాత్మనః,
తిర్యగూర్ధ్వం శరీరే చ పాతయిత్వా శిరోధరామ్, 4
అగ్రాక్ష్ణా వీక్షమాణస్తు తిర్యగ్భ్రాతరమబ్రవీత్.

ప్ర. అ. హస్తీ = ఏనుగు, ఆత్మనః = తనయొక్క, హస్తమ్ ఇవ = తొండమును వలె, అగ్రహస్తమ్ = తన హస్తాగ్రమును, విధూన్వన్ = కదల్చుచు, శిరోధరామ్ = కంఠమును, శరీరే = శరీరమునందు, తిర్యక్ = అడ్డముగాను, ఊర్ధ్వం చ = పైకిని, పాతయిత్వా = పడవేసి, అగ్రాక్ష్ణా = కంటికొనతో, భ్రాతరమ్ = సోదరుని, తిర్యక్ = అడ్డముగా, వీక్షమాణః = చూచుచు, అబ్రవీత్ = పలికెను.

తా. ఏనుగు తొండమును వలె హస్తాగ్రమును కదల్చుచు, శిరస్సును అడ్డముగను పైకిని పడవేయుచు, నేత్రాగ్రముతో రాముని అడ్డముగా చూచుచు ఈ విధముగా పలికెను. 4

మూ. అస్థానే సంభ్రమో యస్య జాతో వై సుమహానయమ్. 5
ధర్మదోషప్రసంగేన లోకస్యానతిశఙ్కయా,
కథం హ్యేతదసంభ్రాన్తస్త్వద్విధో వక్తుమర్హతి, 6
యథా దైవమశౌణ్డీరం శౌణ్డీరక్షత్రియర్షభ.

ప్ర. అ. శౌణ్డీరక్షత్రియర్షభ = శూరు లైన క్షత్రియులలో శ్రేష్ఠుడా! యస్య = ఏ నీకు, ధర్మదోషప్రసంగేన = ధర్మమునకు దోషము కలుగు నను అభిప్రాయముచేతను, లోకస్య = లోకముయొక్క, అనతిశఙ్కయా = శంక లేక పోవుటచేతను, అస్థానే = అయుక్త మగు సమయమున, అయమ్ = ఈ, సుమహాన్ = చాలా గొప్ప దైన, సంభ్రమః = వేగిరపాటు, జాతః వై = పుట్టినదో, త్వద్విధః = అట్టి నీ వంటివాడు, అసంభ్రాన్తః = భ్రాంతి చెందనివాడై, అశౌణ్డీరమ్ = శక్తి లేని, దైవమ్ = దైవమును గూర్చి, యథా = ఏ విధముగా (పలుకుచున్నావో), ఏతత్ = దీనిని, కథమ్ = ఎట్లు, వక్తుమ్ = చెప్పుటకు, అర్హతి = తగియున్నాడు.

తా. శూరు లైన క్షత్రియులలో శ్రేష్ఠుడ వైనవాడా! పితృవాక్యమును పరిపాలింపకపోవుట అను అధర్మము కలుగు నను భయము చేతను, లోకము విషయమున కొంచెము కూడ శంక లేకపోవుటచేతను నీకు ఈ విధముగా కల్గిన గొప్ప వేగిరపాటు అయుక్త మైనది. శక్తి విహీన మైన దైవమును గూర్చి నీ వంటివాడు, భ్రాంతి కలుగని పరిస్థితులలో ఇట్లు (దైవమే బలవత్తర మని) పలుకునా? 5-6

మూ. కిన్నామ కృపణం దైవమశక్తమభిశంససి, 7
పాపయోస్తే కథం నామ తయోశ్శఙ్కా న విద్యతే.

ప్ర. అ. కృపణమ్ = దీన మైన, అశక్తమ్ = అసమర్థ మైన, దైవమ్ = దైవమును, కిం నామ = ఎందుకు, అభిశంససి = పొగడుచున్నావు? పాపయోః = పాపాత్ము లైన, తయోః = వారిద్దరియందు, తే = నీకు, శఙ్కా = శంక, కథం నామ = ఎట్లు, న విద్యతే = లేదు.

తా. దుర్బలము, దీనము అయిన దైవమును గూర్చి ఈ విధముగ ఎందుకు చెప్పుచున్నావు? పాపాత్ము లైన ఆ కైకేయీ దశరథుల విషయమున నీకు శంక ఎందుకు కలుగుటలేదు. 7

మూ. సన్తి ధర్మోపధాః శ్లక్ష్ణా ధర్మాత్మన్ కిం న బుధ్యసే, 8
తయోస్సుచరితం స్వార్థం శాఠ్యాత్ పరిజిహీర్షతోః.

ప్ర. అ. ధర్మాత్మన్ = ఓ ధర్మాత్మా, శాఠ్యాత్ = రహస్యముగా అపకారము చేయు బుద్ధివలన, స్వార్థమ్ = స్వలాభము కొరకై, సుచరితమ్ = నీ ఉత్తమప్రవర్తనను, పరిజిహీర్షతోః = పరిహరింప గోరుచున్న, తయోః = వారిద్దరి యొక్క, శ్లక్ష్ణాః = మృదువైన, ధర్మోపధాః = ధర్మరూపమున కనబడు వంచనలు, సన్తి = ఉన్నవి. కిం = ఎందుచేత, న బుధ్యసే = నీవు తెలుసుకొనుటలేదు.

తా. ఓ ధర్మాత్మా! గూఢముగ అపకారము చేసి స్వలాభము నిమిత్తమై నీ మంచితనమును పరిహరింపవలెనను అభిప్రాయముతో ఆ ఇరువురును, మృదువైన, ధర్మరూపమైన వంచనలను చేయుచున్నారు. నీవు తెలుసుకొనుట లేదు. 8

మూ. యది నైవం వ్యవసితం స్యాద్ధి ప్రాగేవ రాఘవ, 9
తయోః ప్రాగేవ దత్తశ్చ స్యాద్వరః ప్రకృతశ్చ సః.

ప్ర. అ. రాఘవ = రామా! ప్రాగేవ = పూర్వమునందే, తయోః = వారిద్దరి యొక్క, వ్యవసితమ్ = నిర్ణయము, ఏవమ్ = ఈ విధముగ, న స్యాద్యది = కాకున్నచో, ప్రకృతః = ప్రకృతమైన, సః = ఆ, వరః = వరము, ప్రాగేవ = ముందుగానే, దత్తః = ఇవ్వబడినది, స్యాత్ = అయి ఉండెడిది.

తా. రామా! వారు ఇరువురు ముందుగనే ఈ విధముగ నిర్ణయించుకొని ఉండకపోయినచో ఆ వరము, పూర్వమే ఎన్నడో ఇవ్వబడి యుండెడిది. అనగా వారిద్దరును నిన్ను వంచింప దలచినవారు కావుననే ఎన్నడో పూర్వమిచ్చిన వరమును గూర్చి ఇపుడు చెప్పుచున్నారు. అట్లు కాకున్నచో ఆ వరమును దశరథుడు ఎన్నడో పూర్వమే తీర్చి యుండెడివాడు. 9

మూ. లోకవిద్విష్టమారబ్ధం త్వదన్యస్యాభిషేచనమ్,
నోత్సహే సహితుం వీర తత్ర మే క్షన్తుమర్హసి. 10

ప్ర. అ. వీర = ఓ వీరుడా! లోకవిద్విష్టమ్ = లోకముచే ద్వేషింపబడిన దగు, ఆరబ్ధమ్ = ప్రారంభింపబడిన, త్వదన్యస్య = నీకంటె ఇతరుని యొక్క, అభిషేచనమ్ = రాజ్యాభిషేకమును, సహితుమ్ = సహించుటకు, నోత్సహే = ఉత్సహించను. తత్ర = ఆ విషయమున, మే = నాకు, క్షన్తుమ్ = క్షమించుటకు, అర్హసి = తగియున్నావు.

తా. నీకు తప్ప ఇతరునికి రాజ్యాభిషేకము చేయుట లోకవిరుద్ధము. ప్రారంభించిన ఈ పనిని నేను సహింపజాలను. ఈ విషయమున నన్ను క్షమింపుము. 10

మూ. యేనేయమాగతా ద్వైధం తవ బుద్ధిర్మహామతే,
స హి ధర్మో మమ ద్వేష్యః ప్రసంగాద్యస్య ముహ్యసి.

ప్ర. అ. మహామతే = గొప్ప బుద్ధి కలవాడా! యేన = దేనిచే, తవ = నీయొక్క, ఇయమ్ = ఈ, బుద్ధిః = బుద్ధి, ద్వైధమ్ = భేదమును, ఆగతా = పొందినదో, యస్య = దేనియొక్క, ప్రసంగాత్ = ప్రసంగమువలన, ముహ్యసి = నీవు మోహమును చెందుతున్నావో, సః ధర్మః = ఆ ధర్మము, మమ = నాకు, ద్వేష్యః = ద్వేషింపతగినది.

తా. మహాబుద్ధిశాలి వైన ఓ రామా! నీ ఆలోచనయందు భేదమును కలిగించి నీకు మోహమును కూడ కల్గించిన ఈ ధర్మమును నేను ద్వేషించుచున్నాను. 11

మూ. కథం త్వం కర్మణా శక్తః కైకేయీవశవర్తినః,
కరిష్యసి పితుర్వాక్యమధర్మిష్ఠం విగర్హితమ్. 12

ప్ర. అ. కర్మణా = కర్మచేత, శక్తః = సమర్థుడ వైన, త్వమ్ = నీవు, కైకేయీవశవర్తినః = కైకేయికి వశ మైపోయిన, పితుః = తండ్రియొక్క, అధర్మిష్ఠమ్ = ధర్మవిరుద్ధము, విగర్హితమ్ = నింద్యము అయిన, వాక్యమ్ = వాక్యమును, కథమ్ = ఎట్లు, కరిష్యసి = చేయగలవు?

తా. నీవు ప్రతిక్రియ చేయుటకు సమర్థుడ వై ఉండి కూడ కైకేయి మాటలకు లొంగిపోయిన తండ్రి చెప్పిన, ధర్మవిరుద్ధము, నింద్యము అయిన మాట ప్రకారము చేయుట అయుక్తము. 12

మూ. యద్యయం కిల్బిషాద్భేదః కృతో ప్యేవం న గృహ్యతే,
జాయతే తత్ర మే దుఃఖం ధర్మసంగశ్చ గర్హితః. 13

ప్ర. అ. అయమ్ = ఈ, ఛలః = కపటము, కిల్బిషాత్ = పాపబుద్ధి వలన, కృతోఽపి = చేయబడిన దైనను, ఏవమ్ = ఈ విధముగ, న గృహ్యతే యది = గ్రహింపబడకున్న చో, తత్ర = ఆ విషయమున, మే = నాకు, దుఃఖమ్ = దుఃఖము, జాయతే = కలుగుచున్నది. ధర్మసంగశ్చ = ఇట్టి ధర్మాచరణము, గర్హితః = నింద్య మైనది.

తా. వారు ఈ కపటమును పాపబుద్ధితో చేయుచున్నను నీవు దానిని ఆ విధముగ గ్రహింపనందులకు నాకు దుఃఖము కలుగుచున్నది. ఇట్టి ధర్మాచరణము నిందింపదగినది. 13

మూ. మనసాఽపి కథం కామం కుర్యాస్త్వం కామవృత్తయోః,
తయోస్త్వహితయోర్నిత్యం శత్ర్వోః పిత్రభిధానయోః. 14

ప్ర. అ. కామవృత్తయోః = స్వేచ్ఛగా ప్రవర్తించుచున్నవారును, నిత్యమ్ = ఎల్లప్పుడును, అహితయోః = నీకు హితము కోరనివారును, పిత్రభిధానయోః = తల్లిదండ్రులు అను పేరు గల, తయోః శత్ర్వోః = ఆ శత్రువులయొక్క, కామమ్ = కోరికను, త్వమ్ = నీవు, మనసా అపి = మనస్సుచేత నైన, కథమ్ = ఎట్లు, కుర్యాః = చేయుదువు.

తా. వారిరువురును స్వేచ్ఛగా ప్రవర్తించుచు ఎన్నడును నీ హితమును కోరలేదు. తల్లిదండ్రులు అను పేరు గల శత్రువులు. అట్టి వారి కోరికను తీర్చుటకు మనస్సుతో కూడ తలచుట అయుక్తము. 14

మూ. యద్యపి ప్రతిపత్తిస్తే దైవీ చాపి తయోర్మతమ్,
తథాప్యుపేక్షణీయం తే న మే తదపి రోచతే. 15

ప్ర. అ. తయోః = వారియొక్క, ప్రతిపత్తిః = ఈ బుద్ధి, దైవీ చ = దైవకృత మైనది అని, తే = నీయొక్క, మతం యద్యపి = అభిప్రాయమే యైనను, తథాపి = అట్లైనను, తదపి = అది కూడ, తే = నీకు, ఉపేక్షణీయమ్ = ఉపేక్షింపదగినది యను విషయము, న రోచతే = నాకు ఇష్టము కాదు.

తా. వారికి కలిగిన ఈ ఆలోచన కేవలము దైవకృతమే, అని, నీ అభిప్రాయము కావచ్చును. అయినను నీవు దీనిని ఉపేక్షించుట నాకు అభిమతము కాదు. 15

మూ. విక్లబో వీర్యహీనో యః స దైవమనువర్తతే,
వీరాః సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే. 16

ప్ర. అ. యః = ఎవడు, విక్లబః = వ్యాకుల మైన చిత్తము కలవాడో, వీర్యహీనః = వీర్యవిహీనుడో, సః = వాడు, దైవమ్ = దైవమును, అనువర్తతే = అనుసరించును. సంభావితాత్మానః = గౌరవింపబడిన ఆత్మ గల, వీరాః = వీరులు, దైవమ్ = దైవమును, న పర్యుపాసతే = సేవించరు.

తా. చిత్తస్థైర్యము లేనివాడు, వీర్యవిహీనుడు మాత్రమే దైవముపై ఆధార పడి యుండును. ఆత్మాభిమానము గల వీరులు దైవమును లెక్కచేయరు. 16.

మూ. దైవం పురుషకారేణ యః సమర్థః ప్రబాధితుమ్,
న దైవేన విపన్నార్థః పురుషః సోఽవసీదతి. 17

ప్ర. అ. యః పురుషః = ఏ పురుషుడు, పురుషకారేణ = పురుషకారము చేత, దైవమ్ = దైవమును, ప్రబాధితుమ్ = బాధించుటకు, సమర్థః = సమర్థుడో, సః = అతడు, దైవేన = దైవము చేత, విపన్నార్థః = చెడిన ప్రయోజనము కలవాడై, న అవసీదతి = దుఃఖించరు.

తా. స్వప్రయత్నముచే దైవమును బాధింపసమర్థుడైనవాని ప్రయోజనమును దైవము చెరచి అతనికి దుఃఖము కల్గింపజాలదు. 17

మూ. ద్రక్ష్యన్తి త్వద్య దైవస్య పౌరుషం పురుషస్య చ,
దైవమానుషయోరద్య వ్యక్తా వ్యక్తిర్భవిష్యతి. 18

ప్ర. అ. అద్య = ఈనాడు, దైవస్య = దైవముయొక్కయు, పురుషస్య చ = పురుషునియొక్కయు, పౌరుషమ్ = పౌరుషమును, ద్రక్ష్యన్తి = చూడగలరు. అద్య = నేడు, దైవమానుషయోః = దైవముయొక్కయు, మనుష్యునియొక్కయు, వ్యక్తిః = భేదము, వ్యక్తా = స్పష్టమైనదై, భవిష్యతి = కాగలదు.

తా. దైవమునకు ఎంత శక్తి యున్నదో, పురుషునకు ఎంత శక్తి యున్నదో, నేడు అందరును చూడగలరు. దైవపౌరుషములకు ఉన్న భేదము ఈ నాడు స్పష్టము కాగలదు. 18

మూ. అద్య మత్పౌరుషహతం దైవం ద్రక్ష్యన్తి వై జనాః,
యద్దైవాదాహతం తేఽద్య దృష్టం రాజ్యాభిషేచనమ్. 19

ప్ర. అద్య = ఇపుడు, తే = నీయొక్క, రాజ్యాభిషేచనమ్ = రాజ్యాభిషేకము, యద్దైవాత్ = ఏ దైవమువలన, ఆహతమ్ = కొట్టబడినదిగా, దృష్టమ్ = చూడబడినదో, అట్టి, దైవమ్ = దైవమును, అద్య = నేడు, జనాః = జనులు, మత్పౌరుషహతమ్ = నా పౌరుషముచే కొట్టబడగా, ద్రక్ష్యన్తి వై = చూడగలరు.

తా. నీ రాజ్యాభిషేకము ఏ దైవముచే అడ్డుకొనబడినదో ఆ దైవమునే నేను పౌరుషముచే ప్రతిఘటించెదను. జను లెల్లరు చూచెదరు గాక! 19

మూ. అత్యఙ్కుశమివోద్దామం గజం మదబలోద్ధతమ్,
ప్రధావితమహం దైవం పౌరుషేణ నివర్తయే. 20

ప్ర. అ. అహమ్ = నేను, అత్యఙ్కుశమ్ = అంకుశమును లెక్కచేయనిది, ఉద్దామమ్ = బంధనమును అతిక్రమించినది, మదబలోద్ధతమ్ = మదము చేతను బలముచేతను ఉద్ధతముగా నున్నది, ప్రధావితమ్ = పరుగెత్తుచున్నదియైన, గజమ్ ఇవ = గజమును వలె, దైవమ్ = దైవమును, పౌరుషేణ = పౌరుషముచేత, నివర్తయే = వెనుకకు మరల్చెదను.

తా. అంకుశమును లెక్కచేయక బంధనమును ఛేదించి మదబలములచే గర్వించి పరుగెత్తుచున్న ఏనుగును వలె దైవమును నేను పురుషకారముచే మరల్చెదను. 20

మూ. లోకపాలాః సమస్తాస్తే నాద్య రామాభిషేచనమ్,
న చ కృత్స్నాస్త్రయో లోకా విహన్యుః కిం పునః పితా. 21

ప్ర. అ. అద్య = నేడు, తే = ఆ, సమస్తాః = సమస్త మైన, లోకపాలాః = లోకపాలురు, రామాభిషేచనమ్ = రాముని అభిషేకమును, న విహన్యుః = అడ్డగింపజాలరు. కృత్స్నాః = సమస్త మైన, త్రయః లోకాః చ = మూడులోకములు కూడ, న = అడ్డగింపజాలవు. పితా = తండ్రి, కిం పునః = చెప్పనేల.

తా. ఈనాడు సమస్తమైన లోకపాలకులు గాని, మూడు లోకములు కలసి గాని రామునికి జరగబోవు అభిషేకమును అడ్డజాలరు. తండ్రిమాట చెప్ప నేల. 21

మూ. యైర్వివాసస్తవారణ్యే మిథో రాజన్ సమర్థితః,
అరణ్యే తే నివత్స్యన్తి చతుర్దశ సమాస్తథా. 22

ప్ర. అ. రాజన్=ఓ రాజా! యైః=ఎవరిచేత, అరణ్యే=అరణ్యమునందు, తవ=నీయొక్క, నివాసః=నివాసము, మిథః=రహస్యమునందు, సమర్థితః=కోరబడినదో, తే=వారు, తథా=ఆ విధముగా, చతుర్దశ సమాః = పదునాలుగు సంవత్సరములు, అరణ్యే=అరణ్యమునందు, నివత్స్యన్తి=నివసించగలరు.

తా. ఓ మహారాజా! నీవు అరణ్యములో నివసించవలె నని రహస్యముగా నిర్ణయించినవారే పదునాలుగు సంవత్సరములు ఆ విధముగా అరణ్యములో నివసించగలరు. 22

మూ. అహం తదాశాం ఛేత్స్యామి పితుస్తస్యాశ్చ యా తవ,
అభిషేకవిఘాతేన పుత్రరాజ్యాయ వర్తతే. 23

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, అహమ్=నేను, పితుః=తండ్రియొక్కయు, యా=ఏ కైకేయి, తవ=నీయొక్క, అభిషేకవిఘాతేన=అభిషేకమునకు విఘ్నము కల్గించుటచే, పుత్రరాజ్యాయ=తన కుమారుని రాజ్యము కొరకై, వర్తతే=ప్రయత్నించుచున్నదో, తస్యాశ్చ=ఆమెయొక్కయు, ఆశామ్=ఆశను, ఛేత్స్యామి=ఛేదించెదను.

తా. అందుచే నేను తండ్రి ఆశను, నీ అభిషేకమునకు విఘ్నము కలిగించి తన పుత్రుని రాజ్యముకొరకు ప్రయత్నించుచున్న కైకేయి ఆశను ఛేదించెదను. 23

మూ. మద్బలేన విరుద్ధాయ న స్యాద్దైవబలం తథా,
ప్రభవిష్యతి దుఃఖాయ యథోగ్రం పౌరుషం మమ. 24

ప్ర. అ. మద్బలేన = నాబలముతో, విరుద్ధాయ = విరోధించువానికి, ఉగ్రమ్ = భయంకర మైన, మమ పౌరుషమ్ = నా పౌరుషము, యథా = ఎట్లు, దుఃఖాయ = దుఃఖమునకు, ప్రభవిష్యతి = సమర్థ మగునో, తథా = అట్లు, దైవ బలమ్ = దైవబలము, న స్యాత్ = కాదు.

తా. నా బలమును ఎదిరించినవానికి భయంకర మైన నా పౌరుషము ఎంత దుఃఖము కల్గించునో అంత దుఃఖమును దైవబలము కూడ కల్గింపజాలదు. 24

మూ. ఊర్ధ్వం వర్షసహస్రాన్తే ప్రజాపాల్యమనన్తరమ్,
ఆర్యపుత్రాః కరిష్యన్తి వనవాసం గతే త్వయి. 25

ప్ర. అ. ప్రజాపాల్యమనన్తరం = ప్రజాపాలనము చేసిన తరవాత, వర్ష సహస్రాన్తే = వేయి సంవత్సరముల అంతమునందు, త్వయి = నీవు, వనవాసం గతే = వనవాసమును గూర్చి వెళ్లినవాడ వగుచుండగా, ఆర్యపుత్రాః = పూజ్యుర వైన నీ కుమారులు, కరిష్యన్తి = ప్రజాపాలనము చేయగలరు.

తా. నీవు వేయి సంవత్సరములు రాజ్యపాలనము చేసి తపస్సుకై అరణ్య మునకు వెళ్లిన పిమ్మట నీ కుమారులే రాజ్యము చేసెదరు. 25

మూ. పూర్వరాజర్షివృత్త్యా హి వనవాసో విధీయతే,
ప్రజా నిక్షిప్య పుత్రేషు పుత్రవత్పరిపాలనే. 26

ప్ర. అ. పుత్రేషు = పుత్రులయందు, ప్రజాః = ప్రజలను, పుత్రవత్ = పుత్రు లను వలె, పరిపాలనే = పరిపాలనము విషయమున, నిక్షిప్య = ఉంచి, వనవాసః = వనమున నివాసము చేయుట, పూర్వరాజర్షివృత్త్యా = ప్రాచీను లైన రాజర్షుల వృత్తిగా, విధీయతే హి = విధింపబడుచున్నది కదా.

తా. ప్రజలను పుత్రులను పాలించినట్లు పాలించుటకై తమ పుత్రులకు ఒప్పచెప్పి, వనములో నివసించుట ప్రాచీను లగు రాజర్షుల వృత్తిగా విధింపబడి నది కదా। 26

మూ. న చేద్రాజన్యనేకాగ్రే రాజ్యవిభ్రమశఙ్కయా,
నైవమిచ్ఛసి ధర్మాత్మన్ రాజ్యం రామ త్వమాత్మని. 27

ప్రతిజానే చ తే వీర మాఽభూవం వీరలోకభాక్,
రాజ్యం చ తవ రక్షేయమహం వేలేవ సాగరమ్. 28

ప్ర. అ. ధర్మాత్మన్=ధర్మాత్ముడ వైన, రామ=రామా! రాజని=రాజు, అనేకాగ్రే=స్థిర మైన చిత్తముకలవాడు కానపుడు, రాజ్యవిభ్రమశఙ్కయా = రాజ్యములో భేదము కలుగు నను శంకచేత సః త్వమ్=అట్టి నీవు, ఏవమ్=ఈ విధముగ, రాజ్యమ్ = రాజ్యమును, ఆత్మని = తనయందు (తనకు), న ఇచ్ఛసి చేత్ = ఇచ్ఛయించక పోయినట్లైతే, తే = నీకు, ప్రతిజానే చ = ప్రతిజ్ఞ చేయు చున్నాను. వీరః = ఓ వీరుడా, వీరలోకభాక్ = వీరలోకమును పొందువాడను, మాఽభూవమ్ = కాకుందునుగాక. అహమ్ = నేను, వేలా = సముద్రతీరము, సాగరమ్ ఇవ = సముద్రమును వలె, తవ = నీయొక్క, రాజ్యమ్=రాజ్యమును, రక్షేయమ్ = రక్షించెదను.

తా. రాజు అయిన దశరథుడు చపలచిత్తు డై ఉన్నపుడు ఈ రాజ్యము భేదములకు లోనగును, అను కారణముచే నీవు ఈ రాజ్యము నాకు వల దని అనుకొనుచున్నచో ఆ భయ మేదియు లేదు. నేను నీకు మాట ఇచ్చు చున్నాను. సముద్రతీరము సముద్రమును రక్షించి నట్లు నీ రాజ్యమును రక్షించెదను. అట్లు కానిచో నాకు వీరలోకము లభింపకుండు గాక! 27, 28

మూ. మంగళైరభిషిఞ్చస్వ తత్ర త్వం వ్యాపృతో భవ,
అహమేకో మహీపాలానలం వారయితుం బలాత్. 29

ప్ర. అ. త్వమ్=నీవు, మంగళైః=మంగళద్రవ్యములతో, అభిషిఞ్చస్వ= అభిషేకము చేసుకొనుము. తత్ర = ఆ విషయమున, వ్యాపృతః = వ్యాపార వంతుడవు, భవ = అగుము. అహమ్ = నేను, ఏకః = ఒక్కడనే, బలాత్ = బలమువలన, మహీపాలాన్ = రాజులను, వారయితుమ్ = నివారించుటకు, అలమ్ = సమర్థుడను.

తా. నీవు మంగళద్రవ్యములతో నీకు రాజ్యాభిషేకము చేసికొనుటకై ప్రయత్నము చేయుము. నే నొక్కడనే బలప్రయోగముచే రాజుల నందరిని నివారింపగలను. 29

మూ. న శోభార్థావిమౌ బాహూ న ధనుర్భూషణాయ మే,
నాసి రాబన్ధనార్థాయ న శరాః స్తమ్భ హేతవః, 30
అమిత్రదమనార్థం మే సర్వమేతచ్చతుష్టయమ్.

ప్ర. అ. ఇమౌ = ఈ, మే బాహూ = నా బాహువులు, శోభార్థౌ = శోభయే ప్రయోజనముగా కలవి, న = కాదు. ధనుః = ధనుస్సు, భూషణాయ = అలంకారముకొరకు, న = కాదు. అసిః = ఖడ్గము, ఆబన్ధనార్థాయ = నడుమునకు కట్టుకొనుటకు మాత్రమే, న = కాదు, శరాః = శరములు, స్తమ్భహేతవః = కదలకుండుటకు కారణములు, న = కాదు. మే = నాయొక్క, సర్వమ్ = సమస్తమైన, ఏతత్ = ఈ, చతుష్టయమ్ = చతుష్టయము, అమిత్రదమనార్థమ్ = శత్రువులను పీడించుటకు మాత్రమే.

తా. నా బాహువులు కేవలము శోభకు మాత్రమే కాదు. ధనుస్సు అలంకారార్థము కాదు. ఖడ్గము నడుమునకు కట్టుకొనుటకు మాత్రమే కాదు. బాణములు కదలకుండ పడి యుండుటకు కాదు. ఈ నాలుగును శత్రువులను దండించుటకు మాత్రమే ఉద్దిష్ట మైనవి. 30

మూ. న చాహం కామయేఽత్యర్థం యః స్యాచ్ఛత్రుర్మతో మమ
అసినా తీక్ష్ణధారేణ విద్యుచ్చలితవర్చసా,
ప్రగృహీతేన వై శత్రుం వజ్రిణం వా న కల్పయే. 31

ప్ర. అహమ్ = నేను, యః = ఎవడు, మమ = నాకు, శత్రుః = శత్రువుగా, మతః స్యాత్ = భావింపబడునో, అట్టివానిని, అత్యర్థమ్ = మిక్కిలి, న కామయే = సహించుటకు ఇచ్ఛయించను. తీక్ష్ణధారేణ = తీక్ష్ణ మైన అంచుగల, విద్యుచ్చలితవర్చసా = విద్యుత్తు వలె, కదలుచున్న కాంతి గల, ప్రగృహీతేన = చేత ధరింపబడిన, అసినా = ఖడ్గముతో, శత్రుమ్ = శత్రువును, వజ్రిణం వా = దేవేంద్రు నైనను, న కల్పయే = లెక్కచేయను.

తా. నాకు శత్రు వని నిశ్చయింపబడిన వానినిపి విధముగను జీవింప నివ్వను. తీక్ష్ణ మైన అంచులు గలది, మెరుపు వలె ప్రకాశించునది అగు ఖడ్గము చేత బూని నేను ఎదుట నున్న శత్రువు దేవేంద్రు డైనను లెక్కచేయను. 31

మూ. ఖడ్గనిష్పేషనిష్పిష్టైర్గహనా దుశ్చరా చ మే,
హస్త్యశ్వనరహస్తోరుశిరోభిర్భవితా మహీ. 33

ప్ర. అ. మే = నాయొక్క, ఖడ్గనిష్పేషనిష్పిష్టైః = ఖడ్గముచే నలుగ గొట్టుటచే నలిగిపోయిన, హస్త్యశ్వనరహస్తోరుశిరోభిః = ఏనుగులు, అశ్వములు, నరులు, వారి హస్తములు, తొడలు, శిరస్సులు వీటితో, మహీ = భూమి, గహనా = ప్రవేశింప శక్యముగానిది గాను, దుశ్చరా = సంచరింప శక్యము కానిది గాను, భవితా = కాగలదు.

తా. ఈ భూమి యంతయు, ఖడ్గపాతముచే ఖండింపబడిన, గజాశ్వనరుల హస్తములతోను, ఊరువులతోను, శిరస్సులతోను, నిండి, ప్రవేశింప శక్యము కానిదై నడుచుటకు వీలుకాక యుండును. 33

మూ. ఖడ్గధారాహతా మేఽద్య దీప్యమానా ఇవాద్రయః,
పతిష్యన్తి ద్విపా భూమౌ మేఘా ఇవ సవిద్యుతః. 34

ప్ర. అ. అద్య = ఇపుడు, ద్విపాః = ఏనుగులు, మే = నాయొక్క, ఖడ్గధారాహతాః = ఖడ్గధారచే కొట్టబడిన వై, దీప్యమానాః = మండుచున్న, అద్రయ ఇవ = పర్వతములు వలె, సవిద్యుతః = మెరుపులతో కూడిన, మేఘా ఇవ = మేఘములు వలె, భూమౌ = భూమియందు, పతిష్యన్తి = పడగలవు.

తా. ఇపుడు ఏనుగులు నా కత్తి వ్రేటుచే తెగి మండుచున్న పర్వతముల వలె, మెరుపుతో కూడిన మేఘముల వలె భూమిపై పడగలవు. 34

మూ. బద్ధగోధాఙ్గుళిత్రాణే ప్రగృహీతశరాసనే,
కథం పురుషమానీ స్యాత్ పురుషాణాం మయి స్థితే. 35

ప్ర. అ. మయి = నేను, బద్ధగోధాఙ్గుళిత్రాణే = ఉడుము తోలుతో చేసిన అంగుళికవచములను కట్టుకొని, ప్రగృహీతశరాసనే = గ్రహింపబడిన ధనుస్సు కలవాడనై, స్థితే = నిలిచియుండగా, పురుషాణామ్ = పురుషులలో (ఎవడు), పురుషమానీ = పురుషుడను అని చెప్పుకొనువాడుగా, కథమ్ = ఎట్లు, స్యాత్ = ఉండును.

తా. స్త్రీల రక్షణమునకై ఉడుము తోలుతో చేసిన అంగుళిత్రాణములను ధరించి, ధనుస్సు చేత బట్టి, నేను నిలిచి యుండగా నేనే పురుషుడ నని చెప్పు కొనుచు నా యెదుట ఎవడు నిలువగలడు? 35

మూ. బహుభిశ్చైకమత్యస్యన్నేకేన చ బహూన్ జనాన్,
వినియోక్ష్యామ్యహం బాణాన్ నృవాజిగజమర్మసు. 36

ప్ర. అ. అహమ్=నేను, బహుభిః=అనేక బాణములచే, ఏకమ్=ఒకనిని, అత్యస్యన్=కొట్టి దూరముగ పడవేయుచు, ఏకేన = ఒకే బాణముచే, బహూన్ జనాన్=చాలామంది జనులను కొట్టుచు, బాణాన్=బాణములను, నృవాజిగజ మర్మసు=నరాశ్వగజముల మర్మస్థానములందు, వినియోక్ష్యామి = ప్రయోగించెదను.

తా. నేను ఒక్క బలవంతుని అనేకబాణములతో కొట్టుచు, ఒక్క బాణముతో అనేకులను చంపుచు, నా బాణములను మనుష్యఅశ్వగజముల మర్మ స్థానములందు ప్రయోగించెదను. 36

మూ. అద్య మేఽస్త్రప్రభావస్య ప్రభావః ప్రభవిష్యతి,
రాజ్ఞశ్చాప్రభుతాం కర్తుం ప్రభుత్వం చ తవ ప్రభో. 37

ప్ర. అ. ప్రభో=ప్రభు వైన ఓ రామా! అద్య=నేడు, మే=నాయొక్క, అస్త్రప్రభావస్య=అస్త్రప్రభావముయొక్క, ప్రభావః = శక్తి, రాజ్ఞః = రాజైన దశరథునకు, అప్రభుతామ్=ప్రభుత్వము లేకుండుటను. తవ=నీకు, ప్రభుత్వం చ=ప్రభుత్వమును, కర్తుమ్=చేయుటకు, ప్రభవిష్యతి=సమర్థము కాగలదు.

తా. ఓ మహారాజా! నేడు నా అస్త్రప్రభావము రాజైన దశరథుని రాజ్యాధికారమునుండి తొలగించి నీకు రాజ్యాధికారమును ఇవ్వగలదు. 37

మూ. అద్య చందనసారస్య కేయూరామోక్షణస్య చ,
వసూనాం చ విమోక్షస్య సుహృదాం పాలనస్య చ, 38
అనురూపావిమౌ బాహూ రామ కర్మ కరిష్యతః,
అభిషేచనవిఘ్నస్య కర్తౄణాం తే నివారణే. 39

ప్ర. అ. రామ=ఓ రామా! అద్య=నేడు, చందనసారస్య=చందనము యొక్క సారమునకు, కేయూరామోక్షణస్య = కేయూరములను ధరించుటకు, వసూనామ్=ధనములయొక్క, విమోక్షస్య=దానమునకు, సుహృదామ్=స్నేహితులయొక్క, పాలనస్య = పాలనమునకు, అనురూపౌ=తగిన, ఇమౌ=ఈ, బాహూ = బాహువులు, తే = నీయొక్క, అభిషేచనవిఘ్నస్య = అభిషేకమునకు విఘ్నమును, కర్తౄణామ్ = చేయువారియొక్క, నివారణే = నివారణమునందు, కర్మ = కర్మను, కరిష్యతః = చేయగలవు.

తా. మంచిగంధమునకు, కేయూరములను ధరించుటకు, ధనమును దానముచేయుటకు, మిత్రులను పాలించుటకు, తగిన ఈ బాహువులు నేడు నీ అభిషేకమునకు విఘ్నము చేసినవారిని అడ్డుకొనుటకు తగిన పని చేయగలవు. 38-39

మూ. బ్రవీహి కోఽద్యైవ మయా వియుజ్యతామ్
తవాసుహృత్ప్రాణయశస్సుహృజ్జనైః,
యథా తవేయం వసుధా వశే భవే
త్తథైవ మాం శాధి తవాస్మి కింకరః. 40

ప్ర. అ. తవ = నీయొక్క, అసుహృత్ =శత్రువైన, కః = ఎవడు, అద్యైవ = ఇపుడే, మయా = నాచేత, ప్రాణయశస్సుహృజ్జనైః = ప్రాణములతోను, కీర్తితోను, మిత్రులతోను, వియుజ్యతామ్ = దూరము చేయబడవలెనో, బ్రవీహి = చెప్పుము. ఇయమ్ = ఈ, వసుధా = భూమి, యథా = ఎట్లు, తవ = నీయొక్క, వశే = వశమునందు, భవేత్ = అగునో, తథైవ = అట్లు, మామ్ = నన్ను, శాధి = ఆజ్ఞాపింపుము. తవ = నీకు, కింకరః అస్మి = కింకరుడనై ఉన్నాను.

తా. నీ యే శత్రువును ప్రాణకీర్తిమిత్రులనుండి దూరము చేయవలెనో చెప్పుము. నేను ఇపుడే అట్లు చేసెదను. ఈ భూమి నీకు వశమగుటకు నే నేమి చేయవలెనో ఆజ్ఞాపింపుము. నేను నీ కింకరుడను. 40

మూ. విమృజ్య బాష్పం పరిసాన్త్వ్య చాసకృ-
త్స లక్ష్మణం రాఘవవంశవర్ధనః,

ఉవాచ పిత్రోర్వచనే వ్యవస్థితం
నిబోధ మామేష హి సౌమ్య సత్పథః. 41

అత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రయోవింశః సర్గః.

ప్ర. అ. సః = ఆ, రాఘవవంశవర్ధనః = రఘువంశవృద్ధికి కారణభూతు డగు రాముడు, బాష్పమ్ = కన్నీటిని, విమృజ్య = తుడిచి, అసకృత్ = మాటి మాటికి, పరిసాన్త్వ్య చ = ఓదార్చి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను. సౌమ్య = ఓ సౌమ్యుడా! మామ్ = నన్ను, పిత్రోః = తండ్రికి సంబంధించిన, వచనే = వచనమునందు, వ్యవస్థితమ్ = నిలిచినవానినిగా, నిబోధ = తెలిసికొనుము. ఏషః = ఇది, సత్పథః హి = ఉత్తమమార్గము కదా!

తా. అపుడు రాముడు కన్నీరు తుడిచి, మాటి మాటికి ఓదార్చుచు లక్ష్మణు నితో ఇట్లనెను. ఓ లక్ష్మణా! నేను తండ్రి మాట మీదనే స్థిరముగ నిలిచి యున్నాను. ఇదియే మంచి మార్గము. 41

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఇరువదిమూడవ సర్గ సమాప్తము.

## అథ చతుర్వింశః సర్గః

[విలపించుచున్న కౌసల్య తన్నుకూడ అడవికి కొనిపొమ్మని రాముని పట్టుబట్టుట, పతిసేవయే పత్నికి పరమధర్మమని పలికి, శ్రీరాము డామెను నిలిపి, వనవాసమున కామె యనుమతి పొందుట]

మూ. తం సమీక్ష్య త్వవహితం పితుర్నిర్దేశపాలనే,
కౌసల్యా బాష్పసంరుద్ధా వచో ధర్మిష్ఠమబ్రవీత్. 1

ప్ర. అ. తమ్ = అతనిని, పితుః = తండ్రియొక్క, నిర్దేశపాలనే = ఆజ్ఞను పాలించుటయందు, అవహితమ్ = స్థిరచిత్తునిగా, సమీక్ష్య = చూచి, కౌసల్యా = కౌసల్య, బాష్పసంరుద్ధా = బాష్పముచే అడ్డబడిన కంఠము గలదై, ధర్మిష్ఠమ్ = ధర్మయుక్తమైన, వచః = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాముడు, తండ్రి యాజ్ఞనే పరిపాలింపవలె నని దృఢమైన నిశ్చయముతో నున్నట్లు చూచి కౌసల్య డగ్గుత్తికతో అస్పష్టముగా మాట్లాడుచు, ధర్మయుక్తమైన ఈ వాక్యమును పలికెను. 1

మూ. అదృష్టదుఃఖో ధర్మాత్మా సర్వభూతప్రియంవదః,
మయి జాతో దశరథాత్కథముఞ్ఛేన వర్తయేత్. 2

ప్ర. అ. అదృష్టదుఃఖః = చూడబడని దుఃఖము కలవాడు, ధర్మాత్మా = ధర్మాత్ముడు, సర్వభూతప్రియంవదః = సర్వభూతములకు ప్రియమునే మాట్లాడువాడు, దశరథాత్ = దశరథునివలన, మయి = నాయందు, జాతః = పుట్టినవాడు అగు రాముడు, ఉఞ్ఛేన = నేలపై రాలిన ధాన్యమును ఏరుకొను వృత్తిచేత, కథమ్ = ఎట్లు, వర్తయేత్ = జీవించును?

తా. దశరథునకును, నాకును కుమారుడైన ఈ రాముడు ధర్మాత్ముడు. అన్ని భూతములకును ప్రియమునే కోరువాడు. ఎన్నడును దుఃఖములను అనుభవించి ఎరుగడు. అట్టి ఈ రాముడు, ఉంఛవృత్తితో ఎట్లు జీవించును? 2

మూ. యస్య భృత్యాశ్చ దాసాశ్చ మృష్టాన్యన్నాని భుఞ్జతే,
కథం స భోక్ష్యతే నాథో వనే మూలఫలాన్యయమ్. ౩

ప్ర. అ. యస్య = ఎవనియొక్క, భృత్యాశ్చ = భృత్యులును, దాసాశ్చ = దాసులును, మృష్టాని = ఉత్తమ మైన, అన్నాని = అన్నములను, భుఞ్జతే = తిను చుందురో, నాథః = ప్రభు వైన, సః అయమ్ = అట్టి ఈ రాముడు, వనే = వన మునందు, మూలఫలాని = మూలఫలములను, కథమ్ = ఎట్లు, భోక్ష్యతే = తిన గలడు.

తా. ప్రభు వైన ఈ రాముని భృత్యులు, దాసులు కూడా ఉత్తమ మైన ఆహారమును భుజించుచుందురు గదా। ఇత డిపుడు వనమునందు, మూలఫలము లను ఎట్లు తిని జీవించును? ౩

మూ. క ఏతచ్ఛ్రద్దధేచ్ఛ్రుత్వా కస్య వా న భవేద్భయమ్,
గుణవాన్ దయితో రాజ్ఞా రాఘవో యద్వివాస్యతే. ౪

ప్ర. అ. గుణవాన్ = సద్గుణవంతుడును, దయితః = ఇష్టుడును అయిన, రాఘవః = రాముడు, రాజ్ఞా = రాజుచేత, వివాస్యతే ఇతి యత్ = ప్రవాసము నకు పంపబడుచున్నాడు అను విషయ మేది కలదో, ఏతత్ = దీనిని, శ్రుత్వా = విని, కః = ఎవడు, శ్రద్దధేత్ = నమ్మును? కస్య వా = ఎవనికి. భయమ్ = భయము, న భవేత్ = కలుగకుండును?

తా. సద్గుణవంతుడు ప్రియుడు అయిన రామునే రాజు ప్రవాసమునకు పంపుచున్నా డన్నచో ఇది విని ఎవ్వరు నమ్ముదురు? ఎవరికి భయము కలుగ కుండును ? ౪

మూ. నూనం తు బలవాన్ లోకే కృతాన్తః సర్వమాదిశన్,
లోకే రామాభిరామ స్త్వం వనం యత్ర గమిష్యసి. ౫

ప్ర. అ. రామ = ఓ రామా, లోకే అభిరామః = లోకమనోహరుడ వగు, త్వమ్ = నీవు, వనమ్ = వనమును గూర్చి, యత్ర గమిష్యసి = వెళ్లనున్నావు అనగా, లోకే = లోకమునందు, సర్వమ్ = సమస్తమును, ఆదిశన్ = ఆజ్ఞా

పించుచున్న, కృతాన్తః = దైవమే, నూనమ్ = నిశ్చయముగా, బలవాన్ = బలము కలది.

తా. ఓ రామా! లోకాభిరాముడవైన నీవు కూడ అరణ్యమునకు వెళ్లవలసి వచ్చిన దన్నచో లోకములోని కార్యములను నడిపించుచున్న దైవమే బలవత్తరము అని నిశ్చితముగ చెప్పవలసి యున్నది. 5

మూ. అయం తు మామాత్మభవస్తవాదర్శనమారుతః
విలాపదుఃఖసమిధో రుదితాశ్రుహుతాహుతిః, 6
చిన్తాబాష్పమహాధూమస్తవాగమనచిన్తజః,
కర్శయిత్వా భృశం పుత్ర నిశ్వాసాయాససంభవః, 7
త్వయా విహీనామిహ మాం శోకాగ్నిరతులో మహాన్,
ప్రధక్ష్యతి యథా కక్షం చిత్రభానుర్హిమాత్యయే. 8

పుత్ర = కుమారా! ఆత్మభవః = దేహమునందు పుట్టినది, తవ అదర్శనమారుతః = నీవు కనబడకుండుట అను వాయువు గలది, విలాపదుఃఖసమిధః = విలాపము, దుఃఖము అను కట్టెలు గలది, రుదితాశ్రుహుతాహుతిః = ఏడుపువలన కలిగిన కన్నీళ్లే హోమము చేయబడిన ఆహుతి కలది, చింతాబాష్పమహాధూమః = చింతవలన కలిగిన బాష్పమే గొప్ప ధూమము కలది, తవ = నీయొక్క, ఆగమన చిన్తజః = తిరిగి రాకను గూర్చిన చింతవలన కలిగినది, నిశ్వాసాయాససంభవః = నిట్టూర్పువలన ఆయాసమువలన పుట్టినది యగు, అతులః = సాటిలేని, మహాన్ = గొప్పదైన, అయం శోకాగ్నిః = ఈ శోకాగ్ని ఇహ = ఇచట, త్వయా = నీతో, విహీనామ్ = విహీనురాలైన, మామ్ = నన్ను, భృశమ్ = మిక్కిలి, కర్శయిత్వా = కృశింపచేసి, హిమాత్యయే = గ్రీష్మమునందు, చిత్రభానుః = అగ్ని, కక్షం యథా = పొదను వలె, ప్రధక్ష్యతి = కాల్చివేయగలదు.

తా. కుమారా! నీవు దూరముగా వెళ్లిపోయిన వెంటనే నా శరీరమునందు నిశ్వాసాయాసములతో సాటి లేని గొప్పశోకాగ్ని పుట్టును. నీవు కనబడకుండుటయే దీనిని ప్రజ్వరిల్లింపచేయు వాయువు. విలాపదుఃఖములే సమిధలు. ఏడ్పువలన కలుగు కన్నీళ్లే హోమము చేసిన ఆహుతి. చింత, బాష్పము,

(దగ్ధత్రిక) అనునవి గొప్ప దూమము, నీవు ఎప్పుడు వచ్చెదవా అను చింత వలన ఇది మరల మరల పుట్టుచుండును. అట్టి ఈ శోకాగ్ని నన్ను పూర్తిగా కృశింపచేసి గ్రీష్మమునందు అగ్ని తొంకలను కాల్చివేసినట్లు కాల్చివేయును. 8

మూ. కథం హి ధేనుః స్వం వత్సం గచ్ఛన్తం నానుగచ్ఛతి,
అహం త్వానుగమిష్యామి యత్ర పుత్ర గమిష్యసి. 9

ప్ర. అ. ధేనుః = ఆవు, గచ్ఛన్తమ్ = వెళ్ళుచున్న, స్వం వత్సమ్ = తన లేగదూడను, కథం హి = ఎట్లు, నానుగచ్ఛతి = అనుసరించి వెళ్లకుండును. పుత్రః = కుమారా! యత్ర = ఎచటికి, గమిష్యసి = వెళ్లగలవో, అచటికి, అహమ్ = నేను, త్వా = నిన్ను, అను గమిష్యామి = అనుసరించి వెళ్ళెదను.

తా. కుమారా! లేగదూడ పోవుచుండగ దాని తల్లి దాని వెనుకనే వెళ్ల కుండునా? అట్లే నేను నీవు ఎక్కడికి పోయెదవో అక్కడికే వచ్చెదను. 9

మూ. తథా నిగదితం మాత్రా తద్వాక్యం పురుషర్షభః,
శ్రుత్వా రామోఽబ్రవీద్వాక్యం మాతరం భృశదుఃఖితామ్ 10

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, రామః = రాముడు, మాత్రా = తల్లిచేత, తథా = ఆ విధముగా, నిగదితమ్ = పలుకబడిన, తద్వాక్యమ్ = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, భృశదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖించిన, మాతరమ్ = తల్లిని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పురుషశ్రేష్ఠుడైన ఆ రాముడు తల్లి మాటలు విని, మిక్కిలి దుఃఖించు చున్న ఆమెతో ఇట్లనెను. 10

మూ. కైకేయ్యా వఞ్చితో రాజా మయి చారణ్యమాశ్రితే,
భవత్యాపి పరిత్యక్తో న నూనం వర్తయిష్యతి. 11

ప్ర. అ. కైకేయ్యా = కైకేయిచేత, వఞ్చితః = వంచింపబడిన, రాజా = రాజు, మయి = నేను, అరణ్యమ్ = అరణ్యమును, ఆశ్రితే = ఆశ్రయించగా, భవత్యాపి = నీచేత కూడ, పరిత్యక్తః = విడువబడినవాడై, న వర్తయిష్యతి = జీవించడు. నూనమ్ = నిశ్చయము.

తా. రాజును కైకేయి మొదటనే వంచించి యున్నది. నేను అరణ్యమునకు వెళ్లి, నీవు కూడ అతనిని పరిత్యజించినచో అతడు జీవింపజాలడు. ఇది నిశ్చితము. 11

మూ. భర్తుః కిల పరిత్యాగో నృశంసః కేవలం స్త్రియాః,
స భవత్యా న కర్తవ్యో మనసాపి విగర్హితః. 12

ప్ర. అ. స్త్రియాః = స్త్రీకి, భర్తుః = భర్తయొక్క, పరిత్యాగః = పరిత్యాగము, కేవలమ్ = మిక్కిలి, నృశంసః కిల = క్రూర మైన కార్యము కదా? విగర్హితః = నింద్య మైన, సః = అది, భవత్యా = నీచేత, మనసాపి = మనస్సుచేత కూడ, న కర్తవ్యః = చేయ దగినది కాదు.

తా. స్త్రీ భర్తను పరిత్యజించుట చాల క్రూర మైన కార్యము. నీవు మనస్సుచేత కూడ నిందిత మైన ఈ కార్యమును చేయరాదు. 12

మూ. యావజ్జీవతి కాకుత్స్థః పితా మే జగతీపతిః,
శుశ్రూషా క్రియతాం తావత్స హి ధర్మః సనాతనః. 13

ప్ర. అ. మే పితా = నా తండ్రియు, జగతీపతిః = భూమికి రాజును అయిన, కాకుత్స్థః = దశరథుడు, యావత్ = ఎంతవరకు, జీవతి = జీవించునో, తావత్ = అంతవరకు, శుశ్రూషా = సేవ, క్రియతామ్ = చేయబడును గాక. సః = అది, సనాతనః ధర్మః హి = శాశ్వత మైన ధర్మము కదా?

తా. నా తండ్రియు మహారాజును అయిన దశరథుడు జీవించి యున్నంత వరకు నీవు అతని సేవ చేయవలెను. ఇది శాశ్వత మైన ధర్మము. 13

మూ. ఏవముక్తా తు రామేణ కౌసల్యా శుభదర్శనా,
తథేత్యువాచ సుప్రీతా రామమక్లిష్టకారిణమ్. 14

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తా = పలుకబడిన, శుభదర్శనా = శుభకర మైన దర్శనము గల, కౌసల్యా = కౌసల్య, సుప్రీతా = బాగా సంతోషించినదై, అక్లిష్టకారిణమ్ = శ్రమలేకుండగ కార్యము

లను చేయు, రామమ్ = రాముని గూర్చి, తథేతి = అటులనే చేసెద నని, ఉవాచ = పలికెను.

తా. రాము డిట్లు చెప్పగనే శుభకర మైన దర్శనము గల కౌసల్య చాలా సంతోషించి, అటులనే చేసెదను అని, శ్రమపడకుండా కార్యములను సాధింప కలిగిన ఆ రామునితో పలికెను. 14

మూ. ఏవముక్తస్తు వచనం రామో ధర్మభృతాం వరః,
భూయస్తామబ్రవీ ద్వాక్యం మాతరం భృశదుఃఖితామ్.15

ప్ర. అ. ధర్మభృతాం = ధర్మమును పోషించువారిలో, వరః = శ్రేష్ఠు డైన, రామః = రాముడు, ఏవమ్ = ఈ విధముగా, వచనమ్ = వచనమును, ఉక్తః = పలుకబడినవా డై, భృశదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖితురా లైన, తామ్ = ఆ, మాతరమ్ = తల్లిని గూర్చి, భూయః = మరల, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మ సంరక్షకులలో శ్రేష్ఠు డైన ఆ రాముడు తల్లి మాటలు విని, మిక్కిలి దుఃఖించుచున్న ఆమెతో మరల యిట్లనెను. 15

మూ. మయా చైవ భవత్యా చ కర్తవ్యం వచనం పితుః,
రాజా భర్తా గురుః శ్రేష్ఠః సర్వేషామీశ్వరః ప్రభుః. 16

ప్ర. అ. మయా చైవ = నా చేతను, భవత్యా చ = నీ చేతను, పితుః = తండ్రియొక్క, వచనమ్ = వచనము, కర్తవ్యమ్ = చేయదగినది. రాజా = రాజు, భర్తా = పోషించువాడు. గురుః = పూజ్యుడు. శ్రేష్ఠః = శ్రేష్ఠు డైన వాడు. సర్వేషామ్ = అందరికిని, ఈశ్వరః = అధిపతి; ప్రభుః = నియమించువాడు.

తా. నీవు నేను కూడ తండ్రి మాటను ఆచరింపవలెను. అతడే అందరికిని రాజు. పోషకుడు; పూజ్యుడు; శ్రేష్ఠుడు; అధిపతి; ఆజ్ఞాపింప అధికారము కలవాడు. 16

మూ. ఇమాని తు మహారణ్యే విహృత్య నవ పఞ్చ చ,
వర్షాణి పరమప్రీతః స్థాస్యామి వచనే తవ. 17

ప్ర. అ. ఇమాని = ఈ, నవ పఞ్చ చ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, మహారణ్యే = మహారణ్యమునందు, విహృత్య = విహరించి, పరమప్రీతః = మిక్కిలి సంతోషించినవాఁడ నై, తవ = నీయొక్క, వచనే = వచనమునందు, స్థాస్యామి = నిలువగలను.

తా. పదునాలుగు సంవత్సరములు మహారణ్యములో విహరించి వచ్చి, ఆనందపూర్వకముగా నీ ఆజ్ఞను అనుసరించెదను. 17

మూ. ఏవముక్త్వా ప్రియం పుత్రం బాష్పపూర్ణాననా తదా,
ఉవాచ పరమార్తా తు కౌసల్యా పుత్రవత్సలా. 18

ప్ర. అ. తదా = అపుడు, ఏవమ్ = ఈ విధముగ, ఉక్తా = పలుకఁబడిన, పుత్రవత్సలా = పుత్రునియందు ప్రేమ గల, కౌసల్యా = కౌసల్య, పరమార్తా = మిక్కిలి దుఃఖితురాలై, బాష్పపూర్ణాననా = కన్నీటితో నిండిన ముఖము కలదై, ప్రియమ్ = ప్రియు డైన, పుత్రమ్ = పుత్రుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. అప్పుడు పుత్రవత్సల యైన కౌసల్య రాముని మాటలు విని, మిక్కిలి దుఃఖించుచు, కన్నీటితో నిండిన ముఖము కలదై ప్రియపుత్రు డైన రామునితో ఇట్లనెను. 18

మూ. ఆసాం రామ సపత్నీనాం వస్తుం మధ్యే న మే క్షమమ్,
నయ మామపి కాకుత్స్థ వనం వన్యాం మృగీం యథా, 19
యది తే గమనే బుద్ధిః కృతా పితురపేక్షయా.

ప్ర. అ. రామ = ఓ రామా! మే = నాకు, ఆసామ్ = ఈ, సపత్నీనామ్ = సవతుల, మధ్యే = మధ్యయందు, వస్తుమ్ = నివసించుటకు, న క్షమమ్ = శక్యముకాదు. కాకుత్స్థ = ఓ రామా! పితుః = తండ్రియొక్క, అపేక్షయా = కోరికచే, గమనే = అరణ్యమునకు వెళ్లుటయందే, తే = నీకు (నీచే), బుద్ధిః = బుద్ధి, కృతా యది = చేయఁబడినచో, మామపి = నన్ను కూడ, వన్యామ్ = వనమునకు సంబంధించిన, మృగీం యథా = ఆడ లేడిని వలె, వనమ్ = వనమును గూర్చి, నయ = తీసుకొని వెళ్లుము.

తా. రామా! నేను ఈ సవతుల మధ్య నివసింప జాలను. ఓ కాకుత్స్థా! తండ్రి మాటను బట్టి అరణ్యమునకు వెళ్లవలె ననియే నీవు నిశ్చయించుకున్నచో నన్ను కూడ అరణ్యమృగమును తీసుకొని వెళ్లి నట్లు అరణ్యమునకే తీసుకొని వెళ్ళుము. 19

మూ. తాం తథా రుదతీం రామో రుదన్ వచనమబ్రవీత్, 20
జీవన్త్యా హి స్త్రియా భర్తా దైవతం ప్రభురేవ చ.

ప్ర. అ. రామః = రాముడు, తథా = ఆ విధముగా, రుదతీమ్ = ఏడ్చుచున్న, తామ్ = ఆమెను గూర్చి, రుదన్ = ఏడ్చుచు, వచనమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. జీవన్త్యాః = జీవించుచున్న, స్త్రియాః = స్త్రీకి, భర్తా = భర్తయే, దైవతమ్ = దైవతము; ప్రభురేవ చ = ప్రభువు కూడ.

తా. ఆ విధముగా ఏడ్చుచున్న కౌసల్యతో రాముడు ఏడ్చుచు ఇట్లు పలికెను. స్త్రీ జీవించి యున్నంత వరకును భర్తయే ఆమెకు దేవత; అతడే ప్రభువు. 20

మూ. భవత్యా మమ చైవాద్య రాజా ప్రభవతి ప్రభుః, 21
న హ్యనాథా వయం రాజ్ఞా లోకనాథేన ధీమతా.

ప్ర. అ. ప్రభుః = అధికారవంతుడైన, రాజా = దశరథమహారాజు, అద్య = ఇపుడు, భవత్యాః = నీకును, మమ చ = నాకును కూడ, ప్రభవతి = అధికారము కలవాడు. లోకనాథేన = లోకము నకంతకును ప్రభువు, ధీమతా = బుద్ధిమంతుడు అయిన, రాజ్ఞా = రాజుచే, వయమ్ = మనము, అనాథాః = నాథుడు లేనివారము, న హి = కాము కదా!

తా. అధికారసంపన్నుడైన దశరథమహారాజునకు నీపైనను నాపైనను కూడ అధికార మున్నది. లోకమున కంతకు ప్రభువైన, బుద్ధిశాలి యైన ఆ రాజు ఉండగా మనము, నాథుడు లేనివారము ఎట్లగుదుము? 21

మూ. భరతశ్చాపి ధర్మాత్మా సర్వభూతప్రియంవదః, 22
భవతీమనువర్తేత స హి ధర్మరతః సదా.

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడును, సర్వభూత ప్రియంవదః = సమస్త ప్రాణులకు ప్రియమే పలుకువాడు అగు, భరతశ్చాపి=భరతుడు కూడ, భవతీమ్ = నిన్ను, అనువర్తేత = అనుసరించి యుండును. సః = అతడు, సదా = ఎల్లపుడును, ధర్మరతః హి = ధర్మమునందే ఆసక్తి కలవాడు కదా.

తా. ధర్మాత్ముడు, సకలప్రాణులకు ప్రియమును గూర్చువాడు అయిన భరతుడు కూడ నీకు అనుకూలముగానే ఉండును. అతడు సర్వదా ధర్మమునందే ఆసక్తి కలవాడు కదా। 22

మూ. యథా మయి తు నిష్క్రాన్తే పుత్రశోకేన పార్థివః, 23
శ్రమం నావాప్నుయాత్కించిదప్రమత్తా తథా కురు.

ప్ర. అ. మయి=నేను, నిష్క్రాన్తే=వెళ్లినవాడ నగుచుండగా, పార్థివః= రాజా, పుత్రశోకేన=పుత్రశోకముతో, యథా=ఎట్లు, కించిత్=కొంచెము కూడ, శ్రమమ్=శ్రమను, న అవాప్నుయాత్=పొందడో, తథా=అట్లు, అప్రమత్తా= ఏమరుపాటు లేనిదానివై, కురు=చేయుము.

తా. నీవు సావధాన చిత్తురాల వై, నేను వెళ్లిపోయిన పిమ్మట, పుత్ర శోకముచే రాజునకు ఎట్టి శ్రమయు కలుగ కుండు నట్లు చేయుము. 23

మూ. దారుణశ్చాప్యయం శోకో యథైనం న వినాశయేత్, 24
రాజ్ఞో వృద్ధస్య సతతం హితం చర సమాహితా.

ప్ర. అ. దారుణః=దారుణ మైన, అయం శోకః=ఈ శోకము, ఏనమ్= ఇతనిని, యథా=ఎట్లు, న వినాశయేత్=నశింపచేయకుండునో, ఆ విధముగ, సమాహితా=సావధాన చిత్తురాల వై, వృద్ధస్య=వృద్ధు డైన, రాజ్ఞః=రాజునకు, సతతమ్=ఎల్లపుడును, హితమ్=హితమును, చర=ఆచరింపుము.

తా. నీవు సావధానచిత్తురాల వై వృద్ధు డైన రాజును భయంకర మైన ఈ శోకము నశింపచేయకుండు నట్లు చూచుచు సర్వదా అతనికి హితమును చేకూర్చుము. 24

మూ. వ్రతోపవాసనిరతా యా నారీ పరమోత్తమా. 25
భర్తారం నానువర్తేత సా తు పాపగతిర్భవేత్.

ప్ర. అ. యా నారీ=ఏ స్త్రీ, వ్రతోపవాసనిరతా=వ్రతము లందును, ఉప వాసములందును, ఆసక్తురాలై, పరమోత్తమా=మిక్కిలి ఉత్తమురాలై, భర్తారమ్= భర్తను, నానువర్తేత=అనుసరించదో, సా=ఆమె, పాపగతిః=పాప మైన గతి గలది, భవేత్=అగును.

తా. వ్రతోపవాసములు చేయుచు మిక్కిలి ఉత్తమురాలై ఉన్నను, భర్తను అనుసరించని స్త్రీ నరకమును చెందును. 25

మూ. భర్తుః శుశ్రూషయా నారీ లభతే స్వర్గముత్తమమ్, 26
అపి యా నిర్నమస్కారా నివృత్తా దేవపూజనాత్.

ప్ర. అ. యా=ఏ స్త్రీ, నిర్నమస్కారా=దేవతాదులకు నమస్కారములు చేయనిదో, దేవపూజనాత్=దేవతాపూజనుండి, నివృత్తా=మరలినదో, అట్టి, నారీ అపి=స్త్రీ కూడ, భర్తుః=భర్తయొక్క, శుశ్రూషయా = సేవచేత, ఉత్తమమ్= ఉత్తమ మైన, స్వర్గమ్=స్వర్గమును, లభతే=పొందును.

తా. దేవతాదులకు నమస్కారము చేయకున్నను, దేవతలను పూజింప కున్నను భర్త సేవ మాత్రము చేయు స్త్రీ ఉత్తమ మైన స్వర్గమును పొందును. 26

మూ. శుశ్రూషామేవ కుర్వీత భర్తుః ప్రియహితే రతా, 27
ఏష ధర్మః పురా దృష్టో లోకే వేదే శ్రుతః స్మృతః.

ప్ర. అ. భర్తుః=భర్తయొక్క, ప్రియహితే=ప్రియమునందు, హితము నందు, రతా=ఆసక్తికలదై, శుశ్రూషామేవ=శుశ్రూషనే, కుర్వీత=చేయవలెను. ఏషః=ఇది, పురా=పూర్వమునుండి, లోకే=లోకమున, దృష్టః=చూడబడినది, వేదే = వేదమున, శ్రుతః = వినబడినది, స్మృతః=స్మృతులలో చెప్పబడినది అయిన, ధర్మః=ధర్మము.

తా. భర్తకు ప్రియమును హితమును కోరుచు ఆతని సేవయే చేయవలెను. ఇదే పూర్వమునుండియు లోకములో నున్నది, వేదమునందు వినబడినది, స్మృతు లందు చెప్పబడినది అయిన ధర్మము. 27

మూ. అగ్నికార్యేషు చ సదా సుమనోభిశ్చ దేవతాః, 28
పూజ్యాస్తే మత్కృతే దేవి బ్రాహ్మణాశ్చైవ సువ్రతాః.

ప్ర. అ. దేవి = ఓ దేవీ! మత్కృతే = నా నిమిత్తమై, సదా = ఎల్లప్పుడును, దేవతాః = దేవతలు, అగ్నికార్యేషు = హోమములందును, సుమనోభిశ్చ = పుష్పములచేతను, తే = నీకు, పూజ్యాః = పూజింపదగినవారు. సువ్రతాః = మంచి వ్రతములు గల, బ్రాహ్మణాశ్చైవ = బ్రాహ్మణులు కూడ, (పూజింపదగినవారు)

తా. తల్లీ నా నిమిత్తమై నీవు ఎల్లప్పుడును దేవతలను హోమములచేతను పుష్పములచేతను, పూజించుచుండుము. ఉత్తమ వ్రతములు గల బ్రాహ్మణులను కూడ పూజించుచుండుము. 28

మూ. ఏవం కాలం ప్రతీక్షస్వ మమాగమనకాఙ్క్షిణీ, 29
నియతా నియతాహారా భర్తృశుశ్రూషణే రతా.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగ, మమ = నాయొక్క, ఆగమనకాఙ్క్షిణీ = ఆగమనమును కోరుచు, నియతా = నియమవంతురాలవై, నియతాహారా = నియమపూర్వకమైన ఆహారము కలదానవై, భర్తృశుశ్రూషణే = భర్తయొక్క సేవయందు, రతా = ఆసక్తురాలవై; కాలమ్ = కాలమును, ప్రతీక్షస్వ = ఎదురుచూచుచుండుము.

తా. ఈ విధముగా నియమవంతురాల వై, ఆహారనియమము పాటించుచు, భర్తకు సేవ చేయుచు నా రాకకై కాలమును ఎదురుచూచుచుండుము. 29

మూ. ప్రాప్స్యసే పరమం కామం మయి ప్రత్యాగతే సతి, 30
యది ధర్మభృతాం శ్రేష్ఠో ధారయిష్యతి జీవితమ్.

ప్ర. అ. మయి = నేను, ప్రత్యాగతే సతి = తిరిగి వచ్చినవాడ నగుచుండగా, ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారిలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన మా తండ్రి, జీవితమ్ = ప్రాణమును, ధారయిష్యతి యది = ధరించిన ట్లైతే, పరమమ్ = ఉత్తమమైన, కామమ్ = కోరికను, ప్రాప్స్యసే = పొందగలవు.

తా. నేను తిరిగి వచ్చిన పిమ్మట, ధర్మసంరక్షకులలో శ్రేష్ఠుడైన మా తండ్రి అప్పటికి జీవించి యున్నచో, ఉత్తమమైన కోర్కెలను పొందగలవు. 30

మూ. ఏవముక్తా తు రామేణ బాష్పపర్యాకులేక్షణా, 31
కౌసల్యా పుత్రశోకార్తా రామం వచనమబ్రవీత్.

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలుకబడిన, కౌసల్యా = కౌసల్య, పుత్రశోకార్తా = పుత్రశోకముచే పీడితురాలై, బాష్ప పర్యాకులేక్షణా = కన్నీటితో వ్యాకుల మైన నేత్రములు కలదై, రామమ్ = రాముని గూర్చి, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. పుత్రశోకముతో బాధపడుచున్న కౌసల్య రాముని మాటలు విని కన్నీటితో వ్యాకుల మైన నేత్రములు కలదై, రామునితో ఇట్లు పలికెను. 31

మూ. గమనే సుకృతాం బుద్ధిం న తే శక్నోమి పుత్రక, 32
వినివర్తయితుం వీర నూనం కాలో దురత్యయః.

ప్ర. అ. వీర = వీరుడ వైన, పుత్రక = కుమారా। గమనే = వెళ్లుట విషయమై. సుకృతామ్ = దృఢముగా చేయబడిన, తే బుద్ధిమ్ = నీ బుద్ధిని, వినివర్తయితుమ్ = మరల్పుటకు, న శక్నోమి=సమర్థురాలను కాను. నూనమ్= నిశ్చయముగా, కాలః = కాలము, దురత్యయః = దాటశక్యముగానిది.

తా. పరాక్రమశాలి వైన ఓ కుమారా వెళ్లవలెను అనెడు, నీ దృఢ నిశ్చయమును నేను మార్పజాలను. కాలమును ఎవ్వరూ దాటజాలరు. ఇది నిశ్చయము. 32

మూ. గచ్ఛ పుత్ర త్వమేకాగ్రో భద్రం తేఽస్తు సదా విభో, 33
పునస్త్వయి నివృత్తే తు భవిష్యామి గతక్లమా.

ప్ర. అ. పుత్ర=ఓ కుమారా, త్వమ్=నీవు, ఏకాగ్రః=సావధానచిత్తుడ వై, గచ్ఛ=వెళ్లుము. విభో=ఓ ప్రభూ। తే=నీకు, సదా=ఎల్లపుడును, భద్రమ్= భద్రము, అస్తు=అగుగాక. త్వయి=నీవు, పునః=మరల, నివృత్తే తు=వచ్చిన వాడవగుచుండగా, గతక్లమా = పోయిన దుఃఖము కలదానను, భవిష్యామి = కాగలను.

తా. కుమారా। నీవు స్థిర మైన చిత్తముతో (ఆత్మరక్షణయందు జాగ రూకుడ వై) వెళ్లుము. నీకు సర్వదా క్షేమ మగుగాక. నీవు తిరిగి వచ్చిన పిమ్మట నా దుఃఖము లన్నియు తొలగిపోవును. 33

మూ. ప్రత్యాగతే మహాభాగే కృతార్థే చరితవ్రతే, 34
పితురానృణ్యతాం ప్రాప్తే త్వయి లప్స్యే పరం సుఖమ్.

ప్ర. అ. మహాభాగే = గొప్ప భాగ్యము గలవాడ వైన, త్వయి = నీవు, కృతార్థే = కృతార్థుడవై, చరితవ్రతే = ఆచరింపబడిన వ్రతముగలవాడవై, పితుః = తండ్రికి, అనృణ్యతామ్ = ఋణము లేకపోవుటను, ప్రాప్తే = పొంది, ప్రత్యాగతే = తిరిగి వచ్చినవాడవగుచుండగా, పరమ్ = గొప్ప, సుఖమ్ = సుఖమును, లప్స్యే = పొందగలను.

తా. మహాభాగ్యవంతుడ వగు నీవు కర్తవ్యమును నెరవేర్చి, వ్రతము నాచరించి, తండ్రి ఋణమును తీర్చి తిరిగి వచ్చిన పిమ్మట నేను గొప్ప సౌఖ్యమును పొందగలను. 34

మూ. కృతాన్తస్య గతిః పుత్ర! దుర్విభావ్యా సదా భువి, 35
యస్త్వాం సంచోదయతి మే వచ ఆచ్ఛిద్య రాఘవ.

ప్ర. అ. పుత్ర = కుమారా! రాఘవ = ఓ రామా! యః = ఏదైవము, మే = నాయొక్క, వచః = వాక్యమును, ఆచ్ఛిద్య = తొలగించి, త్వా = నిన్ను, సంచోదయతి = ప్రేరేపించుచున్నదో, కృతాన్తస్య = అట్టి దైవము యొక్క, గతిః = గతి, సదా = ఎల్లప్పుడును, భువి = భూమియందు, దుర్విభావ్యా = ఊహింప శక్యముగానిది.

తా. రామా! నా మాటను కాదని నిన్ను అరణ్యమును వెళ్లుటకు ప్రేరేపించుచున్న దైవము యొక్క గతిని ఈ లోకమున ఎవ్వరును ఎన్నడును అర్థము చేసుకొనజాలరు. 35

మూ. గచ్ఛేదానీం మహాబాహో క్షేమేణ పునరాగతః, 36
నన్దయిష్యసి మాం పుత్ర! సామ్నా వాక్యేన చారుణా.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కల ఓరామా! ఇదానీమ్ = ఇప్పుడు, గచ్ఛ = వెళ్లుము. పుత్ర = ఓ కుమారా! క్షేమేణ = క్షేమముతో, పునః ఆగతః = తిరిగి వచ్చినవాడ వై, సామ్నా = సామముతోను, చారుణా = అంద

మైన, వాక్యైన = మాటలతోను, మామ్ = నన్ను, నన్దయిష్యసి = ఆనందింప చేయగలవు.

తా. మహా పరాక్రమశాలి వైన ఓ కుమారా! ఇపుడు వెళ్లి, తిరిగి క్షేమముగ వచ్చి సామపూర్వకము లైన మంచి మాటలతో, నన్ను ఆనందింపచేయగలవు.

మూ. అపీదానీం స కాలః స్యాద్వనాత్ప్రత్యాగతం పునః 37
యత్త్వాం పుత్రక! పశ్యేయం జటావల్కలధారిణమ్.

ప్ర. అ. పుత్రక = ఓ కుమారా! వనాత్ = వనమునుండి, పునః = మరల, ప్రత్యాగతమ్ = తిరిగి వచ్చిన, జటావల్కల ధారిణమ్ = జటావల్కలములను ధరించిన, త్వామ్ = నిన్ను, యత్ = ఎపుడు, పశ్యేయమ్ = చూచెదనో, సః కాలః = ఆ కాలము, ఇదానీమ్ = ఇపుడే, అపి స్యాత్ = అగునా!

తా. నీవు జటావల్కలములను ధరించి వనమునుండి తిరిగి వచ్చిన దివసము నేడే అయినచో ఎంత బాగుండెడిది. 37

మూ. తథా హి రామం వనవాసనిశ్చితం
దదర్శ దేవీ పరమేణ చేతసా
ఉవాచ రామం శుభలక్షణం వచో
బభూవ చ స్వస్త్యయనాభికాఙ్క్షిణీ. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుర్వింశః సర్గః.

ప్ర. అ. దేవీ = కౌసల్యాదేవి, రామమ్ = రాముని, తథా = ఆ విధముగా, వనవాసనిశ్చితమ్ = వనవాసమునందు నిశ్చయము కలవానినిగా, దదర్శ = చూచెను. పరమేణ = ఉత్తమ మైన, చేతసా = చిత్తముతో, శుభలక్షణమ్ = శుభకర మైన లక్షణములు గల, రామమ్ = రాముని గూర్చి, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను. స్వస్త్యయనాభికాఙ్క్షిణీ = స్వస్త్యయనమును కోరునది, బభూవ = అయ్యెను.

తా. కౌసల్య రాము డా విధముగా వనవాసమునకై వెళ్లుటకే నిశ్చయించుకొని నట్లు తెలుసుకొని, శుభలక్షణములు గల ఆ రామునితో, ఉత్తమమైన మనస్సుతో ఈ విధముగ పలికి అతనికి మంగళమును చేయుటకు ఆరంభించెను.

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ఇరువదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పఞ్చవింశః సర్గః

[వనవాసమునకై వెళ్లుచున్న రామునకు, కౌసల్యా మంగళా శాసన పూర్వకముగా స్వస్తివాచనములు చేయించుట. రాముడు ఆమెకు నమస్కరించి సీతానివాసభవనమునకు వెళ్లుట.]

మూ. సాపనీయ తమాయాసముపస్పృశ్య జలం శుచిః,
చకార మాతా రామస్య మఙ్గళాని మనస్వినీ.

ప్ర. అ. మనస్వినీ = ఉత్తమ మైన మనస్సుకల, మాతా = తల్లి యైన, సా = ఆమె, తమ్ ఆయాసమ్ = ఆ దుఃఖమును, అపనీయ = విడచి, జలమ్ = జలమును, ఉపస్పృశ్య = ఆచమనము చేసి, శుచిః = పవిత్రురాలై, రామస్య = రామునకు; మఙ్గళాని = మంగళములను, చకార = చేసెను.

తా. ఉత్తమ మైన మనస్సు కల తల్లి యైన ఆ కౌసల్య ఆ దుఃఖమును విడచి, ఆచమనము చేసి, పవిత్రురాలై, రామునకు మంగళ క్రియలను చేసెను.

మూ. న శక్యసే వారయితుం గచ్ఛేదానీం రఘూత్తమ,
శీఘ్రం చ వినివర్తస్వ వర్తస్వ చ సతాం క్రమే. 2

ప్ర. అ. రఘూత్తమ = ఓ రామా! వారయితుమ్ = నివారించుటకు, న శక్యసే = శక్యమైన వాడవు కావు. ఇదానీమ్ = ఇపుడు, గచ్ఛ = వెళ్లుము. శీఘ్రమ్ = శీఘ్రముగ, వినివర్తస్వ = మరలి రమ్ము. సతామ్ = సత్పురుషుల యొక్క, క్రమే = మార్గమునందు, వర్తస్వ = ప్రవర్తింపుము.

తా. రామా! నిన్ను నివారించుటకు శక్యము కాకున్నది. ఇపుడు వెళ్లి శీఘ్రముగా తిరిగి రమ్ము. సత్పురుషుల మార్గమున ప్రవర్తింపుము. 2

మూ. యం పాలయసి ధర్మం త్వం ధృత్యా చ నియమేన చ
స వై రాఘవశార్దూల! ధర్మస్త్వామభిరక్షతు. 3

ప్ర. అ. రాఘవశార్దూల = రఘువంశమునందు పుట్టినవారిలో శ్రేష్ఠుడవైన ఓ రామా, త్వమ్ = నీవు, ధృత్యా = ధైర్యముతోను, నియమేన చ = నియమముతోను, యం ధర్మమ్ = ఏ ధర్మమును, పాలయసి = పరిపాలించుచున్నావో, సః ధర్మః వై = ఆ ధర్మమే, త్వామ్ = నిన్ను, అభిరక్షతు = రక్షించుగాక.

తా. రామా! నీవు ఏ ధర్మమును ధైర్యముతోను, నియమముతోను పాలించుచున్నావో ఆ ధర్మమే నిన్ను రక్షించుగాక। 3

మూ. యేభ్యః ప్రణమసే పుత్ర చైత్యేష్వాయతనేషు చ
తే చ త్వామభిరక్షన్తు వనే సహ మహర్షిభిః. 4

ప్ర. అ. పుత్ర = కుమారా। చైత్యేషు = చతుష్పథములందును, ఆయతనేషు చ = దేవాలయములందును, యేభ్యః = ఎవరికి, ప్రణమసే = నమస్కరించుచున్నావో, తే = వారు, మహర్షిభిః సహ = మహర్షులతో కూడ, త్వామ్ = నిన్ను, వనే = వనమునందు, అభిరక్షన్తు = రక్షించెదరుగాక.

తా. కుమారా! చైత్యమునందు, దేవాలయమునందు ఉన్న దేవతలకు నీవు నమస్కరించెదవు గదా। ఆ దేవతలును మహర్షులును, వనమునందు నిన్ను రక్షింతురు గాక. 4

మూ. యాని దత్తాని తేఽస్త్రాణి విశ్వామిత్రేణ ధీమతా
తాని త్వామభిరక్షన్తు గుణైస్సముదితం సదా. 5

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతుడైన, విశ్వామిత్రేణ = విశ్వామిత్రుని చేత, తే = నీకు, యాని అస్త్రాణి = ఏ అస్త్రములు, దత్తాని = ఇవ్వబడినవో, తాని = అవి, గుణైః = గుణములతో, సముదితమ్ = నిండి యున్న, త్వామ్ = నిన్ను, సదా = ఎల్లపుడును, అభిరక్షన్తు = రక్షించుగాక.

తా. ధీమంతుడైన విశ్వామిత్రుడు ఇచ్చిన అస్త్రము లన్నియు సద్గుణసంపన్నుడవైన నిన్ను సర్వదా రక్షించుగాక. 5

మూ. పితృశుశ్రూషయా పుత్ర మాతృశుశ్రూషయా తథా,
సత్యేన చ మహాబాహో చిరం జీవాభిరక్షితః. 6

ప్ర. అ. మహాబాహో = మహా బాహువులు గల, పుత్ర = కుమారా! పితృశుశ్రూషయా = పితృసేవచేతను, తథా = మరియు, మాతృశుశ్రూషయా = మాతృసేవచేతను, సత్యేన = సత్యముచేతను, అభిరక్షితః = రక్షింపబడినవాడవై, చిరం జీవ = చిరకాలము జీవింపుము.

తా. మహాబలశాలి వైన ఓ కుమారా! నీవు చేసిన పితృసేవా, మాతృసేవా, సత్యమూ నిన్ను రక్షించుచుండగా, చిరకాలము జీవింపుము.

మూ. సమిత్కుశపవిత్రాణి వేద్యశ్చాయతనాని చ,
స్థణ్డిలాని విచిత్రాణి శైలా వృక్షాః క్షుపా హ్రదాః 7
పతఙ్గాః పన్నగాః సింహాస్త్వాం రక్షన్తు నరోత్తమ.

ప్ర. అ. నరోత్తమ = నరులలో శ్రేష్ఠుడ వైన ఓరామా! సమిత్కుశ పవిత్రాణి = సమిధలు, కుశలు, పవిత్రములు, వేద్యశ్చ = అగ్నివేదికలు, ఆయతనాని చ = దేవాలయములు, విచిత్రాణి = వివిధము లైన, స్థణ్డిలాని = దేవపూజా స్థానములు, శైలాః = పర్వతములు, వృక్షాః = వృక్షములు, క్షుపాః = మొక్కలు, హ్రదాః = మడుగులు, పతఙ్గాః = పక్షులు, పన్నగాః = సర్పములు, సింహాః = సింహములు, త్వామ్ = నిన్ను రక్షన్తు = రక్షించుగాక.

తా. ఓరామా! సమిధలు, కుశలు, పవిత్రములు, అగ్నివేదికలు, దేవాలయములు, దేవపూజా స్థానములు, పర్వతములు, వృక్షములు, మొక్కలు, మడుగులు, పక్షులు, సర్పములు, సింహములు, నిన్ను రక్షించుగాక. 7

మూ. స్వస్తి సాధ్యాశ్చ విశ్వే చ మరుతశ్చ మహర్షయః 8
స్వస్తి ధాతా విధాతా చ స్వస్తి పూషా భగోఽర్యమా
లోకపాలాశ్చ తే సర్వే వాసవప్రముఖా స్తథా. 9

ప్ర. అ. సాధ్యాశ్చ = సాధ్యు లనే దేవతలు, విశ్వే చ = విశ్వేదేవతలూ, మరుతశ్చ = మరుత్తు లను దేవతలు, మహర్షయః = మహర్షులు, స్వస్తి = నీకు మంగళములను ఇచ్చెదరుగాక! ధాతా = ధాతయు, (సమస్త ప్రపంచమునకు ఆధారభూతు డైన విరాట్ పురుషుడు) విధాతా చ = బ్రహ్మయు, స్వస్తి = మంగళము చేయుదురు గాక! పూషా = సూర్యుడు, భగః = భగు డను సూర్యుడు,

అర్యమా = అర్యముడను సూర్యుడు, స్వస్తి = మంగళము చేయుదురుగాక. తథా = మరియు, వాసవప్రముఖాః = దేవేంద్రుడు మొదలైన, సర్వే = సమస్తమైన, తే లోకపాలాశ్చ = ఆ లోకపాలురు కూడ, మంగళము చేయుదురు గాక.

తా. సాధ్యులు, విశ్వేదేవతలు, మరుత్తులు, మహర్షులు, ధాత, విధాత, పూష, భగుడు, అర్యమా, ఇంద్రాది సకలలోకపాలకులు నీకు క్షేమము చేయుదురు గాక. 8, 9

మూ. ఋతవశ్చైవ పక్షాశ్చ మాసాస్సంవత్సరాః క్షపాః,
దినాని చ ముహూర్తాశ్చ స్వస్తి కుర్వన్తు తే సదా. 10

ప్ర. అ. ఋతవశ్చైవ = ఋతువులు, పక్షాశ్చ = పక్షములు, మాసాః = మాసములు, సంవత్సరాః = సంవత్సరములు, క్షపాః = రాత్రులు, దినాని చ = దినములు, ముహూర్తాశ్చ = ముహూర్తములు, (దినములో ముప్పదవ భాగము, 48 నిమిషములు) తే = నీకు, సదా = ఎల్లపుడు, స్వస్తిం = మంగళమును, కుర్వన్తు = చేయుదురుగాక.

తా. ఋతువులు, పక్షములు, మాసములు, సంవత్సరములు, రాత్రులు, దినములు ముహూర్తములు, ఎల్లపుడును నీకు క్షేమము చేయుగాక. 10

మూ. స్మృతిర్ధృతిశ్చ ధర్మశ్చ పాతు త్వాం పుత్ర సర్వతః
స్కన్దశ్చ భగవాన్ దేవః సోమశ్చ సబృహస్పతిః, 11
సప్తర్షయో నారదశ్చ తే త్వాం రక్షన్తు సర్వతః.

ప్ర. అ. పుత్ర = కుమారా! స్మృతిః = స్మృతియు, ధృతిశ్చ = ధృతియు, ధర్మశ్చ = ధర్మము, త్వామ్ = నిన్ను, సర్వతః = అంతటను, పాతు = రక్షించుగాక! భగవాన్ = భగవంతుడైన, దేవః = దేవుడైన, స్కన్దశ్చ = కుమారస్వామియు, సోమశ్చ = సోముడు, సః = ఆ బృహస్పతిః = బృహస్పతి, తే = ఆ, సప్తర్షయః = సప్తర్షులు, నారదశ్చ = నారదుడు, త్వామ్ = నిన్ను సర్వతః = అంతటను, రక్షన్తు = రక్షించెదరుగాక.

తా. ఓ కుమారా స్మృతి, ధృతి, ధర్మము, కుమారస్వామి, సోముడు, బృహస్పతి సప్తర్షులు, నారదుడు నిన్ను అంతటను రక్షింతురు గాక. 11

మూ. యాశ్చాపి సర్వతః సిద్ధా దిశశ్చ సదిగీశ్వరాః, 12
స్తుతా మయా వనే తస్మిన్ పాన్తు త్వాం పుత్ర నిత్యశః.

ప్ర. అ. పుత్ర=కుమారా సిద్ధాః=ప్రసిద్ధమైన, సదిగీశ్వరాః=దిక్పాలురతో కూడిన, యాః = ఏ, దిశశ్చ = దిక్కులు, మయా = నాచేత, స్తుతాః = స్తోత్రము చేయబడినవో అవి, తస్మిన్ వనే=ఆ వనమునందు, త్వామ్=నిన్ను, సర్వతః=అంతటను, నిత్యశః=ఎల్లపుడు, పాన్తు=రక్షించుగాక.

తా. నాచే స్తుతింపబడిన ప్రసిద్ధమైన ఆ దిక్కులు దిక్పాలురు కూడ నిన్ను అరణ్యమునందు అంతటను నిత్యము రక్షించుదురుగాక. 12

మూ. శైలాః సర్వే సముద్రాశ్చ రాజా వరుణ ఏవ చ 13
ద్యౌరన్తరిక్షం పృథివీ నద్యస్సర్వాస్తథైవ చ
నక్షత్రాణి చ సర్వాణి గ్రహాశ్చ సహదేవతాః 14
అహోరాత్రే తథా సన్ధ్యే పాన్తు త్వాం వనమాశ్రితమ్.

ప్ర. అ. సర్వే = సమస్తమైన, శైలాః = శైలములు, సముద్రాశ్చ = సముద్రములు, రాజా=ప్రభువైన, వరుణ ఏవ చ=వరుణుడు, ద్యౌః=స్వర్గము, అన్తరిక్షమ్=ఆకాశము, పృథివీచ=భూమి, తథైవ చ = మరియు, సర్వాః= సమస్తమైన, నద్యః=నదులు, సర్వాణి=సమస్తమైన, నక్షత్రాణి చ=నక్షత్రములు, సహదేవతాః = దేవతలతో కూడిన, గ్రహాశ్చ = గ్రహములు, అహోరాత్రే = పగలు, రాత్రి, తథా = మరియు, సన్ధ్యే = రెండు సంధ్యాకాలములును, వనమ్ ఆశ్రితమ్=వనమును ఆశ్రయించిన, త్వామ్ = నిన్ను, పాన్తు=రక్షించుగాక.

తా. వనములో నుండు నిన్ను శైలములు, సముద్రములు, వరుణుడు, స్వర్గము, ఆకాశము, భూమి, నదులు, నక్షత్రములు గ్రహములు, గ్రహదేవతలు, అహోరాత్రములు, సంధ్యలు రక్షించుగాక. 13, 14

మూ. ఋతవశ్చైవ షట్పుణ్యా మాసాః సంవత్సరాస్తథా, 15
కలాశ్చ కాష్ఠాశ్చ తథా తవ శర్మ దిశన్తు తే.

మూ. ప్లవగా వృశ్చికా దంశా మశకాశ్చైవ కాననే, 18
సరీసృపాశ్చ కీటాశ్చ మా భూవన్ గహనే తవ.

ప్ర. అ. గహనే = ప్రవేశింప శక్యము కాని, కాననే = అరణ్యమునందు, తవ = నీకు, ప్లవగాః = కోతులు, వృశ్చికాః = తేళ్ళు, దంశాః = పెద్దఈగలు, మశకాశ్చైవ = దోమలు, సరీసృపాశ్చ = పాములు, కీటాశ్చ = ఇతర మైన కీటకములు, మా భూవన్ = లేకుండుగాక.

తా. ప్రవేశింప శక్యము కాని ఆ అరణ్యమునందు నీకు కోతులు, తేళ్ళు, ఈగలు, దోమలు, సర్పములు, ఇతర కీటకములు, బాధ కలిగించకుండు గాక. 18

మూ. మహాద్విపాశ్చ సింహాశ్చ వ్యాఘ్రా ఋక్షాశ్చ దంష్ట్రిణః,
మహిషాః శృఙ్గిణో రౌద్రా న తే ద్రుహ్యన్తు పుత్రక.

ప్ర. అ. పుత్రక = కుమారా, మహాద్విపాశ్చ = మహాగజములు, దంష్ట్రిణః = కోరలు గల, సింహాశ్చ = సింహములు, వ్యాఘ్రాః = పులులు, ఋక్షాశ్చ = ఎలుగుబంట్లు, శృఙ్గిణః = కొమ్ములు గల, రౌద్రాః = భయంకరమైన, మహిషాః = దున్నపోతులు, తే = నీకు, న ద్రుహ్యన్తు = ద్రోహము చేయకుండుగాక.

తా. కుమారా, మహాగజములు, కోరలు గల సింహవ్యాఘ్ర భల్లూకములు, కొమ్ములు గల భయంకరమైన అడవి దున్నపోతులు నీకు అపకారము చేయకుండుగాక. 19

మూ. నృమాంసభోజనా రౌద్రా యే చాన్యే సత్త్వజాతయః 20
మా చ త్వాం హింసిషుః పుత్ర మయా సంపూజితాస్త్విహ

ప్ర. అ. పుత్ర = కుమారా, నృమాంసభోజనాః = మనుష్యుల మాంసము తిను, రౌద్రాః = భయంకర మైన, యే = ఏ, అన్యే = ఇతర మైన, సత్త్వజాతయః = మృగజన్మ కలిగిన ప్రాణు లున్నవో అవి, ఇహ = ఇచట, మయా = నాచేత సంపూజితాః = పూజింపబడినవై, త్వామ్ = నిన్ను, మా చ హింసిషుః = హింసించకుందురుగాక.

=దండకారణ్యమునందు నివసించుచున్న, త్వామ్=నిన్ను పాన్తు=రక్షించెదరు గాక.

భా. రామా! గురుడు, చంద్రుడు, సూర్యుడు, కుబేరుడు, యముడు వీరు చేయు పూజలు సంతోషించి దండకారణ్యములో నివసించుచున్న నిన్ను రక్షించె దరు గాక! 23

మూ. అగ్నిర్వాయుస్తథా ధూమో మన్త్రాశ్చర్షిముఖాచ్చ్యుతాః
ఉపస్పర్శనకాలే తు పాన్తు త్వాం రఘునన్దన

ప్ర. అ. రఘునన్దన =ఓ రామా! ఉపస్పర్శనకాలే తు - స్నానసమయ మందు, త్వామ్=నిన్ను, అగ్నిః=అగ్నియు, వాయుః=వాయువు, తథా= మరియు, ధూమః=ధూమము, ఋషిముఖాత్=ఋషుల ముఖమునుండి, చ్యుతాః= జారిన (బయటకువచ్చిన), మన్త్రాః=మంత్రములు, పాన్తు = రక్షింతురుగాక.

భా. రామా! నీ స్నానాది సమయములందు అగ్ని, వాయువు, ధూమము, ఋషిముఖములనుండి వచ్చిన మంత్రములు రక్షింతు గాక. 24

మూ. సర్వలోకప్రభుర్బ్రహ్మా భూతభర్తా తథర్షయః, 25
యే చ శేషాః సురాస్తే త్వాం రక్షన్తు వనవాసినమ్.

ప్ర. అ. సర్వలోకప్రభుః = సమస్తలోకములకు ప్రభువైన శివుడు, బ్రహ్మా=బ్రహ్మయు, భూతభర్తా=ప్రాణులను పోషించు విష్ణువు, తథా=మరియు, ఋషయః=ఋషులు, శేషాః=మిగిలిన, యే=ఏ, సురాః=దేవతలు కలరో, తే= వారును, వనవాసినమ్=వనమునందు నివసించుచున్న, త్వామ్=నిన్ను, రక్షన్తు = రక్షించెదరుగాక.

భా. అరణ్యములో నివసించుచున్న నిన్ను సకలలోకములకు ప్రభువైన శివుడు, బ్రహ్మ, సకలభూతములను రక్షించు విష్ణువు, ఋషులు, మిగిలిన దేవత లెల్లరును రక్షింతురుగాక. 25

మూ. ఇతి మాల్యైః సురగణాన్ గన్ధైశ్చాపి యశస్వినీ, 26
స్తుతిభిశ్చానురూపాభిరానర్చాయతలోచనా.

ప్ర. అ. యశస్వినీ=కీర్తి కలిగిన, ఆయతలోచనా=విశాలనేత్ర యైన కౌసల్య, ఇతి=ఈ విధముగా పలికి, మాల్యైః=మాలలతోను, గన్ధైశ్చాపి=గంధములతోను, అనురూపాభిః=తగిన, స్తుతిభిశ్చ=స్తోత్రములతోను, సురగణాన్=దేవతా గణములను, ఆనర్చ=పూజించెను.

తా. అధిక మైన కీర్తి కలది, విశాలనేత్ర అయిన కౌసల్య ఆ రామునితో ఇట్లు పలికి, దేవతలకు పుష్పమాలలను, సుగంధములను, అర్పించి తగిన స్తోత్రములు పఠించుచు వారిని పూజించెను. 26

మూ. జ్వలనం సముపాదాయ బ్రాహ్మణేన మహాత్మనా, 27
హావయామాస విధినా రామమఙ్గలకారణాత్.

ప్ర. అ. జ్వలనమ్=అగ్నిని, సముపాదాయ=గ్రహించి, రామమఙ్గలకారణాత్=రాముని మంగళముకొరకై, మహాత్మనా=మహాత్ముడైన, బ్రాహ్మణేన=బ్రాహ్మణునిచేత, విధినా=యథాశాస్త్రముగా, హావయామాస=హోమము చేయించెను.

తా. అగ్నిని సమకూర్చి, రాముని మంగళము నిమిత్తమై మహాత్ముడైన బ్రాహ్మణునిచే యథాశాస్త్రముగా హోమములు చేయించెను. 27

మూ. ఘృతం శ్వేతాని మాల్యాని సమిధః శ్వేతసర్షపాన్, 28
ఉపసంపాదయామాస కౌసల్యా పరమాఙ్గనా.

ప్ర. అ. పరమాఙ్గనా=ఉత్తమస్త్రీ అయిన, కౌసల్యా=కౌసల్య, ఘృతమ్=ఘృతమును, శ్వేతాని=తెల్లని, మాల్యాని=పుష్పమాలలను, సమిధః=సమిధలను, శ్వేత సర్షపాన్=తెల్ల ఆవాలను, ఉపసంపాదయామాస=సంపాదించెను.

తా. స్త్రీలలో శ్రేష్ఠురాలైన ఆ కౌసల్య, హోమమునకై నెయ్యి, తెల్లని పుష్పమాలలు, సమిధలు, తెల్లని ఆవాలు తెప్పించెను. 28

మూ. ఉపాధ్యాయః స విధినా హుత్వా శాన్తిమనామయమ్, 29
హుతహవ్యావశేషేణ బాహ్యం బలిమకల్పయత్.

ప్ర. అ. సః=ఆ, ఉపాధ్యాయః=ఉపాధ్యాయుడు, విధినా=శాస్త్రానుసారముగ, అనామయమ్=ఎట్టి దోషములేకుండునట్లు, శాన్తిం హుత్వా=శాంతి

హోమమును చేసి, హుతహవ్యావశేషేణ = హోమము చేయగా మిగిలిన హవ్యముతో, బాహ్యమ్ = వెలుపల చేయదగిన, బలిమ్ = బలిని, అకల్పయత్ = చేసెను.

తా. ఆ ఉపాధ్యాయుడు ఏట్టి దోషములు లేకుండ యథాశాస్త్రముగా, శాంతి హోమమును చేసి, హోమము చేయగా మిగిలిన ద్రవ్యముతో బాహ్యము లగు బలులు అర్పించెను. 29

మూ. మధుదధ్యక్షతఘృతైః స్వస్తివాచ్య ద్విజాం స్తతః, 30
వాచయామాస రామస్య వనే స్వస్త్యయనక్రియాః.

ప్ర. అ. మధు దధ్యక్షతఘృతైః = తేనె, పెరుగు, అక్షతలు, ఘృతము వీనితో, ద్విజాన్ = బ్రాహ్మణులను, స్వస్తివాచ్య = స్వస్తిచెప్పించి, తతః = పిమ్మట, వనే = వనమునందు, రామస్య = రామునకు, స్వస్త్యయనక్రియాః = మంగళములను కలిగించు క్రియలకు సంబంధించిన మంత్రములను, వాచయామాస = చదివించెను.

తా. మధు — దధి — అక్షత — ఘృతములతో ద్విజులచే పుణ్యాహము చెప్పించి, అటుపిమ్మట రామునకు వనమునందు క్షేమమును గూర్చి మంత్రములను చదివించెను. 30

మూ. తత స్తస్మై ద్విజేన్ద్రాయ రామమాతా యశస్వినీ, 31
దక్షిణాం ప్రదదౌ కామ్యాం రాఘవం చేదమబ్రవీత్.

ప్ర. అ. యశస్వినీ = మంచి కీర్తి కల, రామమాతా = రాముని తల్లి, తతః = అటుపిమ్మట, తస్మై = ఆ, ద్విజేన్ద్రాయ = ద్విజశ్రేష్ఠునకు, కామ్యామ్ = కోరదగినంత, దక్షిణామ్ = దక్షిణను, ప్రదదౌ = ఇచ్చెను. రాఘవమ్ = రాముని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ చ = పలికెను కూడ.

తా. కీర్తిమంతురాలైన ఆ కౌసల్య ఆ బ్రాహ్మణోత్తమునకు కోరినంత దక్షిణ యిచ్చి రామునితో ఇట్లు పలికెను. 31

మూ. యన్మఙ్గలం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే, 32
వృత్రనాశే సమభవత్ తత్తే భవతు మఙ్గలమ్.

ప్ర. అ. వృత్రనాశే=వృత్రసంహారసమయమున, సర్వదేవనమస్కృతే= సకలదేవతలచేత నమస్కరింపబడిన, సహస్రాక్షే=దేవేంద్రుని యందు, యత్ మఙ్గలమ్=ఏ మంగళము, సమభవత్=ఆయెనో, తత్మఙ్గళమ్=ఆ మంగళము, తే=నీకు, భవతు=అగుగాక.

తా. వృత్రాసురసంహారసమయమున సకలదేవతానమస్కృతుడైన దేవేంద్రునకు ఏ మంగళము కలిగెనో అట్టి మంగళము నీకు అగుగాక. 32

మూ. యన్మఙ్గళం సుపర్ణస్య వినతాఽకల్పయత్పురా, 33
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మఙ్గళమ్.

ప్ర. అ. పురా = పూర్వము, అమృతమ్ = అమృతమును, ప్రార్థయానస్య = కోరుచున్న, సుపర్ణస్య = గరుత్మంతునకు, వినతా = వినత, యత్ మఙ్గళమ్ = ఏ మంగళమును, అకల్పయత్ = కల్పించెనో, తత్ మఙ్గళమ్ = ఆ మంగళము, తే=నీకు, భవతు=అగుగాక.

తా. పూర్వము గరుత్మంతుడు, అమృతమును తీసుకొనివచ్చుటకు వెళ్లు సమయమున, అతనికి వినత ఎట్టి మంగళమును చేసెనో ఆ మంగళము నీకు అగుగాక. 33

మూ. అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్,
అదితిర్మఙ్గళం ప్రాదాత్ తత్తే భవతు మఙ్గళమ్.

ప్ర. అ. అదితిః = అదితి, అమృతోత్పాదనే = అమృతమును పుట్టించు సమయమున, దైత్యాన్ = దైత్యులను, ఘ్నతః = చంపుచున్న, వజ్రధరస్య = దేవేంద్రునకు, యత్ మఙ్గళమ్=యే మంగళమును, ప్రాదాత్=ఇచ్చెనో, తత్ మఙ్గళమ్=ఆ మంగళము, తే=నీకు, భవతు=అగుగాక.

తా. అమృతమును పుట్టించు సమయమునందు దైత్యులను చంపుటకై ఉద్యమించిన దేవేంద్రునకు తల్లి యైన అదితి యే మంగళము యిచ్చెనో ఆ మంగళము నీకు అగుగాక. 34

మూ. త్రీన్విక్రమాన్ ప్రక్రమతో విష్ణోరమితతేజసః, 35
యదాసీన్మఙ్గళం రామ! తత్తే భవతు మఙ్గళమ్,

ప్ర. అ. రామ = ఓరామా! త్రీన్ = మూడు, విక్రమాన్ = అడుగులను, ప్రక్రమతః = ఉంచుచున్న, అమితతేజసః = గొప్ప తేజస్సు కల, విష్ణోః = విష్ణువునకు, యత్ మఙ్గళమ్ = ఏ మంగళము, ఆసీత్ = అయెనో, తత్ మఙ్గళమ్ = ఆ మంగళము, తే = నీకు, భవతు = అగుగాక.

తా. రామా! మూడు అడుగులు వేసి, త్రిలోకములను ఆక్రమించు సమయమున, సాటి లేని తేజస్సు గల విష్ణువునకు ఏ మంగళము కలిగెనో, అది నీకు కలుగుగాక. ౩౫

మూ. ఋతవః సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ తే ౩౬
మంగళాని మహాబాహో దిశన్తు శుభమఙ్గళాః.

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు గల ఓ రామా! శుభమఙ్గళాః = శుభములు మంగళకరములు అయిన, ఋతవః = ఋతువులు, సాగరాః = సముద్రములు, ద్వీపాః = ద్వీపములు, వేదాః = వేదములు, లోకాః = లోకములు, దిశశ్చ = దిక్కులు, తే = నీకు, మఙ్గళాని = మంగళములను, దిశన్తు = ఇచ్చుగాక.

తా. మహాబాహుండవగు ఓరామా! శుభకరములు, మంగళప్రదములు అయిన ఋతువులు, సముద్రములు, ద్వీపములు, వేదములు, లోకములు, దిక్కులు నీకు మంగళములను ఇచ్చుగాక. ౩౬

మూ. ఇతి పుత్రస్య శేషాశ్చ కృత్వా శిరసి భామినీ. ౩౭
గన్ధాంశ్చాపి సమాలభ్య రామమాయతలోచనా
ఓషధీం చాపి సిద్ధార్థాం విశల్యకరణీం శుభామ్ ౩౮
చకార రక్షాం కౌసల్యా మన్త్రైరభిజజాప చ.

ప్ర. అ. ఆయతలోచనా = విశాల మైన నేత్రములు గల, భామినీ = స్త్రీ అయిన, కౌసల్యా = కౌసల్య, ఇతి = ఈ విధముగా పలుకుచు, పుత్రస్య = పుత్రుని యొక్క, శిరసి = శిరస్సునందు, శేషాశ్చ = అక్షతలనుకూడ, కృత్వా = చేసి, (ఉంచి), రామమ్ = రాముని, గన్ధాంశ్చాపి = గంధములను, సమాలభ్య = పూసి, సిద్ధార్థామ్ = ప్రసిద్ధ మైన ఫలముకలది, శుభామ్ = శుభకర మైనది, విశల్యకరణీమ్ = దేహములోని శల్యములను తొలగించునది యను, ఓషధీమ్ = ఓషధిని

రక్షామ్ = రక్షగా, చకార = చేసెను. మన్త్రైః=మంత్రములతో, అభిజజాప చ = అభిమంత్రించెను.

తా. విశాలలోచన యైన యా కౌసల్య పుత్రుని శిరస్సుపై అక్షతలు ఉంచి, శరీరమునకు గంధములు పూసి, ప్రసిద్ధ మైన ఫలము గల, శుభకర మైన విశల్యకరణి యను ఓషధిని రక్షగా కట్టి మంత్రములతో అభిమంత్రించెను. 37, 38

మూ. ఉవాచాతిప్రహృష్టేవ సా దుఃఖవశవర్తినీ, 39
వాఙ్మాత్రేణ న భావేన వాచా సంసజ్జమానయా.

ప్ర. అ. దుఃఖవశవర్తినీ = దుఃఖముతో నిండిన, సా = ఆమె, అతిప్రహృష్టేవ = చాల సంతసించినది వలె, సంసజ్జమానయా=తొట్రుపాటు చెందుచున్న, వాచా = వాక్కుతో, వాఙ్మాత్రేణ = నోటితో మాత్రమే, ఉవాచ = పలికెను. భావేన = మనస్సుతో, న = కాదు.

తా. దుఃఖముతో నిండి యున్న ఆమె పైకి సంతోషముతో నున్నట్లు కనబడుచు, తొట్రుపాటు చెందుచున్న మాటలతో ఇట్లు పలికెను. ఆమె నోటితో మాత్రమే పలికినది కాని, మనస్సుతో మాత్రము కాదు. 39

మూ. ఆనమ్య మూర్ధ్ని చాఘ్రాయ పరిష్వజ్య యశస్వినీ. 40
అవదత్పుత్ర సిద్ధార్థో గచ్ఛ రామ యథాసుఖమ్.

ప్ర. అ. యశస్వినీ = ఉత్తమ మైన కీర్తి గల, ఆ కౌసల్య, ఆనమ్య = రాముని క్రిందికి వంచి, మూర్ధ్ని = శిరస్సుపై, ఆఘ్రాయ = వాసనచూచి, పరిష్వజ్య = కౌగలించుకొని, అవదత్ = ఇట్లు పలికెను. పుత్ర = పుత్రుడ వైన, రామ = రామా! సిద్ధార్థః = సిద్ధ మైన ప్రయోజనము కలవాడ వై, యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛ = వెళ్లుము.

తా. కీర్తిమంతురా లైన ఆ కౌసల్య రాముని కౌగలించుకొని, అతని తల వంచి వాసన చూసి, ఇట్లు పలికెను. పుత్రా! రామా! కృతకృత్యుడ వై సుఖముగా వెళ్లుము. 40

మూ. ఆరోగం సర్వసిద్ధార్థ మయోధ్యాంపునరాగతమ్, 41
పశ్యామి త్వాం సుఖం వత్స!సుస్థితం రాజవర్త్మని.

ప్ర. అ. వత్స = కుమారా! ఆరోగమ్ = రోగములు లేనివాడవును, సర్వసిద్ధార్థమ్ = సిద్ధించిన సకలప్రయోజనములు కలవాడవును, సుఖమ్ = సుఖముగా, పునః = తిరిగి, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, ఆగతమ్ = వచ్చినవాడవై, రాజవర్త్మని = రాజమార్గమునందు, (రాజుగా), సుస్థితమ్ = చక్కగా ఉన్న, త్వామ్ = నిన్ను, పశ్యామి = చూచెదను.

తా. కుమారా! నీవు కార్యము లన్నియు సాధించి, ఆరోగ్యవంతుడవై సుఖముగా అయోధ్యకు తిరిగి వచ్చి రాజ్యాధికారమును పొందగా చూడగలను.

మూ. ప్రణష్టదుఃఖసంకల్పా హర్షవిద్యోతితాననా, 42
ద్రక్ష్యామి త్వాం వనాత్ప్రాప్తం పూర్ణచన్ద్రమివోదితమ్.

ప్ర. అ. వనాత్ = వనమునుండి, ప్రాప్తమ్ = వచ్చిన, త్వామ్ = నిన్ను, ఉదితమ్ = ఉదయించిన, పూర్ణచన్ద్రమివ = పూర్ణచంద్రుని వలె, ప్రణష్ట దుఃఖ సంకల్పా = నశించిన దుఃఖకర మైన ఆలోచనలు కలదాన నై, హర్షవిద్యోతితాననా = సంతోషముచే ప్రకాశింపచేయబడిన ముఖము కలదాన నై, ద్రక్ష్యామి = చూడగలను.

తా. వనవాసమునుండి తిరిగి వచ్చిన నిన్ను ఉదయించుచున్న పూర్ణచంద్రుని వలె, దుఃఖకరము లైన ఆలోచన లన్నియు తొలగిపోయిన నేను సంతోషముతో ప్రకాశించుచున్న ముఖము కలదాన నై చూచెదను. 42

మూ. భద్రాసనగతం రామ వనవాసాదిహాగతమ్, 43
ద్రక్ష్యామి చ పునస్త్వాం తు తీర్ణవన్తం పితుర్వచః.

ప్ర. అ. రామ = రామా! పితుః = తండ్రియొక్క, వచః = వాక్యమును, తీర్ణవన్తమ్ = నెరవేర్చినవాడవై, వనవాసాత్ = వనవాసమునుండి, ఇహ = ఇచటికి, పునః = తిరిగి, ఆగతమ్ = వచ్చిన, త్వామ్ = నిన్ను, భద్రాసనగతమ్ = సింహాసనము నందు కూర్చుండగా, ద్రక్ష్యామి = చూడగలను.

తా. నీవు తండ్రి మాటనెరవేర్చి, వనమునుండి తిరిగి ఇచటికి వచ్చి, సింహాసనముపై కూర్చుండి యుండగా చూడగలను. 43

మూ. మఙ్గలైరుపసంపన్నో వనవాసాదిహాగతః, 44
వధ్వా మమ చ నిత్యం త్వం కామాన్ సంవర్ధ యాహి భోః

ప్ర. అ. భోః = ఓ, రామా! వనవాసాత్ = వనవాసమునుండి, ఇహ = ఇచటికి, ఆగతః = వచ్చినవాడవై, మఙ్గలైః = మంగళములతో, ఉపసంపన్నః = కూడినవాడవై, త్వమ్ = నీవు, వధ్వాః = కోడలైన సీత యొక్కయు, మమ చ = నా యొక్కయు, కామాన్ = కామములను, నిత్యమ్ = ఎల్లప్పుడును, సంవర్ధ = వృద్ధిపొందించుము. యాహి = వెళ్ళుము.

తా. ఓ రామా! వనవాసమునుండి మరలి వచ్చి, సర్వమంగళసంపన్నుడవై నిత్యము నా కోరికలను, సీత కోరికలను, వృద్ధి పొందించెదవుగాక. ఇపుడు వెళ్లి రమ్ము. 44

మూ. మయార్చితా దేవగణాః శివాదయో
మహర్షయో భూతమహాసురోరగాః,
అభిప్రయాతస్య వనం చిరాయ తే
హితాని కాఙ్క్షన్తు దిశశ్చ రాఘవ. 45

ప్ర. అ. రాఘవ = రామా, మయా = నాచేత, అర్చితాః = పూజింపబడిన, శివాదయః = శివుడు మొదలైన, దేవగణాః = దేవతాగణములును, మహర్షయః = మహర్షులును, భూతమహాసురోరగాః = భూతములు, మహాసురులు, ఉరగులును, దిశశ్చ = దిక్కులును, వనమ్ = వనమును గూర్చి, అభిప్రయాతస్య = వెళ్లిన, తే = నీయొక్క, హితాని = హితములను, చిరాయ = చిరకాలము, కాఙ్క్షన్తు = కోరెదరుగాక.

తా. రామా! ఇచట నేను పూజించుచున్న శివాదిదేవతలును, మహర్షులును, భూత-మహాసుర-ఉరగులును, వనమునకు వెళ్లిన నీ హితమును సర్వదా అభిలషింతురు గాక. 45

మూ. ఇతీవ చాశ్రుప్రతిపూర్ణలోచనా
సమాప్య చ స్వస్త్యయనం యథావిధి,
ప్రదక్షిణం చైవ చకార రాఘవం,
పునః పునశ్చాపి నిపీడ్య సస్వజే. 46

ప్ర. అ. ఇతీవ=ఈ విధముగా పలుకుచు, అశ్రుప్రతిపూర్ణలోచనా = కన్నీళ్లతో నిండిన నేత్రములు కలదై, యథావిధి = యథాశాస్త్రముగా, స్వస్త్యయనమ్=స్వస్త్యయనమును, సమాప్య చ=పూర్తిచేసి, రాఘవమ్=రాముని, ప్రదక్షిణం చకార=ప్రదక్షిణము చేసెను. పునః పునః చ అపి=మాటిమాటికిని, నిపీడ్య=పీడించి, సస్వజే=కౌగలించెను.

తా. కౌసల్య ఇట్లు పలుకుచు, కన్నీళ్ళు నిండిన నేత్రములు కలదై, యథాశాస్త్రముగ స్వస్త్యయనము పూర్తిచేసి, రక్షార్థమై అతని చుట్టును తిరిగి మాటిమాటికిని గట్టిగా కౌగలించుకొనెను. 46

మూ. తథా చ దేవ్యా స కృతప్రదక్షిణో
నిపీడ్య మాతుశ్చరణౌ పునః పునః,
జగామ సీతానిలయం మహాయశాః,
స రాఘవః ప్రజ్వలితః స్వయా శ్రియా. 47

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పఞ్చవింశః సర్గః.

ప్ర. అ. దేవ్యా=కౌసల్యాదేవిచేత, తథా=ఆ విధముగ, కృతప్రదక్షిణః=చేయబడిన ప్రదక్షిణములు గల, సః=అతడు, మాతుః=తల్లియొక్క, చరణౌ=పాదములను, పునః పునః=మాటి మాటికిని, నిపీడ్య=పీడించి (స్పృశించి) మహాయశాః=గొప్ప కీర్తి గల, సః రాఘవః=ఆ రాముడు, స్వయా=తనదైన, శ్రియా=శోభతో, ప్రజ్వలితః=వెలుగుచు, సీతానిలయమ్ = సీత గృహమును గూర్చి, జగామ=వెళ్ళెను.

తా. కౌసల్యా దేవి రక్షాప్రదక్షిణములు చేసిన పిమ్మట గొప్ప కీర్తి గల ఆ రాముడు మరల మరల ఆమె పాదములు స్పృశించి నమస్కరించి, తన కాంతితో వెలుగుచు సీతానివాసగృహమునకు వెళ్ళెను. 47

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఇరువదియైదవ సర్గ సమాప్తము.

# అథ షడ్వింశః సర్గః

[రాముడు దిగులు చెంది ఉండుట చూచి, సీత అందుకు కారణము తెలియగోరుట, రాముడు, తండ్రి ఆజ్ఞచేత తాను వనమునకు వెళ్ళు చున్నట్లు, సీతకు తెలిపి, ''నీవు అయోధ్యలోనే ఉండుము'' అని ఆమెకు ఉపదేశించుట].

మూ. అభివాద్య చ కౌసల్యాం రామః సంప్రస్థితో వనమ్,
కృతస్వస్త్యయనో మాత్రా ధర్మిష్ఠే వర్త్మని స్థితః 1
విరాజయన్ రాజసుతో రాజమార్గం నరైర్వృతమ్,
హృదయాన్యామమన్థేవ జనస్య గుణవత్తయా. 2

ప్ర. అ. రాజసుతః=రాజకుమారుడైన, రామః=రాముడు, మాత్రా= తల్లిచేత, కృతస్వస్త్యయనః= చేయబడిన మంగళాశీర్వచనములు కలవాడై, కౌసల్యామ్=కౌసల్యను, అభివాద్య చ=నమస్కరించి, ధర్మిష్ఠే = ధర్మయుక్తమైన, వర్త్మని = మార్గమునందు, స్థితః=ఉన్నవాడై, వనమ్=వనమును గూర్చి, సంప్రస్థితః = ప్రయాణమైనవాడై, జనైః = జనులతో, వృతమ్ = నిండిన, రాజమార్గమ్=రాజమార్గమును, విరాజయన్=ప్రకాశింపచేయుచు, గుణవత్తయా= ఉత్తమ గుణములు కలవాడగుటచే, జనస్య = జనముయొక్క, హృదయాని = హృదయములను, ఆమమన్థేవ = మథించినట్లు చేసెను.

తా. రాజకుమారుడైన రాముడు, తల్లి మంగళాశీర్వాదములు చేసిన పిమ్మట, ఆమెకు నమస్కరించి, ధర్మమార్గమును అనుసరించుచు, అరణ్యమునకు ప్రయాణ మాయెను. అతడు జనులతో నిండిన రాజమార్గమును ప్రవేశించి, దానిని తన కాంతిచే ప్రకాశింపచేయుచు, తన సద్గుణములచే జనుల హృదయములను, మిక్కిలి ఆకర్షించుచు వారిని కలతపెట్టినట్లు చేసెను. 1, 2

మూ. వైదేహీ చాపి తత్సర్వం న శుశ్రావ తపస్వినీ
తదేవ హృది తస్యాశ్చ యౌవరాజ్యాభిషేచనమ్. 3

ప్ర. అ. తపస్వినీ = అభిషేకము కొరకై వ్రతము నాచరించుచున్న, వైదేహీ చాపి = సీత కూడ, తత్సర్వమ్ = దాని నంతను, నశుశ్రావ = వినలేదు. తస్యాః = ఆమెయొక్క, హృది = హృదయమునందు, తత్ = ఆ, యౌవరాజ్యాభిషేచనమ్ ఏవ = యౌవరాజ్యాభిషేచనము మాత్రమే ఉండెను.

తా. అభిషేకమునకై వ్రతము అవలంబించి యున్న సీతకు ఈ విషయ మేదియు తెలియదు. యౌవరాజ్యాభిషేకము జరుగగల దనియే ఆమె భావించు చుండెను. 3

మూ. దేవకార్యం స్వయం కృత్వా కృతజ్ఞా హృష్టచేతనా
అభిజ్ఞా రాజధర్మాణాం రాజపుత్రం ప్రతీక్షతే. 4

ప్ర. అ. కృతజ్ఞా = కార్యములను ఎరిగినదీ, రాజధర్మాణామ్ = రాజధర్మములను, అభిజ్ఞా = తెలుసుకొనినదీ అయిన ఆమె, హృష్టచేతనా = సంతోషించిన మనస్సు కలదై, స్వయమ్ = స్వయముగా, దేవకార్యమ్ = దేవపూజను, కృత్వా = చేసి, రాజపుత్రమ్ = రాజకుమారుని, ప్రతీక్షతే = నిరీక్షించుచుండెను.

తా. రాజధర్మము లన్నియు తెలిసినదియు, చేయవలసిన పనులు ఎరిగి నదియు నైన ఆ సీత స్వయముగనే దేవపూజాదికము నిర్వర్తించి సంతోషించిన మనస్సుతో రాజపుత్రుని నిరీక్షించుచుండెను. 4

మూ. ప్రవివేశాథ రామస్తు స్వం వేశ్మ సువిభూషితమ్,
ప్రహృష్టజనసంపూర్ణం హ్రియా కించిదవాఙ్ముఖః. 5

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామస్తు = రాముడు, హ్రియా = సిగ్గుచేత, కించిత్ = కొంచెము, అవాఙ్ముఖః = వంచబడిన ముఖముకలవాడై, ప్రహృష్టజనసంపూర్ణమ్ = సంతోషించిన జనులతో నిండిన, సువిభూషితమ్ = బాగుగ అలంకరింపబడిన, స్వం వేశ్మ = తన గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. రాముడు సిగ్గుతో కొంచెము తల వంచుకొని, సంతోషించిన జనులతో నిండిన చక్కగ అలంకరించిన తన ఇంటిలోనికి ప్రవేశించెను. 5

మూ. అథ సీతా సముత్పత్య వేపమానా చ తం పతిమ్,
అపశ్యచ్ఛోకసన్తప్తం చిన్తావ్యాకులితేన్ద్రియమ్. 6

ప్ర. అ. అథ = పిమ్మట, సీతా = సీత, సముత్పత్య = తటాలున లేచి, వేపమానా చ = వణకుచు, శోకసన్తప్తమ్ = శోకముచే తపింపబడినవాడును, చిన్తా వ్యాకులితేన్ద్రియమ్ = విచారముచే వ్యాకులముగ చేయబడిన ఇంద్రియములు కల వాడును, అయిన, తం పతిమ్ = ఆ భర్తను, అపశ్యత్ = చూచెను.

తా. సీత వెంటనే లేచి, దుఃఖముతో బాధపడుచు విచారముచే వ్యాకులమైన ఇంద్రియములు గల, ఆ భర్తను చూచి వణకిపోయెను. 5

మూ. తాం దృష్ట్వా స హి ధర్మాత్మా న శశాక మనోగతమ్,
తం శోకం రాఘవః సోఢుం తతో వివృతతాం గతః. 6

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన, సః = ఆ, రాఘవః = రాముడు, తామ్ = ఆమెను, దృష్ట్వా = చూచి, మనోగతమ్ = మనస్సులో నున్న, తం శోకమ్ = ఆ శోకమును, సోఢుమ్ = సహించుటకు, న శశాక = సమర్థుడు కాలేదు. తతః = ఆ కారణమువలన, వివృతతామ్ = బయటపడిపోవుటను, గతః = పొందెను.

తా. ఆమెను చూడగనే ధర్మాత్ముడైన ఆ రాముడు మనస్సులో నున్న దుఃఖమును లోపల ఇముడ్చుకొనజాలక, బయట పడిపోయెను. 6

మూ. వివర్ణవదనం దృష్ట్వా తం ప్రస్విన్నమమర్షణమ్,
ఆహ దుఃఖాభిసన్తప్తా కిమిదానీమిదం ప్రభో. 7

ప్ర. అ. వివర్ణవదనమ్ = పాలిపోయిన ముఖము కలవాడును, ప్రస్విన్నమ్ = చెమట పట్టినవాడును, అమర్షణమ్ = కోపముతో కూడినవాడును అయిన, తమ్ = అతనిని, దృష్ట్వా = చూచి, దుఃఖాభిసన్తప్తా = దుఃఖముచే పీడింపబడినదై, ఆహ = పలికెను. ప్రభో = ఓ ప్రభువా! ఇదానీమ్ = ఇప్పుడు, ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి?

తా. పాలిపోయిన ముఖముతో, చెమట పట్టి, కోపించి యున్న రాముని చూడగనే దుఃఖపీడితురాలై ఆమె ఇట్లు పలికెను — "ఓ ప్రభూ! ఇపుడు ఇట్లున్నా వేమి"? 7

మూ. అద్య బార్హస్పతః శ్రీమాన్యుక్తః పుష్యేణ రాఘవ,
ప్రోచ్యతే బ్రాహ్మణైః ప్రాజ్ఞైః కేన త్వమసి దుర్మనాః. 8

ప్ర. అ. రాఘవ = రామా! అద్య = నేడు, శ్రీమాన్ = శుభకర మైన, బార్హస్పతః = బృహస్పతి దేవతగా కల, పుష్యః=పుష్యనక్షత్రము, యుక్తః= తగినదిగా, ప్రాజ్ఞైః = బుద్ధిమంతు లైన, బ్రాహ్మణైః = బ్రాహ్మణులచేత, ప్రోచ్యతేను = చెప్పబడుచున్నది కదా! త్వమ్ = నీవు, కేన = ఏ కారణముచేత, దుర్మనాః = దుఃఖవంతుడవై, అసి = అయి ఉన్నావు.

తా. రామా! నేడు లక్ష్మీప్రద మైన, బృహస్పతి దేవతగా గల, పుష్య నక్షత్రము అభిషేకమునకు తగిన దని విద్వాంసు లైన బ్రాహ్మణులు చెప్పినారు కదా! నీవు దుఃఖించుచున్నా వేమి? 8

మూ. న తే శతశలాకేన జలఫేననిభేన చ.
ఆవృతం వదనం వల్గు ఛత్రేణాపి విరాజతే. 9

ప్ర. అ. వల్గు = సుందర మైన, తే = నీయొక్క, వదనమ్=ముఖము, శత శలాకేన = నూరు ఊచలుకల, జలఫేననిభేన = నీటినురుగుతో సమాన మైన, ఛత్రేణ = ఛత్రముచే, ఆవృతమ్ = కప్పబడిన దై, న విరాజతే = ప్రకాశించుటలేదు.

తా. సుందర మైన నీ ముఖము నూరు ఊచలు కలదీ, నీటి నురుగు వలె తెల్లనిదీ అయిన ఛత్రముచే కప్పబడి ప్రకాశింపవలసియున్నది కదా! అట్లు కప్ప బడలే దేమి? 9

మూ. వ్యజనాభ్యాం చ ముఖ్యాభ్యాం శతపత్రనిభేక్షణమ్,
చన్ద్రహంస ప్రకాశాభ్యాం వీజ్యతే న తవాననమ్. 10

ప్ర. అ. శతపత్రనిభేక్షణమ్ = పద్మములం వంటి నేత్రములు గల, తవ ఆననమ్ = నీ ముఖము, చన్ద్రహంసప్రకాశాభ్యాం = చంద్రునివంటి, హంస వంటి ప్రకాశము గల, ముఖ్యాభ్యామ్ = శ్రేష్ఠ మైన, వ్యజనాభ్యామ్ = వింజా మరలచేత, న వీజ్యతే = వీచబడుటలేదు.

తా. పద్మములతో సమానమైన నేత్రములు గల నీ ముఖము, చంద్రుని వలె, హంస వలె నున్న శ్రేష్ఠమైన వింజామరలచే వీచబడుటలేదు. కారణ మేమి? 10

మూ. వాగ్మినో వన్దినశ్చాపి ప్రహృష్టాస్త్వాం నరర్షభ।
స్తువన్తో నాత్ర దృశ్యన్తే మఙ్గళైః సూతమాగధాః. 11

ప్ర. అ. నరర్షభ = ఓ నరశ్రేష్ఠుడా, వాగ్మినః = మాటలలో నేర్పు గల, వన్దినశ్చాపి = స్తోత్రపాఠకులును, సూతమాగధాః = పూర్వకథలను గానము చేయు సూతులు, మాగధులును, ప్రహృష్టాః = సంతసించినవారై, త్వామ్ = నిన్ను మఙ్గళైః = మంగళవాక్యములచేత, స్తువన్తః = స్తోత్రముచేయుచున్న వారుగ, అత్ర = ఇచట, న దృశ్యన్తే = చూడబడుటలేదు.

తా. ఓ నరశ్రేష్ఠా! మాటలలో నేర్పు గల, వందులును, సూతమాగధులును, సంతోషపూర్వకముగ మంగళపాఠములతో నిన్ను స్తుతించుచు కనబడుట లేదు; ఏమి కారణము? 11

మూ. న తే క్షౌద్రం చ దధి చ బ్రాహ్మణా వేదపారగాః,
మూర్ధ్ని మూర్ధాభిషిక్తస్య దదతి స్మ విధానతః. 12

ప్ర. అ. వేదపారగాః = వేదముల అంతములు చూచిన, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, మూర్ధాభిషిక్తస్య = అభిషేకముచేయబడిన, తే = నీయొక్క, మూర్ధ్ని = శిరస్సుయందు, విధానతః = విధిపూర్వకముగ, క్షౌద్రం చ = తేనెను, దధి చ = పెరుగును, న దదతి స్మ = ఉంచలేదు.

తా. మూర్ధాభిషిక్తుడవైన నీ తలపై సకలవేదవిదులైన బ్రాహ్మణులు యథా శాస్త్రముగ తేనెను పెరుగును కలిపి ఏల ఉంచలేదు? 12

మూ. న త్వాం ప్రకృతయః సర్వాః శ్రేణీముఖ్యాశ్చ భూషితాః,
అనువ్రజితుమిచ్ఛన్తి పౌరజానపదా స్తథా. 13

ప్ర. అ. సర్వాః = సమస్తమైన, ప్రకృతయః = మంత్రులు మొదలగు వారు, శ్రేణీముఖ్యాశ్చ = వర్తకులు మొదలగువారి శ్రేణులలో (సంఘములలో) ముఖ్యులును, తథా = మరియు, పౌరజానపదాః = పౌరులును, జానపదులును,

భూషితాః = అలంకరింపబడినవారై, త్వామ్ = నిన్ను, అనుప్రయాతుమ్ = అనుస-
రించి వెళ్లుటకు, న ఇచ్ఛంతి = ఇచ్ఛయించుటలేదు.

తా. అమాత్యాది ప్రకృతులును, శ్రేణులలో ముఖ్యులును, పౌరజాన
పదులును చక్కగ అలంకరించుకొని నీవెంబడి వచ్చుటలేదేమి? 13

మూ. చతుర్భిర్వేగసంపన్నైర్హయైః కాఞ్చనభూషితైః,
ముఖ్యః పుష్యరథో యుక్తః కిం న గచ్ఛతి తేఽగ్రతః.

ప్ర. అ. వేగసంపన్నైః = వేగముతో కూడిన, కాఞ్చనభూషితైః = బంగా
రముచే అలంకరింపబడిన, చతుర్భిః = నాలుగు, హయైః = గుఱ్ఱములతో,
యుక్తః = కట్టబడిన, ముఖ్యః = ముఖ్యమైన, పుష్యరథః = ఉత్సవరథము,
కిమ్ = ఎందుకు, తే అగ్రతః = నీ యెదుట, న గచ్ఛతి = వెళ్లుటలేదు?

తా. బంగారముచే అలంకరింపబడిన, మంచి వేగము గల నాలుగు
గుఱ్ఱములు కట్టిన, ప్రధానమైన పుష్యరథము నీ యెదుట ఎందుచే నడచుట
లేదు. 14

మూ. న హస్తీ చాగ్రతః శ్రీమాన్ తవ లక్షణపూజితః,
ప్రయాణే లక్ష్యతే వీర కృష్ణమేఘగిరిప్రభః. 15

ప్ర. అ. వీర = ఓ వీరుడా! తవ = నీయొక్క, ప్రయాణే = ప్రయాణము
నందు, అగ్రతః = ఎదుట, లక్షణపూజితః = మంచి లక్షణములతో పూజింప
బడినది, కృష్ణమేఘగిరిప్రభః = నల్లని మేఘముయొక్క పర్వతముయొక్క
కాంతి కలది, శ్రీమాన్ = శోభాయుక్తము అయిన, హస్తీ = గజము, న లక్ష్యతే =
చూడబడుటలేదు.

తా. ఓ వీరా! నీ ప్రయాణమున, అగ్రభాగమునందు, ఉత్తమలక్షణములు
కలదీ, నల్లనిమేఘము వలె పర్వతము వలె ఉన్నదీ, శోభాయుక్తమూ, అయిన,
గజము కనబడుటలేదు; కారణ మేమి? 15

మూ. న చ కాఞ్చనచిత్రం తే పశ్యామి ప్రియదర్శన,
భద్రాసనం పురస్కృత్య యాన్తం వీరపురస్సరమ్. 16

ప్ర. అ. వీర = ఓ వీరుడా! ప్రియదర్శన = ప్రియ మైన దర్శనము గలవాడా! కాఞ్చనచిత్రమ్ = బంగారముచే చిత్ర మైన, తే = నీయొక్క, భద్రాసనమ్ = సింహాసనమును, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, యాన్తమ్ = నడచుచున్న, పురస్సరమ్ = నీ ముందు నడచు ఏనుగును, న చ పశ్యామి = నేను చూచుటలేదు.

తా. ప్రియదర్శనుడ వైన ఓ మహావీరా! సువర్ణముచే చిత్రిత మైన నీ సింహాసనమును ముం దిడుకొని, నీ ఎదుట ఏనుగ నడవవలసియున్నది కదా! అది కనబడుటలే దేమి? 17

మూ. అభిషేకో యథా సజ్జః కిమిదానీమిదం తవ,
అపూర్వో ముఖవర్ణశ్చ న ప్రహర్షశ్చ లక్ష్యతే. 18

ప్ర. అ. అభిషేకః = అభిషేకము, యథా = ఎట్లు, సజ్జః = సిద్ధము చేయబడినదో, అట్టి ఈ సమయమున, తవ = నీయొక్క, ముఖవర్ణః = ముఖముయొక్క రంగు, అపూర్వః = పూర్వ మెన్నడును లేని విధముగ నున్నది. ప్రహర్షశ్చ = సంతోషము కూడ, న లక్ష్యతే = కనబడుటలేదు. ఇదానీమ్ = ఇప్పుడు, ఇదమ్ = ఇది, కిమ్ = ఏమి?

తా. నీ కిపుడు అభిషేకము చేయబడుచుండగా, నీ ముఖవర్ణము క్రొత్తగా నున్నది; సంతోషము కూడ కానవచ్చుట లేదు. ఇది ఏమి? 18

మూ. ఇతీవ విలపన్తీం తాం ప్రోవాచ రఘునన్దనః,
సీతే తత్రభవాంస్తాతః ప్రవ్రాజయతి మాం వనమ్. 19

ప్ర. అ. ఇతీవ = ఈ విధముగ, విలపన్తీమ్ = విలపించుచున్న, తామ్ = ఆమెను గూర్చి, రఘునన్దనః = రాముడు, ప్రోవాచ = పలికెను. సీతే = ఓ సీతా! తత్రభవాన్ = పూజ్యు డైన, తాతః = తండ్రి, మామ్ = నన్ను, వనమ్ = వనమును గూర్చి, ప్రవ్రాజయతి = ప్రవాసముచేయించుచున్నాడు.

తా. ఈ విధముగ విలపించుచున్న సీతతో రాము డిట్లనెను. "సీతా! పూజ్యు డైన నా తండ్రి నన్ను అరణ్యమునకు పంపివేయుచున్నాడు. 19

మూ. కులే మహతి సంభూతే ధర్మజ్ఞే ధర్మచారిణి,
శృణు జానకి యేనేదం క్రమేణాభ్యాగతం మమ. 20

ప్ర. అ. మహతి = గొప్ప కులే = కులమునందు, సంభూతే = పుట్టిన దానా! ధర్మజ్ఞే = ధర్మము నెరిగినదానా! ధర్మచారిణి = ధర్మమును ఆచరించు దానా! జానకి = ఓ సీతా! మమ = నాకు, యేన క్రమేణ = ఏ క్రమము చేత, ఇదమ్ = ఇది, అభ్యాగతమ్ = వచ్చినదో, శృణు = వినుము.

తా. సీతా! నీవు ఉత్తమ మైన కులమునందు పుట్టినావు. ధర్మము లన్నియు తెలిసి, ధర్మ మాచరించుదానవు. నాకీ వనవాసము ఏ విధముగ వచ్చినదో చెప్పెదను వినుము. 20

మూ. రాజ్ఞా సత్యప్రతిజ్ఞేన పిత్రా దశరథేన చ,
కైకేయ్యై మమ మాత్రే తు పురా దత్తౌ మహావరౌ. 21

ప్ర. అ. రాజ్ఞా = రాజూ, సత్యప్రతిజ్ఞేన = సత్య మైన ప్రతిజ్ఞకలవాడూ, పిత్రా = నా తండ్రి అయిన, దశరథేన = దశరథునిచేత, పురా = పూర్వము, మమ మాత్రే = నా తల్లి యైన, కైకేయ్యై = కైకేయికి, మహావరౌ = రెండు గొప్ప వరములు, దత్తౌ = ఇవ్వబడినవి.

తా. సత్యప్రతిజ్ఞ గల, మా తండ్రి యైన దశరథమహారాజు, పూర్వము, మా తల్లి యైన కైకేయికి రెండు గొప్పవరముల నిచ్చెను. 21

మూ. తయాద్య మమ సజ్జేఽస్మిన్నభిషేకే నృపోద్యతే,
ప్రచోదితః స సమయో ధర్మేణ ప్రతినిర్జితః. 22

ప్ర. అ. అద్య = ఇపుడు, నృపోద్యతే = రాజుచే ప్రారంభింపబడిన, మమ = నాయొక్క, అస్మిన్ అభిషేకే = ఈ అభిషేకము, సజ్జే = సిద్ధ మైన దగుచుండగా, తయా = ఆమెచేత, సః = ఆ, సమయః = ప్రతిజ్ఞ, ప్రచోదితః = ప్రేరేపింపబడినది. ధర్మేణ = ధర్మముచేత, ప్రతినిర్జితః = జయింపబడినది.

తా. ఇపుడు మహారాజు నాకు అభిషేకము చేయ సంకల్పించి ఏర్పాట్లు చేయుచుండగా, ఆమె ఆ వరముల ప్రతిజ్ఞను వెలికి తీసికొని వచ్చి, ధర్మమును చూపి, ఆ ప్రతిజ్ఞను నెగ్గించినది. 22

మూ. చతుర్దశ హి వర్షాణి వస్తవ్యం దణ్డకే మయా,
పిత్రా మే భరతశ్చాపి యౌవరాజ్యే నియోజితః. 23

ప్ర. అ. మయా = నా చేత, చతుర్దశ వర్షాణి = పదునాలుగు సంవత్సరములు, దణ్డకే = దండకారణ్యమునందు, వస్తవ్యమ్ = నివసించ వలసి యున్నది మే పిత్రా = నా తండ్రిచేత, భరతశ్చాపి = భరతుడు, యౌవరాజ్యే = యౌవరాజ్యము నందు, నియోజితః = నియమింపబడినాడు.

తా. నేను పదునాలుగు సంవత్సరములు దండకారణ్యమునందు నివసించ వలెను. నా తండ్రి భరతునికి యౌవరాజ్యభారము అప్పగించినాడు. 23

మూ. సో௨హం త్వామాగతో ద్రష్టుం ప్రస్థితో విజనం వనమ్,
భరతస్య సమీపే తు నాహం కథ్యః కదాచన. 24
బుద్ధియుక్తా హి పురుషా న సహన్తే పరస్తవమ్,
తస్మాన్నతే గుణాః కథ్యా భరతస్యాగ్రతో మమ. 25

ప్ర. అ. విజనమ్ = జనశూన్య మైన, వనమ్ = వనమును గూర్చి, ప్రస్థితః = ప్రయాణ మైన, సః అహమ్ = అట్టి నేను, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఆగతః = వచ్చినాను. భరతస్య = భరతునియొక్క, సమీపే = సమీపమునందు, కదాచన = ఎన్నడును, అహమ్ = నేను, న కథ్యః = చెప్పదగిన వాడను కాను. బుద్ధియుక్తాః = ఐశ్వర్యముతో కూడిన, పురుషాః = పురుషులు, పరస్తవమ్ = పరుల స్తోత్రమును, న సహన్తే హి = సహించరు కదా. తస్మాత్ = ఆ కారణము వలన, భరతస్య = భరతుని, అగ్రతః = ఎదుట, తే = నీకు, మమ గుణాః = నా గుణములు, న కథ్యాః = చెప్పదగినవి కావు.

తా. అందుచే నే నిపుడు నిర్జనారణ్యమునకు పోవుటకు బయలుదేరి, నిన్ను చూచుటకై వచ్చినాను. నీ వెన్నడును భరతుని ఎదుట నా ప్రసంగము తీసికొని రావలదు. ఎందుచేతననగా, ఐశ్వర్యముతో నున్నవారు, ఎవరైన ఇతరులను పొగడుచుండగా సహించరు. అందుచే భరతుని ఎదుట నీవు నా గుణములను గూర్చి ముచ్చటింపరాదు. 24, 25

మూ. నాపి త్వం తేన భర్తవ్యా విశేషేణ కదాచన,
అనుకూలతయా శక్యం సమీపే తస్య వర్తితుమ్. 26

ప్ర. అ. త్వమ్ = నీవు, తేన = అతనిచేత, కదాచన = ఎన్నడును, విశేషేణ = విశేష రూపమున, న భర్తవ్యా = పోషింపదగినదానవు కావు. అను

కూలతయా తు = అనుకూలముగా మాత్రమే, అస్య = ఈతనియొక్క, సమీపే సమీపమునందు, వర్తితుమ్ = ఉండుటకు, శక్యమ్ = శక్య మగును.

తా. నిన్ను విశేషముగ పోషించ వలసిన బాధ్యత కూడ భరతునకులేదు. అతనికి అనుకూలముగ ప్రవర్తించుచు మాత్రమే నీ వాతని వద్ద ఉండగలవు.

మూ. తస్మై దత్తం నృపతినా యౌవరాజ్యం సనాతనమ్,
స ప్రసాద్యస్త్వయా సీతే నృపతిశ్చ విశేషతః. 27

ప్ర. అ. నృపతినా = రాజుచేత, తస్మై = అతనికి, సనాతనమ్ = పురాతన మైన, యౌవరాజ్యమ్ = యౌవరాజ్యము, దత్తమ్ = ఇవ్వబడినది. సీతే = సీతా, సః = అతడు, త్వయా = నీచేత, ప్రసాద్యః = అనుగ్రహించ చేసుకొన దగినవాడు. నృపతిశ్చ = దశరథమహారాజు కూడ, విశేషతః = విశేషించి, అనుగ్రహించ చేసుకొనదగినవాడు.

తా. పరంపరాగత మైన యౌవరాజ్యమును మహారాజు అతని కిచ్చినాడు. అందుచే, సీతా! నీ వాతని అనుగ్రహమును, విశేషించి మహారాజు అనుగ్రహము సంపాదించుటకు ప్రయత్నించవలెను. 27

మూ. అహం చాపి ప్రతిజ్ఞాం తాం గురోస్సమనుపాలయన్,
వనమద్యైవ యాస్యామి స్థిరా భవ మనస్విని, 28

ప్ర. అ. అహం చాపి = నేను, గురోః = తండ్రియొక్క, తాం ప్రతిజ్ఞామ్ = ఆ ప్రతిజ్ఞను, సమనుపాలయన్ = పాలించుచు, అద్యైవ = ఇప్పుడే, వనమ్ = వనమునుగూర్చి, యాస్యామి = వెళ్లగలను. మనస్విని = మంచి మనస్సు కల ఓ సీతా, త్వమ్ = నీవు, స్థిరా = ధైర్యవంతురాలవు, భవ = అగుము.

తా. నేను నా తండ్రి యాజ్ఞ ప్రకారము అరణ్యమునకు ఇపుడే వెళ్ళుచున్నాను. ఉత్తమ మైన మనస్సు గల ఓ సీతా! నీవు ధైర్యము వహింపుము. 28

మూ. యాతే చ మయి కల్యాణి వనం మునినిషేవితమ్,
వ్రతోపవాసపరయా భవితవ్యం త్వయానఘే. 29

ప్ర. అ. అనఘే = దోషములు లేని సీతా! కల్యాణి = మంగళప్రదురాలా! మయి = నేను, మునినిషేవితమ్ = మునులచే సేవింపబడిన, వనమ్ = వనమును

గూర్చి, యాతే = వెళ్ళినవాడ నగుచుండగా, త్వయా = నీచేత, వ్రతోపవాస పరయా = వ్రతములందు ఉపవాసములందు ఆసక్తి కలదానవుగా, భవితవ్యమ్ = కాదగినది.

తా. మంగళప్రదురాలవూ, దోషరహితురాలవూ అయిన ఓ సీతా! నేను మునుల నివాసమైన వనమునకు వెళ్ళిన పిమ్మట నీవు వ్రతముల నాచరించుచు ఉపవాసములు చేయుచు ఉండవలెను. 29

మూ. కాల్యముత్థాయ దేవానాం కృత్వా పూజాం యథావిధి,
వన్దితవ్యో దశరథః పితా మమ నరేశ్వరః 30

ప్ర. అ. కాల్యమ్ = ఉషఃకాలమునందే, ఉత్థాయ = లేచి, యథావిధి = యథాశాస్త్రముగా, దేవానామ్ = దేవతలయొక్క, పూజామ్ = పూజను, కృత్వా = చేసి, మమ పితా = నా తండ్రి యైన, నరేశ్వరః = రాజైన, దశరథః = దశరథుడు, వన్దితవ్యః = నమస్కరింపదగినవాడు.

తా. నీవు ఉషఃకాలమునందే లేచి, యథావిధిగా పూజ చేసి మా తండ్రి యైన దశరథమహారాజునకు నమస్కరించుచుండవలెను. 30

మూ. మాతా చ మమ కౌసల్యా వృద్ధా సన్తాపకర్శితా,
ధర్మమేవాగ్రతః కృత్వా త్వత్తః సమ్మానమర్హతి. 31

ప్ర. అ. సన్తాపకర్శితా = దుఃఖముతో కృశించినదీ, వృద్ధా = వృద్ధురాలూ, మమ మాతా చ = నా తల్లి అయిన, కౌసల్యా = కౌసల్య, ధర్మమేవ = ధర్మమునే, అగ్రతః కృత్వా = ముందు ఉంచుకొని, త్వత్తః = నీవలన, సమ్మానమ్ = గౌరవమును, అర్హతి = తగియున్నది.

తా. దుఃఖముతో కృశించుచున్నదీ, వృద్ధురాలూ, నా తల్లి అయిన కౌసల్యను నీవు, ధర్మమునకే ప్రాధాన్య మిచ్చుచు గౌరవించవలెను. 31

మూ. వన్దితవ్యాశ్చ తే నిత్యం యాః శేషా మమ మాతరః,
స్నేహప్రణయసంభోగైః సమా హి మమ మాతరః. 32

ప్ర. అ. శేషాః = మిగిలిన, యాః = ఏ, మమ మాతరః = నా తల్లులు గలరో వారును, తే = నీకు, నిత్యమ్ = ఎల్లప్పుడును, వన్దితవ్యాః = నమస్క

రించ దగినవారు. మమ = నాకు, మాతరః = తల్లులందరును, స్నేహప్రణయ సంభోగైః = స్నేహముచేతను, ప్రేమచేతను, పోషణముచేతను, సమాఃహి = సమాన మైనవారే కదా।

తా. స్నేహము, ప్రేమ, పోషణము-వీటి విషయమున నాకు తల్లు లందరును సమాన మైనవారే. అందుచేత నా మిగిలిన తల్లులను గూడ నీవు ఆదరించు చుండవలెను. 32

మూ. భ్రాతృపుత్రసమౌ చాపి ద్రష్టవ్యౌ చ విశేషతః,
త్వయా భరతశత్రుఘ్నౌ ప్రాణైః ప్రియతరౌ మమ. 33

ప్ర.అ. మమ=నాకు, ప్రాణైః=ప్రాణముంచే (ప్రాణములతో సమానముగ) ప్రియతరౌ = మిక్కిలి ప్రియు లైన, భరతశత్రుఘ్నౌ = భరత శత్రుఘ్నులు, విశేషతః = విశేషించి, త్వయా = నీ చేత. భ్రాతృపుత్రసమౌ = సోదరుంవలెను, పుత్రుం వలెను, ద్రష్టవ్యౌ చ = చూడదగినవారు.

తా. విశేషించి నీవు, నా ప్రాణములతో సమాను లైన భరతశత్రుఘ్నులను. సోదరుం వలె, పుత్రుల వలె చూచుకొనవలెను.

మూ. విప్రియం న చ కర్తవ్యం భరతస్య కదాచన,
స హి రాజా ప్రభుశ్చైవ దేశస్య చ కులస్య చ. 34

ప్ర. అ. కదాచన = ఎన్నడును, భరతస్య = భరతునకు, విప్రియమ్= అనిష్టము, న కర్తవ్యమ్ = చేయదగినది కాదు. సః = అతడు, దేశస్య చ = దేశమునకును, కులస్య చ = కులమునకును,రాజా=రాజు; ప్రభుశ్చైవ=ప్రభువూ కదా।

తా. భరతుడు రాజ్యమునకు, కులమునకును గూడ రాజు; సర్వాధికారి. అందుచే అతని కెన్నడును అనిష్టము చేయగూడదు. 34

మూ. ఆరాధితా హి శీలేన ప్రయత్నైశ్చోపసేవితాః,
రాజానః సంప్రసీదన్తి ప్రకుప్యన్తి విపర్యయే. 35

ప్ర. అ. రాజానః = రాజులు, శీలేన = మంచి శీలముచే, ఆరాధితాః = సంతోషపెట్టబడినవారై, ప్రయత్నైః = ప్రయత్నములచే, ఉపసేవితాః = సేవింప

ఖచినవారై, సంప్రసీదన్తి = ప్రసన్నులగుదురు. విపర్యయే = అందుకు విరుద్ధముగా, ప్రవర్తించినచో, ప్రకుప్యన్తి = కోపగింతురు.

తా. రాజులను మంచి స్వభావముచే (నడవడికచే) సంతోషింపచేయుచు ప్రయత్న పూర్వకముగా సేవించినచో వారు ప్రసన్నులగుదురు. అట్లు కానిచో కోపింతురు. 35

మూ. ఔరసానపి పుత్రాన్హి త్యజన్త్యహితకారిణః,
సమర్థాన్ సంప్రగృహ్ణన్తి జనానపి నరాధిపాః. 36

ప్ర. అ. నరాధిపాః = రాజులు, అహితకారిణః = అహితమును చేయు, ఔరసాన్ పుత్రానపి = ఔరసపుత్రులను గూడ, త్యజన్తి = విడిచిపెట్టుదురు. సమర్థాన్ = సమర్థులైన, జనానపి = ఇతరజనులను గూడ, సంప్రగృహ్ణన్తి = స్వీకరింతురు.

తా. అహితమును చేయువారు ఔరసపుత్రులైనను వారిని రాజులు పరిత్యజింతురు. బాహ్యజనులైనను సమర్థులైనచో వారిని దగ్గరకు తీయుదురు. 36

మూ. సా త్వం వసేహ కల్యాణి రాజ్ఞః సమనువర్తినీ,
భరతస్య రతా ధర్మే సత్యవ్రతపరాయణా. 37

ప్ర. అ. కల్యాణి = మంగళస్వరూపురాలవగు ఓ సీతా! సా త్వమ్ = అట్టి నీవు, రాజ్ఞః = రాజైన, భరతస్య = భరతునకు, సమనువర్తినీ = అనుకూలముగా ఉంటున్నదానవై, ధర్మే = ధర్మమునందు, రతా = ఆసక్తి కలదానవై, సత్యవ్రతపరాయణా = సత్యవ్రతమునందు ఆసక్తి గలదానవై, ఇహ = ఇచట, వస = నివసించుము.

తా. మంగళస్వరూపురాలవైన ఓ సీతా! నీవు రాజైన భరతుని విషయమున అనుకూలముగ ప్రవర్తించుచు, ధర్మనిరతురాలవై, సత్యవ్రతమును అవలంబించి, ఇచటనే నివసింపుము. 37

మూ. అహం గమిష్యామి మహావనం ప్రియే
త్వయా హి వస్తవ్యమిహైవ భామిని.

యథా వ్యళీకం కురుషే న కస్య చిత్
తథా త్వయా కార్యమిదం వచో మమ. 38

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షడ్వింశః సర్గః.

ప్ర. అ. ప్రియే = ఓ ప్రియురాలా। కామిని = సీతా! అహమ్ = నేను, మహావనమ్ = మహావనమును గూర్చి, గమిష్యామి = వెళ్ళగలను. త్వయా = నీచేత, ఇహైవ = ఇచటనే, కస్య చిత్ = ఎవ్వనికిని, యథా = ఏ విధముగా, వ్యళీకమ్ = అపకారమును, న కురుషే = చేయవో, తథా = ఆవిధముగా, వస్తవ్యమ్ = నిరసించవలెను యున్నది. మమ = నాయొక్క, ఇదం వచః = ఈ వాక్యము, కార్యమ్ = చేయదగినది.

తా. ఓ ప్రియురాలా। నేను మహారణ్యమునకు వెళ్లెదను. నీవు మాత్రము ఎవ్వరి మనస్సునకును కష్టము కలిగింపకుండగ ఇచటనే ఉండుము. నా మాట లను వినుము.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ఇరువదియారవ సర్గ సమాప్తము.

# అథ సప్తవింశః సర్గః

["నన్ను కూడ అరణ్యమునకు తీసికొనిపొమ్ము" అని సీత రాముని ప్రార్థించుట.]

మూ. ఏవముక్తా తు వైదేహీ ప్రియార్హా ప్రియవాదినీ,
ప్రణయాదేవ సంక్రుద్ధా భర్తారమిదమబ్రవీత్. 1

ప్ర. అ. ప్రియవాదినీ = ప్రియమును పలుకునది, ప్రియార్హా = ప్రియమైన మాటలకు మాత్రమే తగినది అయిన, వైదేహీ = సీత, ఏవమ్ = ఇట్లు, ఉక్తా = పలకబడిన దై, ప్రణయాదేవ = ప్రేమవలననే, సంక్రుద్ధా = కోపించిన దై, భర్తారమ్ = భర్తను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును అబ్రవీత్ = పలికెను.

తా. ప్రియముగ మాటలాడునది, ప్రియవాక్యములకే తగినది అయిన ఆ సీత రాముని మాటలు విని, ప్రేమచేతనే కోపించిన దై, అతనితో ఇట్లనెను. 1

మూ. కిమిదం భాషసే రామ వాక్యం లఘుతయా ధ్రువమ్,
త్వయా యదపహాస్యం మే శ్రుత్వా నరవరాత్మజ. 2

ప్ర. అ. నరవరాత్మజ = రాజకుమారా! రామ = రామా! యత్ = ఏ వాక్యము, లఘుతయా = తేలి కైన దగుటచే, త్వయా = నీచేత, ధ్రువమ్ = తప్పక, అపహాస్యమ్ = పరిహసింపదగినదో, శ్రుత్వా = విని, మే = నాకు (నాచేత గూడ) పరిహసింపదగినదో అట్టి, ఇదమ్ = ఈ, కిం వాక్యమ్ = ఏమి వాక్యమును, భాషసే = మాటలాడుచున్నావు!

తా. రాజకుమారా! రామా! ఏమి టిది నీవు చెప్పుచున్నది! ఈ అర్థరహిత మైన మాటలకు నీకే తప్పక అపహాస్యము కలుగును. నీ నోటినుండి విని నాకును ఇది అపహాస్యాస్పద మగుచున్నది. 2

మూ. ఆర్యపుత్ర పితా మాతా భ్రాతా పుత్రస్తథా స్నుషా,
స్వాని పుణ్యాని భుఞ్జానాః స్వం స్వం భాగ్యముపాసతే.

ప్ర. అ. ఆర్యపుత్ర = ఓ ఆర్యపుత్రా। పితా = తండ్రి, మాతా = తల్లి, భ్రాతా = సోదరుడూ, పుత్రః = పుత్రుడూ, తథా = మరియు, స్నుషా = కోడలూ, స్వాని = తమ సంబంధ మైన, పుణ్యాని = పుణ్యములను, భుఞ్జానాః = అనుభవించుచున్నవా రై, స్వం స్వమ్ = తమ తమ, భాగ్యమ్ = భాగ్యమును (అదృష్టమును) ఉపాసతే = పొందుచున్నారు.

తా. ఆర్యపుత్రా! తండ్రి, తల్లి, సోదరుడూ, కోడలూ, మొద లైనవారు వారు వారు చేసిన పూర్వపుణ్యము ననుసరించి ఆ యా ఫలితములను అనుభవించుచుందురు. ఎవరు చేసిన పాపపుణ్యఫలములను వారే కాని ఇతరు లను భవింపరు. 3

మూ. భర్తుర్భాగ్యం తు భార్యైకా ప్రాప్నోతి పురుషర్షభ,
అతశ్చైవాహమాదిష్టా వనే వస్తవ్యమిత్యపి. 4

ప్ర. అ. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా! భర్తుర్భాగ్యం తు = భర్తయొక్క భాగ్యము నైతే, ఏకా = ఒక్క, భార్యా = భార్యయే, ప్రాప్నోతి = పొందును. అతశ్చ అకారణమువలన, అహమపి = నేనుకూడ, వనే = వనమునందు, వస్తవ్యమితి = నివసింపవలెను అని, ఆదిష్టా ఏవ = ఆజ్ఞాపింపబడినదాననే.

తా. ఓ నరశ్రేష్ఠా! భార్య ఒక్కతె మాత్రమే భర్తయొక్క భాగ్యమును పంచుకొనును. అందుచే నిన్ను వనమునకు వెళ్లవలె నని ఆజ్ఞాపించినచో, నన్ను కూడ ఆజ్ఞాపించినట్లే. 4

మూ. న పితా నాత్మజో నాత్మా న మాతా న సఖీజనః,
ఇహ ప్రేత్య చ నారీణాం పతిరేకో గతిః సదా. 5

ప్ర. అ. పితా = తండ్రి, న = గతి కాదు. ఆత్మజః = కుమారుడు, న = కాదు. ఆత్మా = తాను కూడ, న = కాదు. మాతా = తల్లి, న = కాదు. సఖీజనః = సఖీజనము, న = కాదు. నారీణామ్ = స్త్రీలకు, ఇహ = ఈ లోకమునందును, ప్రేత్య చ = మరణానంతరము గూడ, సదా = ఎల్లప్పుడును, ఏకః = ఒక్క, పతిః = భర్తయే, గతిః = గతి.

తా. స్త్రీకి తండ్రి గాని, కుమారుడు గాని, తనకు తానే గాని, తల్లి గాని, సఖురాండ్రు గాని గతి (గమ్యస్థానము లేదా గమ్యము చూపువారు) కాజాలరు. ఇహలోకమునం దైనను, మరణానంతర మైనను భర్త ఒక్కడే స్త్రీలకు ఉత్తమ గతి. 5

మూ. యది త్వం ప్రస్థితో దుర్గం వనమద్యైవ రాఘవ,
అగ్రతస్తే గమిష్యామి మృద్నన్తీ కుశకణ్టకాన్. 6

ప్ర. అ. రాఘవ=రామా! అద్యైవ=ఇప్పుడే, త్వమ్=నీవు, దుర్గమ్=ప్రవేశింప శక్యము కాని, వనమ్=వనమును గూర్చి, ప్రస్థితః యది=ప్రయాణ మైనచో, కుశకణ్టకాన్=కుశలను కంటకములను, మృద్నన్తీ=నలగగొట్టుచు, తే అగ్రతః=నీ ఎదుట, గమిష్యామి=వెళ్ళగలను.

తా. రామా! నీ విపుడే దుర్గమారణ్యమునకు ప్రయాణ మైనచో, నేను గూడ నీ ముందే నడచుచు, దర్భలను కంటకములను నలగగొట్టి, నీవు నడచుటకు సుఖముగా నుండు నట్లు చేసెదను. 6

మూ. ఈర్ష్యారోషౌ బహిష్కృత్య భుక్తశేషమివోదకమ్,
నయ మాం వీర విస్రబ్ధః పాపం మయి న విద్యతే. 7

ప్ర. అ. వీర=ఓ వీరుడా! ఈర్ష్యారోషౌ=ఈర్ష్యను (ఓర్పులేకపోవుట) రోషమును, భుక్తశేషమ్=త్రాగగా మిగిలిన, ఉదకమ్ ఇవ=ఉదకమును వలె, బహిష్కృత్య=విడచి, విస్రబ్ధః=విశ్వాసము కలవాడవై, మామ్=నన్ను, నయ=తీసికొని వెళ్ళుము. మయి=నాయందు, పాపమ్=పాపము, న విద్యతే=లేదు.

తా. వీరా! నేను నీ మాట మన్నించనందులకు కలుగు ఈర్ష్యను రోషమును, త్రాగగా మిగిలిన జలమును పరిత్యజించి నట్లు పరిత్యజించి, నన్ను కూడ తీసికొని వెళ్ళుము. నాయందు ఎట్టి పాపము లేదు. నీ కేమియు కష్టము కలుగదు. అందుచే నమ్మకముతో తీసికొని వెళ్ళుము.

మూ. ప్రాసాదాగ్రైర్విమానైర్వా వైహాయసగతేన వా,
సర్వావస్థాగతా భర్తుః పాదచ్ఛాయా విశిష్యతే. 8

ప్ర. అ. ప్రాసాదాగ్రైః=మేడల శిఖరములతో గాని, విమానైర్వా=విమానములతో గాని, వైహాయసగతేన వా=ఆకాశసంచారముతో గాని పోవుగా, లేదా ప్రాసాదాగ్రాదులం దున్నపుడు కూడ, సర్వావస్థాగతా=అన్ని అవస్థలయందును లభించు, భర్తుః=భర్తయొక్క, పాదచ్ఛాయా=పాదముల నీడ, విశిష్యతే=విశిష్టమైనది.

తా. మేడలమీద నివాసముకంటెను, విమానములకంటెను (ఇచట విమానమనగా అత్యుత్తమ మైన భవన మని అర్థము), ఆకాశసంచారముకంటెను, లేదా ప్రాసాదాగ్రనివాసాదిసమయములందు కూడ, అన్ని అవస్థలందును భర్త పాదచ్ఛాయయే విశిష్ట మైనది. 8

మూ. అనుశిష్టా చ మాత్రా చ పిత్రా చ వివిధాశ్రయమ్,
నాస్మి సంప్రతి వక్తవ్యా వర్తితవ్యం యథా మయా. 9

ప్ర. అ. మాత్రా చ=తల్లిచేతను, పిత్రా చ=తండ్రిచేతను, వివిధాశ్రయమ్=అనేకవిషయములను గూర్చి, అనుశిష్టా=బోధింపబడితిని. మయా=నాచేత, యథా=ఎట్లు, వర్తితవ్యమ్=ప్రవర్తించవలెనో, సంప్రతి=ఇప్పుడు, వక్తవ్యా=చెప్పదగినదానను, నాస్మి=కాను.

తా. అనేకవిషయములను గూర్చి నా తలిదండ్రులు నాకు పూర్వమే ఉపదేశించి ఉన్నారు. అందుచే నే నెట్లు నడచుకొనవలెనో, ఇప్పుడు, నా కెవ్వరును చెప్ప పని లేదు. 9

మూ. అహం దుర్గం గమిష్యామి వనం పురుషవర్జితమ్,
నానామృగగణాకీర్ణం శార్దూలవృకసేవితమ్. 10

ప్ర. అ. అహమ్=నేను, దుర్గమ్=ప్రవేశింపకష్ట మైనదీ, పురుషవర్జితమ్=జనశూన్యమూ, నానామృగగణాకీర్ణమ్=అనేకవిధము లైన మృగసముదాయముతో నిండినదీ, శార్దూలవృకసేవితమ్=పులులచేతను, తోడేళ్లచేతను ఆశ్రయింపబడినదీ అయిన, వనమ్=వనమును గూర్చి, గమిష్యామి=వెళ్లగలను

తా. జనశూన్యమూ వివిధము లైన మృగగణములతో నిండినవీ, పులులు, తోడేళ్లు మొదలైనవాటికి నివాసమూ, దుర్గమమూ అయిన అరణ్యమునకు నేను గూడ వచ్చెదను. 10

మూ. సుఖం వనే నివత్స్యామి యథైవ భవనే పితుః,
అచిన్తయన్తీ త్రీన్ లోకాన్ చిన్తయన్తీ పతివ్రతమ్. 11

ప్ర. అ. త్రీన్ లోకాన్ = మూడు లోకములను గూర్చి, అచిన్తయన్తీ = ఆలోచించనిదాననై, పతివ్రతమ్ = భర్తకు సంబంధించిన శుశ్రూషాదివ్రతమునే, చిన్తయన్తీ = ఆలోచించుచున్నదాననై, వనే = వనమునందు, పితుః = తండ్రియొక్క, భవనే = గృహమునందు, యథైవ = ఎట్లో అట్లు, సుఖమ్ = సుఖముగా, నివత్స్యామి = నివసించెదను.

తా. నాకు మూడులోకములలో ఉన్న ఏ వస్తువును గూర్చియు చింత ఉండదు. కేవలము పతిశుశ్రూషాదివ్రత మాచరించుచు, అడవియందు, పుట్టింట నున్నట్లు సుఖముగా ఉండెదను. 11

మూ. శుశ్రూషమాణా తే నిత్యం నియతా బ్రహ్మచారిణీ,
సహ రంస్యే త్వయా వీర వనేషు మధుగన్ధిషు. 12

ప్ర. అ. వీర = ఓ వీరా! నిత్యమ్ = నిత్యమూ, తే = నీకు, శుశ్రూషమాణా = శుశ్రూష చేయుచూ, నియతా = నియమవంతురాల నై, బ్రహ్మచారిణీ = బ్రహ్మచర్యవ్రత మవలంబించి, మధుగన్ధిషు = తేనెల సువాసనలు గల, వనేషు = వనములందు, త్వయా సహ = నీతో కూడ, రంస్యే = క్రీడించ గలను.

తా. నిత్యమూ నీ సేవచేయుచు, నియమపూర్వకముగ బ్రహ్మచర్యమును అవలంబించి, తేనెల సువాసనలతో నిండిన అరణ్యములలో నీతో విహరింతును.

మూ. త్వం హి శక్తో వనే కర్తుం రామ సంపరిపాలనమ్,
అన్యస్యాపి జనస్యేహ కిం పునర్మమ మానద. 13

ప్ర. అ. మానద = మానమును (గౌరవమును) ఇచ్చువాడా, రామ = రామా, త్వమ్ = నీవు, ఇహ = ఇచట, వనే = వనమునందు, అన్యస్య = ఇతరుడైన, జనస్య = ఇనుని యొక్క, సంపరిపాలనమపి = రక్షణమును కూడ, కర్తుమ్ = చేయుటకు, శక్తః హి = సమర్థుడవు కదా! మమ = నాయొక్క రక్షణమును గూర్చి, కిం పునః = చెప్పనేల.

తా. అందరి గౌరవమును రక్షించుచు ఓ రామా! నీవు అరణ్యములో ఇతరులను గూడ సంరక్షించుటకు సమర్థుడవు. ఇంక నా మాట చెప్పవలెనా? 13

మూ. సహ త్వయా గమిష్యామి వనమద్య న సంశయః,
నాహం శక్యా మహాభాగ నివర్తయితు ముద్యతా. 14

ప్ర. అ. అద్య = నేడు, త్వయా సహ = నీతో గూడ, వనమ్ = వనమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను. సంశయః = సంశయము, న = లేదు. మహాభాగ = మహాభాగ్యవంతుడా! ఉద్యతా = వనమునకు వచ్చుటకై ఉద్యమించిన, అహమ్ = నేను, నివర్తయితుమ్ = మరల్చుటకు, న శక్యా = శక్య మైన దానను కాను.

తా. ఈ రోజున నీతో కూడ వనమునకు వచ్చెదను. సందేహము లేదు. ఓ మహాభాగ్యవంతుడా! ఈ విధముగ నిర్ణయించుకొన్న నన్నెవ్వరును మరల్పజాలరు. 14

మూ. ఫలమూలాశనా నిత్యం భవిష్యామి న సంశయః,
న తే దుఃఖం కరిష్యామి నివసన్తీ సహ త్వయా. 15

ప్ర. అ. నిత్యమ్ = ఎల్లప్పుడును, ఫలమూలాశనా = ఫలమూలములను భుజించు దానను, భవిష్యామి = కాగలను. సంశయః = సంశయము, న = లేదు. త్వయా సహ = నీతో కూడ. నివసన్తీ = నివసించుచున్న దాన నై, తే = నీకు, దుఃఖమ్ = దుఃఖమును, న కరిష్యామి = చేయను.

తా. నేను నిస్సంశయముగ నిత్యము ఫలమూలములను మాత్రమే భుజించెదను. నీకు ఏ మాత్రము దుఃఖము కలిగింపకుండ నీతో కలిసి నివసింతును.

మూ. ఇచ్ఛామి సరితశ్శైలాన్ పల్వలాని వనాని చ,
ద్రష్టుం సర్వత్ర నిర్భీతా త్వయా నాథేన ధీమతా. 16

ప్ర. అ. ధీమతా = బుద్ధిమంతుడవును, నాథేన = నాథుడవును అయిన, త్వయా = నీతో కలిసి యుండి, సర్వత్ర = అంతటను, నిర్భీతా = భయపడని దాననై, సరితః = నదులను, శైలాన్ = పర్వతములను, పల్వలాని = చిన్న సరస్సులను, వనాని చ = వనములను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. నీ ప్రక్కనే ఉండుటచే ఎచటను భయ మేమియు లేనిదాననై, నదులను శైలములను చిన్న చెరువులను వనములను చూడవలె నని కోరుచున్నాను.

మూ. హంసకారణ్డవాకీర్ణాః పద్మినీః సాధుపుష్పితాః,
ఇచ్ఛేయం సుఖినీ ద్రష్టుం త్వయా వీరేణ సంగతా. 17

ప్ర. అ. వీరేణ = వీరుడ వైన, త్వయా = నీతో, సంగతా = కూడిన దాన నై, సుఖినీ = సుఖవంతురాల నై, హంసకారణ్డవాకీర్ణాః = హంసలతోను కారండవ పక్షులతోను వ్యాప్త మైన, సాధు = చక్కగా, పుష్పితాః = పుష్పించిన, పద్మినీః = పద్మసరస్సులను, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛేయమ్ = ఇచ్ఛయింతును.

తా. వీరుడ వైన నీ దగ్గర నుండి సుఖవంతురాలనై, హంసలతోనూ కారండవపక్షులతోనూ కూడిన, చక్కగా పుష్పించిన పద్మ సరస్సులను చూడవలె నని కోరుచున్నాను. 17

మూ. అభిషేకం కరిష్యామి తాసు నిత్యం యతవ్రతా,
సహ త్వయా విశాలాక్ష రంస్యే పరమనన్దినీ. 18

ప్ర. అ. విశాలాక్ష = విశాల మైన నేత్రములు కలవాడా! యతవ్రతా = దృఢ మైన నియమము కలదాన నై, నిత్యమ్ = ఎల్లప్పుడును, తాసు = ఆ పద్మ సరస్సులందు, అభిషేకమ్ = స్నానమును, కరిష్యామి = చేయగలను. పరమనన్దినీ = గొప్ప ఆనందము గలదాననై, త్వయా సహ = నీతో కూడ, రంస్యే = క్రీడించెదను.

తా. విశాల మైన నేత్రములు గల ఓ రామా! స్థిర మైన వ్రత మాచరించుచు, నిత్యము ఆ తామరకొలనులలో స్నానము చేయుచు, గొప్ప ఆనందము కలదాననై సీతో క్రీడించెదను. 18

మూ. ఏవం వర్షసహస్రాణాం శతం వాపి త్వయా సహ,
వ్యతిక్రమం న వేత్స్యామి స్వర్గోఽపి హి న మే మతః.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగ, అహమ్ = నేను, త్వయా సహ = నీతో కూడ, వర్షసహస్రాణామ్ = వేయి సంవత్సరముల, శతం వాపి = శతమును గడపినను గూడ, వ్యతిక్రమమ్ = దీనికి విరుద్ధ మగు పద్ధతిని, న వేత్స్యామి =

ఎరుగలేను. మే = నాకు, స్వర్గోఽపి = స్వర్గముకూడ, న మతః హి = ఇష్టము కాదు కదా.

తా. ఈ విధముగ నీ సాంగత్యమునం దుండి లక్షసంవత్సరము లైనను సుఖసంతోషాదులతో ఎట్టి మార్పును చూడలేను. నీవు లేని స్వర్గ మైనను నా కిష్టము కాదు. 19

మూ. స్వర్గేఽపి చ వినా వాసో భవితా యది రాఘవ,
త్వయా మమ నరవ్యాఘ్ర నాహం తమపి రోచయే. 20

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరులలో శ్రేష్ఠుడ వైన, రాఘవ = రామా! త్వయా వినా = నీవు లేకుండ, మమ = నాకు, స్వర్గేఽపి = స్వర్గమునందు కూడ, వాసః = నివాసము, భవితా యది = కానున్నలో, అహమ్ = నేను, తమపి = దానిని కూడ, న రోచయే = ఇష్టపడను.

తా. నరులలో శ్రేష్ఠుడ వైన ఓ రామా! నీవు లేకుండ స్వర్గనివాసము కూడ నాకు ఇష్టము కాజాలదు. 20

మూ. అహం గమిష్యామి వనం సుదుర్గమం
మృగాయుతం వానరవారణైర్యుతమ్,
వనే నివత్స్యామి యథా పితుర్గృహే
తవైవ పాదావుపగృహ్య సంయతా. 21

ప్ర. అ. అహమ్ = నేను, సుదుర్గమమ్ = మిక్కిలి దుర్గమ మైనదీ, మృగాయుతమ్ = మృగములతో కూడినదీ, వానరవారణైః = వానరములతోను, ఏనుగులతోను కూడినదీ అయిన, వనమ్ = వనమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను. తవ = నీయొక్క, పాదావేవ = పాదములనే, ఉపగృహ్య = గ్రహించి, సంయతా = నియమవంతురాల నై, వనే = వనమునందు, పితుః = తండ్రియొక్క, గృహే యథా = గృహమునందు వలె, నివత్స్యామి = నివసించగలను.

తా. మృగములతోనూ, వానరములతోనూ, గజములతోనూ నిండినదై, ప్రవేశించుటకు చాల కష్ట మైన అరణ్యమునకు వచ్చి, నియమవంతురాలనై, నీ

పాదములనే పట్టుకొని, ఆ అరణ్యములో పుట్టింట నున్నట్లు సుఖముగా నివ
సించెదను. 21

మూ. అనన్యభావామనురక్తచేతసం
త్వయా వియుక్తాం మరణాయ నిశ్చితామ్,
నయస్వ మాం సాధు కురుష్వ యాచనాం
న తే మయాఽతో గురుతా భవిష్యతి. 22

ప్ర. అ. అనన్యభావామ్ = మరియొక భావ మేదియు లేనిదానను, అను
రక్తచేతసమ్ = నీయందు అనురాగము గల చిత్తము కలదానను, త్వయా =
నీతో, వియుక్తామ్ = వియోగమును చెందినచో, మరణాయ = మరణముకొరకు,
నిశ్చితామ్ = నిశ్చయించుకొన్నదానను అయిన, మామ్ = నన్ను, నయస్వ =
తీసికొనివెళ్ళుము. యాచనామ్ = నా ప్రార్థనను, సాధు = బాగుగా, కురుష్వ =
చేయుము. అతః = దీనివలన, తే = నీకు, మయా = నాచే, గురుతా = భారము,
న భవిష్యతి = కాబోదు.

తా. ఇతరభావము లేవియు లేక నీయందే అనురాగము గల చిత్తముతో
నున్న నేను నీతో వియోగ మేర్పడిన పక్షమున మరణించవలె నని నిశ్చయించు
కొంటిని. అందుచే నన్ను తీసికొని వెళ్ళుము. నా కోరికను బాగుగా మన్నింపుము.
ఇట్లు చేయుటచే నావలన నీ కేమియు బరువు కలగబోదు. 22

మూ. తథా బ్రువాణామపి ధర్మవత్సలో
న చ స్మ సీతాం నృవరో నినీషతి,
ఉవాచ చైనాం బహు సన్నివర్తనే
వనే నివాసస్య చ దుఃఖితాం ప్రతి. 23

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తవింశః సర్గః.

ప్ర. అ. ధర్మవత్సలః = ధర్మమునందు ప్రీతి కల, నృవరః = ఆ నర
శ్రేష్ఠుడు, తథా = ఆ విధముగా, బ్రువాణామపి = మాటలాడుచున్నను, సీతామ్
= సీతను, న నినీషతి స్మ = తీసికొని వెళ్ళుటకు ఇష్టపడలేదు. సంనివర్తనే =

ఆమెను మరల్చుట విషయమై, ఏనామ్ = ఆమెను గూర్చి, వనే = వనమునందు, నివాసస్య = నివాసముయొక్క, దుఃఖితాం ప్రతి = దుఃఖకర మను విషయమును గూర్చి, బహు = అత్యధికముగా, ఉవాచ చ = పలికెను కూడ.

తా. సీత ఇట్లు పలుకుచున్నను, ధర్మాత్ము డగు రాముడు ఆమెను తీసికొని వెళ్ళుటకు అంగీకరించలేదు. ఆమెను వనగమన ప్రయత్నమునుండి మరల్చుటకై వనవాసమునం దుండు దుఃఖములను గూర్చి ఆమెకు ఎక్కువగా చెప్ప మొదలిడెను. 28.

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో అరువదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టావింశః సర్గః

[శ్రీరాముడు వనవాసమందలి క్లేశములను వర్ణించుట, సీతను వనమునకు రావలదని వారించుట].

మూ. స ఏవం బ్రువతీం సీతాం ధర్మజ్ఞో ధర్మవత్సలః,
న నేతుం కురుతే బుద్ధిం వనే దుఃఖాని చిన్తయన్. 1

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మము తెలిసినవాడూ, ధర్మవత్సలః = ధర్మమునందు ప్రీతికలవాడూ అయిన, సః = రాముడు, ఏవమ్ = ఇట్లు, బ్రువతీమ్ = పలుకుచున్న, సీతామ్ = సీతను, నేతుమ్ = తీసికొని వెళ్లుటకు, బుద్ధిమ్ = బుద్ధిని, వనే = వనమునందలి, దుఃఖాని = దుఃఖములను గూర్చి, చిన్తయన్ = ఆలోచించుచు, న కురుతే = చేయలేదు.

తా. ధర్మజ్ఞుడూ, ధర్మతత్పరుడూ అయిన ఆ రాముడు, వనములలో కలుగు దుఃఖములను గూర్చి ఆలోచించుచు సీత ఈ విధముగ మాటలాడుచున్నను, ఆమెను తీసికొనివెళ్లుటకు అంగీకరించలేదు. 1

మూ. సాన్త్వయిత్వా పునస్తాం తు బాష్పదూషితలోచనామ్,
నివర్తనార్థే ధర్మాత్మా వాక్యమేతదువాచ హ. 2

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడైన రాముడు, బాష్పదూషితలోచనామ్ = కన్నీటితో దూషితమైన నేత్రములు గల, తామ్ = ఆమెను, సాన్త్వయిత్వా = ఓదార్చి, నివర్తనార్థే = ఆమెను మరల్చుటకై, పునః = మరల, ఏతత్ = ఈ, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ హ = పలికెను.

తా. ధర్మాత్ముడైన రాముడు, కన్నీటితో నిండిన నేత్రములు గల ఆ సీతను ఓదార్చి, ఆమెను వనగమనోద్యమమునుండి మరల్చుటకై మరల ఇట్లు పలికెను. 2

మూ. సీతే మహాకులీనాసి ధర్మే చ నిరతా సదా,
ఇహాచర స్వధర్మం త్వం మే యథా మనసః సుఖమ్. 3

ప్ర. అ. సీతే=సీతా! మహాకులీనా=ఉత్తమకులమునందు పుట్టినదానవు, సదా=ఎల్లప్పుడును, ధర్మే=ధర్మమునందు, నిరతా = ఆసక్తురాలవు, అసి = అయియున్నావు. ఇహ = ఇచటనే, యథా = ఎట్లు, మే మనసః=నా మనస్సునకు, సుఖమ్ = సుఖము కలుగునో ఆ విధముగ, త్వమ్=నీవు, స్వధర్మమ్=స్వధర్మమును, ఆచర=ఆచరించుము.

తా. సీతా! నీవు ఉత్తమకులమునందు పుట్టినదానవు. సర్వదా ధర్మతత్పరురాలవు. నీవు ఇచటనే ఉండి, నీ స్వధర్మము నాచరించుచున్నచో నా మనస్సునకు సుఖము కలుగును. 3

మూ సీతే యథా త్వాం వక్ష్యామి తథా కార్యం త్వయాబలే,
వనే హి బహవో దోషా వదతస్తాన్నిబోధ మే. 4

ప్ర. అ. అబలే = దుర్బలురాల వైన, సీతే = సీతా, త్వామ్ = నిన్ను గూర్చి, యథా = ఎట్లు, వక్ష్యామి = చెప్పగలనో, తథా = అట్లు, త్వయా = నీచేత, కార్యమ్ = చేయదగినది. వనే = వనమునందు, బహవః = అనేక మైన, దోషాః హి=దోషము లుండును గదా. వదతః=చెప్పుచున్న, మే=నానుండి, తాన్=ఆ దోషములను గూర్చి, నిబోధ=తెలిసికొనుము.

తా. అబల వైన ఓ సీతా! నేను చెప్పి నట్లు చేయుము. అరణ్యములో అనేకకష్టము లుండును. అవి ఏవో చెప్పెదను; వినుము. 4

మూ. సీతే విముచ్యతామేషా వనవాసకృతా మతిః,
బహుదోషం హి కాన్తారం వనమిత్యభిధీయతే 5

ప్ర. అ. సీతే=సీతా! వనవాసకృతా=వనవాసమును గూర్చి చేయబడిన, ఏషా=ఈ, మతిః=ఆలోచన, విముచ్యతామ్=విడువబడుగాక. కాన్తారమ్ = ప్రవేశింపశక్యము కాని, వనమ్=వనము, బహుదోషయుతమ్ = అనేకదోషములతో కూడినదిగా, అభిధీయతే హి = చెప్పబడుచున్నది కదా.

తా. సీతా! వనమునకు వెళ్లవలెనను ఆలోచన విడువుము. ప్రవేశింప శక్యము కాని అరణ్యమునందు ఎన్నో దోషము లున్నట్లు జను లందరును చెప్పుచుందురు కదా. 5

మూ. హితబుద్ధ్యా ఖలు వచో మయైతదభిధీయతే,
సదా సుఖం న జానామి దుఃఖమేవ సదా వనమ్. 6

ప్ర. అ. మయా=నాచేత, ఏతత్ వచః = ఈ వచనము, హితబుద్ధ్యా = హిత మను అభిప్రాయముచేతనే, అభిధీయతే హి = చెప్పబడుచున్నది కదా. వనమ్ = వనమును, సదా = ఎన్నడును, సుఖమ్ = సుఖకరమైనదానినిగా, న జానామి = ఎరుగను. సదా=ఎల్లపుడును, దుఃఖమేవ=దుఃఖకరమే.

తా. నేను నీ హితమును కోరియే ఇట్లు చెప్పుచున్నాను. వనము సర్వదా దుఃఖనిలయము. అచట సుఖ మెన్నడును కలుగదు. 6

మూ. గిరినిర్ఝరసంభూతా గిరికన్దరవాసినామ్,
సింహానాం నినదా దుఃఖాః శ్రోతుం దుఃఖమతో వనమ్. 7

ప్ర. అ. గిరినిర్ఝరసంభూతాః=కొండలనుండి వడుచున్న జలప్రవాహములనుండి పుట్టిన, నినదాః=ధ్వనులును, గిరికన్దరవాసినామ్=పర్వతగుహలలో నివసించుచున్న, సింహానామ్ = సింహములయొక్క ధ్వనులును, శ్రోతుమ్ = వినుటకు, దుఃఖాః = దుఃఖకర మైనవి. అతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖమ్ = దుఃఖకర మైనది.

తా. పర్వతమునుండి వడు చున్న సెలయేళ్ల ధ్వనులును, పర్వతగుహలలో నివసించు సింహముల గర్జనలును వినుటకు భయంకరముగా నుండును. అందుచే వనము దుఃఖకర మైనది. 7

మూ. క్రీడమానాశ్చ విస్రబ్ధా మత్తాః శూన్యే మహామృగాః,
దృష్ట్వా సమభివర్తన్తే సీతే దుఃఖమతో వనమ్. 8

ప్ర. అ. విస్రబ్ధాః = నిర్భయములై, మత్తాః=మదించినవై, శూన్యే = జనశూన్య మైన అరణ్యమునందు, క్రీడమానాః=క్రీడించుచున్న, మహామృగాః= పెద్ద మృగములు, దృష్ట్వా = చూడగనే, సమభివర్తన్తే = మీదికి వచ్చును.

సీతే=ఓ సీతా! అతః=ఆ కారణమువలన, వనమ్=వనము, దుఃఖమ్=దుఃఖకర మైనది.

తా. మత్తెక్కి, శూన్యారణ్యములో నిర్భయముగా క్రీడించుచున్న క్రూర మృగములు మనుష్యులను చూడగానే మీదికి వచ్చును. అందుచే వనము దుఃఖ నిలయము. 8

మూ. సగ్రాహాః సరితశ్చైవ పఙ్కవత్యశ్చ దుస్తరాః,
మత్తైరపి గజైర్నిత్యమతో దుఃఖతరం వనమ్. 9

ప్ర. అ. సగ్రాహాః = మొసళ్ళతో కూడినవి, పఙ్కవత్యః చ = బురదతో నిండినవీ అయిన, సరితశ్చైవ = నదులు కూడ, మత్తైః = మదించిన, గజైరపి =ఏనుగులచేత గూడ, దుస్తరాః = దాట శక్యము కానివి. అతః = అందువలన, వనమ్ = వనము, నిత్యమ్ = ఎల్లప్పుడును, దుఃఖతరమ్ = మిక్కిలి దుఃఖ జనకము.

తా. నదులు మొసళ్లతోను, బురదతోను, మదించిన ఏనుగులు కూడ దాటుటకు శక్యము కాని విధముగ నుండును. అందువలన అరణ్యము సర్వదా దుఃఖమును కలిగించును. 9

మూ. లతాకణ్టకసంపూర్ణాః కృకవాకూపనాదితాః,
నిరపాశ్చ సుదుర్గాశ్చ మార్గా దుఃఖమతో వనమ్. 10

ప్ర. అ. మార్గాః=మార్గములు, లతాకణ్టకసంపూర్ణాః=తొంతలతోను ముళ్ల తోను నిండినవై, కృకవాకూపనాదితాః=అడవికోళ్ళ ధ్వనులతో ప్రతిధ్వనించుచు, నిరపాః = ఉదకము లేనివై, సుదుర్గాః చ = ఏ మాత్రము ప్రవేశింప శక్యము కాకుండ ఉండును. అతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖమ్ = దుఃఖకరము.

తా. మార్గము లన్నియు తొంతలతోను, ముండ్లతోను నిండి యుండును. అడవి కోళ్ల కూతలు ప్రతిధ్వనించుచుండును. జలము లభించదు. ఈ విధముగ

అరణ్యము ప్రవేశించుటకు చాల కష్టముగా నుండును. అందుచే వనవాసము చాల కష్టమైనది. 10

మూ. సుప్యతే పర్ణశయ్యాసు స్వయం భగ్నాసు భూతలే,
రాత్రిషు శ్రమఖిన్నేన తస్మాద్దుఃఖతరం వనమ్. 11

ప్ర. అ. స్వయమ్ = స్వయముగనే, భగ్నాసు = విరిగి (రాలి) పడిన, పర్ణశయ్యాసు = ఆకుల శయ్యలపై, భూతలే = నేలమీద, శ్రమఖిన్నేన = శ్రమతో ఖిన్నుడైనవాడు, రాత్రిషు = రాత్రులందు, సుప్యతే = నిద్రించవలసియుండును. తస్మాత్ = ఆకారణమువలన, వనమ్ = వనము, దుఃఖతరమ్ = చాల దుఃఖమును కలిగించునది.

తా. పగ లంతయు శ్రమపడి, రాత్రులందు, తామంతటాముగా రాలి పడిన ఆకుల పక్కలపై, నేలమీద పరుండవలసి యుండును. అందుచే అరణ్య నివాసము చాల కష్టము. 11

మూ. అహోరాత్రం చ సన్తోషః కర్తవ్యో నియతాత్మనా,
ఫలైర్వృక్షావపతితైః సీతే దుఃఖమతో వనమ్. 12

ప్ర. అ. సీతే = ఓ సీతా! అహోరాత్రమ్ = పగలు రాత్రియందును, నియతాత్మనా = నియమముతో కూడిన మనస్సు కలవాడై, వృక్షావపతితైః = వృక్షమునుండి పడిన, ఫలైః = ఫలములతో, సన్తోషః = సంతోషము, కర్తవ్యః = చేయదగినది. అతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖమ్ = దుఃఖకరము.

తా. రేయింబగళ్ళు నియమము నవలంబించి, తమంతట తాముగా చెట్ల నుండి రాలిన ఫలములతో తృప్తి నెందవలసి యుండును. అందువలన అరణ్యము నందు నివాసము కష్టము. 12

మూ. ఉపవాసశ్చ కర్తవ్యో యథాప్రాణేన మైథిలి,
జటాభారశ్చ కర్తవ్యో వల్కలామ్బరధారిణా. 13

ప్ర. అ. మైథిలి = సీతా! యథాప్రాణేన = శక్త్యనుసారముగా, ఉపవాసశ్చ = ఉపవాసము కూడ, కర్తవ్యః = చేయదగినది. వల్కలామ్బరధారిణా = నార చీరలను ధరించి, జటాభారశ్చ = జటాభారము కూడ, కర్తవ్యః = చేయదగినది.

తా. అరణ్యములో నివసించువారు యథాశక్తిగా ఉపవాసము చేయుచు, నారచీరలను, జటాభారమును, ధరించవలసి యుండును. అందువలన అరణ్య నివాసము కష్టము. 13

మూ. దేవతానాం పితౄణాం చ కర్తవ్యం విధిపూర్వకమ్,
ప్రాప్తానామతిథీనాం చ నిత్యశః ప్రతిపూజనమ్. 14

ప్ర. అ. దేవతానామ్=దేవతలకును, పితౄణాం చ=పితృదేవతలకును, ప్రాప్తానామ్ = వచ్చిన, అతిథీనాం చ = అతిథులకును, విధిపూర్వకమ్ = యథా శాస్త్రముగా, నిత్యశః = ఎల్లప్పుడును, ప్రతిపూజనమ్ = పూజ, కర్తవ్యమ్ = చేయదగినది.

తా. దేవతలనూ, పితృదేవతలనూ, వచ్చిన అతిథులనూ, నిత్యము యథా విధిగా పూజించుచుండవలెను. 14

మూ. కార్యస్త్రిరభిషేకశ్చ కాలే కాలే చ నిత్యశః,
చరతా నియమేనైవ తస్మాద్దుఃఖతరం వనమ్. 15

ప్ర. అ. నియమేనైవ=నియమముతో, చరతా = సంచరించుచున్న వన వాసిచేత, నిత్యశః = ప్రతిదినమూ, కాలే కాలే = ఆ యా కాలమునందు, త్రిః = మూడు పర్యాయములు, అభిషేకః=స్నానము, కార్యః=చేయదగినది. తస్మాత్ = ఆ కారణమువలన, వనమ్=వనము, దుఃఖతరమ్ = చాల కష్టము నిచ్చునది.

తా. వనమునందు నివసించువారు సర్వదా నియమవరులై ఆ యా కాలము లందు, ప్రతిదినము, మూడు పర్యాయములు స్నానము చేయవలసియుండును. అందుచే వనవాసము చాల కష్టము. 15

మూ. ఉపహారశ్చ కర్తవ్యః కుసుమైః స్వయమాహృతైః,
ఆర్షేణ విధినా వేద్యాం బాలే దుఃఖమతో వనమ్. 16

ప్ర. అ. బాలే=అమాయకురాలైన ఓ సీతా! స్వయమ్ = స్వయముగా, ఆహృతైః = తీసికొనిరాబడిన, కుసుమైః=పుష్పములతో, ఆర్షేణ విధినా = ఋషి ప్రోక్తమైన విధానముతో, వేద్యామ్ = వేదికయందు, ఉపహారశ్చ = పూజ,

కర్తవ్యః = చేయదగినది. అతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖమ్ = దుఃఖకర మైనది.

తా. ఓ సీతా! స్వయముగా పుష్పములు కోసి తెచ్చి, వేదికపై, ఋషిప్రోక్త విధానానుసారముగ, పూజ చేయవలసి యుండును. అందువలన వనవాసము దుఃఖకరము. 16

మూ. యథాలబ్ధేన కర్తవ్యః సన్తోషస్తేన మైథిలి,
యథాహారై ర్వనచరైః సీతే దుఃఖమతో వనమ్ 17

ప్ర. అ. మైథిలి = సీతా! వనచరైః = వనమునందు సంచరించువారిచేత, యథాహారైః=నియమిత మైన ఆహారము కలవారుగా ఉండి, యథాలబ్ధేన=ఎంత లభించునో, తేన=అంత ఫలాదికముతో, సన్తోషః=సంతోషము, కర్తవ్యః = చేయదగినది. అతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖమ్ = దుఃఖకరము.

తా. సీతా! వనములో నివసించువారు నియతాహారులై, లభించినదానితో తృప్తి పడవలసి యుండును. అందువలన వననివాసము కష్ట మైనది. 17

మూ. అతీవ వాతాస్తిమిరం బుభుక్షా చాత్ర నిత్యశః,
భయాని చ మహాన్త్యత్ర తతో దుఃఖతరం వనమ్. 18

ప్ర. అ. అత్ర = వనమునందు, వాతాః = గాలియు, తిమిరమ్ = చీకటియు, అతీవ = అత్యధికముగా నుండును. నిత్యశః = ఎల్లప్పుడును, బుభుక్షా = ఆకలి యుండును. మహాన్తి=గొప్ప, భయాని చ=భయములుకూడ ఉండును. అతః= అందువలన, వనమ్=వనము, దుఃఖతరమ్ = మిక్కిలి దుఃఖము కలిగించును.

తా. అరణ్యములో పెను గాలులు వీచుచుండును. చీకటి దట్టముగా ఉండును. సర్వదా ఆకలి బాధ కలుగుచుండును. అనేక మైన భయ హేతువులు కూడ ఉండును. అందువలన అరణ్యము దుఃఖకరము. 18

మూ. సరీసృపాశ్చ బహవో బహురూపాశ్చ భామిని,
చరన్తి పృథివీం దర్పాత్తతో దుఃఖతరం వనమ్. 19

ప్ర. అ. భామిని = ఓ సీతా! బహురూపాః = అనేక విధము లైన రూపములు గల, బహవః = అనేక మైన, సరీసృపాః = సర్పములు మొదలగు

ప్రాణులు జంతువులు. దర్పాత్ = గర్వమువలన (తో), పృథివీమ్ = భూమిని చరన్తి = సంచరించుచుండును. తతః = ఆ కారణమువలన, వనమ్ = వనము, దుఃఖతరమ్ = చాల దుఃఖకర మైనది.

తా. సీతా! వివిధరూపములలో నున్న అనేకము లగు సరీసృపములు. గర్వముతో (నిర్భయముగ) భూమిపై సంచరించుచుండును. అందువలన అరణ్య నివాసము చాల కష్టము. 19

మూ. నదీనిలయనాః సర్పా నదీకుటిలగామినః,
తిష్ఠన్త్యావృత్య పన్థానం తతో దుఃఖతరం వనమ్. 20

ప్ర. అ. నదీనిలయనాః = నదులే నివాసస్థానముగా గలవీ, నదీకుటిల గామినః = నదుల వలె వంకరగా నడచు నవీ అయిన, సర్పాః = సర్పములు, పన్థానమ్ = మార్గమును, ఆవృత్య = అడ్డగించి, తిష్ఠన్తి = ఉండును. తతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖతరమ్ = చాల దుఃఖకరము.

తా. నదులలో నివసించుచు, నదుల వలె వంకరగా నడచు సర్పములు మార్గము నడ్డగించుచుండును. అందువలన వనము దుఃఖకరము. 20

మూ. పతఙ్గా వృశ్చికాః కీటా దంశాశ్చ మశకైః సహ,
బాధన్తే నిత్యమబలే సర్వం దుఃఖమతో వనమ్. 21

ప్ర. అ. అబలే = దుర్బలురాల వైన ఓ సీతా! పతఙ్గాః = పక్షులును, వృశ్చికాః = తేళ్లును, కీటాః = కీటకములును, మశకైః సహ = దోమలతో పాటు, దంశాశ్చ = ఈగలును, నిత్యమ్ = ఎల్లపుడును, సర్వమ్ = అందరినీ, బాధన్తే = బాధించును. అతః = అందువలన, వనమ్ = అరణ్యము, దుఃఖమ్ = దుఃఖకరము.

తా. పక్షులు, తేళ్ళు, కీటకములు. ఈగలు, దోమలు, నిత్యము అందరినీ పీడించుచుండును. దుర్బలురాల వగు నీవు ఆ పీడను సహింపలేవు. అందుచే వనవాసము కష్టము. 21

మూ. ద్రుమాః కణ్టకినశ్చైవ కుశకాశాశ్చ భామిని,
వనే వ్యాకులశాఖాగ్రా స్తేన దుఃఖతరం వనమ్. 22

ప్ర. అ. భామిని = ఓ సీతా। వనే = అరణ్యమునందు, ద్రుమాః = వృక్షములూ, కుశకాశాః చ = కుశలు, రెల్లు గడ్డి, కణ్టకినశ్చైవ = ముళ్లతో కూడినవై, వ్యాకులశాఖాగ్రాః = ఒకదానితో ఒకటి అల్లుకొని పోయిన శాఖాగ్రములు కలవై, ఉండును. తేన = ఆ కారణముచేత, వనమ్ = వనము, దుఃఖతరమ్ = చాల దుఃఖమును కలిగించును.

తా. సీతా। అరణ్యములో చెట్లూ, దర్భలూ, కాశములూ ముళ్లతో నిండి, కొమ్మలు ఒక దానితో ఒకటి పెనవేసికొని ఉండును. అందుచే అరణ్యము దుఃఖమును కలిగించును. 22

మూ. కాయక్లేశాశ్చ బహవో భయాని వివిధాని చ,
అరణ్యవాసే వసతో దుఃఖమేవ తతో వనమ్. 23

ప్ర. అ. అరణ్యవాసే = అరణ్యవాసమునందు, వసతః = నివసించువానికి, బహవః = అనేక మైన, కాయక్లేశాః = శరీరక్లేశములును, వివిధాని = అనేక విధము లైన, భయాని చ = భయములును ఉండును. తతః = అందువలన, వనమ్ = వనము, దుఃఖమేవ = దుఃఖకరమే.

తా. అరణ్యములో నివసించువాడు అనేక మైన కాయక్లేశము లనుభవింపవలసియుండును. వానికి ఎన్నియో భయము లుండును. అందుచే వనములో దుఃఖమే కాని సుఖ ముండదు. 23

మూ. క్రోధలోభౌ విమోక్తవ్యౌ కర్తవ్యా తపసే మతిః,
న భేతవ్యం చ భేతవ్యే నిత్యం దుఃఖమతో వనమ్. 24

ప్ర. అ. క్రోధలోభౌ = క్రోధమూ, లోభమూ, విమోక్తవ్యౌ = విడువదగినవి. తపసే = తపస్సుకొరకు, మతిః = బుద్ధి, కర్తవ్యా = చేయదగినది. భేతవ్యే = భయపడదగిన స్థితియందు గూడ, న భేతవ్యమ్ = భయపడగూడదు. అతః = అందువలన, వనమ్ = వనము. నిత్యమ్ = నిత్యమూ, దుఃఖమ్ = దుఃఖకర మైనది.

తా. అరణ్యములో నివసించువారు క్రోధలోభములు విడచి, మనస్సును తపస్సుపై నిలుపవలెను. భయపడవలసిన స్థితులలో గూడ భయపడగూడదు. అందుచే వనము సర్వదా దుఃఖకారణము. 24

మూ. తదలం తే వనం గత్వా క్షమం న హి వనం తవ,
విమృశన్నిహ పశ్యామి బహుదోషతరం వనమ్. 25

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, తే=నీకు, వనమ్=వనమును గూర్చి, గత్వా=వెళ్లి, అలమ్=చాలును, తవ=నీకు, వనమ్=వనము, క్షమమ్=తగినది, న హి=కాదుకదా. ఇహ=ఇపుడు, విమృశన్=విమర్శించుచు, వనమ్=వనమును, బహుదోషతరమ్=అనేక మైన దోషములు కలదానినిగా, పశ్యామి = చూచుచున్నాను.

తా. అందుచే నీవు అరణ్యమునకు రావద్దు. నీకు అరణ్యము నివాస యోగ్యము కాదు. ఆలోచించిన కొలది అరణ్యములో ఎన్నియో కష్టములే కనబడుచున్నవి. 25

మూ. వనం తు నేతుం న కృతా మతిస్తదా
బభూవ రామేణ యదా మహాత్మనా,
న తస్య సీతా వచనం చకార త
త్తతోఽబ్రవీద్రామమిదం సుదుఃఖితా. 26

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టావింశః సర్గః.

ప్ర. అ. మహాత్మనా=మహాత్ము డైన, రామేణ=రామునిచేత, యదా=ఎప్పుడు, వనమ్=వనమునుగూర్చి, నేతుమ్ = తీసికొనివెళ్ళుటకు, మతిః=బుద్ధి, కృతా=చేయబడినది, న బభూవ=కాలేదో, తదా=అప్పుడు, సీతా=సీత, తస్య=అతనియొక్క, తత్=ఆ, వచనమ్=వచనమును, న చకార = చేయలేదు. తతః=పిమ్మట, సుదుఃఖితా=చాల దుఃఖించినదై, రామమ్ = రాముని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. మహాత్ము డైన రాముడు తనను అరణ్యమునకు తీసికొనిపోవుటకు సమ్మతించకపోవుటచే సీత చాల దుఃఖించుచు ఆతనితో ఇట్లనెను. 26

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఇరువదియెనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనత్రింశః సర్గః

[తాను కూడ అరణ్యమునకు రామునితో కలిసి వెళ్లుట యుక్తమని సీత వాదించుట.]

మూ. ఏతత్తు వచనం శ్రుత్వా సీతా రామస్య దుఃఖితా,
ప్రసక్తాశ్రుముఖీ మన్దమిదం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. సీతా = సీత, రామస్య = రాముని యొక్క, ఏతత్ = ఈ, వచనమ్ = మాటను, శ్రుత్వా తు = విని, దుఃఖితా = దుఃఖించినదై, ప్రసక్తాశ్రుముఖీ = నిరంతరముగా కారుచున్న కన్నీరు గల ముఖము కలదై, మన్దమ్ = మందముగా, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సీత రాముని మాటలు విని, ధారగా స్రవించుచున్న కన్నీళ్లు గల ముఖముతో, మెల్లగా అతనితో ఇట్లు పలికెను. 1

మూ. యే త్వయా కీర్తితా దోషా వనే వస్తవ్యతాం ప్రతి,
గుణానిత్యేవ తాన్విద్ధి తవ స్నేహపురస్కృతాన్. 2

ప్ర. అ. వనే = వనమునందు, వస్తవ్యతాం ప్రతి = నివాసయోగ్యత్వమును గూర్చి, త్వయా = నీచేత, యే = ఏ, దోషాః = దోషములు, కీర్తితాః = చెప్పబడినవో, తవ = నీయొక్క, స్నేహపురస్కృతాన్ = స్నేహముచే పురస్కరింపబడిన, తాన్ = వాటిని, గుణానిత్యేవ = గుణములే అని, విద్ధి = తెలుసుకొనుము.

తా. వనమునందు నివాసము విషయమున నీవు చెప్పిన దోషము లన్నియు, వాటి వెనుక నీ ప్రేమ అనునది ఉన్నదో నాకు గుణములే అగు నని తెలుసుకొనుము. 2

మూ. మృగాః సింహా గజాశ్చైవ శార్దూలాః శరభా స్తథా,
పక్షిణః సృమరాశ్చైవ యే చాన్యే వనచారిణః 3
అదృష్టపూర్వరూపత్వాత్సర్వే తే తవ రాఘవ
రూపం దృష్ట్వాపసర్పేయుర్భయే సర్వే హి బిభ్యతి. 4

ప్ర. అ. రాఘవ=రామా! మృగాః=మృగములు, సింహాః=సింహములు, గజాశ్చైవ=గజములు, తథా=మరియు, శరభాః=శరభములు, పక్షిణః=పక్షులు, సృమరాశ్చైవ = పెద్ద చమరమృగములు, అన్యే = ఇతర మైన, యే = ఏ, వన చారిణః=వనమునందు సంచరించునవి గలవో, తే సర్వే = అవి అన్నియు, తవ=నీవు, అదృష్టపూర్వరూపత్వాత్=పూర్వ మెన్నడును చూడబడని రూపము గలవాడ వగుటవలన, రూపమ్=నీ రూపమును, దృష్ట్వైవ = చూడగనే, అప సర్పేయుః=దూరముగా పారిపోవును. భయే = భయకారణము కలిగి నపుడు, సర్వే=అందరును, బిభ్యతి హి=భయపడుదురు కదా.

తా. ఓ రామా! మృగములు, సింహములు, గజములు, శార్దూలములు, శరభములు, పక్షులు, చమరమృగములు, తదితరము లైన వన్యమృగములు ఇవన్నియు, పూర్వ మెన్నడును నీ రూపమును చూచి యుండకపోవుటచే, నిన్ను చూడగనే పారిపోవును. భయ హేతువును చూచి భయపడకుండువా రెవరు?

మూ. త్వయా చ సహ గన్తవ్యం మయా గురుజనాజ్ఞయా,
త్వద్వియోగేన మే రామ త్యక్తవ్యమిహ జీవితమ్. 5

ప్ర. అ. గురుజనాజ్ఞయా=పెద్దల ఆజ్ఞచేత, త్వయా సహ=నీతో కూడ, మయా చ=నేనుకూడ, గన్తవ్యమ్=వెళ్లవలసి యున్నది. రామ=రామా! త్వద్వి యోగేన=నీ వియోగముచేత, మే = నాకు, జీవితమ్ = జీవితము, ఇహ = ఇచట, త్యక్తవ్యమ్ = విడువదగినది.

తా. రామా! పెద్దల ఆజ్ఞ ప్రకారము నీతో నేను కూడ అరణ్యమునకు వెళ్లవలెను. నీతో వియోగము కలిగిన చో నేను ఇచటనే ప్రాణములు విడచెదను.

మూ. న చ మాం త్వత్సమీపస్థామపి శక్నోతి రాఘవ,
సురాణామీశ్వరః శక్రః ప్రధర్షయితుమోజసా. 6

ప్ర. అ. రాఘవ = ఓ రామా! త్వత్సమీపస్థామ్ = నీ సమీపమునందున్న, మామ్ = నన్ను, సురాణామ్ = దేవతల, ఈశ్వరః = ప్రభు వైన, శక్రః అపి = దేవేంద్రుడు కూడ, ఓజసా = తేజస్సుచేత, ప్రధర్షయితుమ్ = తిరస్కరించుటకు, న శక్నోతి = సమర్థుడు కాడు.

తా. రామా! దేవతాధిపతి యైన ఇంద్రుడు కూడ, నీ సమీపమునందున్నంతవరకు నన్ను తన తేజస్సుచే తిరస్కరించజాలడు. 6

మూ. పతిహీనా తు యా నారీ న సా శక్ష్యతి జీవితుమ్,
కామమేవంవిధం రామ త్వయా మమ విదర్శితమ్. 7

ప్ర. అ. యా నారీ = ఏ స్త్రీ పతిహీనా = భర్త లేనిదో, సా = ఆమె, జీవితుమ్ = జీవించుటకు, న శక్ష్యతి = సమర్థురాలు కాదు. రామ = ఓ రామా! త్వయా = నీచేత, కామమ్ = మిక్కిలి, ఏవంవిధమ్ = ఈ విధ మైనది, మమ = నాకు, విదర్శితమ్ = చూపబడినది.

తా. రామా! భర్త లేని స్త్రీ జీవింపజాలదను ధర్మమును నీవే నాకు ఉపదేశించి యున్నావు కదా!. 7

మూ. అథ చాపి మహాప్రాజ్ఞ బ్రాహ్మణానాం మయా శ్రుతమ్,
పురా పితృగృహే సత్యం వస్తవ్యం కిల మే వనే. 8

ప్ర. అ. మహాప్రాజ్ఞ = గొప్ప బుద్ధిమంతుడా! అథ చాపి = మరియు, పురా = పూర్వము, పితృగృహే = తండ్రిగారి యింటిలో, మయా = నాచేత, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణుల వాక్యము, శ్రుతమ్ = వినబడినది. మే = నాకు, సత్యమ్ = సత్యముగా, వనే = వనమునందు, వస్తవ్యం కిల = నివసింపవలసి యున్నదట.

తా. మహాబుద్ధిశాలి వైన ఓ రామా! మరి యొక విషయ మేమనగా నేను పూర్వము మాతండ్రిగారి ఇంటిలో నున్నపుడు బ్రాహ్మణులు చెప్పగా వింటిని. నేను తప్పక వనవాసము చేయవలసి యున్నదట. 8

మూ. లక్షణిభ్యో ద్విజాతిభ్యః శ్రుత్వాహం వచనం పురా,
వనవాసకృతోత్సాహా నిత్యమేవ మహాబల. 9

ప్ర. అ. మహాబల = గొప్ప బలము కలవాడా! అహమ్ = నేను, పురా = పూర్వము, లక్షణజ్ఞః = సాముద్రికలక్షణము తెలిసిన, ద్విజాతిభ్యః = బ్రాహ్మణులనుండి, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని, నిత్యమేవ = ఎల్లప్పుడును, వనవాసకృతోత్సాహా = వనవాసము నిమిత్తమై చేయబడిన ఉత్సాహము కలదానను.

తా. మహాబలవంతుడ వగు ఓ రామా! సాముద్రికలక్షణవేత్తలైన బ్రాహ్మణుల మాటలు పూర్వము విన్నది మొదలు, ఎల్లప్పుడును వనవాసము నకై ఉత్సాహపడుచు ఉన్నాను. 9

మూ. ఆదేశో వనవాసస్య ప్రాప్తవ్యః స మయా కిల,
సా త్వయా సహ తత్రాహం యాస్యామి ప్రియ నాన్యథా

ప్ర. అ. ప్రియ = ఓ ప్రియుడా! మయా = నాచేత, వనవాసస్య = వనవాసము యొక్క, సః ఆదేశః = ఆ ఆజ్ఞ, ప్రాప్తవ్యః కిల = పొందదగియున్నది. సా = అట్టి, అహమ్ = నేను, త్వయా సహ = నీతో కూడ, తత్ర = అరణ్యమునకు, యాస్యామి = వెళ్లగలను. అన్యథా = మరియొక విధముగా, న = కాకూడదు.

తా. ప్రియుడవైన ఓ రామా! అట్టి వనవాసము నిమిత్తమై నాకు ఆదేశము లభించవలసి యున్నది కదా! అందుచే నే నిపుడు నీతో కలిసి అరణ్యమునకు వెళ్లెదను. మరొక విధముగ జరుగుటకు వీలులేదు. 10

మూ. కృతాదేశా భవిష్యామి గమిష్యామి సహ త్వయా,
కాలశ్చాయం సముత్పన్నః సత్యవాగ్భవతు ద్విజః. 11

ప్ర. అ. కృతాదేశా = చేయబడిన బ్రాహ్మణవాక్యము కలదానను, భవిష్యామి = కాగలను. త్వయా సహ = నీతో కూడ, గమిష్యామి = వెళ్లగలను. అయమ్ = ఈ, కాలశ్చ = కాలము గూడ, సముత్పన్నః = వచ్చినది. ద్విజః = బ్రాహ్మణుడు, సత్యవాక్ = సత్యమైన వాక్కు కలవాడు, భవతు = అగుగాక.

తా. నేను ఆ బ్రాహ్మణుని మాట నిలబెట్టుటకై నీతో వచ్చెదను. అతని మాట సత్యమగుటకు తగిన సమయము వచ్చినది గాన ఆ బ్రాహ్మణుని వాక్యము సత్యమగుగాక. 11

మూ. వనవాసేఽభిజానామి దుఃఖాని బహుధా కిల,
ప్రాప్యన్తే నియతం వీర పురుషైరకృతాత్మభిః. 12

ప్ర. అ. వీర = ఓ వీరుడా। వనవాసే = వనవాసమునందు, దుఃఖాని = దుఃఖములు, బహుధా కిల = అనేకవిధము లైనవి యుండుననట. అభిజానామి = నే నెరుగుదును. అకృతాత్మభిః = ధైర్యము లేని, పురుషైః = పురుషులచేత మాత్రమే, నియతమ్ = తప్పక, ప్రాప్యన్తే = పొందబడును.

తా. ఓ వీరా। వనవాసమునందు అనేక విధము లగు దుఃఖము లుండు నని నాకు తెలియును. కాని ధైర్యరహితులకు మాత్రమే ఆ దుఃఖములు వచ్చును.

మూ. కన్యయా చ పితుర్గేహే వనవాసః శ్రుతో మయా,
భిక్షిణ్యాః సాధువృత్తాయా మమ మాతురిహాగ్రతః. 13

ప్ర. అ. పితుః = తండ్రియొక్క, గేహే = గృహమునందు, కన్యయా = కన్యగా నున్న, మయా = నాచేత, మమ మాతుః = నా తల్లియొక్క, అగ్రతః = ఎదుట, సాధువృత్తాయాః = మంచి నడవడిక గల, భిక్షిణ్యాః = భిక్షుకస్త్రీనుండి, ఇహ = ఇపుడు, వనవాసః = వనవాసము, శ్రుతః = వినబడినది.

తా. నేను నా తండ్రిగారి ఇంటివద్ద కన్యగా నుండు నపుడు, మంచి వృత్తము గల ఒక భిక్షుక స్త్రీ, నాకు ఇపుడు వనవాసము సంభవించు నని మా తల్లితో చెప్పగా విని యున్నాను. 13

మూ. ప్రసాదితశ్చ వై పూర్వం త్వం మే బహూతిథం ప్రభో,
గమనం వనవాసస్య కాఙ్క్షితం హి సహ త్వయా. 14

ప్ర. అ. ప్రభో = ఓ ప్రభూ। పూర్వమ్ = పూర్వము, త్వమ్ = నీవు, బహుతిథమ్ = చాలకాలము, మే = నాకు, ప్రసాదితశ్చ వై = అనుగ్రహించవేసి కొనబడితివి కదా। త్వయా సహ = నీతో కూడ, వనవాసస్య గమనమ్ = వనవాసము నిమిత్తమైన గమనము, కాఙ్క్షితం హి = కోరబడుచున్నది కదా।

తా. ఓ ప్రభూ। నిన్ను నేను చాల కాలము సేవించి అనుగ్రహించ చేసి కొంటిని కదా। నీతో కలిసి వనములో విహరింపవలె నను కోరిక నున్నింతయు.

మూ. కృతక్షణాహం భద్రం తే గమనం ప్రతి రాఘవ,
వనవాసస్య శూరస్య చర్యా హి మమ రోచతే. 15

ప్ర. అ. రాఘవ = రామా! తే = నీయొక్క, వనవాసస్య = వనవాసము యొక్క (వనై), గమనం ప్రతి = గమనమును గూర్చి, అహమ్ = నేను, కృతక్షణా = చేయబడిన సమయము కలదానను (వేచియున్నాను). తే = నీకు, భద్రమ్ = మంగళ మగు గాక. శూరస్య = శూరుని, చర్యా = ఆచరణము, మమ = నాకు, రోచతే హి = ఇష్ట మగును కదా.

తా. రామా! నీకు క్షేమ మగు గాక. నాటినుండియు నేను నీ వనవాసమును గూర్చి వేచియున్నాను. నాకు శౌర్యముతో కూడిన ఆచరణ మన్న చాల ఇష్టము. అందుచే నీ వనవాస సమయము వచ్చినది గాన నన్ను కూడ నీతో తీసికొని వెళ్ళుము. 15

మూ. శుద్ధాత్మన్ ప్రేమభావాద్ధి భవిష్యామి వికల్మషా,
భర్తారమనుగచ్ఛన్తీ భర్తా హి మమ దైవతమ్. 16

ప్ర. అ. శుద్ధాత్మన్ = పరిశుద్ధ మైన మనస్సు గల రామా! ప్రేమభావాత్ హి = ప్రేమ భావమువలననే, భర్తారమ్ = భర్త వైన నిన్ను, అనుగచ్ఛన్తీ = అనుసరించుచున్నదాన నై, వికల్మషా = పాపములు లేనిదాననై, భవిష్యామి = రాగలను. భర్తా = భర్తయే, మమ = నాకు, దైవతం హి = దైవతము కదా.

తా. పరిశుద్ధ మైన అంతఃకరణముగల ఓ రామా! భర్త వైన నిన్ను ప్రేమ పూర్వకముగనే అనుసరించి వనమునకు వెళ్ళి నేను పాపశూన్యురాలను అయ్యెదను. నాకు భర్తయే దైవతము. 16

మూ. ప్రేత్యభావేఽపి కల్యాణః సఙ్గమో మే సహ త్వయా,
శ్రుతిర్హి శ్రూయతే పుణ్యా బ్రాహ్మణానాం యశస్వినామ్.
ఇహలోకే చ పితృభిర్యా స్త్రీ యస్య మహామతే,
అద్భిర్దత్తా స్వధర్మేణ ప్రేత్యభావేఽపి తస్య సా. 18

ప్ర. అ. ప్రేత్యభావేఽపి = మరణానంతరముగూడ, త్వయా సహ = నీతో, మే = నాకు, కల్యాణః = మంగళకరమైన, సఙ్గమః = సంగమము కలుగును.

యశస్వినామ్ = కీర్తిగల, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులయొక్క, పుణ్యా = పుణ్యమైన, శ్రుతిః = వేదవాక్యము, శ్రూయతే = హి = వినబడుచున్నది కదా. మహామతే = గొప్ప బుద్ధి కలవాడా! యా స్త్రీ = ఏ స్త్రీ, ఇహ లోకే = ఈ లోకమునందు, పితృభిః = తండ్రులచేత, యస్య = ఎవనికి, స్వధర్మేణ = స్వధర్మానుసారముగా, అద్భిః = ఉదకములతో, దత్తా = ఇవ్వబడినదో, ప్రేత్యభావేఽపి = మరణానంతరము గూడ, సా = ఆమె, తస్య = అతనికే చెందును.

తా. మరణానంతరము గూడ క్షేసం సీతోడనే కలిసి యుందును. తండ్రులు స్వధర్మానుసారముగ ఏ స్త్రీని ఎవనికి, ఉదకధారాపూర్వకముగ దానము చేయుదురో, ఆ స్త్రీ మరణానంతరము కూడ అతనికే చెంది, అతనితో కలిసి యుండును అని యశశ్శాలులగు బ్రాహ్మణులు వేదవాక్యమును చెప్పుచుందురు కదా! 17, 18

మూ. ఏవమస్మాత్స్వకాం నారీం సువృత్తాం హి పతివ్రతామ్,
నాభిరోచయసే నేతుం త్వం మాం కేనేహ హేతునా. 19

ప్ర. అ. త్వమ్ = నీవు, కేన హేతునా = ఏ కారణముచేత, ఇహ = ఇపుడు, ఏవమ్ = ఈ విధముగా, సువృత్తామ్ = మంచి నడవడికలదానను, పతివ్రతామ్ = పతివ్రతను, స్వకాం నారీమ్ = నీకు సంబంధించిన స్త్రీని అయిన, మామ్ = నన్ను, అస్మాత్ = ఈ స్థానమునుండి, నేతుమ్ = తీసికొని వెళ్ళుటకు, నాభిరోచయసే = ఇష్టపడుట లేదు?

తా. నేను నీ దానను. మంచి నడవడిక కలదానను. పతివ్రతను. అట్టి నన్ను ఈ నగరమునుండి నీతో అరణ్యమునకు తీసికొనిపోవుటకు ఎందుచే ఇచ్చగింపకున్నావు? 19

మూ. భక్తాం పతివ్రతాం దీనాం మాం సమాం సుఖదుఃఖయోః,
నేతుమర్హసి కాకుత్స్థ సమానసుఖదుఃఖినీమ్. 20

ప్ర. అ. కాకుత్స్థ = రామా! భక్తామ్ = భక్తురాలను, పతివ్రతామ్ = పతివ్రతను, సుఖదుఃఖయోః = సుఖదుఃఖములందు, సమామ్ = సమముగా ఉండుదానను, సమాన సుఖదుఃఖినీమ్ = నీతో సమానమైన సుఖదుఃఖములు కలదానను అయిన, మామ్ = నన్ను, నేతుమ్ = తీసికొనివెళ్ళుటకు, అర్హసి = తగియున్నావు.

తా. రామా! నేను నీ భర్తురాలను. పతివ్రతను, సుఖదుఃఖములను తుల్యముగ చూడ గలదానను. నీ సుఖమే నా సుఖ మనీ, నీ దుఃఖమే నా దుఃఖ మనీ భావించుదానను. అట్టి నన్ను నీతో తీసికొని పొమ్ము. 20

మూ. యది మాం దుఃఖితామేవం వనం నేతుం న చేచ్ఛసి,
విషమగ్నిం జలం వాఽహమాస్థాస్యే మృత్యుకారణాత్.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, దుఃఖితామ్ = దుఃఖితురాలు నైన, మామ్ = నన్ను, వనమ్ = వనమును గూర్చి, నేతుమ్ = తీసికొని వెళ్లుటకు, నచ ఇచ్ఛసి యది = నీవు ఇచ్ఛయించక పోయినచో, మృత్యుకారణాత్ = మరణము కొరకై, విషమ్ = విషమునుగాని, అగ్నిమ్ = అగ్నిని గాని, జలం వా = జలమును గాని, ఆస్థాస్యే = ఆశ్రయింతెదను.

తా. ఈ విధముగా దుఃఖించుచున్న నన్ను అరణ్యమునకు తీసికొని వెళ్లకపోయినచో విషము త్రాగి గాని, అగ్నిలో పడి గాని, జలములో దూకి గాని ప్రాణములను విడచెదను. 21

మూ. ఏవం బహువిధం తం సా యాచతే గమనం ప్రతి,
నానుమేనే మహాబాహుస్తాం నేతుం విజనం వనమ్. 22

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, సా = ఆమె, గమనం ప్రతి = గమనమును గూర్చి, బహువిధమ్ = అనేక విధములుగా, తమ్ = అతనిని, యాచతే = ప్రార్థించినది. మహాబాహుః = ఆజానుబాహు డైన రాముడు, తామ్ = ఆమెను, విజనమ్ = జనశూన్య మైన, వనమ్ = వనమును గూర్చి, నేతుమ్ = తీసికొని వెళ్లుటకు, నానుమేనే = అంగీకరించలేదు.

తా. ఈ విధముగ ఆమె తనను కూడ వనమునకు తీసికొని పొమ్మని ఎంత ప్రతిమాలినను, ఆజానుబాహు వగు ఆ రాముడు, ఆమెను, జనశూన్య మగు వనమునకు తీసికొనివెళ్లుటకు అంగీకరించలేదు. 22

మూ. ఏవముక్త్వా తు సా చిన్తాం మైథిలీ సముపాగతా,
స్నాపయన్తీవ గాముష్ణైరశ్రుభిర్నయనచ్యుతైః. 23

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తా = పలుకబడిన, సా మైథిలీ = ఆ సీత, నయనచ్యుతైః = నేత్రములనుండి స్రవించిన, ఉష్ణైః = వేడి యైన, అశ్రుభిః = కన్నీళ్లతో, గామ్ = భూమిని, స్నాపయన్తీవ = తడుపుచున్నది వలె, చిన్తామ్ = దుఃఖమును, సముపాగతా = పొందినది.

తా. రాముని మాటలు విన్న సీత దుఃఖాక్రాంతురాలై, కన్నీళ్లతో నేల తడిసిపోవునట్లు ఏడ్చెను.

మూ. చిన్తయన్తీం తథా తాం తు నివర్తయితుమాత్మవాన్,
తామ్రోష్ఠీం స తదా సీతాం కాకుత్స్థో బహ్వసాన్త్వయత్

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనత్రింశః సర్గః.

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతుడైన, సః కాకుత్స్థః = ఆ రాముడు, తథా = ఆ విధముగా, చిన్తయన్తీమ్ = దుఃఖించుచున్న, తామ్రోష్ఠీమ్ = ఎఱ్ఱని పెదవులు గల, తాం సీతామ్ = ఆ సీతను, తదా = అప్పుడు, నివర్తయితుమ్ = మరల్చుటకు, బహు = అధికముగా, అసాన్త్వయత్ = ఓదార్చెను.

తా. బుద్ధిమంతుడగు ఆ రాముడు ఆ విధముగ ఏడ్చుచున్నదీ, ఎఱ్ఱని పెదవులు కలదీ అయిన ఆ సీతను, వనగమన ప్రయత్నమునుండి మరల్చుటకై ప్రయత్నించుచు, ఓదార్చెను. 24

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ఇరువదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ త్రింశః సర్గః

*[తనతో వనమునకు వచ్చుటకై సీత పట్టుపట్టి, దుఃఖించుచు విలపించగా, రాముడు చివరికి అంగీకరించుట, తలిదండ్రులకు పెద్దలకు సేవచేయుట ఉత్తమ ధర్మమని ఆమెకు బోధించుట, వనమునకు పోవు సందర్భమున గృహములోని వస్తువులన్నీ బ్రాహ్మణాదులకు దానము చేయుమని ఆమెను ఆదేశించుట].*

మూ. సాన్త్వ్యమానా తు రామేణ మైథిలీ జనకాత్మజా,
వనవాసనిమిత్తాయ భర్తారమిదమబ్రవీత్. 1

ప్ర. అ. వనవాసనిమిత్తాయ = వనవాసము విషయమున, రామేణ = రామునిచేత, సాన్త్వ్యమానా = ఓదార్చబడుచున్న, జనకాత్మజా = జనకుని కుమార్తెయైన, మైథిలీ = సీత, భర్తారమ్ = భర్తను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. వనవాసమునకు రావద్దని చెప్పుచు రాముడు ఈ విధముగా ఓదార్చుచుండగా, జనకుని కూతురైన సీత ఇట్లు పలికెను. 1

మూ. సా తముత్తమసంవిగ్నా సీతా విపులవక్షసమ్
ప్రణయాచ్చాభిమానాచ్చ పరిచిక్షేప రాఘవమ్. 2

ప్ర. అ. ఉత్తమసంవిగ్నా = మిక్కిలి దుఃఖితురాలైన, సా సీతా = ఆ సీత, విపులవక్షసమ్ = విశాలమైన వక్షఃస్థలము గల, రాఘవమ్ = రాముని, ప్రణయాత్ = ప్రేమవలనను, అభిమానాచ్చ = అహంకారము (కోపము) వలనను, అధిచిక్షేప = అధిక్షేపించెను.

తా. మిక్కిలి దుఃఖితురాలైన ఆ సీత, విశాలమైన వక్షఃస్థలము గల ఆ రాముని, ప్రేమచేతను, తన ప్రార్థనను వినలేదు కదా అను అహంకారము చేతను నిందించెను. 2

మూ. కిం త్వామన్యత వైదేహః పితా మే మిథిలాధిపః,
రామ జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహమ్. 3

ప్ర. అ. రామ=రామా, పురుషవిగ్రహమ్ = పురుషశరీరము గలవాడవును, స్త్రియమ్=స్త్రీయు అయిన, త్వా=నిన్ను, జామాతరమ్ = అల్లునిగా, ప్రాప్య=పొంది, మిథిలాధిపః=మిథిలారాజైన, వైదేహః=విదేహాధిపతి యైన, మే పితా=నా తండ్రి, కిమ్=ఏమి, అమన్యత=తలంచెనో.

తా. రామా! నీవు పురుష శరీరము గల స్త్రీవి. అట్టి నిన్ను, విదేహదేశ రాజు, మిథిలాధీశుడు అయిన నా తండ్రి ఏ మనుకొని అల్లునిగా చేసికొని నాడో తెలియదు. 3

వి. ఇచట వ్యాఖ్యాతలు ఏవేవో వ్యాఖ్యానాలు వ్రాసినారు గాని అవన్నియు స్వప్రతిభామాత్ర కల్పితములు. అనావశ్యకములు. సీత కేవలము తాత్కాలికమైన మానసికాందోళనముతో ఈ విధముగా రామునితో దురుసుగా మాట లాడిన దని చెప్పుటయే యుక్తము. ఇట్లు మాటలాడుట సహజ మైనది కూడ. ముందు ఈ విధముగా పరుషముగా పలికి వెంటనే "నీవు తేజశ్శాలివి కావని ఎవ రైన అన్నచో అది అసత్యము" అని సీతయే నాల్గవ శ్లోకమున చెప్ప బోవుచున్నది. 3

మూ. అనృతం బత లోకోఽయమజ్ఞానాద్యది వక్ష్యతి,
తేజో నాస్తి పరం రామే తపతీవ దివాకరే. 4

ప్ర. అ. తపతి=ప్రకాశించుచున్న, దివాకరే ఇవ=సూర్యునియందు వలె, రామే=రామునియందు, పరమ్=ఉత్తమ మైన, తేజః=తేజస్సు, నాస్తి=లేదు అని, అయం లోకః=ఈ లోకము, అజ్ఞానాత్=అజ్ఞానమువలన, వక్ష్యతి యది=చెప్పబోవుచో అది, అనృతమ్=అసత్యము. బత=ఎంత కష్టము.

తా. వాస్తవానికి, నీవు నన్ను అడవికి తీసికొని వెళ్లకపోయినచో అందుకు కారణము నీవు తేజోవిహీనుడ వగుట కాదు. లోకులలో ఎవరైన రామునియందు తేజస్సు లేదు అని అజ్ఞానముచే అన్నచో, అది "ప్రకాశించుచున్న సూర్యునిలో తేజస్సు లేదు" అని అన్నట్లు అసత్యమే. అందుచే నీవు నన్ను తీసికొని వెళ్లక పోవుటకు పరాక్రమవిహీనత్వము కాదు; వేరే కారణ ముండవలెను. 4

మూ. కిం హి కృత్వా విషణ్ణస్త్వం కుతో వా భయమస్తి తే.
యత్పరిత్యక్తుకామస్త్వం మామనన్యపరాయణామ్. 5

ప్ర. అ. త్వమ్=నీవు, అనన్యపరాయణామ్=మరి యెవ్వరును గతి లేని, మామ్=నన్ను, పరిత్యక్తుకామః ఇతి యత్ = విడచుటకు కోరిక గలవాడవై యున్నావు అనునది ఏది కలదో ఆ విషయమున, త్వమ్=నీవు, కిం హి కృత్వా =ఏ కారణముచేత, విషణ్ణః=దుఃఖితుడవైనావు? తే=నీకు, కుతః వా=దేనివలన, భయమ్=భయము, అస్తి=ఉన్నది.

తా. మరి యెవ్వరును గతి లేని నన్ను ఈ విధముగా పరిత్యజించి వెళ్ళవలె నని అనుకొనుచున్నావే. నీవు ఎందుకు దిగులుబాటు చెందుచున్నావు? నీకు భయకారణము ఏమి? 5

మూ. ద్యుమత్సేనసుతం వీర సత్యవన్తమనువ్రతామ్,
సావిత్రీమివ మాం విద్ధి త్వమాత్మవశవర్తినీమ్. 6

ప్ర. అ. వీర=ఓ వీరుడా! మామ్=నన్ను, ద్యుమత్సేన సుతమ్=ద్యుమత్సేనుని కుమారు డైన, సత్యవన్తమ్=సత్యవంతుని, అనువ్రతామ్=అనుసరించిన, సావిత్రీమివ=సావిత్రినివలె, ఆత్మవశవర్తినీమ్=నీ వశమునం దుండు దానినిగా, విద్ధి=తెలుసుకొనుము.

తా. సావిత్రి ద్యుమత్సేనుని కుమారు డైన సత్యవంతుని అనుసరించి యుండునట్లు, నేను సర్వదా నీ సమీపమునందు ఉండుదానను అని తెలిసికొనుము.

మూ. న త్వహం మనసాప్యన్యం ద్రష్టాస్మి త్వదృతేఽనఘ,
త్వయా రాఘవ గచ్ఛేయం యథాన్యా కులపాంసనీ. 7

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా! రాఘవ=రామా, కులపాంసనీ=కులమును అపవిత్రముచేయు, అన్యా యథా=మరియొక సాధారణ స్త్రీ వలె, అహమ్=నేను, త్వదృతే=నీవు తప్ప, అన్యమ్=ఇతరుని, మనసాపి=మనస్సుచేతగూడ, న ద్రష్టాస్మి=చూడను. త్వయా=నీతో, గచ్ఛేయమ్=అరణ్యమునకు వెళ్ళెదను.

తా. దోషరహితుడ వైన రామా! కులమునకు కళంకము తెచ్చు సామాన్య స్త్రీ వంటి దానను కాను. నీవు తప్ప మరి యొకనిని మనస్సుచేత కూడ చూడను. నీతో అరణ్యమునకు వచ్చెదను. 7

మూ. స్వయం తు భార్యాం కౌమారీం చిరమధ్యుషితాం సతీమ్,
శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతుమిచ్ఛసి. 8

ప్ర. అ. రామ=రామా! కౌమారీమ్=యౌవనవంతురాలను, చిరమ్=చిరకాలము, అధ్యుషితామ్=ఏలుకొనబడినదానను, సతీమ్ = పతివ్రతను, భార్యామ్=భార్యను అయిన, మామ్=నన్ను, శైలూషః ఇవ=నటుడు వలె, స్వయమ్=స్వయముగా, పరేభ్యః=ఇతరులకు, దాతుమ్=ఇచ్చుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

తా. నేను నీ భార్యను; పతియే గతి యని నమ్మినదానను. నూతన యౌవనములో ఉన్నదానను. చాలకాలము నీతో కాపురము చేసిన దానను. అట్టి నన్ను నాటకాలలో వేషాలు వేసికొని జీవించు నటుడు తన భార్యను స్వయముగనే ఇతరులకు ఇచ్చినట్లు, ఇతరులకిచ్చి వేయదలచుచున్నావు! 8

మూ. యస్య పథ్యం చ రామాత్థ యస్య చార్థేఽవరుధ్యసే,
త్వం తస్య భవ వశ్యశ్చ విధేయశ్చ సదానఘ. 9

ప్ర. అ. అనఘ=దోషము లేని, రామ=ఓ రామా, యస్య=ఎవనియొక్క, పథ్యమ్=హితమును గూర్చి, ఆత్థ=పలుకుచున్నావో, యస్య చ అర్థే=ఎవని నిమిత్తమై, అవరుధ్యసే=నన్ను అడ్డగించుచున్నావో, త్వమ్=నీవు, తస్య=అతనికి, సదా=ఎల్లపుడును, వశ్యః చ=వశ్యుడవు గాను, విధేయః చ=విధేయుడవు గాను, భవ=ఉండుము.

తా. దోషరహితుడవైన ఓ రామా! నీవు ఏ దశరథాదుల హితమును గూర్చి మాటలాడుచున్నావో, ఎవరిని దృష్టిలో నుంచుకొని నన్ను నీతో రావలదని అడ్డుపెట్టుచున్నావో, వారికి నీవు సర్వదా వశ్యుడవై, విధేయుడవై ఉండవచ్చును. కాని నన్ను వారికి విధేయురాలనై ఉండు మనుట అయుక్తము. 9

మూ. స మామనాదాయ వనం న త్వం ప్రస్థాతుమర్హసి
తపో వా యది వాఽరణ్యం స్వర్గో వా మే సహ త్వయా

ప్ర. అ. సః త్వమ్ = అట్టి నీవు, మామ్ = నన్ను, అనాదాయ=తీసికొని వెళ్లకుండగా, వనమ్ = వనమును గూర్చి, ప్రస్థాతుమ్ = బయలుదేరుటకు,

న్యాస్తని = తగదు. తపో వా = తప స్సైనను, యది వా = లేక, అరణ్యమ్ = అరణ్య మైనను, స్వర్గో వా = స్వర్గ మైనను, మే = నాకు, త్వయా సహ = నీతో కూడి మాత్రమే.

తా. అన్నియు తెలిసిన నీవు నన్ను తీసికొని వెళ్లకుండగా వనమునకు బయలుదేరుట యుక్తము కాదు. నాకు తప స్సైనను, అరణ్యమైనను, స్వర్గ మైనను నీతో కలిసియే. నీ సాన్నిధ్యము లేనిచో నా కేదియు రుచింపదు. 10

మూ. న చ మే భవితా తత్ర కశ్చిత్ పథి పరిశ్రమః
పృష్ఠతస్తవ గచ్ఛన్త్యా విహారశయనేష్వివ. 11

ప్ర: అ. తవ = నీయొక్క, పృష్ఠతః = వెనుకనే, గచ్ఛన్త్యాః = వెళ్లుచున్న, మే = నాకు, తత్ర = అచట, పథి = మార్గమునందు, విహారశయనేష్వివ = విహారములందు, శయనములందు వలె, కశ్చిత్ = ఏమియు, పరిశ్రమః = అలసట, న భవితా = కాబోదు.

తా. నీ వెనుకనే వచ్చు నపుడు మార్గమునందు నా కేమియు శ్రమ కలుగదు. విహారములందును, శయనములందును ఏ విధముగ శ్రమ లేనిదాన నై యుందునో అట్లే మార్గమునందు గూడ నుండగలను. 11

మూ. కుశకాశశరేషీకా యే చ కణ్టకినో ద్రుమాః,
తూలాజినసమస్పర్శా మార్గే మమ సహ త్వయా. 12

ప్ర. అ. త్వయా సహ = నీతో కూడ, మార్గే = మార్గమునందు నడచునపుడు, కుశకాశశరేషీకాః = దర్భలు, రెల్లు, శరములు, ఇషీకలు అను తృణములు, కణ్టకినః = ముండ్లు గల, యే ద్రుమాః చ = ఏ వృక్షములు కలవో అవియు, తూలాజిన సమస్పర్శాః = దూదితోను, అజినముతోను సమాన మైనస్పర్శ గలవి అగును.

తా. నీతో కలిసి ప్రయాణము చేయుచు న్నపుడు, మార్గములో నున్న దర్భలు, కాశములు, శర-ఇషీకాదితృణములు, ముండ్ల చెట్లూ కూడ నాకు దూది వలె, మంచి మృగచర్మము వలె మృదువుగా నుండును. 12

మూ. మహావాతసముద్ధూతం యన్మామవకరిష్యతి,
రజో రమణ తన్మన్యే పరార్ధ్యమివ చన్దనమ్. 13

ప్ర. అ. రమణ = ఓ ప్రియుడ వైన రామా! మహావాతసముద్ధూతమ్ = గొప్ప వాయువుచేత ఎగురగొట్టబడిన, యత్ = ఏ, రజః = పరాగము, మామ్ = నన్ను, అవకరిష్యతి = కప్పివేయగలదో, తత్ = దానిని, పరార్ధ్యమ్ = అత్యుత్తమ మైన, చన్దనమ్ ఇవ = చందనమును వలె, మన్యే = తలచెదను.

తా. రామా! పెనుగాలికి ఎగిరి నన్ను కప్పివేయు పరాగమును అత్యుత్తమ మైన చందనమునుగా పరిగణింపగలను. 13

మూ. శాద్వలేషు యథా శిశ్యే వనాన్తే వనగోచరా
కుశాస్తరణతల్పేషు కిం స్యాత్సుఖకరం తతః. 14

ప్ర. అ. వనగోచరా = వనమును ప్రవేశించినదాన నై, వనాన్తే = వన మధ్యమునందు, శాద్వలేషు = పచ్చికబీడులందు, యథా = ఎట్లు, శిశ్యే = శయనించెదనో, తతః = దానికంటె, కుశాస్తరణతల్పేషు = దర్భ కంబళములు కప్పిన తల్పముల యందు, సుఖతరమ్ = ఎక్కువ సుఖకరముగా, స్యాత్ కిమ్ = ఉండునా?

తా. వనములో నివసించుచు, నేను, వనమధ్యమునందు, పచ్చిక బీడుల పై శయనించు నపుడు కలుగు సుఖము కంటె దర్భ మైన కంబళ్లు కప్పిన శయనముల పై ఎక్కువ సుఖము కలుగునా! 14

మూ. పత్రం మూలం ఫలం యత్త్వమల్పం వా యది వా బహు
దాస్యసి స్వయమాహృత్య తన్మేఽమృతరసోపమమ్ 15

ప్ర. అ. త్వమ్ = నీవు, యత్ = ఏ, పత్రమ్ = పత్రమును గాని, మూలమ్ = మూలమును గాని, ఫలమ్ = ఫలమును గాని, అల్పం వా = అల్పముగా గాని, యది వా = లేక, బహు = అధికముగా గాని, స్వయమ్ = స్వయముగా, ఆహృత్య = తీసికొని వచ్చి, దాస్యసి = ఇవ్వగలవో, తత్ = అది, మే = నాకు, అమృతరసోపమమ్ = అమృతరసముతో సమాన మైనది, భవేత్ = కాగలదు.

తా. నీవు స్వయముగా తీసికొనివచ్చి ఇచ్చే పత్ర మైనను, దుంపమైనను, ఫల మైనను, అది కొంచె మైనను అధిక మైనను, నాకు అమృతతుల్య మగును.

మూ. న మాతుర్న పితు స్తత్ర స్మరిష్యామి న వేశ్మనః
అర్తవాన్యుపభుఞ్జానా పుష్పాణి చ ఫలాని చ. 16

ప్ర. అ. తత్ర=అచట, ఆర్తవాని=ఆ యా ఋతువులకు సంబంధించిన, పుష్పాణి=పుష్పములను, ఫలాని చ=ఫలములనూ, ఉపభుఞ్జానా = అనుభవించుచు, మాతుః=తల్లి (కే)ని, న స్మరిష్యామి=స్మరించను. పితుః న=తండ్రిని స్మరించను. వేశ్మనః = గృహమును, న = స్మరించను.

తా. అరణ్యమునందు ఆ యా ఋతువులలో లభించు పుష్పఫలాదులను అనుభవించుచు తల్లిని గాని, తండ్రిని గాని, గృహమును గాని స్మరించుచు బెంగ పెట్టుకొనను. 16

మూ. న చ తత్ర తతః కించిద్ద్రష్టుమర్హసి విప్రియమ్
మత్కృతే న చ తే శోకో న భవిష్యామి దుర్భరా. 17

ప్ర. అ. తతః = ఆ కారణమున, తత్ర = అచట, కించిత్ = ఏమియు, విప్రియమ్ = కష్టమును, ద్రష్టుమ్=చూచుటకు, నార్హసి=తగవు. మత్కృతే= నానిమిత్త మై, తే = నీకు, శోకః = శోకము, న = కలుగదు. దుర్భరా = నీచే పోషింప శక్యముకాని దానను, న భవిష్యామి = కాను.

తా. అందుచే అరణ్యములో నావలన కష్టము లేవియో వచ్చు నని భావించకుము. నా మూలమున నీ కేమియు శోకము కలుగదు. నీకు పోషింప భారముగా కాలేను.

మూ. య స్త్వయా సహ స స్వర్గో నిరయో యస్త్వయా వినా
ఇతి జానన్ పరాం ప్రీతిం గచ్ఛ రామ మయా సహ.

ప్ర. అ. త్వయా సహ=నీతో కలిసి యుండగా, యః=ఏది కలుగునో, సః = అదియే, స్వర్గః = స్వర్గము. త్వయా వినా = నీవు లేకుండ ఏర్పడునది, నిరయః=నరకము. ఇతి=ఈ విధముగ, జానన్=తెలుసుకొన్నవాడ వై, రామ= రామా! మయా సహ = నాతో కూడ, పరామ్ = గొప్ప, ప్రీతిమ్ = ప్రీతిని, గచ్ఛ = పొందుము.

తా. నాకు నీ సాహచర్య మున్నదే స్వర్గము. నీవు లేనిచో అది నరకము. రామా! ఈ విషయమును గుర్తించి నాతో కూడ గొప్ప ఆనందమును పొందుము.

మూ. అథ మామేవమవ్యగ్రాం వనం నైవ నయిష్యసి
విషమద్యైవ పాస్యామి మా వశం ద్విషతాం గమమ్. 19

ప్ర. అ. అథ = అట్లు గాక, ఏవమ్ = ఈ విధముగా, అవ్యగ్రామ్ = సందేహము లేని, అనగా నీతో వెళ్ళుటకే నిశ్చయము చేసికొన్న, మామ్ = నన్ను, వనమ్ = వనమును గూర్చి, నైవ నయిష్యసి యది = తీసికొని వెళ్లకపోయినచో, అద్యైవ = ఇప్పుడే, విషమ్ = విషమును, పాస్యామి = త్రాగగలను. ద్విషతామ్ = శత్రువులయొక్క, వశమ్ = వశమును, మా గమమ్ = పొందకుందును గాక.

తా. నీతో వనమునకు వెళ్లవలె నని దృఢనిశ్చయముతో నున్న నన్ను తీసికొని వెళ్లకపోయినచో ఇప్పుడే విషము త్రాగెదను. శత్రువులకు మాత్రము వశము కాజాలను. 19

మూ. పశ్చాదపి హి దుఃఖేన మమ నైవాస్తి జీవితమ్
ఉజ్ఝితాయా స్త్వయా నాథ తదైవ మరణం వరమ్. 20

ప్ర. అ. నాథ = ఓనాథా! త్వయా = నీచేత, ఉజ్ఝితాయాః = విడువబడిన, మమ = నాకు, పశ్చాదపి = తరువాత నైనను, దుఃఖేన = దుఃఖము చేత, జీవితమ్ = జీవితము, నైవాస్తి = ఉండదు. తదైవ = పరిత్యాగసమయమునందే, మరణమ్ = మరణము, వరమ్ = శ్రేష్ఠము.

తా. నాథా! నీవు నన్ను విడచిపోయినచో నేను దుఃఖముతో కొంత కాలము తరువాత నైనను ప్రాణములు విడువవలసినదే. అందుచే ఇప్పుడే మరణించుట మేలు. 20

మూ. ఇమం హి సహితుం శోకం ముహూర్తమపి నోత్సహే
కిం పునర్దశ వర్షాణి త్రీణి చైకం చ దుఃఖితా. 21

ప్ర. అ. ఇమమ్ = ఈ, శోకమ్ = శోకమును, ముహూర్తమపి = క్షణకాలమైనను, సహితుమ్ = సహించుటకు, నోత్సహే = అంగీకరింపను. దశ = పది, త్రీణి = మూడు, ఏకం చ = ఒక (పదునాలుగు) వర్షాణి = సంవత్సరములు, దుఃఖితా = దుఃఖితురాల నై, కిం పునః = చెప్పనేల.

తా. ఈ శోకమును ఒక్క క్షణ మైనను సహింప జాలను. పదునాలుగు సంవత్సరములు దుఃఖించుచు గడవజాల నని వేరె చెప్పవలెనా. 21

మూ. ఇతి సా శోకసన్తప్తా విలప్య కరుణం బహు
చుక్రోశ పతిమాయస్తా భృశమాలిఙ్గ్య సస్వరమ్. 22

ప్ర. అ. సా = ఆ సీత, శోకసన్తప్తా = శోకముచే తపింపచేయబడినదై, ఆయస్తా = ఆయాసపడుచున్నదై, ఇతి = ఈ విధముగా, కరుణమ్ = జాలిగా, బహు = అధికముగా, విలప్య = విలపించి, పతిమ్ = భర్తను, ఆలిఙ్గ్య = కౌగలించుకొని, సస్వరమ్ = స్వరముతో కూడినట్లుగా, భృశమ్ = మిక్కిలి, చుక్రోశ = ఏడ్చెను.

తా. శోకసంతప్తురాలైన ఆ సీత ఈ విధముగ జాలి కలుగునట్లు అధికముగా ఏడ్చి, భర్తను కౌగలించుకొని, సస్వరముగా బిగ్గరగా ఏడ్చెను. 22

మూ. సా విద్ధా బహుభిర్వాక్యైర్దిగ్ధైరివ గజాఙ్గనా
చిరసన్నియతం బాష్పం ముమోచాగ్నిమివారణిః. 23

ప్ర. అ. దిగ్ధైః = విషము పూసిన బాణాదులచే, గజాఙ్గనా ఇవ = ఆడ ఏనుగ వలె, సా = ఆమె, బహుభిః = అనేకమైన, వాక్యైః = వాక్యములచేత, విద్ధా = కొట్టబడినదై, చిరసన్నియతమ్ = చిరకాలము అడ్డుకొనబడిన, బాష్పమ్ = బాష్పమును, అరణిః = అరణి, అగ్నిమివ = అగ్నిని వలె, ముమోచ = విడచెను.

తా. విషముపూసిన బాణాదులచే కొట్టబడిన ఆడ ఏనుగ వలె, అనేకములైన వాక్యములచే పీడింపబడిన ఆ సీత, చాల సేపటివరకును ఆపియుండిన కన్నీటిని, అరణి అగ్నిని వలె, పైకి విడచెను. 23

మూ. తస్యాః స్ఫటికసంకాశం వారిసన్తాపసమ్భవమ్
నేత్రాభ్యాం పరిసుస్రావ పఙ్కజాభ్యామివోదకమ్. 24

ప్ర. అ. తస్యాః = ఆమెయొక్క, నేత్రాభ్యామ్ = నేత్రములనుండి, సన్తాపసంభవమ్ = దుఃఖమువలన కలిగిన, స్ఫటికసంకాశమ్ = స్ఫటికము వంటి, వారి = ఉదకము, పఙ్కజాభ్యామ్ = రెండు పద్మములనుండి, ఉదకమివ = ఉదకము వలె, పరిసుస్రావ = స్రవించెను.

తా. ఆమె నేత్రములనుండి, దుఃఖమువలన కలిగిన స్వచ్ఛమైన కన్నీరు, పద్మములనుండి ఉదకము స్రవించినట్లు, స్రవించెను. 24

మూ. తచ్చైవామలచన్ద్రాభం ముఖమాయతలోచనమ్,
పర్యశుష్యత బాష్పేణ జలోద్ధృతమివామ్బుజమ్. 25

ప్ర. అ. అమలచన్ద్రాభమ్ = నిర్మల మైన చంద్రుని వంటి కాంతి కలదీ, ఆయతలోచనమ్ = విశాల మైన నేత్రములు కలదీ అయిన, తత్ = ఆ, ముఖం చైవ = ముఖము కూడ, జలోద్ధృతమ్ = జలమునుండి పెరికివేయబడిన, అమ్బుజమివ = పద్మము వలె, బాష్పేణ = కన్నీటితో, పర్యశుష్యత = శోషించెను.

తా. విశాల మైన నేత్రములు గలదీ, నిర్మల మైన చంద్రుని వంటి కాంతి గలదీ అయిన ఆమె ముఖము, కన్నీటితో, నీటినుండి పెరికివేసిన పద్మము వలె, వాడిపోయెను. 25

మూ. తాం పరిష్వజ్య బాహుభ్యాం విసంజ్ఞామివ దుఃఖితామ్
ఉవాచ వచనం రామః పరివిశ్వాసయంస్తదా. 26

ప్ర. అ. తదా = అప్పుడు, రామః = రాముడు, దుఃఖితామ్ = దుఃఖితురాలూ, విసంజ్ఞామివ = మూర్ఛితురాలు వలె నున్నదీ అయిన, తామ్ = ఆమెను, బాహుభ్యామ్ = బాహువులతో, పరిష్వజ్య = కౌగలించుకొని, పరివిశ్వాసయన్ = ఓదార్చుచు, వచనమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. అపుడు, రాముడు దుఃఖితురా లై మూర్ఛ చెందినట్లున్న ఆ సీతను బాహువులతో కౌగలించుకొని, ఓదార్చుచు ఇట్లనెను. 26

మూ. న దేవి తవ దుఃఖేన స్వర్గమప్యభిరోచయే,
న హి మేఽస్తి భయం కించిత్స్వయమ్భోరివ సర్వతః.

ప్ర. అ. దేవి = ఓ దేవీ! తవ = నీయొక్క, దుఃఖేన = దుఃఖముచేత, స్వర్గమపి = స్వర్గమును కూడ, న అభిరోచయే = ఇష్టపడను. మే = నాకు, స్వయమ్భోరివ = బ్రహ్మదేవునకు వలె, సర్వతః = అన్నింటినుండియు, (దేని నుండియు), కించిత్ = కొంచెము గూడ, భయమ్ = భయము, నాస్తి హి = లేదు కదా.

తా. ఓ దేవీ! నీవు దుఃఖించుచుండగా, స్వర్గము లభించినను దాని నిష్టపడను. బ్రహ్మదేవునకు వలె, నాకు, ఎవరినుండియు, ఏ మాత్రమును, భయము లేదు. 27

మూ. తవ సర్వమభిప్రాయమవిజ్ఞాయ శుభాననే
వాసం న రోచయేఽరణ్యే శక్తిమానపి రక్షణే. 28

ప్ర. అ. శుభాననే = శుభకర మైన ముఖము కలదానా! రక్షణే = నిన్ను రక్షించుటయందు, శక్తిమానపి = శక్తికలవాడ నైనను, తవ = నీయొక్క, సర్వమ్ = సమస్త మైన, అభిప్రాయమ్ = అభిప్రాయమును, అవిజ్ఞాయ = తెలుసుకొనక, అరణ్యే = అరణ్యమునందు, వాసమ్ = నీ నివాసమును, న రోచయే = ఇష్టపడను.

తా. శుభకర మైన ముఖము గల ఓ సీతా! నిన్ను రక్షింప సమర్థుడ నైనను, నీ అభిప్రాయ మేమో పూర్తిగ తెలిసికొనకుండ నిన్ను అరణ్యమునకు తీసికొనివెళ్ళుటకు నే నిష్టపడలేదు. 28

మూ. యత్సృష్టాసి మయా సార్ధం వనవాసాయ మైథిలి
న విహాతుం మయా శక్యా కీర్తిరాత్మవతా యథా. 29

ప్ర. అ. మైథిలి = ఓ సీతా! యత్ = ఏ కారణమువలన, మయా సార్ధమ్ = నాతో కూడ, వనవాసాయ = వనవాసముకొరకు, సృష్టాసి = సృష్టింపబడినావో, ఆ కారణమువలన, ఆత్మవతా = దృఢ మైన మనస్సుకలవానిచే, కీర్తిర్యథా = కీర్తి వలె, మయా = నాచేత, విహాతుమ్ = విడచుటకు, న శక్యా = శక్య మైన దానవు కావు.

తా. సీతా! నిన్ను బ్రహ్మ నాతో కలిసి వనవాసము చేయుటకే సృష్టించినట్లున్నది. అందుచే, ఆత్మాభిమానవంతుడు కీర్తిని ఏ విధముగ విడువజాలడో, ఆ విధముగనే నిన్ను విడువజాలను. 29

మూ. ధర్మస్తు గజనాసోరు సద్భిరాచరితః పురా
తం చాహమనువర్తేఽద్య యథా సూర్యం సువర్చలా.

ప్ర. అ. గజనాసోరు = గజతుండము వంటి ఊరువులు గల ఓ సీతా! ధర్మః = పితృవాక్యపరిపాలనరూప మగు ధర్మము, పురా = పూర్వము, సద్భిః = సత్పురుషులచే, ఆచరితః = ఆచరింపబడినది. సువర్చలా = సువర్చల, సూర్యం యథా = సూర్యుని వలె, తమ్ = ఆ ధర్మమును, అహమ్ = నేను, అద్య = ఇపుడు, అనువర్తే = అనుసరించెదను.

తా. ఓ సీతా! పితృవాక్యపరిపాలన మను ధర్మమును పూర్వము సత్పురుషు లందరును ఆచరించిరి. సువర్చ్వం సూర్యునే అనుసరించు నట్లు నే నిపుడు ఆ ధర్మమునే ఆచరింతును. ౩౦

మూ. న ఖల్వహం న గచ్ఛేయం వనం జనకనన్దిని
వచనం తన్నయతి మాం పితుః సత్యోపబృంహితమ్. ౩౧

ప్ర. అ. జనకనన్దిని = ఓ సీతా! అహమ్ = నేను, వనమ్ = వనమును గూర్చి, న ఖలు న గచ్ఛేయమ్ = వెళ్ల నను 'మాట లేదు.' పితుః = తండ్రియొక్క, సత్యోపబృంహితమ్ = సత్యముచే పరిపుష్ట మైన, తత్ వచః = ఆ వచనము, మామ్ = నన్ను, నయతి = తీసికొనివెళ్లుచున్నది.

తా. సీతా! సత్యముచే పరిపుష్ట మైన మా తండ్రి వచనము నన్ను వనమునకు తీసికొనివెళ్లుచున్నది. అందుచే నేను తప్పక వనమునకు వెళ్లెదను. ౩౧

మూ. ఏష ధర్మస్తు సుశ్రోణి పితుర్మాతుశ్చ వశ్యతా
అతశ్చ తం వ్యతిక్రమ్య నాహం జీవితుముత్సహే. ౩౨

ప్ర. అ. సుశ్రోణి = ఓ సీతా! పితుః = తండ్రికిని, మాతుశ్చ = తల్లికిని, వశ్యతా = లొంగియుండుట అను, ఏషః = ఇది, ధర్మస్తు = ధర్మము. అతశ్చ = ఆ కారణమువలన, తమ్ = ఆ ధర్మమును, వ్యతిక్రమ్య = అతిక్రమించి, అహమ్ = నేను, జీవితుమ్ = జీవించుటకు, న ఉత్సహే = కోరను.

తా. సీతా! తల్లికిని తండ్రికిని లొంగి యుండుట అనునదే ధర్మము. అందుచే నే నా ధర్మమును అతిక్రమించి జీవించుటకు ఇచ్చగించను. ౩౨

మూ. అస్వాధీనం కథం దైవం ప్రకారైరభిరాధ్యతే
స్వాధీనం సమతిక్రమ్య మాతరం పితరం గురుమ్. ౩౩

ప్ర. అ. స్వాధీనమ్ = తనకు అందుబాటులో నున్న, మాతరమ్ = తల్లిని, పితరమ్ = తండ్రిని, గురుమ్ = గురువునూ, సమతిక్రమ్య = అతిక్రమించి, అస్వాధీనమ్ = స్వాధీనము కాని, దైవమ్ = దైవము, ప్రకారైః = వివిధరీతులంచే, కథమ్ = ఎట్లు, అభిరాధ్యతే = ఆరాధింపబడును.

తా. తల్లి, తండ్రి, గురువు అనువారు మనకు అందుబాటులో ఉన్నవారు. అట్టి వారిని కాదని, మనకు అందుబాటులో లేని దైవమును ఆరాధించుట ఎట్లు శక్య మగును. ౩౩

మూ. యత్ర్రయం తత్త్రయో లోకాః పవిత్రం తత్సమం భువి,
నాన్యదస్తి శుభాపాఙ్గే తేనేదమభిరాధ్యతే. ౩౪

ప్ర. అ. శుభాపాఙ్గే = అంద మైన నేత్రములు కలదానా, యత్ = ఏ, త్రయమ్ = మాతృపితృగురువు లను త్రయము గలదో, తత్ = అది, త్రయః లోకాః = మూడు లోకములు. తత్సమమ్ = ఆ త్రయముతో, సమాన మైనది, అన్యత్ = మరియొకటి, లోకే = లోకమునందు, నాస్తి = లేదు. తేన = ఆ కారణము చేత, ఇదమ్ = ఇది, అభిరాధ్యతే = సేవింపబడుచున్నది.

తా. ఓ సీతా! పితృమాతృగురువులే మూడు లోకములు. వీరితో సమాన మైన వా రెవరును ఈ భూలోకమునందు లేరు. అందుచే వారి సేవ చేయవలెను.

మూ. న సత్యం దానమానౌ వా న యజ్ఞాశ్చాప్తదక్షిణాః,
తథా బలకరాః సీతే యథా సేవా పితుర్మతా. ౩౫

ప్ర. అ. సీతే = సీతా! పితుః = తండ్రియొక్క, సేవా = సేవ, యథా = ఎట్లు, మతా = బలకరమని చెప్పబడినదో, తథా = అట్లు, సత్యమ్ = సత్యము, న = కాదు. దానమానౌ = దానమానములు, న = కాదు. ఆప్తదక్షిణాః = పొందబడిన (ఇవ్వబడిన) దక్షిణలు గల, యజ్ఞాః చ = యజ్ఞములును, బలకరాః న = బలకరములు కాదు.

తా. తండ్రియొక్క సేవ ఏ విధముగ బలకరమో అట్లు సత్యము గాని, దానమానములు గాని, భూరిదక్షిణలు గల యజ్ఞములు గాని బలకరములు కావు.

మూ. స్వర్గో ధనం వా ధాన్యం వా విద్యాః పుత్రాః సుఖాని చ
గురువృత్త్యనురోధేన న కించిదపి దుర్లభమ్. ౩౬

ప్ర. అ. గురువృత్త్యనురోధేన = తండ్రి కోరికను అనుసరించుటచే, స్వర్గః = స్వర్గము గాని, ధనం వా = ధనము, ధాన్యంవా = ధాన్యము, విద్యాః = విద్యలు, పుత్రాః = పుత్రులు, సుఖాని చ = సుఖములు, కించిదపి = ఏదియు, దుర్లభమ్ = లభింప శక్యము కానిది, న = కాదు.

తా. తండ్రి యాజ్ఞను పాలించుటచే, స్వర్గము గాని, ధనము గాని, ధాన్యముగాని, విద్యలు గాని, పుత్రులుగాని, సుఖములు గాని, ఏదైనను లభించును. లభించని దేదియు నుండదు.

మూ. దేవగన్ధర్వగోలోకాన్ బ్రహ్మలోకం తథాపరాన్,
ప్రాప్నువన్తి మహాత్మానో మాతాపితృపరాయణాః. ౩౭

ప్ర. అ. మాతాపితృపరాయణాః = తలిదండ్రులే పరమగతి యని భావించు, మహాత్మానః = మహాత్ములు, దేవగన్ధర్వగోలోకాన్ = దేవలోక-గంధర్వ లోక గోలోకములను, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును, తథా = మరియు, అప రాన్ = ఇతర మైన ఉత్తమ లోకములను, ప్రాప్నువన్తి = పొందుదురు.

తా. మాతాపితృసేవాపరాయణు లగు మహాత్ములు, దేవలోకమును, గంధర్వలోకమును. గోలోకమును, బ్రహ్మలోకమును, తదితరపుణ్యలోకము లను పొందగలరు. ౩౭

మూ. స మాం పితా యథా శాస్తి సత్యధర్మపథే స్థితః,
తథా వర్తితుమిచ్ఛామి స హి ధర్మః సనాతనః. ౩౮

ప్ర. అ. సత్యధర్మపథే = సత్యధర్మమార్గమునందు, స్థితః = ఉన్న, సః పితా = ఆ తండ్రి, మామ్ = నన్ను, యథా = ఎట్లు, శాస్తి = శాసించునో, తథా = అట్లు, వర్తితుమ్ = ప్రవర్తించుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. సః = అదియే, సనాతనః = సనాతన మైన, ధర్మః హి = ధర్మము కదా.

తా. సత్యధర్మమార్గము ననుసరించుచున్న నా తండ్రి నన్నెట్లు ఆజ్ఞా పించునో ఆ విధముగనే ప్రవర్తింపవలె నని నేను కోరుచున్నాను. అదియే సనాతనధర్మము కదా! ౩౮

మూ. మమ సన్నా మతిః సీతే త్వాం నేతుం దణ్డకావనమ్,
వసిష్యామీతి సా త్వం మామనుయాతుం సునిశ్చితా. ౩౯

ప్ర. అ. సీతే = సీతా! త్వామ్ = నిన్ను, దణ్డకావనమ్ = దండకావన మును గూర్చి, నేతుమ్ = తీసికొని వెళ్ళుటకు, మమ = నాయొక్క, మతిః = బుద్ధి, సన్నా = ఉత్సాహవిహీనముగా నున్నది. సా త్వమ్ = అట్టి నీవు, వసిష్యామి =

అరణ్యములో నివసింపగలను. ఇతి = అని పలుకుచు, మామ్ = నన్ను, అనుయాతుమ్ = అనుసరించి వెళ్ళుటకు, సునిశ్చితా = దృఢముగా నిశ్చయము కల్గియున్నావు.

తా. సీతా! నిన్ను కూడ దండకావనమునకు తీసికొనివెళ్లవలె నను ఉత్సాహము నాకు లేకుండెను. కాని నీవు అరణ్యములో నివసించెద నని చెప్పుచు నాతో వచ్చుటకు కృతనిశ్చయురాల వై ఉన్నావు. 39

మూ. సా హి దిష్టాఽనవద్యాఙ్గీ వనాయ మదిరేక్షణే,
అనుగచ్ఛస్వ మాం భీరు సహధర్మచరీ భవ. 40

ప్ర. అ. మదిరేక్షణే = మదజనకము లగు నేత్రములు గల సీతా! అనవద్యాఙ్గీ = నిర్దుష్ట మైన సకలావయవములు గల, సా = అట్టి నీవు, వనాయ = వనమునకు వెళ్లుటకు, దిష్టా = అనుమతింపబడితివి. భీరు = భయస్వభావము గల ఓ సీతా! మామ్ = నన్ను, అనుగచ్ఛస్వ = అనుసరింపుము. సహధర్మచరీ = సహధర్మచారిణి వై, భవ = అగుము.

తా. ఓ మదిరేక్షణా! నిర్దుష్టములైన సకలావయములు గల నిన్ను అనుమతించుచున్నాను. నాతో రమ్ము. నాకు సహధర్మచారిణివి అగుము. 40

మూ. సర్వథా సదృశం సీతే మమ స్వస్య కులస్య చ,
వ్యవసాయమనుక్రాన్తా కాన్తే త్వమతిశోభనమ్. 41

ప్ర. అ. కాన్తే = మనోహరురాల వైన, సీతే = సీతా! త్వమ్ = నీవు, మమ = నాకును, స్వస్య = తన, కులస్య చ = కులమునకును, సర్వథా = అన్ని విధముల, సదృశమ్ = తగిన, అతిశోభనమ్ = చాల మంచి దైన, వ్యవసాయమ్ = ఉద్యమమును, అనుక్రాన్తా = ప్రారంభించితివి.

తా. సీతా! నాకును, నీ కులమునకును అన్ని విధాలా తగిన మంచి నిర్ణయమును తీసికొనినావు. 41

మూ. ఆరభస్వ గురుశ్రోణి వనవాసక్షమాః క్రియాః,
నేదానీం త్వదృతే సీతే స్వర్గోఽపి మమ రోచతే. 42

ప్ర. అ. శుభశ్రోణి = సీతా! వనవాసక్షమాః = వనవాసమునకు తగిన, క్రియాః = క్రియలను, ఇదానీమ్ = ఇప్పుడు, ఆరభస్వ = ప్రారంభింపుము. సీతే = సీతా! త్వదృతే = నీవు లేనిచో, మమ = నాకు, స్వర్గోఽపి = స్వర్గము కూడ, న రోచతే = ఇష్టము కాదు.

తా. సీతా! వెంటనే వనవాసమునకు తగిన పనులన్నియు ప్రారంభించుము. నీవు లేనిచో స్వర్గము కూడ నా కిష్టము కాదు.

మూ. బ్రాహ్మణేభ్యశ్చ రత్నాని భిక్షుకేభ్యశ్చ భోజనమ్,
దేహి చాశంసమానేభ్యః సంత్వరస్వ చ మా చిరమ్. 43

ప్ర. అ. ఆశంసమానేభ్యః = కోరుచున్న, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు, రత్నాని చ = రత్నములనూ, భిక్షుకేభ్యః = భిక్షుకులకు, భోజనం చ = భోజనమును, దేహి = ఇమ్ము. సంత్వరస్వ చ = తొందర పడుము. చిరమ్ = ఆలస్యము, మా = వద్దు.

తా. కోరి వచ్చిన బ్రాహ్మణులకు రత్నాలనూ, భిక్షుకులకు భోజనమునూ ఇమ్ము. తొందరగా చేయుము. ఆలస్యము చేయకుము. 43

మూ. భూషణాని మహార్హాణి వరవస్త్రాణి యాని చ,
రమణీయాశ్చ యే కేచిత్క్రీడార్థాశ్చాప్యుపస్కరాః, 44
శయనీయాని యానాని మమ చాన్యాని యాని చ,
దేహి స్వభృత్యవర్గస్య బ్రాహ్మణానామనన్తరమ్, 45

ప్ర. అ. మహార్హాణి = గొప్ప విలువ గల, యాని = ఏ, భూషణాని = భూషణములూ, వరవస్త్రాణి = శ్రేష్ఠమైన వస్త్రములూ ఉన్నవో వాటినీ, రమణీయాః = సుందరమైన, యే కేచిత్ = ఏ, క్రీడార్థాః = ఆటకొరకైన, ఉపస్కరాః = సాధనము లున్నవో వాటినీ, మమ = నాయొక్క, శయనీయాని = శయనములు, యానాని = వాహనములు, అన్యాని = ఇతరమైన, యాని చ = ఏవి కూడ ఉన్నవో వాటిని, స్వభృత్యవర్గస్య = నీభృత్యవర్గమునకు, దేహి = ఇమ్ము. అనన్తరమ్ = పిదప, బ్రాహ్మణానామ్ = బ్రాహ్మణులకు ఇమ్ము.

తా. మంచి విలువ గల అలంకారములను, వస్త్రములను, అందమైన క్రీడా సాధనములను, నాకు సంబంధించిన శయనములను, తదితరవస్తువులను నీ పోషణలో నుండువారి కిమ్ము. ఇంకను మిగిలినవాటిని బ్రాహ్మణులం కిమ్ము. 44, 45

మూ. అనుకూలం తు సా భర్తుర్జ్ఞాత్వా గమనమాత్మనః,
క్షిప్రం ప్రముదితా దేవీ దాతుమేవోపచక్రమే. 46

ప్ర. అ. సా దేవీ=ఆ సీతాదేవి, ఆత్మనః=తనయొక్క, గమనమ్=గమనమును, భర్తుః=భర్తకు, అనుకూలమ్=అనుకూలమైన దానినిగా, జ్ఞాత్వా=తెలిసికొని, ప్రముదితా=చాల సంతోషించినదై, క్షిప్రమ్=వెంటనే, దాతుమేవ=ఇచ్చుటకై, ఉపచక్రమే=ఉపక్రమించెను.

తా. తాను కూడ అరణ్యమునకు వచ్చుట భర్తకు సమ్మతమే అని తెలిసికొనిన సీతాదేవి చాల సంతోషించి, వెంటనే దానములు చేయ ప్రారంభించెను.

మూ. తతః ప్రహృష్టా ప్రతిపూర్ణమానసా,
యశస్వినీ భర్తురవేక్ష్య భాషితమ్,
ధనాని రత్నాని చ దాతుమఙ్గనా,
ప్రచక్రమే ధర్మభృతాం మనస్వినీ. 47

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రింశః సర్గః.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, యశస్వినీ=కీర్తి కలదియు, మనస్వినీ=పరిశుద్ధమైన మనస్సు కలదియు అయిన, అఙ్గనా=సీత, భర్తుః=భర్తయొక్క, భాషితమ్=మాటను, అవేక్ష్య=చూచి, (విని), ప్రహృష్టా=సంతోషించినదై, ప్రతిపూర్ణమానసా=నిండిన మనస్సు కలదై, ధర్మభృతామ్=ధార్మికులకు, ధనాని=ధనములను, రత్నాని చ=రత్నములను, దాతుమ్=ఇచ్చుటకు, ప్రచక్రమే=ప్రారంభించెను.

తా. కీర్తిమంతురాలూ, పవిత్ర మైన మనస్సు కలదీ అయిన సీతా దేవి భర్త మాటలు విని సంతోషించి, నిండు మనస్సుతో, రత్నములనూ, ధనమునూ, ధర్మాత్ములకు దానము చేయ ప్రారంభించెను. 47

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ముప్పదవ సర్గ సమాప్తము.

# అథ ఏకత్రింశః సర్గః

[రామలక్ష్మణుల సంవాదము, రాముని ఆజ్ఞప్రకారము లక్ష్మణుడు మిత్రాదులకు వీడ్కోలు చెప్పి, దివ్యాయుధములు గ్రహించి వనమునకు బయలుదేరుట, ధనమునంతను బ్రాహ్మణులకు దానము చేసివేయుము అని రాముడు అతనిని ఆదేశించుట].

మూ. ఏవం శ్రుత్వా తు సంవాదం లక్ష్మణః పూర్వమాగతః,
బాష్పపర్యాకులముఖః శోకం సోఢుమశక్నువన్ 1
స భ్రాతుశ్చరణౌ గాఢం నిపీడ్య రఘునన్దనః,
సీతామువాచాతియశాం రాఘవం చ మహావ్రతమ్. 2

ప్ర. అ. పూర్వమ్=ముందుగానే, ఆగతః=అచటికి వచ్చిన, లక్ష్మణః=లక్ష్మణుడు, ఏవమ్=ఈ విధముగా, సంవాదమ్=సంవాదమును, శ్రుత్వా=విని, శోకమ్=దుఃఖమును, సోఢుమ్=సహించుటకు, అశక్నువన్=అసమర్థుడై, బాష్పపర్యాకులేక్షణః= కన్నీటితో వ్యాకులమైన నేత్రములు కలవాడయ్యెను. సః=ఆ, రఘునన్దనః=లక్ష్మణుడు, భ్రాతుః=సోదరునియొక్క, చరణౌ=పాదములను, గాఢమ్=గట్టిగా, నిపీడ్య=పీడించి, మహావ్రతమ్=గొప్ప వ్రతము గల, రాఘవం చ=రాముని గూర్చియు, అతియశామ్=గొప్ప కీర్తిగల, సీతామ్=సీతను గూర్చియు, ఉవాచ=పలికెను.

తా. అంతకు పూర్వమే అక్కడికి వచ్చిన లక్ష్మణుడు సీతారాముల మధ్య జరిగిన ఈ సంవాదము నంతను విని, కన్నీటితో వ్యాకులమైన నేత్రములు కలవాడై, దుఃఖమును ఓర్చుకొనజాలక, సోదరుని పాదములకు నమస్కరించుచు, గొప్ప నియమము గల రామునితోను, గొప్ప కీర్తి గల సీత తోను ఇట్లు పలికెను.

వి. 'మహాయశామ్' అనునది ఆర్ష ప్రయోగము. కొందరు 'మహాయశాః' అని దిద్ది 'లక్ష్మణః' అనుదానికి విశేషణముగా గ్రహించినారు. 1, 2

మూ. యది గన్తుం కృతా బుద్ధిర్వనం మృగగజాయుతమ్
అహం త్వానుగమిష్యామి వనమగ్రే ధనుర్ధరః. 3

ప్ర. అ. మృగగజాయుతమ్=మృగములతోనూ గజములతోనూ నిండిన, వనమ్=వనమును గూర్చి, గన్తుమ్=వెళ్ళుటకు, బుద్ధిః=నిర్ణయము, కృతా యది=చేయబడిన ట్లయితే, అహమ్=నేను, అగ్రే=నీ ఎదుట ధనుర్ధరః=ధనస్సును ధరించినవాడ నై, త్వా=నిన్ను, వనమ్=వనమును గూర్చి, అనుగమిష్యామి=అనుసరించెదను.

తా. మృగగజాదులతో నిండిన అరణ్యమునకు వెళ్ళవలె నని నీవు నిశ్చయించినచో, నేను కూడ ధనుర్ధారి నై, ముందు నడచుచు, నీతో అరణ్యమునకు వచ్చెదను. 3

మూ. మయా సమేతోఽరణ్యాని బహూని విచరిష్యసి
పక్షిభిర్మృగయూథైశ్చ సంఘుష్టాని సమన్తతః. 4

ప్ర. అ. సమన్తతః=అంతటను, పక్షిభిః=పక్షులచేతను, మృగయూథైః చ=మృగముల గుంపులచేతను, సంఘుష్టాని=ధ్వనింపచేయబడిన, బహూని=అనేక మైన, అరణ్యాని=అరణ్యములను, మయా=నాతో, సమేతః=కూడిన వాడవై, విచరిష్యసి=సంచరింపగలవు.

తా. పక్షులకూతలతోను, మృగములనాదములతోను అంతటా ప్రతిధ్వనించుచున్న అనేక అరణ్యములలో నాతో కలిసి సంచరించగలవు. 4

మూ. న దేవలోకాక్రమణం నామరత్వమహం వృణే
ఐశ్వర్యం వాపి లోకానాం కామయే న త్వయా వినా. 5

ప్ర. అ. అహమ్=నేను, త్వయా వినా=నీవు లేకుండగా, దేవలోకాక్రమణమ్=స్వర్గలోకాక్రమణమును, న వృణే=కోరను. అమరత్వమ్=దేవతాత్వమును, న=కోరను. లోకానామ్=సమస్తలోకముల, ఐశ్వర్యం వాపి=అధిపత్యము వైనను, న కామయే=కోరను.

తా. నీవు లేనిచో నాకు దేవలోకముపై విజయము గాని, దేవతాత్వము గాని, త్రిలోకాధిపత్యము గాని అక్కరలేదు. 5

మూ. ఏవం బ్రువాణః సౌమిత్రిర్వనవాసాయ నిశ్చితః।
రామేణ బహుభిః సాన్త్వైర్నిషిద్ధః పునరబ్రవీత్. 6

ప్ర. అ. వనవాసాయ=వనవాసమునకై, నిశ్చితః = నిశ్చయము చేసికొని, ఏవమ్=ఈ విధముగా, బ్రువాణః=పలుకుచున్న, సౌమిత్రిః=లక్ష్మణుడు, రామేణ = రామునిచేత, బహుభిః = అనేకమైన, సాన్త్వైః = ఓదార్పుమాటలచే, నిషిద్ధః=నిషేధింపబడినవాడై, పునః=మరల, అబ్రవీత్=పలికెను.

తా. వనవాసమునకై నిశ్చయము చేసికొని ఈ విధముగా పలికిన లక్ష్మణుని, రాముడు వనమునకు రావలదని అనేకవిధముల చెప్పి ఓదార్చెను. అది విని లక్ష్మణుడు మరల ఇట్లు పలికెను. 6

మూ. అనుజ్ఞాతశ్చ భవతా పూర్వమేవ యదస్మ్యహమ్
కిమిదానీం పునరిదం క్రియతే మే నివారణమ్.

ప్ర. అ. అహమ్=నేను, భవతా=నీచేత, పూర్వమేవ = ముందుగనే, అనుజ్ఞాతః=అనుమతింపబడినవాడను, అస్మి యత్=అయితిని గదా! ఇదానీమ్=ఇప్పుడు, పునః=మరల, ఇదమ్=ఈ, నివారణమ్=నివారణము, కిమ్=ఎందుచేత, క్రియతే=చేయబడుచున్నది?

తా. నీవు ఇంతకు పూర్వమే నాకు అనుమతి ఇచ్చితివి కదా; ఇప్పుడీ విధముగా నివారించుచున్నావేమి? 7

మూ. యదర్థం ప్రతిషేధో మే క్రియతే గన్తుమిచ్ఛతః।
ఏతదిచ్ఛామి విజ్ఞాతుం సంశయో హి మమానఘ. 8

ప్ర. అ. అనఘ=దోషరహితుడా! గన్తుమ్=వెళ్లుటకు, ఇచ్ఛతః=కోరుచున్న, మే=నాయొక్క, ప్రతిషేధః=నిషేధము, యదర్థమ్ = ఎందునిమిత్తమై, క్రియతే = చేయబడుచున్నదో, ఏతత్ = దీనిని, విజ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. మే = నాకు, సంశయః హి = సంశయము కలుగుచున్నది కదా!

తా. నేను నీతో రావలెనని అనుకొనుచుండగా నన్ను ఎందుచేత అడ్డు పెట్టుచున్నావో, తెలిసికొనగోరుచున్నాను. నా మనస్సులో సంశయము కలుగుచున్నది. 8

మూ. తతోఽబ్రవీన్మహాతేజా రామో లక్ష్మణమగ్రతః,
స్థితం ప్రాగ్గామినం వీరం యాచమానం కృతాంజలిమ్. 9

ప్ర. అ. తతః=అటుపిమ్మట, మహాతేజాః=గొప్ప తేజస్సు గల, రామః=రాముడు, అగ్రతః=తన యెదట, స్థితమ్ = నిలిచి యున్నవాడూ, ప్రాగ్గామినమ్=ముందుగా వెళ్ళుచున్నవాడూ, వీరమ్=వీరుడూ, యాచమానమ్=ప్రార్థించుచున్నవాడూ, కృతాఞ్జలిమ్=దోసిలి కట్టినవాడూ, అయిన, లక్ష్మణమ్=లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను.

తా. లక్ష్మణుడు ఈ విధముగ ఎదుట నిలచి, ముందుగనే అరణ్యమునకు పోవుటకు సంసిద్ధుడై, చేతులు మోడ్చి ఈ విధముగ ప్రార్థించుచుండగా మహాతేజశ్శాలి యగు రాముడు ఆ వీరునితో ఇట్లు పలికెను. 9

మూ. స్నిగ్ధో ధర్మరతో వీరస్సతతం సత్పథే స్థితః
ప్రియః ప్రాణసమో వశ్యో భ్రాతా చాపి సఖా చ మే. 10

ప్ర. అ. స్నిగ్ధః=స్నేహము కలవాడవూ, ధర్మరతః=ధర్మమునందు ఆసక్తి కలవాడవూ, వీరః=వీరుడవూ, సతతమ్=ఎల్లప్పుడును, సత్పథే=మంచి మార్గమునందు, స్థితః=ఉన్నవాడవూ అయిన నీవు, మే=నాకు, ప్రాణసమః=ప్రాణములతో సమానుడవైన, ప్రియః=ప్రియుడవు. వశ్యః=వశములో నుండువాడవు. భ్రాతా చాపి=సోదరుడవు. సఖా చ=స్నేహితుడవు.

తా. నీవు మంచి స్నేహశీలము కలవాడవు. ధర్మనిరతుడైన వీరుడవు. ఎల్లప్పుడును సన్మార్గమునందే సంచరించువాడవు. నాకు ప్రాణము వంటి వాడవు. సర్వదా నా ఆజ్ఞ ననుసరించు సోదరుడవే కాదు; మిత్రుడవు కూడ. 10

మూ. మయాఽద్య సహ సౌమిత్రే త్వయి గచ్ఛతి తద్వనమ్,
కో భరిష్యతి కౌసల్యాం సుమిత్రాం వా యశస్వినీమ్. 11

ప్ర. అ. సౌమిత్రే=ఓ లక్ష్మణా, త్వయి=నీవు, అద్య=ఇపుడు, మయా సహ=నాతో కూడ, తత్ వనమ్=ఆ వనమును గూర్చి, గచ్ఛతి = వెళ్లగా, కౌసల్యామ్=కౌసల్యను, యశస్వినీమ్=కీర్తి గల, సుమిత్రాం చ=సుమిత్రను, కః=ఎవరు, భరిష్యతి=పోషింతురు?

తా. లక్ష్మణా నీవు నాతో కలిసి అరణ్యమునకు వచ్చినచో కౌసల్యను, యశోమంతురా లగు సుమిత్రను ఎవరు పోషింతురు? 11

మూ. అభివర్షతి కామైర్యః పర్జన్యః పృథివీమివ,
స కామపాశపర్యస్తో మహాతేజా మహీపతిః. 12

ప్ర. అ. మహాతేజాః=గొప్పతేజస్సు గల, యః=ఏ, మహీపతిః=రాజు, పృథివీమ్=భూమిని, పర్జన్యః ఇవ=మేఘము వలె, కామైః=కోరిన పదార్థములచే, అభివర్షతి=వర్షించునో, సః=అతడు, కామపాశపర్యస్తః=కామ మనే పాశము చేత చుట్టబడినాడు.

తా. మహాతేజశ్శాలి యగు దశరథ మహారాజు, భూమిపై మేఘము వర్షించినట్లు కోరిన కోరిక లన్నియు వర్షించుచుండెడివాడు. కాని ఇపు డారాజు కామపాశముచే కట్టబడి ఉన్నాడు. 12

మూ. సా హి రాజ్యమిదం ప్రాప్య నృపస్యాశ్వపతేః సుతా,
దుఃఖితానాం సపత్నీనాం న కరిష్యతి శోభనమ్. 13

ప్ర. అ. నృపస్య=రాజైన, అశ్వపతేః=అశ్వపతియొక్క, సుతా=కుమార్తె యైన, సా=ఆ కైకేయి, ఇదం రాజ్యమ్=ఈ రాజ్యమును, ప్రాప్య=పొంది, దుఃఖితానామ్=దుఃఖించుచున్న, సపత్నీనామ్=సవతులకు, శోభనమ్=మంచిని, న కరిష్యతి హి=చేయదు కదా?

తా. ఎందుచేత ననగా ఈ రాజ్యము లభించిన పిమ్మట, ఆ కైకేయి దుఃఖాక్రాంత లైన సవతులకు కష్టము కల్గించును. 13

మూ. న స్మరిష్యతి కౌసల్యాం సుమిత్రాం చ సుదుఃఖితామ్
భరతో రాజ్యమాసాద్య కైకేయ్యాం పర్యవస్థితః. 14

ప్ర. అ. భరతః = భరతుడు, రాజ్యమ్ = రాజ్యమును ఆసాద్య=పొంది, కైకేయ్యామ్ = కైకేయియందు, పర్యవస్థితః = ఉన్నవాడై, కౌసల్యామ్ = కౌసల్యను, సుదుఃఖితామ్ = మిక్కిలి దుఃఖితురా లైన, సుమిత్రాం చ=సుమిత్రను, న స్మరిష్యతి = స్మరించడు.

తా. భరతుడు రాజ్యమును పొంది, కైకేయి మాటలనే వినుచు దుఃఖితురాలైన కౌసల్యను, సుమిత్రను స్మరింపడు. 14

మూ. తామార్యాం స్వయమేవేహ రాజానుగ్రహణేన వా
సౌమిత్రే భర కౌసల్యా ముక్తమర్థమిమం చర. 15

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా, స్వయమేవ = స్వయముగానే కాని, రాజానుగ్రహణేన వా = రాజును అనుగ్రహింపచేసికొనుటచేగాని, ఇహ=ఇక్కడనే ఉండి, ఆర్యామ్=పూజ్యురా లైన, తాం కౌసల్యామ్=ఆ కౌసల్యను, భర= పోషించుము. ఇమమ్ = ఈ, ఉక్తమ్=చెప్పబడిన, అర్థమ్=కార్యమును, చర= చేయుము.

తా. లక్ష్మణా! నీవు ఇచటనే ఉండి స్వయముగా గాని, రాజును అనుగ్రహింపచేసుకొనుటగాని, పూజ్యురా లైన కౌసల్యను పోషించుము. నేను చెప్పినట్లు చేయుము. 15

మూ. ఏవం మమ చ తే భక్తిర్భవిష్యతి సుదర్శితా
ధర్మజ్ఞ గురుపూజాయాం ధర్మశ్చాప్యతులో మహాన్

ప్ర. అ. ధర్మజ్ఞ = ధర్మములు తెలిసినవాడా! ఏవమ్ = ఈ విధముగా, మమ = నా విషయమున, తే = నీయొక్క, భక్తిః = భక్తి, సుదర్శితా = బాగుగ చూపబడినది, భవిష్యతి=కాగలదు. గురుపూజాయామ్=పెద్దలను పూజించుటలో అతులః = సాటి లేని, మహాన్ = గొప్ప, ధర్మశ్చ = ధర్మముకూడ కలుగును.

తా. ధర్మజ్ఞుడ వైన ఓ లక్ష్మణా! ఇట్లు చేసినచో, నీకు నాపై కల భక్తిని బాగుగ చూపినట్లగును. పెద్దల శుశ్రూష చేయుటచే సాటిలేని, గొప్ప ధర్మము కూడ లభించును. 16

మూ.. ఏవం కురుష్వ సౌమిత్రే మత్కృతే రఘునన్దన
అస్మాభిర్విప్రహీనాయా మాతుర్నో న భవేత్సుఖమ్. 17

ప్ర. అ. రఘునన్దన = రఘువంశమును ఆనందింపచేయు, సౌమిత్రే = ఓ లక్ష్మణా, మత్కృతే = నా నిమిత్తమై, ఏవమ్ = ఇట్లు, కురుష్వ = చేయుము. అస్మాభిః = మనతో, విప్రహీనాయాః = వియోగమును పొందిన, నః = మన యొక్క, మాతుః = తల్లికి, సుఖమ్ = సుఖము, న భవేత్ = కలుగదు.

తా. రఘువంశమునకు ఆనంద కరుడ వగు ఓ లక్ష్మణా! నాకొరకైనను నేను చెప్పి నట్లు చేయుము. మనము దగ్గర లేనితో, తల్లికి సుఖము ఉండదు.

మూ. ఏవముక్తస్తు రామేణ లక్ష్మణః శ్లక్ష్ణయా గిరా
ప్రత్యువాచ తదా రామం వాక్యజ్ఞో వాక్యకోవిదమ్. 18

ప్ర. అ రామేణ = రామునిచేత, ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలుక బడిన, వాక్యజ్ఞః = మాటలలో నేర్పరి అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, తదా = అపుడు, వాక్యకోవిదమ్ = మాటలయందు పండితు డైన, రామమ్ = రాముని గూర్చి, శ్లక్ష్ణయా = మనోహర మైన, గిరా = వాక్కుతో, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. మాటలలో నేర్పరి యైన లక్ష్మణుడు, రాముని మాటలు విని, మాట లలో నేర్పు గల అతనితో, మధుర మైన వాక్కుతో ఇట్లు పలికెను. 18

మూ తవైవ తేజసా వీర భరతః పూజయిష్యతి
కౌసల్యాం చ సుమిత్రాం చ ప్రయతో నాత్ర సంశయః

ప్ర. అ. వీర! = ఓవీరుడా! భరతః = భరతుడు, తవ = నీయొక్క, తేజసైవ = తేజస్సుచేతనే, ప్రయతః = వినయవంతుడై, కౌసల్యాం చ = కౌసల్యను, సుమిత్రాం చ = సుమిత్రను, పూజయిష్యతి = పూజింపగలడు. అత్ర = ఈ విష యమున, సంశయః = సంశయము, న = లేదు.

తా. వీరుడ వైన ఓ రామా! నీ పరాక్రమమునకే భయపడి, భరతుడు వినయవంతు డై, కౌసల్యను, సుమిత్రను, ఆదరించగలడు, ఇందుకు సందే హము లేదు. 19

మూ. కౌసల్యా బిభృయాదార్యా సహస్రమపి మద్విధాన్
యస్యాః సహస్రం గ్రామాణాం సంప్రాప్తముపజీవినామ్.

ప్ర. అ. యస్యాః = ఏ కౌసల్యకు, ఉపజీవినామ్ = ఆమెను ఆధారముగా చేసుకొని జీవించు, గ్రామాణామ్ = గ్రామములయొక్క, సహస్రమ్=సహస్రము, సంప్రాప్తమ్=పొందబడినదో, అట్టి, ఆర్యా=పూజ్యురాలైన, కౌసల్యా=కౌసల్య, మద్విధాన్ = నావంటివారిని, సహస్రమపి = వేయిమందిని కూడ, బిభృయాత్= భరింపగలదు.

* భా. వెయ్యి గ్రామములు కౌసల్య చేతిలో నుండి, ఆమె అనుగ్రహముపై జీవించుచున్నవి. అట్టి పూజ్యురాలగు కౌసల్య నావంటివారిని వెయ్యిమందినైనను పోషింపగలదు. 20

మూ. తదాత్మభరణే చైవ మమ మాతుస్తథైవ చ
పర్యాప్తా మద్విధానాం చ భరణాయ యశస్వినీ. 21

ప్ర. అ. తత్ = అందువలన, యశస్వినీ=కీర్తిమంతురాలైన ఆ కౌసల్య, ఆత్మభరణే చైవ = తనను పోషించుకొనుటయందును, తథైవ చ = మరియు, మమ మాతుః=నా తల్లియొక్కయు, మద్విధానాం చ =నావంటివారియొక్కయు, భరణాయ చ = పోషణమునకును, పర్యాప్తా=సమర్థురాలు.

భా. కీర్తిమంతురాలగు ఆ కౌసల్య, సహస్రగ్రామాధిపతి యగుటచే తనను, నా తల్లిని, నావంటి వారిని అనేకులను కూడ పోషింప సమర్థురాలు. 21

మూ. కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే
కృతార్థోఽహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే. 22

ప్ర. అ. మామ్ = నన్ను, అనుచరమ్ = నీ అనుచరునిగా, కురుష్వ = చేసికొనుము. ఇహ = దీనిలో, వైధర్మ్యమ్ = ధర్మవిరోధము, న విద్యతే=లేదు. అహమ్ = నేను, కృతార్థః = కృతార్థుడను, భవిష్యామి = కాగలను. తవ = నీయొక్క, అర్థః చ = కార్యముకూడ, ప్రకల్పతే = సిద్ధించును.

భా. నన్ను నీ అనుచరునిగా చేసికొనుము. దీనిలో ధర్మవిరోధ మేదియు లేదు. అట్లు చేయుటచే నేను కృతార్థుడ నగుదును. నీ కార్యము కూడ సిద్ధించును.

మూ. ధనురాదాయ సశరం ఖనిత్రపిటకాధరః
అగ్రతస్తే గమిష్యామి పన్థానమనుదర్శయన్. 23

ప్ర. అ. సశరమ్ = బాణములతో కూడిన, ధనుః = ధనుస్సును, ఆదాయ = గ్రహించి, ఖనిత్రపిటకాధరః = గునపమును చిన్న గంపను ధరించినవాడనై, తే = నీయొక్క, అగ్రతః = ఎదుట, పన్థానమ్ = మార్గమును, అనుదర్శయన్ = చూపుచు, గమిష్యామి = నడచెదను.

తా. ధనుర్బాణములను, గునపమును, చిన్న గంపను తీసుకొని, నీకు మార్గమును చూపుచు, నీ ముందు నడచుచు వచ్చెదను. 23

మూ. ఆహరిష్యామి తే నిత్యం మూలాని చ ఫలాని చ
వన్యాని యాని చాన్యాని స్వాహారాణి తపస్వినామ్. 24

ప్ర. అ. మూలాని = దుంపలను, ఫలాని చ = పండ్లను, తపస్వినామ్ = మునులకు, స్వాహారాణి = మంచి ఆహారములైన, వన్యాని = వనమునందు లభించు, యాని = ఏ, అన్యాని చ = ఇతరవస్తువు లున్నవో వాటిని, నిత్యమ్ = ఎల్లపుడు, తే = నీకొరకై, ఆహరిష్యామి = తెచ్చి యిచ్చెదను.

తా. నీకు నిత్యము దుంపలు, ఫలములు, మునులకు మంచి ఆహారముగా ఉపయోగించు వనములో లభించు ఇతరవస్తువులు, తెచ్చి యిచ్చుచుందును.

మూ. భవాంస్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే
అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే. 25

ప్ర. అ. భవాంస్తు = నీవైతే, వైదేహ్యా సహ = సీతతో కూడ, గిరిసానుషు = పర్వతముల చరియల మీద, రంస్యతే = విహరించగలవు. తే = నీవు, జాగ్రతః = మేలుకొని యున్నపుడును, స్వపతశ్చ = నిద్రించుచున్నపుడును, అహమ్ = నేను, సర్వమ్ = సమస్తమును, కరిష్యామి = చేయగలను.

తా. నీవు మాత్రము సీతా సమేతుడవై, పర్వతముల చరియలందు విహరించ వచ్చును. నీవు మేల్కొని యున్నను, నిద్రించుచున్నను, నేను కార్యము లన్నియు చేయుచుందును. 25

మూ. రామస్త్వనేన వాక్యేన సుప్రీతః ప్రత్యువాచ తమ్,
వ్రజాపృచ్ఛస్వ సౌమిత్రే సర్వమేవ సుహృజ్జనమ్. 28

ప్ర. అ. రామస్తు = రాముడు, అనేన వాక్యేన = ఈ మాటచే, సుప్రీతః = చాల సంతోషించిన వాడై, తమ్ = అతనిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను. సౌమిత్రే = లక్ష్మణా, వ్రజ = వెళ్లుము. సర్వమేవ = సమస్తమైన, సుహృజ్జనమ్ = మిత్ర సముదాయమును, ఆపృచ్ఛస్వ = అడిగి రమ్ము.

తా. ఈ మాటలు విని రాముడు చాల సంతోషించి అతనితో ఇట్లు పలికెను. లక్ష్మణా! వెళ్ళి నీ మిత్రులందరి వద్ద సెలవు తీసుకొని రమ్ము. 28

మూ. యే చ రాజ్ఞో దదౌ దివ్యే మహాత్మా వరుణః స్వయమ్,
జనకస్య మహాయజ్ఞే ధనుషీ రౌద్రదర్శనే,
అభేద్యకవచే దివ్యే తూణీ చాక్షయసాయకే,
ఆదిత్యవిమలౌ చోభౌ ఖడ్గౌ హేమపరిష్కృతౌ,
సత్కృత్య నిహితం సర్వమేతదాచార్యసద్మని,
సర్వమాయుధమాదాయ క్షిప్రమావ్రజ లక్ష్మణ. 29

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! మహాత్మా = మహాత్ముడైన, వరుణః = వరుణుడు, స్వయమ్ = స్వయముగా, రాజ్ఞః = రాజైన, జనకస్య = జనకుని యొక్క, మహాయజ్ఞే = మహాయజ్ఞము నందు, దివ్యే = దివ్యమైనవి, రౌద్రదర్శనే = భయంకరమైన దర్శనము కలవి యైన, యే = ఏ, ధనుషీ = ధనుస్సులను, దివ్యే = దివ్యమైన, అభేద్యకవచే = భేదింప శక్యము కాని కవచములను, అక్షయసాయకే = అక్షయమైన బాణములు గల, తూణీ చ = అంబుల పొదులను, హేమపరిష్కృతౌ = బంగారముచే అలంకరింపబడిన, ఆదిత్యవిమలౌ = సూర్యుని వలె నిర్మలమైన, ఉభౌ = రెండు, ఖడ్గౌ = ఖడ్గములను, దదౌ = ఇచ్చెనో, ఏతత్ = ఈ, సర్వమ్ = అంతయు, సత్కృత్య = పూజించి, ఆచార్యసద్మని = ఆచార్యుడైన వశిష్ఠుని గృహమునందు, నిహితమ్ = ఉంచబడినది. సర్వమ్ = సమస్తమైన, ఆయుధమ్ = ఆయుధమును, ఆదాయ = గ్రహించి, క్షిప్రం = శీఘ్రముగా, ఆవ్రజ = రమ్ము.

తా. జనక మహారాజు చేసిన మహాయజ్ఞములో, మహాత్ముడగు వరుణుడు, స్వయముగా, చూచుటకు భయంకరము లైన రెండు దివ్య ధనుస్సులను, ఛేదించుటకు శక్యము గాని రెండు దివ్య కవచములను, అక్షయ మైన బాణములు కలతూణీరములను, బంగారముతో అలంకరించిన సూర్యుని వలె ప్రకాశించుచున్న రెండు ఖడ్గములను యిచ్చి యున్నాడు. ఈ ఆయుధము లన్నియు మన ఆచార్యుడగు వశిష్ఠుని గృహములో ఉంచి, పూజింపబడుచున్నవి. వాటి నన్నిటిని తీసుకొని శ్రీఘ్రముగా రమ్ము. 27-29

మూ. స సుహృజ్జనమామన్త్య్ర వనవాసాయ నిశ్చితః,
ఇక్ష్వాకుగురుమాగమ్య జగ్రాహాఽయుధ ముత్తమమ్. 30

ప్ర. అ. వనవాసాయ=వనవాసమునకు, నిశ్చితః=నిశ్చయించుకొనిన, సః=లక్ష్మణుడు, సుహృజ్జనమ్=మిత్ర జనమును, ఆమన్త్య్ర=వీడ్కొలిపి, ఇక్ష్వాకుగురుమ్=ఇక్ష్వాకు వంశగురు వైన వసిష్ఠుని, ఆగమ్య=పొంది, ఉత్తమమ్=ఉత్తమ మైన, ఆయుధమ్=ఆయుధమును, జగ్రాహ=గ్రహించెను.

తా. వనవాసమునకు నిర్ణయము చేసుకొన్న లక్ష్మణుడు, తన మిత్రులందరికి వీడ్కోలు చెప్పి, వసిష్ఠుని ఇంటికి వెళ్ళి అక్కడ ఉన్న ఉత్తమ మైన ఆయుధ సముదాయమును, తీసుకొనెను. 30

మూ. తద్దివ్యం రాజశార్దూలః సత్కృతం మాల్యభూషితమ్,
రామాయ దర్శయామాస సౌమిత్రిస్సర్వమాయుధమ్.

ప్ర. అ. రాజశార్దూలః = రాజ శ్రేష్ఠు డైన, సౌమిత్రిః=లక్ష్మణుడు, దివ్యమ్=దివ్య మైనదీ, సత్కృతమ్=పూజింపబడినదీ, మాల్య భూషితమ్=మాలలచే అలంకరింపబడినదీ అయిన, సర్వమ్=సమస్త మైన, తత్ ఆయుధమ్=ఆ ఆయుధమును, రామాయ=రామునకు, దర్శయామాస= చూపించెను.

తా. రాజశ్రేష్ఠు డైన ఆ లక్ష్మణుడు, మాలలచే అలంకృతములై పూజింపబడిన ఆ దివ్యాయుధముల నన్నింటిని తీసికొని వచ్చి రామునకు చూపెను. 31

మూ. తమువాచాత్మవాన్ రామః ప్రీత్యా లక్ష్మణ మాగతమ్,
కాలే త్వమాగతః సౌమ్య కాఙ్క్షితే మమ లక్ష్మణ. 32

ప్ర. అ. ఆత్మవాన్ = ధీరుడైన, రామః = రాముడు, ఆగతమ్ = వచ్చిన, తం లక్ష్మణమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, ప్రీత్యా = ప్రేమతో, ఉవాచ = పలికెను. సౌమ్య = సౌమ్యుడవైన, లక్ష్మణ = ఓ లక్ష్మణా। త్వమ్ = నీవు, మమ = నాకు, కాఙ్క్షితే = కోరబడిన, కాలే = కాలమునందు, ఆగతః = వచ్చితివి.

తా. వచ్చిన లక్ష్మణుని చూచి, రాముడు, ప్రేమపూర్వకముగా ఇట్లు పలికెను. సౌమ్యుడవైన ఓ లక్ష్మణా। నేను అనుకొన్న సమయమున వచ్చినావు. ౩౨

మూ. అహం ప్రదాతుమిచ్ఛామి యదిదం మామకం ధనమ్,
బ్రాహ్మణేభ్యస్తపస్విభ్యస్త్వయా సహ పరంతప. ౩౩

ప్ర. అ. పరంతప = శత్రువులను పీడించు ఓ లక్ష్మణా। అహమ్ = నేను, త్వయా సహ = నీతో కలసి, యత్ = ఏ, ఇదమ్ = ఈ, మామకమ్ = నాకు సంబంధించిన, ధనమ్ = ధనమున్నదో దానిని, తపస్విభ్యః = తపస్సు కల, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకు, ప్రదాతుమ్ = ఇచ్చుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. శత్రువులను పీడించు ఓ లక్ష్మణా। నీతో కలసి నేను, నా ధనమునంతను తపస్సు కల బ్రాహ్మణులకు ఇవ్వవలె నని కోరుచున్నాను. ౩౩

మూ. వసన్తీహ దృఢం భక్తా గురుషు ద్విజసత్తమాః,
తేషామపి చ మే భూయః సర్వేషాం చోపజీవినామ్. ౩౪

ప్ర. అ. ఇహ = ఇచట, గురుషు = గురువులయందు, దృఢమ్ = అధికముగ, భక్తాః = భక్తులై, ద్విజసత్తమాః = ఏ బ్రాహ్మణశ్రేష్ఠులు, వసన్తి = నివసించుచున్నారో, తేషామపి చ = వారికిని, భూయః = మరియు, సర్వేషామ్ = సమస్తమైన, మే = నా యొక్క, ఉపజీవినాంచ = ఆశ్రితులకును, ఇవ్వదలచుచున్నాను.

తా. గురువులపై దృఢమైన శ్రద్ధతో ఇచట నివసించు బ్రాహ్మణోత్తములకును, నన్ను ఆశ్రయించుకొన్నవారికిని ఇవ్వవలెనని కోరుచున్నాను. ౩౪

మూ. వసిష్ఠపుత్రం తు సుయజ్ఞమార్యం
త్వమానయాశు ప్రవరం ద్విజానామ్,
అభిప్రయాస్యామి వనం సమస్తా
నభ్యర్చ్య శిష్టానపరాన్ ద్విజాతీన్. 85

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకత్రింశస్సర్గః

ప్ర. అ. త్వమ్=నీవు, ద్విజానామ్ = ద్విజులలో, ప్రవరమ్ = శ్రేష్ఠుడు, వసిష్ఠపుత్రమ్ = వసిష్ఠుని పుత్రుడు, ఆర్యమ్ = పూజ్యుడు అయిన, సుయజ్ఞమ్ = సుయజ్ఞుని, ఆశు = శీఘ్రముగా, ఆనయ = తీసికొని రమ్ము. శిష్టాన్ = శిష్టులైన, అపరాన్ = ఇతరులైన, సమస్తాన్ ద్విజాతీన్ = అందరు బ్రాహ్మణులను, అభ్యర్చ్య = పూజించి, వనమ్ = వనమును గూర్చి, అభిప్రయాస్యామి = వెళ్ళెదను.

తా. ద్విజులలో శ్రేష్ఠుడు, వసిష్ఠ పుత్రుడు, పూజ్యుడు అయిన సుయజ్ఞుని వెంటనే తీసుకొని రమ్ము. సదాచారవంతులైన ఇతర బ్రాహ్మణు లందరిని కూడ పూజించి నేను అరణ్యమునకు వెళ్లెదను.

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్వాత్రింశస్సర్గః

[శ్రీరాముడు సీతాసమేతుడై వసిష్ఠపుత్రుడగు సుయజ్ఞుని పిలిపించి, ఆయనకు, ఆయన పత్నికిని అమూల్యములగు ఆభరణములు, రత్నములు, ధనములు మున్నగునవి యొసగుట, పిమ్మట లక్ష్మణునితో కలిసి బ్రాహ్మణులకు, బ్రహ్మచారులకు, సేవకులకు, త్రిజటుడను బ్రాహ్మణునకు మిత్రులకు, ధన మొసంగుట] !

మూ. తతః శాసనమాజ్ఞాయ భ్రాతుః శుభతరం ప్రియమ్
గత్వా స ప్రవివేశాశు సుయజ్ఞస్య నివేశనమ్. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సః = అతడు, భ్రాతుః = సోదరునియొక్క, శుభతరమ్ = మిక్కిలి శుభకరమైన, ప్రియమ్ = ప్రియకరమైన, శాసనమ్ = శాసనమును, ఆజ్ఞాయ = గ్రహించి, ఆశు = వెంటనే, గత్వా = వెళ్లి, సుయజ్ఞస్య = సుయజ్ఞునియొక్క, నివేశనమ్ = గృహమును, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. మిక్కిలి మంగళకరము, తనకు ప్రియము అయిన సోదరుని ఆజ్ఞ ప్రకారము లక్ష్మణుడు వెంటనే సుయజ్ఞుని ఇంటికి వెళ్లెను. 1

మూ. తం విప్రమగ్న్యగారస్థం వన్దిత్వా లక్ష్మణోఽబ్రవీత్
సఖేఽభ్యాగచ్ఛ పశ్య త్వం వేశ్మ దుష్కరకారిణః. 2

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, అగ్న్యగారస్థమ్ = అగ్నిగృహములో నున్న, తం విప్రమ్ = ఆ బ్రాహ్మణుని, వన్దిత్వా = నమస్కరించి, అబ్రవీత్ = పలికెను. సఖే = ఓ స్నేహితుడా, అభ్యాగచ్ఛ = రమ్ము. త్వమ్ = నీవు, దుష్కర కారిణః = ఇతరు లెవరు చేయజాలని కార్యము చేయుచున్న రామునియొక్క, వేశ్మ = గృహమును, పశ్య = చూడుము.

తా. లక్ష్మణుడు, అగ్నిగృహములో నున్న ఆ బ్రాహ్మణునకు నమస్కరించి ఇట్లు చెప్పెను. ఓ స్నేహితుడా ఇతరులెవ్వరు చేయజాలని కార్యము చేయుచున్న రాముని ఇంటికి వచ్చి చూడుము. 2

మూ. తతః సన్ధ్యాముపాస్యాశు గత్వా సౌమిత్రిణా సహ
జుష్టం తత్రావిశల్లక్ష్మ్యా రమ్యం రామనివేశనమ్. 3

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సంధ్యామ్ = సంధ్యను, ఉపాస్య = ఉపాసించి, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడ, ఆశు = శీఘ్రముగా, గత్వా = వెళ్లి, లక్ష్మ్యా = లక్ష్మిచేత, జుష్టమ్ = పొందబడిన, రమ్యమ్ = అందమైన, తత్ = ఆ, రామనివేశనమ్ = రామునిగృహమును, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. ఆ సుయజ్ఞుడు సంధ్యోపాసనము పూర్తిచేసుకొని, లక్ష్మణునితో కూడ వెంటనే వచ్చి లక్ష్మికి నిలయమై సుందరముగా నున్న రాముని గృహము లోనికి ప్రవేశించెను. 3

మూ. తమాగతం వేదవిదం ప్రాఞ్జలిః సీతయా సహ.
సుయజ్ఞమభిచక్రామ రాఘవోఽగ్నిమివార్చితమ్. 4

ప్ర. అ. రాఘవః = రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఆగతమ్ = వచ్చిన, వేదవిదమ్ = వేదవేత్తయైన, తం సుయజ్ఞమ్ = ఆ సుయజ్ఞుని, అర్చితమ్ = పూజింపబడిన, అగ్నిమ్ ఇవ = అగ్నిని వలె, సీతయా సహ = సీతతో కూడ, అభిచక్రామ = ప్రదక్షిణముచేసెను.

తా. వేదవేత్తయైన, ఆ సుయజ్ఞుడు వచ్చిన వెంటనే రాముడు సీతా సహితుడై నమస్కరించి, హోమానంతరము అగ్నికి ప్రదక్షిణముచేసి నట్లు అతనికి ప్రదక్షిణము చేసెను. 4

మూ. జాతరూపమయైర్ముఖ్యైరఙ్గదైః కుణ్డలైః శుభైః
సహేమసూత్రైర్మణిభిః కేయూరైర్వలయైరపి. 5
అన్యైః రత్నైర్బహుభిః కాకుత్స్థః ప్రత్యపూజయత్
సుయజ్ఞం స తదోవాచ రామః సీతాప్రచోదితః. 6

ప్ర. అ. కాకుత్స్థః = రాముడు, జాతరూపమయైః = బంగారు వికారమైన, ముఖ్యైః = శ్రేష్ఠమైన, అఙ్గదైః = బాహుపురులచేతను, శుభైః = సుందరమైన, కుణ్డలైః = కుండలములచేతను, సహేమసూత్రైః = బంగారు సూత్రములతో కూడిన, మణిభిః = మాణిక్యములచేతను, కేయూరైః = బాహుపురులచేతను, వల-

వలయైరపి = కంకణములచేతను, అన్యైః = ఇతరములైన, బహుభిః = అనేకములైన, రత్నైశ్చ = రత్నములచేతను, సుయజ్ఞమ్ = సుయజ్ఞుని, ప్రత్యపూజయత్ = పూజించెను. తదా = అప్పుడు, సః రామః = ఆ రాముడు, సీతాప్రచోదితః = సీతచే ప్రేరేపింపబడినవాడై, ఉవాచ = పలికెను.

తా. రాముడు శ్రేష్ఠమైన బంగారు అంగదములు, అందమైన కుండలములు, బంగారు సూత్రములు గల మణులు, కేయూరములు, వలయములు, ఇతరమైన అనేకరత్నములు, సుయజ్ఞునకు ఇచ్చి, సీత ప్రేరేపింపగా, అతనితో ఇట్లనెను. 6

మూ. హారం చ హేమసూత్రం చ భార్యాయై సౌమ్య హారయ
రశనాం చాధునా సీతా దాతుమిచ్ఛతి తే సఖే. 7

ప్ర. అ. సౌమ్య = సౌమ్యుడవైన, సఖే = ఓ స్నేహితుడా, సీతా = సీత, అధునా = ఇపుడు, హారం చ = హారమును, హేమసూత్రం చ = బంగారు సూత్రమును, రశనాం చ = వడ్డాణమును, తే = నీకు, దాతుమ్ = ఇచ్చుటకు, ఇచ్ఛతి = కోరుచున్నది. భార్యాయై = నీభార్యకొరకై, హారయ = తీసుకొనివెళ్లుము.

తా. సౌమ్యుడవైన ఓ మిత్రమా! ఇపుడు సీత నీ భార్యకొరకై హారమును, బంగారు సూత్రమును, వడ్డాణమును, ఇవ్వవలెనని కోరుచున్నది. వీటిని తీసుకొని వెళ్లుము. 7

మూ. అఙ్గదాని విచిత్రాణి కేయూరాణి శుభాని చ,
ప్రయచ్ఛతి సఖే తుభ్యం భార్యాయై గచ్ఛతీ వనమ్. 8

ప్ర. అ. సఖే = ఓ స్నేహితుడా, వనమ్ = వనమును గూర్చి, గచ్ఛతీ = వెళ్ళుచున్న సీత, భార్యాయై = నీ భార్యకొరకై, అఙ్గదాని = బాహుపురులను, విచిత్రాణి = విచిత్రములైన, శుభాని = అందమైన, కేయురాణి చ = కేయూరములను, తుభ్యమ్ = నీకు, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నది.

తా. మిత్రమా! వనమునకు వెళ్ళుచున్న సీత నీ భార్యనిమిత్తమై అంగదములను, విచిత్రములు, సుందరములు అయిన బాహుపురులను నీకు ఇచ్చుచున్నది. 8

మూ. పర్యఙ్కమగ్ర్యాస్తరణం నానారత్నవిభూషితమ్,
తమపీచ్ఛతి వైదేహీ ప్రతిష్ఠాపయితుం త్వయి. ౯

ప్ర. అ. వైదేహీ=సీత, అగ్ర్యాస్తరణమ్=శ్రేష్ఠ మైన, మైన పరుపు వస్త్రము కలది, నానారత్నవిభూషితమ్=అనేకవిధము లైన రత్నములచే అలంకరింపబడినది అయిన, తం పర్యఙ్కమ్ అపి=ఆ పాన్పును కూడ, త్వయి= నీయందు, ప్రతిష్ఠాపయితుమ్=ఉద్దుటకు, ఇచ్ఛతి=కోరుచున్నది.

తా. శ్రేష్ఠ మైన ఆస్తరణము కలిగి అనేక విధము లైన రత్నములచే అలంకృత మైన పర్యంకమును కూడ సీత నీకు ఇవ్వవలె నని కోరుచున్నది. ౯

మూ. నాగః శత్రుంజయో నామ మాతులో౽యం దదౌ మమ
తం తే గజసహస్రేణ దదామి ద్విజపుఙ్గవ. 10

ప్ర. అ. ద్విజపుఙ్గవ=ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడా, అయమ్=ఇది, శత్రుంజయో నామ=శత్రుంజయ మను, నాగః=గజము. మాతులః=మా మేనమామ, మమ= నాకు, దదౌ=ఇచ్చెను. తమ్=ఆ గజమును, గజసహస్రేణ = వేయి గజములతో, తే=నీకు, దదామి = ఇచ్చుచున్నాను.

తా. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా నాకు నా మేనమామ ఇచ్చిన శత్రుంజయ మను ఏనుగును, మరి వేయి ఏనుగులను నీకు ఇచ్చుచున్నాను. 10

మూ. ఇత్యుక్తః స హి రామేణ సుయజ్ఞః ప్రతిగృహ్య తత్
రామలక్ష్మణసీతానాం ప్రయుయోజాశిషః శుభాః. 11

ప్ర. అ. రామేణ = రామునిచేత, ఇతి = ఇట్లు, ఉక్తః = పలుకబడిన, సః సుయజ్ఞః=ఆ సుయజ్ఞుడు, తత్ = దానిని, ప్రతిగృహ్య = స్వీకరించి, రామలక్ష్మణసీతానామ్ = రామలక్ష్మణసీతలకు, శుభాః = శుభ మైన, ఆశిషః = ఆశీర్వాదములను, ప్రయుయోజ= ఇచ్చెను.

తా. సుయజ్ఞుడు రాముడు చెప్పిన విధముగ వాని నన్నిటిని ప్రతిగ్రహించి, సీతారామలక్ష్మణులకు శుభకరము లైన ఆశీర్వాదములను పలికెను. 11

మూ. అథ భ్రాతరమవ్యగ్రం ప్రియం రామః ప్రియంవదః
సౌమిత్రిం తమువాచేదం బ్రహ్మేవ త్రిదశేశ్వరమ్. 12

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ప్రియంవదః = ప్రియ మైన మాటలు పలుకు, రామః = రాముడు, ప్రియమ్ = ప్రియు డైన, భ్రాతరమ్ = సోదరుడగు, తం సౌమిత్రిమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, బ్రహ్మా = బ్రహ్మదేవుడు, త్రిదశేశ్వరమ్ ఇవ = దేవేంద్రుని గూర్చి వలె, అవ్యగ్రమ్ = తొందర లేకుండగ, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. పిమ్మట ప్రియముగా మాటలాడు ఆ రాముడు తన ప్రియసోదరు డైన లక్ష్మణునితో, బ్రహ్మ దేవేంద్రునితో పలికి నట్లు, తొందరపాటు లేకుండగ ఇట్లు పలికెను. 12

మూ. అగస్త్యం కౌశికం చైవ తావుభౌ బ్రాహ్మణోత్తమౌ
అర్చయాహూయ సౌమిత్రే రత్నైః సస్యమివాంబుభిః.

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! అగస్త్యమ్ = అగస్త్యుడు, కౌశికం చైవ = కౌశికుడు అను, ఉభౌ = ఇద్దరు, తౌ = ఆ, బ్రాహ్మణోత్తమౌ = బ్రాహ్మణ శ్రేష్ఠులను, ఆహూయ = పిలిచి, రత్నైః = రత్నములతో, సస్యం = సస్యమును, అంబుభిః ఇవ = ఉదకముతో వలె, అర్చయ = పూజించుము.

తా. లక్ష్మణా! బ్రాహ్మణోత్తము లైన, అగస్త్యుని, కౌశికుని, ఆహ్వానించి, సస్యముపై ఉదకము వర్షించి నట్లు రత్నములు వర్షించి పూజింపుము.

వి. ఈ అగస్త్య కౌశికులు ప్రసిద్ధు లైన అగస్త్య విశ్వామిత్రుల కంటె భిన్ను లై ఉండవలెను. 13

మూ. తర్పయస్వ మహాబాహో గోసహస్రైశ్చ మానద,
సువర్ణైః రజతైశ్చైవ మణిభిశ్చ మహాధనైః. 14

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! మానద = గౌరవము నిచ్చువాడా! గోసహస్రైశ్చ = వేలకొలది గోవుల చేతను, సువర్ణైః = బంగారము చేతను, రజతైశ్చైవ = వెండిచేతను, మహాధనైః = గొప్ప విలువ గల, మణిభిశ్చ = మణుల చేతను, తర్పయస్వ = తృప్తి చెందింపుము.

తా. గౌరవప్రదుడవు, ఆజానుబాహుడవు అయిన ఓ లక్ష్మణా! వారికి బంగారము, వెండి, అమూల్య మైన మణులు ఇచ్చి వారిని ఆనందింపచేయుము.

మూ. కౌసల్యాం చ య ఆశీర్భిః భక్తః పర్యుపతిష్ఠతి,
ఆచార్యస్తైత్తిరీయాణామభిరూపశ్చ వేదవిత్,
తస్య యానం చ దాసీశ్చ సౌమిత్రే సంప్రదాపయ,
కౌశేయాని చ వస్త్రాణి యావత్తుష్యతి స ద్విజః. 16

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా, తైత్తిరీయాణామ్ = తైత్తిరీయ శాఖను అధ్యయనము చేయువారియొక్క, ఆచార్యః = ఆచార్యుడు, అభిరూపశ్చ = అనుకూలముగ నుండువాడు, వేదవిత్ = వేదవేత్త యైన, యః = యే బ్రాహ్మణుడు, భక్తః = శ్రద్ధావంతుడై, ఆశీర్భిః = ఆశీర్వాదములతో, కౌసల్యామ్ = కౌసల్యను, పర్యుపతిష్ఠతి = సేవించుచుండునో, తస్య = అతనికి, సః ద్విజః = ఆ బ్రాహ్మణుడు, యావత్ = ఎంతవరకు, తుష్యతి = సంతోషించునో అంతవరకు, యానం చ = వాహనములను, దాసీశ్చ = దాసులను, కౌశేయాని వస్త్రాణి చ = పట్టు వస్త్రములను, సంప్రదాపయ = ఇప్పించుము.

తా. ఓ లక్ష్మణా! తైత్తిరీయుల ఆచార్యుడు, అనుకూలుడు, వేదవేత్త అయిన ఏ పండితుడు, శ్రద్ధా పూర్వకముగా కౌసల్యకు ఆశీర్వచనములను పలుకుచు సేవ చేయుచుండునో అతనికి సంతోషము కలుగు నంతవరకు వాహనములను, దాసులను, పట్టు వస్త్రములను ఇప్పించుము. 16

మూ. సూతశ్చిత్రరథశ్చార్యస్సచివః సుచిరోషితః,
తోషయైనం మహార్హైశ్చ రత్నైర్వస్త్రైర్ధనైస్తథా.
పశుకాభిశ్చ సర్వాభిర్గవాం దశశతేన చ. 17

ప్ర. అ. ఆర్యసచివః = పూజ్యుడైన తండ్రిగారికి సచివుడైన, చిత్రరథః = చిత్రరథుడు అను, సూతః = సారథి, సుచిరోషితః = చాల కాలమునుండి ఉన్నవాడు. ఏనమ్ = ఇతనిని, మహార్హైః = గొప్ప విలువగల, రత్నైశ్చ = రత్నములచేతను, వస్త్రైః = వస్త్రములచేతను, తథా = మరియు, ధనైః = ధనములచేతను, సర్వాభిః = సమస్తమైన, పశుకాభిః చ = చిన్న అల పశువులచేతను, గవామ్ = గోవుల యొక్క, దశశతేన చ = వేయింటి చేతను, తోషయ = సంతోషపెట్టుము.

తా. మన తండ్రిగారి సచివు లైన, చిత్రరథు డను సారథి చాలకాల ముగా మన ఇంటిలో ఉన్నాడు. అతనికి అమూల్య మైన రత్నములు, వస్త్ర ములు, ధనములు, అన్ని విధము లైన చిన్న పశువులు, వేయి గోవులు ఇచ్చి సంతోషపెట్టుము. 17

మూ. యే చేమే కఠకాలాపా బహవో దణ్డమాణవాః,
నిత్యస్వాధ్యాయశీలత్వాన్నాన్యత్కుర్వన్తి కించన,
అలసాః స్వాదుకామాశ్చ మహతాం చాపి సమ్మతాః,
తేషామశీతియానాని రత్నపూర్ణాని దాపయ,
శాలివాహనసహస్రం చ ద్వే శతే భద్రకాంస్తథా,
వ్యఞ్జనార్థం చ సౌమిత్రే గోసహస్రముపాకురు. 20

ప్ర. అ. కఠకాలాపాః = కఠకలాపశాఖలకు చెందిన, యే = ఏ, ఇమే = ఈ, బహవః = అనేకు లైన, దణ్డమాణవాః = పలాశదండములను ధరించిన, బ్రహ్మచారులు కలరో వారు, నిత్యస్వాధ్యాయశీలత్వాత్ = నిత్యము స్వాధ్యాయము చేయు, శీలము కలవా రగుటవలన, అన్యత్ = మరియొక కార్యమును, కించన = దేనినీ, న కుర్వన్తి = చెయ్యరు. అలసాః = సోమరులు. స్వాదుకామాశ్చ = మధుర పదార్థములందు కోరిక కలవారు. మహతాం చాపి = పూజ్యులకు కూడ, సమ్మతాః = పూజ్యులు. తేషామ్ = వారికి, రత్నపూర్ణాని = రత్నములతో నిండిన అశీతియానాని = ఎనభై బండ్లను, శాలివాహనసహస్రం చ = ధాన్యమును మోయు వృషభముల సహస్రమును, ద్వే శతే = రెండు వందల, భద్రకాన్ = భూమి దున్నెడు ఎద్దులను, దాపయ = ఇప్పించుము. సౌమిత్రే = ఓ లక్ష్మణా, వ్యఞ్జ నార్థమ్ = భోజనోపకరణముకొరకై, గోసహస్రమ్ = వేయి గోవులను, ఉపా కురు = ఇమ్ము.

తా. లక్ష్మణా! కఠకలాపశాఖలకు చెందిన పలాశదండధారు లైన ఎందరో బ్రహ్మచారులు నిత్యము వేదాధ్యయనమునందే నిరతు లై యుండుటచే మరి యే పనులను చేయరు. వారు సోమరులు. మధుర మైన పదార్థములను తినగోరు చుందురు. పూజ్యు లైన వారు కూడ వీరిని గౌరవించుచుందురు. అట్టి ఈ బ్రహ్మ చారులకు రత్నములతో నిండిన ఎనుబది వాహనములను, ధాన్యమును మోయు వెయ్యి వృషభములను, భూమిని దున్ను రెండు వందల ఎద్దులను, ఆహారము

నందు వెయ్యి పెరుగు మొదలగునవి లభించుటకు వెయ్యి గోవులను, ఇప్పించుము. 20

మూ. మేఖలీనాం మహాసంఘః కౌసల్యాం సముపస్థితః
తేషాం సహస్రం సౌమిత్రే ప్రత్యేకం సంప్రదాపయ. 21

ప్ర. అ. సౌమిత్రే=ఓ లక్ష్మణా! మేఖలీనామ్=మేఖలలు ధరించిన బ్రహ్మచారుల, మహాసంఘః=గొప్ప సముదాయము, కౌసల్యామ్ = కౌసల్యను, సముపస్థితః = ఆశ్రయించియున్నది. తేషామ్ = ఆ బ్రహ్మచారులకు, ప్రత్యేకమ్ = ఒక్కొక్కరికి, సహస్రమ్=వెయ్యి ఆవులను, సంప్రదాపయ=ఇప్పించుము.

తా. మేఖలలు ధరించిన బ్రహ్మచారులు చాలమంది కౌసల్యను ఆశ్రయించి యున్నారు. వారందరికిని ఒక్కొక్కరికి వేయి గోవుల చొప్పున ఇప్పించుము. 21

మూ. అమ్బా యథా చ సా నన్దేత్కౌసల్యా మమ దక్షిణామ్
తథా ద్విజాతీంస్తాన్సర్వాన్ లక్ష్మణార్చయ సర్వశః. 22

ప్ర. అ. లక్ష్మణా=ఓ లక్ష్మణా! అమ్బా=తల్లి యైన, సా కౌసల్యా=ఆ కౌసల్య, మమ=నాయొక్క, దక్షిణామ్=దక్షిణను గూర్చి, యథా=ఏ విధముగ, నన్దేత్ = సంతోషించునో, తథా = అట్లు, తాన్ = ఆ, సర్వాన్ =సమస్తమైన, ద్విజాతీన్=బ్రాహ్మణులను. సర్వశః=అన్ని విధముల, అర్చయ=పూజింపుము.

తా. నేను ఇచ్చు దక్షిణలను చూచి మా తల్లి యైన కౌసల్య ఆనందించు విధమున ఆ బ్రాహ్మణు లందరిని సర్వవిధముల పూజింపుము. 22

మూ. తతః స పురుషవ్యాఘ్రస్తద్ధనం లక్ష్మణః స్వయమ్,
యథోక్తం బ్రాహ్మణేన్ద్రాణామదదాద్ధనదో యథా. 23

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడైన, సః లక్ష్మణః=ఆ లక్ష్మణుడు, ధనదో యథా=కుబేరుడు వలె, తత్ ధనమ్=ఆ ధనమును, యథోక్తమ్=చెప్పిన విధముగ, స్వయమ్=స్వయముగ, బ్రాహ్మణేంద్రాణామ్=బ్రాహ్మణశ్రేష్ఠులకు, అదదాత్=ఇచ్చెను.

తా. పురుషశ్రేష్ఠు డైన ఆ లక్ష్మణుడు, రాముడు చెప్పిన విధమున ఆ ధనము నంతను, కుబేరుడు వలె స్వయముగ బ్రాహ్మణశ్రేష్ఠులకు ఇచ్చెను. 23

మూ. అథాఽబ్రవీద్బాష్పగళాంస్తిష్ఠతశ్చోపజీవినః,
సంప్రదాయ బహు ద్రవ్యమేకైకస్యోపజీవనమ్. 24

ప్ర. అ. అథ = అటుపిమ్మట, బాష్పగళాన్ = బాష్పము కంఠమునందు గల, తిష్ఠతః = అచట నిలచి యున్న, ఉపజీవినః = నౌకరులను గూర్చి, ఏకైకస్య = ఒక్కొక్కనికి, బహు = అధిక మైన, ద్రవ్యమ్ = ద్రవ్యమును, ఉపజీవనమ్ = జీవికగా, సంప్రదాయ = ఇచ్చి, అబ్రవీత్ = ఇట్లు పలికెను.

తా. పిమ్మట రాముడు, బాష్పముతో నిండిన కంఠములతో అచట నిలచి యున్న నౌకరుల కందరకు జీవికార్థ మై అత్యధికముగ ధనము నిచ్చి వారితో ఇట్లు పలికెను. 24

మూ. లక్ష్మణస్య చ యద్వేశ్మ గృహం చ యదిదం మమ,
అశూన్యం కార్యమేకైకం యావదాగమనం మమ. 25

ప్ర. అ. లక్ష్మణస్య = లక్ష్మణునియొక్క, యత్ = ఏ, గృహము కలదో, మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, యత్ = ఏ, గృహం చ = గృహ మున్నదో, ఏకైకమ్ = ఇవి ఒక్కొక్కటి, మమ = నాయొక్క, యావదాగమనమ్ = ఆగమనమువరకు, అశూన్యమ్ = శూన్యముకానిదిగా, కార్యమ్ = చేయదగినది.

తా. నేను తిరిగి వచ్చువరకును, లక్ష్మణుని గృహమును, నా గృహమును కూడ కావలా కాయుచు, ఇవి శూన్యము కాకుండు నట్లు చూడవలెను. 25

మూ. ఇత్యుక్త్వా దుఃఖితం సర్వం జనం తముపజీవినమ్,
ఉవాచేదం ధనాధ్యక్షం ధనమానీయతామితి. 26

ప్ర. అ. దుఃఖితమ్ = దుఃఖించుచున్న, ఉపజీవినమ్ = తనపై ఆధార పడి జీవించు, సర్వమ్ = సమస్త మైన, తం జనమ్ = ఆ జనమునుగూర్చి,

ఇతి = ఇట్లు. ఉక్త్వా = పలికి, ధనమ్ = ధనము, ఆనీయతామ్ = తీసుకొనిరాబడు గాక, ఇతి = అని, ఇదమ్ = ఈ వాక్యమును, ధనాధ్యక్షమ్ = ధనాధ్యక్షుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. దుఃఖితు లైన ఆ పరిచారకులను ఈ విధముగ ఆదేశించి, "ధనమును తీసుకొని రమ్ము" అని కోశాధ్యక్షుని ఆజ్ఞాపించెను.

మూ. తతోఽస్య ధనమాజహ్రుః సర్వమేవోపజీవినః,
స రాశిః సుమహాంస్తత్ర దర్శనీయో హ్యదృశ్యత. 27

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఉపజీవినః = నౌకరులు, అస్య = రామునియొక్క, సర్వమేవ = సమస్త మైన, ధనమ్ = ధనమును, ఆజహ్రుః = తీసుకొనివచ్చిరి. తత్ర = అచట, సుమహాన్ = చాలా పెద్ద దైన, సః రాశిః = ఆ ధనరాశి, దర్శనీయః = చూచుటకు ముచ్చట గొల్పున దై, అదృశ్యత = కనబడెను.

తా. రాముని ఆజ్ఞ ప్రకారము అతని భృత్యులు రాముని ధనము నంతను తీసుకొని వచ్చిరి. పెద్ద దైన ఆ ధనరాశి చూచుటకు చాలా అందముగా నుండెను. 27

మూ. తతః స పురుషవ్యాఘ్రస్తద్ధనం సహలక్ష్మణః,
ద్విజేభ్యో బాలవృద్ధేభ్యః కృపణేభ్యో హ్యదాపయత్. 28

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠు డైన, సః = ఆ రాముడు, సహలక్ష్మణః = లక్ష్మణసమేతు డై, తత్ ధనమ్ = ఆ ధనమును, ద్విజేభ్యః = బ్రాహ్మణులకు, బాలవృద్ధేభ్యః = బాలురకు, వృద్ధులకు, కృపణేభ్యః = దీనులకును, అదాపయత్ = ఇప్పించెను.

తా. పురుషశ్రేష్ఠు డైన ఆ రాముడును, లక్ష్మణుడును, ఆ ధనము నంతను బ్రాహ్మణులకు, బాలురకు, వృద్ధులకు, దీనులకు ఇప్పించిరి. 28

మూ. తత్రాసీత్పింగళో గార్గ్యస్త్రిజటో నామ వై ద్విజః,
క్షతవృత్తిర్వనే నిత్యం ఫాలకుద్దాలలాఙ్గలీ. 29

ప్ర. అ. తత్ర = అచట, నిత్యమ్ = ఎల్లప్పుడును, ఫాలకుద్దాలలాఙ్గలీ = చిన్న గొడ్డలి, గునపము, నాగలి కలవాడును, వనే = వనమునందు, క్షతవృత్తిః = త్రవ్వుటయే వృత్తిగా కలవాడును, లేదా క్షీణించిన జీవనోపాయము కలవాడును, పింగళః = పింగళవర్ణము కలవాడును, గార్గ్యః = గర్గవంశమునందు పుట్టిన వాడును అయిన, త్రిజటో నామ = త్రిజటుడు అను పేరు గల, ద్విజః = బ్రాహ్మణుడు, ఆసీత్ = ఉండెను.

తా. ఆ ప్రాంతమునందు పచ్చని శరీరచ్ఛాయ కల త్రిజటుడు అను గర్గవంశమునందు పుట్టిన బ్రాహ్మణుడు నివసించుచుండెను. ఆతడు నిత్యము చిన్న గొడ్డలి, గునపము, నాగలి అను సాధనములు ఉపయోగించుచు, వనములో త్రవ్వుకొనుచు, జీవించుచుండెడివాడు. 29

మూ. తం వృద్ధం తరుణీ భార్యా బాలానాదాయ దారకాన్,
అబ్రవీద్బ్రాహ్మణం వాక్యం దారిద్ర్యేణాభిపీడితా. 30

ప్ర. అ. తరుణీ = యువతి యైన, భార్యా = ఆతని భార్య, దారిద్ర్యేణ = దారిద్ర్యముచే, అభిపీడితా = పీడింపబడినదై, బాలాన్ = చిన్నవారైన, దారకాన్ = కుమారులను, ఆదాయ = గ్రహించి (ముందుంచుకొని), వృద్ధమ్ = వృద్ధుడైన, తం బ్రాహ్మణమ్ = ఆ బ్రాహ్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పడుచుదైన ఆతని భార్య, దారిద్ర్యముతో బాధపడుచు, చిన్నవారైన తన కుమారులను చూపి, ముసలివాడైన ఆ బ్రాహ్మణునితో ఇట్లు పలికెను. 30

మూ. అపాస్య ఫాలం కుద్దాలం కురుష్వ వచనం మమ,
రామం దర్శయ ధర్మజ్ఞం యది కించిదవాప్స్యసి. 31

ప్ర. అ. ఫాలమ్ = చిన్నగొడ్డలిని, కుద్దాలమ్ = గునపమును, అపాస్య = దూరముగా పారవేసి, మమ = నాయొక్క, వచనమ్ = వచనమును, కురుష్వ =

చేయుము. ధర్మజ్ఞమ్ = ధర్మము నెఱిగిన, రామమ్ = రాముని, దర్శయ = చూడుము. కించిత్ = ఏమైన, అవాప్స్యసి యది = పొందగలవేమో.

తా. నా మాట విని, ఈ చిన్న గొడ్డలిని, గునపమును దూరముగ పారవేసి, ధర్మాత్ముడైన రాముని దర్శనము చేసినచో నీ కేమైన లభించవచ్చును. 31

మూ. స భార్యావచనం శ్రుత్వా శాటీమాచ్ఛాద్య దుశ్ఛదామ్,
స ప్రాతిష్ఠత పన్థానం యత్ర రామనివేశనమ్. 32.

ప్ర. అ. సః = అతడు, భార్యావచనమ్ = భార్య మాటను, శ్రుత్వా = విని, దుశ్ఛదామ్ = కప్పుకొనుటకు వీలుగాకుండ ఉన్న, శాటీమ్ = వస్త్రమును, ఆచ్ఛాద్య = కప్పుకొని, రామనివేశనమ్ = రాముని గృహము, యత్ర = ఎక్కడ ఉన్నదో, పన్థానమ్ = ఆ మార్గమును గూర్చి, ప్రాతిష్ఠత = ప్రయాణమాయెను.

తా. ఆ త్రిజటుడు, భార్య మాట విని, పూర్తిగా చిరిగి పోవుటచే కప్పుకొనుటకు రాని ఉత్తరీయము కప్పుకొని, రాముని గృహమున్న మార్గమున బయలుదేరెను. 32

మూ. భృగ్వఙ్గిరసమం దీప్త్యా త్రిజటం జనసంసది,
ఆపఞ్చమాయాః కక్ష్యాయా నైనం కశ్చిదవారయత్.

ప్ర. అ. జనసంసది = జనసమూహములో, దీప్త్యా = కాంతిచేత, భృగ్వఙ్గిరసమమ్ = భృగుమహర్షితోను, అంగిరసునితోను సమానుడుగా ఉన్న, ఏనమ్ = ఈ, త్రిజటమ్ = త్రిజటుని, ఆ పఞ్చమాయాః కక్ష్యాయాః = ఐదవ వాకిలి వరకును, కశ్చిత్ = ఎవడును, న అవారయత్ = నివారించలేదు.

తా. ఆ త్రిజటుడు జనసమూహములో భృగుమహర్షి వలెను, అంగిరసుని వలెను, బ్రహ్మతేజస్సుతో విరాజిల్లు చుండెను. అందుచే ఐదవ వాకిలి వరకు అతనిని ఎవ్వరును అడ్డుపెట్టలేదు. 33

మూ. స రాజపుత్రమాసాద్య త్రిజటో వాక్యమబ్రవీత్;
నిర్ధనో బహుపుత్రోఽస్మి రాజపుత్ర మహాయశః,
క్షతవృత్తిర్వనే నిత్యం ప్రత్యవేక్షస్వ మామితి. ౩౪

ప్ర. అ. సః త్రిజటః = ఆ త్రిజటుడు, రాజపుత్రమ్ = రాజకుమారుడైన రాముని, ఆసాద్య = పొంది, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. మహాయశః = గొప్ప కీర్తి గల, రాజపుత్ర = రాజకుమారా! నిర్ధనః = దరిద్రుడను, బహుపుత్రః = చాలా మంది పుత్రులు కలవాడను అగు నేను, నిత్యమ్ = ఎల్లప్పుడు, వనే = వనమునందు, క్షతవృత్తిః = త్రవ్వుటయే వృత్తిగా కలవాడనుగా, అస్మి = అయి ఉన్నాను. మామ్ = నన్ను, ప్రత్యవేక్షస్వ = చూడుము. ఇతి = అట్లు.

తా. ఆ త్రిజటుడు రాముని సమీపించి, "మహాకీర్తిమంతుడవైన ఓ రామా! నేను ధనము లేనివాడను. చాల మంది పిల్లలు కలవాడను. నిత్యము అడవిలో త్రవ్వుకొనుచు, జీవించుచున్నాను. నన్ను కూడ ఒక కంట చూడుము." ౩౪

మూ. తమువాచ తతో రామః పరిహాససమన్వితమ్,
గవాం సహస్రమప్యేకం న చ విశ్రాణితం మయా,
పరిక్షిపసి దణ్డేన యావత్తావదవాప్స్యసి. ౩౫

ప్ర. అ. తతః = అటుపిమ్మట, రామః = రాముడు, పరిహాససమన్వితమ్ = పరిహాసపూర్వకముగా, తమ్ = అతనిని గూర్చి, ఉవాచ = పలికెను. మయా = నాచేత, ఏకమ్ = ఒక్క, గవాం సహస్రమపి = గోసహస్రము కూడ, న చ విశ్రాణితమ్ = ఇవ్వబడలేదు. దణ్డేన = దండముచేత, యావత్ = ఎంతవరకు, పరిక్షిపసి = విసిరివేసెదవో, తావత్ = అంతవరకు, అవాప్స్యసి = పొందగలవు.

తా. అప్పుడు రాముడు పరిహాసపూర్వకముగా అతనితో ఇట్లనెను. "నేను ఇంతవరకు ఒక్క గోసహస్రమును కూడ (వేయి గోవుల సముదాయము) దానము చేయలేదు. నీవు చేతిలోని దండమును ఎంత దూరము విసిరెదవో అంత వరకు వ్యాపించు గోసమూహమును నీకిచ్చెదను". ౩౫

మూ. స శాటీం త్వరితః కట్యాం సంభ్రాన్తః పరివేష్ట్య తామ్,
ఆవిద్ధ్య దణ్డం చిక్షేప సర్వప్రాణేన వేగితః. ౩౬

ప్ర. అ. సః = అతడు, సంభ్రాన్తః = సంతోషించినవాడై, త్వరితః = తొందరపడుచు, తాం శాటీమ్ = ఆ వస్త్రమును, కట్యామ్ = కటిప్రదేశమునందు, పరివేష్ట్య = చుట్టి, దణ్డమ్ = దండమును, ఆవిద్ధ్య = నేలపై కొట్టి, లేదా త్రిప్పి, వేగితః = వేగము గలవాడై, సర్వప్రాణేన = సమస్తమైన ప్రాణబలముతో, చిక్షేప = విసిరెను.

తా. ఆ త్రిజటుడు సంతోషించి, తొందరపడుచు ఆ వస్త్రమును నడుమునకు కట్టి, తన బలము నంతను ఉపయోగించి, ఆ దండమును వేగముగా త్రిప్పి విసిరెను. ౩౬

మూ. స తీర్త్వా సరయూపారం దణ్డస్తస్య కరాచ్చ్యుతః,
గోవ్రజే బహుసాహస్రే పపాతోక్షణసన్నిధౌ. ౩౭

ప్ర. అ. తస్య = అతనియొక్క, కరాత్ = హస్తమునుండి, చ్యుతః = జారిన, సః దణ్డః = ఆ దండము, సరయూపారమ్ = సరయునది గట్టును, తీర్త్వా = దాటి, బహుసాహస్రే = అనేక వేల సంఖ్య గల, గోవ్రజే = ఆవుల మంద యందు, ఉక్షణసన్నిధౌ = ఆబోతు సమీపమున, పపాత = పడెను.

తా. అతడు విసిరిన దండము సరయూనదిని దాటి, కొన్ని వేల ఆవు లున్న ఆవుల మందయందు, ఆబోతు దగ్గర పడెను. ౩౭

మూ. తం పరిష్వజ్య ధర్మాత్మా ఆతస్మాత్సరయూతటాత్,
ఆనయామాస తా గోపైస్త్రిజటాయాశ్రమం ప్రతి. ౩౮

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడు అయిన రాముడు, తమ్ = అతనిని, పరిష్వజ్య = కౌగలించుకొని, తస్మాత్ = ఆ, ఆ సరయూతటాత్ = సరయూనది తీరము వరకు, తాః = ఆ గోవులను, గోపైః = గోపాలకులచేత, త్రిజటాయ = త్రిజటునికొరకు, ఆశ్రమం ప్రతి = అతని ఆశ్రమమును గూర్చి, ఆనయామాస = చేర్పించెను.

తా. ధర్మాత్ముడైన ఆ రాముడు, ఆ బ్రాహ్మణుని కౌగిలించుకొని, సరయూ తీరమువరకు వ్యాపించిన ఆ గోవులను అతనికి ఇచ్చి, గోపాలకులచే వానిని అతని ఆశ్రమమునకు పంపెను. ౩౮

మూ. ఉవాచ చ తతో రామస్తం గార్గ్యమభిసాన్త్వయన్,
మన్యుర్న ఖలు కర్తవ్యః పరిహాసో హ్యయం మమ. ౩౯

ప్ర. అ. తతః=అటు పిమ్మట, రామః=రాముడు, తం గార్గ్యమ్=ఆ గార్గ్యుని, అభిసాన్త్వయన్=బ్రతిమాలుచు, ఉవాచ=పలికెను. మన్యుః=కోపము, న కర్తవ్యః ఖలు=చేయదగినది కాదు. అయమ్=ఇది, మమ=నాయొక్క, పరిహాసః=పరిహాసము.

తా. అపుడు రాముడు, గర్వసంతోషపూర్ణుడైన ఆ బ్రాహ్మణుని బ్రతిమాలుచు, ఇట్లు పలికెను. కేవలము పరిహాసము కొరకై నే నట్లు చేసితిని; కోపించకుము.

మూ. ఇదం హి తేజస్తవ యద్దురత్యయం
తదేవ జిజ్ఞాసితు మిచ్ఛతా మయా,
ఇమం భవానర్థమభిప్రచోదితో
వృణీష్వ కించేదపరం వ్యవస్యతి. 40

ప్ర. అ. తవ=నీయొక్క, దురత్యయమ్=మించుటకు శక్యము కాని, యత్=ఏ, ఇదం తేజః=ఈ తేజస్సున్నదో, తత్=దానిని, జిజ్ఞాసితుమ్=తెలుసుకొనుటకు, ఇచ్ఛతా ఏవ=ఇచ్ఛయించినవాడనే అయిన, మయా=నాచేత, భవాన్=నీవు, ఇమమ్=ఈ, అర్థమ్=కార్యమును గూర్చి, అభిప్రచోదితః=ప్రేరేపింపబడితివి. అపరమ్=ఇతరమైనది, కిమ్=ఏదైనను, వ్యవస్యతి చేత్=కోరినట్లైతే, వృణీష్వ=కోరుము.

తా. నీ తేజస్సు ఎవ్వరును మించుటకు శక్యము కానిది. దానిని చూడవలెనను కోరికతోనే నేను ఈ పని చేయుటకు నిన్ను ప్రేరేపించితిని. మరింకను కోరిక లేమైన ఉన్నచో కోరుకొనుము".

మూ. బ్రవీమి సత్యేన న తేఽస్తి యన్త్రణా
ధనం హి యద్యన్మమ విప్రకారణాత్,
భవత్సు సమ్యక్ప్రతిపాదనేన త
న్మయార్జితం ప్రీతియశస్కరం భవేత్. 41

ప్ర. అ. సత్యేన = సత్యముచేత, బ్రవీమి = చెప్పుచున్నాను. తే = నీకు, యన్త్రణా = ఇంతియే కోరవలె నను నియమము, నాస్తి = లేదు. మమ = నా యొక్క, యద్యత్ = ఏ యే, ధనమ్ = ధనమున్నదో, అది, విప్రకారణాత్ హి = విప్రులకొరకే కదా. మయా = నాచేత, అర్జితమ్ = సంపాదింపబడిన, తత్ = ఆ ధనము, భవత్సు = మీ యందు, సమ్యక్ = బాగుగ, ప్రతిపాదనేన = ఇచ్చుటచే, ప్రీతియశస్కరమ్ = ప్రీతిని యశస్సును ఇచ్చునది, భవేత్ = అగును.

తా. "నేను నిజముగ చెప్పుచున్నాను. ఇంతయే కోరవలెనని నియమము లేదు. నా ధనమంతయు బ్రాహ్మణులకొరకే ఉద్దిష్ట మైనది. నేను సంపాదించిన ధనమును మీకు ఇచ్చుటచే నాకు ప్రీతి, యశస్సు కలుగును." 41

మూ. తత స్సభార్య స్త్రిజటో మహాముని
ర్గవామనీకం ప్రతిగృహ్య మోదితః,
యశోబలప్రీతిసుఖోపబృంహణీ
స్తదాశిషః ప్రత్యవదన్మహాత్మనః. 42

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సభార్యః = భార్యాసమేతు డైన, మహామునిః = మహాముని యైన, త్రిజటః = త్రిజటుడు, గవామ్ = గోవులయొక్క, అనీకమ్ = సమూదాయమును, ప్రతిగృహ్య = ప్రతిగ్రహించి, మోదితః = సంతోషించినవాడై, తదా = అపుడు, మహాత్మనః = మహాత్ము డైన, ఆ రామునకు, యశోబలప్రీతిసుఖోపబృంహణీః = యశస్సును, బలమును, ప్రీతిని, సుఖమును, వృద్ధి పొందించు, ఆశిషః = ఆశీర్వాదములను, ప్రత్యవదత్ = బదులుగా చెప్పెను.

తా. భార్యాసహితు డైన, ఆ త్రిజటమహాముని, గోసముదాయమును ప్రతిగ్రహించి, సంతోషించినవాడై, మహాత్ము డైన, ఆ రాముని మాటలకు బదు

లుగా, యశస్సును, బలమును, ఆనందమును, వృద్ధిపొందించు, ఆశీర్వాదములను పలికెను. 42

మూ. స చాపి రామః ప్రతిపూర్ణమానసో
మహద్ధనం ధర్మబలైరుపార్జితమ్,
నియోజయామాస సుహృజ్జనేఽచిరా
ద్యథార్హసమ్మానవచఃప్రచోదితః. 43

ప్ర. అ. సః=ఆ, రామః చాపి=రాముడు కూడ, ప్రతిపూర్ణమానసః=సంతృప్తి చెందిన మనస్సు కలవాడై, ధర్మబలైః=ధర్మసమ్మత మైన బలము లచే, ఉపార్జితమ్=సంపాదింపబడిన, మహత్ ధనమ్=గొప్ప ధనమును, అచిరాత్=వెంటనే, యథార్హసమ్మానవచఃప్రచోదితః=తగిన సమ్మానవాక్యము లచే ప్రేరేపింపబడినవాడై, సుహృజ్జనే=మిత్రజనమునందు, నియోజయామాస=సమర్పించెను.

తా. పిమ్మట ఆ రాముడు సంతోషించిన మనస్సు కలవాడై, తగిన సమ్మానవాక్యములచే ప్రేరితుడై, ధర్మసమ్మత మైన బలముచే తాను సంపాదించిన ధనమును వెంటనే మిత్రులకు యిచ్చెను. 43

మూ. ద్విజః సుహృద్భృత్యజనోఽథవా తదా
దరిద్రభిక్షాచరణశ్చ యోఽభవత్.
న తత్ర కశ్చిన్న బభూవ తర్పితో
యథార్హ సమ్మానన దాన సంభ్రమైః. 44

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్వాత్రింశః సర్గః.

ప్ర. అ. తత్ర=అచట, తదా=అపుడు, యః=ఏ, ద్విజః=బ్రాహ్మణుడుగాని, సుహృత్=మిత్రుడుగాని, అథవా=లేక, భృత్యజనః=భృత్యుడుగాని, దరిద్రభిక్షాచరణశ్చ=దరిద్రుడు గాని, యాచకుడుగాని, ఉండెనో,

కశ్చిత్ = అర్థి వారిలో ఒక్కడును, యథార్హసమ్మానదానసంభ్రమైః = తగు విధముగ సమ్మానించుటచేతను, దానముచేతను, గౌరవముచేతను, న తర్పితః = తృప్తి పొందింపబడనివాడు, న బభూవ = లేడు.

తా. ఆ సమయమున అక్కడ ఉన్న ద్విజులలో కాని, మిత్రులలో గాని, భృత్యులలో గాని, దరిద్రులలో గాని, యాచకులలో గాని, ఏ ఒక్కడును, తగు విధముగ సమ్మానముచేతను, దానముచేతను, గౌరవముచేతను, తృప్తి పొందనివాడు లేకుండెను.

“బాలానందిని” అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పదిరెండవ సర్గ సమాప్తము.

# అథ త్రయస్త్రింశః సర్గః

[శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై, దుఃఖితులైన నగరవాసుల పలువిధములగు సంభాషణలు వినుచు తండ్రిని చూచుటకై కైకేయీభవనమునకు పోవుట.]

మూ. దత్త్వా తు సహ వైదేహ్యా బ్రాహ్మణేభ్యో ధనం బహు,
జగ్మతుః పితరం ద్రష్టుం సీతయా సహ రాఘవౌ. 1

ప్ర. అ. రాఘవౌ = రామలక్ష్మణులు, వైదేహ్యా సహ = సీతతో కూడ, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకొరకు, బహు = అధిక మైన, ధనమ్ = ధనమును, దత్త్వా = ఇచ్చి, పితరమ్ = తండ్రిని, ద్రష్టుమ్ = చూచుటకు, సీతయా సహ = సీతతో కూడ, జగ్మతుః = వెళ్ళిరి.

తా. సీతారామలక్ష్మణులు ఈ విధముగా బ్రాహ్మణులకు అధికముగా ధనము నిచ్చి, దశరథుని చూచుటకై వెళ్ళిరి. 1

మూ. తతో గృహీతే దుష్ప్రేక్షే త్వశోభేతాం తదాయుధే,
మాలాదామభిరాబద్ధే సీతయా సమలంకృతే. 2

ప్ర. అ. తతః = అటుపిమ్మట, దుష్ప్రేక్షే = చూచుటకు కూడ శక్యము గానివి, గృహీతే = వారిచే గ్రహింపబడినవి, సీతయా = సీతచేత, మాలాదామభిః = పుష్పమాలలచే, ఆబద్ధే = కట్టబడినవి, సమలంకృతే = అలంకరింపబడినవి అయిన, తదాయుధే = రామలక్ష్మణుల ఆయుధములు, అశోభేతామ్ = ప్రకాశించినవి.

తా. రామలక్ష్మణులు ధరించిన ఆయుధములకు సీతాదేవి పుష్పమాలలను కట్టెను. ఈ విధముగ అలంకరింపబడిన ఆ ఆయుధములు ప్రకాశించుచు, చూచుటకు భయము కల్గించుచుండెను. 2

మూ. తతః ప్రాసాదహర్మ్యాణి విమానశిఖరాణి చ,
అధిరుహ్య జనః శ్రీమానుదాసీనో వ్యలోకయత్. ౨

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శ్రీమాన్ = శోభాయుక్తమైన, జనః = జనము, ప్రాసాదహర్మ్యాణి = ప్రాసాదములను, ధనవంతుల గృహములను, విమానశిఖరాణి చ = ఏడంతస్తుల మేడల శిఖరములను, అధిరుహ్య = ఎక్కి, ఉదాసీనః = సంతోషము లేనిదై, వ్యలోకయత్ = చూచెను.

తా. అపుడు శోభాయుక్తులైన జను లందరును ప్రాసాదములను (రాజ దేవతాది గృహములను,) ధనికుల గృహములను, ఏడంతస్తులమేడల శిఖరములను ఎక్కి, సంతోషము లేనివారై వారిని చూచుచుండిరి. ౨

మూ. న హి రథ్యాః స్మ శక్యన్తే గన్తుం బహుజనాకులాః,
ఆరుహ్య తస్మాత్ప్రాసాదాన్ దీనాః పశ్యన్తి రాఘవమ్.

ప్ర. అ. బహుజనాకులాః = అధిక సంఖ్యగల జనులచే వ్యాకులమైన, రథ్యాః = వీథులు, గన్తుమ్ = నడచుటకు, న శక్యన్తే స్మ హి = శక్యము కావు కదా. తస్మాత్ = ఆ కారణమువలన, దీనాః = దుఃఖితులై, ప్రాసాదాన్ = మేడలను, ఆరుహ్య = ఎక్కి, రాఘవమ్ = రాముని, పశ్యన్తి = చూచుచున్నారు. ౩

తా. అసంఖ్యాకులైన జనులతో నిండిన వీథులు నడచుటకు శక్యము కాకుండెను. అందుచే దుఃఖాక్రాంతులైన ప్రజలు, ప్రాసాదములను ఎక్కి, రాముని చూచుచుండిరి. ౩

మూ. పదాతిం వర్జితచ్ఛత్రం రామం దృష్ట్వా జనాస్తదా,
ఊచుర్బహువిధా వాచః శోకోపహతచేతసః. ౪

ప్ర. అ. తదా = అపుడు, జనాః = జనులు, పదాతిమ్ = పాదచారియు, వర్జితచ్ఛత్రమ్ = విడువబడిన ఛత్రము కలవాడు అయిన, రామమ్ = రాముని, దృష్ట్వా = చూచి, శోకోపహతచేతసః = శోకముచే పీడింపబడిన చిత్తము కలవారై, బహువిధాః = అనేకవిధములైన, వాచః = వాక్యములను, ఊచుః = పలికిరి.

తా. ఛత్రమును విడిచి పాదచారియై, వెళ్లుచున్న ఆ రాముని చూచి, అందరును దుఃఖముచే పీడింపబడిన మనస్సులతో అనేక విధములుగ చెప్ప సాగిరి. 5

మూ. యం యాన్తమనుయాతి స్మ చతురఙ్గబలం మహత్,
తమేకం సీతయా సార్ధమనుయాతి స్మ లక్ష్మణః. 6

ప్ర. అ. యాన్తమ్ = వెళ్ళుచున్న, యమ్ = ఎవనిని, మహత్ = గొప్ప, చతురఙ్గబలమ్ = చతురంగ సైన్యము, అనుయాతి స్మ = అనుసరించి వెళ్ళుచుండెడిదో, తమ్ = అట్టి, ఏకమ్ = ఒంటరిగా ఉన్న రాముని, సీతయా సార్ధమ్ = సీతతో కూడ, లక్ష్మణః = లక్ష్మణుడు, అనుయాతి స్మ = అనుసరించి వెళ్ళు చున్నాడు.

తా. రాముడు ఎచ్చటికి వెళ్ళినను అతని వెనుక చతురంగసైన్యము వెళ్ళుచుండెడిది. అట్టి రాముడే ఈనాడు ఒంటరిగా నడచుచుండగా, సీతాలక్ష్మణులు మాత్రము అతని వెనుక వెళ్లుచున్నారు. 6

మూ. ఐశ్వర్యస్య రసజ్ఞః సన్ కామినాం చైవ కామదః,
నేచ్ఛత్యే వానృతం కర్తుం వచనం ధర్మగౌరవాత్. 7

ప్ర. అ. ఐశ్వర్యస్య = ఐశ్వర్యము యొక్క, రసజ్ఞః సన్ = రుచి తెలిసినవాడైనను, కామినామ్ = కోరికలు కలవారికి, కామదః చైవ = కోరికలు ఇచ్చువాడు అయినను, ఈ రాముడు, ధర్మగౌరవాత్ = ధర్మమునందలి గౌరవము వలన, వచనమ్ = తండ్రి మాటను, అనృతమ్ = అసత్యమునుగా, కర్తుమ్ = చేయుటకు, నేచ్ఛత్యేవ = ఇచ్ఛయించుటలేదు.

తా. ఈ రాముడు ఐశ్వర్యమును రుచి చూచినవాడు. కోరికలు కలవారి కోరికలను తీర్చగలవాడు. అయినను ధర్మమునందున్న శ్రద్ధచే తండ్రి మాటను అసత్యము చేయకూడదని కోరుచున్నాడు. 7

మూ. యా న శక్యా పురా ద్రష్టుం భూతైరాకాశగైరపి,
తామద్య సీతాం పశ్యన్తి రాజమార్గగతా జనాః. 8

ప్ర. అ. పురా = పూర్వము, యా = ఏ సీత, ఆకాశగైః = ఆకాశము నందు సంచరించు, భూతైరపి = ప్రాణులచేత గూడ, ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యా = శక్యము కాదో, తాం సీతామ్ = అట్టి సీతను, అద్య = నేడు, రాజ మార్గగతాః = రాజమార్గములో నున్న, జనాః = జనులు, పశ్యన్తి = చూచు చున్నారు.

తా. పూర్వము ఈ సీతను ఆకాశమునందు సంచరింపగలిగిన వారు కూడ చూడ జాలకుండిరి. అట్టి సీతను ఈ నాడు, రాజవీధులలో నున్న జనులు చూచుచున్నారు.

మూ. అఙ్గరాగోచితాం సీతాం రక్తచన్దనసేవినీమ్,
వర్షముష్ణం చ శీతం చ నేష్యన్త్యాశు వివర్ణతామ్. 9

ప్ర. అ. అఙ్గరాగోచితామ్ = మైపూతకు అలవాటువడ్డది, రక్తచన్దన సేవినీమ్ = ఎఱ్ఱని చందనమును పూసుకొనునది అయిన. సీతామ్ = సీతను, వర్షమ్ = వర్షము, ఉష్ణం చ = వేడి, శీతం చ = చలియు, ఆశు = శీఘ్రముగా, వివర్ణతామ్ = మారిన రంగు కలిగి యుండుటను, నేష్యన్తి = పొందించగలవు.

తా. సీత శరీరమునకు అంగరాగములను, రక్తచందనమును పూసు కొనుటకు అలవాటు పడినది. అట్టి ఈ సీత శరీరవర్ణమును వర్షము, వేడి, చలి మొదలగునవి తొందరగా చెడగొట్టగలవు. 9

మూ. అద్య నూనం దశరథః సత్త్వమావిశ్య భాషతే,
న హి రాజా ప్రియం పుత్రం వివాసయితుమర్హతి. 10

ప్ర. అ. అద్య = నేడు, నూనమ్ = నిశ్చయముగా, దశరథః = దశరథుడు, సత్త్వమ్ = ఏదో భూతము, ఆవిశ్య = ఆవేశించి. భాషతే = మాటలాడుచున్నాడు. రాజా = రాజు, ప్రియమ్ = ప్రియుడైన, పుత్రమ్ = పుత్రుని, వివాసయితుమ్ = దూరము పంపివేయుటకు, న అర్హతి హి = తగడు కదా.

తా. రాజు ఇపుడు ఏదో భూతము ఆవేశించి ఈ విధముగ మాటలాడు చున్నాడు. సందేహము లేదు. ప్రియపుత్రుని ఏ రాజైనను ఇట్లు వెడలం గొట్టునా 10

మూ. నిర్గుణస్యాపి పుత్రస్య కథం స్యాద్విప్రవాసనమ్,
కిం పునర్యస్య లోకోఽయం జితో వృత్తేన కేవలమ్. 11

ప్ర. అ. నిర్గుణస్యాపి = గుణములు లేని వా డైనను, పుత్రస్య = పుత్రునకు, విప్రవాసనమ్ = దేశము వెడలగొట్టుట, కథమ్ = ఎట్లు, స్యాత్ = అగును? యస్య = ఎవనియొక్క, వృత్తేన కేవలమ్ = మంచి చరిత్ర చేతనే, అయం లోకః = ఈ లోకము, జితః = జయింపబడినదో, అతని విషయమున, కిం పునః = చెప్పనేల?

తా. గుణములు లేని పుత్రుని కూడ దేశమునుండి వెడలగొట్టుట అసంభావ్యము. కేవలము మంచి చరిత్రచే ప్రజలం దరిని ఆకర్షించిన కుమారుని విషయమున చెప్పవలెనా? 11

మూ. ఆనృశంస్యమనుక్రోశః శ్రుతం శీలం దమశ్శమః,
రాఘవం శోభయన్త్యేతే షడ్గుణాః పురుషోత్తమమ్. 12

ప్ర. అ. ఆనృశంస్యమ్ = క్రూరత్వము లేకపోవుట, అనుక్రోశః = జాలి, శ్రుతమ్ = విద్య, శీలమ్ = మంచి స్వభావము, దమః = ఇంద్రియ నిగ్రహము, శమః = మనోనిగ్రహము అను, ఏతే = ఈ, షట్ = ఆరు, గుణాః = గుణములు, పురుషోత్తమమ్ = పురుషులలో ఉత్తము డైన, రాఘవమ్ = రాముని, శోభయన్తి = ప్రకాశింపచేయుచున్నవి.

తా. పురుషులలో ఉత్తము డైన రాముడు, క్రూరత్వము లేకుండుట, జాలి, విద్య, మంచి శీలము, ఇంద్రియముల నిగ్రహము, మనోనిగ్రహము అను ఆరు గుణములతో ప్రకాశించుచున్నాడు. 12

మూ. తస్మాత్తస్యోపఘాతేన ప్రజాః పరమపీడితాః,
ఔదకానీవ సత్త్వాని గ్రీష్మే సలిలసంక్షయాత్. 13

ప్ర. అ. తస్మాత్ = ఆ కారణమువలన, తస్య = అట్టి రామునియొక్క, ఉపఘాతేన = హింసచేత, గ్రీష్మే = గ్రీష్మమునందు, సలిలసంక్షయాత్ = నీరు తగ్గిపోవుటవలన, ఔదకాని = నీటిలో నుండు, సత్త్వానీవ = ప్రాణులవలె, ప్రజాః = ప్రజలు, పరమపీడితాః = మిక్కిలి పీడింపబడినారు. 13

తా. అందుచే ఆర్త రామునకు అపకారము కలుగుటవలన, ప్రజ లందరును, గ్రీష్మఋతువునందు నీరు ఎండిపోవుటచే జలజంతువుల వలె గొప్ప బాధను అనుభవించుచున్నారు. 13

మూ. పీడయా పీడితం సర్వం జగదస్య జగత్పతేః,
మూలస్యేవోపఘాతేన వృక్షః పుష్పఫలోపగః. 14

ప్ర. అ. జగత్పతేః = జగత్తునకు అధిపతి యైన, అస్య = ఈ రాముని యొక్క, పీడయా = కష్టము చేత, సర్వమ్ = సమస్త మైన, జగత్ = జగత్తు, మూలస్య = మొదలుకు, ఉపఘాతేన = దెబ్బతగులుట చేత, పుష్పఫలోపగః = పుష్పములను ఫలములను పొందిన, వృక్షః ఇవ = వృక్షము వలె, పీడితమ్ = పీడింపబడినది.

తా. మొదలు కొట్టి వేయుటచే పుష్పఫలములతో నిండిన వృక్షము వలె ఈ లోకమున కంతకు ప్రభు వైన రామునకు కష్టము కలుగుటచే ఈ లోక మంతయు కష్టములపా లగుచున్నది. 14

మూ. మూలం హ్యేష మనుష్యాణాం ధర్మసారో మహాద్యుతిః,
పుష్పం ఫలం చ పత్రం చ శాఖాశ్చాస్యేతరే జనాః. 15

ప్ర. అ. ధర్మసారః = ధర్మమే సారముగా కలవాడు, మహాద్యుతిః = గొప్ప కాంతి కలవాడు అయిన, ఏషః = ఈ రాముడు, మనుష్యాణామ్ = మనుష్యులకు, మూలం హి = మొదలు కదా, ఇతరే = ఇతర మైన, జనాః = జనులు, అస్య = ఈ రాము డనే మొదలు యొక్క, పుష్పమ్ = పుష్పము, ఫలం చ = ఫలమూ, పత్రం చ = ఆకులు, శాఖాః = శాఖలు.

తా. రాముడు, ధర్మమే సారముగా కలవాడు, గొప్ప కాంతి కలవాడు. ఇతడే మనుష్యులకు మొదలు. ఇతరజను లందరును ఈ చెట్టు మొదలుతో సంబంధము గల, పుష్పములు, ఫలములు, పత్రములు, శాఖలు. 15

మూ. తే లక్ష్మణ ఇవ క్షిప్రం సపత్న్యః సహబాంధవాః,
గచ్ఛన్తమనుగచ్ఛామో యేన గచ్ఛతి రాఘవః.

ప్ర. అ. తే = అట్టి మనము, సపత్న్యః = భార్యలతో కూడిన వార మై, సహబాంధవాః = బంధువులతో కూడిన వార మై, రాఘవః = రాముడు, యేన = ఏ మార్గముచే, గచ్ఛతి = వెళ్ళుచున్నాడో ఆ మార్గముచే, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్న ఆ రాముని, లక్ష్మణ ఇవ = లక్ష్మణుడు వలె, క్షిప్రమ్ = శీఘ్రముగా, అనుగచ్ఛామః = అనుసరించి వెళ్ళుదము.

తా. అందుచే మనము కూడ భార్యాబంధువులతో కలసి రాముడు ఎక్కడికి వెళ్లుచున్నాడో అక్కడికి లక్ష్మణుని వలె అతనిని అనుసరించుచు, వెంటనే బయలుదేరి వెళ్లుదము. 16

మూ. ఉద్యానాని పరిత్యజ్య క్షేత్రాణి చ గృహాణి చ,
ఏకదుఃఖసుఖా రామమనుగచ్ఛామ ధార్మికమ్. 17

ప్ర. అ. ఉద్యానాని = ఉద్యానములను, క్షేత్రాణి = పొలములను, గృహాణి చ = ఇండ్లను, పరిత్యజ్య = విడచి, ఏకదుఃఖసుఖాః = రామునితో సమాన మైన సుఖదుఃఖములు కలవార మై, ధార్మికమ్ = ధర్మాత్ము డైన, రామమ్ = రాముని, అనుగచ్ఛామ = అనుసరించి వెళ్ళెదము.

తా. ఉద్యానములను, పొలములను, ఇండ్లను విడచి, రామునితో సుఖదుఃఖములను పంచుకొనుచు, ధర్మాత్ము డైన ఈ రాముని వెంట వెళ్ళెదము. 17

మూ. సముద్ధృతనిధానాని పరిధ్వస్తాజిరాణి చ,
ఉపాత్తధనధాన్యాని హృతసారాణి సర్వశః, 18
రజసాఽభ్యవకీర్ణాని పరిత్యక్తాని దైవతైః,
మూషకైః పరిధావద్భిరుద్బిలైరావృతాని చ, 19
అపేతోదకధూమాని హీనసమ్మార్జనాని చ,
ప్రనష్టబలికర్మేజ్యమన్త్రహోమజపాని చ, 20
దుష్కాలేనేవ భగ్నాని భిన్నభాజనవన్తి చ,
అస్మత్త్యక్తాని వేశ్మాని కైకేయీ ప్రతిపద్యతామ్. 21

ప్ర. అ. సముద్ధృతనిధానాని = పైకి తీసివేయబడిన నిధులు కలవి, పరిధ్వస్తాజిరాణి చ = పాడుపడిన ముంగిళ్ళు కలవి, ఉపాత్తధనధాన్యాని =

తీసుకొనబడిన ధనధాన్యములు కలవీ, సర్వశః = అంతటను, హృతసారాణి = హరింపబడిన సారములు కలవీ, రజసా = పరాగముచే, అభ్యవకీర్ణాని = చల్లబడినవీ, దైవతైః = దేవతలచే, పరిత్యక్తాని = విడువబడినవీ, ఉద్బిలైః = కన్నముల నుండి బయటకు వచ్చిన, పరిధావద్భిః = పరుగెత్తుచున్న, మూషకైః = ఎలుకలచే, ఆవృతాని చ = వ్యాప్తమైనవీ, అపేతోదకధూమాని = ఉదకములు ధూమములు లేనివీ, హీనసమ్మార్జనాని చ = తుడుచుట లేనివీ, ప్రణష్టబలికర్మేజ్యామన్త్రహోమజపాని చ = నశించిన బలికర్మలు, యాగములు, మంత్రములు, హోమములు, జపములు కలవీ, దుష్కాలేన = చెడ్డ కాలముచే, భగ్నాని ఇవ = పాడుపడినవి వలె నున్నవీ, భిన్నభాజనవన్తి చ = బద్దలైన పాత్రలు కలవీ అయిన, అస్మత్త్యక్తాని = మనచే విడువబడిన, వేశ్మాని = గృహములను, కైకేయీ = కైకేయి, ప్రతిపద్యతామ్ = పొందుగాక.

తా. మనము విడిచి వేయగా ఈ నగరములోని ఇండ్లన్నియు, క్షామాది దుష్కాలముచే పాడుపడి నట్లు పాడుపడిపోవును. నిధులన్నియు త్రవ్వివేయ బడును. ముంగిళ్ళు చెడిపోవును. ధనధాన్యములు, ఇతరసంపదలు, అన్నియు నశించును. ఈ ఇండ్లపై దుమ్ము కప్పియుండును. దేవతలు వీటిని విడిచి వెళ్లిపోవుదురు. ఎలుకలు కన్నములనుండి బయటికి వచ్చి స్వేచ్ఛగా ఇటు అటు పరుగెత్తుచుండును. ఉదకము గాని ధూమము గాని కనబడదు. వీటిని తుడుచువా రుండరు. వీటిలో బలికర్మలు, యజ్ఞములు, మంత్రపఠనము, హోమములు, జపములు జరుగవు. బద్దలైన కుండలు అక్కడ అక్కడ పడి యుండును. అట్టి ఇండ్లు కైకేయికి లభించుగాక. 18-21

మూ. వనం నగరమేవాస్తు యేన గచ్ఛతి రాఘవః,
అస్మాభిశ్చ పరిత్యక్తం పురం సంపద్యతాం వనమ్. 22

ప్ర. అ. రాఘవః = రాముడు, యేన = ఏ కారణముచే, గచ్ఛతి = వెళ్ళి పోవుచున్నాడో అందువలన, వనమేవ = వనమే, నగరమ్ = నగరముగ, అస్తు = అగుగాక. అస్మాభిః = మనచే, పరిత్యక్తమ్ = విడువబడిన, పురం చ = పట్టణము, వనమ్ = వనముగా, సంపద్యతామ్ = అగుగాక.

తా. రాముడు వనమునకు వెళ్ళుచున్నాడు గాన ఆ వనమే నగర మగుగాక. మనము విడిచి వేసిన ఈ నగరమే వన మగుగాక. 22

మూ. బిలాని దంష్ట్రిణః సర్వే సానూని మృగపక్షిణః,
త్యజన్త్వస్మద్భయాద్భీతా గజసింహా వనాని చ, 23
అస్మత్త్యక్తం ప్రపద్యన్తాం సేవ్యమానం త్యజన్తు చ.

ప్ర. అ. సర్వే=సమస్త మైన, దంష్ట్రిణః=కోరలు గల సర్పాదులు, బిలాని=బిలములను, మృగపక్షిణః=మృగములు పక్షులు, సానూని=పర్వతముల చరియలను, గజాః=గజములు, సింహాః=సింహములు, వనాని చ=వనములను, అస్మద్భయాత్=మనవలన కలుగు భయమువలన, భీతాః=భయపడిన వై, త్యజన్తు=విడచుగాక. అస్మత్త్యక్తమ్=మనచే విడువబడినదానిని, ప్రపద్యన్తామ్=పొందుగాక। సేవ్యమానమ్=సేవింపబడుచున్నదానిని, త్యజన్తు చ=విడుచుగాక।

తా. మనలను చూచి భయపడి కోరలు గల సర్పాదు లన్నియు బిలములను విడచి పోవుగాక। మృగములు, పక్షులు, పర్వతములను విడిచి పోవుగాక. గజములు, సింహములు, వనములను విడచి పోవుగాక। ఇవన్నియు, మన మున్న వనమును విడిచి మనము విడిచిన అయోధ్యానగరమును చేరుగాక। 23

మూ. తృణమాంసఫలాదానాం దేశం వ్యాలమృగద్విజమ్, 24
ప్రపద్యతాం హి కైకేయీ సపుత్రా సహబాన్ధవైః,
రాఘవేణ వనే సర్వే సహ వత్స్యామ నిర్వృతాః. 25

ప్ర. అ. కైకేయీ=కైకేయి, సపుత్రా=పుత్రునితో కూడుకున్నదై, సహబాన్ధవైః=బంధువులతో కూడ, వ్యాలమృగద్విజమ్ = క్రూరమృగములు, పక్షులు గల, తృణమాంసఫలాదానామ్=తృణములను, మాంసమును, ఫలములను తిను జంతువుల, దేశమ్=దేశమును, ప్రపద్యతాం హి=పొందుగాక. సర్వే=మన మందరము, నిర్వృతాః=సుఖము కలవార మై, రాఘవేణ సహ=రామునితో కూడ, వనే=వనమునందు, వత్స్యామ=నివసించెదము.

తా. పుత్రబాంధవాదులతో కూడిన కైకేయి క్రూరమృగములతోను, పక్షులతోను నిండిన, తృణమాంస ఫలములను తిను జంతువుల దేశమును పొంది పరిపాలించుగాక. మన మందరము రామునితో కలసి వనములో సుఖముగ నివసించెదము. 24.25

మూ. ఇత్యేవం వివిధా వాచో నానాజనసమీరితాః,
శుశ్రావ రామః శ్రుత్వా చ న విచక్రేఽస్య మానసమ్.

ప్ర. అ. రామః = రాముడు, ఇత్యేవమ్ = ఇట్లు, నానాజనసమీరితాః = అనేకు లైన జనులచే పలుకబడిన, వివిధాః = అనేకవిధము లైన, వాచః = వాక్యములను, శుశ్రావ = వినెను. శ్రుత్వా చ = విని కూడ, అస్య = ఇతని, మానసమ్ = మనస్సు, న విచక్రే = వికారము పొందలేదు.

తా. రాముడు ఇట్లు జను లందరును అనేకవిధములుగా పలుకుచున్న మాటలను వినెను. ఆ మాటలను వినిన పిమ్మట కూడ అతని మనస్సునకు వికార మేమియు కలుగలేదు. 26

మూ. స తు వేశ్మ పితుర్దూరాత్ కైలాసశిఖరప్రభమ్,
అభిచక్రామ ధర్మాత్మా మత్తమాతఙ్గవిక్రమః 27

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ముడు, మత్తమాతఙ్గ విక్రమః = మదించిన గజము వంటి గమనము కలవాడు అయిన, సః = ఆ రాముడు, దూరాత్ = దూరమునుండి, కైలాసశిఖరప్రభమ్ = కైలాసశిఖరమువంటి కాంతి గల, పితుః = తండ్రియొక్క, వేశ్మ = గృహమును, అభిచక్రామ = సమీపించెను.

తా. ధర్మాత్ముడును, మదగజగమనము వంటి గమనము గలవాడును అయిన రాముడు దూరమునుండి కైలాసశిఖరము వలె కనబడుచున్న తండ్రి గారి గృహమును సమీపించెను. 27

మూ. వినీతవీరపురుషం ప్రవిశ్య తు నృపాలయమ్,
దదర్శావస్థితం దీనం సుమన్త్రమవిదూరతః. 28

ప్ర. అ. వినీతవీరపురుషమ్ = వినయవంతు లైన వీరపురుషులు గల, నృపాలయమ్ = రాజగృహమును, ప్రవిశ్య తు = ప్రవేశించి, అవిదూరతః = సమీపమున, అవస్థితమ్ = ఉన్న, దీనమ్ = దీను డైన, సుమన్త్రమ్ = సుమంత్రుని, దదర్శ = చూచెను.

తా. రాముడు వీరపురుషులు వినయముతో నిలిచియున్న ఆ రాజగృహమును ప్రవేశించి ఆ సమీపమున, దీను డైన సుమంత్రుని చూచెను. 28

మూ. ప్రతీక్షమాణోఽపి జనం తదార్త
మనార్తరూపః ప్రహసన్నివాథ,
జగామ రామః పితరం దిదృక్షుః
పితుర్నిదేశం విధివచ్చికీర్షుః. 29

ప్ర. అ. రామః = రాముడు, తదా = అపుడు, ఆర్తమ్ = దుఃఖించుచున్న, జనమ్ = జనమును, ప్రతీక్షమాణోఽపి = చూచుచున్నాను, అనార్తరూపః = దుఃఖము లేని రూపము కలవాడు, అథ = మరియు, ప్రహసన్నివ = నవ్వు చున్నట్లు ఉన్నవాడై, పితుః = తండ్రియొక్క, నిదేశమ్ = ఆజ్ఞను, విధివత్ = యథాశాస్త్రముగ, చికీర్షుః = చేయదలచిన వాడై, పితరమ్ = తండ్రిని, దిదృక్షుః = చూడదలచిన వాడై, జగామ = వెళ్ళెను.

తా. అక్కడ నున్న జను లందరు దుఃఖాక్రాంతు లగుటను చూచి కూడ రాము డే మాత్రము దుఃఖింపక పైరుమిక్కిలి నవ్వుచున్నట్లు కనబడుచు, తండ్రి యాజ్ఞను యథావిధిగా చెల్లించుటకు నిశ్చయము చేసుకొని తండ్రిని చూచుటకై వెళ్ళెను. 29

మూ. తత్పూర్వమైక్ష్వాకసుతో మహాత్మా
రామో గమిష్యన్వనమార్తరూపమ్,
వ్యతిష్ఠత ప్రేక్ష్య తదా సుమన్త్రం
పితుర్మహాత్మా ప్రతిహారణార్థమ్. 30

ప్ర. అ. ఐక్ష్వాకసుతః = ఇక్ష్వాకువంశమునందు పుట్టిన దశరథుని కుమారుడును, మహాత్మా = గొప్ప బుద్ధి కలవాడును, మహాత్మా = గొప్ప ధైర్యము కలవాడును అయిన, రామః = రాముడు, తత్పూర్వమ్ = అదే మొదటిసారిగా, వనమ్ = వనమును గూర్చి, గమిష్యన్ = వెళ్లనున్న వాడై, తదా = అపుడు, ఆర్తరూపమ్ = దుఃఖించుచున్న, సుమన్త్రమ్ = సుమంత్రుని, ప్రేక్ష్య = చూచి, పితుః = తండ్రికి, ప్రతిహారణార్థమ్ = తెలుపుట నిమిత్తమై, వ్యతిష్ఠత = నిలచెను.

తా. గొప్ప బుద్ధి కలవాడు, ధైర్యవంతుడు, దశరథకుమారుడు అయిన ఆ రాముడు, తొలిసారిగా, అరణ్యమునకు పోవుటకు నిశ్చయించుకొని,

అక్కడ దుఃఖితు డైన సుమంత్రుని చూచి తన రాకను తండ్రికి తెలుపుటకై అక్కడ నిలచెను. ౪౦

మూ. పితుర్నిదేశేన తు ధర్మవత్సలో
వనప్రవేశే కృతబుద్ధినిశ్చయః,
స రాఘవః ప్రేక్ష్య సుమన్త్రమబ్రవీ
న్నివేదయస్వాగమనం నృపాయ మే. ౪౧

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
త్రయస్త్రింశః సర్గః.

ప్ర. అ. ధర్మవత్సలః = ధర్మమునందు ప్రేమ గల, సః రాఘవః = ఆ రాముడు, పితుః = తండ్రియొక్క, నిదేశేన = ఆజ్ఞచేత, వనప్రవేశే = వనప్రవేశమునందు, కృతబుద్ధినిశ్చయః = చేయబడిన బుద్ధియొక్క నిశ్చయము కలవాడై, సుమన్త్రమ్ = సుమంత్రుని, ప్రేక్ష్య = చూచి, అబ్రవీత్ = పలికెను. నృపాయ = రాజునకు, మే = నా యొక్క, ఆగమనమ్ = రాకను, నివేదయస్వ = తెలుపుము.

తా. ధర్మమునందు అధిక శ్రద్ధగల ఆ రాముడు తండ్రి యాజ్ఞచే వనమునకు పోవుటకు నిశ్చయించుకొని "నేను వచ్చి నట్లు రాజునకు చెప్పుము" అని సుమంత్రునితో పలికెను. ౪౧

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్ర వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ముప్పదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుస్త్రింశః సర్గః

[శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై రాజులతో కూడిన దశరథమహారాజు వద్దకు పోయి, వనవాసమునకై సెలవడుగుట, రాజు శోకముచే మూర్ఛిల్లుట, శ్రీరాముడు తండ్రికి నచ్చఁబలుకుట, రాజు శ్రీరాముని గాఢాశ్లేషము చేసి మరల మూర్ఛనొందుట].

మూ. తతః కమలపత్రాక్షః శ్యామో నిరుపమో మహాన్,
ఉవాచ రామస్తం సూతం పితురాఖ్యాహి మామితి. 1

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కమలపత్రాక్షః = కమలపత్రముల వంటి నేత్రములు కలవాడు, శ్యామః = నల్లనివాడు, నిరుపమః = సాటి లేనివాడు, మహాన్ = పూజ్యుడు అయిన, రామః = రాముడు, మామ్ = నన్ను గూర్చి, పితుః = తండ్రికి, ఆఖ్యాహి = చెప్పుము, ఇతి = అని, తం సూతమ్ = ఆ సారథిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పద్మపత్రముల వంటి నేత్రములు కలవాడు, శ్యామవర్ణుడు, సాటి లేనివాడు, పూజ్యుడు అయిన ఆ రాముడు "నేను వచ్చి నట్లు మా తండ్రిగారికి చెప్పుము" అని సూతునితో పలికెను. 1

మూ. స రామప్రేషితః క్షిప్రం సంతాపకలుషేన్ద్రియః,
ప్రవిశ్య నృపతిం సూతో నిఃశ్వసన్తం దదర్శ హ. 2

ప్ర. అ. సంతాపకలుషేన్ద్రియః = దుఃఖముచే కలత చెందిన ఇంద్రియములు గల, సః సూతః = ఆ సూతుడు, రామప్రేషితః = రామునిచే పంపబడి, క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రవిశ్య = ప్రవేశించి, నిఃశ్వసన్తమ్ = నిట్టూర్పుచున్న, నృపతిమ్ = రాజును, దదర్శ హ = చూచెను.

తా. సూతుని ఇంద్రియములు అన్నియు దుఃఖముచే కలత చెంది యుండెను. ఆ సూతుడు, రాముని మాట విని, వెంటనే లోనికి వెళ్లి యచట దుఃఖముతో నిట్టూర్చుచున్న రాజును చూచెను. ౨

మూ. ఉపరక్తమివాదిత్యం భస్మచ్ఛన్నమివానలమ్,
తటాకమివ నిస్తోయమపశ్యజ్జగతీపతిమ్. ౩

ప్ర. అ. ఉపరక్తమ్ = గ్రహణము పట్టిన, ఆదిత్యమ్ ఇవ = సూర్యుని వలె, భస్మచ్ఛన్నమ్ = భస్మముచే కప్పబడిన, అనలమ్ ఇవ = అగ్ని వలె, నిస్తోయమ్ = జలము లేని, తటాకమ్ ఇవ = చెరువు వలెనున్న, జగతీపతిమ్ = రాజును, అపశ్యత్ = చూచెను.

తా. దశరథుడు అపుడు గ్రహణము పట్టిన సూర్యుడు వలె, భస్మముచే కప్పబడిన అగ్నివలె, జలము లేని తటాకము వలె తేజోవిహీనుడై యుండెను. ౩

మూ. ఆలోక్య తు మహాప్రాజ్ఞః పరమాకులచేతసమ్,
రామమేవానుశోచన్తం సూతః ప్రాఞ్జలిరాసదత్. ౪

ప్ర. అ. మహాప్రాజ్ఞః = గొప్ప బుద్ధిమంతుడైన, సూతః = సారథి, రామమేవ = రాముని గూర్చియే, అనుశోచన్తమ్ = దుఃఖించుచున్న, పరమాకులచేతసమ్ = మిక్కిలి వ్యాకులమైన చిత్తము గల, దశరథుని, ఆలోక్య తు = చూచి, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, ఆసదత్ = సమీపించెను.

తా. మహాబుద్ధిశాలియైన ఆ సుమంత్రుడు, రాముని గూర్చియే దుఃఖించుచు, వ్యాకులమైన చిత్తము గల ఆ దశరథుని చూచి నమస్కరించుచు, సమీపించెను. ౪

మూ. తం వర్ధయిత్వా రాజానం సూతః పూర్వం జయాశిషా,
భయవిక్లబయా వాచా మన్దయా శ్లక్ష్ణమబ్రవీత్. ౫

ప్ర. అ. సూతః = సూతుడు, తం రాజానమ్ = ఆ రాజును, పూర్వమ్ = ముందుగా, జయాశిషా = 'జయ విజయీ భవ' అను ఆశీర్వాదముతో, వర్ధయిత్వా = వృద్ధి పొందించి, భయవిక్లబయా = భయముచే తత్తరపడుచున్న, మన్దయా = మందమైన, వాచా = వాక్కుతో, శ్లక్ష్ణమ్ = మధురముగా, అబ్రవీత్ = పలికెను.

తా. సుమంత్రుడు, ముందుగా ఆ రాజునకు "జయ విజయీ భవ" అను ఆశీర్వచన వాక్యములను పలికి భయమూచే తొట్రుపడుచున్న మాటలతో, మెల్లగా, మధురముగా ఇట్లు పలికెను. 5

మూ. అయం స పురుషవ్యాఘ్రో ద్వారి తిష్ఠతి తే సుతః,
బ్రాహ్మణేభ్యో ధనం దత్త్వా సర్వం చైవోపజీవినామ్. 6

ప్ర. అ. పురుషవ్యాఘ్రః=పురుషులలో శ్రేష్ఠుడైన, సః అయమ్ = అట్టి ఈ, తే సుతః=నీ కుమారుడు, బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకును, ఉపజీవినాం చైవ=జీవికకై తనపై ఆధారపడినవారికిని, సర్వమ్=సమస్తమైన, ధనమ్ = ధనమును, దత్త్వా=ఇచ్చి, ద్వారి=ద్వారమునందు, తిష్ఠతి=నిలిచి యున్నాడు.

తా. పురుషశ్రేష్ఠుడైన నీ కుమారుడు, తన ధనము నంతను బ్రాహ్మణులకును, భృత్యులకును దానము చేసి, వచ్చి, ద్వారమువద్ద వేచియున్నాడు.

మూ. స త్వా పశ్యతు భద్రం తే రామః సత్యపరాక్రమః,
సర్వాన్ సుహృద ఆపృచ్ఛ్య త్వామిదానీం దిదృక్షతే. 7

ప్ర. అ. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక. సత్యపరాక్రమః = వ్యర్థము కాని పరాక్రమము గల, సః రామః = ఆ రాముడు, త్వా = నిన్ను, పశ్యతు = చూచుగాక. సర్వాన్ = సమస్తమైన, సుహృదః = మిత్రులను, ఆపృచ్ఛ్య=అడిగి, ఇదానీమ్=ఇపుడు, త్వామ్=నిన్ను, దిదృక్షతే=చూడదలంచు చున్నాడు.

తా. నీకు క్షేమ మగుగాక. వ్యర్థము కాని పరాక్రమము గల ఆ రామునికి దర్శనము ఇమ్ము. అతడు తన మిత్రుల నందరిని పీడ్కొలిపి ఇపుడు నిన్ను చూడదలంచుచున్నాడు. 7

మూ. గమిష్యతి మహారణ్యం తం పశ్య జగతీపతే,
వృతం రాజగుణైః సర్వైరాదిత్యమివ రశ్మిభిః. 8

ప్ర. అ. మహారణ్యమ్ = మహారణ్యమును గూర్చి, గమిష్యతి = వెళ్ళగలడు. జగతీపతే=ఓ రాజా! సర్వైః=సమస్తమైన, రాజగుణైః=రాజగుణము

లతో, వృతమ్=కూడిన, తమ్=ఆ రాముని, రశ్మిభిః=కిరణములతో కూడిన, ఆదిత్యమివ=సూర్యుని వలె, పశ్య=చూడుము.

తా. మహారాజా! రాముడు మహారణ్యమునకు వెళ్లుచున్నాడు. కిరణములతో కూడిన సూర్యుని వలె సకలరాజగుణములతో ప్రకాశించుచున్న ఆ రాముని చూడుము. 8

మూ. స సత్యవాదీ ధర్మాత్మా గాంభీర్యాత్సాగరోపమః,
అకాశ ఇవ నిష్పఙ్కో నరేంద్రః ప్రత్యువాచ తమ్. 9

ప్ర. అ. సత్యవాదీ=సత్యమునే పలుకువాడు, ధర్మాత్మా=ధర్మాత్ముడు, గాంభీర్యాత్=గాంభీర్యము వలన, సాగరోపమః=సముద్రముతో సమానుడు, అకాశ ఇవ = ఆకాశము వలె, నిష్పఙ్కః=మాలిన్యము లేనివాడు అయిన, సః నరేన్ద్రః=ఆ రాజా, తమ్=అతనిని గూర్చి, ప్రత్యువాచ=తిరిగి పలికెను.

తా. సత్యమునే పలుకువాడు, ధర్మాత్ముడు, గాంభీర్యములో సముద్రముతో సమానుడు, ఆకాశము వలె మాలిన్యము లేనివాడు అయిన ఆ దశరథ మహారాజు సుమంత్రునితో ఇట్లు పలికెను. 9

మూ. సుమన్త్రానయ మే దారాన్ యే కేచిదిహ మామకాః,
దారైః పరివృతః సర్వైర్ద్రష్టుమిచ్ఛామి ధార్మికమ్. 10

ప్ర. అ. సుమన్త్ర=ఓ సుమంత్రుడా, మామకాః = నాభార్యలు, యే కేచిత్=ఎవరైతే, ఇహ=ఇక్కడ ఉన్నారో, మే దారాన్=అట్టి నా భార్యలను, ఆనయ = తీసుకొనిరమ్ము. సర్వైః = సమస్తమైన, దారైః = భార్యలతో, పరివృతః=కూడిన వాడనై, ధార్మికమ్=ధర్మాత్ముడైన రాముని, ద్రష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

తా. సుమంత్రా! ఇక్కడ ఉన్న నా భార్యల నందరిని తీసుకొనిరమ్ము. వారందరితో కలిసి నేను ధర్మాత్ముడైన రాముని చూడగోరుచున్నాను. 10

మూ. సోఽన్తఃపురమతీత్యైవ స్త్రియస్తా వాక్యమబ్రవీత్,
ఆర్యో హ్వయతి వో రాజా గమ్యతాం తత్ర మా చిరమ్. 11

ప్ర. అ. సః=అతడు, అన్తఃపురమ్=అంతఃపురమును, ఆవిశ్య=ప్రవేశించి, తాః=ఆ, స్త్రియః=స్త్రీలను గూర్చి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను. ఆర్యాః=ఓ పూజార్హులారా, వః=మిమ్ములను, రాజా=రాజు, హ్వయతి=పిలుచుచున్నారు. తత్ర=అచటికి, గమ్యతామ్=వెళ్లెదరుగాక. చిరమ్=ఆలస్యము, మా=వద్దు.

తా. సుమంత్రుడు అంతఃపురము ప్రవేశించి "ఓ పూజనీయులారా! రాజు మిమ్ములను పిలుచుచున్నారు. అచటికి వెళ్ళుడు. ఆలస్యము చేయవద్దు" అని ఆ స్త్రీలతో పలికెను. 11

మూ. ఏవముక్తాః స్త్రియః సర్వాః సుమన్త్రేణ నృపాజ్ఞయా,
ప్రచక్రముస్తద్భవనం భర్తురాజ్ఞాయ శాసనమ్. 12

ప్ర. అ. నృపాజ్ఞయా=రాజుయొక్క ఆజ్ఞచేత, సుమన్త్రేణ=సుమంత్రుని చేత, ఏవమ్=ఇట్లు, ఉక్తాః=పలుకబడిన, సర్వాః=సమస్తమైన, స్త్రియః=స్త్రీలు, భర్తుః=భర్తయొక్క, శాసనమ్=శాసనమును, ఆజ్ఞాయ=తెలుసుకొని, తద్భవనమ్=అతని గృహమును గూర్చి, ప్రచక్రముః=నడచిరి.

తా. రాజాజ్ఞచే సుమంత్రుడు ఇట్లు పలుకగా, ఆ స్త్రీ లందరును, రాజాజ్ఞ ప్రకారము అతని ఇంటికి వెళ్లిరి. 12

మూ. అర్ధసప్తశతాస్తాస్తు ప్రమదాస్తామ్రలోచనాః,
కౌసల్యాం పరివార్యాథ శనైర్జగ్ముర్ధృతవ్రతాః. 13

ప్ర. అ. అథ=అటుపిమ్మట, ధృతవ్రతాః=ధరింపబడిన వ్రతము కలవారు, తామ్రలోచనాః=ఎఱ్ఱని నేత్రములు కలవారు, అయిన, తాః=ఆ, అర్ధసప్తశతాః=మూడువందల ఏబదిమంది, ప్రమదాః=స్త్రీలు, కౌసల్యామ్=కౌసల్యను, పరివార్య=చుట్టి, శనైః=మెల్లగా, జగ్ముః=వెళ్లిరి.

తా. పతివ్రతలు, ఎఱ్ఱని నేత్రములు కలవారు, అయిన మూడు వందల యేబదిమంది స్త్రీలు, కౌసల్యను అనుసరించి మెల్లగా అచటికి వెళ్లిరి. 13

మూ. ఆగతేషు చ దారేషు సమవేక్ష్య మహీపతిః,
ఉవాచ రాజా సూతం తం సుమన్త్రానయ మే సుతమ్.

ప్ర. అ. దారేషు = భార్యలు, ఆగతేషు = వచ్చినవారగు చుండగా, మహీపతిః = భూమికి అధిపతి యైన, రాజా = దశరథుడు, సమవేక్ష్య = చూచి, తం సూతమ్ = ఆ సారథిని గూర్చి, ఉవాచ = పలికెను. సుమన్త్ర = ఓ సుమంత్రా! మే సుతమ్ = నా కుమారుని, ఆనయ = తీసుకొనిరమ్ము.

తా. ఆ భార్య లందరును వచ్చిన పిమ్మట దశరథమహారాజు, "ఓ సుమంత్రా! నా కుమారుని తీసుకొని రమ్ము" అని అతనితో పలికెను. 14

మూ. స సూతో రామమాదాయ లక్ష్మణం మైథిలీం తదా,
జగామాభిముఖస్తూర్ణం సకాశం జగతీపతేః. 15

ప్ర. అ. సః సూతః = ఆ సూతుడు, తదా = అపుడు, రామమ్ = రాముని, లక్ష్మణమ్ = లక్ష్మణుని, మైథిలీమ్ = సీతను, ఆదాయ = తీసుకొని, తూర్ణమ్ = శీఘ్రముగ, జగతీపతేః = రాజుయొక్క, సకాశమ్ = సమీపమును, అభిముఖః = అతనికి అభిముఖుడై, జగామ = వెళ్లెను.

తా. అపు డా సుమంత్రుడు సీతారామలక్ష్మణులను వెంటనే రాజు దగ్గరకు తీసుకొని వెళ్ళెను. 15

మూ. స రాజా పుత్రమాయాన్తం దృష్ట్వా దూరాత్కృతాఞ్జలిమ్,
ఉత్పపాతాసనాత్తూర్ణమార్తః స్త్రీజనసంవృతః. 16

ప్ర. అ. స్త్రీజనసంవృతః = స్త్రీజనముతో కూడిన, సః రాజా = ఆ రాజు, కృతాఞ్జలిమ్ = కట్టబడిన దోసిలిగల, ఆయాన్తమ్ = వచ్చుచున్న, పుత్రమ్ = పుత్రుని, దూరాత్ = దూరమునుండి, దృష్ట్వా = చూచి, ఆర్తః = దుఃఖితుడై, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆసనాత్ = ఆసనము నుండి, ఉత్పపాత = ఎగిరి లేచెను.

తా. స్త్రీలచే చుట్టుకొనబడిన ఆ దశరథుడు, నమస్కరించుచువచ్చుచున్న కుమారుని, దూరమునుండియే చూచి దుఃఖితుడై, వెంటనే ఆసనమునుండి లేచెను. 16

మూ. సోఽభిదుద్రావ వేగేన రామం దృష్ట్వా విశాంపతిః,
తమసమ్ప్రాప్య దుఃఖార్తః పపాత భువి మూర్ఛితః. 17

ప్ర. అ. విశామ్ = ప్రజలకు, పతిః = ప్రభు వైన, సః = దశరథుడు, రామమ్ = రాముని, దృష్ట్వా = చూచి, వేగేన = వేగముతో, అభిదుద్రావ = ఎదురుగా పరుగెత్తెను. తమ్ = ఆ రాముని, అసంప్రాప్య = చేరకుండగనే, దుఃఖార్తః = దుఃఖపీడితు డై, మూర్ఛితః = మూర్ఛితు డై, భువి = నేలపై, పపాత = పడెను.

తా. ఆ దశరథమహారాజు రాముని చూడగనే వేగముగా అతనికి ఎదురుగా పరుగెత్తి, ఆ రాముని చేరక మునుపే దుఃఖముతో మూర్ఛ చెంది నేలపై పడెను. 17

మూ. తం రామోఽభ్యపతత్క్షిప్రం లక్ష్మణశ్చ మహారథః,
విసంజ్ఞమివ దుఃఖేన సశోకం నృపతిం తదా. 18

ప్ర. అ. తదా = అపుడు, దుఃఖేన = దుఃఖముచేత, విసంజ్ఞమ్ ఇవ = తెలివి తప్పిన వాని వలె ఉన్న, సశోకమ్ = శోకముతో కూడిన, తం నృపతిమ్ = ఆ రాజును, రామః = రాముడు, మహారథః = మహారథు డైన, లక్ష్మణశ్చ = లక్ష్మణుడును, క్షిప్రమ్ = శీఘ్రముగా, అభ్యపతత్ = సమీపించిరి.

తా. అపుడు, దుఃఖముతో తెలివితప్పినట్లు ఉన్న శోకార్తు డైన ఆ రాజు దగ్గరకు రాముడును, మహారథు డైన లక్ష్మణుడును తొందరగా పరుగెత్తిరి.

వి. తనను సారథిని గుఱ్ఱములను కాపాడుకొనుచు పదివేలమంది ధనుర్ధరులతో యుద్ధము చేయగల్గినవాడు మహారథుడు 18

మూ. స్త్రీసహస్రనినాదశ్చ సంజజ్ఞే రాజవేశ్మని,
హా హా రామేతి సహసా భూషణధ్వనిమూర్ఛితః. 19

ప్ర. అ. సహసా = వెంటనే, రాజవేశ్మని = రాజగృహమునందు, భూషణధ్వనిమూర్ఛితః = అలంకారధ్వనితో కలసిన, హా హా రామ ఇతి = అయ్యో రామా!, అయ్యో రామా అని, స్త్రీ సహస్రనినాదశ్చ = వేలకొలది స్త్రీల ఆర్తధ్వని, సంజజ్ఞే = పుట్టెను.

తా. అపుడు వెంటనే ఆ రాజగృహము నుండి భూషణధ్వనులతో కలసిన "అయ్యో రామా!" అను వేలకొలది స్త్రీల ఆర్తధ్వని బయలుదేరెను. 19

మూ. తం పరిష్వజ్య బాహుభ్యాం తావుభౌ రామలక్ష్మణౌ,
పర్యఙ్కే సీతయా సార్ధం రుదన్తః సమవేశయన్. 20

ప్ర. అ. తౌ = ఉభౌ = ఇద్దరైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, సీతయా సార్ధమ్ = సీతతో కూడ, తమ్ = ఆ దశరథుని, బాహుభ్యామ్ = బాహువులతో, పరిష్వజ్య = కౌగలించుకొని, రుదంతః = ఏడ్చుచున్నవారై, పర్యఙ్కే = పర్యంకమునందు, సమవేశయన్ = కూర్చుండబెట్టిరి.

తా. సీతారామలక్ష్మణులు ఆ దశరథుని బాహువులతో కౌగలించుకొని ఏడ్చుచు, అతనిని మెత్తని ఆసనముపై కూర్చుండబెట్టిరి. 20

మూ. అథ రామో ముహూర్తేన లబ్ధసంజ్ఞం మహీపతిమ్,
ఉవాచ ప్రాఞ్జలిర్భూత్వా శోకార్ణవపరిప్లుతమ్. 21

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రామః = రాముడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, ముహూర్తేన = క్షణకాలములో, లబ్ధసంజ్ఞమ్ = పొందబడిన సంజ్ఞ కలవాడు, శోకార్ణవపరిప్లుతమ్ = దుఃఖసముద్రములో మునిగినవాడూ ఐన, మహీపతిమ్ = రాజునుగూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిదప రాముడు, క్షణకాలమున తిరిగి సంజ్ఞ పొంది, శోకసముద్రమున మునిగి ఉన్న ఆ రాజునకు నమస్కరించుచు ఇట్లనెను. 21

మూ. ఆపృచ్ఛే త్వాం మహారాజ సర్వేషామీశ్వరోఽసి నః,
ప్రస్థితం దణ్డకారణ్యం పశ్య త్వం కుశలేన మామ్. 22

ప్ర. అ. మహారాజ = మహారాజా, త్వామ్ = నిన్ను, ఆపృచ్ఛే = అనుమతిని కోరుచున్నాను. సర్వేషామ్ = సమస్తమైన, నః = మాకు, ఈశ్వరః = ప్రభువుగా, అసి = అయివున్నావు. త్వమ్ = నీవు, కుశలేన = కుశలముగా, దణ్డకారణ్యమ్ = దండకారణ్యమును గూర్చి, ప్రస్థితమ్ = ప్రయాణమైన, మామ్ = నన్ను, పశ్య = చూడుము.

తా. మహారాజా! నేను సెలవు కోరుచున్నాను. నీవు మా అందరికిని అధిపతివి. నేను దండకారణ్యమునకు బయలుదేరి వెళ్ళుచున్నాను. నీవు సుఖముగా నన్ను చూడుము. 22

మూ. లక్ష్మణం చానుజానీహి సీతా చాన్వేతి మాం వనమ్,
కారణైర్బహుభి స్తథ్యైర్వార్యమాణౌ న చేచ్ఛతః. 23

ప్ర. అ. లక్ష్మణం చ = లక్ష్మణుని(కి) కూడ, అనుజానీహి = అనుజ్ఞ నిమ్ము. సీతా చ = సీతకూడ, మామ్ = నన్ను, వనమ్ = వనమును గూర్చి, అన్వేతి = అనుసరించి వచ్చుచున్నది. తథ్యైః = సత్యమైన, బహుభిః = అనేకమైన, కారణైః = కారణములచేత, వార్యమాణౌ = నివారింపబడుచున్నను, న చ ఇచ్ఛతః = వీరిద్దరు అంగీకరించుటలేదు.

తా. లక్ష్మణునకు కూడ అనుజ్ఞ నిమ్ము. సీత కూడ నన్ను అనుసరించి వనమునకు వచ్చుచున్నది. సత్యమైన ఎన్నో కారణములు చెప్పి నేను నివారించుచున్నను వీరు అంగీకరించుటలేదు. 23

మూ. అనుజానీహి సర్వాన్నః శోకముత్సృజ్య మానద,
లక్ష్మణం మాం చ సీతాం చ ప్రజాపతిరివ ప్రజాః. 24

ప్ర. అ. మానద = మానమును ఇచ్చువాడా, శోకమ్ = దుఃఖమును, ఉత్సృజ్య = విడచి, లక్ష్మణమ్ = లక్ష్మణుని, మాం చ = నన్ను, సీతాం చ = సీతను, సర్వాన్ = సమస్తమైన, నః = మమ్ములను, ప్రజాపతిః = బ్రహ్మదేవుడు, ప్రజాః ఇవ = ప్రజలను వలె, అనుజానీహి = అనుమతింపుము.

తా. మర్యాదను ఇచ్చు మహారాజా! దుఃఖమును విడచి, లక్ష్మణుని, నన్ను, సీతను, మమ్ముల నందరిని కూడ బ్రహ్మ ప్రజలను వలె అనుమతింపుము.

మూ. ప్రతీక్షమాణ మవ్యగ్ర మనుజ్ఞాం జగతీపతేః,
ఉవాచ రాజా సంప్రేక్ష్య వనవాసాయ రాఘవమ్. 25

ప్ర. అ. రాజా = రాజు, వనవాసాయ = వనవాసముకొరకు, జగతీపతేః = రాజుయొక్క (తనయొక్క), అనుజ్ఞామ్ = అనుజ్ఞను, ప్రతీక్షమాణమ్ = ఎదురు చూచుచున్న, అవ్యగ్రమ్ = వ్యగ్రత లేని, రాఘవమ్ = రాముని, సంప్రేక్ష్య = చూచి, ఉవాచ = పలికెను.

తా. మనోవైకల్య మేమియు లేక వనవాసమున నిమిత్తము తన అనుమతి కొరకై, నిరీక్షించుచున్న ఆ రాముని చూచి దశరథుడు ఇట్లు పలికెను. 25

మూ. అహం రాఘవ కైకేయ్యా వరదానేన మోహితః,
అయోధ్యాయా స్త్వమేవాద్య భవ రాజా నిగృహ్య మామ్.

ప్ర. అ. రాఘవ = ఓ రామా, అహమ్ = నేను, కైకేయ్యా = కైకేయిచేత, వరదానేన = వరదానముచేత, మోహితః = మోహపెట్టబడితిని. అద్య = ఇపుడు, మామ్ = నన్ను, నిగృహ్య = నిగ్రహించి, త్వమేవ = నీవే, అయోధ్యాయాః = అయోధ్యకు, రాజా = రాజుగా, భవ = అగుము.

తా. ఓ రామా! కైకేయి నన్ను తన కిచ్చిన వరములను కారణముగ చేసికొని వంచించినది. నీవు నన్ను నిగ్రహించి అయోధ్యాధిపత్యమును పొందుము. 26

మూ. ఏవముక్తో నృపతినా రామో ధర్మభృతాం వరః,
ప్రత్యువాచాఞ్జలిం కృత్వా పితరం వాక్యకోవిదః. 27

ప్ర. అ. ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారిలో, వరః = శ్రేష్ఠుడు, వాక్యకోవిదః = మాటలలో నేర్పరి యైన, రామః = రాముడు, నృపతినా = రాజుచేత, ఏవమ్ = ఈ విధముగ, ఉక్తః = పలుకబడినవాడై, అఞ్జలిం కృత్వా = దోసిలి ఒగ్గి, పితరమ్ = తండ్రిని గూర్చి, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. ధర్మమును పోషించువారిలో శ్రేష్ఠుడు, మాటలలో నేర్పరి యైన రాముడు, రాజు మాటలు విని, అతనికి నమస్కరించుచు ఇట్లు పలికెను. 27

మూ. భవాన్వర్షసహస్రాయ పృథివ్యా నృపతే పతిః,
అహం త్వరణ్యే వత్స్యామి న మే
కార్యం త్వయాఽనృతమ్. 28

ప్ర. అ. నృపతే = మహారాజా! వర్షసహస్రాయ = వేయి సంవత్సరములకు, భవాన్ = నీవే, పృథివ్యాః = భూమికి, పతిః = అధిపతివి. అహం తు = నేనైతే, అరణ్యే = అరణ్యమునందు, వత్స్యామి = నివసించగలను. త్వయా = నీచేత, మే = నాకొరకు, అనృతమ్ = అసత్యము, న కార్యమ్ = చేయతగినది కాదు.

తా. మహారాజా, అనేకసంవత్సరములపాటు నీవు ఈ భూమికి రాజుగా ఉండవలెను. నేను అరణ్యములో నివసించెదను. నా నిమిత్తమై నీవు నీ మాటను అసత్యము చేయవద్దు. 28

మూ. నవ పఞ్చ చ వర్షాణి వనవాసే విహృత్య తే,
పునః పాదౌ గ్రహీష్యామి ప్రతిజ్ఞాన్తే నరాధిప. 29

ప్ర. అ. నరాధిప = ఓ రాజా! నవ పఞ్చ చ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, వనవాసే = వనవాసమునందు, విహృత్య = విహరించి, ప్రతిజ్ఞాన్తే = ప్రతిజ్ఞయొక్క అంతమునందు, పునః = తిరిగి, తే = నీయొక్క, పాదౌ = పాదములను, గ్రహీష్యామి = గ్రహించెదను.

తా. రాజా! పదునాలుగు సంవత్సరములు వనవాసము చేయుచు, విహరించి, ప్రతిజ్ఞ పూర్తి చేసుకొని, మరల నీ పాదములకు నమస్కరించెదను. 29

మూ. రుదన్నార్తః ప్రియం పుత్రం సత్యపాశేన సంయుతః,
కైకేయ్యా చోద్యమానస్తు మిథో రాజా తమబ్రవీత్. 30

ప్ర. అ. సత్యపాశేన = సత్యపాశముచేత, సంయుతః = కట్టబడిన, రాజా = ఆ రాజు, కైకేయ్యా = కైకేయిచేత, మిథః = రహస్యముగా, చోద్యమానస్తు = ప్రేరేపింపబడుచు, ఆర్తః = దుఃఖితుడై, రుదన్ = ఏడ్చుచు, తమ్ = ఆ, ప్రియం పుత్రమ్ = ప్రియుడైన పుత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. సత్యపాశముచే బంధింపబడిన ఆ రాజును కైకేయి రహస్యముగ, (రాముని పంపివేయుము అని) ప్రేరేపింప మొదలిడెను. అప్పుడు అతడు దుఃఖాక్రాంతుడై, ఏడ్చుచు, ఆ ప్రియపుత్రునితో ఇట్లనెను. 30

మూ. శ్రేయసే వృద్ధయే తాత పునరాగమనాయ చ,
గచ్ఛస్వారిష్టమవ్యగ్రం పన్థానమకుతోభయమ్. 31

ప్ర. అ. తాత = ఓ తండ్రీ, అరిష్టమ్ = మంగళకరము, అవ్యగ్రమ్ = దుఃఖములు లేనిది, అకుతోభయమ్ = ఎటునుండియు భయము లేనిది అయిన, పన్థానమ్ = మార్గమును, శ్రేయసే = శ్రేయస్సుకొరకును, వృద్ధయే = అభివృద్ధి కొరకును, పునః ఆగమనాయ చ = తిరిగి వచ్చుటకొరకును, గచ్ఛస్వ = వెళ్ళుము.

తా. నాయనా! నీవు పరలోకశ్రేయస్సు కొరకును, ఇహలోకాభివృద్ధికొరకును, తిరిగి వచ్చుటకును వెళ్లుము. (వెళ్లి తిరిగి రమ్ము). నీ మార్గము మంగళప్రదమై, దుఃఖశూన్యమై, ఎటువైపునుండియు భయములేనిదై ఉండుగాక. ౩1

మూ. న హి సత్యాత్మనస్తాత ధర్మాభిమనసస్తవ,
వినివర్తయితుం బుద్ధిః శక్యతే రఘునన్దన. ౩2

ప్ర. అ. తాత = నాయనా! రఘునన్దన = ఓ రామా! సత్యాత్మనః = సత్యస్వరూపుడవు, ధర్మాభిమనసః = ధర్మమునందు మనస్సుకలవాడవు అయిన, తవ = నీయొక్క, బుద్ధిః = బుద్ధి, వినివర్తయితుమ్ = మరలించుటకు, న శక్యతే హి = శక్యము కాదు కదా!

తా. రామా! నీవు సత్యరూపుడవు. ధర్మమునందు మనస్సు నిలిపినవాడవు. అట్టి నీ బుద్ధిని మరల్చుటకు శక్యము కాదు. ౩2

మూ. అద్య త్విదానీం రజనీం పుత్ర మా గచ్ఛ సర్వథా,
ఏకాహదర్శనేనాపి సాధు తావచ్చరామ్యహమ్. ౩౩

ప్ర. అ. పుత్ర = ఓ కుమారా! అద్య = నేడు, ఇదానీమ్ = ఇపుడు, రజనీమ్ = రాత్రి, సర్వథా = అన్ని విధముల, మా గచ్ఛ = వెళ్లకుము. ఏకాహదర్శనేనాపి = ఒక దినము చూచుటచేతనైనను, అహమ్ = నేను, సాధు = బాగుగ, చరామి తావత్ = ఉండెదను.

తా. కుమారా! ఈ రాత్రి మాత్రము నీవు ఏ విధముగను, వెళ్లవద్దు. ఒక్క రోజైనను నిన్ను చూచుచు సుఖముగా ఉండెదను. ౩౩

మూ. మాతరం మాం చ సంపశ్యన్ వసేమామద్య శర్వరీమ్,
తర్పితః సర్వకామైస్త్వం శ్వః కాలే సాధయిష్యసి. ౩4

ప్ర. అ. మాతరమ్ = తల్లిని, మాం చ = నన్ను, సంపశ్యన్ = చూచుచు, అద్య = నేడు, ఇమామ్ = ఈ, శర్వరీమ్ = రాత్రిని, వస = నివసింపుము. సర్వకామైః = సమస్తకామములచే, తర్పితః = తృప్తి పొందింపబడినవాడవై, త్వమ్ = నీవు, శ్వః = రేపు, కాలే = ప్రాతఃకాలమున, సాధయిష్యసి = వెళ్లగలవు.

తా. నన్ను, నీ తల్లిని చూచుకొనుచు నేటి రాత్రి యిచటనే యుండిపొమ్ము. సర్వకామములందే సంతృప్తి చెందినవాడవై రేపు ఉదయమే వెళ్ళుము. ౮౪

మూ. దుష్కరం క్రియతే పుత్ర సర్వథా రాఘవ త్వయా,
మత్ప్రియార్థం ప్రియాంస్త్యక్త్వా యద్యాసి విజనం వనమ్.

ప్ర. అ. పుత్ర = కుమారా! రాఘవ = రామా! త్వయా = నీచేత, సర్వథా = అన్ని విధముల, దుష్కరమ్ = చేయ శక్యము కాని పని, క్రియతే = చేయబడు చున్నది. యత్ = ఎందువలన, మత్ ప్రియార్థమ్ = నా సంతోషముకొరకు, ప్రియాన్ = ప్రియులైనవారిని అందరిని, త్యక్త్వా = విడచి, విజనమ్ = జనశూన్యమైన, వనమ్ = వనమును గూర్చి, యాసి = వెళ్ళుచున్నావు.

తా. కుమారా! రామా! నీవు నాకు ప్రియమును చేయుటకై ఇష్టజనులను అందరిని విడచి అరణ్యమునకు పోవుచున్నావు. ఈ విధముగ అన్ని విధముల ఎవ్వరును చేయజాలని పనిని చేయుచున్నావు. ౮౫

మూ. న చైతన్మే ప్రియం పుత్ర శపే సత్యేన రాఘవ,
ఛన్నయా చలితస్త్వస్మి స్త్రియా భస్మాగ్నికల్పయా.

ప్ర. అ. పుత్ర = కుమారా! రాఘవ = రామా! ఏతత్ = ఇది, మే = నాకు, ప్రియమ్ = ఇష్టమైనది, న చ = కాదు. సత్యేన = సత్యముచే, శపే = ఒట్టు పెట్టుచున్నాను. భస్మాగ్నికల్పయా = కప్పబడిన అగ్నితో సమానురాలైన, ఛన్నయా = గూఢమైన అభిప్రాయము గల, స్త్రియా = స్త్రీచేత, చలితః = మోసగింపబడినవాడను, అస్మి = అయితిని.

తా. కుమారా! నీవు అరణ్యమునకు వెళ్ళుట నాకు ఏ మాత్రము ఇష్టము కాదు. సత్యముపై ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. గూఢమైన అభిప్రాయము కలదై బూడిద కప్పిన నిప్పువలె ఉన్న ఈ స్త్రీ నన్ను మోసగించినది. ౮౬

మూ. వఞ్చనా యా తు లబ్ధా మే తాం త్వం నిస్తర్తుమిచ్ఛసి;
అనయా వృత్తసాదిన్యా కైకేయ్యాఽభిప్రచోదితః. 87

ప్ర. అ. త్వమ్ = నీవు, వృత్తసాదిన్యా = మంచి నడవడికను చెరచు, అనయా = ఈ, కైకేయ్యా = కైకేయిచేత, అభిప్రచోదితః = ప్రేరేపింపబడిన

వాడవై, మే=నాయొక్క, యా వఞ్చనా = ఏ వంచన, లబ్ధా=పొందబడినదో, తామ్ = దానిని, నిస్తర్తుమ్ = దాటుటకు, ఇచ్ఛసి=కోరుచున్నావు.

తా. మంచి చరిత్రమును చెరచు ఈ కైకేయి ప్రేరేపింపగా, నీవు నన్ను ఈ వంచననుండి ఉద్ధరించుటకై ప్రయత్నించుచున్నావు. 37

మూ. న చైతదాశ్చర్యతమం యత్త్వం జ్యేష్ఠస్సుతో మమ,
అపానృతకథం పుత్ర పితరం కర్తుమిచ్ఛసి. 38

ప్ర. అ. పుత్ర=కుమారా, మమ=నాయొక్క, జ్యేష్ఠః సుతః = జ్యేష్ఠ కుమారుడ వైన నీవు, పితరమ్ = తండ్రిని, అపానృతకథమ్ = అసత్యవాక్యము లేనివానినిగా, కర్తుమ్ = చేయుటకు, ఇచ్ఛసి ఇతి యత్=ఇచ్ఛయించుచున్నావు అనునది ఏది కలదో, తత్ ఏతత్ = ఇది, ఆశ్చర్యతమమ్ = మిక్కిలి ఆశ్చర్యకరము, న = కాదు.

తా. కుమారా! నా జ్యేష్ఠపుత్రుడ వైన నీవు తండ్రినైన నా మాట అసత్యము కాకుండు నట్లు చేయుటలో ఆశ్చర్య మేమియు లేదు. 38

మూ. అథ రామస్తథా శ్రుత్వా పితురార్తస్య భాషితమ్,
లక్ష్మణేన సహ భ్రాత్రా దీనో వచనమబ్రవీత్. 39

ప్ర. అ. అథ=అటు పిమ్మట, రామః=రాముడు, తథా=అట్లు, ఆర్తస్య= దుఃఖితు డైన, పితుః=తండ్రియొక్క, భాషితమ్=మాటను, శ్రుత్వా= విని, భ్రాత్రా=సోదరు డైన, లక్ష్మణేన సహ=లక్ష్మణునితో కూడ, దీనః=దుఃఖితుడై, వచనమ్=వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఈ విధముగా దుఃఖించుచున్న తండ్రి మాటలు విని రామలక్ష్మణులు దుఃఖితు లైరి. రాము డిట్లు పలికెను. 39

మూ. ప్రాప్స్యామి యానద్య గుణాన్ కో మే శ్వస్తాన్ ప్రదాస్యతి,
అపక్రమణమేవాతః సర్వకామైరహం వృణే. 40

ప్ర. అ. అద్య=ఈనాడు, యాన్=ఏ, గుణాన్=భోగాదులను, ప్రాప్స్యామి= పొందగలనో, తాన్=వాటిని, శ్వః=రేపు, మే=నాకు, కః=ఎవడు, ప్రదాస్యతి=

ఇవ్వగలరు॥ అతః=అందువలన, సర్వకామైః=అన్నికోరికలచేతను, అపక్రమణ మేవ=వనమునకు వెళ్లుటనే. అహమ్=నేను, వృణే=కోరుచున్నాను.

తా. ఈనాడు నీవలన అన్ని భోగములను పొందినను రేపు వాటిని ఎవ్వరు ఇచ్చెదరు? అందుచే ఆ కామములను విడిచి వనమునకు వెళ్లుటయే మంచి దని కోరుచున్నాను. 40

మూ. ఇయం సరాష్ట్రా సజనా ధనధాన్యసమాకులా,
మయా విసృష్టా వసుధా భరతాయ ప్రదీయతామ్. 41

ప్ర. అ. మయా=నాచేత, విసృష్టా=విడువబడినది, సరాష్ట్రా=రాష్ట్రము లతో కూడినది, సజనా=జనులతో కూడినది, ధనధాన్యసమాకులా=ధనధాన్యము లతో నిండినది అయిన, ఇయం వసుధా = ఈ భూమి, భరతాయ = భరతునకు, ప్రదీయతామ్=ఇవ్వబడుగాక.

తా. అనేకమైన రాష్ట్రములు గలది, జనులతో నిండినది, ధనధాన్య సమృద్ధము అయిన, ఈ భూమిని, నేను విడిచిపెట్టుచున్నాను. దీనిని భరతునకు ఇమ్ము. 41

మూ. వనవాసకృతా బుద్ధిర్న చ మేఽద్య చలిష్యతి,
యస్తుష్టేన వరో దత్తః కైకేయ్యై వరద త్వయా. 42
దీయతాం నిఖిలేనైవ సత్యస్త్వం భవ పార్థివ.

ప్ర. అ. వనవాసకృతా=వనవాసమును గూర్చి చేయబడిన, మే బుద్ధిః= నా బుద్ధి, అద్య=ఇపుడు. న చలిష్యతి = చలింపదు. వరద = వరముల నిచ్చువాడా, పార్థివ=ఓ రాజా, తుష్టేన=సంతోషించిన, త్వయా=నీచేత, కైకేయ్యై=కైకేయికి, యః వరః=ఏ వరము, దత్తః=ఇవ్వబడినదో అది, నిఖిలేనైవ=పూర్తిగానే, దీయతామ్=ఇవ్వబడుగాక, త్వమ్=నీవు, సత్యః= సత్యవంతుడవు, భవ=అగుము.

తా. వనవాసమునకు వెళ్లవలెనను నా నిశ్చయము ఇపుడు మారదు. వరముల నివ్వగలిగిన ఓ మహారాజా! నీవు సంతోషించి కైకేయికి ఇచ్చిన వరమును పూర్తిగా ఇమ్ము. నీవు సత్యసంధుడవు అగుము.

మూ. అహం నిదేశం భవతో యథోక్తమనుపాలయన్, 43
చతుర్దశ సమా వత్స్యే వనే వనచరైః సహ.

ప్ర. అ. అహమ్ = నేను, యథోక్తమ్ = చెప్పిన విధముగా, భవతః = నీయొక్క, నిదేశమ్ = ఆజ్ఞను, అనుపాలయన్ = పరిపాలించుచు, చతుర్దశ = పదునాలుగు, సమాః = సంవత్సరములను, వనచరైః సహ = వనచరులతో కూడ, వనే = వనమునందు, వత్స్యే = నివసించగలను.

తా. నేను నీకు మాట ఇచ్చిన విధముగా నీ ఆజ్ఞను పరిపాలించుచు పదునాలుగు సంవత్సరములు వనచరులతో కలసి వనములో నివసించెదను. 43

మూ. మా విమర్శో వసుమతీ భరతాయ ప్రదీయతామ్, 44
న హి మే కాంక్షితం రాజ్యం సుఖమాత్మని వా ప్రియమ్,
యథా నిదేశం కర్తుం వై తవైవ రఘునన్దన। 45

ప్ర. అ. విమర్శః = ఆలోచన, మా = వద్దు. వసుమతీ = భూమి, భరతాయ = భరతునకు, ప్రదీయతామ్ = ఇవ్వబడుగాక. రఘునన్దన = ఓ మహారాజా! మే = నాకు, రాజ్యమ్ = రాజ్యముగాని, ఆత్మని = నాయందు (నాయొక్క), సుఖం వా = సుఖముగాని, కాంక్షితమ్ = కోరబడినది, న హి = కాదు. తవ = నీయొక్క, యథానిదేశమ్ = ఆజ్ఞానుసారముగా, కర్తుమ్ ఏవ = చేయుటకే, ప్రియం వై = నాకు ఇష్టము.

తా. ఇంక ఆలోచన ఏమియు వద్దు. రాజ్యమును భరతునకు ఇమ్ము. నాకు రాజ్యము కాని, సుఖము కాని, పొందవలెనను కోరిక లేదు. నీ ఆజ్ఞానుసారముగా చేయుటయే నాకు యిష్టము. 44-45

మూ. అపగచ్ఛతు తే దుఃఖం మా భూర్బాష్పపరిప్లుతః,
న హి క్షుభ్యతి దుర్ధర్షః సముద్రః సరితాం పతిః. 46

ప్ర. అ. తే = నీయొక్క, దుఃఖమ్ = దుఃఖము, అపగచ్ఛతు = తొలగుగాక। బాష్పపరిప్లుతః = కన్నీటితో నిండినవాడవు, మా భూః = కాకుము, సరితామ్ = నదులకు, పతిః = భర్త యైన, దుర్ధర్షః = ఎదురింపశక్యముగాని, సముద్రః = సముద్రము, న క్షుభ్యతి హి = క్షోభ చెందదుకదా!

తా. నీవు దుఃఖమును విడువుము. కన్నీళ్లు కార్చకుము. నదులకు భర్తయైన, ఎదురింప శక్యము గాని సముద్రము క్షోభ చెందునా! 46

మూ. న చాహం రాజ్య మిచ్ఛామి న సుఖం న చ మైథిలీమ్,
నైవ సర్వానిమాన్ కామాన్న స్వర్గం నైవ జీవితమ్.

ప్ర. అ. అహమ్ = నేను, రాజ్యమ్ = రాజ్యమును, నైవ ఇచ్ఛామి = కోరను. సుఖమ్ = సుఖమును, న = కోరను. మైథిలీం చ = సీతను కూడ, న = కోరను. సర్వాన్ = సమస్తమైన, ఇమాన్ = ఈ, కామాన్ = భోగములను, నైవ = కోరను. స్వర్గమ్ = స్వర్గమును, న = కోరను. జీవితమ్ = జీవితమును, నైవ = కోరను.

తా. నాకు ఈ రాజ్యమునందు కాని, సుఖమునందు కాని, సీతయందు కాని, ఈ సకల భోగములందు కాని, స్వర్గమునందు కాని జీవితమునందు కాని కోరిక లేదు. 47

మూ. త్వామహం సత్యమిచ్ఛామి నానృతం పురుషర్షభ,
ప్రత్యక్షం తవ సత్యేన సుకృతేన చ తే శపే. 48

ప్ర. అ. పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా! త్వామ్ = నిన్ను, సత్యమ్ = సత్యవంతునిగా, అహమ్ = నేను, ఇచ్ఛామి = కోరుచున్నాను. అనృతమ్ = అసత్యవంతునిగా, న = కోరుటలేదు. తవ = నీయొక్క, ప్రత్యక్షమ్ = ఎదుట, సత్యేన = సత్యముచేతను, సుకృతేన చ = పుణ్యముచేతను, తే = నీకు, శపే = ఒట్టు పెట్టి చెప్పుచున్నాను.

తా. ఓ పురుషశ్రేష్ఠా! నీవు సత్యము కాపాడవలె నని, అసత్యవంతుడవు కాకూడ దని నేను కోరుచున్నాను. నీ ఎదుటగా సత్యముపైనను, పుణ్యముపైనను, ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. 48

మూ. న చ శక్యం మయా తాత స్థాతుం క్షణమపి ప్రభో,
స శోకం ధారయస్వేమం న హి మేఽస్తి విపర్యయః.

ప్ర. అ. తాత = ఓ తండ్రీ, ప్రభో = ఓ ప్రభూ, మయా = నాచేత, క్షణమపి = క్షణకాలమైనను, స్థాతుమ్ = ఉండుటకు, న శక్యమ్ = శక్యము గాదు. సః =

అస్మి నీవు, ఏవమ్ = ఈ, శోకమ్ = శోకమును, ధారయస్వ = నిలుపుకొనుము. మే = నాకు, వివర్యయః = మార్పు, నాస్తి హి = లేదు కదా।

తా. మహారాజా! ఓ తండ్రీ! ఇంత ఒక్కటి కలదైనను, నేను ఇక్కడ ఉండజాలను. నీవు నీ దుఃఖమును అణచుకొనుము. నా నిర్ణయమునకు తిరుగు లేదు. 49

మూ. అర్థితో హ్యస్మి కైకేయ్యా వనం గచ్ఛేతి రాఘవ,
మయా చోక్తం వ్రజామీతి తత్సత్యమనుపాలయే. 50

ప్ర. అ. రాఘవ = ఓ దశరథమహారాజా! వనమ్ = వనమునుగూర్చి, గచ్ఛ = వెళ్లుము, ఇతి = అని, కైకేయ్యా = కైకేయిచేత, అర్థితః = కోరబడిన వాడను, అస్మి హి = అయి ఉన్నాను కదా. వ్రజామి ఇతి = వెళ్లెదను అని, మయా = నాచేత, ఉక్తం చ = చెప్పబడినది కూడ. తత్ = ఆ, సత్యమ్ = సత్యమును, అనుపాలయే = పాలించెదను.

తా., మహారాజా "నీవు వనమునకు వెళ్లుము" అని కైకేయి నన్ను కోరినది. నేను కూడ వెళ్ళెద నని అంగీకరించితిని. ఆ సత్యమును పాలించెదను.

మూ. మా చోత్కణ్ఠాం కృథా దేవ వనే రంస్యామహే వయమ్,
ప్రశాన్తహరిణాకీర్ణే నానాశకునినాదితే. 51

ప్ర. అ. దేవ = మహారాజా! ఉత్కణ్ఠామ్ = బెంగను, మా కృథాః = చేయకుము, వయమ్ = మేము, ప్రశాన్తహరిణాకీర్ణే = ప్రశాంత మైన లేళ్లతో వ్యాప్త మైన, నానాశకునినాదితే = అనేకవిధము లైన పక్షులచే ధ్వనింపచేయబడిన, వనే = వనమునందు, రంస్యామహే = క్రీడించెదము.

తా. మహారాజా! నీవు బెంగపెట్టుకొనకుము. మేము ముగ్గురము ప్రశాంత మైన లేళ్లతో నిండినదీ, అనేకవిధము లగు పక్షుల ధ్వనులతో కూడినదీ యైన వనములో, సుఖముగా విహరించెదము. 51

మూ. పితా హి దైవతం తాత దేవతానామపి స్మృతమ్,
తస్మాద్దైవతమిత్యేవ కరిష్యామి పితుర్వచః. 52

ప్ర. అ. తాత = ఓ తండ్రీ, దేవతానామపి = దేవతలకు కూడ, పితా = తండ్రియే, దైవతమ్ = దేవత అని, స్మృతం హి = చెప్పబడినది కదా। తస్మాత్ = ఆ కారణమువలన, దైవతమ్ ఇత్యేవ = దేవత యనియే, పితుః = తండ్రియొక్క, వచః = వచనమును, కరిష్యామి = చేసెదను.

తా. ఓ తండ్రీ! దేవతలకు కూడ తండ్రియే దేవత యని చెప్పబడినది కదా। అందువలన, తండ్రియే దేవత యను నిశ్చయముతో తండ్రి మాటను చేసెదను. 62

మూ. చతుర్దశసు వర్షేషు గతేషు నరసత్తమ,
పునర్ద్రక్ష్యసి మాం ప్రాప్తం సన్తాపోఽయం విముచ్యతామ్.

ప్ర. అ. నరసత్తమ = ఓ నరశ్రేష్ఠా, చతుర్దశసు = పదునాలుగు, వర్షేషు = సంవత్సరములు, గతేషు = గతించినవగుచుండగా, పునః = మరల, ప్రాప్తమ్ = వచ్చిన, మామ్ = నన్ను, ద్రక్ష్యసి = చూడగలవు. అయమ్ = ఈ, సంతాపః = దుఃఖము, విముచ్యతామ్ = విడువబడుగాక.

తా. నరులలో శ్రేష్ఠుడవైన ఓ తండ్రీ! పదునాలుగు వత్సరములు గడచిన పిమ్మట, నేను మరల వచ్చెదను. అప్పుడు నన్ను చూడగలవు. అందుచే ఈ దుఃఖమును విడువుము. 63

మూ. యేన సంస్తమ్భనీయోఽయం సర్వో బాష్పగళో జనః,
స త్వం పురుషశార్దూల కిమర్థం విక్రియాం గతః. 64

ప్ర. అ. పురుషశార్దూల = పురుషులలో శ్రేష్ఠుడవైన ఓ మహారాజా। బాష్పగళః = బాష్పము కంఠమునందు కల, సర్వః = సమస్తమైన, అయం జనః = ఈ జనము, యేన = ఏ నీచేత, సంస్తమ్భనీయః = ఓదార్చదగినదో, సః త్వమ్ = అట్టి నీవు, కిమర్థమ్ = ఎందుకు, విక్రియామ్ = వికారమును, గతః = పొందినావు.

తా. కంఠమునందు బాష్పమును అణచిపెట్టుకొనిన ఈ జనుల కందరికిని, నీవు ధైర్యము చెప్పవలసి యుండగా నీవే ఇట్లు వికారము పొందినా వేమి

మూ. పురం చ రాష్ట్రం చ మహీ చ కేవలా
మయా విసృష్టా భరతాయ దీయతామ్,

అహం నిదేశం భవతోఽనుపాలయన్
వనం గమిష్యామి చిరాయ సేవితుమ్. 55

ప్ర. అ. పురం చ = పట్టణము, రాష్ట్రం చ = రాష్ట్రము, మయా = నాచేత, నిసృష్టా = ఇవ్వబడిన, కేవలా మహీ చ = ఈ భూమి అంతయు, భరతాయ = భరతునకు, దీయతామ్ = ఇవ్వబడుగాక. అహమ్ = నేను, భవతః = మీయొక్క, నిదేశమ్ = ఆజ్ఞను, అనుపాలయన్ = పాలించుచు, వనమ్ = వనమును, చిరాయ = చిరకాలము, సేవితుమ్ = సేవించుటకు, గమిష్యామి = వెళ్లెదను.

తా. ఈ పట్టణమును, రాష్ట్రమును, భూమి నంతను కూడ, నేను ఇచ్చి వేయుచున్నాను. వీనిని భరతున కిమ్ము. నేను నీ ఆజ్ఞను పాలించుచు, వనములో చిరకాలము నివసించుటకై వెళ్ళెదను. 55.

మూ. మయా నిసృష్టాం భరతో మహీమిమాం
సశైలషణ్డాం సపురాం సకాననామ్,
శివాం సుసీమామనుశాస్తు కేవలం
త్వయా యదుక్తం నృపతే తథాస్తు తత్. 56

ప్ర. అ. నృపతే = ఓ రాజా! సశైలషణ్డామ్ = పర్వతసముదాయములతో కూడినదీ, సపురామ్ = పట్టణములతో కూడినదీ, సకాననామ్ = అడవులతో కూడినదీ, శివామ్ = మంగళకర మైనదీ, సుసీమామ్ = మంచి సరిహద్దులు కలదీ, మయా = నాచేత, నిసృష్టామ్ = ఇవ్వబడినదీ, అయిన, ఇమాం మహీమ్ = ఈ భూమిని, భరతః కేవలమ్ = భరతుడే, అనుశాస్తు = పాలించుగాక. త్వయా = నీచేత, యత్ = ఏది, ఉక్తమ్ = చెప్పబడినదో, తత్ = అది, తథా = అట్లు, అస్తు = అగుగాక.

తా. మహారాజా! అనేకపర్వతములతోను, నగరములతోను, అడవులతోను కూడిన, మంచి ఎల్లలు గల మంగళప్రద మైన, ఈ భూమిని నేను ఇచ్చివేయుచున్నాను. దీనిని భరతుడు మాత్రమే పాలించుగాక. నీవు చెప్పినట్లుగా జరుగు గాక. 56.

మూ. న మే తథా పార్థివ ధీయతే మనో
మహత్సు కామేషు న చాత్మనః ప్రియే,

యథా నిదేశే తవ శిష్టసమ్మతే
వ్యపైతు దుఃఖం తవ మత్కృతేఽనఘ. 57

ప్ర. అ. అనఘ = దోషములు లేని, పార్థివ = ఓ రాజా! మే మనః = నా మనస్సు, శిష్టసమ్మతే = శిష్టులకు సమ్మత మైన, తవ నిదేశే = నీ ఆజ్ఞ యందు, యథా = ఏ విధముగా, స్థితమ్ = నిలిచి యున్నదో, తథా = ఆ విధముగా, మహత్సు = గొప్ప, కామేషు = భోగములయందు, న = నిలువదు. ఆత్మనః = తనయొక్క. ప్రియే = ప్రియమునందు, న = నిలువదు. మత్కృతే = నా నిమిత్తమై. తవ = నీయొక్క, దుఃఖమ్ = దుఃఖము, వ్యపైతు = తొలగు గాక.

తా. దోషములు లేని ఓ మహారాజా! నా మనస్సు శిష్టులకు సమ్మత మైన నీ ఆజ్ఞపై ఎట్లు దృఢముగా నిలచియున్నదో, అంత దృఢముగా గొప్ప భోగములందు గాని, ఇతర ప్రియవస్తువులందు గాని నిలువదు. నాకొరకై నీవు దుఃఖింపకుము. 57

మూ. తదద్య నైవానఘ రాజ్యమవ్యయం
న సర్వకామాన్న సుఖం న మైథిలీమ్,
న జీవితం త్వామనృతేన యోజయన్
వృణీయ సత్యం వ్రతమస్తు తే తథా. 58

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా! తత్ = ఆ కారణమువలన, అద్య = ఇపుడు, త్వామ్ = నిన్ను, అనృతేన = అసత్యముతో, యోజయన్ = సంబంధము కలవానినిగా చేయుచు, అవ్యయమ్ = నాశనము లేని, రాజ్యమ్ = రాజ్యమును, నైవ వృణీయ = కోరనే కోరను, సర్వకామాన్ = సమస్తభోగము లను, న = కోరను, సుఖమ్ = సుఖమును, న = కోరను. మైథిలీమ్ = సీతను, న = కోరను. జీవితమ్ = జీవితమును, న = కోరను. తే = నీయొక్క, వ్రతమ్ = నియమము, తథా = అట్లు, సత్యమ్ = సత్యముగా, అస్తు = అగుగాక.

తా. పాపరహితుడ వైన ఓ మహారాజా! నీ సత్యవ్రతమునకు భంగము కల్గించి శాశ్వత మైన రాజ్యమును గాని, సమస్త భోగములను గాని, సుఖమును గాని, సీతను గాని, జీవితమును గాని, నేను కోరను. అందుచే నీ వ్రతము సత్య మగు గాక! 58

మూ. ఫలాని మూలాని చ భక్షయన్వనే
గిరీంశ్చ పశ్యన్ సరితస్సరాంసి చ,
వనం ప్రవిశ్యైవ విచిత్రపాదపం
సుఖీ భవిష్యామి తవాస్తు నిర్వృతిః. 59

ప్ర. అ. విచిత్రపాదపమ్=విచిత్ర మైన వృక్షములు గల, వనమ్=వనమును, ప్రవిశ్యైవ=ప్రవేశించి, ఫలాని=ఫలములను, మూలాని చ=దుంపలను, భక్షయన్=భక్షించుచు, వనే=వనమునందు, గిరీంశ్చ=పర్వతములను, సరితః=నదులను, సరాంసి చ=సరస్సులను, పశ్యన్=చూచుచు, సుఖీ=సుఖవంతుడను, భవిష్యామి=అగుదును. తవ=నీకు, నిర్వృతిః=సుఖము, అస్తు=అగుగాక.

తా. నేను విచిత్రము లైన వృక్షములతో నిండిన అరణ్యమునకు వెళ్లి, ఫలములు మూలములు తినుచు, పర్వతములు, నదులు, సరస్సులు, చూచుచు, అక్కడ సుఖముగా నుందగలను. నీకు సుఖము కలుగుగాక. 59

మూ. ఏవం స రాజా వ్యసనాభిపన్నః
శోకేన దుఃఖేన చ తామ్యమానః,
ఆలిఙ్గ్య పుత్రం సువినష్టసంజ్ఞో
మోహం గతో నైవ చిచేష్ట కించిత్. 60

ప్ర. అ. సః రాజా=ఆ రాజు, ఏవమ్=ఈ విధముగా, వ్యసనాభిపన్నః=దుఃఖముచే ఆక్రమింపబడినవాడై, శోకేన=మనోవ్యథ చేతను, దుఃఖేన చ=దుఃఖముచేతను, తామ్యమానః=బాధపడుచు, పుత్రమ్=కుమారుని, ఆలిఙ్గ్య=కౌగలించుకొని, సువినష్టసంజ్ఞః=పూర్తిగా నశించిన స్మృతికలవాడై, మోహం గతః=మూర్ఛపొందినవాడై, కించిత్=కొంచెము కూడ, నైవ చిచేష్ట=కదల లేదు.

తా. ఈ విధముగ వ్యసనముతో చిక్కుకొనిన ఆ దశరథమహారాజు, మనోవ్యథతోను, దుఃఖముతోను బాధపడుచు, కుమారుని కౌగలించుకొని పూర్తిగా స్మృతి తప్పి, మూర్ఛపోయి, చేష్టారహితు డయ్యెను. 60

మూ. దేవ్యస్తతః సంరురుదుః సమేతా
స్తాం వర్జయిత్వా నరదేవపత్నీమ్,
రుదన్ సుమన్త్రోఽపి జగామ మూర్ఛాం
హా హా కృతం తత్ర బభూవ సర్వమ్. 61

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుస్త్రింశః సర్గః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, తామ్ = ఆ, నరదేవపత్నీమ్=దశరథుని భార్య యైన కైకేయిని, వర్జయిత్వా=విడిచి, దేవ్యః=రాజభార్యలు, సమేతాః=కలిసినవారై, సంరురుదుః=ఏడ్చిరి. సుమన్త్రోఽపి=సుమంత్రుడు కూడ, రుదన్=ఏడ్చుచు, మూర్ఛామ్=మూర్ఛను, జగామ = పొందెను. తత్ర=అక్కడ, సర్వమ్=సమస్తము, హాహాకృతమ్=హాహాకారములు కలదిగా, బభూవ =ఆయెను.

తా. పిమ్మట కైకేయి తప్ప, మిగిలిన రాజభార్య లందరును, ఒక్క మాటుగా కలిసి, ఏడ్చిరి. సుమంత్రుడు కూడ ఏడ్చుచు మూర్ఛ పొందెను. ఆ ప్రదేశ మంతయు హాహాకారములతో నిండెను. 61

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పదినాల్గవ సర్గ సమాప్తము.

## అథ పంచత్రింశః సర్గః

[సుమంత్రుడు ఎంతగా ప్రతిమాలినను, నిందించినను కైక తన నిశ్చయమును మార్చుకొనకుండుట].

మూ. తతో నిర్ధూయ సహసా శిరో నిఃశ్వస్య చాసకృత్,
పాణౌ పాణిం వినిష్పిష్య దన్తాన్ కటకటాయ్య చ. 1
లోచనే కోపసంరక్తే వర్ణం పూర్వోచితం జహత్.
కోపాభిభూతః సహసా సంతాపమశుభం గతః. 2
మనః సమీక్షమాణశ్చ సూతో దశరథస్య సః,
కంపయన్నివ కైకేయ్యా హృదయం వాక్యశైశితైః 3
వాక్యవజ్రైరనుపమైర్నిర్భిన్దన్నివ చాశుగైః,
కైకేయ్యాః సర్వమర్మాణి సుమన్త్రః ప్రత్యభాషత. 4

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సూతః = సారథి యైన, సుమన్త్రః = సుమంత్రుడు, సహసా = శీఘ్రముగా, శిరః = శిరస్సును, నిర్ధూయ = కదల్చి, అసకృత్ = మాటిమాటికి, నిఃశ్వస్య = నిట్టూర్చి, పాణౌ = హస్తమునందు, పాణిమ్ = హస్తమును, వినిష్పిష్య = మర్దించి, దన్తాన్ = దంతములను, కటకటాయ్య చ = కటకటలాడించి, కోపసంరక్తే = కోపముచే ఎఱ్ఱబడిన, లోచనే = నేత్రమునందు, పూర్వోచితమ్ = పూర్వమునం దున్న, వర్ణమ్ = రంగును, జహత్ = విడచుచు, కోపాభిభూతః = కోపముచే తిరస్కరింపబడినవాడై, సహసా = హఠాత్తుగా, అశుభమ్ = అశుభ మైన, సంతాపమ్ = దుఃఖమును, గతః = పొందినవాడై, దశరథస్య = దశరథునియొక్క, మనః = మనస్సును, సమీక్షమాణశ్చ = చూచుచు, శితైః = వాడి యైన, వాక్యశైః = వాగ్బాణములచేత, కైకేయ్యాః = కైకేయియొక్క, హృదయమ్ = హృదయమును, కంపయన్నివ = కంపింపచేయుచున్నవాడు వలె, అనుపమైః = సాటిలేని, ఆశుగైః = శీఘ్రముగా

వెళ్లు, వాక్యవజ్రైః = వాక్యము లనెడు వజ్రములచేత, కైకేయ్యాః = కైకేయి యొక్క, సర్వమర్మాణి = అన్ని మర్మములను, భిందన్నివ = భేదించుచున్న వాడు వలె, ప్రత్యభాషత = పలికెను.

తా. అపుడు, సారథి యైన ఆ సుమంత్రుడు, వెంటనే లేచి తల కదల్చుచు, మాటి మాటికి నిట్టూర్చుచు, చేతిని చేతిలో వేసి మర్దించుచు, దంతములు పిండుకొనుచు, వెనుకటి రంగు మారి ఎఱ్ఱ నైన నేత్రములు కలవాడై, కోపావిష్టుడై, చాల దుఃఖించుచు, దశరథుని అభిప్రాయము కూడ తెలుసుకొనుచు, వాడి యైన మాట లనెడు బాణములతో కైకేయి హృదయమును కంపింపచేయుచున్నవాడు వలె, క్రమముగా వచ్చునదు సాటి లేని వాక్యవజ్రాయుధములచే కైకేయి మర్మస్థానము లన్నింటిని భేదించుచున్నవాడు వలె, ఇట్లు పలికెను. 1-4

మూ. యస్యాస్తవ పతిస్త్యక్తో రాజా దశరథః స్వయమ్,
భర్తా సర్వస్య జగతః స్థావరస్య చరస్య చ, 5
న హ్యకార్యతమం కించిత్ తవ దేవీహ విద్యతే.

ప్ర. అ. దేవి = ఓ కైకేయీ, యస్యాః తవ = ఏ నీయొక్క, పతిః = భర్తయు, స్థావరస్య = స్థావరము, చరస్య చ = జంగమము అయిన, సర్వస్య జగతః = సకలజగత్తునకు, భర్తా = ప్రభువు అయిన, రాజా దశరథః = దశరథమహారాజు, స్వయమ్ = స్వయముగా, త్యక్తః = విడువబడినాడో, తవ = అట్టి నీకు, ఇహ = ఈ లోకమునందు, అకార్యతమమ్ = ఏ మాత్రము చేయకూడనిది, కించిత్ = ఏదియు, న హి విద్యతే = లేదు కదా.

తా. ఓ కైకేయీ! స్థావరజంగమాత్మక మైన ఈ జగత్తు కంతటికిని ప్రభువూ, నీ భర్తా అయిన దశరథమహారాజునే నీవు స్వయముగా పరిత్యజించి నావు. అట్టి నీకు ఈ లోకములో చేయరాని పని యేదియు లేదు. 5

మూ. పతిఘ్నీం త్వామహం మన్యే కులఘ్నీమపి చాన్తతః,
యన్మహేంద్రమివాజయ్యం దుష్ప్రకంప్యమివాచలమ్,
మహోదధిమివాక్షోభ్యం సన్తాపయసి కర్మభిః. 7

ప్ర. అ. త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, పతిఘ్నీమ్ = భర్తను చంపిన దానిని గాను, అన్తతః = చివరికి, కులఘ్నీమపి చ = కులమునే నశింప చేసిన దానిని గాను, మన్యే = తలచుచున్నాను. యత్ = ఏ కారణమువలన, మహేంద్రమివ = మహేంద్రుడువలె, అజయ్యమ్ = జయింప శక్యముకానివాడు, అచలమివ = పర్వతము వలె, అప్రకమ్ప్యమ్ = కదల్పశక్యముగానివాడు, మహోదధిమివ = మహాసముద్రము వలె, అక్షోభ్యమ్ = క్షోభింప శక్యముగాని వాడూ అయిన, దశరథుని, కర్మభిః = పనులచే, సన్తాపయసి = దుఃఖపెట్టుచున్నావు.

తా. దశరథ మహారాజు, ఇంద్రుడు వలె జయింప శక్యముకానివాడు. పర్వతము వలె కదల్ప శక్యముగానివాడు, మహాసముద్రము వలె క్షోభింపచేయ శక్యముగాని వాడు. అట్టి దశరథుని ఈ విధముగా చెడ్డపనులచే బాధపెట్టుచున్న నీవు భర్తను చంపుచున్న దానవు; చివరకు కులమునే నశింపచేయుదానవు అని నేను భావించుచున్నాను. 7

మూ. మావమంస్థా దశరథం భర్తారం వరదం పతిమ్,
భర్తురిచ్ఛా హి నారీణాం పుత్రకోట్యా విశిష్యతే. 8

ప్ర. అ. భర్తారమ్ = పోషించువాడూ, వరదమ్ = వరముల నిచ్చువాడూ, పతిమ్ = నీ పతి యైన, దశరథమ్ = దశరథుని, మావమంస్థాః = అవమానించకుము. నారీణామ్ = స్త్రీలకు, భర్తుః = భర్తయొక్క, ఇచ్ఛా = కోరిక, పుత్రకోట్యాః = కోటి పుత్రులకంటె, విశిష్యతే = విశిష్టమైనది.

తా. నీకు వరముల నిచ్చుచు, పోషించుచున్న భర్త యైన దశరథుని అవమానించకుము. స్త్రీలకు భర్త కోరిక కోటిమంది పుత్రులకంటె అధికమైనది.

మూ. యథావయో హి రాజ్యాని ప్రాప్నువన్తి నృపక్షయే,
ఇక్ష్వాకుకులనాథేఽస్మింస్తల్లోపయితుమిచ్ఛసి. 9

ప్ర. అ. నృపక్షయే = రాజుమరణానంతరము, యథావయః = వయస్సు ననుసరించి, రాజ్యాని = రాజ్యములను, ప్రాప్నువన్తి హి = పొందుచుందురుకదా ! అస్మిన్ = ఈ, ఇక్ష్వాకుకులనాథే = ఇక్ష్వాకువంశప్రభు వైన రాముని విషయమున, తత్ = దానిని, లోపయితుమ్ = లోపింపచేయుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. రాజు మరణించిన నపుడు వయస్సు ననుసరించి రాజపుత్రుడు రాజ్యము పొందుచుండు. ఈ రాముని విషయమున ఆ పద్ధతిని మార్చవలె నని కోరుచున్నావు. 9

మూ. రాజా భవతు తే పుత్రో భరతశ్శాస్తు మేదినీమ్,
వయం తత్ర గమిష్యామో రామో యత్ర గమిష్యతి. 10

ప్ర. అ. తే పుత్రః = నీ కుమారు డైన, భరతః = భరతుడు, రాజా = రాజుగా, భవతు = అగుగాక. మేదినీమ్ = భూమిని, శాస్తు = పరిపాలించు గాక. రామః = రాముడు, యత్ర = ఎచటికి, గమిష్యతి = వెళ్ళునో, వయమ్ = మేము, తత్ర = అచటికి, గమిష్యామః = వెళ్ళెదము.

తా. నీ కుమారు డైన భరతుడు రాజై భూమిని పాలించుగాక. మే మంద రము కూడ రాముడు వెళ్ళిన చోటుకే వెళ్ళెదము. 10

మూ. న హి తే విషయే కశ్చిద్బ్రాహ్మణో వస్తుమర్హతి.
తాదృశం త్వమమర్యాదమద్య కర్మ చికీర్షసి. 11

ప్ర. అ. తే విషయే = నీ దేశమునందు, కశ్చిత్ బ్రాహ్మణః = ఏ బ్రాహ్మణుడును, వస్తుమ్ = నివసించుటకు, న అర్హతి హి = తగడు కదా! త్వమ్ = నీవు, అద్య = ఇపుడు, తాదృశమ్ = అట్టి, అమర్యాదమ్ = కట్టుబాట్లను అతిక్రమించిన, కర్మ = పనిని, చికీర్షసి = చేయదలచుచున్నావు.

తా. నీ విపుడు చేయదలచు చున్న మర్యాదావిరుద్ధ మైన పనిని బట్టి నీ దేశములో, బ్రాహ్మణు డైన వాడె వ్వడును నివసింపకూడదు. 11

మూ. నూనం సర్వే గమిష్యామో మార్గం రామనిషేవితమ్,
త్యక్తాయా బాన్ధవైః సర్వైర్బ్రాహ్మణైః సాధుభిః సహా,
కా ప్రీతీ రాజ్యలాభేన తవ దేవి భవిష్యతి.
తాదృశం త్వమమర్యాదం కర్మ కర్తుం చికీర్షసి. 13

ప్ర. అ. నూనమ్ = నిశ్చయముగా, సర్వే = మే మందరము, రామనిషే వితమ్ = రామునిచే సేవింపబడిన, మార్గమ్ = మార్గమును గూర్చి, గమిష్యామః = వెళ్ళగలము. దేవి = ఓ కైకేయీ, యా = ఏ నీవు, బాన్ధవైః = బంధువుల చేతను,

సర్వైః=సమస్త మైన, బ్రాహ్మణైః=బ్రాహ్మణులచేతను, సాధుభిః=సత్పురుషుల చేతను, సదా=ఎల్లప్పుడును, త్యక్తా=విడువబడితివో, తవ=అట్టి నీకు, రాజ్యలాభేన=రాజ్యలాభముచేత, కా=ఏమి, ప్రీతిః=ఆనందము, భవిష్యతి=కాగలదు? త్వమ్=నీవు, అమర్యాదమ్=మర్యాదను అతిక్రమించిన, తాదృశమ్=అట్టి, కర్మ=కర్మను, కర్తుమ్=చేయుటకు, చికీర్షసి=కోరుచున్నావు.

తా. మే మందరము తప్పక రాముడు ఏ మార్గమున పోవునో ఆ మార్గముననే వెళ్ళి పోయెదము. బంధువులచేతను, బ్రాహ్మణు లందరిచేతను, సత్పురుషుల చేతను విడువబడిన నీకు రాజ్యము లభించినను, ఏమి ఆనందము పొందగలవు? నీవు ఆ విధ మైన మర్యాదకు విరుద్ధ మైన పనిచేయుచున్నావు. 12-13

మూ. ఆశ్చర్యమివ పశ్యామి యస్యాస్తే వృత్తమీదృశమ్,
ఆచరన్త్యా న వివృతా సద్యో భవతి మేదినీ. 14

ప్ర. అ. యస్యాః=ఏ నీవు, ఈదృశం=అట్టి, వృత్తం=కార్యమును, ఆచరన్త్యాః=ఆచరించు చుండగా, తే=అట్టి నీకు, మేదినీ=భూమి, సద్యః=వెంటనే, వివృతా=చీల్చుకొన్న దై, న భవతి=అగుటలేదు. ఆశ్చర్యమివ=ఆశ్చర్యమును వలె, పశ్యామి=చూచుచున్నాను.

తా. నీవు ఈ విధముగా ప్రవర్తించుచుండగా, భూమి వెంటనే బ్రద్దలై నిన్ను తనలో కలుపుకొనుటలేదు. ఇది చూచుచుండగా నాకు ఆశ్చర్యము కలుగుచున్నది. 14

మూ. మహాబ్రహ్మర్షిసృష్టా వా జ్వలన్తో భీమదర్శనాః,
ధిగ్వాగ్దణ్డా న హింసన్తి రామప్రవ్రాజనే స్థితామ్. 15

ప్ర. అ. రామప్రవ్రాజనే=రాముని అడవికి పంపుటయందు, స్థితామ్=నిశ్చయించుకొని ఉన్న నిన్ను, మహాబ్రహ్మర్షిసృష్టాః=గొప్ప బ్రహ్మర్షులచేత ప్రయోగింపబడిన, జ్వలన్తః=ప్రజ్వలించుచున్న, భీమదర్శనాః=భయంకర మైన దర్శనముగల, ధిక్ వాగ్దణ్డాః, ధా='ఛీ' అను మాట అనెడు దండము లైనను, న హింసన్తి=హింసించుటలేదు.

తా. రాముని వనమునకు పంపవలె నని పట్టుపట్టుచున్న నిన్ను మహా బ్రహ్మర్షులు స్పృశించిన ప్రజ్వరించుచున్న, చూచుటకు భయంకరముగా నుండు, 'భీ' అను వాగ్దండములైనను దహించుటలేదు; ఇది ఆశ్చర్యముగా నున్నది.

మూ. ఆమ్రం ఛిత్త్వా కుఠారేణ నిమ్బం పరిచరేత్తు యః,
యశ్చైనం పయసా సిఞ్చేన్నైవాస్య మధురో భవేత్. 16

ప్ర. అ. యః=ఎవడు, ఆమ్రమ్=మామిడి చెట్టును, కుఠారేణ=గొడ్డలితో, ఛిత్త్వా=ఛేదించి, నిమ్బమ్=వేపచెట్టును, పరిచరేత్తు=సేవించునో, యశ్చ=ఎవడు, ఏనమ్=ఈ వేపచెట్టును, పయసా=పాలతో, సిఞ్చేత్=తడుపునో, అస్య=వానికి, మధురః=మధుర మైనది, నైవ భవేత్=కాదు.

తా. ఎవడైన మామిడి చెట్టును గొడ్డలితో నరికివేసి, వేపచెట్టుకు ఉపచారము చేసినను, దానిని పాలతో తడిపినను అది వాని విషయమున కూడ మధురముగా నుండదు. అనగా కౌసల్యాదులను కాదని దశరథుడు నిన్ను ఇంత ప్రేమగా చూచినా నీవు ఆతని విషయమున చాలా కటువుగానే ప్రవర్తించు చున్నావు అని భావము. 16

మూ. ఆభిజాత్యం హి తే మన్యే యథా మాతుస్తథైవ చ,
న హి నిమ్బాత్స్రవేత్క్షౌద్రం లోకే నిగదితం వచః. 17

ప్ర. అ. తే=నీయొక్క, ఆభిజాత్యమ్=పుట్టుకవలన వచ్చిన ధర్మము, మాతుః=నీ తల్లియొక్క స్వభావము, యథా=ఎట్లో, తథైవ చ=అట్లే నని, మన్యే=తలచెదను. నిమ్బాత్=వేపచెట్టునుండి, క్షౌద్రమ్=తేనె, న స్రవేత్ హి=స్రవించదు కదా। లోకే=లోకమునందు, వచః=ఈ వాక్యము, నిగదితమ్=చెప్పబడినది.

తా. జన్మతః వచ్చిన నీ స్వభావము నీ తల్లి స్వభావమువంటిదే నని అనుకొనుచున్నాను. "వేపచెట్టునుండి తేనె కారునా?" అని లోకములో ప్రసిద్ధమైన సామెత ఉండనే ఉన్నది. 17

మూ. తవ మాతురసద్గ్రాహం విద్మః పూర్వం యథాశ్రుతమ్,
పితుస్తే వరదః కశ్చిద్దదౌ వరమనుత్తమమ్. 18

సర్వభూతరుతం తస్మాత్సంజజ్ఞే వసుధాధిపః,
తేన తిర్యగ్గతానాం చ భూతానాం విదితం వచః. 19

ప్ర. అ. పూర్వమ్ = పూర్వము, యథాశ్రుతమ్ = వినబడిన నట్లుగా, తవ. మాతుః = నీ తల్లియొక్క, అసద్గ్రాహమ్ = చెడ్డ పట్టుదలను గూర్చి, విద్మః = మేము ఎరుగుదుము. కశ్చిత్ = ఒకానొక, వరదః = వరముల నిచ్చువాడు, తే. పితుః = నీ తండ్రికి, అనుత్తమమ్ = గొప్ప, వరమ్ = వరమును, దదౌ = ఇచ్చెను. తస్మాత్ = దానివలన, వసుధాధిపః = ఆ రాజు, సర్వభూతరుతమ్ = సమస్త ప్రాణుల ధ్వనిని, సంజజ్ఞే = అర్థము చేసికొనెను. తేన = అతనిచే, తిర్యగ్గతానామ్ = అడ్డముగా ప్రవర్తించు, భూతానామ్ = ప్రాణులయొక్క, వచః = వాక్యము, విదితమ్ = తెలియబడినది.

తా. నీ తల్లికి ఏ విధముగా చెడ్డ పట్టుదల ఉండెడిదో దానిని గూర్చి మేము పూర్వము విని యున్నాము. అందుచే మాకు తెలుసును. ఒక మహా పురుషుడు నీ తండ్రికి ఒక గొప్పవరమును ఇచ్చెను. దాని ప్రభావముచే, నీ తండ్రి సమస్తప్రాణుల ధ్వనులను, అర్థము చేసుకొనెడివాడు. తిర్యగ్జంతువులు మాటలాడు మాటలు కూడ అతనికి అర్థ మయ్యెడివి. 18.19

మూ. తతో జృమ్భస్య శయనే విరుతాద్భూరివర్చసా,
పితుస్తే విదితో భావః స తత్ర బహుధాఽహసత్. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శయనే = శయనసమీపమునందు, జృమ్భస్య = జృంభ మను ఒక విధ మైన చీమయొక్క, విరుతాత్ = మాటవలన, భావః = దాని అభిప్రాయము, భూరివర్చసః = గొప్ప తేజస్సు గల, తే పితుః = నీ తండ్రికి, విదితః = తెలిసినది. తత్ర = ఆ విషయమున, సః = అతడు, బహుధా = ఎక్కువగా, అహసత్ = నవ్వెను.

తా. ఒకనాడు నీ తండ్రి శయనము దగ్గర జృంభ మను ఒక చీమ మాటలాడగా దాని భావము, గొప్ప తేజస్సు గల నీ తండ్రికి తెలిసి, అతడు బిగ్గరగా నవ్వెను. 20

మూ. తత్ర తే జననీ క్రుద్ధా మృత్యుపాశమభీప్సతీ,
హాసం తే నృపతే సౌమ్య జిజ్ఞాసామీతి చాబ్రవీత్. 21

ప్ర. అ. తే జననీ = నీ తల్లి, మృత్యుపాశమ్ = మృత్యుపాశమును, అభీప్సతీ = కోరుచున్నదై, తత్ర = ఆ నవ్వువిషయమున, క్రుద్ధా = కోపించినదై, సౌమ్య = సౌమ్యుడ వైన, నృపతే = ఓ రాజా, తే = నీయొక్క, హాసమ్ = నవ్వును గూర్చి, జిజ్ఞాసామి = తెలుసుకొనదలంచుచున్నాను, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను.

తా. అపుడు నీ తల్లి అతడు తనను పరిహసించుచున్నాడని భావించి, కోపగించి, ప్రాణము పోయినను సరే అని తలచుచు, "సౌమ్యుడ వైన ఓ రాజా! నీ నవ్వునకు కారణ మేమో తెలుసుకొన దలచుచున్నాను." అని పలికెను. 21

మూ. నృపశ్చోవాచ తాం దేవీం దేవి శంసామి తే యది,
తతో మే మరణం సద్యో భవిష్యతి న సంశయః 22

ప్ర. అ. నృపశ్చ = ఆ రాజు, తాం దేవీమ్ = ఆ రాణిని గూర్చి, ఉవాచ = పలికెను. దేవి = ఓ రాణీ, తే = నీకు, శంసామి యది = చెప్పినట్లైతే, తతః = అటుపిమ్మట, సద్యః = వెంటనే, మే = నాకు, మరణమ్ = మరణము, భవిష్యతి = కలుగును. సంశయః = సంశయము, న = లేదు.

తా. అపు డా రాజు ఆమెతో 'ఓ రాణీ! నేను నీకు కారణము చెప్పినచో, వెంటనే నాకు నిస్సంశయముగా మరణము కలుగును' అని చెప్పెను. 22

మూ. మాతా తే పితరం దేవి తతః కేకయమబ్రవీత్,
శంస మే జీవ వా మా వా న మామపహసిష్యసి. 23

ప్ర. అ. దేవి = ఓ కైకేయీ! తతః = అటుపిమ్మట, తే మాతా = నీ తల్లి, పితరమ్ = నీ తండ్రియైన, కేకయమ్ = కేకయరాజును గూర్చి, అబ్రవీత్ = పలికెను. జీవ వా = బ్రతికిన బ్రతుకుము, మా వా = లేదా మరణింపుము. మే = నాకు, శంస = చెప్పుము. మామ్ = నన్ను, న అపహసిష్యసి = పరిహసింపకుము.

తా. అపుడు నీ తల్లి ఆ కేకయరాజుతో "నీవు జీవించిన జీవింపుము. లేదా మరణింపుము. ఏ మైనను నీ నవ్వునకు కారణము చెప్పి తీరవలయును. నన్ను ఈ విధముగా పరిహసించుటకు వీలులేదు" అని పలికెను. 23

మూ. ప్రియయా చ తథోక్తః సన్ కేకయః పృథివీపతిః,
తస్మై తం వరదాయార్థం కథయామాస తత్త్వతః. 24

ప్ర. అ. ప్రియయా=ప్రియురాలిచేత, తథా=ఆ విధముగా, ఉక్తః సన్= పలుకబడినవాడై, కేకయః పృథివీపతిః = కేకయమహారాజు, తస్మై = ఆ, వరదాయ = తనకు వరము నిచ్చినవానికి, తమ్ అర్థం = ఆ విషయమును, తత్త్వతః = యథార్థముగా, కథయామాస = చెప్పెను.

తా. ఆ కేకయమహారాజు భార్య మాటలు విని, వరము నిచ్చిన ఆ మహాపురుషునకు ఆ విషయము నంతయు జరిగినది జరిగి నట్లు చెప్పెను. 24

మూ. తతః స వరదః సాధు రాజానం ప్రత్యభాషత,
ప్రియతాం ధ్వంసతాం వేయం మా కృథాస్త్వం మహీపతే.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, వరదః = వరము నిచ్చిన, సః సాధుః = ఆ సత్పురుషుడు, రాజానమ్ = రాజును గూర్చి, ప్రత్యభాషత = బదులుచెప్పెను. మహీపతే = ఓ రాజా, ఇయమ్ = ఈమె, ప్రియతామ్ = మరణించిన మరణించు గాక. ధ్వంసతాం వా = నశించిన నశించు గాక; త్వమ్ = నీవు, మా కృథాః = అట్లు చేయకుము.

తా. వర మిచ్చిన ఆ మహాపురుషుడు, నీ తండ్రితో, "ఓ రాజా! ఈమె మరణించినను, నశించినను నీవు మాత్రము ఆ రహస్యమును చెప్పకుము'' అని పలికెను. 25

మూ. స తచ్ఛ్రుత్వా వచస్తస్య ప్రసన్నమనసో నృపః,
మాతరం తే నిరస్యాశు విజహార కుబేరవత్. 26

ప్ర. అ. సః నృపః = ఆ రాజు, ప్రసన్నమనసః = ప్రసన్నమైన మనస్సు గల, తస్య = అతనియొక్క, తత్ వచః = ఆ వాక్యమును, శ్రుత్వా = విని, ఆశు = వెంటనే, తే = నీయొక్క, మాతరమ్ = తల్లిని, నిరస్య = తిరస్కరించి, కుబేరవత్ = కుబేరుడు వలె, విజహార = సుఖముగా నుండెను.

తా. ప్రసన్నమైన మనస్సు గల ఆ మహాపురుషుని మాటలు విని, ఆ రాజు నీ తల్లిని తిరస్కరించి, కుబేరుడు వలె సుఖముగా నుండెను. 26

మూ. తథా త్వమపి రాజానం దుర్జనాచరితే పథి,
అసద్గ్రాహమిమం మోహాత్కురుషే పాపదర్శిని. 27

ప్ర. అ. పాపదర్శిని=పాపములనే చూచు ఓ కైకేయీ! త్వమపి=నీవు కూడ, తథా=ఆ విధముగనే, రాజానమ్=ఈ రాజును గూర్చి, దుర్జనాచరితే=దుర్జనులచే ఆచరింపబడిన, పథి=మార్గమునందు, మోహాత్=అజ్ఞానమువలన, ఇమమ్=ఈ, అసద్గ్రాహమ్=చెడ్డ పట్టుదలను, కురుషే=చేయుచున్నావు.

తా. పాపదృష్టి గల ఓ కైకేయీ! నీవు కూడ నీ తల్లి వలెనే దుర్జనులు అనుసరించు మార్గమున ప్రవర్తించుచు, అజ్ఞానముచే ఈ దశరథుని విషయమున ఈ విధముగ, చెడ్డ పట్టుదలను వహించియున్నావు. 27

మూ. సత్యశ్చాద్య ప్రవాదోఽయం లౌకికః ప్రతిభాతి మా,
పితౄన్ సమనుజాయన్తే నరా మాతరమఙ్గనాః. 28

ప్ర. అ. నరాః=పురుషులు, పితౄన్=తండ్రులను, అఙ్గనాః=స్త్రీలు, మాతరమ్=తల్లిని, సమనుజాయన్తే=అనుసరించి పుట్టుదురు అను, అయమ్=ఈ, లౌకికః=లోకప్రసిద్ధమైన, ప్రవాదః=మాట, సత్యః=నిజమైనదే యని, అద్య=ఇపుడు, మా=నన్ను గూర్చి (నాకు), ప్రతిభాతి=తోచుచున్నది.

తా. కొడుకులకు తండ్రి గుణములు, కూతుళ్లకు తల్లి గుణములు వచ్చునను లోకములో ప్రసిద్ధముగా నున్న మాట సత్యమే అని ఇపుడు నాకు తోచుచున్నది. 28

మూ. నైవం భవ గృహాణేదం యదాహ వసుధాధిపః,
భర్తురిచ్ఛాముపాస్స్వేహ జనస్యాస్య గతిర్భవ. 29

ప్ర. అ. ఏవమ్=ఈ విధముగా, న భవ=ఉండకుము. వసుధాధిపః=రాజు, యత్=ఏది, ఆహ=చెప్పుచున్నాడో, ఇదమ్=దానిని, గృహాణ=గ్రహింపుము. భర్తుః=భర్తయొక్క, ఇచ్ఛామ్=కోరికను, ఉపాస్స్వ=సేవింపుము. ఇహ=ఇచట, అస్య జనస్య=ఈ జనమునకు, గతిః=గతిగా, భవ=అగుము.

తా. నీవు ఈ విధముగా తల్లి పోలిక కలదానవు కాకుము. రాజు చెప్పినది అంగీకరించి అతని కోరిక ప్రకారము ప్రవర్తించి ఈ పౌరజానపదాదు లందరిని కాపాడుము. 29

మూ. మా త్వం ప్రోత్సాహితా పాపైర్దేవరాజసమప్రభమ్,
భర్తారం లోకభర్తారమసద్ధర్మముపాదధాః. 80

ప్ర. అ. త్వమ్ = నీవు, పాపైః = పాపాత్ములచేత, ప్రోత్సాహితా = ప్రోత్సహింపబడినదానవై, దేవరాజసమప్రభమ్ = దేవేంద్రునితో సమాన మైన కాంతి కలవాడు, లోకభర్తారమ్ = ఈ లోకమునకు ప్రభువు ఐన, భర్తారమ్ = నీ భర్తను, అసద్ధర్మమ్ = చెడ్డ ధర్మమును, మా ఉపాదధాః = పొందింపకుము.

తా. నీవు పాపాత్ములు చెప్పు మాటలు విని, దేవేంద్రునితో సమాన మైన ప్రభావము కలవాడూ, ఈలోకమునకు ప్రభువూ అయిన, నీ భర్తకు అధర్మము సంక్రమించు నట్లు చేయకుము. 80

మూ. న హి మిథ్యా ప్రతిజ్ఞాతం కరిష్యతి తవానఘః,
శ్రీమానదశరథో రాజా దేవి రాజీవలోచనః. 81

ప్ర. అ. దేవి = ఓ కైకేయీ। అనఘః = దోషములు లేనివాడూ, శ్రీమాన్ = శ్రీమంతుడూ, రాజీవలోచనః = పద్మముల వంటి నేత్రములు కలవాడూ, రాజా = రాజు అయిన, దశరథః = దశరథుడు, తవ = నీకు, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞచేయబడినదానిని, మిథ్యా = అసత్యముగా, న కరిష్యతి హి = చేయడు కదా.

తా. దోషములు లేనివాడూ, శ్రీమంతుడూ, కమలనేత్రుడూ అయిన దశరథమహారాజు, నీ కిచ్చిన మాటను అసత్యము చేయజాలడు. అందుచే నీవే నీ అభిప్రాయమును మార్చుకొనవలెను. 81

మూ. జ్యేష్ఠో వదాన్యః కర్మణ్యః స్వధర్మపరిరక్షితా,
రక్షితా జీవలోకస్య బలీ రామోఽభిషిచ్యతామ్. 82

ప్ర. అ. జ్యేష్ఠః = పెద్దవాడూ, వదాన్యః = ఔదార్యవంతుడూ, కర్మణ్యః = పనులు చేయుటలో సమర్థుడూ, స్వధర్మపరిరక్షితా = తన ధర్మమును రక్షించువాడూ, జీవలోకస్య = ప్రాణుల సముదాయమునకు, రక్షితా = రక్షకుడూ, బలీ = బలవంతుడూ అయిన, రామః = రాముడు, అభిషిచ్యతామ్ = అభిషేకింపబడు గాక.

తా. రాముడు అన్నదమ్ములలో శ్రేష్ఠుడు. ఉదారస్వభావుడు. కార్యము లను నిర్వహించుటలో సమర్థుడు. స్వధర్మమును కాపాడుకొనువాడు. ప్రాణు లందరిని రక్షించువాడు. మహాబలశాలి. అట్టి రామునకు రాజ్యాభిషేకము జరుగ నట్లు చూడుము. 32

మూ. పరివాదో హి తే దేవి మహాన్లోకే చరిష్యతి,
యది రామో వనం యాతి విహాయ పితరం నృపమ్. 33

ప్ర. అ. దేవి=ఓ కైకేయీ। రామః=రాముడు, నృపమ్=రాజైన, పితరమ్=తండ్రిని, విహాయ=విడచి, వనమ్=వనమును గూర్చి, యాతి యది=వెళ్ళిన దైతే, లోకే=లోకమునందు, తే=నీకు, మహాన్=గొప్ప, పరివాదః= అపవాదము, చరిష్యతి హి=వ్యాపించును కదా.

తా. ఓ కైకేయీ, రాముడు తండ్రి యైన దశరథమహారాజును విడచి అడవికి వెళ్ళినచో, లోకములో నీ విషయమున గొప్ప అపవాదము వ్యాపించును.

మూ. స రాజ్యం రాఘవః పాతు భవ త్వం విగతజ్వరా,
న హి తే రాఘవాదన్యః క్షమః పురవరే వసేత్. 34

ప్ర. అ. సః రాఘవః=అట్టి రాముడు, రాజ్యమ్=రాజ్యమును, పాతు= రక్షించుగాక. త్వమ్=నీవు, విగతజ్వరా = తొలగిన మనోవ్యథ కలదానవు, భవ=అగుము. రాఘవాత్=రామునికంటె, అన్యః = ఇతరు డైన, క్షమః= సమర్థుడు, తే=నీయొక్క, పురవరే=శ్రేష్ఠ మైన ఈ పురమునందు, న వసేత్ హి=ఉండడు కదా!

తా. అందుచే రాముడే రాజ్యమును పాలించుగాక। నీ మనస్సులోని సంతాపమును విడువుము. నీ రాజ్యమును పరిపాలించుటకు సమర్థుడు రాముడు తప్ప వేరెవ్వరును ఈ అయోధ్యలో లేడు. 34

మూ. రామే హి యౌవరాజ్యస్థే రాజా దశరథో వనమ్,
ప్రవేక్ష్యతి మహేష్వాసః పూర్వవృత్తమనుస్మరన్. 35

ప్ర. అ. రామే=రాముడు, యౌవరాజ్యస్థే=యౌవరాజ్యమునం దుండగా. మహేష్వాసః=గొప్ప ధనస్సు గల, రాజా=రాజైన, దశరథః = దశరథుడు,

పూర్వవృత్తమ్=తన వంశములోని పూర్వపురుషుల ఆచారమును, అనుస్మరన్= స్మరించుచు, వనమ్=వనమును, ప్రవేక్ష్యతి=ప్రవేశింపగలడు.

తా. రామునకు యౌవరాజ్యాభిషేకము చేసిన పిమ్మట, మహాబలశాలియైన దశరథమహారాజు తన పూర్వపురుషుల ఆచారమును పాటించుచు, తపస్సుకై అడవికి వెళ్ళును. 35

మూ. ఇతి సాన్త్వైశ్చ తీక్ష్ణైశ్చ కైకేయీం రాజసంసది,
సుమన్త్రః క్షోభయామాస భూయ ఏవ కృతాఞ్జలిః. 36

ప్ర. అ. ఇతి=ఈ విధముగా, సుమన్త్రః=సుమంత్రుడు, సాన్త్వైః=మంచి మాటలచేతను, తీక్ష్ణైః=తీవ్ర మైన మాటలచేతను, రాజసంసది=రాజ సభయందు, కైకేయీమ్=కైకేయిని, క్షోభయామాస=కలత చెందు నట్లు చేసెను. భూయ ఏవ=మరల, కృతాఞ్జలిః=కట్టబడిన దోసిలికలవాడై నిలచెను.

తా. సుమంత్రు డీ విధముగా, దశరథుని సమక్షమున మంచి మాటలు, తీవ్రమైన మాటలు చెప్పి కైకేయి కలతచెందు నట్లు చేసి, మరల నమస్కరించుచు నిలచెను. 36

మూ. నైవ సా క్షుభ్యతే దేవీ న చ స్మ పరిదూయతే,
న చాస్యా ముఖవర్ణస్య విక్రియా లక్ష్యతే తదా. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పంచత్రింశస్సర్గః.

ప్ర. అ. సా దేవీ=ఆ కైకేయి, నైవ క్షుభ్యతే=ఏ మాత్రము కలత చెంద లేదు. న చ పరిదూయతే స్మ=మనస్సులో బాధపడలేదు. తదా=అపుడు, అస్యాః=ఈమెయొక్క, ముఖవర్ణస్య=ముఖమునందలి వర్ణముయొక్క, విక్రియా చ=వికారము కూడ, న లక్ష్యతే=కానరాలేదు.

తా. సుమంత్రు డిన్ని చెప్పినను, ఆ కైకేయి ఏ మాత్రము కలత చెంద లేదు. ఆమె మనస్సులో ఏ మాత్రము బాధ కలుగలేదు. ఆమె ముఖవర్ణములో కూడ మార్పు కనబడలేదు. ౩౭

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పదియైదవ సర్గ సమాప్తము.

# అథ షట్త్రింశః సర్గః

[దశరథమహారాజు శ్రీరామునితో సేనను, ధనమును పంపుట కాదేశించుట, కైకేయి అందులకు వ్యతిరేకించుట, సిద్ధార్థుడు కైకను నయనయించుట, రాజు రామునితో తాను అడవికి పోవలయునను కోరికను వెల్లడించుట].

మూ. తతః సుమన్త్రమైక్ష్వాకః పీడితోఽత్ర ప్రతిజ్ఞయా,
సబాష్పమతినిఃశ్వస్య జగాదేదం పునః పునః. 1

ప్ర. అ. తతః=పిమ్మట, అత్ర=ఈ విషయమున, ప్రతిజ్ఞయా=ప్రతిజ్ఞ చేత, పీడితః = పీడితు డైన, ఐక్ష్వాకః = దశరథుడు, సబాష్పం=బాష్పముతో కూడునట్లుగా, అతినిఃశ్వస్య = ఎక్కువగా నిట్టూర్చి, సుమన్త్రమ్=సుమంత్రుని గూర్చి, పునః పునః = మాటిమాటికి, ఇదమ్ = ఈ వాక్యమును, జగాద = పలికెను.

తా. వరముల నిచ్చెదను అని ప్రతిజ్ఞ చేసి ఉండుట చేత పీడింపబడిన ఆ దశరథుడు బాష్పము (ఆవిరి) వచ్చునట్లు ఎక్కువగా నిట్టూర్చుచు సుమంత్రునితో మాటి మాటికి ఈ విధముగా చెప్పెను. 1

మూ. సూత రత్నసుసంపూర్ణా చతుర్విధబలా చమూః,
రాఘవస్యానుయాత్రార్థం క్షిప్రం ప్రతివిధీయతామ్. 2

ప్ర. అ. సూత = ఓ సుమంత్రా, రాఘవస్య = రాముని యొక్క, అనుయాత్రార్థమ్=అనుసరించి ప్రయాణము చేయుటకై, రత్నసుసంపూర్ణా = రత్నములతో నిండిన, చతుర్విధబలా=నాలుగు విధము లైన బలములు గల, చమూః = సేన, క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రతివిధీయతామ్ = ఏర్పరుపబడుగాక.

తా. సుమంత్రా! రాముని వెనుకనే అరణ్యమునకు వెళ్లుటకు రత్నములతో నిండిన చతుర్విధబలములు గల సైన్యమును వెంటనే ఏర్పరుపుము. ౨

మూ. రూపాజీవాశ్చ వాదిన్యో వణిజశ్చ మహాధనాః,
శోభయన్తు కుమారస్య వాహినీం సుప్రసారితాః. ౩

ప్ర. అ. వాదిన్యః=సంగీతాది ధ్వనులు చేయుచున్న, రూపాజీవాశ్చ=వేశ్యలు, మహాధనాః=గొప్ప ధనము గల, వణిజశ్చ=వర్తకులు, సుప్రసారితాః=బాగుగ ప్రసరింపచేయబడినవారై, కుమారస్య=కుమారునియొక్క, వాహినీమ్=సేనను, శోభయన్తు=శోభింపచేయుదురు గాక.

తా. సంగీతాదిధ్వనులు చేయు వేశ్యలు, గొప్ప ధనము గల వర్తకులు, సైన్యమునందంతటను, వ్యాపించి, దానిని శోభింపచేయుదురు గాక. ౩

మూ. యే చైనముపజీవన్తి రమతే యైశ్చ వీర్యతః,
తేషాం బహుధనం దత్త్వా తానప్యత్ర నియోజయ. ౪

ప్ర. అ. యే చ=ఎవరు, ఏనమ్=ఈ రాముని, ఉపజీవన్తి=ఆశ్రయించి జీవించుచుందురో, వీర్యతః=పరాక్రమమువలన, యైశ్చ=ఎవరితో, రమతే=రాముడు క్రీడించుచుండునో, తేషామ్=వారికి, బహుధనమ్=అధికధనమును, దత్త్వా=ఇచ్చి, తానపి=వారిని కూడ, అత్ర=ఈ సైన్యమునందు, నియోజయ=కూర్పుము.

తా. రామునిపై ఆధారపడి జీవించువారికిని, బలప్రదర్శనాదులందే రాముడు ఎవ్వరితో క్రీడించుచుండునో అట్టివారికిని, అధికమైన ధనమును ఇచ్చి, వారిని కూడ ఈ సేనతో రాముని వెంట పంపుము. ౪

మూ. ఆయుధాని చ ముఖ్యాని నాగరాః శకటాని చ,
అనుగచ్ఛన్తు కాకుత్స్థం వ్యాధాశ్చారణ్యగోచరాః. ౫

ప్ర. అ. ముఖ్యాని=ముఖ్యమైన, ఆయుధాని చ=ఆయుధములు, నాగరాః=పౌరులు, శకటాని చ=బండ్లు, అరణ్యగోచరాః=అరణ్యములో నివసించు, వ్యాధాశ్చ=బోయవారు, కాకుత్స్థమ్=రాముని, అనుగచ్ఛన్తు=అనుసరించి వెళ్లుదురుగాక.

తా. శ్రేష్ఠ మైన ఆయుధములు, బోరులు, శకటములు, అరణ్యములో నివసించు బోయవారు రాముని వెంట వెళ్ళెదరు గాక! 5

మూ. నిఘ్నన్ మృగాన్ కుఞ్జరాంశ్చ పిబంశ్చారణ్యకం మధు,
నదీశ్చ వివిధాః పశ్యన్ న రాజ్యస్య స్మరిష్యతి. 6

తా. మృగాన్ = మృగములను, కుఞ్జరాంశ్చ = ఏనుగులను, నిఘ్నన్ = చంపుచు, అరణ్యకమ్ = అరణ్యసంబంధ మైన, మధు = తేనెను, పిబంశ్చ = త్రాగుచు, వివిధాః = అనేక విధము లైన, నదీశ్చ = నదులను కూడ, పశ్యన్ = చూచుచు, రాజ్యస్య = రాజ్యమునకు (రాజ్యమును), న స్మరిష్యతి = స్మరించడు.

తా. రాముడు అరణ్యములో మృగములను, ఏనుగులను వేటాడుచు, అక్కడ లభించు తేనెను త్రాగుచు అనేకవిధము లైన నదులను చూచుచు, సుఖముగా నుండి రాజ్యమును గూర్చి స్మరించడు. 6

మూ. ధాన్యకోశశ్చ యః కశ్చిద్ధనకోశశ్చ మామకః,
తౌ రామమనుగచ్ఛేతాం వసన్తం నిర్జనే వనే. 7

ప్ర. అ. యః = యే, మామకః = నా సంబంధ మైన, ధాన్యకోశః చ = ధాన్యములకోశము, ధనకోశః చ = ధనకోశము ఉన్నవో, తౌ = అవి, నిర్జనే = జనులు లేని, వనే = వనమునందు, వసన్తం = నివసించుచున్న, రామమ్ = రాముని, అనుగచ్ఛేతామ్ = అనుసరించుగాక!

తా. నిర్జనవనములో నివసించు, రాముని వెంట నా ధాన్యకోశమును, ధనకోశమును కూడ పంపుము. 7

మూ. యజన్ పుణ్యేషు దేశేషు విసృజంశ్చాప్తదక్షిణాః,
ఋషిభిశ్చ సమాగమ్య ప్రవత్స్యతి సుఖం వనే. 8

ప్ర. అ. పుణ్యేషు = పుణ్య మైన, దేశేషు = ప్రదేశము లయందు, యజన్ = యాగము చేయుచు, ఆప్తదక్షిణాః = తగిన దక్షిణలను, విసృజంశ్చ =

ఇచ్చుచు, ఋషిభిః=ఋషులతో, సమాగమ్య=కలసి, వనే=వనమునందు, సుఖమ్=సుఖముగా, ప్రవత్స్యతి=ప్రవాస ముండగలడు.

తా. పుణ్యక్షేత్రములందు, యాగములు చేయుచు, తగిన దక్షిణలను ఇచ్చుచు, రాముడు ఋషులతో కలసి వనములో సుఖముగా ప్రవాసకాలము గడుపగలడు. 8

మూ. భరతశ్చ మహాబాహురయోధ్యాం పాలయిష్యతి,
సర్వకామైః సహ శ్రీమాన్ రామః సంసాధ్యతామితి. 9

ప్ర. అ. మహాబాహుః=గొప్ప బాహువులు గల, భరతశ్చ=భరతుడు, అయోధ్యామ్=అయోధ్యను, పాలయిష్యతి=పరిపాలింపగలడు. శ్రీమాన్=శోభాయుక్తుడైన, రామః=రాముడు, సర్వకామైః సహ=సమస్తమైన భోగ్యపదార్థములతో కూడ, సంసాధ్యతామ్=పంపబడుగాక, ఇతి=అని పలికెను.

తా. ఆజానుబాహువైన భరతుడు అయోధ్యను పాలించగలడు. శ్రీమంతుడైన రామునకు సమస్తమైన భోగ్యవస్తువులను ఇచ్చి పంపుము. 9

మూ. ఏవం బ్రువతి కాకుత్స్థే కైకేయ్యా భయమాగతమ్,
ముఖం చాప్యగమచ్ఛోషం స్వరశ్చాపి న్యరుధ్యత. 10

ప్ర. అ. కాకుత్స్థే=దశరథుడు, ఏవమ్=ఇట్లు, బ్రువతి=చెప్పుచుండగా, కైకేయ్యాః=కైకేయికి, భయమ్=భయము, ఆగతమ్=వచ్చినది. ముఖం చాపి=ముఖముకూడ, శోషమ్=ఎండిపోవుటను, అగమత్=పొందెను. స్వరశ్చాపి=స్వరము కూడ, న్యరుధ్యత=నిరోధింపబడెను.

తా. దశరథు డిట్లు చెప్పుచుండగా, కైకేయికి భయము కలిగెను. ఆమె ముఖము వాడిపోయెను. కంఠస్వరము కూడ దుర్బలమయ్యెను. 10

మూ. సా విషణ్ణా చ సంత్రస్తా ముఖేన పరిశుష్యతా,
రాజానమేవాభిముఖీ కైకేయీ వాక్యమబ్రవీత్. 11

ప్ర. అ. సా కైకేయీ=ఆ కైకేయి, విషణ్ణా చ=దుఃఖించుచున్నదై, సంత్రస్తా=భయపడినదై, పరిశుష్యతా=ఎండిపోవుచున్న, ముఖేన=ముఖముతో,

రాజానమేవ=రాజునే గూర్చి, అభిముఖీ=ఎదురైన ముఖము గలదై, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. అపు డా కైకేయి, దిగులుపడి, భయపడుచున్నదై, వాడిపోయిన ముఖముతో రాజును చూచుచు, ఇట్లు పలికెను. 11

మూ. రాజ్యం గతజనం సాధో పీతమణ్డాం సురామివ,
నిరాస్వాద్యతమం శూన్యం భరతో నాభిపత్స్యతే. 12

ప్ర. అ. సాధో=ఓ సత్పురుషుడా! గతజనమ్=పోయిన జనములు కలది, శూన్యమ్=శూన్యమూ, నిరాస్వాద్యతమమ్=అనుభవించుటకు శక్యము గానిది అయిన, రాజ్యమ్=రాజ్యమును, పీతమణ్డామ్=త్రాగివేయబడిన సారముగల, సురామ్ ఇవ=మద్యమును వలె, భరతః=భరతుడు, నాభిపత్స్యతే=పొందడు.

తా. సత్పురుషుడ వైన ఓ రాజా! జను లందరు వెళ్ళిపోయి, శూన్య మై, అనుభవించుటకు ఏమియు మిగలని ఈ రాజ్యము, సారమును ఇతరులు త్రాగి వేసిన మద్యము వలె, భరతునకు అక్కరలేదు. 12

మూ. కైకేయ్యాం ముక్తలజ్జాయాం వదన్త్యామతిదారుణమ్,
రాజా దశరథో వాక్యమువాచాయతలోచనామ్. 13

ప్ర. అ. కైకేయ్యామ్=కైకేయి, ముక్తలజ్జాయామ్=విడువబడిన సిగ్గు కలదై అతిదారుణమ్=మిక్కిలి దారుణముగా, వదన్త్యామ్=పలుకుచుండగా, రాజా=రాజైన, దశరథః=దశరథుడు, ఆయతలోచనామ్=విశాల మైన నేత్రములు గల ఆమెను గూర్చి, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. కైకేయి సిగ్గు విడచి అతిదారుణముగ పలికిన మాటలు విని దశరథ మహారాజు ఆమెతో ఇట్లు పలికెను. 13

మూ. వహన్తం కిం తుదసి మాం నియుజ్య ధురి మాఽహితే,
అనార్యే కృత్యమారబ్ధం కిం న పూర్వముపారుధః. 14

ప్ర. అ. అహితే = శత్రువైనదానా, మా = నన్ను, ధురి = కాడియందు, నియుజ్య = కట్టి, వహన్తమ్ = లాగుచున్న, మామ్ = నన్ను, కిమ్ = ఎందుకు, తుదసి = పొడుచుచున్నావు. అనార్యే = ఓ చెడ్డదానా, ఆరబ్ధమ్ = ప్రారంభింపబడిన, కృత్యమ్ = పనిని, పూర్వమ్ = ముందుగనే, కిమ్ = ఎందుకు, న ఉపారుధః = అడ్డు పెట్టలేదు.

తా. శత్రువైన కైకేయీ! నన్ను కాడికి కట్టినావు. నేను లాగుచుండగనే ఇంకను నన్ను పొడుచుచున్నావేమి? ఓ అనార్యురాలా! నేను ప్రారంభించిన (రామునితో సైన్యాదులను పంపుట అను) పనిని ముందుగనే నీవు ఎందుకు అడ్డుకొనలేదు? 14

మూ. తస్యైతత్క్రోధసంయుక్తముక్తం శ్రుత్వా వరాఙ్గనా,
కైకేయీ ద్విగుణం క్రుద్ధా రాజానమిదమబ్రవీత్. 15

ప్ర. అ. వరాఙ్గనా = శ్రేష్ఠమైన స్త్రీయైన, కైకేయీ = కైకేయి, క్రోధసంయుక్తమ్ = కోపముతో కూడిన, తస్య = ఆ దశరథునియొక్క, ఉక్తమ్ = పలుకబడిన, ఏతత్ = ఈ మాటను, శ్రుత్వా = విని, ద్విగుణమ్ = రెండురెట్లు, క్రుద్ధా = కోపగించినదై, రాజానమ్ = రాజును గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాజు కోపముతో పలికిన ఆ మాటలు విని, ఆ కైకేయి రెట్టింపు కోపముతో రాజుతో ఇట్లనెను. 15

మూ. తవైవ వంశే సగరో జ్యేష్ఠపుత్రముపారుధత్,
అసమఞ్జ ఇతి ఖ్యాతం తథాయం గన్తుమర్హతి. 16

ప్ర. అ. తవ = నీయొక్క, వంశే ఏవ = వంశమునందే, సగరః = సగరుడు, అసమఞ్జః ఇతి = అసమంజుడు అని, ఖ్యాతమ్ = ప్రసిద్ధుడైన, జ్యేష్ఠపుత్రమ్ = పెద్ద కుమారుని, ఉపారుధత్ = రాజ్యమునకు రాకుండగ అడ్డగించెను. అయమ్ = ఈ రాముడు కూడ, తథా = అట్లే, గన్తుమ్ = వెళ్లుటకు, అర్హతి = తగియున్నాడు.

తా. నీ వంశమునందే, సగరుడనే రాజు అసమంజుడనే తన పుత్రునికి రాజ్యము లేకుండా అడ్డగించి, అతనిని వెడలగొట్టెను. ఈ రాముడు కూడ అట్లే వెళ్లవలెను. 16

మూ. ఏవముక్తో ధిగిత్యేవ రాజా దశరథోఽబ్రవీత్,
వ్రీడితశ్చ జనః సర్వః సా చ తం నావబుధ్యత. 17

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఉక్తః = పలుకబడిన, రాజా = రాజైన, దశరథః = దశరథుడు, ధిక్ ఇత్యేవ = "ఛీ"యని మాత్రమే, అబ్రవీత్ = పలికెను. సర్వః = సమస్తమైన, జనః = జనము, వ్రీడితః = సిగ్గువడెను. సా చ = ఆ కైకేయి, తమ్ = దానిని, నావబుధ్యత = తెలుసుకొనలేదు.

తా. కైకేయి మాటలు విని, దశరథుడు "ఛీ, ఎంత మాట అంటివి" అని మాత్రమే పలికెను. అక్కడ ఉన్న వారందరు సిగ్గుపడిరి. ఇంతైనను, కైకేయి ఏమియు లెక్కచేయలేదు. 17

మూ. తత్ర వృద్ధో మహామాత్రః సిద్ధార్థో నామ నామతః,
శుచిర్బహుమతో రాజ్ఞః కైకేయీ మిదమబ్రవీత్. 18

ప్ర. అ. తత్ర = అక్కడ ఉన్న, వృద్ధః = ముసలివాడు, నామతః = పేరుచే, సిద్ధార్థో నామ = సిద్ధార్థుడని ప్రసిద్ధమైనవాడు, శుచిః = పరిశుద్ధమైన స్వభావము కలవాడు, రాజ్ఞః = రాజునకు, బహుమతః = ఇష్టుడు అయిన, మహామాత్రః = మంత్రి, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ మాటలు విని, వృద్ధుడు, మంచి స్వభావము కలవాడు, రాజునకు అభిమానపాత్రుడు, అయిన అక్కడే ఉన్న సిద్ధార్థుడనే మంత్రి కైకేయితో ఇట్లు పలికెను. 18

మూ. అసమఞ్జో గృహీత్వా తు క్రీడతః పథి బాలకాన్,
సరయ్వాః ప్రక్షిపన్నప్సు రమతే తేన దుర్మతిః. 19

ప్ర. అ. దుర్మతిః = దుష్టబుద్ధి గల, అసమఞ్జః తు = అసమంజుడైతే, పథి = మార్గమునందు, క్రీడతః = ఆడుకొనుచున్న, బాలకాన్ = పిల్లలను, గృహీత్వా = పట్టుకొని, సరయ్వాః = సరయూనదియొక్క, అప్సు = జలమునందు, ప్రక్షిపన్ = పడవేయుచు, తేన = దానిచేత రమతే = క్రీడించుచుండెడివాడు.

తా. దుర్మార్గుడైన అసమంజుడు మార్గములో ఆడుకొనుచున్న పిల్లలను పట్టుకొని, సరయూనదిలోనికి వారిని విసిరివేసి ఆ విధముగా క్రీడించుచుండెవాడు.

మూ. తం దృష్ట్వా నాగరాః సర్వే క్రుద్ధా రాజానమబ్రువన్,
అసమఞ్జం వృణీష్వైకమస్మాన్వా రాష్ట్రవర్ధన. 20

ప్ర. అ. తమ్=వానిని, దృష్ట్వా=చూచి, సర్వే=సమస్తమైన, నాగరాః =నగరవాసులు, క్రుద్ధాః = కోపించినవారై, రాజానమ్ = రాజునుగూర్చి, అబ్రువన్=పలికిరి. రాష్ట్రవర్ధన=రాష్ట్రమును వృద్ధిపొందించువాడా, ఏకమ్= ఒక, అసమఞ్జమ్ = అసమంజుని గాని, అస్మాన్ వా = మమ్ములను కాని, వృణీష్వ=కోరుకొనుము.

తా. పౌరులందరు అది చూచి, కోపగించి రాజుతో ఇట్లు పలికిరి. "రాష్ట్రమునకు వృద్ధిని కలిగించు ఓ రాజా! నీకు ఒక్క అసమంజుడు మాత్రమే కావలెనో లేక మేము కావలెనో కోరుకొనుము." 20

మూ. తానువాచ తతో రాజా కింనిమిత్తమిదం భయమ్,
తాశ్చాపి రాజ్ఞా సంపృష్టా వాక్యం ప్రకృతయోఽబ్రువన్.

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాజా=రాజు, తాన్=వారిని గూర్చి, ఉవాచ=పలికెను. ఇదం భయమ్=ఈ భయము, కింనిమిత్తమ్ = ఏమి నిమిత్తము కలది? రాజ్ఞా=రాజుచేత, సంపృష్టాః=అడుగబడిన, తాః=ఆ, ప్రకృతయశ్చాపి=ప్రజలు కూడ, వాక్యమ్=వాక్యమును, అబ్రువన్=పలికిరి.

తా. "మీకు ఈ విధముగా భయము కలుగుటకు కారణమేమి" అని రాజు ప్రశ్నింపగా ఆ ప్రజలిట్లు చెప్పిరి. 21

మూ. క్రీడితస్త్వేష నః పుత్రాన్ బాలానుద్భ్రాన్తచేతనః,
సరయ్వాం ప్రక్షిపన్మౌర్ఖ్యాదతులాం ప్రీతిమశ్నుతే. 22

ప్ర. అ. ఉద్భ్రాన్తచేతనః=భ్రాంతిచెందిన బుద్ధిగల, ఏషః=ఇతడు, క్రీడితః=ఆడుకొనుచున్న, బాలాన్=బాలురైన, నః=మాయొక్క, పుత్రాన్= పుత్రులను, సరయ్వామ్ = సరయూనదియందు, ప్రక్షిపన్ = పడవేయుచు, మౌర్ఖ్యాత్=మూర్ఖత్వమువలన, అతులామ్=సాటిలేని, ప్రీతిమ్=ఆనందమును, అశ్నుతే=పొందుచున్నాడు.

తా. "బుద్ధి చెడిన ఈ అసమంజుడు, ఆడుకొనుచున్న మా పుత్రు లైన చిన్న పిల్లలను, సరయూ నదిలో పారవేయుచు మూర్ఖత్వముచే చాలా ఆనందించు చున్నాడు." 22

మూ. స తాసాం వచనం శ్రుత్వా ప్రకృతీనాం నరాధిపః,
తం తత్యాజ హితం పుత్రం తాసాం ప్రియచికీర్షయా. 23

ప్ర. అ. సః నరాధిపః = ఆ రాజు, తాసాం ప్రకృతీనామ్ = ఆ ప్రజల, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా = విని, తాసామ్ = వారికి, ప్రియచికీర్షయా = ప్రియమును చేయవలె నను కోరికతో, హితమ్ = ఇష్టుడైన, తం పుత్రమ్ = ఆ పుత్రుని, తత్యాజ = విడచెను.

తా. ఆ సగరచక్రవర్తి ప్రజలమాటలు విని, వారికి ప్రియము చేయ దల చినవాడై ఆ పుత్రుని విడిచివేసెను. 23

మూ. తం యానం శీఘ్రమారోప్య సభార్యం సపరిచ్ఛదమ్,
యావజ్జీవం వివాస్యోఽయమితి స్వానన్వశాత్ పితా. 24

ప్ర. అ. పితా = తండ్రియైన సగరుడు, సభార్యమ్ = భార్యతో కూడిన వాడూ, సపరిచ్ఛదమ్ = వస్త్రములతో కూడిన వాడూ అయిన, తమ్ = వానిని, శీఘ్రమ్ = శీఘ్రముగా, యానమ్ = వాహనమును, ఆరోప్య = ఎక్కించి, అయమ్ = ఇతడు, యావజ్జీవమ్ = జీవించి యున్నంతవరకు, వివాస్యః = ఊరువెడల గొట్టదగినవాడు, ఇతి = అని, స్వాన్ = తనవారిని, అన్వశాత్ = ఆజ్ఞాపించెను.

తా. వెంటనే ఆ సగరుడు, అసమంజుని, అతని భార్యను కట్టుబట్టలతో రథ మెక్కించి, "వీనిని యావజ్జీవము దేశమునుండి వెడలగొట్టవలెను" అని తన భృత్యులకు ఆజ్ఞాపించెను. 24

మూ. స ఫాలపిటకం గృహ్య గిరిదుర్గాణ్యలోడయత్,
దిశః సర్వాస్త్వనుచరన్ స యథా పాపకర్మకృత్. 25

ప్ర. అ. సః = అతడు, పాపకర్మకృత్ యథా = పాపకర్మ చేసినవాడు వలె, సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులను, అనుచరన్ = సంచరించుచు,

సః = అతడు, ఫాలపిటకమ్ = చిన్న గునపమును, చిన్నగంపను, గృహ్య = గ్రహించి, గిరిదుర్గాణి = పర్వతదుర్గములను, అలోడయత్ = త్రవ్వెను.

తా. ఆ అసమంజుడు, పాపకర్మ చేసినవాడు వలె, దిక్కులు పట్టి పోయి, ఒక చిన్న గునపము, గంప చేత గొని పర్వతదుర్గములను త్రవ్వెను. 25

మూ. ఇత్యేనమత్యజద్రాజా సగరో వై సుధార్మికః,
రామః కిమకరోత్పాపం యేనైవముపరుధ్యతే. 26

ప్ర. అ. సుధార్మికః = గొప్పధార్మికు డైన, సగరః రాజా = రాజైన సగరుడు, ఇతి = ఈ విధముగా, ఏనమ్ = వీనిని, అత్యజత్ = విడచెను. రామః = రాముడు, కిం పాపమ్ = ఏమి పాపమును, అకరోత్ = చేసెను? యేన = దేనిచే, ఏవమ్ = ఈ విధముగ, ఉపరుధ్యతే = వెడలగొట్టబడుచున్నాడో.

తా. ధర్మాత్ము డైన సగరచక్రవర్తి తన కుమారుని ఈ పాపకార్యము నకై వెడలగొట్టెను రాముని వెడలగొట్టుటకు అత డే పాపము చేసినాడు? 26

మూ. న హి కంచన పశ్యామో రాఘవస్యాగుణం వయమ్,
దుర్లభో యస్య నిరయః శశాఙ్కస్యేవ కల్మషమ్. 27

ప్ర. అ. వయమ్ = మేము, రాఘవస్య = రామునియొక్క, అగుణమ్ = చెడ్డ గుణమును, కంచన = దేనిని, న పశ్యామః హి = చూడము కదా? శశాఙ్కస్య = చంద్రునకు, కల్మషమ్ ఇవ = మాలిన్యము వలె, అస్య = ఈ రామునకు, నిరయః = దోషము, దుర్లభః = దుర్లభ మైనది.

తా. రామునిలో మాకు ఏ దోషము కనబడుటలేదు. చంద్రునియందు మాలిన్య మె ట్లుండదో, రామునియందు దోషము కూడ ఉండజాలదు. 27

మూ. అథవా దేవి దోషం త్వం కంచిత్పశ్యసి రాఘవే,
తమద్య బ్రూహి తత్త్వేన తదా రామో వివాస్యతామ్. 28

ప్ర. అ. అథవా = లేక, దేవి = ఓ కైకేయీ, త్వమ్ = నీవు, రాఘవే = రామునియందు, కంచిత్ దోషమ్ = ఏదైన దోషమును, పశ్యసి = చూచినట్లైతే, తమ్ = దానిని గూర్చి, అద్య = ఇపుడు, తత్త్వేన = యథార్థముగ, బ్రూహి =

చెప్పుము. తదా = అప్పుడు, రామః = రాముడు, వివాస్యతామ్ = వెడలగొట్టబడుగాక।

తా. అట్లు కాక నీవు రామునియందు ఏదైన దోషము కనబడినచో, ఆ దోష మేదియో ఇపుడు ఉన్న దున్నట్లు చెప్పుము. అటుపైన, రాముని అరణ్యమునకు పంపవచ్చును. 28

మూ. అదుష్టస్య హి సంత్యాగః సత్పథే నిరతస్య చ,
నిర్దహే దపి శక్రస్య ద్యుతిం ధర్మనిరోధనాత్. 29

ప్ర. అ. అదుష్టస్య = దుష్టుడు కానివాడును, సత్పథే = సన్మార్గమునందు, నిరతస్య చ = ఆసక్తుడును అయిన వానియొక్క, సంత్యాగః = వెడలగొట్టుట, ధర్మనిరోధనాత్ = ధర్మమును అడ్డగించుటవలన, శక్రస్య అపి = దేవేంద్రుని యొక్క కూడ, ద్యుతిమ్ = కాంతిని, నిర్దహేత్ = కాల్చివేయును.

తా. దోషములు ఏమియు లేక, ధర్మమార్గమునందు సంచరించుచున్న వారిని వెడలివేయుట అనునది ధర్మవిరుద్ధ మగుటచే, అది దేవేంద్రుని ఐశ్వర్యమును కూడ భస్మము చేయును. 29

మూ. తదలం దేవి రామస్య శ్రియా విహతయా త్వయా,
లోకతోఽపి హి తే రక్ష్యః పరివాదః శుభాననే. 30

ప్ర. అ. దేవి = ఓ కైకేయీ, తత్ = ఆ కారణమువలన, త్వయా = నీ చేత, రామస్య = రామునియొక్క, శ్రియా = సంపద, విహతయా = కొట్టబడగా, అలమ్ = చాలును. శుభాననే = శుభ మైన ముఖముకలదానా, తే = నీకు, లోకతః = లోకమువలన, పరివాదః అపి = పరివాదము కూడ, రక్ష్యః హి = రక్షింప దగినది కదా।

తా. ఓ కైకేయీ! నీవు రాముని ఐశ్వర్యమునకు విఘ్నము కల్గింపకుము. నీకు లోకములో చెడ్డ పేరు రాకుండు నట్లు కూడ చూచుకొనవలెను కదా। 30

మూ. శ్రుత్వా తు సిద్ధార్థవచో రాజా శ్రాన్తతరస్వనః,
శోకోపహతయా వాచా కైకేయీమిదమబ్రవీత్. 31

ప్ర. అ. సిద్ధార్థవచః = సిద్ధార్థుని మాటలను, శ్రుత్వా = విని, రాజా = దశరథుడు, శ్రాన్తతరస్వనః = మిక్కిలి అలసిపోయిన కంఠధ్వని కలవాడై, శోకోపహతయా = శోకముచే కొట్టబడిన, వాచా = వాక్కుతో, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. సిద్ధార్థుని మాటలు విని రాజు, మిక్కిలి అలసిపోయిన కంఠస్వరముతో, దుఃఖముచే పీడింపబడిన వాక్కుతో కైకేయితో ఇట్లు పలికెను. 31

మూ. ఏతద్వచో నేచ్ఛసి పాపవృత్తే!
హితం న జానాసి మమాత్మనో వా,
ఆస్థాయ మార్గం కృపణం కుచేష్టా
చేష్టా హి తే సాధుపథాదపేతా. 32

ప్ర. అ. పాపవృత్తే = పాపమైన నడవడిక కలదానా, ఏతత్ = ఈ, వచః = మాటను, నేచ్ఛసి = అంగీకరింపవా? కుచేష్టా = చెడ్డ చేష్టగల నీవు, కృపణమ్ = కుత్సితమైన, మార్గమ్ = మార్గమును, ఆస్థాయ = అవలంబించి, మమ = నాకు గాని, ఆత్మనో వా = నీకు గాని, హితమ్ = మేలును, న జానాసి = తెలుసుకొనలేకున్నావు. తే = నీయొక్క, చేష్టా = పని, సాధుపథాత్ = సన్మార్గమునుండి, అపేతా = తొలగినది.

తా. చెడ్డ నడవడిక గల ఓ కైకేయీ! నీవు సిద్ధార్థుని మాటలు కూడ వినుటలేదు. చెడ్డ చేష్ట గల నీవు, కుత్సితమైన మార్గమును అవలంబించి నా హితమును గాని, నీ హితమును గాని, తెలిసికొనజాలకున్నావు. నీవు చేయు పని సన్మార్గమునకు విరుద్ధముగా ఉన్నది. 32

మూ. అనుప్రజిష్యామ్యహమద్య రామం
రాజ్యం పరిత్యజ్య సుఖం ధనం చ,
సహైవ రాజ్ఞా భరతేన చ త్వం
యథాసుఖం భుఙ్క్ష్వ చిరాయ రాజ్యమ్. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షట్త్రింశః సర్గః.

ప్ర. అ. అహమ్ = నేను, రాజ్యమ్ = రాజ్యమును, సుఖమ్ = సుఖమును, ధనం చ = ధనమును, పరిత్యజ్య = విడచి, అద్య = ఇపుడు, రామమ్=రాముని, అనువ్రజిష్యామి = అనుసరించి వెళ్లెదను. త్వమ్ = నీవు, రాజ్ఞా = రాజైన, భరతేన సహైవ = భరతునితో కలిసి, యథాసుఖమ్ = సుఖముగా, చిరాయ = చిరకాలము, రాజ్యమ్ = రాజ్యమును, భుఙ్క్ష్వ = అనుభవింపుము.

తా. నేను ఈ రాజ్యమును, సుఖమును, ధనమును విడచి, రామునితో కలిసి, ఇపుడు అరణ్యమునకు పోయెదను. నీవును రాజైన భరతుడును, చిరకాలము సుఖముగా రాజ్యమును అనుభవింపుడు. ౪౪

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పదిఆరవ సర్గ సమాప్తము.

# అథ సప్తత్రింశః సర్గః

[శ్రీరామాదులు నారవస్త్రములు ధరించుట, సీత నారచీర ధరింపవలెనని వచ్చుటను చూచి రాజవాసపు స్త్రీలు కలతజెందుట, కుల గురువగు వసిష్ఠుడు కైకేయిని నిందించుచు సీత నారచీరములు దాల్చుట అనుచిత మని పలుకుట.]

మూ. మహామాత్ర వచః శ్రుత్వా రామో దశరథం తదా,
అన్వభాషత వాక్యం తు వినయజ్ఞో వినీతవత్. 1

ప్ర. అ. వినయజ్ఞః = వినయము నెరిగిన, రామః = రాముడు, మహామాత్రవచః = మంత్రివాక్యమును, శ్రుత్వా = విని, తదా = అపుడు, దశరథమ్ = దశరథుని గూర్చి, వినీతవత్ = వినయము కలవాడై, వాక్యమ్ = వాక్యమును, అన్వభాషత = పలికెను.

తా. వినయవంతు డైన ఆ రాముడు మంత్రి మాటలు విని దశరథునితో సవినయముగా ఇట్లనెను. 1

మూ. త్యక్తభోగస్య మే రాజన్ వనే వన్యేన జీవతః,
కిం కార్యమనుయాత్రేణ త్యక్తసంగస్య సర్వతః. 2

ప్ర. అ. రాజన్ = రాజా! త్యక్తభోగస్య = విడువబడిన భోగములు కలవాడను, సర్వతః = అంతటను, త్యక్తసంగస్య = విడువబడిన సంబంధము కలవాడను, వనే = వనమునందు, వన్యేన = వనమునందు లభించు ఆహారముచే, జీవతః = జీవించుచున్నవాడను అయిన, మే = నాకు, అనుయాత్రేణ = కూడ వచ్చు పరివారముచే, కిం కార్యమ్ = ఏమి ప్రయోజనము?

తా. మహారాజా! భోగములను విడచి, సర్వసంగపరిత్యాగము చేసి వనములో లభించు ఆహారమును తినుచు, వనములో నివసించు నాకు ఈ పరివార మంతయు ఎందుకు? 2

మూ. యో హి దత్త్వా ద్విపశ్రేష్ఠం కక్ష్యాయాం కురుతే మనః,
రజ్జుస్నేహేన కిం తస్య త్యజతః కుంజరోత్తమమ్. 3

ప్ర. అ. యః = ఎవడు, ద్విపశ్రేష్ఠమ్ = ఏనుగులలో శ్రేష్ఠ మైన దానిని, దత్త్వా = ఇచ్చి వేసి, కక్ష్యాయామ్ = నడుమునకు కట్టు త్రాడియందు, మనః = మనస్సును, కురుతే = చేయునో, కుంజరోత్తమమ్ = శ్రేష్ఠ మైన గజమును, త్యజతః = విడిచిన, తస్య = వానికి, రజ్జుస్నేహేన = రజ్జువుపై స్నేహముచేత, కిమ్ = ఏమి ప్రయోజనము.

తా. ఉత్తమ మైన గజమును ఇచ్చివేసి, దాని నడుముకు కట్టిన త్రాడియందు ఎవ డైన ఆసక్తి చూపునా? కుంజరశ్రేష్ఠమును ఇచ్చివేసిన అతనికి ఆ త్రాడిపై స్నేహ మెందుకు? 3

మూ. తథా మమ సతాం శ్రేష్ఠ! కిం ధ్వజిన్యా జగత్పతే,
సర్వాణ్యేవానుజానామి చీరాణ్యేవానయన్తు మే. 4

ప్ర. అ. సతామ్ = సత్పురుషులలో, శ్రేష్ఠ = శ్రేష్ఠుడా, జగత్పతే = ఓ మహారాజా! తథా = ఆ విధముగనే, మమ = నాకు, ధ్వజిన్యా = సేనచేత, కిమ్ = ఏమి ప్రయోజనము? సర్వాణ్యేవ = అన్నింటిని, అనుజానామి = ఇచ్చి వేయుచున్నాను. మే = నాకు, చీరాణ్యేవ = నారచీరలను మాత్రమే, ఆనయన్తు = తీసుకొని వచ్చెదరు గాక!

తా. సత్పురుషులలో శ్రేష్ఠుడ వైన ఓ మహారాజా! ఏనుగునే ఇచ్చివేసిన వానికి దాని త్రాడితో ఎట్లు ప్రయోజనము లేదో, నాకును అట్లే ఈ సేనతో ప్రయోజనమేమియులేదు. వీటి నన్నిటిని భరతునకే ఇచ్చి వేయుచున్నాను. నాకు నారచీరలు మాత్రము తెచ్చి ఇవ్వవలెను. 4

మూ. ఖనిత్రపిటకే చోభే సమానయత గచ్ఛత,
చతుర్దశ వనే వాసం వర్షాణి వసతో మమ. 5

ప్ర. అ. గచ్ఛతః = వెళ్ళుచున్న వారను, చతుర్దశ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములను, వనే = వనమునందు, వాసమ్ = నివాసమును, వసతః = నివసించువారను అయిన, మమ = నాకు, ఉభే = రెండు, ఖనిత్రపిటకే = గునపమును, గంపను, సమానయత = తీసుకొనిరండి.

తా. నేను పదునాలుగు సంవత్సరములు వనములో నివసించుటకై వెళ్ళుచున్నాను. అందుచే నాకు కావలసినవి ఒక గునపము, ఒక గంప అను రెండు వస్తువులు మాత్రమే. 5

మూ. అథ చీరాణి కైకేయీ స్వయమాహృత్య రాఘవమ్,
ఉవాచ పరిధత్స్వేతి జనౌఘే నిరపత్రపా. 6

ప్ర. అ. అథ = పిమ్మట, కైకేయీ = కైకేయి, జనౌఘే = జనసమూహమునందు, నిరపత్రపా = సిగ్గులేనిదై, స్వయమ్ = స్వయముగా, చీరాణి = నారచీరలను, ఆహృత్య = తీసుకొని వచ్చి, పరిధత్స్వ = ధరించుము, ఇతి = అని, రాఘవమ్ = రామునిగూర్చి, ఉవాచ = పలికెను.

తా. కైకేయి ఆ జనసమూహములో సిగ్గు లేక తానే స్వయముగా నారచీరలు తీసుకొని వచ్చి "ఇదిగో కట్టుకొనుము" అని రామునికి ఇచ్చెను. 6

మూ. స చీరే పురుషవ్యాఘ్రః కైకేయ్యాః ప్రతిగృహ్య తే,
సూక్ష్మవస్త్రమవక్షిప్య మునివస్త్రాణ్యవస్త హ. 7

ప్ర.అ. పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడైన, సః = ఆ రాముడు, కైకేయ్యాః = కైకేయినుండి, తే = ఆ, చీరే = రెండు నారచీరలను, ప్రతిగృహ్య = తీసుకొని, సూక్ష్మవస్త్రమ్ = సన్నని వస్త్రమును, అవక్షిప్య = వదలివేసి, మునివస్త్రాణి = మునులు ధరించు వస్త్రములను, అవస్త హ = కట్టుకొనెను.

తా. పురుషశ్రేష్ఠుడైన ఆ రాముడు కైకేయి చేతిలోనుండి, ఆ నారచీరలు తీసుకొని, తాను ధరించియున్న సన్నని వస్త్రమును వదలివేసి, ఆ మునివస్త్రములను ధరించెను. 7

మూ. లక్ష్మణశ్చాపి తత్రైవ విహాయ వసనే శుభే,
తాపసాచ్ఛాదనే చైవ జగ్రాహ పితురగ్రతః. 8

ప్ర. అ. లక్ష్మణశ్చాపి = లక్ష్మణుడు కూడ, తత్రైవ = అక్కడనే, పితుః = తండ్రియొక్క, అగ్రతః = ఎదుట, శుభే = సుందరములైన, వసనే = వస్త్రములను, విహాయ = విడచి, తాపసాచ్ఛాదనే చైవ = మునులు ధరించు వస్త్రములనే, జగ్రాహ = ధరించెను.

తా. లక్ష్మణుడు కూడ తండ్రి ఎదుటనే తాను ధరించి యున్న సుందర వస్త్రములను విడిచి, నారచీరలను ధరించెను. 8

మూ. అథాత్మపరిధానార్థం సీతా కౌశేయవాసినీ,
సమీక్ష్య చీరం సంత్రస్తా పృషతీ వాగురామివ. 9

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కౌశేయవాసినీ = పట్టు వస్త్రములు ధరించిన, సీతా = సీత, ఆత్మపరిధానార్థమ్ = తాను కట్టుకొనుటకై ఉద్దేశించిన, చీరమ్ = నారచీరను, సమీక్ష్య = చూచి, పృషతీ = లేడి, వాగురామివ = వలను చూచి వలె, సంత్రస్తా = భయపడినది.

తా. ఇంతలో పట్టువస్త్రములనే ధరించు సీత తనకొరకై తీసుకొని వచ్చిన నారచీరలను చూచి, వల చూచిన లేడి వలె, భయపడిపోయినది. 9

మూ. సా వ్యపత్రపమాణేవ ప్రగృహ్య చ సుదుర్మనాః,
కైకేయ్యాః కుశచీరే తే జానకీ శుభలక్షణా. 10
అశ్రుసంపూర్ణనేత్రా చ ధర్మజ్ఞా ధర్మదర్శినీ,
గన్ధర్వరాజప్రతిమం భర్తారమిదమబ్రవీత్. 11

ప్ర. అ. సుదుర్మనాః = మిక్కిలి దుఃఖము పొందిన మనస్సు కలదీ, శుభలక్షణా = శుభమైన లక్షణములు కలదీ, ధర్మజ్ఞా = ధర్మము తెలిసినదీ, ధర్మదర్శినీ = ధర్మమును చూచునదీ అయిన, సా జానకీ = ఆ సీత, వ్యపత్రపమాణేవ = సిగ్గుపడుచునే, కైకేయ్యాః = కైకేయినుండి, తే = ఆ, కుశచీరే = కుశలతో తయారుచేసిన నారచీరలను, ప్రగృహ్య = గ్రహించి, అశ్రుసంపూర్ణనేత్రా = కన్నీరుతో నిండిన నేత్రములు కలదై, గన్ధర్వరాజప్రతిమమ్ = గంధర్వ రాజుతో సమానుడైన, భర్తారమ్ = భర్తను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధర్మము లన్నియు తెలిసినదీ, ధర్మమునందే దృష్టి కలదీ, ఉత్తమ లక్షణములు కలదీ యైన ఆ సీత కైకేయి చేతినుండి ఆ నారచీరలను సిగ్గుపడు చునే తీసుకొని, మిక్కిలి దుఃఖించుచు, కన్నీళ్లతో నిండిన నేత్రములు కలదై గంధర్వరాజుతో సమానుడైన భర్తతో ఇట్లు పలికెను. 11

మూ. కథం ను చీరం బధ్నన్తి మునయో వనవాసినః,
ఇతి హ్యకుశలా సీతా సా ముమోహ ముహుర్ముహుః.

ప్ర. అ. వనవాసినః = వనమునందు, మునయః = మునులు, చీరమ్ = నారచీరను, కథమ్ = ఎట్లు, బధ్నన్తి ను = కట్టెదరో, ఇతి = అని పలికి, సా సీతా = ఆ సీత, అకుశలా = చేతకానిదై, ముహుర్ముహుః = మాటిమాటికి, ముమోహ = మోహము చెందెను.

తా. "వనములో నివసించు మునులు నారచీరలను ఎట్లు కట్టుకుందురో" అని రామునితో పలికి సీత వాటిని ధరింప చేతగాక ఏమి చేయవలెనో తోచక అట్లే ఉండిపోయినది. 12

మూ. కృత్వా కణ్ఠే చ సా చీరమేకమాదాయ పాణినా,
తస్థౌ హ్యకుశలా తత్ర వ్రీడితా జనకాత్మజా. 13

ప్ర. అ. సా జనకాత్మజా = ఆ సీత, ఏకమ్ = ఒక, చీరమ్ = నారచీరను, కణ్ఠే = కంఠమునందు, కృత్వా = ఉంచి, పాణినా = హస్తముతో, ఆదాయ = పట్టుకొని, తత్ర = కట్టుకొనుటయందు, అకుశలా = చేతకానిదై, వ్రీడితా = సిగ్గుపడి, తస్థౌ = నిలచెను.

తా. సీత ఒక నారచీరను మెడపై వేసుకొని, ఒకటి చేతితో పట్టుకొని, ఎట్లు కట్టుకొనవలెనో తెలియక సిగ్గుపడుచు, నిలబడెను. 13

మూ. తస్యాస్తత్క్షిప్రమాగమ్య రామో ధర్మభృతాం వరః,
చీరం బబన్ధ సీతాయాః కౌశేయస్యోపరి స్వయమ్. 14

ప్ర. అ. ధర్మభృతామ్ = ధర్మమును పోషించువారిలో, వరః = శ్రేష్ఠుడైన, రామః = రాముడు, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆగమ్య = వచ్చి, తత్ చీరమ్ = ఆ

నారచీరను. తస్యాః సీతాయాః=ఆ సీతయొక్క, కౌశేయస్య = పట్టువస్త్రము యొక్క, ఉపరి = పైన, స్వయమ్ = స్వయముగా, బబన్ధ = కట్టెను.

తా. ధర్మరక్షకులలో శ్రేష్ఠుడైన రాముడు, అది చూచి, వెంటనే సీత దగ్గరకు వెళ్లి, ఆమె ధరించి యున్న పట్టువస్త్రముపైననే స్వయముగా నార చీరను కట్టెను. 14

మూ. రామం ప్రేక్ష్య తు సీతాయాః బధ్నన్తం చీరముత్తమమ్,
అన్తఃపురగతా నార్యో ముముచుర్వారి నేత్రజమ్. 15

ప్ర. అ. సీతాయాః = సీతకు, చీరమ్ = నారచీరను, బధ్నన్తమ్=కట్టు చున్న, ఉత్తమమ్ = శ్రేష్ఠుడైన, రామమ్=రాముని, ప్రేక్ష్య=చూచి, అన్తఃపుర గతాః = అంతఃపురములో ఉన్న, నార్యః = స్త్రీలు, నేత్రజమ్ = నేత్రములనుండి పుట్టిన, వారి = నీటిని, ముముచుః = విడిచిరి.

తా. ఆ విధముగా సీతకు రాముడు నారచీర కట్టుచుండగా చూచి, అంతఃపురములో నున్న స్త్రీ లందరును ఏడ్చిరి. 15

మూ. ఊచుశ్చ పరమాయస్తా రామం జ్వలితతేజసమ్,
వత్స నైవం నియుక్తేయం వనవాసే మనస్వినీ. 16

ప్ర. అ. పరమాయస్తాః=మిక్కిలి దుఃఖించుచున్నవారై, జ్వలితతేజసమ్= ప్రజ్వలించుచున్న తేజస్సు గల, రామమ్=రాముని గూర్చి, ఊచుశ్చ=పలికిరి. వత్స = ఓ వత్సా, మనస్వినీ=ఉత్తమమైన మనస్సు గల, ఇయమ్ = ఈ సీత, ఏవమ్ = ఈ విధముగా, వనవాసే = వనవాసమునందు, న నియుక్తా = ఆజ్ఞా పింపబడలేదు.

తా. వారందరును మిక్కిలి దుఃఖించుచు, తేజస్సుతో ప్రజ్వలించుచున్న ఆ రామునితో ఇట్లనిరి. "నాయనా! ఉత్తమమైన మనస్సు గల ఈ సీత కూడ ఈ విధముగ వనవాసమునకు వెళ్లవలెనని ఎవ్వరును ఆజ్ఞాపించలేదు కదా" 16

మూ. పితుర్వాక్యానురోధేన గతస్య విజనం వనమ్,
తావద్దర్శనమస్యా నః సఫలం భవతు ప్రభో. 17

ప్ర. అ. వ్రతో = ఓ రామా! పితుః = తండ్రియొక్క, వాక్యనిదేశ = వాక్యమును అనుసరించి, విజనమ్ = జనశూన్య మైన, వనమ్ = వనమును గూర్చి, గతస్య = నీవు వెళ్లగా, యావత్ = అంతవరకును, నః = మాకు, సఫలమ్ = సఫల మైన, అస్యాః = ఈమెయొక్క, దర్శనమ్ = దర్శనము, భవతు = అగుగాక.

తా. "నీవు తండ్రి మాటను అనుసరించి అరణ్యమునకు వెళ్ళిపోయిన పిమ్మట, నీవు వచ్చువరకును మేము ఈమెను చూచుచు సంతోషించెదము గాక."

మూ. లక్ష్మణేన సహాయేన వనం గచ్ఛస్వ పుత్రక,
నేయమర్హతి కల్యాణీ వస్తుం తాపసవద్వనే. 18

ప్ర. అ. పుత్రక = కుమారా! సహాయేన = సహాయభూతు డైన, లక్ష్మణేన = లక్ష్మణునితో కూడ, వనమ్ = వనమును గూర్చి, గచ్ఛస్వ = వెళ్ళుము. కల్యాణీ = మంగళస్వరూపురా లైన, ఇయమ్ = ఈ సీత, తాపసవత్ = ముని వలె, వనే = వనమునందు, వస్తుమ్ = నివసించుటకు, నార్హతి = తగదు.

తా. "కుమారా! నీవు లక్ష్మణుని సహాయునిగా తీసుకొని అరణ్యమునకు వెళ్ళుము. మంగళస్వరూపిణి యైన ఈ సీత ముని వలె అరణ్యములో నివసించుటకు తగదు." 18

మూ. కురు నో యాచనాం పుత్ర! సీతా తిష్ఠతు భామినీ,
ధర్మనిత్యః స్వయం స్థాతుం న హీదానీం త్వమిచ్ఛసి. 19

ప్ర. అ. పుత్ర = కుమారా! నః = మాయొక్క, యాచనామ్ = ప్రార్థనను, కురు = చేయుము. భామినీ = ఉత్తమ స్త్రీ యైన, సీతా = సీత, తిష్ఠతు = ఇచటనే ఉండుగాక. ధర్మనిత్యః = ధర్మమునందు స్థిరుడ వైన, త్వమ్ = నీవు, స్వయమ్ = తాను, స్థాతుమ్ = ఉండుటకు, ఇదానీమ్ = ఇపుడు, న ఇచ్ఛసి హి = ఇచ్ఛయించుటలేదు కదా.

తా. "కుమారా! మా ప్రార్థనను అంగీకరించి, సీతను ఇచటనే ఉంచి వేయుము. ధర్మమునందు స్థైర్యము కల నీవు ఉండుటకు ఎట్లైనను అంగీకరించుటలేదు కదా!". 19

మూ. తాసామేవంవిధా వాచః శృణ్వన్ దశరథాత్మజః,
బబన్ధైవ తదా చీరం సీతయా తుల్యశీలయా. 20

ప్ర. అ. దశరథాత్మజః = రాముడు, తాసామ్ = వారియొక్క, ఏవం విధాః = ఈ విధ మైన, వాచః = మాటలను, శృణ్వన్ = వినుచు, తదా = అపుడు, తుల్యశీలయా = సమాన మైన స్వభావము గల, సీతయా = సీతచేత, చీరమ్ = నార చీరను, బబన్ధైవ = కట్టించియే తీరెను.

తా. రాముడు వా రందరును ఇట్లు పలుకుచున్నను, తన వలె ధర్మ స్వభావము గల ఆ సీతకు నారచీరను కట్టెను. 20

మూ. చీరే గృహీతే తు తయా సమీక్ష్య నృపతేర్గురుః,
నివార్య సీతాం కైకేయీం వసిష్ఠో వాక్యమబ్రవీత్. 21

ప్ర. అ. తయా = ఆ సీత చేత, చీరే = నారచీర, గ్రహీతే = గ్రహింపబడిన దగుచుండగా, నృపతేః = రాజుయొక్క, గురుః = గురు వైన, వసిష్ఠః = వసిష్ఠుడు, సమీక్ష్య = చూచి, సీతామ్ = సీతను, నివార్య = నివారించి, కైకేయీమ్ = కైకేయిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. దశరథుని గురు వైన వసిష్ఠుడు సీత నారచీర గ్రహించుటను చూచి, ఆమెను నివారించి, కైకేయితో ఇట్లనెను. 21

మూ. అతిప్రవృత్తే దుర్మేధే కైకేయి కులపాంసని,
వఞ్చయిత్వా చ రాజానం న ప్రమాణేఽవతిష్ఠసే. 22

ప్ర. అ. అతిప్రవృత్తే = మితి మీరి ప్రవర్తించుచున్నదానా। దుర్మేధే = దుష్ట మైన బుద్ధి కలదానా। కులపాంసని = కులమును అపవిత్రము చేయుదానా। కైకేయి = ఓ కైకేయీ। రాజానమ్ = రాజును, వఞ్చయిత్వా చ = వంచించి కూడ, ప్రమాణే = న్యాయసమ్మత మైన ప్రమాణమునందు, న అవతిష్ఠసే = (నీవు) నిలుచుటలేదు.

తా. మితి మీరి ప్రవర్తించేదానా। చెడ్డ బుద్ధి కలదానా। కులమును అపవిత్రము చేయుదానా। ఓ కైకేయీ, రాజును ఈ విధముగా, వంచించితివి. ఇంకను ప్రమాణసమ్మత మైన న్యాయమార్గములో ప్రవర్తించుటలేదు. 22

మూ. న గన్తవ్యం వనం దేవ్యా సీతయా శీలవర్జితే,
అనుష్ఠాస్యతి రామస్య సీతా ప్రకృతమాసనమ్. 23

ప్ర. అ. శీలవర్జితే=సదాచారము లేనిదానా, దేవ్యాః=దేవియైన, సీతయా=సీతచేత, వనమ్ = వనము, న గన్తవ్యమ్ = వెళ్లదగినది కాదు. సీతా = సీత, రామస్య=రామునియొక్క, ప్రకృతమ్ = ప్రస్తుత మైన, ఆసనమ్ = సింహాసనమును, అనుష్ఠాస్యతి=అధిష్ఠించగలదు.

తా. సదాచారము లేని ఓ కైకేయీ, సీత వనమునకు వెళ్లవలసిన పని లేదు. ఆమె ఇచటనే ఉండి రాముని సింహాసనమును అధిష్ఠించగలదు. 23

మూ. ఆత్మా హి దారాః సర్వేషాం దారసంగ్రహవర్తినామ్,
ఆత్మేయమితి రామస్య పాలయిష్యతి మేదినీమ్. 24

ప్ర. అ. దారసంగ్రహవర్తినామ్ = భార్యలను పరిగ్రహించి ఉండు, సర్వేషామ్ = అందరికిని, దారాః = భార్య, ఆత్మా హి = ఆత్మ కదా। ఇయమ్ = ఈ సీత, రామస్య = రామునియొక్క, ఆత్మా ఇతి = ఆత్మ అనే కారణమువలన, మేదినీమ్ = భూమిని, పాలయిష్యతి = పరిపాలించగలదు.

తా. గృహస్థు లందరికిని భార్య ఆత్మవంటిది. ఈ సీత రాముని ఆత్మ కావున రాజ్యమును పరిపాలించగలదు. 24

మూ. అథ యాస్యతి వైదేహీ వనం రామేణ సంగతా,
వయమప్యనుయాస్యామః పురం చేదం గమిష్యతి. 25

ప్ర. అ. అథ = అట్లుగాక, వైదేహీ = సీత, రామేణ = రామునితో, సంగతా = కూడినదై, వనమ్ = వనమును గూర్చి, యాస్యతి = వెళ్లినచో, వయమపి = మేము కూడ, అనుయాస్యామః=అనుసరించి వెళ్లెదము. ఇదమ్= ఈ, పురం చ = పట్టణము కూడ, గమిష్యతి = వెళ్లగలదు.

తా. అట్లు గాక సీత కూడ రామునితో అరణ్యమునకు వెళ్లినచో మేము కూడ ఆమెను అనుసరించి వెళ్లెదము. ఈ పట్టణము కూడ వెళ్ళగలదు. 25

మూ. అన్తపాలాశ్చ యాస్యన్తి సదారో యత్ర రాఘవః,
సహోపజీవ్యం రాష్ట్రం చ పురం చ సపరిచ్ఛదమ్. 26

ప్ర. అ. సదారః = భార్యాసహితు డైన, రాఘవః = రాముడు, యత్ర = ఎక్కడ ఉండునో అచటికి, అన్తపాలాశ్చ = సరిహద్దులు పరిపాలించే వారును, సహోపజీవ్యమ్ = ఆధారపడి జీవింప దగిన రాజుతో కూడిన, రాష్ట్రం చ = రాష్ట్రము, సపరిచ్ఛదమ్ = పరివారముతో కూడిన, పురం చ = పట్టణము, యాస్యన్తి = వెళ్లగలవు.

తా. సరిహద్దులు పరిపాలించువా రందరును, దశరథ సహిత మైన ఈ రాష్ట్రము, సకలపరివారములు, పటికరములతో కూడిన ఈ నగరము, రాము డున్నచోటికే వెళ్ళిపోవును. 26

మూ. భరతశ్చ సశత్రుఘ్నశ్చీరవాసా వనేచరః,
వనే వసన్తం కాకుత్స్థమనువత్స్యతి పూర్వజమ్. 27

ప్ర. అ. సశత్రుఘ్నః = శత్రుఘ్నునితో కూడిన, భరతశ్చ = భరతుడు కూడ, చీరవాసాః = నారచీరను ధరించినవాడై, వనేచరః = వనమునందు తిరుగుచు, వనే = వనమునందు, వసన్తం = నివసించుచున్న, పూర్వజమ్ = అన్నగారైన, కాకుత్స్థమ్ = రాముని, అనువత్స్యతి = అనుసరించి నివసించగలడు.

తా. భరతశత్రుఘ్నులు కూడ నారచీరలు ధరించి, అడవికి పోయి అచట నివసించుచున్న అన్నగారైన రామునితో కలసి, అక్కడనే నివసించగలరు. 27

మూ. తతః శూన్యాం గతజనాం వసుధాం పాదపైః సహ,
త్వమేకా శాధి దుర్వృత్తా ప్రజానామహితే స్థితా. 28

ప్ర. అ. ప్రజానామ్ = ప్రజలయొక్క, అహితే = అహితమునందు, స్థితా = ఉన్న, దుర్వృత్తా = చెడ్డ నడవడిక గల, త్వమ్ ఏకా = నీవు ఒక్కతెవే, తతః = అటు పిమ్మట, గతజనామ్ = వెడలిపోయిన జనులు కలదీ, శూన్యామ్ = పాడుపడినదీ అయిన, వసుధామ్ = భూమిని, పాదపైః సహ = వృక్షములతో, శాధి = పరిపాలింపుము.

తా. అటు పిమ్మట ప్రజలకు కీడు చెయ్యుచున్నదానవూ, చెడ్డ నడవడిక కలదానవూ అయిన నీవు ఒక్కతెవే ప్రజ లందరు వెడలి పోవుటచే పాడుపడిన ఈ భూమిపై ఉన్న చెట్లను మాత్రమే పరిపాలింపుము. 28

మూ. న హి తద్భవితా రాష్ట్రం యత్ర రామో న భూపతిః,
తద్వనం భవితా రాష్ట్రం యత్ర రామో నివత్స్యతి. 29

ప్ర. అ. యత్ర=ఎక్కడ, రామః=రాముడు, భూపతిః=రాజు, న=కాడో, తత్=అది, రాష్ట్రమ్=రాష్ట్రముగా, న భవితా హి=కాజాలదు కదా। యత్ర=ఎక్కడ, రామః=రాముడు, నివత్స్యతి=నివసించగలడో, తత్ వనమ్=ఆ వనము, రాష్ట్రమ్=రాష్ట్రముగా, భవితా=కాగలదు.

తా. రాముడు రాజుగా లేనిది రాజ్యము కాజాలదు. రాముడు నివసించు వనమే రాజ్యమగును. 29

మూ. న హ్యదత్తాం మహీం పిత్రా భరతః శాస్తుమర్హతి,
త్వయి వా పుత్రవద్వస్తుం యది జాతో మహీపతేః. 30

ప్ర. అ. భరతః=భరతుడు, మహీపతేః=దశరథునకు, జాతః యది=పుట్టినవాడైతే, పిత్రా=తండ్రిచేత, అదత్తామ్=ఇవ్వబడని, మహీమ్=భూమిని, శాస్తుమ్=పరిపాలించుటకు కాని, త్వయి=నీ విషయమున, పుత్రవత్=పుత్రుడు వలె, వస్తుం వా=నివసించుటకు గాని, న అర్హతి=తగడు.

తా. భరతుడు దశరథునికి పుట్టినవాడే అయినచో, తండ్రి తనకు మనః పూర్వకముగా ఇవ్వని రాజ్యమును పాలింపడు. నీ విషయమున పుత్రుడు వలె ప్రవర్తింపడు. 30

మూ. యద్యపి త్వం క్షితితలాద్గగనం చోత్పతిష్యసి,
పితుర్వంశచరిత్రజ్ఞః సోఽన్యథా న కరిష్యతి. 31

ప్ర. అ. త్వమ్=నీవు, క్షితితలాత్=భూతలమునుండి, గగనమ్=ఆకాశమును గూర్చి, ఉత్పతిష్యసి యద్యపి=ఎగిరినను, పితుర్వంశచరిత్రజ్ఞః=తండ్రి యొక్క వంశచరిత్ర తెలిసిన, సః=భరతుడు, అన్యథా=మరి యొక విధముగా, న కరిష్యతి=చేయడు.

తా. నీవు భూతలమునుండి ఆకాశమునకు ఎగురగల్గినను, తండ్రి వంశములో పుట్టిన పూర్వపురుషుల సచ్చరిత్రలు తెలిసిన ఆ భరతుడు, నీవు చెప్పినట్లు చేయడు. 31

మూ. తత్త్వయా పుత్రగర్ధిన్యా పుత్రస్య కృతమప్రియమ్,
లోకే హి స న విద్యేత యో న రామమనువ్రతః. 32

ప్ర. అ. తత్=ఆ కారణమువలన, పుత్రగర్ధిన్యా=పుత్రునియందు ప్రేమ గల, త్వయా=నీచేత, పుత్రస్య=నీ కుమారునకు, అప్రియమ్=అప్రియమే, కృతమ్=చేయబడినది. లోకే=ఈ లోకమునందు, యః=ఎవడు, రామమ్=రాముని, అనువ్రతః=అనుసరించినవాడు, న=కాడో, సః=అట్టివాడు, న విద్యేత హి=ఉండడుకదా!

తా. పుత్రునియందు ప్రేమతో నీవు పుత్రునకు అపకారమే చేయుచున్నావు. ఈ లోకములో రాముని అనుసరించనివాడు ఎవ్వడును ఉండడు కదా! 32

మూ. ద్రక్ష్యస్యద్యైవ కైకేయి పశువ్యాళమృగద్విజాన్,
గచ్ఛతః సహ రామేణ పాదపాంశ్చ తదున్ముఖాన్. 33

ప్ర. అ. కైకేయి=కైకేయీ, రామేణ సహ=రామునితో కలసి, గచ్ఛతః=వెళ్లుచున్న, పశువ్యాళమృగద్విజాన్=పశువులను, గజములను, మృగములను, పక్షులను, తదున్ముఖాన్=ఆ రాముని వైపు ముఖము త్రిప్పి ఉన్న, పాదపాంశ్చ=వృక్షములను, అద్యైవ=ఇపుడే, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఓ కైకేయీ! పశువులు, గజములు, మృగములు, పక్షులు కూడ రాముని వెంటనే వెళ్ళుచుండగా, వృక్షము లన్నియు రాముని వైపే ముఖము త్రిప్పి నిలచి యుండగా నీవు ఇప్పుడే చూచెదవు. 33

మూ. అథోత్తమాన్యాభరణాని దేవి
దేహి స్నుషాయై వ్యపనీయ చీరమ్,
న చీరమస్యాః ప్రవిధీయతేతి
న్యవారయత్ తద్వసనం వసిష్ఠః. 34

ప్ర. అ. అథ=ఇంక, దేవి=ఓ కైకేయీ, చీరమ్=నారచీరను, వ్యపనీయ=తీసివేసి, స్నుషాయై=నీ కోడ లైన సీతకు, ఉత్తమాని=ఉత్తమ మైన, ఆభరణాని=అలంకారములను. దేహి=ఇమ్ము. అస్యాః=ఈమెకు, చీరమ్=

నారచీర, న ప్రవిధీయత = విధింపబడలేదు, ఇతి = అని, వసిష్ఠః = వసిష్ఠుడు, తత్ = ఆ, వసనమ్ = వస్త్రమును, న్యవారయత్ = నివారించెను.

తా. అందుచే ఈ నారచీరను తొలగించి సీతకు ఉత్తమ మైన ఆభరణాదులను ఇమ్ము. ఈమె కూడ నారచీరలు కట్టవలె నని విధింపబడలేదు కదా, అని చెప్పుచు వసిష్ఠుడు కైకేయి యిచ్చిన ఆ వస్త్రమును, సీత కట్టుకొనుచుండగా నివారించెను. 34

మూ. ఏకస్య రామస్య వనే నివాస
స్త్వయా వృతః కేకయరాజపుత్రి,
విభూషితేయం ప్రతికర్మనిత్యా
వసత్వరణ్యే సహ రాఘవేణ. 35

ప్ర. అ. కేకయరాజపుత్రి = ఓ కైకేయీ, త్వయా = నీచేత, ఏకస్య రామస్య = రామునికి ఒక్కనికే, వనే = వనమునందు, నివాసః = నివాసము, వృతః = కోరబడినది. ఇయమ్ = ఈ సీత, విభూషితా = అలంకరింపబడినదై, ప్రతికర్మనిత్యా = నిత్యము అలంకరించుకొన్నదై, రాఘవేణ సహ = రామునితో కూడ, అరణ్యే = అరణ్యమునందు, వసతు = నివసించు గాక;

తా. ఓ కైకేయీ! నీవు రాముని కొక్కనికే కదా! వనవాసము కోరినది; అందుచే ఈమె అలంకారములను ధరించి, నిత్యము శరీరసంస్కారము చేసికొనుచు, రామునితో కూడ అరణ్యములో నివసించుగాక. 35

మూ. యానైశ్చ ముఖ్యైః పరిచారకైశ్చ
సుసంవృతా గచ్ఛతు రాజపుత్రీ,
వస్త్రైశ్చ సర్వైః సహితైర్విధానై
ర్నేయం వృతా తే వరసంప్రదానే. 36

ప్ర. అ. రాజపుత్రీ = సీత, ముఖ్యైః = శ్రేష్ఠ మైన, యానైశ్చ = వాహనములతోను, పరిచారకైశ్చ = పరిచారకులతోను, సుసంవృతా = కూడినదై, వస్త్రైశ్చ = వస్త్రములతోను, సర్వైః = సమస్త మైన, సహితైః = ఒకచోట చేరి

యున్న, విధానై। = ఉపకరణములతోను కూడి, గచ్ఛతు = వెళ్ళుగాక. తే = నీ యొక్క, వరసంప్రదానే = వరముల నిచ్చుటయందు, ఇయమ్ = ఈమె, న వృతా = కోరబడలేదు కదా।

తా. సీతాదేవి వెంట ప్రధాన మైన వాహనములు, పరిచారకులు, వస్త్రములు అన్ని విధము లైన ఉపకరణములు కూడ వెళ్ళుగాక. నీవు వరములను కోరి నప్పుడు ఈమె కూడ వెళ్లవలెను అని కోరలేదు కదా। 36

మూ. తస్మింస్తథా జల్పతి విప్రముఖ్యే
గురౌ నృపస్యాప్రతిమప్రభావే.
నైవ స్మ సీతా వినివృత్తభావా
ప్రియస్య భర్తుః ప్రతికారకామా. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తత్రింశః సర్గః.

ప్ర. అ. నృపస్య = రాజుయొక్క, గురౌ = గురువు, అప్రతిమప్రభావే = సాటి లేని ప్రభావము కలవాడు, విప్రముఖ్యే = బ్రాహ్మణశ్రేష్ఠుడు అయిన, తస్మిన్ = ఆ వసిష్ఠుడు, తథా = అట్లు, జల్పతి = పలుకుచుండగా, సీతా = సీత, ప్రియస్య = ప్రియు డైన, భర్తుః = భర్తకు, ప్రతికారకామా = సరి యైన కార్య మును చేయ గోరుచున్నదై, వినివృత్తభావా = మరలిన భావము కలది, నైవ స్మ = కాలేదు.

తా. సాటి లేని ప్రభావము కలవాడూ, రాజగురువూ, బ్రాహ్మణశ్రేష్ఠుడూ అయిన ఆ వసిష్ఠుడు, అట్లు చెప్పుచున్నను తనకు అతిప్రియుడైన భర్తకు తగిన శుశ్రూషాదికార్యమును చేయదలచి ఉన్న ఆ సీత తన అభిప్రాయమును మార్చు కొనక అరణ్యమునకు వెళ్లుటకే సిద్ధమాయెను. 37

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండములో ముప్పదియేడవ సర్గ సమాప్తము.

# అథ అష్టాత్రింశః సర్గః

*[దశరథమహారాజు సీత నారచీరలు దాల్చుట అనుచిత మని పలికి, కైకను నిందించుట, శ్రీరాముడు తల్లి కౌసల్యను దయతో చూడవలయునని తండ్రిని కోరుట.]*

మూ. తస్యాం చీరం వసానాయాం నాథవత్యామనాథవత్,
ప్రచుక్రోశ జనస్సర్వో ధిక్త్వాం దశరథం త్వితి. 1

ప్ర. అ. నాథవత్యామ్ = రాముడు నాథుడుగా గల, తస్యామ్ = ఆ సీత, అనాథవత్ = నాథుడు లేనిది వలె, చీరమ్ = నారచీరను, వసానాయామ్ = ధరించుచుండగా, సర్వః = సమస్తమైన, జనః = జనము, త్వామ్ = నిన్ను గూర్చి, ధిక్ = నింద అవుగాక। ఇతి = అని, దశరథమ్ = దశరథుని గూర్చి, ప్రచుక్రోశ = ఏడ్చెను.

తా. నాథుడు గల ఆ సీత అనాథురాలు వలె నారచీరను ధరించుచుండగా చూచి, జను లెల్లరును గట్టిగా ఏడ్చుచు, "ఛీఛీ" యని దశరథుని నిందించిరి. 1

మూ. తేన తత్ర ప్రణాదేన దుఃఖితస్స మహీపతిః,
చిచ్ఛేద జీవితే శ్రద్ధాం ధర్మే యశసి చాత్మనః. 2

ప్ర. అ. మహీపతిః = ఆ రాజు, తత్ర = అక్కడ, తేన ప్రణాదేన = ఆ ఏడ్పుల ధ్వనిచేత, దుఃఖితః = దుఃఖితుడై, ఆత్మనః = తనయొక్క, జీవితే = జీవితమునందును, ధర్మే = ధర్మమునందును, శ్రద్ధామ్ = శ్రద్ధను, చిచ్ఛేద = ఛేదించెను.

తా. ఆ జనుల ఆర్తధ్వని వినగానే దశరథుడు, దుఃఖితుడై, తన జీవితమునందు, ధర్మమునందు, కీర్తియందు కూడ, శ్రద్ధను విడనాడెను. 2

మూ. స నిఃశ్వస్యోష్ణమైక్ష్వాక స్తాం భార్యామిదమబ్రవీత్,
కైకేయి కుశచీరేణ న సీతా గన్తుమర్హతి. 3

ప్ర. అ. సః = ఆ, ఐక్ష్వాకః = దశరథుడు, ఉష్ణమ్ = వేడిగా, నిఃశ్వస్య = నిట్టూర్చి, భార్యామ్ = భార్యను గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను. కైకేయి = కైకేయీ! సీతా = సీత, కుశచీరేణ = నారచీరతో, గన్తుమ్ = వెళ్ళుటకు, నార్హతి = తగదు.

తా. ఆ దశరథమహారాజు వేడిగా నిట్టూర్చుచు, "ఓ కైకేయీ! సీత నారచీరను ధరించి వనమునకు వెళ్ళరాదు." అని భార్యతో పలికెను. 3

మూ. సుకుమారీ చ బాలా చ సతతం చ సుఖోచితా,
నేయం వనస్య యోగ్యేతి సత్యమాహ గురుర్మమ. 4

ప్ర. అ. సుకుమారీ చ = సుకుమారురాలును, బాలా చ = చిన్న వయస్సు కలది, సతతమ్ = ఎల్లపుడు, సుఖోచితా = సుఖమునకు అలవాటు పడినది యైన, ఇయమ్ = ఈమె, వనస్య = వనమునకు, న యోగ్యా = తగినది కాదు, ఇతి = అని, మమ గురుః = నా గురువు, సత్యమ్ = సత్యముగనే, ఆహ = పలుకుచున్నారు.

తా. ఈ సీత సుకుమారురాలు. చిన్న వయస్సు కలది. ఎల్లపుడును సుఖములకు అలవాటుపడినది. అట్టి ఈమె వనవాసమునకు తగినది కాదు అని నా గురువు చెప్పిన మాట నిజమే. 4

మూ. ఇయం హి కస్యాపకరోతి కించి
త్తపస్వినీ రాజవరస్య కన్యా,
యా చీరమాసాద్య జనస్య మధ్యే
స్థితా విసంజ్ఞా శ్రమణీవ కాచిత్. 5

ప్ర. అ. యా = ఏ సీత, చీరమ్ = నారచీరను, ఆసాద్య = పొంది, కాచిత్ = ఒకానొక, శ్రమణీవ = సన్యాసిని వలె, విసంజ్ఞా = మూర్ఛితురాలై, జనస్య = జనముయొక్క, మధ్యే = మధ్యయందు, స్థితా = నిలబడి యున్నదో, ఇయమ్ = అట్టి, రాజవరస్య కన్యా = రాజశ్రేష్ఠుడైన జనకుని కుమార్తె అయిన,

తపస్వినీ = జాలిపడదగిన సీత, కస్య = ఎవనికి, కించిత్ = ఏ కొంచెము, అపకరోతి = అపకారము చేసినది?

తా. జనకమహారాజు కూతు రైన ఈ సీత ఎవరో ఒక సన్యాసిని వలె నారచీర గట్టి, స్పృహ తప్పి, దీనురా లై జనుల మధ్య ఈ విధముగా నిలిచి యుండుటకు ఈమె ఎవరికి ఏ అపకారము చేసినది? 5

మూ. చీరాణ్యపాస్యా జ్జనకస్య కన్యా
నేయం ప్రతిజ్ఞా మమ దత్తపూర్వా,
యథాసుఖం గచ్ఛతు రాజపుత్రీ
వనం సమగ్రా సహ సర్వరత్నైః. 6

ప్ర. అ. జనకస్య = జనకుని, కన్యా = కూతు రైన సీత, చీరాణి = నారచీరలను, అపాస్యా = విడుచుగాక. ఇయమ్ = ఈ, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, మమ = నాకు, దత్తపూర్వా = పూర్వము ఇవ్వబడినది, న = కాదు. రాజపుత్రీ = సీత, సర్వరత్నైః సహ = సకలరత్నములతో కూడ, సమగ్రా = నిండిన దై, వనమ్ = వనమును గూర్చి, యథాసుఖమ్ = సుఖముగా, గచ్ఛతు = వెళ్ళుగాక.

తా. జనకుని కుమారి యైన ఈ సీత, నారచీరలను ధరింప వలసిన పని లేదు. నేను నీకు ఈ విధముగా ప్రతిజ్ఞ చేసి ఉండలేదు. అందుచే ఈ రాజ పుత్రి సమస్త మైన రత్నములను (ఉత్తమ వస్తువులను) వెంట తీసుకొని వనము నకు సుఖముగా వెళ్ళుగాక. 6

మూ. అజీవనార్హేణ మయా నృశంసా
కృతా ప్రతిజ్ఞా నియమేన తావత్,
త్వయా హి బాల్యాత్ ప్రతిపన్న మేతత్
తన్మాం దహేద్ వేణుమివాత్మపుష్పమ్. 7

ప్ర. అ. అజీవనార్హేణ = జీవించుటకు తగని, మయా = నాచేత, నియమేన = నిర్బంధముచేత, నృశంసా = క్రూర మైన, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, కృతా తావత్ = చేయబడినది, బాల్యాత్ = మూర్ఖత్వము వలన, త్వయా = నీచేత, ఏతత్ = ఇది, ప్రతిపన్నం హి = నిశ్చయింపబడినది కదా? తత్ = అది. వేణుమ్ =

వెదురుకల్లును, ఆత్మపుష్పమ్ ఇవ = తన పుష్పము వలె, మామ్ = నన్ను, దహేత్ = కాల్చివేయును.

తా. జీవించుటకు అర్హత లేని నేను నీ నిర్బంధముచే క్రూరమైన ప్రతిజ్ఞ చేసినాను. నీవు మూర్ఖత్వముతో చేయుచున్న ఈ పని వెదురుకల్లును తన పుష్పమే దహించినట్లు నన్ను దహించివేయగలదు. 7

మూ. రామేణ యది తే పాపే కించిత్కృతమశోభనమ్,
అపకారః క ఇహ తే వైదేహ్యా దర్శితోఽధమే. 8

ప్ర. అ. పాపే = ఓ పాపాత్మురాలా! అధమే = ఓ నీచురాలా! రామేణ = రామునిచేత, తే = నీ విషయమున, కించిత్ = ఏమైన, అశోభనమ్ = కష్టము, కృతం యది = చేయబడినను, వైదేహ్యా = సీతచేత, ఇహ = ఇక్కడ, తే = నీకు, కః = ఏ, అపకారః = అపకారము, దర్శితః = చూపబడినది?

తా. ఓ పాపాత్మురాలా! నీచురాలా! రాముడు నీ కేమైన చెడుగు చేసినాడేమో కాని, సీత నీ కేమి అపకారము చేసినది? 8

మూ. మృగీవోత్ఫుల్లనయనా మృదుశీలా తపస్వినీ,
అపకారం కమిహ తే కరోతి జనకాత్మజా. 9

ప్ర. అ. మృగీవ = ఆడ లేడి వలె, ఉత్ఫుల్లనయనా = వికసించిన నేత్రములు గలదీ, మృదుశీలా = మృదువైన స్వభావముగలదీ, తపస్వినీ = దీనురాలు అయిన, జనకాత్మజా = సీత, ఇహ = ఇచట, తే = నీకు, కమ్ అపకారమ్ = ఏమి అపకారమును, కరోతి = చేయుచున్నది.

తా. ఆడలేడి వలె విశాలమైన నేత్రములు గల ఈ సీత, మృదువైన స్వభావము గలది. జాలి చూపదగినది. అట్టి ఈమె నీకు ఏమి అపకారము చేసినది? 9

మూ. నను పర్యాప్తమేతత్తే పాపే రామవివాసనమ్,
కిమేభిః కృపణైర్భూయః పాతకైరపి తే కృతైః. 10

ప్ర. అ. పాపే = పాపాత్మురాలా, ఏతత్ = ఈ, రామవివాసనమ్ = రాముని వనమునకు పంపుట, తే = నీకు, పర్యాప్తం నను = చాలును కదా! భూయః =

ఇంతను, కృతైః = చేయబడిన, కృపణైః = నీచ మైన, ఏభిః = ఈ, పాతకైరపి = పాతకములచేత కూడ, తే = నీకు, కిమ్ = ఏమి ప్రయోజనము?

తా. పాపాత్మురాలా! నీవు రాముని వనమునకు పంపివేయుచున్నావు. అది చాలక ఇంకను ఈ నీచ మైన పాపములు ఎందుకు చేయుచున్నావు? 10

మూ. ప్రతిజ్ఞాతం మయా తావత్ త్వయోక్తం దేవి శృణ్వతా,
రామం యదభిషేకాయ త్వమిహాగత మబ్రవీః. 11

ప్ర. అ. దేవి = ఓ కైకేయీ! అభిషేకాయ = అభిషేకనిమిత్తము, ఇహ = ఇక్కడికి, ఆగతమ్ = వచ్చిన, రామమ్ = రాముని గూర్చి, త్వమ్ = నీవు, అబ్రవీః = పలికితివో, త్వయా = నీచేత, ఉక్తమ్ = పలుకబడిన దానిని, శృణ్వతా = విన్న, మయా = నాచేత, తావత్ = అంతవరకును, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడినది.

తా. అభిషేకము సందర్భమున రాముడు ఇక్కడికి వచ్చినపుడు నీవు ఆతనితో ఏమి చెప్పినావో అది విని నేను అంత మాత్రమే ప్రతిజ్ఞ చేసితిని. 11

మూ. తత్త్వేతత్సమతిక్రమ్య నిరయం గన్తుమిచ్ఛసి,
మైథిలీమపి యా హి త్వ మీక్షసే చీరవాసినీమ్. 12

ప్ర. అ. యా = ఏ, త్వం = నీవు, తత్ ఏతత్ = దానినంతను, అతిక్రమ్య = అతిక్రమించి, మైథిలీం అపి = సీతనుకూడ, చీరవాసినీం = నారచీరను ధరించినదానినిగా, ఈక్షసే = చూచుచున్నావో, అట్టి నీవు, నిరయం = నరకమును, గన్తుం = వెళ్ళుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

తా. దానికి మించి సీత నారచీర కట్టుకొని యుండగా చూడవలెనని కూడ కోరుచు, నీవు నరకమునకు పోవుచున్నావు. 12

మూ. ఇతీవ రాజా విలపన్మహాత్మా
శోకస్య నాన్తం స దదర్శ కించిత్,
భృశాతురత్వాచ్చ పపాత భూమౌ
తేనైవ పుత్రవ్యసనేన మగ్నః. 13

ప్ర. అ. మహాత్మా = మహాత్ము డైన, సః రాజా = ఆ రాజా, ఇతీవ = ఈ విధముగా, విలపన్ = విలపించుచు, శోకస్య = శోకమునకు, కించిత్ = కొంచెము కూడ, అన్తమ్ = అంతమును, న దదర్శ = చూడలేదు. భృశాతురత్వాచ్చ = మిక్కిలి మానసిక పీడ కలవా డగుటవలన, తేన = ఆ, పుత్రవ్యసనేన ఏవ = పుత్రవ్యసనముచేతనే, మగ్నః = మునిగిపోయినవా డై, భూమౌ = నేలపై, పపాత = పడెను.

తా. ఈ విధముగా విలపించుచున్న ఆ దశరథమహారాజునకు ఆ దుఃఖమునకు ఏ మాత్రము అంతము కనబడలేదు. ఆతడు పుత్రవ్యసనములో మునిగి అత్యధిక మైన మనోవేదనతో నేలపై పడిపోయెను. 13

మూ. ఏవం బ్రువన్తం పితరం రామః సంప్రస్థితో వనం,
అవాక్శిరసమాసీన మిదం వచనమబ్రవీత్. 14

ప్ర. అ. వనమ్ = వనమును గూర్చి, సంప్రస్థితః = ప్రయాణ మైన, రామః = రాముడు, ఏవమ్ = ఈ విధముగా, బ్రువన్తమ్ = పలుకుచున్నవాడూ, అవాక్శిరసమ్ = క్రిందకు వంగిన శిరస్సు కలవాడూ, ఆసీనమ్ = కూర్చున్న వాడూ అయిన, పితరమ్ = తండ్రినిగూర్చి, ఇదం వచనమ్ = ఈ వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. వనమునకు ప్రయాణ మైన ఆ రాముడు, ఈ విధముగా పలుకుచు, తల వంచి కూర్చొని యున్న తండ్రితో ఇట్లనెను. 14

మూ. ఇయం ధార్మిక కౌసల్యా మమ మాతా యశస్వినీ,
వృద్ధా చాక్షుద్రశీలా చ న చ త్వాం దేవ గర్హతే. 15

ప్ర. అ. ధార్మిక = ఓ ధర్మాత్ముడా! దేవ = ఓ రాజా, యశస్వినీ = కీర్తి గలిగినదీ, మమ మాతా = నా తల్లియు అయిన, ఇయమ్ = ఈ, కౌసల్యా = కౌసల్య, వృద్ధా = వృద్ధురాలు. అక్షుద్రశీలా చ = నీచము కాని స్వభావము కలదీ. త్వామ్ = నిన్ను, న చ గర్హతే = నిందించదు కూడ.

తా. ధర్మాత్ముడ వైన ఓ మహారాజా! కీర్తిమంతురా లైన నా తల్లి కౌసల్య వృద్ధురా లైనది. ఈమె నీచస్వభావము కలది కాదు. ఎన్నడును నిన్ను నిందించి ఎరుగదు. 15

మూ. మయా విహీనాం వరద ప్రపన్నాం శోకసాగరమ్,
అదృష్టపూర్వవ్యసనాం భూయస్సమ్మన్తుమర్హసి. 16

ప్ర. అ. వరద = వరములను నిచ్చువాడా! మయా = నాతో, విహీనామ్ = వియోగమును పొందినదీ, శోకసాగరమ్ = దుఃఖసముద్రమును, ప్రపన్నామ్ = పొందినదీ, అదృష్టపూర్వవ్యసనామ్ = పూర్వ మెన్నడును చూడబడని వ్యసనములు కలదీ, అయిన, ఈమెను, భూయః = అధికముగా, సమ్మన్తుమ్ = ఆదరించుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. వరముల నిచ్చు ఓ మహారాజా! పూర్వ మెన్నడును ఇట్టి కష్టములు ఎరుగని ఈమె నేను దూరముగా వెళ్ళిపోవుటచే శోకసముద్రములో మునిగి పోవును. అట్టి ఈమెను ఎక్కువ ఆదరముతో చూడుము. 16

మూ. పుత్రశోకం యథా నర్చ్ఛేత్త్వయా పూజ్యేన పూజితా,
మాం హి సంచిన్తయన్తీ సా త్వయి జీవేత్ తపస్వినీ. 17

ప్ర. అ. తపస్వినీ = దీనురా లైన, సా = ఆమె, మామ్ = నన్ను గూర్చి, సంచిన్తయన్తీ = ఆలోచించుచున్నదై, పుత్రశోకమ్ = పుత్రశోకమును, యథా = ఎట్లు, న ఋచ్ఛేత్ = పొందదో, ఆ విధముగా, పూజ్యేన = పూజ్యుడ వైన, త్వయా = నీచేత, పూజితా = ఆదరింపబడిన దై, త్వయి = నీయందు, జీవేత్ = జీవించును.

తా. నన్ను గూర్చి ఆలోచించుచు ఈమె పుత్రశోకము పొందకుండు నట్టుగా పూజ్యుడ వైన నీవు ఆదరించినచో దీనురా లైన ఈమె నీపై ఆధారపడి జీవించును. 17

మూ. ఇమాం మహేన్ద్రోపమ జాతగర్ధినీం
తథా విధాతుం జననీం మమార్హసి,
యథా వనస్థే మయి శోకకర్శితా
న జీవితం న్యస్య యమక్షయం వ్రజేత్. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టత్రింశః సర్గః.

ప్ర. అ. మహేంద్రోపమ = మహేంద్రునితో సమానమైనవాడా! మయి = నేను, వనస్థే = వనమునం దుండగా, శోకకర్శితా = దుఃఖముచే కృశింపజేయబడినదై, జీవితమ్ = జీవితమును, త్యక్త్వా = విడచి, యథా = ఎట్లు, యమక్షయమ్ = యముని గృహమును, న వ్రజేత్ = వెళ్లకుండునో, తథా = అట్లు, పుత్రగర్ధినీమ్ = పుత్రునియందు అధికప్రేమ గల, ఇమామ్ = ఈ, మమ జననీమ్ = నా తల్లిని, విధాతుమ్ = చేయుటకు, అర్హసి = తగి యున్నావు.

తా. మహేంద్రునితో సమానమైన వాడా! అధికమైన పుత్రప్రేమ గల నా తల్లి, నేను వనమునకు వెళ్లిన పిమ్మట, శోకముచే కృశించి ప్రాణములు విడచి యమలోకమునకు వెళ్లకుండునట్లు చూచుకొనుము. 18

'బాలానందిని' అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పదియెనిమిదవ సర్గ సమాప్తము

# అథ ఏకోనచత్వారింశః సర్గః

[దశరథుని విలాపము. రాజాజ్ఞచే సుమంత్రుడు రామునికై రథమును కొనివచ్చుట, కోశాధిపతి సీతకై అమూల్యవస్త్రములు, ఆభరణముల నిచ్చుట. కౌసల్య సీతకు పతిసేవ నుపదేశించుట, సీత ఆ ఉపదేశమును స్వీకరించుట, శ్రీరాముడు తన తండ్రిని దోషదృష్టితో చూడకు మని తల్లిని ప్రార్థించుట. తక్కిన తల్లులను సెల వడుగుట.]

మూ. రామస్య తు వచః శ్రుత్వా మునివేషధరం చ తమ్,
సమీక్ష్య సహ భార్యాభిః రాజా విగతచేతనః. 1
నైనం దుఃఖేన సంతప్తః ప్రత్యవేక్షత రాఘవమ్,
న చైనమభి సంప్రేక్ష్య ప్రత్యభాషత దుర్మనాః. 2

ప్ర. అ. భార్యాభిః సహ=భార్యలతో కూడిన, రాజా=రాజు, రామస్య=రామునియొక్క, వచః=మాటను, శ్రుత్వా=విని, మునివేషధరమ్=మునివేషము ధరించిన, తమ్=అతనిని, సమీక్ష్య చ=చూచి, విగతచేతనః=తొలగిన చైతన్యము కలవాడై, దుఃఖేన=దుఃఖముచేత, సంతప్తః=తపించినవాడై, ఏనమ్=ఈ, రాఘవమ్=రాముని, న ప్రత్యవేక్షత=చూడలేదు. దుర్మనాః=పీడిత మైన మనస్సు కలవాడై, ఏనమ్=ఈతనిని, అభిసంప్రేక్ష్య=చూచి, న ప్రత్యభాషత చ=బదులు చెప్పలేదు.

తా. ఆ రాముని మాటలు విని, అతనిని మునివేషములో నుండగా చూడగనే దశరథునకును, అతని భార్యలకును, మూర్ఛ వచ్చెను. దుఃఖ సంతప్తుడైన ఆ దశరథుడు, రాముని వైపు చూడలేకపోయెను. దుఃఖముతో నిండిన మనస్సుతో అతడు రాముని ముఖములోనికి చూచి, బదులు చెప్పలేకపోయెను.

మూ. స ముహూర్తమివాసంజ్ఞో దుఃఖితశ్చ మహీపతిః,
విలలాప మహాబాహూ రామమేవానుచిన్తయన్. 3

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు గల, సః మహీపతిః = ఆ రాజు, ముహూర్తమ్ = క్షణకాలము, అసంజ్ఞ ఇవ = సంజ్ఞ లేనివాని వలె నుండి, దుఃఖితశ్చ = దుఃఖితుడై, రామమ్ ఏవ = రామునే, అనుచిన్తయన్ = చింతించుచు, విలలాప = ఏడ్చెను.

తా. ఆజానుబాహు వైన ఆ దశరథుడు కొంచెము సేపు సంజ్ఞ లేక పడి యుండి, దుఃఖించుచు, రాముని గూర్చియే ఆలోచించుచు ఏడ్చెను. 3

మూ. మన్యే ఖలు మయా పూర్వం వివత్సా బహవః కృతాః,
ప్రాణినో హింసితా వాపి తస్మాదిదముపస్థితమ్. 4

ప్ర. అ. మయా = నాచేత, పూర్వమ్ = పూర్వము, బహవః = చాలమంది, వివత్సాః = పిల్లలకు దూర మైన వారుగ, కృతాః = చేయబడినారు. వాపి = లేక, ప్రాణినః = ప్రాణులు, హింసితాః = చంపబడినవి. తస్మాత్ = అందువలననే, ఇదమ్ = ఇది, ఉపస్థితమ్ = వచ్చిన దని, మన్యే ఖలు = తలచు చున్నాను.

తా. పూర్వము నే నెందరినో తమ పిల్లలనుండి విడదీసి యుంటిని, లేదా ప్రాణులను చంపి యుంటిని. అందువలననే ఇది వచ్చి పడినది అనుకొను చున్నాను. 4

మూ. న త్వేవానాగతే కాలే దేహాచ్చ్యవతి జీవితమ్,
కైకేయ్యా క్లిశ్యమానస్య మృత్యుర్మమ న విద్యతే. 5
యోహం పావకసంకాశం పశ్యామి పురతః స్థితమ్,
విహాయ వసనే సూక్ష్మే తాపసాచ్ఛాదమాత్మజమ్. 6

ప్ర. అ. కాలే = కాలము, అనాగతే = రాకుండగా, దేహాత్ = దేహము నుండి, జీవితమ్ = ప్రాణము, న చ్యవతి = జారిపోదు. యః అహమ్ = ఏ నేను, సూక్ష్మే = సన్నని, వసనే = వస్త్రములను, విహాయ = విడచి, తాపసాచ్ఛాదనమ్ = మునివస్త్రములను ధరించిన, పావకసంకాశమ్ = అగ్నితో సమాను డైన, ఆత్మ

జమ్ = కుమారుని, పురతః స్థితమ్ = ఎదుట నిలిచి యుండగా, పశ్యామి = చూచు
చున్నానో, కైకేయ్యా = కైకేయిచేత, క్లిశ్యమానస్య = బాధింపబడుచున్న, మమ =
అట్టి నాకు, మృత్యుః = మృత్యువు, న విద్యతే = లేదు కదా.

తా. కాలము రాకుండ ప్రాణములు దేహము విడిచి వెళ్ళవు. అందు
చేతనే కైకేయిచే ఈ విధముగా పీడింపబడుచున్న నేను అగ్నితో సమానుడైన
కుమారుడు, సన్నని వస్త్రములు విడిచి మునులు ధరించు నారచీరలు ధరించి,
ఎదుట నిలచి యుండగా చూచికూడ మరణించకున్నాను. 6

మూ. ఏకస్యాః ఖలు కైకేయ్యాః కృతేఽయం క్లిశ్యతే జనః,
స్వార్థే ప్రయతమానాయాః సంశ్రిత్య నికృతిం త్విమామ్.

ప్ర. అ. ఇమామ్ = ఈ, నికృతిమ్ = కుట్రను, సంశ్రిత్య = ఆశ్రయించి,
స్వార్థే = స్వప్రయోజనమునకై, ప్రయతమానాయాః = ప్రయత్నించుచున్న,
ఏకస్యాః = ఒక్క, కైకేయ్యాః కృతే = కైకేయి కొరకై, అయం జనః = ఈ జన
మంతయు, క్లిశ్యతే = బాధపడుచున్నది.

తా. ఈ విధముగా కుట్ర పన్ని స్వలాభముకొరకు ప్రయత్నించుచున్న
ఒక్క కైకేయి మూలమున ఈ జను లందరు బాధపడుచున్నారు. 7

మూ. ఏవముక్త్వా తు వచనం బాష్పేణ పిహితేన్ద్రియః,
రామేతి సకృదేవోక్త్వా వ్యాహర్తుం న శశాక హ. 8

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, వచనమ్ = వాక్యము, ఉక్త్వా = పలికి,
బాష్పేణ = బాష్పముచేత, పిహితేన్ద్రియః = కప్పివేయబడిన ఇంద్రియములు
కలవాడై, రామేతి = రామా యని, సకృదేవ = ఒక్క మారే, ఉక్త్వా = పలికి,
వ్యాహర్తుమ్ = మాటలాడుటకు, న శశాక హ = సమర్థుడు కాలేదు.

తా. అతడు ఈ విధముగా పలికి బాష్పము ఇంద్రియములను కప్పి
వేయగా "రామా" అని ఒక్కమారు అని ఇంకేమియు పలుక లేకపోయెను.

మూ. సంజ్ఞాం తు ప్రతిలభ్యైవ ముహూర్తాత్స మహీపతిః,
నేత్రాభ్యామశ్రుపూర్ణాభ్యాం సుమన్త్రమిదమబ్రవీత్. 9

ప్ర. అ. సః మహీపతిః=ఆ రాజు, ముహూర్తాత్=క్షణకాలములో, సంజ్ఞామ్=సంజ్ఞను, ప్రతిలభ్యైవ=పొంది, అశ్రుపూర్ణాభ్యామ్=కన్నీళ్లతో నిండిన, నేత్రాభ్యామ్=నేత్రములతో, సుమంత్రమ్=సుమంత్రుని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. కొంతసేపటికి స్పృహ వచ్చిన ఆ దశరథుడు, కన్నీళ్లు కార్చుచు, సుమంత్రునితో ఇట్లనెను. 9

మూ. ఔపవాహ్యం రథం యుక్త్వా త్వమాయాహి హయోత్తమైః,
ప్రాపయైనం మహాభాగమితో జనపదాత్పరమ్. 10

ప్ర. అ. త్వమ్=నీవు, ఔపవాహ్యమ్=ప్రయాణమునకు తగిన, రథమ్=రథమును, హయోత్తమైః=ఉత్తమమైన అశ్వములతో, యుక్త్వా=కూర్చి, ఆయాహి=రమ్ము. ఏనమ్=ఈ, మహాభాగమ్=గొప్ప భాగ్యవంతుడైన శ్రీరాముని, ఇతః=ఇచ్చటినుండి, జనపదాత్=దేశముకంటె, పరమ్=అవతల నున్న స్థానమును, ప్రాపయ=పొందించుము.

తా. నీవు ప్రయాణమునకు అనుకూలమైన రథమునకు ఉత్తమమైన అశ్వములు కట్టి, తీసుకొనివచ్చి మహాభాగ్యశాలియైన ఈ రాముని ఈ దేశమునకు అవతల నున్న వనమునకు చేర్చుము. 10

మూ. ఏవం మన్యే గుణవతాం గుణానాం ఫలముచ్యతే,
పిత్రా మాత్రా చ యత్సాధుర్వీరో నిర్వాస్యతే వనమ్. 11

ప్ర అ. గుణవతామ్=గుణవంతులయొక్క, గుణానామ్=గుణములకు, ఫలమ్=ఫలము, ఏవమ్=ఈ విధముగనే, ఉచ్యతే=చెప్పబడును అని, మన్యే=తలంచుచున్నాను. యత్=ఏ కారణమువలన, సాధుః=సత్పురుషుడైన, వీరః=వీరుడు, పిత్రా=తండ్రిచేతను, మాత్రా చ=తల్లిచేతను, వనమ్=వనమును గూర్చి, నిర్వాస్యతే=పంపివేయబడుచున్నాడో.

తా. సత్పురుషుడు, వీరుడు అయిన కుమారుని, తల్లిదండ్రులు ఈ నాడు వనమునకు పంపివేయుచున్నారు. గుణవంతునకు మంచి గుణములు ఉన్నందుకు ఇదియే ఫలము అని అనుకొనుచున్నాను. 11

మూ. రాజ్ఞో వచనమాజ్ఞాయ సుమన్త్రః శీఘ్రవిక్రమః,
యోజయిత్వా యయౌ తత్ర రథమశ్వైరలంకృతమ్. 12

ప్ర. అ. రాజ్ఞః = రాజుయొక్క, వచనమ్ = వాక్యమును, ఆజ్ఞాయ = తెలుసుకొని, సుమన్త్రః = సుమంత్రుడు, శీఘ్రవిక్రమః = శీఘ్ర మైన గమనము కలవాడై, అలంకృతమ్ = అలంకరింపబడిన, రథమ్ = రథమును, అశ్వైః = అశ్వములతో, యోజయిత్వా = కూర్చి, తత్ర = అచటికి, ఆయయౌ = వచ్చెను.

తా. సుమంత్రుడు రాజు మాట విని, శీఘ్రముగా నడచి వెళ్లి అలంకరింప బడిన రథమునకు అశ్వములను కట్టి తీసుకొని వచ్చెను. 12

మూ. తం రథం రాజపుత్రాయ సూతః కనకభూషితమ్,
ఆచచక్షేఽఞ్జలిం కృత్వా యుక్తం పరమవాజిభిః. 13

ప్ర. అ. సూతః = సారథి, అఞ్జలిం కృత్వా = దోసిలికట్టి, రాజపుత్రాయ = రాజకుమారునకు, కనకభూషితమ్ = బంగారముచే అలంకరింపబడినదీ, పరమవాజిభిః = ఉత్తమ మైన గుఱ్ఱములతో, యుక్తమ్ = కూడినదీ అయిన, తం రథమ్ = ఆ రథమును గూర్చి, ఆచచక్షే = చెప్పెను.

తా. సుమంత్రుడు రామునకు నమస్కరించి, బంగారముచే అలంకరింప బడిన రథము ఉత్తమ మైన గుఱ్ఱములు కట్టి సిద్ధముగా నున్నట్లు చెప్పెను. 13

మూ. రాజా సత్వరమాహూయ వ్యాపృతం విత్తసంచయే,
ఉవాచ దేశకాలజ్ఞం నిశ్చితం సర్వతః శుచిమ్. 14

ప్ర. అ. రాజా = రాజు, దేశకాలజ్ఞమ్ = దేశకాలములను ఎరిగినవాడూ, నిశ్చితమ్ = నిశ్చయము కలవాడూ, సర్వతః = అన్ని విధములా, శుచిమ్ = పరిశుద్ధ మైనవాడూ అయిన, విత్తసంచయే = కోశగృహమునందు, వ్యాపృతమ్ = పని చేయు చున్న అధికారిని, సత్వరమ్ = తొందరగా, ఆహూయ = పిలచి, ఉవాచ = పలికెను.

తా. దశరథమహారాజు దేశకాలములు తెలిసినవాడూ, నిశ్చిత మైన బుద్ధి కలవాడూ, అన్ని విధముల పరిశుద్ధుడూ (నిజాయితీ కలవాడు) అయిన కోశా గారాధికారిని వెంటనే పిలిపించి ఇట్లు చెప్పెను. 14

మూ. వాసాంసి చ మహార్హాణి భూషణాని వరాణి చ,
వర్షాణ్యేతాని సంఖ్యాయ వైదేహ్యాః క్షిప్రమానయ. 15

ప్ర. అ. ఏతాని=ఈ, వర్షాణి=సంవత్సరములను, సంఖ్యాయ=లెక్కపెట్టి, వైదేహ్యాః=సీతయొక్క, మహార్హాణి=గొప్పమూల్యముగల, వాసాంసి చ=వస్త్రములనూ, వరాణి=శ్రేష్ఠ మైన, భూషణాని చ=అలంకారములనూ, క్షిప్రమ్=శీఘ్రముగా, ఆనయ=తీసికొని రమ్ము.

తా. అరణ్యములో ఎన్ని సంవత్సరము లుండవలెనో ఆ లెక్క ప్రకారము సీతకు కావలసిన అమూల్య మైన వస్త్రములూ, శ్రేష్ఠ మైన అలంకారములూ శీఘ్రముగా తీసికొని రమ్ము. 15

మూ. నరేన్ద్రేణైవముక్తస్తు గత్వా కోశగృహం తతః,
ప్రాయచ్ఛత్సర్వమాహృత్య సీతాయై సమమేవ తత్. 16

ప్ర. అ. నరేన్ద్రేణ=రాజుచేత, ఏవమ్=ఈ విధముగా, ఉక్తః=పలుకబడిన వాడై, తతః=పిమ్మట, కోశగృహమ్=ధనాగారమును గూర్చి, గత్వా=వెళ్లి, సర్వమ్=దానినంతనూ, ఆహృత్య=తీసికొని వచ్చి, తత్=దానిని, సమమేవ=మొత్తముగా, సీతాయై=సీతకు, ప్రాయచ్ఛత్=ఇచ్చెను.

తా. అతడు రాజాజ్ఞ ప్రకారము కోశగృహమునుండి ఆ వస్తువుల నన్నింటిని తీసికొని వచ్చి, ఆ మొత్తమును సీత కిచ్చెను. 16

మూ. సా సుజాతా సుజాతాని వైదేహీ ప్రస్థితా వనమ్,
భూషయామాస గాత్రాణి తైర్విచిత్రైర్విభూషణైః. 17

ప్ర. అ. వనమ్=వనమును గూర్చి, ప్రస్థితా=ప్రయాణ మైన, సుజాతా=సౌందర్యవతి యైన, సా వైదేహీ=ఆ సీత, సుజాతాని=సుందర మైన, గాత్రాణి=అవయవములను, విచిత్రైః=విచిత్రము లైన, తైః విభూషణైః=ఆ అలంకారములచేత, భూషయామాస=అలంకరించెను.

తా. అడవికి ప్రయాణ మైన, సౌందర్యవతి యగు ఆ సీత, విచిత్రము లైన ఆ అలంకారములతో, సుందర మైన తన అవయవములను అలంకరించు కొనెను. 17

మూ. వ్యరాజయత వైదేహీ వేశ్మ తత్సువిభూషితా,
ఉద్యతోంఽశుమతః కాలే ఖం ప్రభేవ వివస్వతః. 18

ప్ర. అ. సువిభూషితా=చక్కగా అలంకరింపబడిన, వైదేహీ=సీత, తత్ వేశ్మ=ఆ గృహమును, కాలే=ప్రాతఃకాలమునందు, ఉద్యతః=ఉదయించుచున్న, వివస్వతః= సూర్యునియొక్క, ప్రభా=కాంతి, ఖమివ = ఆకాశమును వలె, వ్యరాజయత=ప్రకాశింపచేసెను.

తా. చక్కగా అలంకరించుకొనిన సీత ఆ గృహము నంతను, ఉదయించుచున్న సూర్యుని కాంతి ఆకాశమును ప్రకాశింపచేసి నట్లు ప్రకాశింపచేసెను.

మూ. తాం భుజాభ్యాం పరిష్వజ్య శ్వశ్రూర్వచనమబ్రవీత్,
అనాచరన్తీం కృపణం మూర్ధ్న్యుపాఘ్రాయ మైథిలీమ్.

ప్ర. అ. శ్వశ్రూః=అత్తగారైన కౌసల్య, కృపణమ్=దీనముగా, అనాచరన్తీమ్=ప్రవర్తించని, తాం మైథిలీమ్=ఆ సీతను, భుజాభ్యామ్=భుజములచేత, పరిష్వజ్య=కౌగలించుకొని, మూర్ధ్ని=శిరస్సుపై, ఉపాఘ్రాయ=వాసన చూచి, అబ్రవీత్=పలికెను.

తా. అట్టి సమయములో కూడ దైన్యముతో ప్రవర్తించక ఉత్సాహవంతురాలై ఉన్న ఆ సీతను కౌసల్య భుజములతో కౌగలించుకొని, శిరస్సుపై వాసన చూచి ఇట్లు పలికెను. 19

మూ. అసత్యః సర్వలోకేఽస్మిన్ సతతం సత్కృతాః ప్రియైః,
భర్తారం నానుమన్యన్తే వినిపాతగతం స్త్రియః. 20

ప్ర. అ. అస్మిన్=ఈ, సర్వలోకే=సమస్తలోకమునందును, అసత్యః= చెడ్డవారైన, స్త్రియః=స్త్రీలు, ప్రియైః= భర్తలచేత, సతతమ్= ఎల్లప్పుడును, సత్కృతాః=గౌరవింపబడినవారైనను, వినిపాతగతమ్=ఆపదలను పొందిన, భర్తారమ్=భర్తను, నానుమన్యన్తే=అంగీకరించరు (అనుసరించరు).

తా. ఈ లోకములో పాతివ్రత్యము లేని స్త్రీలు, వారిని భర్తలు ఎంతగా గౌరవించుచున్నను, ఆ భర్తలు దుర్దశలో ఉన్నప్పుడు వారిని అవమానింతురు:

మూ. ఏష స్వభావో నారీణామనుభూయ పురా సుఖమ్,
అల్పామప్యాపదం ప్రాప్య దుష్యన్తి ప్రజహత్యపి. 21

ప్ర. అ. పురా = మొదట, సుఖమ్ = సుఖమును, అనుభూయ = అనుభవించి, అల్పామపి = అల్పమే యైనను, ఆపదమ్ = ఆపదను, ప్రాప్య = పొంది, దుష్యన్తి = చెడిపోవుదురు. ప్రజహత్యపి = విడచివేయుదురు కూడ. ఏషః = ఇది, నారీణామ్ = స్త్రీలయొక్క, స్వభావః = స్వభావము.

తా. స్త్రీలు ముందు తా మెంత సుఖ మనుభవించినను, ఏ చిన్న ఆపద వచ్చినను కూడ తాము చెడిపోవుదురు. భర్తను కూడ పరిత్యజింతురు. ఇది స్త్రీల స్వభావము. 21

మూ. అసత్యశీలా వికృతా దుర్గ్రాహ్యహృదయాస్తథా,
యువత్యః పాపసంకల్పాః క్షణమాత్రాద్విరాగిణః. 22

ప్ర. అ. పాపసంకల్పాః = పాప మైన ఆలోచనలు గల, యువత్యః = యువతులు, అసత్యశీలాః = అసత్య మైన శీలము గలవారు. వికృతాః = వికారము చెందువారు. తథా = మరియు, దుర్గ్రాహ్యహృదయాః = గ్రహింప శక్యము కాని హృదయము కలవారు. క్షణమాత్రాత్ = ఒక్క క్షణములో, విరాగిణః = వైరాగ్యము కలవారు.

తా. చెడ్డ ఆలోచనలు గల యువతులకు సత్యము లుండదు. వికృతముగా ప్రవర్తింతురు. వారి హృదయమును ఆకర్షించుట కష్టము. ఒక్క క్షణములో భర్తపై అనురాగము కోల్పోవుదురు. 22

మూ. న కులం న కృతం విద్యా న దత్తం నాపి సంగ్రహః,
స్త్రీణాం గృహ్ణాతి హృదయమనిత్యహృదయా హి తాః.

ప్ర. అ. స్త్రీణామ్ = స్త్రీలయొక్క, హృదయమ్ = హృదయమును, కులమ్ = మంచి కులము, న గృహ్ణాతి = ఆకర్షించదు. కృతమ్ = చేయబడిన ఉపకారము, న = ఆకర్షించదు. విద్యా = విద్య గాని, దత్తమ్ = ఇవ్వబడినది గాని, న = ఆకర్షించదు. సంగ్రహః అపి = ఆదరము కూడ, న = ఆకర్షించదు. తాః = వారు, అనిత్యహృదయాః హి = అస్థిర మైన హృదయము కలవారు గదా.

తా. సత్కులము గాని, ఉపకారము గాని, విద్య గాని, దానము గాని, ఆదరము గాని స్త్రీల హృదయమును ఆకర్షింపజాలదు. వాళ్ల హృదయము అస్థిరము. 23

మూ. సాధ్వీనాం హి స్థితానాం తు శీలే సత్యే శ్రుతే శమే,
స్త్రీణాం పవిత్రం పరమం పతిరేకో విశిష్యతే. 24

ప్ర. అ. తు = కాని, శీలే = శీలమునందూ, సత్యే = సత్యమునందూ, శ్రుతే = శాస్త్రమునందూ, శమే = శాంతియందూ, స్థితానామ్ = స్థిరముగా ఉన్న, సాధ్వీనామ్ = పతివ్రత లైన, స్త్రీణామ్ = స్త్రీలకు, ఏకః = ఒక్క, పతిః = భర్తయే, పరమమ్ = శ్రేష్ఠ మైన, పవిత్రమ్ = పవిత్రవస్తువుగా, విశిష్యతే = విశిష్ట మై ఉండును.

తా. కాని శీలమునందూ, సత్యమునందూ, శాస్త్రమునందూ, శమము, నందూ, స్థిర మైన చిత్తము గల పతివ్రత లైన స్త్రీలకు మాత్రము ఒక్క భర్త యే పరమపవిత్రుడుగా విశిష్టస్థానమును పొంది యుండును. 24

మూ. స త్వయా నావమన్తవ్యః పుత్రః ప్రవ్రాజితో మమ,
తవ దైవతమస్త్వేష నిర్ధనః సధనోఽపి వా. 25

ప్ర. అ. ప్రవ్రాజితః = వనమునకు పంపబడిన, మమ = నాయొక్క, సః పుత్రః = ఆ ఈ పుత్రుడు, త్వయా = నీచేత, నావమన్తవ్యః = అవమానింప దగినవాడు కాడు. నిర్ధనః = ధనము లేనివా డైనను, సధనోపి వా = ధనవంతు డైనను, ఏషః = ఇతడు, తవ = నీకు, దైవమ్ = దేవతగా, అస్తు = అగుగాక.

తా. వనమునకు పంపివేయబడు చున్న నా కుమారుని నీవు అవమానింప కూడదు. ధన మున్నవా డైనను, ధనము లేనివా డైనను, ఇతనిని నీవు దేవతగా చూచుకొనవలెను. 25

మూ. విజ్ఞాయ వచనం సీతా తస్యా ధర్మార్థసంహితమ్,
కృతాఞ్జలిరువాచేదం శ్వశ్రూమభిముఖే స్థితామ్. 26

ప్ర. అ. సీతా = సీత, తస్యాః = ఆమెయొక్క, ధర్మార్థసంహితమ్ = ధర్మార్థములకు అనుకూల మైన, వచనమ్ = మాటను, విజ్ఞాయ = అర్థము చేసు

కొని, కృతాఞ్జలిః = కట్టుకొన్న దోసిలికలదై, అభిముఖే = ఎదుట, స్థితామ్ = ఉన్న, శ్వశ్రూమ్ = అత్తగారిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. సీత ధర్మార్థములు రెండింటికిని అనుగుణముగా నున్న కౌసల్య మాటలు విని బాగుగా అర్థము చేసుకొని నమస్కరించుచు ఎదుట నిలచి ఉన్న అత్తగారితో ఇట్లనెను. 26

మూ. కరిష్యే సర్వమేవాహమార్యా యదనుశాస్తి మామ్,
అభిజ్ఞాస్మి యథా భర్తుర్వర్తితవ్యం శ్రుతం చ మే. 27

ప్ర. అ. ఆర్యా=పూజ్యురాలు, యథా = ఎట్లు, మామ్=నన్ను, అనుశాస్తి=ఆజ్ఞాపించుచున్నదో, ఆ విధముగా, సర్వమేవ=సమస్తమునూ, అహమ్=నేను, కరిష్యే=చేయగలను. భర్తుః=భర్త విషయమున, యథా = ఎట్లు, వర్తితవ్యమ్=ఉండవలెనో, అభిజ్ఞా = తెలిసినదానను, అస్మి=అయితిని. మే=నాకు, శ్రుతం చ=పూర్వము వినబడినది కూడ.

తా. పూజ్యురాలవైన, నీవు ఆజ్ఞాపించిన విధమువనే అంతయు చేసెదను. భర్త విషయమున ఎట్లు ప్రవర్తించవలెనో నాకు తెలియును. నేను పూర్వము కూడ విని ఉన్నాను. 27

మూ. న మామసజ్జనేనార్యా సమానయితుమర్హతి,
ధర్మాద్విచలితుం నాలమహం చన్ద్రాదివ ప్రభా. 28

ప్ర. అ. ఆర్యా=పూజ్యురాలవైన నీవు, మామ్ = నన్ను, అసజ్జనేన= దుష్టజనముతో, సమానయితుమ్=సమానముగా చూచుటకు, న అర్హతి= తగవు. అహమ్ = నేను, ప్రభా=కాంతి, చన్ద్రాదివ=చంద్రునినుండి వలె, ధర్మాత్= ధర్మమునుండి, విచలితుమ్=చలించుటకు, నాలమ్=సమర్థురాలను గాను.

తా. నేను దుష్టస్త్రీల వంటి దాన నని పూజ్యురాల వైన నీవు భావించ కుము. కాంతి చంద్రుని విడువజాల నట్లు నేను ధర్మమును విడువజాలను. 28

మూ. నాతన్త్రీ వాద్యతే వీణా నాచక్రో వర్తతే రథః,
నాపతిః సుఖమేధేత యా స్యాదపి శతాత్మజా. 29

ప్ర. అ. అతన్త్రీ=తీగలు లేని, వీణా=వీణ, న వాద్యతే=మ్రోగదు. అచక్రః=చక్రములు లేని, రథః=రథము, న వర్తతే=నడవదు. యా=ఏ స్త్రీ, అపతిః=భర్త లేనిదో అది, శతాత్మజా=నూర్గురు కుమారులు కలది. స్యాదపి=అయినను, సుఖమ్=సుఖముగా, న ఏధేత=వృద్ధి పొందదు.

తా. తీగలు లేని వీణ మ్రోగదు. చక్రము లేని రథము నడవదు. అట్లే భర్త లేని స్త్రీ నూర్గురు కుమారు లున్నను, సుఖముగా ఉండజాలదు. 29

మూ. మితం దదాతి హి పితా మితం మాతా మితం సుతః,
అమితస్య హి దాతారం భర్తారం కా న పూజయేత్. 30

ప్ర. అ. పితా=తండ్రి, మితమ్=పరిమిత మైనదానినే, దదాతి హి=ఇచ్చును కదా, మాతా=తల్లి, మితమ్=పరిమిత మైనదానినే ఇచ్చును. సుతః=కుమారుడు, మితమ్=పరిమిత మైనదానిని (ఇచ్చును). అమితస్య=అమిత మైనదానిని, దాతారమ్=ఇచ్చు, భర్తారమ్=భర్తను, కా=ఎవతె, న పూజయేత్=పూజించదు.

తా. తండ్రి గాని, తల్లి గాని, కుమారుడు గాని, స్త్రీకి ఇవ్వగలిగినది పరిమిత మైనదే. అపరిమితముగా ఇవ్వగలిగినవాడు భర్త ఒక్కడే. అట్టి భర్తను ఏ స్త్రీ యైన పూజించకుండునా? 30

మూ. సాహమేవంగతా శ్రేష్ఠా శ్రుతధర్మపరావరా,
ఆర్యే కిమవమన్యేయం స్త్రీణాం భర్తా హి దైవతమ్. 31

ప్ర. అ. ఆర్యే=పూజ్యురాలా! ఏవం గతా=ఈ విధముగా ఉన్న దానను, శ్రేష్ఠా=శ్రేష్ఠురాలను, శ్రుతధర్మపరావరా=వినబడిన ధర్మముయొక్క విశేషసామాన్య స్వరూపములు కలదానను అయిన, సా అహమ్=అట్టి నేను, కిమ్=ఎందుకు, అవమన్యేయమ్=అవమానింతును? స్త్రీణామ్=స్త్రీలకు, భర్తా=భర్తయే, దైవతం హి=దేవత కదా.

తా. ఇట్టి ఆలోచనలు కలిగి, ధర్మమునకు సంబంధించిన సామాన్య విషయములను విశేషవిషయములను విని శ్రేష్ఠురాల నై ఉన్న నేను భర్తను ఎట్లు అవమానింతును? స్త్రీలకు భర్తయే దేవత కదా?

వి. సీత తనను తాను శ్రేష్ఠురాలని చెప్పుకొనుట యుక్తము కాదనుకున్నచో "శ్రేష్ఠా శ్రుతధర్మపరావరా" అని ఒక పదముగా తీసికొని" శ్రేష్ఠులైన స్త్రీలనుండి వినబడిన.......... అను అర్థము చెప్పుకొనవచ్చును. ౩౧

మూ. సీతాయా వచనం శ్రుత్వా కౌసల్యా హృదయంగమమ్,
శుద్ధసత్త్వా ముమోచాశ్రు సహసా దుఃఖహర్షజమ్. ౩౨

ప్ర. అ. కౌసల్యా=కౌసల్య, హృదయఙ్గమమ్=మనోహరమైన, సీతాయాః=సీతయొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, శుద్ధసత్త్వా=పరిశుద్ధమైన బుద్ధి గలదై, సహసా=వెంటనే, దుఃఖహర్షజమ్=దుఃఖమువలన ఆనందము వలన కలిగిన, అశ్రు=కన్నీటిని, ముమోచ=విడచెను.

తా. కౌసల్య సీత పల్కిన మనోహరమైన మాటలు విని సంతోషించిన మనస్సు కలదై, వెంటనే దుఃఖాశ్రువులనూ ఆనందాశ్రువులనూగూడ కలిపి ఒక్కసారి విడచెను. ౩౨

మూ. తాం ప్రాఞ్జలిరభిక్రమ్య మాతృమధ్యేఽతిసత్కృతామ్,
రామః పరమధర్మాత్మా మాతరం వాక్యమబ్రవీత్. ౩౩

ప్ర. అ. పరమధర్మాత్మా=మిక్కిలి ధర్మాత్ముడైన, రామః=రాముడు, మాతృమధ్యే=తల్లుల మధ్యయందు, అతిసత్కృతామ్=మిక్కిలి పూజింపబడిన, తామ్=ఆ, మాతరమ్=తల్లిని, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, అభిక్రమ్య=ప్రదక్షిణము చేసి, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. పరమధర్మాత్ముడైన రాముడు తల్లులందరిలో ఎక్కువ సత్కారము అందుచున్న ఆ తల్లికి ప్రదక్షిణము చేసి, నమస్కరించి, ఇట్లు పలికెను.

మూ. అమ్బ మా దుఃఖితా భూస్త్వం పశ్య త్వం పితరం మమ,
క్షయో హి వనవాసస్య క్షిప్రమేవ భవిష్యతి. ౩౪

ప్ర. అ. అమ్బ=అమ్మా, త్వమ్=నీవు, దుఃఖితా=దుఃఖితురాలవు, మా భూః=కాకుము. త్వమ్=నీవు, మమ పితరమ్=నా తండ్రిని, పశ్య=చూచుకొనుచుండుము. వనవాసస్య=వనవాసముయొక్క, క్షయః=అంతము, క్షిప్రమేవ=శీఘ్రముగానే, భవిష్యతి=కాగలదు.

తా. అమ్మా! నీవు దుఃఖింపకుము. తండ్రిగారిని చూచుకొనుచుండుము. వనవాసము తొందరగానే ముగియగలదు. ౩౪

మూ. సుప్తాయాస్తే గమిష్యన్తి నవ వర్షాణి పఞ్చ చ,
సా సమగ్రమిహ ప్రాప్తం మాం ద్రక్ష్యసి సుహృద్వృతమ్.

ప్ర. అ. తే = నీవు, సుప్తాయాః = నిద్రించుచుండగా, నవ పఞ్చ చ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, గమిష్యన్తి = గడచి పోవును. సా = అట్టి నీవు, ఇహ = ఇచటికి, సంప్రాప్తమ్ = వచ్చిన, సుహృద్వృతమ్ = మిత్రులతో కూడిన, సమగ్రమ్ = సంపూర్ణుడ వైన, మామ్ = నన్ను, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. పదునాల్గు సంవత్సరములును నీ నిద్రలో గడచినట్లు, గడచిపోవును. నేను మిత్రసమేతుడ నై, ప్రతిజ్ఞ పూర్తి చేసికొని వచ్చెదను. నీవు చూడగలవు.

మూ. ఏతావదభినీతార్థముక్త్వా స జననీం వచః,
త్రయః శతశతార్ధాశ్చ దదర్శావేక్ష్య మాతరః. ౩౫

ప్ర. అ. సః = అతడు, అభినీతార్థమ్ = నిశ్చిత మైన అర్థము గల, ఏతావత్ = ఇంత మాత్రము, వచః = వాక్యమును, ఉక్త్వా = పలికి, అవేక్ష్య = మరల ఆలోచించి, త్రయః శతశతార్ధాః = మూడు వందల ఏబదిమంది, మాతరః చ = తల్లులను గూడ, దదర్శ = చూచెను.

తా. రాము డీ విధముగ తల్లితో నిశ్చిత ముగు అర్థము గల వాక్యము పలికి, ఆలోచించి, మూడు వందల ఏబదిమంది తల్లులను చూచెను. ౩౬

మూ. తాశ్చాపి స తథైవార్తా మాతౄర్దశరథాత్మజః,
ధర్మయుక్తమిదం వాక్యం నిజగాద కృతాఞ్జలిః. ౩౭

ప్ర. అ. సః = ఆ, దశరథాత్మజః = రాముడు, తథైవ = అట్లే, ఆర్తాః = దుఃఖిత లైన, తాః = ఆ, మాతౄరపి = తల్లులను గూర్చి గూడ, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవా డై, ధర్మయుక్తమ్ = ధర్మముతో గూడిన, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, నిజగాద = పలికెను.

తా. రాముడు కౌసల్యవలెనే దుఃఖించుచున్న ఆ తల్లు లందరికిని నమస్కరించి ధర్మయుక్తమైన వాక్యమును పలికెను. 37

మూ. సంవాసాత్పరుషం కిఞ్చిదజ్ఞానాద్వాపి యత్కృతమ్,
తన్మే సముపజానీత సర్వాశ్చామన్త్రయామి వః. 38

ప్ర. అ. సంవాసాత్ = కలిసి నివసించుటవలనగాని, అజ్ఞానాద్వా = అజ్ఞానమువలన గాని, కిఞ్చిత్ = ఏదైన, యత్ = ఏ, పరుషమ్ = పరుషమైన కార్యము, కృతమ్ = చేయబడినదో, మే = నాయొక్క, తత్ = దానిని, సముపజానీత = మన్నించండి. వః = మిమ్ములను, సర్వాః = అందరిని, ఆమన్త్రయామి = అనుజ్ఞ కోరుచున్నాను.

తా. చిరపరిచయము వలన గాని, అజ్ఞానమువలన గాని నేనేమైన తప్పు చేసినచో దానిని మన్నించండి. మీ అందరి దగ్గర సెలవు తీసుకొనుచున్నాను. 38

మూ. వచనం రాఘవస్యైతద్ధర్మయుక్తం సమాహితమ్,
శుశ్రువుస్తాః స్త్రియః సర్వాః శోకోపహతచేతసః. 39

ప్ర. అ. తాః = ఆ, సర్వాః = సమస్తమైన, స్త్రియః = స్త్రీలు, రాఘవస్య = రాముని యొక్క, ధర్మయుక్తమ్ = ధర్మముతో కూడినదీ, సమాహితమ్ = చక్కగా చెప్పబడినదీ అయిన, ఏతత్ = ఈ, వచనమ్ = వచనమును, శోకోపహతచేతసః = శోకముచే కొట్టబడిన చిత్తము గలవారై, శుశ్రువుః = వినిరి.

తా. ఆ స్త్రీలందరును ధర్మయుక్తమగు రామవచనమును శోకాక్రాంత చిత్తలై వినిరి. 39

మూ. జజ్ఞేఽథ తాసాం సన్నాదః క్రౌఞ్చీనామివ నిస్వనః,
మానవేన్ద్రస్య భార్యాణామేవం వదతి రాఘవే. 40

ప్ర. అ. రాఘవే = రాముడు, ఏవమ్ = ఇట్లు, వదతి = చెప్పుచుండగా, అథ = పిమ్మట, తాసామ్ = ఆ, మానవేన్ద్రస్య భార్యాణామ్ = రాజభార్యలయొక్క, సన్నాదః = ధ్వని, క్రౌఞ్చీనామ్ = క్రౌంచపక్షుల, నిస్వనః ఇవ = ధ్వని వలె, జజ్ఞే = కలిగెను.

తా. రాము డిట్లు పలుకగనే ఆ రాజభార్య లందరును క్రౌంచపక్షులు అరచి నట్లు ఏడ్చిరి. 40

మూ. మురజపణవమేఘఘోషవ
ద్దశరథవేశ్మ బభూవ యత్పురా,
విలపితపరిదేవనాకులం
వ్యసనగతం తదభూత్సుదుఃఖితమ్. 41

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకోనచత్వారింశః సర్గః.

ప్ర. అ. యత్ = ఏ, దశరథవేశ్మ = దశరథుని గృహము, పురా = పూర్వమునందు, మురజపణవమేఘఘోషవత్ = మురజములయొక్కయు, పణవములయొక్క మేఘఘోషమువంటి ఘోషము కలదిగా ఉండెనో, తత్ = అది, విలపితపరిదేవనాకులమ్ = విలాపములతోను, ఏడ్పులతోను వ్యాకులమై, వ్యసనగతమ్ = వ్యసనములో చిక్కినదై, సుదుఃఖితమ్ = మిక్కిలి దుఃఖించినదై, అభూత్ = అయెను.

తా. పూర్వము మేఘధ్వనివంటి మురజపణవాదివాద్యముల ధ్వనులతో మారుమ్రోగుతుండెడి దశరథగృహము, వ్యసనములలో చిక్కి, ఏడ్పులతోను, పెడబొబ్బలతోను నిండి దుఃఖాకులమైనది. 41

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ముప్పదితొమ్మిదవ సర్గ సమాప్తము.

## అథ చత్వారింశః సర్గః

[సీతారామలక్ష్మణులు దశరథునకు ప్రదక్షిణ మొనర్చి కౌసల్యకు వందన మాచరించుట. సుమిత్ర లక్ష్మణున కుపదేశము చేయుట. సీతారామలక్ష్మణులు రథముపై నెక్కి వనమునకు బయలుదేరుట, పౌరులు, రాణులు, రాజు శోకముతో కలత నొందుట.]

మూ. అథ రామశ్చ సీతా చ లక్ష్మణశ్చ కృతాఞ్జలిః,
ఉపసంగృహ్య రాజానం చక్రుర్దీనాః ప్రదక్షిణమ్. 1

ప్ర. అ. అథ = అటుపిమ్మట, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి గల, రామశ్చ = రాముడును, సీతా చ = సీతయు, లక్ష్మణశ్చ = లక్ష్మణుడును, రాజానమ్ = రాజును, ఉపసంగృహ్య = పాదములు స్పృశించి, దీనాః = దీనులై, ప్రదక్షిణం చక్రుః = ప్రదక్షిణము చేసిరి.

తా. పిదప సీతారామలక్ష్మణులు అంజలులు ఘటించి, దీనులై రాజు పాదములు స్పృశించి నమస్కరించి ప్రదక్షిణము చేసిరి. 1

మూ. తం చాపి సమనుజ్ఞాప్య ధర్మజ్ఞః సీతయా సహ,
రాఘవః శోకసంమూఢో జననీమభ్యవాదయత్. 2

ప్ర. అ. ధర్మజ్ఞః = ధర్మము తెలిసిన, రాఘవః = రాముడు, సీతయా సహ = సీతతో కూడ, తమ్ = దశరథుని, సమనుజ్ఞాప్య = అనుమతింపచేసి, శోకసంమూఢః = దుఃఖముతో మోహము చెంది, జననీమ్ = తల్లిని, అభ్యవాదయత్ = నమస్కరించెను.

తా. ధర్మము నెరిగిన రాముడును, సీతయు దశరథుని అనుమతి పొందిన పిమ్మట దుఃఖాక్రాంతులై, కౌసల్యకు నమస్కరించిరి. 2

మూ. అన్వక్షం లక్ష్మణో భ్రాతుః కౌసల్యామభ్యవాదయత్,
అథ మాతుః సుమిత్రాయా జగ్రాహ చరణౌ పునః. 3

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, భ్రాతుః = సోదరునకు, అన్వక్షమ్ = వెంటనే, కౌసల్యామ్ = కౌసల్యను, అభ్యవాదయత్ = నమస్కరించెను. అథ = పిమ్మట, మాతుః = తల్లి యైన, సుమిత్రాయాః = సుమిత్రయొక్క, చరణౌ = పాదములను, పునః = మరల, జగ్రాహ = పట్టుకొనెను.

తా. రాముడు కౌసల్యకు నమస్కారము చేసిన పిమ్మట లక్ష్మణుడు కూడ, ఆమెకు నమస్కారము చేసి, పిదప తన తల్లి యైన సుమిత్రకు పాదములు స్పృశించి నమస్కరించెను. 3

మూ. తం వన్దమానం రుదతీ మాతా సౌమిత్రిమబ్రవీత్,
హితకామా మహాబాహుం మూర్ధ్న్యుపాఘ్రాయ లక్ష్మణమ్.

ప్ర. అ. మాతా = తల్లి, వన్దమానమ్ = నమస్కరించుచున్నవాడూ, సౌమిత్రిమ్ = తన కుమారుడూ, మహాబాహుమ్ = గొప్ప బాహువులు కలవాడూ అయిన, లక్ష్మణమ్ = లక్ష్మణుని, మూర్ధ్ని = శిరస్సుపై, ఉపాఘ్రాయ = వాసన చూచి, రుదతీ = ఏడ్చుచు, హితకామా = అతని హితమును కోరుచు. అబ్రవీత్ = పలికెను.

తా. తల్లి యైన సుమిత్ర ఆ విధముగా నమస్కరించుచున్న తన కుమారు డైన అజానుబాహు వగు లక్ష్మణుని శిరస్సుపై వాసన చూచి, ఏడ్చుచు అతని హితమును కోరుచున్న దై ఇట్లు పలికెను. 4

మూ. సృష్టస్త్వం వనవాసాయ స్వనురక్తః సుహృజ్జనే,
రామే ప్రమాదం మా కార్షీః పుత్ర భ్రాతరి గచ్ఛతి. 5

ప్ర. అ. పుత్ర = కుమారా! సుహృజ్జనే = స్నేహితుల విషయమున, స్వనురక్తః = మిక్కిలి ప్రేమ గల నీవు, వనవాసాయ = వనవాసముకొరకే, సృష్టః = సృష్టింపబడితివి, గచ్ఛతి = అరణ్యమునకు వెళ్లుచున్న, భ్రాతరి = సోదరు డైన, రామే = రాముని విషయమున, ప్రమాదమ్ = ఏమరుపాటును, మా కార్షీః = చేయకుము.

తా. కుమారా! మిత్రులపై నీ కున్న ప్రేమ అపరిమితము. నిన్ను భగవంతుడు వనవాసము కొరకే సృష్టించి నట్లున్నది. ఏ మాత్రము ఏమరుపాటు లేకుండ సోదరు డైన రాముని అరణ్యవాసమునందు కాపాడుచుండుము.

వి. "సృష్ట"! అనుదానికి "పంపబడుచున్నావు- అనుమతింపబడితివి" అను అర్థము గ్రహించి 'నీవు అరణ్యమునకు వెళ్లుటకు అనుమతించుచున్నాను'. అను భావము చెప్పవచ్చును. 5

మూ. వ్యసనీ వా సమృద్ధో వా గతిరేష తవానఘ,
ఏష లోకే సతాం ధర్మో యజ్జ్యేష్ఠవశగో భవేత్. 6

ప్ర. అ. అనఘ = దోషములు లేనివాడా! వ్యసనీ వా = వ్యసనముకలవాడైనను, సమృద్ధో వా = ఐశ్వర్యవంతు డైనను, ఏషః = ఇతడే, తవ = నీకు, గతిః = గతి, జ్యేష్ఠవశగః = జ్యేష్ఠు డగు సోదరుని అధీనములో నున్నవాడుగా, భవేత్ ఇతి యత్ = కావలెను అను, ఏషః = ఇది, లోకే = లోకమునందు, సతామ్ = సత్పురుషుల, ధర్మః = ధర్మము.

తా. దోషము లేనియు లేని ఓ రాజకుమారా! కష్టములలో ఉన్నను, ఐశ్వర్యవంతు డై ఉన్నను, ఈ రాముడే నీకు పరమగతి. పెద్ద సోదరుని అనుసరించి ఉండుట అను పనే, లోకములో సత్పురుషులకు సమ్మత మైన ధర్మము.

మూ. ఇదం హి వృత్తముచితం కులస్యాస్య సనాతనమ్,
దానం దీక్షా చ యజ్ఞేషు తనుత్యాగో మృధేషు చ. 7

ప్ర. అ. దానమ్ = దానము, యజ్ఞేషు = యజ్ఞములందు, దీక్షా చ = దీక్ష వహించుట, మృధేషు = యుద్ధములందు, తనుత్యాగః చ = దేహమును విడుచుట అను, ఇదమ్ = ఇదియే, అస్య = ఈ, కులస్య = కులమునకు, ఉచితమ్ = తగిన, సనాతనమ్ = అతి ప్రాచీన మైన, వృత్తం హి = చరితము కదా.

తా. దానములు చేయుట, దీక్ష వహించి యజ్ఞములు చేయుట, యుద్ధములలో దేహములను పరిత్యజించుట అనునవి ఈ కులములో ప్రాచీనకాలము నుండియు వచ్చుచున్న పద్ధతి కదా!

మూ. లక్ష్మణం త్వేవముక్త్వా సా సంసిద్ధం ప్రియరాఘవమ్,
సుమిత్రా గచ్ఛ గచ్ఛేతి పునః పునరువాచ తమ్. 8

ప్ర. అ. సా=ఆ, సుమిత్రా=సుమిత్ర, ప్రియరాఘవమ్ = ఇష్టుడైన రాముడు గల, సంసిద్ధమ్ = సిద్ధముగా నున్న, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, గచ్ఛ = వెళ్లుము, ఇతి = అని, తమ్ = వానిని గూర్చి, పునః పునః = మాటి మాటికిని, ఉవాచ = పలికెను.

తా. రామునియందు అధిక మైన స్నేహము గల ఆ లక్ష్మణునితో సుమిత్ర ఈ విధముగ పలికి, "వెళ్లుము వెళ్లుము" అని మాటి మాటికిని పలికెను. 8

మూ. రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్,
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్. 9

ప్ర. అ. రామమ్ = రాముని, దశరథమ్=దశరథునిగా, విద్ధి = తెలుసుకొనుము. జనకాత్మజామ్ = సీతను, మామ్ = నన్నుగా, విద్ధి = తెలుసుకొనుము. అటవీమ్=అడవిని, అయోధ్యామ్=అయోధ్యనుగా, విద్ధి = తెలుసుకొనుము. తాత = తండ్రీ, యథాసుఖమ్ = సుఖముగా గచ్ఛ = వెళ్లుము.

తా. రాముడే దశరథు డని భావింపుము. సీతయే నే నని భావింపుము. అడవి అయోధ్య యని భావింపుము. నాయనా! సుఖముగా వెళ్లుము.

వి. ఇతర వ్యాఖ్యాతలు కొన్ని విశేషార్థములు చెప్పి యున్నారు. రాముని, దశరథమ్=పక్షి రథముగా గల విష్ణువు గాను, సీతను, మామ్ = లక్ష్మిని గాను, అడవిని, అయోధ్యామ్ = యుద్ధము చేయ శక్యముగాని వైకుంఠము గాను భావింపుము అనునది ఒక అర్థము. "రాముడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు. సీత లక్ష్మి. రాముడు నివసించు అడవియే వైకుంఠము" అని దీని భావము. 9

మూ. తతః సుమన్త్రః కాకుత్స్థం ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్,
వినీతో వినయజ్ఞశ్చ మాతలిర్వాసవం యథా. 10

ప్ర. అ. తతః = పిమ్మట, వినీతః = వినయవంతుడూ, వినయజ్ఞః = వినయము తెలిసినవాడూ అయిన, సుమన్త్రః = సుమంత్రుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన చేతులు కలవాడై, మాతలిః = మాతలి, వాసవం యథా = దేవేంద్రుని గూర్చి వలె, కాకుత్స్థమ్ = రాముని గూర్చి, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిదప, వినయవంతుడూ, వినయము (మర్యాద) తెలిసినవాడూ అయిన సుమంత్రుడు నమస్కరించి మాతలి దేవేంద్రునితో పలికినట్లు రామునితో ఇట్లు పలికెను. 10

మూ. రథమారోహ భద్రం తే రాజపుత్ర మహాయశః,
క్షిప్రం త్వాం ప్రాపయిష్యామి యత్ర మాం రామ వక్ష్యసి.

ప్ర. అ. రాజపుత్ర = రాజకుమారా, మహాయశః = గొప్ప కీర్తి గల, రథం = రథమును, ఆరోహ = ఎక్కుము. తే = నీకు, భద్రమ్ = మంగళ మగుగాక, యత్ర = ఎచటికి, వక్ష్యసి = చెప్పెదవో అచటికి, త్వామ్ = నిన్ను, క్షిప్రమ్ = శీఘ్రముగా, ప్రాపయిష్యామి = పొందించెదను.

తా. గొప్ప కీర్తిగల ఓ రాజకుమారా! ఓ రామా! నీకు క్షేమ మగుగాక! రథమును ఎక్కుము. నీవు ఎక్కడికి వెళ్లవలె నని చెప్పెదవో అక్కడికి శీఘ్రముగా నిన్ను తీసుకొని వెళ్లెదను. 11

మూ. చతుర్దశ హి వర్షాణి వస్తవ్యాని వనే త్వయా,
తాన్యుపక్రమితవ్యాని యాని దేవ్యాసి చోదితః. 12

ప్ర. అ. చతుర్దశ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, త్వయా = నీచేత, వనే = వనమునందు, వస్తవ్యాని = నివసింప దగినవి. యాని = ఏ సంవత్సరములను గూర్చి, దేవ్యా = కైకేయి చేత, చోదితః అసి = ప్రేరేపింపబడితివో, తాని = అవి, ఉపక్రమితవ్యాని = ప్రారంభింపదగినవి.

తా. నీవు పదునాలుగు సంవత్సరములు అరణ్యములో ఉండవలెను కదా. కైకేయి ఆజ్ఞాపించిన విధముగ ఆ సంవత్సరములు నీవు ప్రారంభింపవలెను.

మూ. తం రథం సూర్యసంకాశం సీతా హృష్టేన చేతసా,
ఆరురోహ వరారోహా కృత్వాలంకారమాత్మనః. 13

ప్ర. అ. వరారోహా = సుందర మైన కటిప్రదేశము గల, సీతా = సీత, ఆత్మనః = తనకు, అలంకారమ్ = అలంకారమును, కృత్వా = చేసికొని, హృష్టేన = సంతోషించిన, చేతసా = చిత్తముతో, సూర్యసంకాశమ్ = సూర్యునితో సమాన మైన, తం రథమ్ = ఆ రథమును, ఆరురోహ = ఎక్కెను.

తా. సుందరాంగి యైన సీత, అలంకరించుకొని, సంతోషించుచున్న మనస్సుతో సూర్యుని వలె ప్రకాశించుచున్న ఆ రథమును ఎక్కెను. 13

మూ. అథో జ్వలనసంకాశం చామీకరవిభూషితమ్,
తమారురుహతుస్తూర్ణం భ్రాతరౌ రామలక్ష్మణౌ. 14

ప్ర. అ. అథో = అటు పిమ్మట, భ్రాతరౌ = సోదరు లైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, జ్వలనసంకాశమ్ = పైకి లేచిన అగ్నితో సమాన మైన, చామీకరవిభూషితమ్ = బంగారముచే అలంకరింపబడిన, తమ్ = రథమును, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆరురుహతుః = ఎక్కిరి.

తా. పిమ్మట రామలక్ష్మణులు కూడ, బంగారముచే అలంకరింపబడి, మండుచున్న అగ్ని వలె ప్రకాశించుచున్న ఆ రథమును శీఘ్రముగా ఎక్కిరి.

మూ. వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణాని చ,
భర్తారమనుగచ్ఛన్త్యై సీతాయై శ్వశురో దదౌ. 15

ప్ర. అ. శ్వశురః = మామగా రైన దశరథుడు, భర్తారమ్ = భర్తను, అనుగచ్ఛన్త్యై = అనుసరించి వెళ్ళుచున్న, సీతాయై = సీతకొరకు, వనవాసమ్ = వనములో నివసింపవలసిన కాలమును, సంఖ్యాయ = లెక్కపెట్టి, వాసాంసి = వస్త్రములను, ఆభరణాని చ = ఆభరణములను, దదౌ = ఇచ్చెను.

తా. భర్తను అనుసరించి వెళ్ళుచున్న సీతకొరకై దశరథుడు ఆమె వనములో ఎంత కాలము ఉండవలెనో లెక్క చూచి, వస్త్రములను ఆభరణములను ఇచ్చెను. 15

మూ. తథైవాయుధజాలాని భ్రాతృభ్యాం కవచాని చ,
రథోపస్థే ప్రతిన్యస్య సచర్మ కఠినం చ తత్. 16

ప్ర. అ. తత్ పురమ్ = ఆ పట్టణము, మత్తసంకులితద్విపమ్ = మదించి చెలరేగిన ఏనుగులు కలది, హయశిక్షితనిర్ఘోషమ్ = గుఱ్ఱముల సకిలింపుల ధ్వని కలది, మహాస్వనమ్ = గొప్ప ధ్వనితో నిండినది అయి, ఆకులసంభ్రాన్తమ్ = వ్యాకులమై, కంగారుపడినదిగా, ఆసీత్ = ఆయెను.

తా. అపు డా పట్టణములో గజములు మదించి, కోపముతో చెలరేగినవి. గుఱ్ఱములు సకిలించుట ప్రారంభించినవి. ఈ విధముగ గొప్ప ధ్వనితో, ఆ పట్టణ మంతయు వ్యాకులమై పోయినది. 19

మూ. తతః సబాలవృద్ధా సా పురీ పరమపీడితా,
రామమేవాభిదుద్రావ ఘర్మార్తః సలిలం యథా. 20

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సబాలవృద్ధా = బాలురతోను, వృద్ధులతోను కూడిన, సా పురీ = ఆ పట్టణము, పరమపీడితా = మిక్కిలి పీడింపబడినదై, ఘర్మార్తః = ఎండచే పీడింపబడినవాడు, సలిలం యథా = నీటిని గూర్చి వలె, రామమ్ ఏవ = రామునే, అభిదుద్రావ = అనుసరించి పరుగెత్తెను.

తా. పిమ్మట బాలవృద్ధాదిసహితముగా ఆ పట్టణములోని జను లందరు మిక్కిలి దుఃఖితులై, ఎండకు బాధపడువాడు నీటివైపు పరుగెత్తునట్లు, రాముని వైపే పరుగెత్తిరి. 20

మూ. పార్శ్వతః పృష్ఠతశ్చైవ లమ్బమానాస్తదున్ముఖాః,
బాష్పపూర్ణముఖాః సర్వే తమూచుర్భృశనిస్వనాః. 21

ప్ర. అ. సర్వే = ఆ జను లందరును, పార్శ్వతః = రాముని ప్రక్కలందును, పృష్ఠతశ్చైవ = వెనుకను, లమ్బమానాః = వ్రేలాడుచు, తదున్ముఖాః = అతని వైపు ముఖము కలవారై, బాష్పపూర్ణముఖాః = కన్నీటితో నిండిన ముఖములు కలవారై, భృశనిస్వనాః = అధికమైన ధ్వని కలవారగుచు, తమ్ = అతనిని గూర్చి, ఊచుః = పలికిరి.

తా. ఆ జను లందరు రామునికి ప్రక్కను వెనుకను గూడి గూడి అతనికి అభిముఖులై, కన్నీళ్లతో నిండిన ముఖములతో, గట్టిగా ధ్వని చేయుచు ఇట్లు పలికిరి. 21

మూ. సంయచ్ఛ వాజినాం రశ్మీన్ సూత యాహి శనైశ్శనైః,
ముఖం ద్రక్ష్యామ రామస్య దుర్దర్శం నో భవిష్యతి. 22

ప్ర. అ. సూత = ఓ సారథీ! వాజినామ్ = గుఱ్ఱములయొక్క, రశ్మీన్ = కళ్లెములను, సంయచ్ఛ = లాగుము. శనైః శనైః = మెల్లమెల్లగా, యాహి = వెళ్ళుము. రామస్య = రామునియొక్క, ముఖమ్ = ముఖమును, ద్రక్ష్యామః = చూచెదము. నః = మాకు, దుర్దర్శమ్ = చూడ శక్యము గానిది, భవిష్యతి = కాగలదు.

తా. ఓ సారథీ! గుఱ్ఱముల కళ్లెములను లాగి మెల్లగా వెళ్లుము. మేము రాముని ముఖమును చూడవలెను. ఇటుపై దీనిని చూచుటకు మాకు శక్యము కాదు. 22

మూ. ఆయసం హృదయం నూనం రామమాతురసంశయమ్,
యద్దేవగర్భప్రతిమే వనం యాతి న భిద్యతే. 23

ప్ర. అ. దేవగర్భప్రతిమే = దేవతాకుమారునితో సమానుడైన రాముడు, వనమ్ = వనమును గూర్చి, యాతి = వెళ్ళుచుండగా, యత్ = ఏ కారణము వలన, న భిద్యతే = బ్రద్దలగుట లేదో అందువలన, నూనమ్ = నిశ్చయముగా, రామమాతుః = రాముని తల్లి యైన కౌసల్యయొక్క, హృదయమ్ = హృదయము, ఆయసమ్ = ఇనుముతో చేసినది. అసంశయమ్ = సంశయము లేదు.

తా. దేవతాకుమారుని వంటి కుమారుడు అరణ్యమునకు వెళ్లుచున్నను, కౌసల్య హృదయము బ్రద్దలు కాలేదు. నిజముగా అది ఇనుముతో చేసినది. 23

మూ. కృతకృత్యా హి వైదేహీ ఛాయేవానుగతా పతిమ్,
న జహాతి రతా ధర్మే మేరుమర్కప్రభా యథా. 24

ప్ర. అ. ధర్మే = ధర్మమునందు, రతా = ఆసక్తురాలై, ఛాయేవ = నీడ వలె, అనుగతా = అనుసరించి వెళ్లెడు, వైదేహీ = సీత, అర్కప్రభా = సూర్యుని కాంతి, మేరుమ్ ఇవ = మేరుపర్వతమును వలె, పతిమ్ = భర్తను, న జహాతి = విడుచుటలేదు. కృతకృత్యా హి = ఆమె కృతార్థురాలు కదా!

తా. సీత ధర్మపరతురాలై, సూర్యుని కాంతి మేరుపర్వతమును విడువ కుండునట్లు, భర్తను విడువకుండా అతనిని నీడ వలె అనుసరించుచు, వెళ్లు చున్నది. ఆమె కృతార్థురాలు. 24

మూ. అహో! లక్ష్మణ సిద్ధార్థః సతతం ప్రియవాదినమ్,
భ్రాతరం దేవసంకాశం యస్త్వం పరిచరిష్యసి. 25

ప్ర. అ. లక్ష్మణ = లక్ష్మణా! యః త్వమ్ = ఏ నీవు, ప్రియవాదినమ్= ప్రియముగా మాటలాడువాడు, దేవసంకాశమ్=దేవతలతో సమానుడు అయిన, భ్రాతరమ్ = సోదరుని, సతతమ్=ఎల్లప్పుడును, పరిచరిష్యసి = సేవించగలవో, అట్టి నీవు, సిద్ధార్థః = కృతార్థుడవు, అహో = ఆహా!

తా. ఓ లక్ష్మణా! ప్రియమును పలుకువాడూ, దేవతాతుల్యుడూ అయిన నీ సోదరునికి, సర్వదా సేవ చేయుచున్నావు. నీవు ఎంత అదృష్టవంతుడవు! 25

మూ. మహత్యేషా హి తే సిద్ధిరేష చాభ్యుదయో మహాన్,
ఏష స్వర్గస్య మార్గశ్చ యదేనమనుగచ్ఛసి 26

ప్ర. అ. ఏనమ్ = ఈ రాముని, అనుగచ్ఛసి ఇతి యత్ = అనుసరించు చున్నావు అనునది యేది కలదో, ఏషా = యిది, తే = నీకు, మహతీ = గొప్ప దైన, సిద్ధిః = సిద్ధి. ఏషః = ఇది, మహాన్ = గొప్ప దైన, అభ్యుదయః = అభి వృద్ధి. ఏషః = ఇది. స్వర్గస్య=స్వర్గమునకు, మార్గశ్చ = మార్గము కూడ.

తా. నీవు రాముని అనుసరించి వెళ్ళుటయే గొప్పసిద్ధి. ఇదియే గొప్ప అభివృద్ధి. ఇదియే స్వర్గమార్గము. 26

మూ. ఏవం వదన్తస్తే సోఢుం న శేకుర్బాష్పమాగతమ్,
నరాస్తమనుగచ్ఛన్తః ప్రియమిక్ష్వాకునన్దనమ్. 27

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, వదన్తః = పలుకుచు, ఇక్ష్వాకునన్దనమ్ = ఇక్ష్వాకువంశమునకు ఆనందకరు డైన, ప్రియమ్ = తమకు ప్రేమపాత్రు డైన, తమ్ = ఆ రాముని, అనుగచ్ఛన్తః = అనుసరించుచున్న, తే నరాః = ఆ జనులు,

అగతమ్ = వచ్చిన, బాష్పమ్ = కన్నీటిని, సోఢుమ్ = సహించుటకు, న శేకుః = సమర్థులు కాలేరు.

తా. ఈ విధముగా పలుకుచు, ఇక్ష్వాకువంశవర్ధనుడు, తమకు ప్రేమపాత్రుడు అయిన ఆ రాముని అనుసరించి వెళ్ళుచున్న ఆ జనులు, తమ కండ్లనుండి కారుచున్న కన్నీటిని నిలుపలేకపోయిరి. 27

మూ॥ అథ రాజా వృతః స్త్రీభిర్దీనాభిర్దీనచేతనః,
నిర్జగామ ప్రియం పుత్రం ద్రక్ష్యామీతి బ్రువన్ గృహాత్.

ప్ర. అ. అథ = అటుపిమ్మట, దీనచేతనః = దీనమైన మనస్సు గల, రాజా = రాజు, ప్రియమ్ = ప్రియుడైన, పుత్రమ్ = పుత్రుని, ద్రక్ష్యామీతి = చూచెదను అని, బ్రువన్ = పలుకుచు, దీనాభిః = దీనురాలైన, స్త్రీభిః = స్త్రీలతో, వృతః = చుట్టబడినవాడై, గృహాత్ = గృహమునుండి, నిర్జగామ = బయటకు వచ్చెను.

తా. పిమ్మట, దుఃఖించుచున్న మనస్సు గల దశరథుడు, ప్రియుడైన నా పుత్రుని చూచెదను అని పలుకుచు, దుఃఖార్తలైన స్త్రీలతో కలసి గృహమునుండి బయటకు వచ్చెను. 28

మూ. శుశ్రువే చాగ్రతః స్త్రీణాం రుదన్తీనాం మహాస్వనః,
యథా నాదః కరేణూనాం బద్ధే మహతి కుఞ్జరే. 29

ప్ర. అ. అగ్రతః = ఎదుట, రుదన్తీనామ్ = ఏడ్చుచున్న, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, మహాస్వనః = గొప్ప ధ్వని, మహతి = గొప్ప, కుఞ్జరే = ఏనుగ, బద్ధే = కట్టబడినదగుచుండగా, కరేణూనామ్ = ఆడ ఏనుగులయొక్క, నాదః యథా = ధ్వని వలె, శుశ్రువే = వినబడెను.

తా. స్త్రీ లందరును, ఎదుట బిగ్గరగా ఏడ్చుచుండగా, ఆ ధ్వని మహాగజమును బంధించినపుడు, ఏడ్చుచున్న ఆడ ఏనుగుల ధ్వని వలె అచట వినబడెను. 29

మూ. పితా హి రాజా కాకుత్స్థః శ్రీమాన్ సన్నస్తదాఽభవత్,
పరిపూర్ణః శశీ కాలే గ్రహేణోపప్లుతో యథా. 30

ప్ర. అ. శ్రీమాన్ = శ్రీమంతుడు, కాకుత్స్థః = కకుత్స్థవంశమునందు జన్మించినవాడు, పితా = తండ్రి అయిన, రాజా = దశరథుడు, తదా = అపుడు, కాలే = కాలమునందు, గ్రహేణ = రాహుగ్రహముచేత, ఉపప్లుతః = బాధింపబడిన, పూర్ణశశీ యథా = పూర్ణచంద్రుడు వలె, సన్నః = క్షీణించినవాడు, అభవత్ = అయెను.

తా. తండ్రియైన, ఆ దశరథమహారాజు సహజమైన శోభకలవాడైనను అపుడు, గ్రహణకాలమున రాహువుచే పీడింపబడిన పూర్ణచంద్రుడు వలె క్షీణించెను. 30

మూ. స చ శ్రీమానచిన్త్యాత్మా రామో దశరథాత్మజః,
సూతం సంచోదయామాస త్వరితం వాహ్యతామితి. 31

ప్ర. అ. శ్రీమాన్ = శోభాయుక్తుడూ, అచిన్త్యాత్మా = ఊహింప శక్యము కాని ధైర్యము కలవాడూ అయిన, సః = ఆ, దశరథాత్మజః = దశరథుని కుమారుడైన, రామః = రాముడు, త్వరితమ్ = తొందరగా, వాహ్యతామ్ = తోలబడు గాక, ఇతి = అని, సూతమ్ = సారథిని, సంచోదయామాస = ప్రేరేపించెను.

తా. శోభాయుక్తుడూ, ఊహింపరాని ధైర్యము కలవాడూ అయిన ఆ రాముడు "శీఘ్రముగా తోలుము" అని సూతుని ఆదేశించెను. 31

మూ. రామో యాహీతి సూతం తం తిష్ఠేతి స జనస్తదా,
ఉభయం నాశకత్సూతః కర్తుమధ్వని చోదితః 32

ప్ర. అ. తదా = అప్పుడు, రామః = రాముడు, యాహి ఇతి = వెళ్ళుము అనీ, జనః = పౌరజనము, తిష్ఠ ఇతి = ఆగుము అనీ, తం సూతమ్ = ఆ సారథిని, (ప్రేరేపించిరి). చోదితః = ఈ విధముగా ప్రేరేపింపబడిన, సూతః = సారథి, అధ్వని = మార్గమునందు, ఉభయమ్ = ఆ రెండు పనులనూ, కర్తుమ్ = చేయుటకు, న అశకత్ = సమర్థుడు కాలేదు.

తా. ఆ సమయమునందు 'తొందరగా తోలుము' అని రాముడును, 'నిలుపుము' అని పౌరులును ఆ సూతునితో చెప్పగా అతడు మార్గమునందు, ఆ రెండు పనులను చేయజాలక పోయెను. 32

మూ. నిర్గచ్ఛతి మహాబాహౌ రామే పౌరజనాశ్రుభిః,
పతితైరభ్యవహితం ప్రశశామ మహీరజః. 33

ప్ర. అ. మహాబాహౌ = గొప్ప బాహువులు గల, రామే = రాముడు, నిర్గచ్ఛతి = బయలు వెడలుచుండగా, అభ్యవహితమ్ = పైకి లేగిన, మహీరజః = భూమిపై నున్న పరాగము, పతితైః = పడిన, పౌరజనాశ్రుభిః = పౌరుల = కన్నీళ్లచేత, ప్రశశామ = శాంతించెను.

తా. రాముడు బయలుదేరిన సమయమునందు, ఆనుల తొక్కుడిచే లేగిన భూపరాగము, పౌరుల కన్నీళ్లు పడి అణగిపోయెను. 33.

మూ. రుదితాశ్రుపరిద్యూనం హాహాకృతమచేతనమ్,
ప్రయాణే రాఘవస్యాసీత్పురం పరమపీడితమ్. 34

ప్ర. అ. రాఘవస్య = రామునియొక్క, ప్రయాణే = ప్రయాణసమయము నందు, పురమ్ = పట్టణము, రుదితాశ్రుపరిద్యూనమ్ = కన్నీళ్లచేత తడిసినదై, హాహాకృతమ్ = హాహాకారములతో నిండినదీ, అచేతనమ్ = మూర్ఛ చెందినదీ, పరమపీడితమ్ = మిక్కిలి పీడించబడినదీ, ఆసీత్ = ఆయెను.

తా. రాముని ప్రయాణసమయమునందు, ఆ నగరవాసు లందరు కన్నీళ్లు కార్చుచు హాహాకారములు చేయుచు, మూర్ఛ పొంది చాల పీడితు లైరి. 34

మూ. సుస్రావ నయనైః స్త్రీణామస్రమాయాససమ్భవమ్,
మీనసంక్షోభచలితైః సలిలం పఙ్కజైరివ. 35.

ప్ర. అ. స్త్రీణామ్ = స్త్రీలయొక్క, నయనైః = నేత్రముల చేత (నుండి) ఆయాససమ్భవమ్ = దుఃఖమువలన కలిగిన, అస్రమ్ = కన్నీరు, మీనసంక్షోభ చలితైః = మీనముల సంక్షోభముచే కదలిన, పఙ్కజైః = పద్మములనుండి, సలిలం ఇవ = నీరు వలె, సుస్రావ = స్రవించెను.

తా. చేపల తాకిడికి కదలిన పద్మములనుండి నీళ్ళు కారినట్లు, స్త్రీల నేత్రములనుండి దుఃఖము వలన కలిగిన కన్నీరు స్రవించెను. 35.

మూ. దృష్ట్వా తు నృపతిః శ్రీమానేకచిత్తగతం పురమ్,
నిపపాతైవ దుఃఖేన హతమూల ఇవ ద్రుమః. 36

ప్ర. అ. శ్రీమాన్=శ్రీమంతుడైన, నృపతిః=రాజు, ఏకచిత్తగతమ్= ఒకే విధమైన మనస్సును పొందిన, పురమ్= పట్టణమును, దృష్ట్వా=చూచి, దుఃఖేన=దుఃఖముతో, హతమూలః=కొట్టబడిన మొదలుగల, ద్రుమః ఇవ = వృక్షము వలె, నిపపాతైవ=క్రింద పడెను.

తా. ఒకే విధమైన మనస్సుతో ఆ విధముగా దుఃఖించుచున్న పౌరుల నందరిని చూచి, దశరథమహారాజు, దుఃఖాక్రాంతుడై, మొదలు నరకిన చెట్టు వలె పడిపోయెను. 36

మూ. తతో హలహలా శబ్దో జజ్ఞే రామస్య పృష్ఠతః,
నరాణాం ప్రేక్ష్య రాజానం సీదన్తం భృశదుఃఖితమ్. 37

ప్ర. అ. తతః=అటు పిమ్మట, భృశదుఃఖితమ్=చాల దుఃఖించిన, సీదన్తమ్=దుర్బలుడై పోతున్న, రాజానమ్=రాజును, ప్రేక్ష్య=చూచి, నరాణామ్=జనులయొక్క, హలహలాశబ్దః=కోలాహలధ్వని, రామస్య=రాముని యొక్క, పృష్ఠతః=వెనుక, జజ్ఞే=పుట్టెను.

తా. అంతలో చాల దుఃఖార్తుడై, క్షీణించిపోవుచున్న దశరథుని చూచి జనులు చేసిన హాహాకారధ్వని రాముని వెనుక నుండి వినవచ్చెను. 37

మూ. హా రామేతి జనాః కేచిద్రామమాతేతి చాపరే,
అన్తఃపురం సమృద్ధం చ క్రోశన్తః పర్యదేవయన్. 38

ప్ర. అ. కేచిత్=కొందరు, జనాః=జనులు, హా రామేతి=హా రామా! అని, అపరే=మరికొందరు, రామమాతేతి=అయ్యో! రాముని తల్లీ అని, క్రోశన్తః=ఏడ్చుచు, సమృద్ధమ్=సమృద్ధమైన, అన్తఃపురం చ=అంతఃపురమును గూడ, పర్యదేవయన్=ఏడ్పించిరి.

తా. ఆ జనులలో కొందరు 'అయ్యో! రామా' అని అరచిరి, కొందరు 'అయ్యో రామమాతా'! అని అరచిరి. ఈవిధముగ అరచుచు ఆ జనులు స్త్రీలతో నిండిన ఆ అంతఃపురము కూడ ఏడ్చునట్లు చేసిరి. 38

మూ. అన్వీక్షమాణో రామస్తు విషణ్ణం భ్రాన్తచేతసమ్,
రాజానం మాతరం చైవ దదర్శానుగతౌ పథి. 39

ప్ర. అ. రామస్తు = రాముడు, అన్వీక్షమాణః = వెనుకకు చూచుచు, విషణ్ణామ్ = దుఃఖితురాలూ, భ్రాన్తచేతసమ్ = భ్రమ చెందిన చిత్తము కలవాడూ అయిన, రాజానమ్ = రాజూను, మాతరం చైవ = తల్లినీ, పథి = మార్గమునందు, అనుగతౌ = తనను అనుసరించివచ్చుచుండగా, దదర్శ = చూచెను.

తా. రాముడు వెనుకకు తిరిగి చూడగా, తన వెంట వచ్చుచున్న, దుఃఖాక్రాంతులై తిరిగిపోవుచున్న మనస్సు గల తండ్రి తల్లి కనబడిరి. 39

మూ. స బద్ధ ఇవ పాశేన కిశోరో మాతరం యథా,
ధర్మపాశేన సంక్షిప్తః ప్రకాశం నాభ్యుదైక్షత. 40

ప్ర. అ. పాశేన = పాశముచేత, బద్ధః = కట్టబడిన, కిశోరః ఇవ = గుఱ్ఱపు పిల్ల వలె, సః = రాముడు, ధర్మపాశేన = ధర్మపాశముచేత, సంక్షిప్తః = కట్టబడినవాడై, మాతరం యథా = తల్లిని వలె, ప్రకాశమ్ = ప్రకటముగా, నాభ్యుదైక్షత = ఆ తల్లిదండ్రులను చూడలేదు.

తా. ధర్మపాశముచే కట్టబడిన ఆ రాముడు, పాశముచే కట్టబడిన గుఱ్ఱపు పిల్ల తన తల్లిని సరిగా చూడజాలనట్లు, ఆ తల్లిదండ్రులను సరిగా చూడజాలక ఓరకంటమాత్రమే చూచెను. 40

మూ. పదాతినౌ చ యానార్హావదుఃఖార్హౌ సుఖోచితౌ,
దృష్ట్వా సంచోదయామాస శీఘ్రం యాహీతి సారథిమ్.

ప్ర. అ. యానార్హౌ = వాహనములకు తగినవారు, పదాతినౌ = కాలినడకతో వచ్చుచున్నవారు, సుఖోచితౌ = సుఖమునకు అలవాటుపడినవారు, అదుఃఖార్హౌ = దుఃఖమునకు తగనివారు అయిన ఆ తల్లిదండ్రులను, దృష్ట్వా = చూచి, శీఘ్రమ్ = శీఘ్రముగా, యాహి = వెళ్ళుము, ఇతి = అని, సారథిమ్ = సారథిని, సంచోదయామాస = ప్రేరేపించెను.

తా. సుఖమునకు అలవాటుపడినవారు, దుఃఖ మనుభవించుటకు తగనివారు, వాహనమునకు తగినవారు అయిన ఆ తల్లిదండ్రులు కాలినడకతో వచ్చుచుండగా చూచి, తొందరగా నడుపుము అని రాముడు సారథిని ప్రేరేపించెను

మూ. న హి తత్పురుషవ్యాఘ్రో దుఃఖదం దర్శనం పితుః,
మాతుశ్చ సహితుం శక్తస్తోత్రార్దిత ఇవ ద్విపః. 42

ప్ర. అ. పురుషవ్యాఘ్రః = పురుషులలో శ్రేష్ఠుడైన ఆ రాముడు, తోత్రార్దితః = అంకుశముచే పీడింపబడిన, ద్విపః ఇవ = ఏనుగు వలె, దుఃఖదమ్ = దుఃఖమును కల్గించు, పితుః = తండ్రియొక్కయు, మాతుశ్చ = తల్లియొక్కయు, తత్ = ఆ, దర్శనమ్ = దర్శనమును, సహితుమ్ = సహించుటకు, న శక్తః హి = సమర్థుడు కాడు కదా!

తా. పురుషులలో శ్రేష్ఠుడైన ఆ రాముడు, అంకుశముచే పీడింపబడిన ఏనుగు వలె బాధపడుచు, దుఃఖమును కల్గించు తలిదండ్రుల అవస్థను చూడలేకపోయెను. 42

మూ. ప్రత్యగారమివాయాన్తీ వత్సలా వత్సకారణాత్,
బద్ధవత్సా యథా ధేనూ రామమాతాభ్యధావత. 43

ప్ర. అ. బద్ధవత్సా = కట్టబడిన లేగదూడ కలది, వత్సలా = ప్రేమకలది, అగారం ప్రతి = ఇంటిని గూర్చి, ఆయాన్తీ = వచ్చుచున్న, ధేనుః ఇవ = ధేనువు వలె, వత్సకారణాత్ యథా = లేగదూడకొరకు వలె, రామమాతా = రాముని తల్లి, అభ్యధావత = కుమారుని వైపు పరుగెత్తెను.

తా. లేగదూడయందు ప్రేమ గల ధేనువు ఇంటికి తిరిగి వచ్చి, కట్టబడియున్న తన లేగదూడవైపుకు పరుగెత్తునట్లు కౌసల్య తన కుమారుని వైపు పరుగెత్తెను. 43

మూ. తథా రుదన్తీం కౌసల్యాం రథం తమనుధావతీమ్,
క్రోశన్తీం రామ రామేతి హా సీతే లక్ష్మణేతి చ. 44
రామలక్ష్మణసీతార్థం స్రవన్తీం వారి నేత్రజమ్,
అసకృత్ప్రైక్షత స తాం నృత్యన్తీమివ మాతరమ్. 45

ప్ర. అ. సః = ఆ రాముడు, తథా = ఆ విధముగా, రుదన్తీమ్ = ఏడ్చుచున్నది, తం రథమ్ = ఆ రథమును, అనుధావన్తీమ్ = అనుసరించి పరుగెత్తుచున్నది, రామ రామేతి = రామా రామా! అని, హా సీతే = అయ్యో సీతా! లక్ష్మణేతి చ

= అయో! లక్ష్మణా అని, క్రోశన్తీమ్ = అరచుచున్నది, రామలక్ష్మణసీతార్థమ్ = రామలక్ష్మణ సీతలకొరకై, నేత్రజమ్ = నేత్రములనుండి పుట్టిన, వారి = నీటిని, ప్రసవన్తీమ్ = కార్చుచున్నది, నృత్యన్తీమ్ ఇవ = నాట్యము చేయుచున్నది వలె నున్న, మాతరమ్ = తల్లియైన, తాం కౌసల్యామ్ = ఆ కౌసల్యను, అసకృత్ = మాటి మాటికి. ప్రైక్షత = చూచెను.

తా. కౌసల్య ఆ విధముగా ఏడ్చుచు, రథము వైపు పరుగెత్తుచుండెను హా రామా! హా హా సీతా! లక్ష్మణా అని అరచుచు, రామలక్ష్మణ సీతలకై కన్నీరు కార్చుచు, ఒళ్లు తెలియక ఇటు నటు ఊగి పోవుచు నాట్యము చేయు చున్నట్లుండెను. అట్టి తల్లియైన కౌసల్య వైపు రాముడు మాటిమాటికిని చూచెను. 44, 45

మూ. తిష్ఠేతి రాజా చుక్రోశ యాహి యాహీతి రాఘవః,
సుమన్త్రస్య బభూవాత్మా చక్రయోరివ చాన్తరా. 46

ప్ర. అ. రాజా = దశరథుడు, తిష్ఠేతి = ఆగుము అని, చుక్రోశ = అరచెను. రాఘవః = రాముడు, యాహి యాహి ఇతి = నడుపుము, నడుపుము అని, అరచెను. సుమన్త్రస్య = సుమంత్రునియొక్క, ఆత్మా = మనస్సు, చక్రయోః = రెండు చక్రముల, అంతరా ఇవ = మధ్యయందు వలె, బభూవ = ఆయెను.

తా. ఆగుము ఆగుము అని రాజు అరచుచుండగా, నడుపుము నడుపుము అని రాముడు అనుచుండెను. అపుడు సుమంత్రుని మనస్సు రెండు చక్రముల మధ్య పడి నట్లు సంకటములో పడెను. 46

మూ. నాశ్రౌషమితి రాజానముపాలబ్ధోఽపి వక్ష్యసి,
చిరం దుఃఖస్య పాపిష్ఠమితి రామస్తమబ్రవీత్. 47

ప్ర. అ. ఉపాలబ్ధోఽపి = నిందింపబడినవాడ వైనను, నాశ్రౌషమితి = నేను వినలేదు అని, రాజానమ్ = రాజును గూర్చి, వక్ష్యసి = చెప్పగలవు. దుఃఖస్య = దుఃఖముయొక్క, చిరమ్ = చిరకాలదర్శనము, పాపిష్ఠమ్ = సహింప శక్యము కానిది, ఇతి = అని, రామః = రాముడు, తమ్ = అతనిని గూర్చి, అబ్రవీత్ =

తా. "రథమును ఏందుకు ఆపలేదు" అని రాజు నన్ను తరువాత నిందించినను, 'మాట వినబడలేదు' అని చెప్పవచ్చును. వీరి దుఃఖమును చాల సేపు చూచుచు ఉండుట సహింపరానిది అని రాముడు అతనితో చెప్పెను. 47

మూ. రామస్య చ వచః కుర్వన్ననుజ్ఞాప్య చ తం జనమ్,
వ్రజతోఽపి హయాన్ శీఘ్రం చోదయామాస సారథిః.

ప్ర. అ. సారథిః = సారథి, రామస్య = రామునియొక్క, వచః = మాటను, కుర్వన్ = చేయుచు, తమ్ = ఆ, జనమ్ = పౌరజనమును, అనుజ్ఞాప్య = సమ్మతింపచేసి, వ్రజతోఽపి = నడచుచున్న వైనను, హయాన్ = గుర్రములను, శీఘ్రమ్ = శీఘ్రముగ, చోదయామాస = తోలెను.

తా. సుమంత్రుడు రాముని మాట ప్రకారము చేయుచు, కూడ వచ్చుచున్న ప్రజల అనుజ్ఞ తీసుకొని, గుఱ్ఱములు పరుగెత్తుచున్నను ఇంకను శీఘ్రముగా పరుగెత్తు నట్లు వాటిని తోలెను. 48

మూ. న్యవర్తత జనో రాజ్ఞో రామం కృత్వా ప్రదక్షిణమ్,
మనసాప్యశ్రువేగైశ్చ న న్యవర్తత మానుషమ్. 49

ప్ర. అ. రాజ్ఞః = రాజుయొక్క, జనః = జనము, రామమ్ = రాముని, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, న్యవర్తత = మరలెను. మానుషమ్ = మనుష్య సముదాయము, మనసా అపి = మనస్సుచేతను, అశ్రువేగైశ్చ = కన్నీళ్ల వేగముచేతను, న న్యవర్తత = మరలలేదు.

తా. దశరథుని జను లందరు రామునకు ప్రదక్షిణము చేసి, తిరిగి వెళ్ళిరి కాని, వారి మనస్సులు మాత్రము వెనుకకు మరలలేదు. కన్నీళ్ళు తగ్గలేదు. 49

మూ. యమిచ్ఛేత్పునరాయాన్తం నైనం దూరమనువ్రజేత్,
ఇత్యమాత్యా మహారాజమూచుర్దశరథం వచః 50

ప్ర. అ. యమ్ = ఎవనిని, పునః = మరల, ఆయాన్తమ్ = వచ్చువానినిగా, ఇచ్ఛేత్ = కోరునో, ఏనమ్ = అతనిని, దూరమ్ = దూరముగా, న అనువ్రజేత్ = అనుసరించి వెళ్ల కూడదు, ఇతి = అని, అమాత్యాః = మంత్రులు, మహారాజమ్ =

మహారాజైన, దశరథమ్ = దశరథుని గూర్చి, వచః = వాక్యమును, ఊచుః = పలికిరి.

తా. "ఎవరు తిరిగి రావలెనని మనము కోరుకొందుమో వారిని చాల దూరము సాగనంపకూడదు' అని మంత్రులు దశరథమహారాజుతో చెప్పిరి. 50

మూ. తేషాం వచః సర్వగుణోపపన్నం
ప్రస్విన్నగాత్రః ప్రవిషణ్ణరూపః,
నిశమ్య రాజా కృపణః సభార్యో
వ్యవస్థితస్తం సుతమీక్షమాణః. 51

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చత్వారింశః సర్గః.

ప్ర. అ. ప్రస్విన్నగాత్రః = చెమట పట్టిన శరీరము కలవాడు, ప్రవిషణ్ణరూపః = మిక్కిలి దుఃఖముతో కూడిన రూపము కలవాడు, కృపణః = దీనుడు, సభార్యః = భార్యతో కూడినవాడు అయిన, రాజా = రాజు, తేషామ్ = వారియొక్క, సర్వగుణోపపన్నమ్ = సమస్తమైన గుణములతో కూడిన, వచః = వాక్యమును, నిశమ్య = విని, తం సుతమ్ = ఆ కుమారుని, ఈక్షమాణః = చూచుచు, వ్యవస్థితః = నిలచెను.

తా. దశరథుని శరీర మంతయు చెమటపట్టెను. రూపము వాడిపోయెను. ఈ విధముగా దీనుడై యున్న భార్యాసహితుడగు అతడు సుగుణములతో కూడిన వారి మాట విని, ఆ కుమారుని వైపే చూచుచు, అచట నిలబడెను. 51

"బాలానందిని" యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదవ సర్గ సమాప్తము.

## అథ ఏకచత్వారింశః సర్గః

[శ్రీరాముని అరణ్యాగమనముచే అంతఃపురస్త్రీల విలాపము, నగర వాసులు శోకముతో వ్యాకులత చెందుట.]

మూ. తస్మింస్తు పురుషవ్యాఘ్రే వినిర్యాతి కృతాఞ్జలౌ,
అర్తశబ్దోఽథ సంజజ్ఞే స్త్రీణామన్తఃపురే తదా. 1

ప్ర. అ. పురుషవ్యాఘ్రే = పురుషశ్రేష్ఠు డైన, తస్మిన్ = ఆ రాముడు, తదా = అపుడు, కృతాఞ్జలౌ = కట్టబడిన దోసిలికలవాడై, వినిర్యాతి = వెడలి పోవుచుండగా, అథ = పిమ్మట, అన్తఃపురే = అంతఃపురమునందు, స్త్రీణామ్ = స్త్రీలయొక్క, ఆర్తశబ్దః = ఆర్తధ్వని, సంజజ్ఞే = పుట్టెను.

తా. పురుషశ్రేష్ఠు డైన ఆ రాముడు నమస్కరించుచు, అరణ్యమునకు బయలుదేరగనే అంతఃపురములోని స్త్రీలు దుఃఖార్త లై ఏడ్చిరి. 1

మూ. అనాథస్య జనస్యాస్య దుర్బలస్య తపస్వినః,
యో గతిః శరణం చాసీత్స నాథః క్వ ను గచ్ఛతి. 2

ప్ర. అ. అనాథస్య = నాథుడులేనిది, దుర్బలస్య = బలములేనిది, తపస్వినః = దీనము అయిన, అస్య జనస్య = ఈ జనమునకు, యః = ఎవడు, గతిః = గతిగాను, శరణం చ = రక్షకుడు గాను, ఆసీత్ = అయెనో, సః నాథః = అట్టి నాథుడు, క్వ ను = ఎచ్చటికి, గచ్ఛతి = వెళ్ళుచున్నాడో.

తా. రక్షకుడు లేనివారము, దుర్బలులము, దీనులము అయిన మా అందరికిని ఏ రాముడు గతి యై రక్షకుడుగా ఉండెనో అట్టి మా రక్షకు డైన రాముడు ఎక్కడికి పోవుచున్నాడో! 2

మూ. న క్రుధ్యత్యభిశప్తోఽపి క్రోధనీయాని వర్జయన్,
క్రుద్ధాన్ప్రసాదయన్సర్వాన్ సమదుఃఖః క్వచిద్గతః. ౩

ప్ర. అ. అభిశప్తోఽపి = నిందింపబడినవాడైనను, న క్రుధ్యతి = కోపగించడు. క్రోధనీయాని = కోపము కల్గించు పనులను, వర్జయన్ = విడచుచు, క్రుద్ధాన్ = కోపగించిన, సర్వాన్ = అందరిని, ప్రసాదయన్ = కోపము తొలగిన వారినిగా చేయుచు, సమదుఃఖః = సమాన మైన దుఃఖము గల ఆ రాముడు, క్వచిత్ = ఎక్కడికి, గతః = వెళ్ళినాడో.

తా. ఎవ రైన నిందించినను కోపగించెడివాడు కాడు. కోపము కల్గించు పనులను చేసెడివాడే కాదు. కోపము వచ్చినవారి కోపము పోవునట్లు బ్రతిమాలెడివాడు. అందరితో సమముగా దుఃఖము పంచుకొనెడివాడు. అట్టి రాముడు ఎక్కడికి వెళ్లి పోయినాడో। ౩

మూ. కౌసల్యాయాం మహాతేజా యథా మాతరి వర్తతే,
తథా యో వర్తతేఽస్మాసు మహాత్మా క్వ ను గచ్ఛతి. 4

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, యః = ఏ రాముడు, మాతరి = తల్లియైన, కౌసల్యాయామ్ = కౌసల్యయందు, యథా = ఏ విధముగా, వర్తతే = ప్రవర్తించునో, తథా = అట్లే, అస్మాసు = మా విషయములో, వర్తతే = ప్రవర్తించెడివాడు. మహాత్మా = మహాత్ముడైన, అట్టి రాముడు, క్వ ను = ఎక్కడికి, గచ్ఛతి = పోవుచున్నాడు.

తా. మహాతేజశ్శాలి యైన రాముడు, తనతల్లి యైన కౌసల్య విషయమున ఏ విధముగా ప్రవర్తించెడివాడో, మా విషయమునందు కూడ అట్లే ప్రవర్తించెడివాడు. అట్టి మహాత్ముడు ఎక్కడికి పోవుచున్నాడో। 4

మూ. కైకేయ్యా క్లిశ్యమానేన రాజ్ఞా సంచోదితో వనమ్,
పరిత్రాతా జనస్యాస్య జగతః క్వ ను గచ్ఛతి. ౫

ప్ర. అ. కైకేయ్యా = కైకేయిచేత, క్లిశ్యమానేన = బాధింపబడిన, రాజ్ఞా = రాజుచే, వనమ్ = వనమును గూర్చి వెళ్లుటకు, సంచోదితః = ప్రేరేపింప

ఐది, అస్య = ఈ, జనస్య = జనమునకును, జగతః = జగత్తునకును, పరిత్రాతా = రక్షకుడైన రాముడు, క్వ ను = ఎక్కడికి, గచ్ఛతి = వెళ్ళిపోవుచున్నాడో.

భా. మా అందరిని, ఈ జగత్తును కూడ రక్షించు రాముడు, కైకేయి నిర్బంధించగా దశరథునిచే వనమునకు వెళ్ళుమని ప్రేరేపింపబడి, ఎక్కడికి పోవుచున్నాడో. 5

మూ. అహో నిశ్చేతనో రాజా జీవలోకస్య సంప్రియమ్,
ధర్మ్యం సత్యవ్రతం రామం వనవాసే ప్రవత్స్యతి. 6

ప్ర. అ. రాజా = రాజు, నిశ్చేతనః = బుద్ధిలేనివాడు. అహో = ఎంత ఆశ్చర్యము। జీవలోకస్య = ప్రాణిసముదాయమునకు, సంప్రియమ్ = ఇష్టుడు, ధర్మ్యమ్ = ధర్మాత్ముడు, సత్యవ్రతమ్ = సత్యము వ్రతముగాకలవాడు అయిన, రామమ్ = రాముని, వనవాసే = వనవాసమునందు, ప్రవత్స్యతి = దూరముగా పంపివేయుచున్నాడు.

భా. ఈ రాజు ప్రాణులందరికి ఇష్టుడూ, ధర్మపరాయణుడూ, సత్య వ్రతుడూ అయిన, రాముని, వనవాసమునకై పంపివేయుచున్నాడు. ఇతనికి బుద్ధిలేదు. ఎంత ఆశ్చర్యము। 6

మూ. ఇతి సర్వా మహిష్యస్తా వివత్సా ఇవ ధేనవః,
రురుదుశ్చైవ దుఃఖార్తాః సస్వరం చ విచుక్రుశుః. 7

ప్ర. అ. ఇతి = ఈ విధముగా, సర్వాః = సమస్తమైన, తాః మహిష్యః = ఆ రాజభార్యలు, వివత్సాః = దూడలు దూరమైన, ధేనవః ఇవ = ధేనువుల వలె, దుఃఖార్తాః = దుఃఖముచే పీడింపబడినవారై, రురుదుశ్చైవ = ఏడ్చిరి. సస్వరమ్ = స్వరముతో కూడునట్లుగ, విచుక్రుశుః = అరచిరి.

భా. ఈ విధముగా ఆ రాజు భార్యలందరు, తమ దూడలనుండి దూర మైన ఆవులవలె, దుఃఖముచే పీడింపబడి, బిగ్గరగా ఏడ్చిరి. 7

మూ. స తమన్తఃపురే ఘోరమార్తశబ్దం మహీపతిః,
పుత్రశోకాభిసంతప్తః శ్రుత్వా చాసీత్సుదుఃఖితః. 8

ప్ర. అ. పుత్రశోకాభిసన్తప్తః = పుత్రశోకముతో బాధపడుచున్న, సః మహీపతిః = ఆ రాజు, అన్తఃపురే = అంతఃపురమునందు, ఘోరమ్ = ఘోరమైన, తమ్ = ఆ, ఆర్త శబ్దమ్ = ఏడ్పును, శ్రుత్వా = విని, సుదుఃఖితః = మిక్కిలి దుఃఖముకలవాడు; ఆసీత్ = అయెను.

తా. ముందుగనే పుత్రశోకముతో బాధపడుచున్న ఆ రాజునకు అంతఃపురములోనుండి వచ్చిన, ఆ ఏడ్పును వినగానే దుఃఖము రెట్టింపాయెను. 8

మూ. నాగ్నిహోత్రాణ్యహూయన్త నాపచన్ గృహమేధినః,
అకుర్వన్న ప్రజాః కార్యం సూర్యశ్చాన్తరధీయత. 9

ప్ర. అ. అగ్నిహోత్రాణి = అగ్నిహోత్రములు, నాహూయన్త = చేయబడలేదు. గృహమేధినః = గృహస్థులు, నాపచన్ = వంటుకొనలేదు. ప్రజాః = ప్రజలు, కార్యమ్ = కార్యమును, న అకుర్వన్ = చేయలేదు. సూర్యశ్చ = సూర్యుడు కూడ, అన్తరధీయత = అంతర్ధానము చెందెను.

తా. అపుడు ద్విజులు అగ్నిహోత్రములను చేయలేదు. గృహస్థుల యిండ్లలో వంటలు వండలేదు. ప్రజలు తమ పనులు చేయలేదు. సూర్యుడు కూడ కనబడకుండ పోయెను. 9

మూ. వ్యసృజన్ కబలాన్నాగా గావో వత్సాన్న పాయయన్,
పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనన్దత. 10

ప్ర. అ. నాగాః = ఏనుగులు, కబలాన్ = కబళములను, వ్యసృజన్ = విడిచివేసినవి. గావః = ఆవులు, వత్సాన్ = దూడలను, న పాయయన్ = పాలు త్రాగించలేదు. జననీ = తల్లి, ప్రథమజమ్ = తొలిసారిగా పుట్టిన, పుత్రమ్ = పుత్రుని, లబ్ధ్వా = పొంది, నాభ్యనన్దత = సంతోషించలేదు.

తా. ఏనుగులు నోటిలో నున్న కబళములను కక్కివేసెను. గోవులు, దూడలకు పాలు ఇవ్వలేదు. తొలిసారిగా కుమారుడు పుట్టినను తల్లి అందులకు సంతోషించలేదు. 10

మూ. త్రిశంకుర్లోహితాఙ్గశ్చ బృహస్పతిబుధావపి,
దారుణాః సోమమభ్యేత్య గ్రహాః సర్వే వ్యవస్థితాః. 11

ప్ర. అ. త్రిశంకుః = త్రిశంకువు, లోహితాఙ్గశ్చ = కుజుడు, బృహస్పతి బుధావపి = బృహస్పతి, బుధుడు, దారుణాః = క్రూరమైన, సర్వే = సమస్తమైన, గ్రహాః = గ్రహములు, సోమమ్ = చంద్రుని, అభ్యేత్య = పొంది, వ్యవస్థితాః = ఉన్నవి.

తా. త్రిశంకువు, కుజుడు, గురుడు, బుధుడు, క్రూరగ్రహము లన్నియు, చంద్రునితో కలిసి యుండెను. 11

మూ. నక్షత్రాణి గతార్చీంషి గ్రహాశ్చ గతతేజసః,
విశాఖాస్తు సధూమాశ్చ నభసి ప్రచకాశిరే. 12

ప్ర. అ. నక్షత్రాణి = నక్షత్రములు, గతార్చీంషి = పోయిన కిరణములు కలవి. గ్రహాశ్చ = గ్రహములు, గతతేజసః = పోయిన తేజస్సు కలవి. విశాఖాస్తు = విశాఖానక్షత్రము లైతే, సధూమాః = ధూమముతో కూడినవై, నభసి = ఆకాశమునందు, ప్రచకాశిరే = ప్రకాశించినవి.

తా. నక్షత్రముల కిరణములు లోపించెను. గ్రహముల తేజస్సు తగ్గిపో యెను. కోసలదేశనక్షత్రమైన విశాఖను ఆకాశమునందు ధూమము ఆవరించెను. 12

మూ. కాలికానిలవేగేన మహోదధిరివోత్థితః,
రామే వనం ప్రవ్రజితే నగరం ప్రచచాల తత్. 13

ప్ర. అ. మహోదధిః = మహాసముద్రము, కాలికానిలవేగేన ఇవ = ప్రళయకాలమునందలి వాయువేగముచేతను వలె, ఉత్థితః = పొంగినది. రామే = రాముడు, వనమ్ = వనమునుగూర్చి, ప్రవ్రజితే = వెళ్లగా, తత్ నగరమ్ = ఆ నగరము, ప్రచచాల = చలించెను.

తా. సముద్రము, ప్రళయకాలమునందలి వాయువేగముచేత పొంగి నట్లు పొంగెను. రాముడు అరణ్యమునకు ప్రయాణము కాగానే, ఆ నగర మంతయు చలించెను. 13

మూ. దిశః పర్యాకులాః సర్వాస్తిమిరేణేవ సంవృతాః,
న గ్రహో నాపి నక్షత్రం ప్రచకాశే న కించన. 14

ప్ర. అ. సర్వాః = సమస్తమైన, దిశః = దిక్కులు, పర్యాకులాః = వ్యాకులములైనవై, తిమిరేణ = చీకటిచే, సంవృతాః ఇవ = కప్పబడిన ట్లున్నవి. గ్రహః = గ్రహములు, న ప్రచకాశే = ప్రకాశించలేదు. నక్షత్రమపి = నక్షత్రము కూడ, న = ప్రకాశించలేదు. కించ = ఏదియు, న = ప్రకాశించలేదు.

తా. దిక్కు లన్నియు వ్యాకులములై, చీకటి కమ్మిన ట్లుండెను. గ్రహములు కాని, నక్షత్రములు కాని, మరేదియు కాని ప్రకాశించలేదు. 14

మూ. అకస్మాన్నాగరః సర్వో జనో దైన్యముపాగమత్,
ఆహారే వా విహారే వా న కశ్చిదకరోన్మనః. 15

ప్ర. అ. సర్వః = సమస్తమైన, నాగరః = నగరమునకు సంబంధించిన, జనః = జనము, అకస్మాత్ = అకస్మాత్తుగా, దైన్యమ్ = దైన్యమును, ఉపాగమత్ = పొందెను. ఆహారే వా = ఆహారమునందు గాని, విహారే వా = విహారమునందుగాని, కశ్చిత్ = ఒక్కడును, మనః = మనస్సును, న అకరోత్ = చేయలేదు.

తా. నగరములోని పౌరు లందరిని అకస్మాత్తుగా దైన్యము ఆవహించెను. ఆహారమునందు గాని, విహారమునందు గాని ఏ ఒక్కని మనస్సు కూడ ప్రవర్తించలేదు. 15

మూ. శోకపర్యాయసన్తప్తః సతతం దీర్ఘముచ్ఛ్వసన్,
అయోధ్యాయాం జనః సర్వః శుశోచ జగతీపతిమ్. 16

ప్ర. అ. అయోధ్యాయామ్ = అయోధ్యయందు, సర్వః = సమస్తమైన, జనః = జనము, శోకపర్యాయసంతప్తః = దుఃఖపరంపరచే పీడింపబడి, సతతమ్ = ఎల్లపుడు, దీర్ఘమ్ = దీర్ఘముగా, ఉచ్ఛ్వసన్ = నిట్టూర్చుచు, జగతీపతిమ్ = రాజునుగూర్చి, శుశోచ = దుఃఖించెను.

తా. అయోధ్యలోని జను లందరు, శోకపరంపరచే పీడితులై నిరంతరము దీర్ఘముగా నిట్టూర్చుచు, దశరథమహారాజునుగూర్చి దుఃఖించిరి. 16

మూ. బాష్పపర్యాకులముఖో రాజమార్గగతో జనః,
న హృష్టో లక్ష్యతే కశ్చిత్సర్వః శోకపరాయణః. 17

ప్ర. అ. రాజమార్గగతః = రాజమార్గములో నున్న, జనః = జనము, బాష్పపర్యాకులముఖః = కన్నీటిచే వ్యాకుల మైన ముఖము కలది. కశ్చిత్ = ఏ ఒక్కడును, హృష్టః = సంతోషించినవాడు, న లక్ష్యతే = కనబడుటలేదు. సర్వః = ప్రతి ఒక్కడును, శోకపరాయణః = దుఃఖమునకు లొంగిపోయినవాడు.

తా. రాజమార్గములో నున్న జనుల ముఖములు కన్నీళ్లతో కలుషములై యుండెను. సంతోషముతో నున్నవాడు ఒక్కడును కనబడలేదు. ప్రతి ఒక్కడును దుఃఖముతో నిండి యుండెను. 17

మూ. న వాతి పవనః శీతో న శశీ సౌమ్యదర్శనః,
న సూర్యస్తపతే లోకం సర్వం పర్యాకులం జగత్. 18

ప్ర. అ. పవనః = వాయువు, శీతః = చల్లనిదిగా, న వాతి = వీచుట లేదు. శశీ = చంద్రుడు, సౌమ్యదర్శనః = సౌమ్య మైన దర్శనము కలవాడుగా, న = లేడు. సూర్యః = సూర్యుడు, లోకమ్ = లోకమును, న తపతే = తపింపచేయలేదు. సర్వమ్ = సమస్త మైన, జగత్ = జగత్తు, పర్యాకులమ్ = వ్యాకుల మైనది.

తా. ఆ సమయమున వాయువు చల్లగా వీచలేదు. చంద్రుడు చూచుటకు సౌమ్యముగా లేకుండెను. సూర్యుడు ఎండ కాయలేదు. జగత్తంతయు వ్యాకులముగా నుండెను. 18

మూ. అనర్థినః సుతాః స్త్రీణాం భర్తారో భ్రాతరస్తథా,
సర్వే సర్వం పరిత్యజ్య రామమేవాన్వచింతయన్. 19

ప్ర. అ. సుతాః = కుమారులు, భర్తారః = భర్తలు, స్త్రీణామ్ = స్త్రీల విషయమున, అనర్థినః = కోరిక లేనివారు అయిరి. తథా = మరియు, భ్రాతరః = సోదరులు, అనర్థినః = పరస్పరము కోరిక లేనివా రైరి. సర్వే = అందరును, సర్వమ్ = సమస్తమును, పరిత్యజ్య = విడచి, రామమ్ ఏవ = రాముని గూర్చియే, అన్వచింతయన్ = ఆలోచించిరి.

తా. పుత్రులకు తల్లుల విషయమునను, భర్తలకు భార్యల విషయమునను ఆసక్తి తగ్గినది. సోదరులు పరస్పరము ఆసక్తి లేనివారైరి. అందరును అన్నిం టిని విడిచిపెట్టి రామునిగూర్చియే ఆలోచించుచుండిరి.

వి. ఈ శ్లోకానికి భావం చాలా అధ్యాహారాలు తెచ్చుకొని చెప్పవలసి ఉన్నది. దీనికి బదులు ప్రాచ్యరామాయణంలోని పాఠం బాగున్నది.

"నాచిన్తయత్ సుతాన్కశ్చిన్నచ భర్తౄంస్తథా స్త్రియః,
న కాన్తం కామినీ కాచిన్న చ కామీ వరాఙ్గనామ్,
నాససాద రతిం కశ్చిచ్ఛోకసంవిగ్నమానసః."

"ఎవ్వరును తన కుమారులను గూర్చి ఆలోచింపలేదు. స్త్రీలు తమ భర్తలను గూర్చి ఆలోచింపలేదు. కామిని తన ప్రియుని వద్దకు గాని, ప్రియుడు తన ప్రేయసివద్దకు గాని వెళ్లలేదు. ప్రతి ఒక్కడు దుఃఖాక్రాంత మైన మనస్సుతో ఆనందమును పొందలేదు" అని వీటి భావము. 19

మూ. యే తు రామస్య సుహృదః సర్వే తే మూఢచేతసః,
శోకభారేణ చాక్రాన్తాః శయనం న జహుస్తదా. 20

ప్ర. అ. తదా=అపుడు, రామస్య=రామునియొక్క, యే=ఏ, సుహృదః=స్నేహితులు కలరో, తే సర్వే=వా రందరును, మూఢచేతసః=ఏమియు తోచని మనస్సు కలవారై, శోకభారేణ=దుఃఖభారముచేత, ఆక్రాన్తాః=ఆక్రమింపబడినవారై, శయనమ్=శయనమును, న జహుః=విడువలేదు.

తా. అపుడు రాముని స్నేహితు లందరును దుఃఖభారముతో నిండి యేమి చేయుటకును తోచక, తమ పడకలను విడువకుండిరి. 20

మూ. తతస్త్వయోధ్యా రహితా మహాత్మనా
పురన్దరేణేవ మహీ సపర్వతా,
చచాల ఘోరం భయశోకపీడితా
సనాగయోధాశ్వగణా ననాద చ. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకచత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః=అటు పిమ్మట, పురన్దరేణ=దేవేంద్రునితో, రహితా=శూన్య మైన, సపర్వతా=పర్వతములతో కూడిన, మహీవ=భూమి వలె, మహాత్మనా=మహాత్ము డైన ఆ రామునితో, రహితా=శూన్య మైన, అయోధ్యా=

అయోధ్యా, భయశోకపీడితా = భయముచేతను, శోకముచేతను పీడింపబడినదై, ఘోరమ్ = భయంకరముగా, చచాల = చలించెను. సనాగయోధాశ్వగణా = నాగములయొక్క, యోధులయొక్క, అశ్వములయొక్క, గణములతో కూడిన, ఆ అయోధ్య, ననాద చ=ధ్వని కూడ చేసెను.

తా. రాముడు లేని ఆ అయోధ్య దేవేంద్రుడు లేని పర్వతాది సహిత మగు భూమి వలె, భయశోకములవలన కలిగిన పీడతో, భయంకరముగా చలించెను. అక్కడ నున్న గజములు, యోధులు, అశ్వములు కూడ, మిక్కిలి ధ్వని చేసెను (ఏడ్చెను). 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబది ఒకటవ సర్గ సమాప్తము.

# అథ ద్విచత్వారింశః సర్గః

*[దశరథమహారాజు భూమిపై పడుట, రామునకై విలపించుట, కైకను తనవద్దకు రావలదని వారించి యామెను విడిచిపెట్టుట, సేవకులతోడుపాటుతో రాజు కౌసల్యాభవనమునకు పోవుట, అచటను రామునికై దుఃఖ మనుభవించుట.]*

మూ. యావత్తు నిర్యతస్తస్య రజో రూపమదృశ్యత,
నైవేక్ష్వాకువరస్తావత్సంజహారాత్మచక్షుషీ. 1

ప్ర. అ. తస్య = ఆ రాముడు, నిర్యతః = వెళ్ళుచుండగా, రజోరూపమ్ = పరాగముయొక్క రూపము, యావత్ = ఎంతవరకు, అదృశ్యత = చూడబడెనో, తావత్ = అంతవరకును, ఇక్ష్వాకువరః = దశరథుడు, ఆత్మచక్షుషీ = తన నేత్రములను, నైవ సంజహార = ఉపసంహరించలేదు.

తా. రాముడు ప్రయాణమై వెళ్ళుచున్నప్పుడు, రథగమనముచే రేగిన పరాగము కనబడుచున్నంతవరకును, దశరథుడు అటు వైపే చూచుచుండెను.1

మూ. యావద్రాజా ప్రియం పుత్రం పశ్యత్యత్యన్తధార్మికమ్,
తావద్వ్యవర్ధతే వాస్య ధరణ్యాం పుత్రదర్శనే. 2

ప్ర. అ. రాజా = రాజు, ప్రియమ్ = ప్రియుడైన, అత్యన్తధార్మికమ్ = మిక్కిలి ధార్మికుడైన, పుత్రమ్ = పుత్రుని, యావత్ = ఎంతవరకు, పశ్యతి = చూడునో, తావత్ = అంతవరకు, అస్య = ఆతనియొక్క, పుత్రదర్శనే = పుత్రదర్శనము నిమిత్తమై, ధరణ్యామ్ = భూమియందలి పరాగము, వ్యవర్ధతేవ = వృద్ధిహొందినట్లున్నది.

తా. అత్యంతధార్మికుడైన ఆ ప్రియపుత్రుని ఎంతవరకు ఆ రాజు చూచుచుండెనో అంతవరకును అతనికి పుత్రదర్శనసుఖము కలిగించుటకై భూమిపై పరాగము పెరిగినట్లుండెను.

ఈ శ్లోకము భావము అస్పష్టముగా ఉన్నది.
౨. ఇక్కడ ప్రాచ్యరామాయణపాఠము బాగున్నది.

"యావత్తు గచ్ఛతస్తస్య రాజా రూపమపశ్యత,
నైవేక్ష్వాకువరస్తావత్ సంజహారాత్మచక్షుషీ."

భా. "రాముడు వెళ్లుచుండగా అతని రూపము కనబడునంతవరకును దశరథుడు తన నేత్రములను వెనుకకు మరల్చలేదు" అని దీని భావము.

మొదట ఇచ్చిన పాఠములోని 'రజోరూపమ్' అనునది సరియైనదిగా లేదు. సాధారణముగా ఏ కవులును "రజస్సు యొక్క రూపము" అను అర్థము గల ఆ పదమును ప్రయోగించరు. "రజః" అని మాత్రమే ప్రయోగింతురు.

"యావద్రాజా ప్రియం పుత్రం పశ్యతి స్మ స చక్షుషా,
ఉత్ససర్జ మహీ తావత్ తదా దూరమివాన్తరమ్."

"ఆ రాజు తన ప్రియపుత్రుని చూచుచున్నప్పుడు భూమి అధికమైన దూరమును సృష్టించి నట్లుండెను" అని దీని భావము.

దీని తరువాత — ఆ రాజు ధార్మికుడైన ప్రియపుత్రుని చూచుచున్నంత వరకూ అతని కండ్లు అటువైపే ప్రసరించెను" అను భావము గల మూడవ శ్లోక మున్నది". దీని తరువాత వచ్చు నాల్గవ శ్లోకము మన పాఠములోని మూడవశ్లోకముతో సమానముగా ఉన్నది. ఈ విధముగా పై శ్లోకాలలో రాముడు కనబడినంతవరకు చూచి, చివరకు రథపరాగము కూడ కనబడకపోవుటతో అతడు మూర్ఛపడెను అని చెప్పుట యుక్తము గాన ఈ పాఠము బాగున్నది. అర్థము కూడ స్పష్టముగా ఉన్నది. 2

మూ. న పశ్యతి రజోఽప్యస్య యదా రామస్య భూమిపః,
తదార్తశ్చ విషణ్ణశ్చ పపాత ధరణీతలే. 3

ప్ర. అ. భూమిపః = రాజు, యదా = ఎప్పుడు, అస్య రామస్య = ఈ రాముని యొక్క, రజోఽపి = పరాగమును కూడ, న పశ్యతి = చూడలేదో, తదా = అప్పుడు, ఆర్తః చ = పీడితుడై, విషణ్ణః చ = దిగులుపొందినవాడై, ధరణీతలే = నేలపై, పపాత = పడెను.

తా. రాముని రథమువలన ఎగిరిన దూళి కూడ ఎప్పుడు కనబడ లేదో అప్పు డా దశరథుడు దుఃఖితు డై, దిగులు చెంది నేలపై పడిపోయెను. ౩

మూ. తస్య దక్షిణమన్వాగాత్కౌసల్యా బాహుమఙ్గనా,
వామం చైవాన్వగాత్పార్శ్వం కైకేయీ భరతప్రియా. 4

ప్ర. అ. అఙ్గనా=భార్య యైన, కౌసల్యా = కౌసల్య, తస్య = అతని యొక్క, దక్షిణం బాహుమ్ = కుడి బాహువును, అన్వాగాత్ = పొందెను. భరత ప్రియా = భరతుడు ఇష్టుడు గాగల, కైకేయీ చ = కైకేయి, వామమ్ = ఎడమ దైన, పార్శ్వమ్=పార్శ్వమును, అన్వగాత్ = పొందెను.

తా. దశరథుడు నేలపై పడగానే అతనిని లేవదీయుటకై, కౌసల్య కుడి చేతి వైపునకును, భరతునియందు ప్రేమ గల కైకేయి ఎడమవైపునకు వచ్చిరి.

మూ. తాం నయేన చ సంపన్నో ధర్మేణ వినయేన చ,
ఉవాచ రాజా కైకేయీం సమీక్ష్య వ్యథితేన్ద్రియః. 5

ప్ర. అ. నయేన = నీతితోను, ధర్మేణ = ధర్మముతోను, వినయేన చ = వినయముతోను, సంపన్నః = కూడిన, రాజా = రాజు, తాం కైకేయీమ్ = ఆ కైకేయిని, సమీక్ష్య=చూచి, వ్యథితేన్ద్రియః = బాధపడుచున్న ఇంద్రియములు కలవాడై, ఉవాచ=పలికెను.

తా. నీతిమంతుడూ, ధర్మపాలకుడూ, వినయసంపన్నుడూ, అయిన ఆ దశరథుడు ఆ కైకేయిని చూచి, మిక్కిలి బాధపడుచు ఇట్లనెను. 5

మూ. కైకేయి మా మమాఙ్గాని స్ప్రాక్షీస్త్వం దుష్టచారిణీ,
న హి త్వాం ద్రష్టుమిచ్ఛామి న భార్యా న చ బాన్ధవీ. 6

ప్ర. అ. కైకేయి=ఓ కైకేయీ, దుష్టచారిణీ = దుష్టముగా ప్రవర్తించు చున్న, త్వమ్=నీవు, మమ = నాయొక్క, అఙ్గాని = అవయవములను, మా స్ప్రాక్షీః = స్పృశింపకుము. త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, న హి ఇచ్ఛామి = ఇచ్ఛయించను. భార్యా = నా భార్యవు, న = కావు, బాన్ధవీ=బంధువు కూడ, న=కావు.

తా. కైకేయీ! దుష్టమైన ప్రవృత్తి గల నీవు నా శరీరమును తాకవద్దు. నిన్ను చూచుట నా కిష్టము లేదు. నీవు నా భార్యవు కావు; బంధువు కూడ కావు.

మూ. యే చ త్వామనుజీవన్తి నాహం తేషాం న తే మమ,
కేవలార్థపరాం హి త్వాం త్యక్తధర్మాం త్యజామ్యహమ్.

ప్ర. అ. యే చ = ఎవరు, త్వామ్ = నిన్ను, అనుజీవన్తి = అనుసరించి జీవించుచున్నారో, తేషామ్ = వారికి, అహమ్ = నేను, న = ఏమియు కాను; తే = వారు, మమ = నాకు, న = ఏమియు కారు. కేవలార్థపరామ్ = కేవలము అర్థమునందు మాత్రమే ఆసక్తి కలదానవూ, త్యక్తధర్మామ్ = విడువబడిన ధర్మము కలదానవూ అయిన, త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, త్యజామి = విడచి వేయుచున్నాను.

తా. నీమీద ఆధారపడి జీవించు నీ అనుచరులకు నేనేమియు కాను. నాకు వారేమియు కారు. ధర్మమును పరిత్యజించి కేవలము అర్థమునందు మాత్రమే ఆసక్తి గల నిన్ను నేను పరిత్యజించుచున్నాను. 7

మూ. అగృహ్ణాం యచ్చ తే పాణిమగ్నిం పర్యణయం చ యత్,
అనుజానామి తత్సర్వమస్మిన్ లోకే పరత్ర చ. 8

ప్ర. అ. తే = నీయొక్క, పాణిమ్ = హస్తమును, అగృహ్ణామితి యత్ = గ్రహించితి నను మాట ఏది కలదో, అగ్నిమ్ = అగ్నిని (కి), పర్యణయం చ ఇతి యత్ = ప్రదక్షిణము చేయించితి నను విషయ మేది గలదో, తత్సర్వమ్ = దాని నంతనూ, అస్మిన్ లోకే = ఈ లోకమునందునూ, పరత్ర చ = పరలోకమునందునూ, అనుజానామి = పరిత్యజించుచున్నాను.

తా. నీ చేయి పట్టి, అగ్ని చుట్టూ ప్రదక్షిణము చేయించి, నిన్ను వివాహ మాడుటవలన కలిగిన సంబంధమును ఇహలోకమునందును, పరలోకమునందును కూడ పరిత్యజించుచున్నాను. 8

మూ. భరతశ్చేత్ప్రతీతః స్యాద్రాజ్యం ప్రాప్యైతదవ్యయమ్,
యన్మే స దద్యాత్పిత్రర్థం మాం మా తద్దత్తమాగమత్. 9

ప్ర. అ. అవ్యయమ్=నాశనము లేని, ఇదం రాజ్యమ్ = ఈ రాజ్యమును, ప్రాప్య = పొంది, భరతః = భరతుడు, ప్రతీతః = సంతోషించినవాడు, స్యాత్ చేత్=అయినట్లైతే, సః = అతడు, పిత్రర్థమ్=పితృకార్యరూపమున, మే=నాకు, యత్ = దేనిని, దద్యాత్ = ఇచ్చునో, తద్దత్తమ్ = వానిచే ఇవ్వబడినది, మామ్ = నన్ను, మాగమత్ = చేరకుండుగాక!

తా. అక్షయ మైన ఈ రాజ్యము లభించినందుకు భరతుడు సంతోషించి నట్లైతే అతడు పితృకార్యమునందు నన్ను ఉద్దేశించి ఇచ్చిన జలతర్పణాదికము నాకు ముట్టకుండుగాక. 9

మూ. అథ రేణుసముద్ధ్వస్తం సముత్థాప్య నరాధిపమ్,
న్యవర్తత తదా దేవీ కౌసల్యా శోకకర్శితా. 10

ప్ర. అ. అథ = అటుపిమ్మట, రేణుసముద్ధ్వస్తమ్ = పరాగముచే దూషితు డైన, తం నరాధిపమ్=ఆ రాజును, సముత్థాప్య = లేపి, దేవీ = దేవి యైన, కౌసల్యా = కౌసల్య, శోకకర్శితా = దుఃఖముచే కృశింపచేయబడినదై, తదా = అపుడు, న్యవర్తత = మరలివెళ్లెను.

తా. పరాగము శరీరమంతయు వ్యాపించియున్న ఆ రాజును నేలపై నుండి లేవదీసి శోకముచే కృశించిన ఆ కౌసల్యాదేవి తన గృహమునకు మరలి వెళ్ళెను. 10

మూ. హత్వేవ బ్రాహ్మణం కామాత్ స్పృష్ట్వాగ్నిమివ పాణినా,
అన్వతప్యత ధర్మాత్మా పుత్రం సంచిన్త్య తాపసమ్. 11

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన దశరథుడు, తాపసమ్ = ముని వేషము ధరించిన, పుత్రమ్ = కుమారుని, సంచిన్త్య = తలచుకొని, కామాత్ = కోరికవలన, బ్రాహ్మణమ్ = బ్రాహ్మణుని, హత్వేవ = చంపి వలె, పాణినా = హస్తముచేత, అగ్నిమ్ = అగ్నిని, స్పృష్ట్వా ఇవ=స్పృశించి వలె, అన్వతప్యత పరితపించెను.

తా. ధర్మాత్ము డైన ఆ దశరథుడు, మునివేషము ధరించి అరణ్యమునకు వెళ్ళిన కుమారుని తలచుకొని, కావలె నని బ్రహ్మహత్య చేసినవాడు వలెను, చేతితో నిప్పు ముట్టుకున్న వాని వలెను పరితపించెను. 11

మూ. నివృత్యైవ నివృత్యైవ సీదతో రథవర్త్మసు,
రాజ్ఞో నాతిబభౌ రూపం గ్రస్తస్యాంశుమతో యథా. 12

ప్ర. అ. రథవర్త్మసు = రథము వెళ్లు మార్గమునందు, నివృత్యైవ నివృత్యైవ = మాటి మాటికి తిరిగి, సీదతః = దుఃఖించుచున్న, రాజ్ఞః = రాజుయొక్క, రూపమ్ = రూపము, గ్రస్తస్య = రాహువుచే మ్రింగబడిన, అంశుమతః యథా = సూర్యుని రూపము వలె, నాతిబభౌ = అంతగా ప్రకాశింపలేదు.

తా. రథమార్గమును వెనుకకు తిరిగి తిరిగి చూచుచు, దుఃఖించుచున్న ఆ దశరథుని రూపము, రాహుగ్రస్తు డైన సూర్యుని రూపము వలె ప్రకాశవిహీన మైనది. 12

మూ. విలలాప చ దుఃఖార్తః ప్రియం పుత్రమనుస్మరన్,
నగరాన్తమనుప్రాప్తం బుద్ధ్వా పుత్రమథాబ్రవీత్. 13

ప్ర. అ. ప్రియమ్ = ప్రియు డైన, పుత్రమ్ = పుత్రుని, అనుస్మరన్ = స్మరించుచు, దుఃఖార్తః = దుఃఖముచే పీడింపబడిన వా డై, విలలాప చ = విలపించెను. అథ = అటుపిమ్మట, పుత్రమ్ = పుత్రుని, నగరాన్తమ్ = నగరము యొక్క అంతమును, అనుప్రాప్తమ్ = చేరిన వానినిగా, బుద్ధ్వా = తెలుసుకొని, అబ్రవీత్ = పలికెను.

తా. ప్రియు డైన ఆ కుమారునే స్మరించుచు దుఃఖార్తు డై విలపించెను. ఇంతలో పుత్రుడు పట్టణము దాటె నని విని ఈ విధముగా పలికెను. 13

మూ. వాహనానాం చ ముఖ్యానాం వహతాం తం మమాత్మజమ్,
పదాని పథి దృశ్యన్తే న మహాత్మా న దృశ్యతే. 14

ప్ర. అ. మమ = నా యొక్క, ఆత్మజమ్ = కుమారు డైన, తమ్ = ఆ రాముని, వహతామ్ = తీసికొని వెళ్లిన, ముఖ్యానామ్ = శ్రేష్ఠము లైన, వాహనానామ్ = గుఱ్ఱములయొక్క, పదాని = అడుగులు, పథి = మార్గమునందు, దృశ్యన్తే = చూడబడుచున్నవి. మహాత్మా = మహాత్ము డైన, సః = అతడు, న దృశ్యతే = చూడబడుటలేదు.

తా. నా కుమారుని తీసుకొని వెళ్ళిన శ్రేష్ఠము లైన గుఱ్ఱముల అడుగు జాడలు నేలపై కనబడుచున్నవి కాని, మహాత్ము డైన ఆ రాముడు మాత్రము కనబడుటలేదు. 14

మూ. యస్సుఖేషూపధానేషు శేతే చన్దనరూషితః,
వీజ్యమానో మహార్హాభిః స్త్రీభిర్మమ సుతోత్తమః,
స నూనం క్వచిదేవాద్య వృక్షమూలముపాశ్రితః,
కాష్ఠం వా యదివాశ్మాన ముపధాయ శయిష్యతే. 16

ప్ర. అ. యః = ఏ, మమ సుతోత్తమః = నా పుత్రులలో శ్రేష్ఠు డైన రాముడు, చన్దనరూషితః = చందనముచే పూయబడినవాడై, మహార్హాభిః = ఉత్తము లైన, స్త్రీభిః = స్త్రీలచేత, వీజ్యమానః = వీవబడుచున్నవాడై, సుఖేషు = సుఖకరము లైన, ఉపధానేషు = తలగడలపై, శేతే = శయనించెనో, సః = అట్టి రాముడు, అద్య = ఇపుడు, నూనమ్ = నిశ్చయముగా, క్వచిదేవ = ఎక్కడనో ఒకచోట, వృక్షమూలమ్ = వృక్షముయొక్క మూలమును, ఉపాశ్రితః = ఆశ్రయించినవాడై, కాష్ఠం వా = కఱ్ఱను గాని, యది వా = లేక, అశ్మానమ్ = రాయిని గాని, ఉపధాయ = తలగడగా చేసుకొని, శయిష్యతే = శయనింపగలడు.

తా. నా కుమారులలో శ్రేష్ఠు డైన ఏ రాముడు శరీరమునకు చందనము పూసుకొని, ఉత్తము లైన స్త్రీలు వింజామరలతో వీచుచుండగా, మెత్తని తలగడలపై శయనించుచుండెడివాడో, ఆ రాముడే ఇపుడు, ఏదో ఒక చెట్టు నీడను ఆశ్రయించి కఱ్ఱను గాని, రాయిని గాని, తలగడగా ఉంచుకొని, శయనించును.

మూ. ఉత్థాస్యతి చ మేదిన్యాః కృపణః పాంసుగుణ్ఠితః,
వినిశ్శ్వసన్ ప్రస్రవణాత్కరేణూనామివర్షభః. 17

ప్ర. అ. కరేణూనామ్ = ఆడ ఏనుగుల, ఋషభః = ప్రభు వైన మగ ఏనుగు, ప్రస్రవణాత్ ఇవ = ప్రస్రవణపర్వతమునుండి వలె, వినిశ్శ్వసన్ = నిట్టూర్చుచు, పాంసుగుణ్ఠితః = పరాగములచే కప్పబడినవాడై, కృపణః = దీను డైన ఆ రాముడు, మేదిన్యాః = భూమినుండి, ఉత్థాస్యతి చ = లేవగలడు.

తా. దీనుడైన ఆ రాముడు పరాగముచే కప్పబడినవాడై నిట్టూర్పు చు, ఏనుగు ప్రస్రవణపర్వతమునుండి లేచి నట్లు, నేలపైనుండి లేవగలడు. 17

మూ. ద్రక్ష్యన్తి నూనం పురుషా దీర్ఘబాహుం వనేచరాః,
రామముత్థాయ గచ్ఛన్తం లోకనాథమనాథవత్. 18

ప్ర. అ. దీర్ఘబాహుమ్ = దీర్ఘము లైన బాహువులు కలవాడూ, లోకనాథం = లోకములకు ప్రభువూ, అనాథవత్ = అనాథుడు వలె, ఉత్థాయ = లేచి, గచ్ఛన్తమ్ = వెళ్ళుచున్నవాడు అయిన, రామమ్ = రాముని, నూనమ్ = తప్పక, వనేచరాః = వనమునందు సంచరించు, పురుషాః = పురుషులు, ద్రక్ష్యన్తి = చూడగలరు.

తా. లోకములకు నాథు డైన శ్రీరాముడు ఆ విధముగా నేలపైనుండి లేచి, అనాథుడు వలె వెళ్ళుచుండగా, ఆజానుబాహు డైన, అతనిని అరణ్యంలో నివసించు జనులు చూడగలరు. 18

మూ. సా నూనం జనకస్యేష్టా సుతా సుఖసదోచితా,
కణ్టకాక్రమణక్లాన్తా వనమద్య గమిష్యతి. 19

ప్ర. అ. సుఖసదోచితా = సుఖములకు ఎల్లపుడు అలవాటు పడినదీ, జనకస్య = జనకమహారాజుయొక్క, ఇష్టా = ఇష్టురా లైన, సుతా = కుమార్తెయూ అయిన, సా = ఆ సీత, కణ్టకాక్రమణక్లాన్తా = ముండ్లపై నడచుటచే అలసినదై, అద్య = ఇపుడు, వనమ్ = వనమును గూర్చి, గమిష్యతి = వెళ్ళగలదు.

తా. ఎల్లపుడు సుఖములకు అలవాటు పడినదీ, జనకునకు ఇష్టమైన కుమార్తెయూ, అయిన సీత, ఇపుడు ముండ్లపై నడచుటచే బాధపడుచు అరణ్యములోనికి వెళ్ళగలదు. 19

మూ. అనభిజ్ఞా వనానాం సా నూనం భయముపైష్యతి.
శ్వాపదానర్దితం శ్రుత్వా గమ్భీరం రోమహర్షణమ్. 20

ప్ర. అ. వనానామ్ = వనములకు, అనభిజ్ఞా = పరిచితురాలు కాని, సా = ఆమె, నూనమ్ = తప్పక, గమ్భీరమ్ = గంభీరమైనదీ, రోమహర్షణమ్ = గగుర్పాటు కల్గించునదీ, అయిన, శ్వాపదానర్దితమ్ = క్రూరమృగముల ధ్వనిని, శ్రుత్వా = విని, భయమ్ = భయమును, ఉపైష్యతి = పొందగలదు.

తా. పూర్వ మెన్నడును అడవులను చూడని ఆ సీత, గగుర్పాటు కల్గించు గంభీర మైన, క్రూరమృగముల ధ్వనిని విని భయపడును. 20

మూ. సకామా భవ కైకేయి విధవా రాజ్య మావస,
న హి తం పురుషవ్యాఘ్రం వినా జీవితుముత్సహే. 21

ప్ర. అ. కైకేయి = ఓకైకేయీ, సకామా = నిండిన కోర్కె కలదాన వై, భవ = అగుము. విధవా = మరణించిన భర్త గందానవై, రాజ్యమ్ = రాజ్యమును, ఆవస = అధిష్ఠించుము. పురుషవ్యాఘ్రమ్ = పురుషశ్రేష్ఠు డైన, తం వినా = ఆ రాముడు లేకుండగ, జీవితుమ్ = జీవించుటకు, న ఉత్సహే హి = కోరనుగదా।

తా. కైకేయీ! నీ కోరిక తీరినది. విధవ వై రాజ్యమును పాలించుము. పురుష శ్రేష్ఠు డైన ఆ రాముడు లేకుండగ నేను జీవించజాలను. 21

మూ. ఇత్యేవం విలపన్ రాజా జనౌఘేనాభిసంవృతః,
అపస్నాత ఇవారిష్టం ప్రవివేశ పురోత్తమమ్. 22

ప్ర. అ. ఇత్యేవమ్ = ఈ విధముగా, విలపన్ = విలపించుచు, రాజా = రాజు, జనౌఘేన = జనసముదాయముచేత, అభిసంవృతః = చుట్టబడినవాడై, అపస్నాతః = అమంగళ మైన మృతిస్నానము చేసినవాడు, అరిష్టం ఇవ = అమంగళకర మైన గృహమును వలె, పురోత్తమమ్ = పురములలో శ్రేష్ఠ మైన అయోధ్యను, ప్రవివేశ = ప్రవేశించెను.

తా. ఈ విధముగా విలపించుచు, రాజు, జనసముదాయముతో కూడి, బంధు మరణము విని స్నానము చేసినవాడు అమంగళ మైన గృహమును ప్రవేశించినట్లు పురములలో శ్రేష్ఠమైన అయోధ్యలోనికి ప్రవేశించెను. 22

మూ. శూన్యచత్వరవేశ్మాన్తాం సంవృతాపణదేవతామ్,
క్లాన్తదుర్బలదుఃఖార్తాం నాత్యాకీర్ణమహాపథామ్,
తామవేక్ష్య పురీం సర్వాం రామమేవానుచిన్తయన్,
విలపన్ ప్రావిశద్రాజా గృహం సూర్య ఇవామ్బుదమ్.

ప్ర. అ. శూన్యచత్వరవేశ్మాన్తామ్ = జనశూన్య మైన చతుష్పథములు గృహమధ్యములు కలదీ, సంవృతాపణదేవతామ్ = మూసివేయబడిన అంగళ్ళు

దేవాలయములు కలదీ, క్లాన్తదుర్బలదుఃఖార్తాం = అలసిపోయిన దుర్బలు లైన దుఃఖార్తు లైన జనులు కలదీ, నాత్యాకీర్ణమహాపథామ్ = సరిగా శుభ్రము చేయబడని రాజమార్గములు కలదీ అయిన, తామ్ = ఆ, సర్వామ్ = సమస్త మైన, పురీమ్ = పట్టణమును, అవేక్ష్య = చూచి, రాజా = రాజు, రామమేవ = రామునే, అనుచిన్తయన్ = తలచుచు, విలపన్ = విలపించుచు, సూర్యః = సూర్యుడు, అమ్బుదమ్ ఇవ = మేఘమును వలె, ప్రావిశత్ = ప్రవేశించెను.

తా. అయోధ్యలోని చతుష్పథములు, (నాలుగు వీధుల కూడలి] గృహపథ్య ములు, జనశూన్యములై యుండెను. అంగళ్ళు, దేవాలయములు మూసివేయబడెను. జనులందరు దుఃఖార్తులై అలసి, దుర్బలులై యుండిరి. రాజమార్గములు సరిగా శుభ్రము చేయబడలేదు. అట్టి ఆ నగరము నంతను చూచి, దశరథుడు, రామునే స్మరించుచు, విలపించుచు, సూర్యుడు మేఘములోనికి ప్రవేశించి నట్లు ఇంటిలోనికి ప్రవేశించెను. 23

మూ. మహాహ్రద మివాక్షోభ్యం సుపర్ణేన హృతోరగమ్,
రామేణ రహితం వేశ్మ వైదేహ్యా లక్ష్మణేన చ. 24

ప్ర. అ. రామేణ = రామునితోను, వైదేహ్యా = సీతతోను, లక్ష్మణేన చ = లక్ష్మణునితోను, రహితమ్ = శూన్యమైన, వేశ్మ = గృహము, సుపర్ణేన = గరుత్మంతునిచే, హృతోరగమ్ = హరింపబడిన సర్పము గల, అక్షోభ్యమ్ = క్షోభింప శక్యము గాని, మహాహ్రదమ్ ఇవ = గొప్ప హ్రదమువలె యుండెను. (అట్టి గృహమును ప్రవేశించెను.)

తా. సీతారామలక్ష్మణులు లేని ఆ గృహము, గరుత్మంతునిచే అపహరింపబడిన సర్పము గలదీ, [ఆ సర్పమున్నంతవరకు] ప్రవేశింప శక్యముగానిదీ యైన గొప్ప మడుగు వలె యుండెను. 24

మూ. అథ గద్గదశబ్దస్తు విలపన్మనుజాధిపః,
ఉవాచ మృదుమన్దార్థం వచనం దీన మస్వరమ్. 25

ప్ర. అ. అథ = అటుపిమ్మట, వసుధాధిపః = రాజు, గద్గదశబ్దః = డగ్గుత్తికతో కూడిన శబ్దము కలవాడై, విలపన్ = విలపించుచు, మృదు = మృదువైనదీ, మన్దార్థమ్ = మందమైన అర్థము గలదీ, అస్వరమ్ = స్వరము లేనిది అయిన, దీనం వచనమ్ = దీనమైన వాక్యమును, ఉవాచ = పలికెను.

తా. ఆ దశరథుడు దగ్గుత్తికతో కూడిన ధ్వనితో వినిపించుడు, మృదువైనది, మంద మైన అర్థము గలది, స్వరము లేనిది అయిన వచనమును, దీనముగా పలికెను. 25

మూ. కౌసల్యాయాం గృహం శీఘ్రం రామమాతుర్నయన్తు మామ్,
న హ్యన్యత్ర మమాశ్వాసో హృదయస్య భవిష్యతి. 26

ప్ర. అ. రామమాతుః=రాముని తల్లి యైన, కౌసల్యాయాః = కౌసల్య యొక్క, గృహమ్ = గృహమును గూర్చి, మామ్=నన్ను, శీఘ్రమ్ = శీఘ్రముగా, నయన్తు=తీసుకొని వెళ్ళెదరుగాక; మమ హృదయస్య=నా హృదయమునకు, అన్యత్ర=మరియొక చోట, ఆశ్వాసః = ఊరట, న భవిష్యతి హి = కలుగదు కదా!

తా. నన్ను శీఘ్రముగా, రామమాత యైన కౌసల్య ఇంటికి తీసుకొని వెళ్లుడు. నా హృదయమునకు మరి ఎక్కడను ఊరట కలుగదు. 26

మూ. ఇతి బ్రువన్తం రాజాన మనయన్ ద్వారదర్శినః,
కౌసల్యాయా గృహం తత్ర న్యవేశ్యత వినీతవత్. 27

ప్ర. అ. ఇతి = ఇట్లు, బ్రువన్తమ్ = పలుకుచున్న, రాజానమ్ = రాజును, ద్వారదర్శినః = ద్వారపాలకులు, కౌసల్యాయాః = కౌసల్యయొక్క, గృహమ్= గృహమును, అనయన్ = తీసుకొని వెళ్ళిరి. తత్ర = అచట, వినీతవత్ = వినయపూర్వకముగా, న్యవేశ్యత=పరుండపెట్టబడెను.

తా. రాజు మాటలు విని, ద్వారపాలకులు అతనిని కౌసల్యయింటికి తీసుకొని వెళ్ళి వినయపూర్వకముగా అచట పరుండబెట్టిరి. 27

మూ. తతస్తస్య ప్రవిష్టస్య కౌసల్యాయా నివేశనమ్.
అధిరుహ్యాపి శయనం బభూవ లులితం మనః. 28

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కౌసల్యాయాః = కౌసల్యయొక్క, నివేశనమ్=గృహమును, ప్రవిష్టస్య = ప్రవేశించిన, తస్య=అతనియొక్క, మనః= మనస్సు, శయనమ్ = శయనమును, అధిరుహ్యాపి = ఎక్కి యున్నను, లులితమ్ = కలిగిపోయినది, బభూవ = అయి ఉండెను.

కౌసల్య గృహమును ప్రవేశించిన ఆ దశరథుడు శయనముపై పరుండి యున్నను, అతని మనస్సు దుఃఖాక్రాంత మై యుండెను. 28

మూ. పుత్రద్వయవిహీనం చ స్నుషయాపి వివర్జితమ్,
అపశ్యద్భవనం రాజా నష్టచన్ద్రమివామ్బరమ్. 29

ప్ర. అ. రాజా = రాజు, పుత్రద్వయవిహీనమ్ = ఇద్దరు పుత్రులతో శూన్య మైనదీ, స్నుషయాపి = కోడలిచేత కూడ, వివర్జితమ్ = విడువబడినదీ అయిన, భవనమ్ = గృహమును, నష్టచన్ద్రమ్ = నష్ట మైన చంద్రుడు గల, అమ్బరమ్ ఇవ = ఆకాశమును వలె, అపశ్యత్ = చూచెను.

తా. ఇరువురు కుమారులు, కోడ లైన సీత లేని ఆ గృహము, రాజునకు చంద్రుడు లేని ఆకాశము వలె కనబడెను. 29

మూ. తచ్చ దృష్ట్వా మహారాజో భుజముద్యమ్య వీర్యవాన్,
ఉచ్చైఃస్వరేణ చుక్రోశ హా రాఘవ జహాసి మామ్. 30

ప్ర. అ. వీర్యవాన్ = పరాక్రమవంతు డైన, మహారాజః = మహారాజు, తత్ = ఆ గృహమును, దృష్ట్వా = చూచి, భుజమ్ = భుజమును, ఉద్యమ్య = ఎత్తి, హా రాఘవః = అయ్యో రామా! మామ్ = నన్ను, జహాసి = విడిచివేయు చున్నావు అని, ఉచ్చైఃస్వరేణ = ఉన్నతస్వరముతో, చుక్రోశ = ఏడ్చెను.

తా. పరాక్రమవంతు డైన ఆ మహారాజు, ఆ గృహమును చూచి, చేతులు ఎత్తి "అయ్యో రామా! నన్ను విడిచివేయుచున్నావు కదా!" అని బిగ్గరగా ఏడ్చెను. 30

మూ. సుఖితా బత తం కాలం జీవిష్యన్తి నరోత్తమాః,
పరిష్వజన్తో యే రామం ద్రక్ష్యన్తి పునరాగతమ్. 31

ప్ర. అ. యే = ఏ, నరోత్తమాః = పురుషశ్రేష్ఠులు, తం కాలమ్ = ఆ కాలమును, జీవిష్యన్తి = జీవించగలరో, వారు, పునః ఆగతమ్ = తిరిగి వచ్చిన, రామమ్ = రాముని, పరిష్వజన్తః = కౌగలించుకొనుచు, సుఖితాః = సుఖవంతు లై, ద్రక్ష్యన్తి = చూడగలరు. బత = ఎంతకష్టము.

తా. పదునాలుగు సంవత్సరముల కాలము పూర్తి యగువరకును జీవించి నరశ్రేష్ఠుడు రాముడు తిరిగి వచ్చు నపుడు అతనిని చూచి కౌగలించుకొని సుఖముగా నుండగలరు. అయ్యో! అట్టి భాగ్యము నా కుండదు కదా! ౮౧

మూ. అథ రాత్ర్యాం ప్రపన్నాయాం కాలరాత్ర్యామివాత్మనః,
అర్ధరాత్రే దశరథః కౌసల్యామిదమబ్రవీత్. ౮౨

ప్ర. అ. అథ = అటు పిమ్మట, దశరథః = దశరథుడు. ఆత్మనః = తనకు. కాలరాత్ర్యామివ = ప్రళయకాలరాత్రివలె నున్న, రాత్ర్యామ్ = రాత్రి, ప్రపన్నాయామ్ = వచ్చినదగుచుండగా, అర్ధరాత్రే = అర్ధరాత్రమునందు, కౌసల్యామ్ = కౌసల్యనుగూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఇంతలో దశరథునకు కాళరాత్రి వంటి రాత్రి వచ్చినది. అపుడు దశరథుడు అర్ధరాత్రియందు కౌసల్యతో ఇట్లు పలికెను. ౮౨

మూ. రామం మేఽనుగతా దృష్టిరద్యాపి న నివర్తతే,
న త్వా పశ్యామి కౌసల్యే సాధు మాం పాణినా స్పృశ.

ప్ర. అ. కౌసల్యే = కౌసల్యా! రామమ్ = రాముని, అనుగతా = అనుసరించి, వెళ్ళిన, మే దృష్టిః = నా చూపు, అద్యాపి = ఇపుడు కూడ, న నివర్తతే = తిరిగి రాలేదు. త్వా = నిన్ను, సాధు = చక్కగా, న పశ్యామి = చూడలేకున్నాను. మామ్ = నన్ను, పాణినా = హస్తముతో, స్పృశ = స్పృశింపుము.

తా. ఓ కౌసల్యా! నా దృష్టి రాముని వెంబడించి వెళ్ళిపోయినది. అది ఇంకను తిరిగివచ్చుట లేదు. నువ్వు నాకు సరిగా కనబడుటలేదు. నీ హస్తముతో నన్ను స్పృశించుము. ౮౩

మూ. తం రామమేవానువిచిన్తయన్తం,
సమీక్ష్య దేవీ శయనే నరేంద్రమ్,
ఉపోపవిశ్యాధికమార్తరూపా,
వినిఃశ్వసన్తి విలలాప కృచ్ఛ్రమ్. ౮౪

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ద్విచత్వారింశః సర్గః.

ప్ర. అ. దేవీ = కౌసల్యాదేవి, శయనే = శయనముపైన, రామమ్ ఏవ = రామునిగూర్చియే, అనుచిన్తయన్తమ్ = ఆలోచించుచున్న, తం నరేంద్రమ్ = ఆ రాజును, సమీక్ష్య = చూచి, ఉపోపవిశ్య = సమీపమున కూర్చుండి, అధికమ్ = మిక్కిలి, ఆర్తరూపా = దుఃఖితురాలై, వినిఃశ్వసన్తీ = నిట్టూర్చుచు, కృచ్ఛ్రమ్ = కష్టముగా, విలలాప = విలపించెను.

తా. శయనముపై పరుండి రాముని గూర్చియే ఆలోచించుచున్న ఆ రాజును చూచి, కౌసల్య చాలం దుఃఖించుచు సమీపమున కూర్చుండి, నిట్టూర్చుచు, విలపించెను. ౩౪

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిచత్వారింశః సర్గః

## [కౌసల్యా విలాపము]

మూ. తత స్సమీక్ష్య శయనే సన్నం శోకేన పార్థివమ్,
కౌసల్యా పుత్రశోకార్తా తమువాచ మహీపతిమ్. 1

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పుత్రశోకార్తా = పుత్రశోకముచే పీడింప బడిన, కౌసల్యా = కౌసల్య, శయనే = శయనముపై, శోకేన = దుఃఖముతో, సన్నమ్ = కృశించిన, పార్థివమ్ = ఆ రాజును, సమీక్ష్య = చూచి, తం మహీపతిమ్ = ఆ రాజును గూర్చి, ఉవాచ = పలికెను.

తా. పిదప, పుత్రశోకముతో బాధపడుచున్న ఆ కౌసల్య, శయనముపై పరుండి, శోకముచే కృశించిన ఆ దశరథమహారాజును చూచి, అతనితో యిట్లనెను. 1

మూ. రాఘవే నరశార్దూలే విషముప్త్వాహిజిహ్మగా,
విచరిష్యతి కైకేయీ నిర్ముక్తేవ హి పన్నగీ. 2

ప్ర. అ. అహిజిహ్మగా = సర్పము వలె, కుటిలముగా నడచు, కైకేయీ = కైకేయి, నరశార్దూలే = నరశ్రేష్ఠుడైన, రాఘవే = రామునియందు, విషమ్ = విషమును, ఉప్త్వా = నాటి, నిర్ముక్తా = కూసము విడిచిన, పన్నగీ ఇవ = ఆడ సర్పము వలె, విచరిష్యతి = సంచరింపగలదు.

తా. సర్పము వలె వక్రముగా నడచు స్వభావము గల కైకేయి, నరశ్రేష్ఠుడైన రాముని విషయమున విషము నాటినది. ఇపుడు ఇంక కూసము విడిచిన సర్పము వలె సంచరించును. 2

మూ. వివాస్య రామం సుభగా లబ్ధకామా సమాహితా,
త్రాసయిష్యతి మాం భూయో దుష్టాహిరివ వేశ్మని. 3

ప్ర. అ. సుభగా = సౌందర్యవతి యైన ఆ కైకేయి, రామమ్ = రాముని, వివాస్య = వెడలగొట్టి, లబ్ధకామా = పొందబడిన కోర్కె గలదై, భూయః = మరల, వేశ్మని = ఇంటిలో వున్న, దుష్టాహిరివ = దుష్టసర్పము వలె, మామ్ = నన్ను, సమాహితా = అన్ని విధముల సన్నద్ధురాలై, త్రాసయిష్యతి = భయ పెట్టగలదు.

తా. రాముని అరణ్యమునకు వెడలగొట్టి, కోర్కె తీరిన ఆ కైకేయి, ఇంటిలో నున్న దుష్టసర్పము వలె, ఇటు పైన నన్ను ప్రయత్నపూర్వకముగా, భయపెట్టగలదు. 3

మూ. అథ స్మ నగరే రామశ్చరన్ భైక్షం గృహే వసేత్,
కామకారో వరం దాతుమపి దాసం మమాత్మజమ్. 4

ప్ర. అ. మమ = నా యొక్క, ఆత్మజమ్ = కుమారుని, దాసమ్ = దాసునిగా, దాతుమ్ అపి = ఇచ్చుట యైనను, వరమ్ = శ్రేష్ఠము. అథ = అటుపిమ్మట, రామః = రాముడు, కామకారః = కోరిన (చెప్పిన) పనిచేయుచు, నగరే = నగరమునందు, భైక్షమ్ = భిక్షాన్నమును, చరన్ = సంపాదించుచు, గృహే = గృహమునందు, వసేత్ స్మ = నివసించెడివాడు.

తా. నా కుమారుని దాసునిగా చేసి ఆమెకు ఇచ్చినను, బాగుండెడిది. అపుడు రాముడు చెప్పిన పని చేయుచు, నగరములో భిక్షాటనము చేయుచు, ఇంటిలోనే ఉండెడివాడు. 4

మూ. పాతయిత్వా తు కైకేయ్యా రామం స్థానాద్యథేష్టతః,
ప్రవిద్ధో రక్షసాం భాగః పర్వణీవాహితాగ్నినా. 5

ప్ర. అ. కైకేయ్యా = కైకేయిచేత, యథేష్టతః = తన ఇష్టము ప్రకారము, రామమ్ = రాముని, స్థానాత్ = స్థానమునుండి, పాతయిత్వా = పడద్రోసి, ఆహితాగ్నినా = ఆహితాగ్నిచేత, పర్వణి = పర్వకాలమునందు, రక్షసామ్ = రాక్షసులకు, భాగః ఇవ = భాగము వలె, ప్రవిద్ధః = విడువబడినది.

తా. నీవు కైకేయి ద్వారా రాముని, అతని స్థానమునుండి, స్త్రీ ఇష్టము తీర్చినట్లు, కిందకు పడద్రోసి, అహితాగ్ని పర్వసమయమున దేవతల కివ్వ వలసిన భాగమును, రాక్షసుల కిచ్చి నట్లు, రాముని రాజ్యమును భరతున కిచ్చితివి. 5

మూ. గజరాజగతిర్వీరో మహాబాహుర్ధనుర్ధరః,
వనమావిశతే నూనం సభార్యః సహ లక్ష్మణః. 6

ప్ర. అ. గజరాజగతిః = గజరాజువంటి నడక కలవాడు, వీరః = వీరుడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, ధనుర్ధరః = ధనుస్సును ధరించిన వాడు అన రాముడు, సభార్యః = భార్యతో కూడినవాడై, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, నూనమ్ = నిశ్చయముగా, వనమ్ = వనమును, ఆవిశతే = ప్రవేశించుచున్నాడు.

తా. గజరాజువంటి నడక కలవాడు, వీరుడు, ఆజానుబాహువు, ధనుర్ధరుడు అయిన రాముడు, సీతాలక్ష్మణ సహితుడై, అడవిలో ప్రవేశించి యుండును.

మూ. వనే త్వదృష్టదుఃఖానాం కైకేయ్యనుమతే త్వయా,
త్యక్తానాం వనవాసాయ కా న్వవస్థా భవిష్యతి. 7

ప్ర. అ. అదృష్టదుఃఖానామ్ = చూడబడని దుఃఖము కలవారు, కైకేయ్యాః = కైకేయియొక్క, అనుమతే = ఇష్టమునందు, త్వయా = నీచేత, వనవాసాయ = వనవాసముకొరకు, త్యక్తానామ్ = పంపబడినవారు అయిన, సీతారామలక్ష్మణులకు, వనే = వనమునందు, కా ను = ఎట్టి, అవస్థా = అవస్థ, భవిష్యతి = కాగలదో,

తా. సీతారామలక్ష్మణులు ఎన్నడును కష్టములు అనుభవించినవారు కారు. అట్టి వారిని నీవు కైకేయి ఇష్టము ప్రకారము, అరణ్యమునకు పంపివేసితివి. అరణ్యములో వారి అవస్థ ఎట్లుండునో కదా! 7

మూ. తే రత్నహీనాస్తరుణాః ఫలకాలే వివాసితాః,
కథం వత్స్యంతి కృపణాః ఫలమూలైః కృతాశనాః. 8

ప్ర. అ. రత్నహీనాః = మంచి వస్తువులు లేనివారు, ఫలకాలే = భోగములను అనుభవింప దగు కాలమున, వివాసితాః = వెడలఁగొట్టఁ బడినవారు, తరుణాః = యువకులు అయిన, తే = వారు, కృపణాః = దీనులై, ఫలమూలైః = ఫలములతోను, దుంపలతోను, కృతాశనాః = చేయఁబడిన ఆహారము కలవారై, కథమ్ = ఎట్లు, వత్స్యన్తి = నివసింతురో.

తా. ఉత్తమపదార్థములు ఏమియు లేని వారిని భోగములు అనుభవింపవలసిన కాలములో వెడలఁగొట్టిరి. యువకు లైన వారు, దీనులై ఫలములను మూలములను తినుచు ఎట్లుందురో కదా! 8

మూ. అపీదానీం స కాలః స్యాన్మమ శోకక్షయః శివః,
సభార్యం యత్సహ భ్రాత్రా పశ్యేయ మిహ రాఘవమ్.

ప్ర. అ. యత్ = ఎప్పుడు, సభార్యమ్ = భార్యతో కూడిన, రాఘవమ్ = రాముని, సహ భ్రాత్రా = సోదరునితో కూడ, ఇహ = ఇక్కడ, పశ్యేయమ్ = చూచెదనో, శోకక్షయః = శోకమును నశింపచేయునది, శివః = మంగళప్రదము అయిన, సః కాలః = ఆ కాలము, ఇదానీమ్ = ఇపుడు, మమ = నాకు, అపి స్యాత్ = వచ్చునా!

తా. రాముడు భార్యతోను, తమ్మునితోను కలిసి ఇక్కడకు వచ్చి నా శోకమును తొలగించు మంగళప్రద మైన కాలమును నే నెన్న డైన చూచెదనా!

మూ. శ్రుత్వైవోపస్థితౌ వీరౌ కదాఽయోధ్యా భవిష్యతి,
యశస్వినీ హృష్టజనా సూచ్ఛ్రితధ్వజమాలినీ. 10

ప్ర. అ. వీరౌ = ఆ వీరులను, ఉపస్థితౌ = వచ్చిన వారినిగా, శ్రుత్వైవ = వినగానే, యశస్వినీ = కీర్తి గల, అయోధ్యా = అయోధ్య, హృష్టజనా = సంతోషించిన జనము గలదై, సూచ్ఛ్రితధ్వజమాలినీ = అందముగా ఎగురవేయఁబడిన, ధ్వజ పంక్తులు కలదై, కదా = ఎపుడు, భవిష్యతి = కాగలదో.

తా. వీరు లైన ఆ రామలక్ష్మణులు, తిరిగి వచ్చి నట్లు వినగానే కీర్తి గల ఈ అయోధ్యలోని జను లందరు మిక్కిలి సంతోషించి చక్కని ధ్వజ పంక్తులను ఎపుడు ఎగురవేసెదరో. 10

మూ. కదా ప్రేక్ష్య నరవ్యాఘ్రా వరణ్యాత్పునరాగతౌ,
నన్దిష్యతి పురీ హృష్టా సముద్ర ఇవ పర్వణి. 11

ప్ర. అ. అరణ్యాత్=అరణ్యమునుండి, పునః=తిరిగి, ఆగతౌ=వచ్చిన, నరవ్యాఘ్రౌ=పురుషులలో శ్రేష్ఠులైన ఆ రామ లక్ష్మణులను, ప్రేక్ష్య=చూచి, పురీ=పట్టణము, పర్వణి=పూర్ణిమయందు, సముద్ర ఇవ=సముద్రము వలె, హృష్టా=పొంగినదై, కదా=ఎపుడు, నన్దిష్యతి=సంతోషించునో।

తా. రామలక్ష్మణులు తిరిగి రాగా చూచి, ఈ పట్టణ మంతయు, పూర్ణిమ నాడు సముద్రము వలె ఉప్పొంగుచు, ఎపుడు ఆనందించునో. 11

మూ. కదాఽయోధ్యాం మహాబాహుః పురీం వీరః ప్రవేక్ష్యతి,
పురస్కృత్య రథే సీతాం వృషభో గోవధూమివ. 12

ప్ర. అ. మహాబాహుః= గొప్ప బాహువులు గల, వీరః = వీరుడైన రాముడు, వృషభః=వృషభము, గోవధూమివ = ఆవును వలె, సీతామ్=సీతను, రథే = రథమునందు, పురస్కృత్య = ఎదుట ఉంచుకొని, అయోధ్యాం పురీమ్ = అయోధ్యాపట్టణమును, కదా = ఎప్పుడు, ప్రవేక్ష్యతి = ప్రవేశించునో।

తా. ఆజానుబాహుడూ, వీరుడూ అయిన రాముడు వృషభము ఆవును ఎదుట ఉంచుకొని వచ్చు నట్లు సీతను రథముపై ఎదుట కూర్చుండ బెట్టుకొని ఎప్పుడు అయోధ్యానగరములో ప్రవేశించునో కదా। 12

మూ. కదా ప్రాణిసహస్రాణి రాజమార్గే మమాత్మజౌ,
లాజైరవకరిష్యన్తి ప్రవిశన్తావరిన్దమౌ. 13

ప్ర. అ. ప్రవిశన్తౌ = అయోధ్యాపురములో ప్రవేశించుచున్న, అరిన్దమౌ = శత్రుసంహారకులైన, మమ = నాయొక్క, ఆత్మజౌ = కుమారులను, రాజమార్గే = రాజమార్గమునందు, ప్రాణిసహస్రాణి=వేలకొలది జనులు, లాజైః = పేలాలచే, కదా = ఎప్పుడు, అవకరిష్యన్తి = చల్లెదరో।

తా. శత్రుభయంకరులైన నా కుమారులు, రామలక్ష్మణులు, నగరములో ప్రవేశించుచుండగా, వేలకొలది జనులు రాజమార్గమునందు, వారిపై పేలాలు ఎప్పుడు చల్లెదరో కదా। 13

మూ. ప్రవిశన్తౌ కదాఽయోధ్యాం ద్రక్ష్యామి శుభకుణ్డలౌ,
ఉదగ్రాయుధనిస్త్రింశౌ సశృఙ్గావివ పర్వతౌ. 14

ప్ర. అ. అయోధ్యామ్ = అయోధ్యను, ప్రవిశన్తౌ = ప్రవేశించుచున్నవారూ, శుభకుణ్డలౌ = అందమైన కుండలములు కలవారూ, ఉదగ్రాయుధనిస్త్రింశౌ = తీవ్రమైన ఆయుధములు, ఖడ్గములు కలవారూ, సశృఙ్గౌ = శిఖరములతో కూడిన, పర్వతావివ = పర్వతములవలె నున్నవారూ అయిన రామలక్ష్మణులను, కదా = ఎప్పుడు, ద్రక్ష్యామి = చూడగలనో.

తా. అందమైన కుండలములు ధరించి, భయంకరములైన ఆయుధములతోను, ఖడ్గములతోను, శిఖరములతో గూడిన పర్వతముల వలె ప్రకాశించుచున్న, రామలక్ష్మణులు అయోధ్యలో ప్రవేశించుచుండగా ఎప్పుడు చూచెదనో కదా! 14

మూ. కదా సుమనసః కన్యా ద్విజాతీనాం ఫలాని చ,
ప్రదిశన్తః పురీం హృష్టాః కరిష్యన్తి ప్రదక్షిణమ్. 15

ప్ర. అ. హృష్టాః = సంతోషించినవారై (ఆ సీతారామలక్ష్మణులు), కన్యాద్విజాతీనామ్ = కన్యలకును, ద్విజులకును, సుమనసః = పుష్పములను, ఫలాని చ = ఫలములను, ప్రదిశన్తః = ఇచ్చుచు, కదా = ఎప్పుడు, పురీమ్ = పట్టణమును, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణము, కరిష్యన్తి = చేయగలరో!

తా. ఆ సీతారామలక్ష్మణులు, కన్యలకును, ద్విజులకును పుష్పఫలములను పంచి పెట్టుచూ, ఆనందముతో పట్టణమునకు ఎప్పుడు ప్రదక్షిణము చేయుదురో కదా! 15

మూ. కదా పరిణతో బుద్ధ్యా వయసా చామరప్రభః,
అభ్యుపైష్యతి ధర్మజ్ఞస్త్రివర్ష ఇవ మాం లలన్. 16

ప్ర. అ. అమరప్రభః = దేవతలవంటి కాంతి గల, ధర్మజ్ఞః = ధర్మము నెరిగిన రాముడు, బుద్ధ్యా = బుద్ధిచేతను, వయసా చ = వయస్సు చేతను, పరిణతః = పరిణతి చెందినవాడై, త్రివర్షః ఇవ = మూడు సంవత్సరముల వయస్సు కలవాని వలె, లలన్ = క్రీడించుచు, మామ్ = నన్ను, కదా = ఎప్పుడు, అభ్యుపైష్యతి = చేరునో!

తా. దేవతలవంటి కాంతి కలవాడూ, ధర్మములు తెలిసినవాడు అయిన రాముడు, పదునాలుగు సంవత్సరములలో బుద్ధి చేతను, వయస్సు చేతను గూడ మంచి పరిణతి చెందెను. అయినను, ఆ రాముడు మూడు సంవత్సరముల పిల్లవాడు వలె క్రీడించుచు నా దగ్గరికి ఎప్పుడు వచ్చునో! 16

మూ. నిస్సంశయం మయా మన్యే పురా వీర కదర్యయా,
పాతుకామేషు వత్సేషు మాతౄణాం శాతితాః స్తనాః. 17

ప్ర. అ. వీర = వీరుడా! కదర్యయా = క్రూరురాలనైన, మయా = నాచేత, నిస్సంశయమ్ = సంశయములేకుండ, పురా = పూర్వము। వత్సేషు = లేగదూడలు, పాతుకామేషు = పాలు త్రాగగోరుచుండగా. మాతౄణామ్ = తల్లుల యొక్క, స్తనాః = స్తనములు, శాతితాః = ఛేదింపబడినవి.

తా. ఓ వీరుడా! క్రూరురాలనైన నేను పూర్వజన్మలో, దూడలు పాలు త్రాగవలె నని అనుకొనుచుండగా, వాని తల్లుల స్తనములను ఛేదించితిని, సందేహము లేదు. 17

మూ. సాహం గౌరివ సింహేన వివత్సా వత్సలా కృతా,
కైకేయ్యా పురుషవ్యాఘ్ర బాలవత్సేవ గౌర్బలాత్. 18

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషులలో శ్రేష్ఠుడా! బాలవత్సా = లేతదూడగల, గౌరివ = ఆవువలె, వత్సలా = బిడ్డయందు ప్రేమ గల, సా అహమ్ = అట్టి నేను, కైకేయ్యా = కైకేయిచేత, సింహేన = సింహము చేత, గౌరివ = గోవు వలె: బలాత్ = బలాత్కారముగా, వివత్సా = బిడ్డడు లేనిదిగా, కృతా = చేయబడితిని.

తా. పురుషులలో శ్రేష్ఠుడవైన ఓ మహారాజా! చిన్నదూడపై గోవుకు ఎంత ప్రేమయుండునో నాకు నా పుత్రుడన్న అంత ప్రేమ. అట్టి నన్ను కైకేయి సింహము గోవును, తన దూడనుండి దూరము చేసినట్లు, నన్ను బలాత్కారముగ నా పుత్రునినుండి దూరము చేసినది. 18

మూ. న హి తావద్గుణైర్జుష్టం సర్వశాస్త్రవిశారదమ్,
ఏకపుత్రా వినా పుత్రమహం జీవితుముత్సహే. 19

ప్ర. అ. ఏకపుత్రా = ఒకే పుత్రుడు గల, అహమ్ = నేను, తావద్గుణైః = అన్ని సద్గుణములతో, జుష్టమ్ = కూడిన వాడూ, సర్వశాస్త్రవిశారదమ్ = సకల

శాస్త్రములందు నేర్పు కలవాడూ అయిన, పుత్రం వినా = పుత్రుని విడచి, జీవి
తుమ్ = జీవించుటకు, న ఉత్సహే హి = ఉత్సహింపను.

తా. అట్టి సద్గుణములు కలవాడూ, సర్వశాస్త్రములలో పండితుడు అయిన
నా ఏకైకపుత్రుని విడచి నేను జీవించజాలను. 19

మూ. న హి మే జీవితే కించిత్సామర్థ్యమిహ కల్ప్యతే,
అపశ్యన్త్యాః ప్రియం పుత్రం మహాబాహుం మహాబలమ్. 20

ప్ర. అ. మహాబాహుమ్ = గొప్ప బాహువులు గలవాడూ, మహాబలమ్ =
గొప్పబలము గలవాడూ అయిన, ప్రియం పుత్రమ్ = ప్రియుడైన పుత్రుని, అప
శ్యన్త్యాః = చూడని, మే = నాకు, ఇహ = ఈ, జీవితే = జీవితమునందు, కించిత్
= కొంచె మైనను. సామర్థ్యమ్ = సామర్థ్యము, న కల్ప్యతే హి = కల్పించ
బడదు కదా.

తా. అజానుబాహుడు మహాబలశాలి అయిన నా ప్రియ పుత్రుని చూడ
కుండ జీవించుటకు నా కేమాత్రము సామర్థ్యము లేదు. 20

మూ. అయం హి మాం దీపయతే సముత్థిత
స్తనూజశోకప్రభవో హుతాశనః,
మహీమిమాం రశ్మిభి రుత్తమప్రభో,
యథా నిదాఘే భగవాన్ దివాకరః. 21

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
త్రిచత్వారింశః సర్గః.

ప్ర. అ. తనూజశోకప్రభవః = పుత్రశోకమువలన కలిగిన, అయమ్ =
ఈ, హుతాశః = అగ్ని, సముత్థితః = పైకి లేచిన దై, నిదాఘే = గ్రీష్మము
నందు, ఉత్తమప్రభః = శ్రేష్ఠమైన కాంతి గల, భగవాన్ = భగవంతుడైన,
దివాకరః = సూర్యుడు, రశ్మిభిః = కిరణములచేత, ఇమామ్ = ఈ, మహీం యథా =
భూమిని వలె, మామ్ = నన్ను, దీపయతే = ప్రజ్వలింప చేయుచున్నది.

తా. పుత్రశోకమువలన కలిగిన ఈ అగ్ని ప్రైతి శేది, గ్రీష్మకాలమునందు తీవ్రమైన కాంతి గల భగవంతుడైన సూర్యుడు తన కిరణములచే ఈ భూమిని కాల్చివేసినట్లు నన్ను కాల్చివేయుచున్నది. 21

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుశ్చత్వారింశః సర్గః

## [సుమిత్ర కౌసల్యను ఓదార్చుట.]

మూ. విలపన్తీం తథా తాం తు కౌసల్యాం ప్రమదోత్తమామ్,
ఇదం ధర్మే స్థితా ధర్మ్యం సుమిత్రా వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. ధర్మే = ధర్మమునందు, స్థితా = ఉన్న, సుమిత్రా = సుమిత్ర, తథా = ఆ విధముగా, విలపన్తీమ్ = ఏడ్చుచున్న, ప్రమదోత్తమామ్ = స్త్రీలలో శ్రేష్ఠురాలైన, తాం కౌసల్యామ్ = ఆ కౌసల్యను గూర్చి, ధర్మ్యమ్ = ధర్మసమ్మతమైన, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ విధముగా విలపించుచున్న ఉత్తమస్త్రీయైన కౌసల్యను చూచి, ధర్మమునందు స్థిరమైన బుద్ధి గల సుమిత్ర, ధర్మసమ్మతమైన మాట పలికెను. 1

మూ. తవార్యే సద్గుణైర్యుక్తః పుత్రః స పురుషోత్తమః,
కిం తే విలపితేనైవం కృపణం రుదితేన వా. 2

ప్ర. అ. ఆర్యే = పూజ్యురాలా, సద్గుణైః = మంచి గుణములతో, యుక్తః = కూడిన, తవ = నీయొక్క, సః పుత్రః = ఆ పుత్రుడైన రాముడు, పురుషోత్తమః = పురుషులలో శ్రేష్ఠుడు. ఏవమ్ = ఇట్లు, తే = నీయొక్క, విలపితేన = విలాపము చేత గాని, కృపణమ్ = దీనముగా, రుదితేన వా = ఏడ్పుటచేత గాని, కిమ్ = ఏమి ప్రయోజనము (కారణము).

తా. పూజ్యురాలా! నీ పుత్రుడైన రాముడు సకలసద్గుణసంపన్నుడు. పురుషులలో శ్రేష్ఠుడు. నీ వీ విధముగ ఏల విలపించెదవు? దీనముగా ఎందు కేడ్చెదవు? 2

మూ. యస్తవార్యే గతః పుత్రస్త్యక్త్వా రాజ్యం మహాబలః,
సాధు కుర్వన్ మహాత్మానం పితరం సత్యవాదినమ్. 3

శిష్టైరాచరితే సమ్యక్ శశ్వత్ప్రేత్య ఫలోదయే,
రామో ధర్మే స్థితః శ్రేష్ఠో న స శోచ్యః కదాచన. 4

ప్ర. అ. ఆర్యే = పూజ్యురాలా, మహాబలః = మహాబలముగల, యః = ఏ, తవ పుత్రః = నీ పుత్రుడు, మహాత్మానమ్ = మహాత్ముడైన, పితరమ్ = తండ్రిని, సాధు = బాగుగా, సత్యవాదినమ్ = సత్యమే పలుకువానినిగా, కుర్వన్ = చేయుచు, రాజ్యమ్ = రాజ్యమును, త్యక్త్వా = విడచి, శిష్టైః = శిష్టులచేత, సమ్యక్ = బాగుగా, శశ్వత్ = ఎల్లప్పుడును, ఆచరితే = ఆచరింపబడినదీ, ప్రేత్య = మరణానంతరముకూడ, ఫలోదయే = ఫలము నిచ్చునదీ అయిన, ధర్మే = ధర్మమునందు, స్థితః = నిలచినాడో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, సః = ఆ, రామః = రాముడు, కదాచన = ఎన్నడును, శోచ్యః = దుఃఖింపదగినవాడు, న = కాడు.

తా. ఓ పూజ్యురాలా! నీ కుమారుడైన రాముడు మహాబలశాలి. శ్రేష్ఠుడు. మహాత్ముడైన తండ్రి మాటను సత్యము చేయుటకై రాజ్యమును విడచి శిష్టులందరును ఎల్లప్పుడును చక్కగా ఆచరించినదీ, మరణానంతరము గూడ మంచి ఫలము నిచ్చునదీ అయిన ధర్మమార్గమున స్థిరముగా నిలచి ఉన్నాడు. అట్టి రాముని గూర్చి ఎన్నడును విచారింప పని లేదు. 3, 4

మూ. వర్తతే చోత్తమాం వృత్తిం లక్ష్మణోఽస్మిన్ సదానఘః,
దయావాన్ సర్వభూతేషు లాభస్తస్య మహాత్మనః. 5

ప్ర. అ. అనఘః = దోషములు లేనివాడూ, సర్వభూతేషు = సమస్తప్రాణులందును, దయావాన్ = దయగలవాడూ అయిన, లక్ష్మణః = లక్ష్మణుడు, అస్మిన్ = ఈ రాముని విషయమున, సదా = ఎల్లప్పుడును, ఉత్తమామ్ = ఉత్తమమైన, వృత్తిమ్ = ప్రవృత్తిని, వర్తతే = ప్రవర్తించుచున్నాడు (చూపుచున్నాడు). మహాత్మనః = ఉత్తమమైన బుద్ధిగల, తస్య = వానికి, లాభః = ఇది లాభకరము.

తా. దోషరహితుడూ, సకలప్రాణులందును దయగలవాడూ అయిన లక్ష్మణుడు ఈ రాముని విషయమున ఉత్తమమైన ప్రవృత్తిని (భక్తిని) చూపుచున్నాడు. దానిచే అతడు (రాముడు) లాభము పొందగలడు. 5

మూ. అరణ్యవాసే యద్దుఃఖం జానతీ వై సుఖోచితా,
అనుగచ్ఛతి వైదేహీ ధర్మాత్మానం తవాత్మజమ్. 6

ప్ర. అ. సుఖోచితా = సుఖమునకు అలవాటు పడిన, వైదేహీ = సీత, అరణ్యవాసే = అరణ్యవాసమునందు, యత్ = ఏ, దుఃఖమ్ = దుఃఖ మున్నదో దానిని, జానతీ వై = ఎరిగిన దగుచునే, ధర్మాత్మానమ్=ధర్మాత్ము డైన, తవ = నీయొక్క, ఆత్మజమ్ = కుమారుని, అనుగచ్ఛతి=అనుసరించుచున్నది.

తా. సుఖమునకు అలవాటుపడిన సీత కూడ అరణ్యవాసములో ఉండు కష్టము లన్నియు తెలిసియే ధర్మాత్ముడైన నీ కుమారుని అనుసరించి వెళ్ళినది. 6

మూ. కీర్తిభూతాం పతాకాం యో లోకే భ్రామయతి ప్రభుః,
ధర్మసత్యవ్రతపరః కిం న ప్రాప్త స్తవాత్మజః. 7

ప్ర. అ. ప్రభుః = సమర్థు డైన, యః = ఎవ్వడు, కీర్తిభూతామ్ = కీర్తి అనెడు, పతాకామ్ = పతాకను, లోకే=లోకమునందు, భ్రమయతి=ఎగురవేయు చున్నాడో, ధర్మసత్యవ్రతధనః = ధర్మమూ సత్యవ్రతమూ ధనముగా గల, అట్టి, తవ ఆత్మజః = నీ కుమారుడు, కిమ్=దేనిని, న ప్రాప్తః = పొందలేదు?

తా. ధర్మమూ, సత్యవ్రతము అనునవియే ధన మని తలచిన, సర్వ సమర్థు డైన నీ కుమారుడు, తన కీర్తిపతాకను ఈ లోకముపైని ఎగురవేయు చున్నాడు. అతనికి లభించని సత్ఫలిత మేమి ఉన్నది? 7

మూ. వ్యక్తం రామస్య విజ్ఞాయ శౌచం మాహాత్మ్యముత్తమమ్,
న గాత్రమంశుభిః సూర్యః సన్తాపయితుమర్హతి. 8

ప్ర. అ. రామస్య=రామునియొక్క, శౌచమ్=పరిశుద్ధిని, ఉత్తమమ్=ఉత్తమ మైన, మాహాత్మ్యమ్ = మాహాత్మ్యమును, విజ్ఞాయ = తెలుసుకొని, సూర్యః = సూర్యుడు, అంశుభిః = కిరణములచే, గాత్రమ్ = శరీరమును, సన్తాపయితుమ్= = తపింపచేయుటకు, న అర్హతి=తగడు. వ్యక్తమ్ = ఈ విషయము తథ్యము.

తా. రాముని పరిశుద్ధ మైన శీలమూ, ఉత్తమ మైన మాహాత్మ్యమూ తెలిసిన సూర్యుడు తన కిరణములచే రాముని శరీరమును తపింపచేయడు. తథ్యము.

మూ. శివః సర్వేషు కాలేషు కాననేభ్యో వినిఃసృతః,
రాఘవం యుక్తశీతోష్ణః సేవిష్యతి సుఖోఽనిలః. 9

ప్ర. అ. శివః = మంగళకర మైనదీ, కాననేభ్యః = అరణ్యమునుండి, వినిః సృతః = బయలుదేరినదీ, యుక్తశీతోష్ణః = తగిన చల్లదనమూ వేడి కలదీ, సుఖః = సుఖకరమూ అయిన, అనిలః = వాయువు, రాఘవమ్ = రాముని, సర్వేషు కాలేషు = అన్ని కాలములందును, సేవిష్యతి = సేవించగలదు.

తా. అరణ్యమునుండి వచ్చుచు, సమశీతోష్ణముగా, సుఖకరముగా ఉన్న గాలి, మంగళకర మగుచు, రాముని సర్వకాలములందును సేవించగలదు. 9

మూ. శయానమనఘం రాత్రౌ పితేవాభిపరిష్వజన్,
రశ్మిభిః సంస్పృశన్ శీతైశ్చన్ద్రమా అహ్లాదయిష్యతి. 10

ప్ర. అ. చన్ద్రమాః = చంద్రుడు, రాత్రౌ = రాత్రియందు, శయానమ్ = శయనించిన రాముని, శీతైః = చల్లని, రశ్మిభిః = కిరణములచేత, సంస్పృశన్ = స్పృశించుచు, పితేవ = తండ్రి వలె, అభిపరిష్వజన్ = ఆలింగనము చేసికొనుచు, అహ్లాదయిష్యతి = సంతోషింపచేయగలడు.

తా. రాత్రి నిద్రించుచున్న ఆ రాముని, చంద్రుడు తన కిరణములచేత స్పృశించుచు, తండ్రి వలె కౌగలించుకొని ఆనందింపచేయగలడు. 10

మూ. దదౌ చాస్త్రాణి దివ్యాని యస్మై బ్రహ్మా మహౌజసే,
దానవేన్ద్రం హతం దృష్ట్వా తిమిధ్వజసుతం రణే, 11
స శూరః పురుషవ్యాఘ్రః స్వబాహుబలమాశ్రితః,
అసన్త్రస్తోఽ ప్యరణ్యస్థో వేశ్మనీవ నివత్స్యతి. 12

ప్ర. అ. రణే = యుద్ధమునందు, దానవేన్ద్రమ్ = దానవులలో శ్రేష్ఠు డైన, తిమిధ్వజసుతమ్ = శంబరాసురుని కొడుకును, హతమ్ = చంపబడినవానినిగా, దృష్ట్వా = చూచి, మహౌజసే = గొప్ప తేజస్సు గల, యస్మై = ఏ రామునకు, బ్రహ్మా = బ్రహ్మదేవుడు, దివ్యాని = దివ్యము లైన, అస్త్రాణి = అస్త్రములను, దదౌ = ఇచ్చెనో, శూరః = శూరుడూ, పురుషవ్యాఘ్రః = పురుషులలో శ్రేష్ఠుడూ అయిన, సః = ఆ రాముడు, అరణ్యస్థోఽపి = అరణ్యములో నున్నవా డైనను, స్వబాహుబలమ్ = తన బాహుబలమును, ఆశ్రితః = ఆశ్రయించినవాడై, అసంత్రస్తః = భయపడక, వేశ్మనీవ = ఇంటిలో వలె, నివత్స్యతి = నివసించగలడు.

తా. పూర్వము రాముడు యుద్ధమునందు, దానవేంద్రు డైన శంబరాసుర పుత్రుని సంహరింపగా సంతోషించిన బ్రహ్మదేవుడు గొప్ప తేజస్సు గల ఆ రామునకు దివ్యాస్త్రముల నిచ్చెను. శూరుడూ, పురుషులలో శ్రేష్ఠుడూ అయిన అట్టి రాముడు, అరణ్యములో నున్నను, తన బాహుబలము సాహాయ్యముతో నిర్భయుడై, ఇంటిలో నివసించునట్లు నివసించగలడు.. 11.12

మూ. యస్యేషుపదమాసాద్య వినాశం యాన్తి శత్రవః,
కథం న పృథివీ తస్య శాసనే స్థాతుమర్హతి. 13

ప్ర. అ. యస్య = ఎవ్వనియొక్క, ఇషుపదమ్ = బాణములకు లక్ష్యత్వమును, ఆసాద్య = పొంది, శత్రవః = శత్రువులు, వినాశమ్ = నాశమును, యాన్తి = పొందుదురో, తస్య = అట్టి రామునియొక్క, శాసనే = శాసనమునందు, పృథివీ = భూమి, కథమ్ = ఎట్లు, స్థాతుమ్ = ఉండుటకు, నార్హతి = తగదు.

తా. ఏ రాముని బాణములకు గురి యైన శత్రువులు తప్పక నశింతురో, ఆ రామునికి ఈ భూమి యంతయు వశము కాక ఎట్లుండును. 13

మూ. యా శ్రీః శౌర్యం చ రామస్య యా చ కల్యాణసత్త్వతా,
నివృత్తారణ్యవాసః స్వం క్షిప్రం రాజ్యమవాప్స్యతి. 14

ప్ర. అ. రామస్య = రామునియొక్క, యా = ఏ, శ్రీః = శోభ ఉన్నదో, శౌర్యం చ = శౌర్యము ఉన్నదో, యా = ఏ, కల్యాణసత్త్వతా = మంగళకరమూ అయిన బలము కలిగి యుండుట అనునది ఏదైతే ఉన్నదో (వీటిచే), నివృత్తారణ్యవాసః = పూర్తి యైన అరణ్యవాసము కలవాడై, సః = ఆ రాముడు, క్షిప్రమ్ = శీఘ్రముగా, స్వం రాజ్యమ్ = తన రాజ్యమును, అవాప్స్యతి = పొందగలడు

తా. రామునియందు లక్ష్మి, శౌర్యము మంగళప్రద మైన బలము ఉన్నవి. వీటితో కూడిన రాముడు, అరణ్యవాసమును పూర్తి చేసుకొని శీఘ్రముగా తన రాజ్యమును పొందగలడు. 14

మూ. సూర్యస్యాపి భవేత్సూర్యో హ్యగ్నేరగ్నిః ప్రభోః ప్రభుః,
శ్రియశ్చ శ్రీరభవేదగ్ర్యా కీర్తిః కీర్త్యాః క్షమాక్షమా. 15

దైవతం దైవతానాం చ భూతానాం భూతసత్తమః,
తస్య కే హ్యగుణా దేవి వనే వాప్యథవా పురే. 16

ప్ర. అ. దేవి = ఓ కౌసల్యా, సూర్యస్యాపి = సూర్యునకు కూడ, సూర్యః = సూర్యుడుగా, భవేత్ = అగును. అగ్నేః = అగ్నికి, అగ్నిః = అగ్నిగాను, ప్రభోః = ప్రభువునకు, ప్రభుః = ప్రభువుగాను, శ్రియశ్చ = సంపదకు, శ్రీః = సంపదగాను, కీర్త్యాః = కీర్తికి, అగ్ర్యా = శ్రేష్ఠమైన, కీర్తిః = కీర్తిగాను, క్షమాక్షమా = ఓర్పుకు ఓర్పుగాను, దైవతానామ్ = దేవతలకు, దైవతమ్ = దేవతగాను, భూతానామ్ = భూతములకు, భూతసత్తమః = భూతశ్రేష్ఠుడు గాను, భవేత్ = అగును. తస్య = అట్టి రామునకు, వనే వాపి వనమునందైనను, అథవా = లేక, పురే = పట్టణమునందైనను, అగుణాః = చెడ్డ గుణములు, కే హి = ఏవి?

తా. ఓ కౌసల్యా! రాముడు సూర్యునకు కూడ సూర్యుడు గాను, అగ్నికి అగ్నిగాను, ప్రభువుకు ప్రభువుగాను, సంపదకు సంపదగాను, కీర్తికి శ్రేష్ఠమైన కీర్తిగాను, ఓర్పుకు ఓర్పుగాను, దేవతలకు దేవతగాను, భూతములకు, భూతశ్రేష్ఠుడుగాను కాగల సామర్థ్యము కలవాడు. అట్టి రామునకు అరణ్యములో నున్నను పురములో నున్నను ఏ లోపము ఉండును? 15.16.

మూ. పృథివ్యా సహ వైదేహ్యా శ్రియా చ పురుషర్షభః,
క్షిప్రం తిసృభిరేతాభిః సహ రామోఽభిషేక్ష్యతే. 17

ప్ర. అ. పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, రామః = రాముడు, పృథివ్యా సహ = భూమితో కూడ, వైదేహ్యా = సీతతో కూడ, శ్రియా చ = లక్ష్మితో కూడ, ఏతాభిః = ఈ, తిసృభిః సహ = ముగ్గురితో కూడ, క్షిప్రమ్ = శీఘ్రముగా, అభిషేక్ష్యతే = అభిషేకింపబడగలడు.

తా. పురుషశ్రేష్ఠుడైన రామునకు భూమి, సీత, లక్ష్మి అను ఈ ముగ్గురితో కలసి, రాజ్యాభిషేకము జరుగగలదు. 17

మూ. దుఃఖజం విసృజన్త్యస్రం నిష్క్రామన్తముదీక్ష్య యమ్,
అయోధ్యాయాం జనాః సర్వే శోకవేగసమాహతాః, 18
కుశచీరధరం దేవం గచ్ఛన్తమపరాజితమ్,
సీతేవానుగతా లక్ష్మీస్తస్య కిం నామ దుర్లభమ్. 19

టీ. నిర్యాన్తమ్ = ప్రయాణము అయి వెళ్ళుచున్న, యమ్ = ఏ, రాముని ఉదీక్ష్య = చూచి, అయోధ్యాయామ్ = అయోధ్యయందలి, సర్వే = సమస్త మైన జనాః = జనులు, శోకవేగసమాహతాః = దుఃఖవేగముచే కొట్టబడినవారై, దుఃఖజమ్ = దుఃఖమువలన కలిగిన, అస్రమ్ = కన్నీటిని, విసృజన్తి = విడుచు చున్నారో, కుశచీరధరమ్ = నారచీరను ధరించిన, గచ్ఛన్తమ్ = వెళ్లుచున్న, అపరాజితమ్ = పరాజయము ఎరుగని, దేవమ్ = ఏ రాముని, లక్ష్మీః = రాజ్యలక్ష్మి, సీతేవ = సీత వలె, అనుగతా = అనుసరించి వెళ్ళినదో, తస్య = అట్టి రామునకు, కిం నామ = ఏది, దుర్లభమ్ = దుర్లభము.

తా. వనమునకు ప్రయాణ మై వెళ్లుచున్న ఏ రాముని చూచి, అయోధ్య లోని జను లందరు, శోకవేగముచే పీడితులై, కన్నీరు విడిచిరో, నారచీరలు ధరించి వెళ్లుచున్న, పరాజయ మనునది ఎరుగని ఏ రాముని అనుసరించి, రాజ్య లక్ష్మి కూడ సీత వలె వెళ్లినదో, అట్టి రాముడు పొంద జాలనిది ఈ లోకములో ఏమి ఉన్నది? 18-19

మూ. ధనుర్గ్రహవరో యస్య బాణఖడ్గాస్త్రభృత్స్వయమ్,
లక్ష్మణో వ్రజతి హ్యగ్రే తస్య కిం నామ దుర్లభమ్. 20

ప్ర. అ. ధనుర్గ్రహవరః = ధనుర్ధరులలో శ్రేష్ఠు డైన, లక్ష్మణః = లక్ష్మణుడు, స్వయమ్ = స్వయముగా, బాణఖడ్గాస్త్రభృత్ = బాణములను ఖడ్గమును, అస్త్రములను ధరించి, యస్య = ఎవనియొక్క, అగ్రే = ఎదుట, వ్రజతి = వెళ్లుచున్నాడో, తస్య = ఆ రామునికి, కిం నామ = ఏది, దుర్లభమ్ = పొంద శక్యము గానిది.

తా. ధనుర్ధరులలో శ్రేష్ఠు డైన లక్ష్మణుడు స్వయముగా, బాణములు, ఖడ్గములు ఇతరాయుధములు ధరించి, రాముని ముందు వెళ్ళుచుండగా, ఆ రామునకు దుర్లభ మైనది యేది యుండును? 20

మూ. నివృత్తవనవాసం తం ద్రష్టాసి పునరాగతమ్,
జహి శోకం చ మోహం చ దేవి సత్యం బ్రవీమి తే. 21

ప్ర. అ. దేవి = ఓ కౌసల్యా! నివృత్తవనవాసమ్ = పూర్తి యైన వనవాసము కలవాడై, పునః = మరల, ఆగతమ్ = వచ్చిన, తమ్ = ఆ రాముని, ద్రష్టాసి =

చూడగలవు. శోకం చ = శోకమును, మోహం చ = మోహమును, జహి = చంపుము (విడువుము). తే = నీకు, సత్యమ్ = సత్యమును, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. ఓ కౌసల్యా! రాముడు వనవాసము పూర్తి చేసుకొని మరల వచ్చినపుడు నీవు తప్పక అతనిని చూడగలవు. అందుచే శోకమును, మోహమును విడువుము. నేను సత్యమును చెప్పుచున్నాను. 21

మూ. శిరసా చరణావేతౌ వన్దమానమనిన్దితే,
పునర్ద్రక్ష్యసి కల్యాణి! పుత్రం చన్ద్రమివోదితమ్. 22

ప్ర. అ. అనిన్దితే = నిందింపబడనిదానా! కల్యాణి = మంగళప్రదురాలవగు ఓ కౌసల్యా! ఏతౌ = ఈ, చరణౌ = పాదములను, శిరసా = శిరస్సుతో, వన్దమానమ్ = నమస్కరించుచున్న, పుత్రమ్ = పుత్రుని, ఉదితమ్ = ఉదయించిన, చన్ద్రమివ = చంద్రుని వలె, పునః = తిరిగి, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. ఎవరిచేతను నిందింపబడని, కల్యాణప్రదురాలవగు ఓ కౌసల్యా! నీ పుత్రుడు వచ్చి నీ పాదములకు నమస్కరించుచుండగా, అతనిని, ఉదయించిన చంద్రుని వలె మరల చూడగలవు. 22

మూ. పునః ప్రవిష్టం దృష్ట్వా తమభిషిక్తం మహాశ్రియమ్,
సముత్స్రక్ష్యసి నేత్రాభ్యాం క్షిప్రమానన్దజం పయః. 23

ప్ర. అ. పునః = మరల, ప్రవిష్టమ్ = ప్రవేశించిన, అభిషిక్తమ్ = అభిషిక్తుడైన, మహాశ్రియమ్ = గొప్ప తేజస్సు గల, తమ్ = ఆ రాముని, దృష్ట్వా = చూచి, క్షిప్రమ్ = శీఘ్రముగా, నేత్రాభ్యామ్ = నేత్రములనుండి, ఆనన్దజమ్ = ఆనందమువలన కలిగిన, పయః = నీటిని, సముత్స్రక్ష్యసి = విడువగలవు.

తా. రాముడు మరల వచ్చి రాజ్యాభిషిక్తుడై, గొప్ప తేజస్సుతో ప్రకాశించుచుండగా, అతనిని చూచి, అచిరకాలములో, ఆనందాశ్రువులను విడువగలవు. 23

మూ. మా శోకో దేవి దుఃఖం వా న రామే దృశ్యతేఽశివమ్,
క్షిప్రం ద్రక్ష్యసి పుత్రం త్వం ససీతం సహ లక్ష్మణమ్. 24

ప్ర. అ. దేవి = ఓ కౌసల్యా! శోకః = శోకము గాని, దుఃఖం వా = దుఃఖము గాని, మా = వద్దు. రామే = రామునియందు, అశివమ్ = అమంగళము. న దృశ్యతే = చూడబడుట లేదు. త్వమ్=నీవు, ససీతమ్ = సీతతో కూడిన, సహలక్ష్మణమ్=లక్ష్మణునితో కూడిన, పుత్రమ్=పుత్రుని, క్షిప్రమ్ = శీఘ్రముగా, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. ఓ కౌసల్యా! రామునికి ఎట్టి అమంగళమూ కలుగదు. అందుచే నీవు శోకమును దుఃఖమును విడువుము. సీతాలక్ష్మణులతో కూడిన నీ కుమారుని, అచిరకాలములో చూడగలవు.

మూ. త్వయా శేషో జనశ్చైవ సమాశ్వాస్యో యదాఽనఘే,
కిమిదానీమిదం దేవి కరోషి హృది విక్లబమ్. 25

ప్ర. అ. అనఘే = దోషములు లేని, దేవి = ఓ కౌసల్యా! శేషః = మిగిలిన, జనః = జనము, త్వయా = నీచేత, యదా = ఎపుడు, సమాశ్వాస్యః ఏవ = ఓదార్చ తగి ఉన్నదో, ఇదానీమ్ = ఇపుడు, హృది = హృదయమునందు, విక్లబమ్ = దుఃఖమును, కరోషి = చేయుచున్నావు. ఇదమ్ = ఇది, కిమ్ = ఏమిటి?

తా. పాపరహితురాలవైన ఓ కౌసల్యా! మిగిలినవారందరిని నీవు ఓదార్చవలసి యుండగా, నీవే ఇట్లు మనస్సును దుఃఖవికలముగా చేసుకొనుచున్నావేమి? 25

మూ. నార్హా త్వం శోచితుం దేవి యస్యాస్తే రాఘవస్సుతః,
న హి రామాత్పరో లోకే విద్యతే సత్పథే స్థితః. 26

ప్ర. అ. దేవి = ఓ దేవీ! యస్యాః = ఏ, తే = నీకు, రాఘవః = రాముడు, సుతః = కుమారుడో, త్వమ్ = అట్టి నీవు, శోచితుమ్ = దుఃఖించుటకు, నార్హా = తగవు. రామాత్ = రామునికంటె, పరః = ఇతరుడు, సత్పథే = సన్మార్గమునందు, స్థితః = ఉన్నవాడు, లోకే = లోకమునందు, న విద్యతే హి = లేడు కదా.

తా. ఓ కౌసల్యా! రాముని వంటి కుమారుని కనిన నీవు ఈ విధముగా దుఃఖించకూడదు. ఈ లోకములో, రాముని వలె ఈ విధముగా సన్మార్గములో నున్నవాడు ఎవ్వడును లేడు. 26

మూ. అభివాదయమానం తం దృష్ట్వా ససుహృదం సుతమ్,
ముదాశ్రు మోక్ష్యసే క్షిప్రం మేఘలేఖేవ వార్షికీ. 27

ప్ర. అ. అభివాదయమానమ్ = నమస్కరించుచున్న, ససుహృదమ్ = స్నేహితులతో కూడిన, తం సుతమ్ = ఆ కుమారుని, దృష్ట్వా = చూచి, క్షిప్రమ్ = శీఘ్రముగా, వార్షికీ = వర్షకాలమునకు సంబంధించిన, మేఘలేఖేవ = మేఘపంక్తి వలె, ముదా = ఆనందముతో, అశ్రు = కన్నీటిని, మోక్ష్యసే = విడువగలవు.

తా. స్నేహితులతో కూడ వచ్చి, నీ కుమారుడు నమస్కరించుచుండగా అతనిని చూచి నీవు అచిరకాలములో, వర్షకాలమునందు మేఘపంక్తి వలె, ఆనందాశ్రువులను విడువగలవు. 27

మూ. పుత్రస్తే వరదః క్షిప్రమయోధ్యాం పునరాగతః,
పాణిభ్యాం మృదుపీనాభ్యాం చరణౌ పీడయిష్యతి. 28

ప్ర. అ. వరదః = వరము లిచ్చు, తే పుత్రః = నీ కుమారుడు, క్షిప్రమ్ = శీఘ్రముగా, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, పునః = మరల, ఆగతః = వచ్చినవాడై, మృదుపీనాభ్యామ్ = మెత్తనివి, బలిసినవి అయిన, పాణిభ్యామ్ = చేతులతో, చరణౌ = నీ పాదములను, పీడయిష్యతి = స్పృశించగలడు.

తా. వరములను ఈయ సమర్థుడైన నీ కుమారుడు, శీఘ్రముగా అయోధ్యకు తిరిగి వచ్చి, మెత్తనివి, బలిసి యున్నవి అయిన చేతులతో, నీ పాదములను స్పృశింపగలడు. 28

మూ. అభివాద్య నమస్యన్తం శూరం ససుహృదం సుతమ్,
ముదాస్రైః ప్రోక్ష్యసి పునర్మేఘరాజి రివాచలమ్. 29

ప్ర. అ. అభివాద్య = అభివాదనము చేసి, నమస్యన్తమ్ = నమస్కరించుచున్న, శూరమ్ = శూరుడైన, ససుహృదమ్ = మిత్రులతో కూడిన, సుతమ్ = కుమారుని, ముదా = సంతోషముతో, అస్రైః = కన్నీళ్లతో, మేఘరాజిః = మేఘపంక్తి, అచలమివ = పర్వతమును వలె, పునః = మరల, ప్రోక్ష్యసి = తడుపగలవు.

తా. మిత్రసహితు డైన, కొడు కైన నీ కుమారుడు, అభివాదనము చేసి, (నామప్రవరాదులను చెప్పుచు) నమస్కరించుచుండగా, మేఘపంక్తి పర్వతమును తడిపి నట్లు అతనిని మరల ఆనందాశ్రువులతో తడుపగలవు. 29

మూ. ఆశ్వాసయన్తీ వివిధైశ్చ వాక్యై
ర్వాక్యోపచారే కుశలానవద్యా,
రామస్య తాం మాతర మేవముక్త్వా
దేవీ సుమిత్రా విరరామ రామా. 30

ప్ర. అ. వాక్యోపచారే = వాక్యములచే ఉపచారము చేయుటయందు, కుశలా = నేర్పు గలదీ, అనవద్యా = దోషములు లేనిదీ, రామా = మనోహర మైన స్వభావము కలదీ, దేవీ = దేవి అయిన, సుమిత్రా = సుమిత్ర, వివిధైః = అనేక విధము లైన, వాక్యైః = వాక్యములతో, ఆశ్వాసయన్తీ = ఓదార్చుచున్నదై, రామస్య = రాముని యొక్క, తాం మాతరమ్ = ఆ తల్లిని గూర్చి, ఏవమ్ = ఇట్లు, ఉక్త్వా = పలికి, విరరామ = విరమించెను.

తా. మాటలు చెప్పి ఉపచారము చేయుటయందు నేర్పు కలదీ, ఎట్టి దోషములు లేనిదీ, అయిన సుమిత్రాదేవి, ఈ విధముగా అనేక వాక్యములచే, రామమాత యైన కౌసల్యను ఓదార్చి, ఊరకుండెను. 30

మూ. నిశమ్య తల్లక్ష్మణమాతృవాక్యం
రామస్య మాతుర్నరదేవపత్న్యాః,
సద్యః శరీరే విననాశ శోకః
శరద్గతో మేఘ ఇవాల్పతోయః. 31

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుశ్చత్వారింశః సర్గః.

ప్ర. అ. తత్ = ఆ, లక్ష్మణమాతృవాక్యమ్ = లక్ష్మణుని తల్లి వాక్యమును, నిశమ్య = విని, నరదేవపత్న్యాః = దశరథుని భార్య యైన, రామస్య మాతుః = రామమాత యొక్క, శోకః = శోకము, శరద్గతః = శరదృతువునం

సంబంధించిన, అల్పతోయః = అల్పమైన ఉదకము గల, మేఘ ఇవ = మేఘము వలె, సద్యః = వెంటనే, శరీరే = శరీరమునందు, వినాశ = నశించెను.

తా. సుమిత్ర మాటలు వినిన పిమ్మట, దశరథుని భార్య, రాముని తల్లియైన ఆ కౌసల్య శోకము, శరత్కాలమునందు అల్పమైన ఉదకము గల మేఘము వలె వెంటనే ఆమె శరీరమునందే లీన మైపోయెను.

“బాలానందిని” యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదినాలుగవ సర్గ సమాప్తము.

## అథ పంచచత్వారింశః సర్గః

[భరతునియెడల, మహారాజువద్ద ప్రీతిని చూపుతనియు అయోధ్యకు మరలిపొండనియు రాముడు పౌరులకు చెప్పుట. నగర వాసులగు వృద్ధ బ్రాహ్మణులు రాము నయోధ్యకు రమ్మని పట్టుబట్టుట. రాముడు వారందరితో తమసాతీరమునకు చేరుట.]

మూ. అనురక్తా మహాత్మానం రామం సత్యపరాక్రమమ్,
అనుజగ్ముః ప్రయాన్తం తం వనవాసాయ మానవాః. 1

ప్ర. అ. అనురక్తాః = రామునియందు ప్రేమ గల, మానవాః = మానవులు, వనవాసాయ = వనవాసముకొరకు, ప్రయాన్తమ్ = వెళ్లుచున్న, మహాత్మానమ్ = మహాత్ముడైన, సత్యపరాక్రమమ్ = సత్యమైన పరాక్రమము గల, తం రామమ్ = ఆ రాముని, అనుజగ్ముః = అనుసరించి వెళ్ళిరి.

తా. మహాత్ముడు, సత్యమైన పరాక్రమము కలవాడూ అయిన రాముడు వనవాసమునకై వెళ్ళుచుండగా అతనిపై ప్రేమ గల పౌరు లందరును అతనిని అనుసరించి వెళ్ళిరి. 1

మూ. నివర్తితేఽపి చ బలాత్ సుహృద్వర్గే చ రాజని,
నైవ తే సంన్యవర్తన్త రామస్యానుగతా రథమ్. 2

ప్ర. అ. సుహృద్వర్గే = మిత్రసముదాయము, రాజని చ = రాజు, బలాత్ = బలాత్కారముగా, నివర్తితేఽపి చ = తిరిగిపంపబడినను, రామస్య = రామునియొక్క, రథమ్ = రథమును, అనుగతాః = అనుసరించి వెళ్ళుచున్నట్టి, తే = ఆ జనులు, నైవ సంన్యవర్తన్త = మరలలేదు.

తా. రాముని మిత్రవర్గము, దశరథమహారాజు, బలాత్కారముగా వెనుకకు పంపబడినను, రాముని రథమును అనుసరించి వెళ్ళుచున్న ఆ పౌరులు మాత్రము తిరిగి వెళ్లలేదు. 2

మూ. అయోధ్యానిలయానాం హి పురుషాణాం మహాయశాః,
బభూవ గుణసంపన్నః పూర్ణచన్ద్ర ఇవ ప్రియః. 3

ప్ర. అ. మహాయశాః = గొప్ప కీర్తిగలవాడు, గుణసంపన్నః = సద్గుణ సంపన్నుడు అయిన, ఆ రాముడు, అయోధ్యానిలయానామ్ = అయోధ్యలో నివసించు, పురుషాణామ్ = పురుషులకు, పూర్ణచన్ద్ర ఇవ = పూర్ణచంద్రుడు వలె, ప్రియః = ఇష్టుడుగా, బభూవ హి = అయెను కదా.

తా. మహాయశస్వియు సద్గుణసంపన్నుడూ అయిన ఆ రాముడు, పూర్ణ చంద్రుడు వలె అయోధ్యలో నివసించు పౌరు లందరికిని, చాల ఇష్టుడుగా ఉండెను. 3

మూ. స యాచ్యమానః కాకుత్స్థః స్వాభిః ప్రకృతిభిస్తదా,
కుర్వాణః పితరం సత్యం వనమేవాన్వపద్యత. 4

ప్ర. అ. సః = ఆ, కాకుత్స్థః = రాముడు, తదా = అపుడు, స్వాభిః = తన సంబంధమైన, ప్రకృతిభిః = ప్రజలచేత, యాచ్యమానః = ప్రార్థింపబడినను, పితరమ్ = తండ్రిని, సత్యమ్ = సత్యవాక్కు కలవానినిగా, కుర్వాణః = చేయుచు, వనమేవ = వనమునే, అన్వపద్యత = పొందెను.

తా. తన ప్రజ లందరును, ఎంత ప్రార్థించినను వినక, ఆ రాముడు తండ్రిని సత్యవంతుని చేయుటకే, వనమునకే వెళ్ళెను. 4

మూ. అవేక్షమాణః సస్నేహం చక్షుషా ప్రపిబన్నివ,
ఉవాచ రామః స్నేహేన తాః ప్రజాః స్వాః ప్రజా ఇవ.

ప్ర. అ. రామః = రాముడు, చక్షుషా = నేత్రముతో, ప్రపిబన్నివ = త్రాగుచున్నవాడు వలె, తాః = ఆ, ప్రజాః = ప్రజలను, స్వాః = తనసంబంధమైన, ప్రజా ఇవ = సంతానములను వలె, సస్నేహమ్ = స్నేహపూర్వకముగా, అవేక్షమాణః = చూచుచు, ఉవాచ = పలికెను.

తా. రాముడు ఆ ప్రజలను తన సంతానమును వలె, కంటితో త్రాగి వేయుచున్నట్లు ప్రేమపూర్వకముగా చూచుచు స్నేహముతో నిట్లనెను. 5

మూ. యా ప్రీతిర్బహుమానశ్చ మయ్యయోధ్యానివాసినామ్,
మత్ప్రియార్థం విశేషేణ భరతే సా నివేశ్యతామ్. 6

ప్ర. అ. అయోధ్యానివాసినామ్=అయోధ్యలో నివసించు, మీకు, మయి=నాయందు, యా=ఏ, ప్రీతిః=ప్రేమ, బహుమానశ్చ=గౌరవము ఉన్నవో, సా=అది, విశేషేణ=అతిశయముచేత, మత్ప్రియార్థమ్=నాకు ప్రీతి కలిగించుటకు, భరతే=భరతునియందు, నివేశ్యతామ్=ఉంచబడుగాక

తా. అయోధ్యానివాసులైన మీరందరును, నాపై మీకు గల ప్రేమ గౌరవములను, భరతునిపై చూపుడు. అట్లు చేసినచో నాకు అధికముగా సంతోషము కలుగును. 6

మూ. స హి కల్యాణచారిత్రః కైకేయ్యానన్దవర్ధనః,
కరిష్యతి యథావద్వః ప్రియాణి చ హితాని చ. 7

ప్ర. అ. కల్యాణచారిత్రః = మంగళకరమైన చరిత్ర కలవాడూ, కైకేయ్యానందవర్ధనః=కైకేయికి ఆనందమును వృద్ధిపొందించువాడూ అయిన, సః = అతడు, యథావత్ = నియమానుసారముగా, వః = మీకు, ప్రియాణి = ప్రియములను, హితాని చ=హితములను, కరిష్యతి హి=చేయగలడు.

తా. కైకేయి కుమారుడైన ఆ భరతుడు, మంగళకరమైన చరిత్ర కలవాడు. అతడు, మీకు ఇష్టములు, క్షేమకరములు అయిన పనులను, చక్కగా చేయగలడు. 7

మూ. జ్ఞానవృద్ధో వయోబాలో మృదుర్వీర్యగుణాన్వితః,
అనురూపః స వో భర్తా భవిష్యతి భయాపహః. 8

ప్ర. అ. జ్ఞానవృద్ధః=జ్ఞానముచేత వృద్ధుడు, వయోబాలః=వయస్సుచేత చిన్నవాడు, మృదుః=మెత్తనివాడు, వీర్యగుణాన్వితః=వీర్యముతోను, సద్గుణములతోను కూడినవాడూ అయిన, సః=ఆ భరతుడు, వః=మీకు, అనురూపః=తగిన, భయాపహః = భయమును తొలగించు, భర్తా=ప్రభువుగా, భవిష్యతి=కాగలడు.

తా. ఆ భరతుడు వయస్సుచే చిన్నవా డైనను, జ్ఞానముచేత వృద్ధుడు. మృదు వైన స్వభావము కలవాడు. పరాక్రమముతోను, సద్గుణములతోను ఒప్పు చున్నవాడు. అతడు మీకు తగిన ప్రభువై మీ సమస్తభయములను తొల గించును. 8

మూ. స హి రాజగుణై ర్యుక్తో యువరాజః సమీక్షితః,
అపి చాపి మయా శిష్టైః కార్యం వో భర్తృశాసనమ్. 9

ప్ర. అ. రాజగుణైః=రాజున కుండవలసిన గుణములతో, యుక్తః= కూడిన, సః=అతడు, యువరాజః=యువరాజుగా, సమీక్షితః=చూడబడినాడు. అపి చ=మరియు, మయా=నాచేతను, శిష్టైః=మిగిలినవారిచేతను,వః = మీకు, (మీచేతను), భర్తృశాసనమ్=రాజుయొక్క ఆజ్ఞ, కార్యమ్=చేయదగినది.

తా. రాజగుణములతో కూడిన ఆ భరతుడు యువరాజుగా నియుక్తు డైనాడు. నేను, ఇతరులు, మీరు కూడ ప్రభు వైన దశరథుని ఆజ్ఞను అనుసరింత వలెను. 9

మూ. న సన్తప్యే ద్యథా చాసౌ వనవాసం గతే మయి,
మహారాజ స్తథా కార్యో మమ ప్రియచికీర్షయా. 10

ప్ర. అ. మయి = నేను, వనవాసమ్ = వనవాసమును గూర్చి, గతే = వెళ్లగా, అసౌ = ఈ, మహారాజః = మహారాజు, యథా = ఏ విధముగా, న సన్తప్యేత్ = సంతాపము చెందడో, తథా = అట్లు, మమ = నాకు, ప్రియ చికీర్షయా=ప్రియము చేయవలె నను ఇచ్ఛచేత, కార్యః=చేయదగినవాడు.

తా. మీరు నాకు సంతోషము కల్గింపవలె నని కోరినచో, నేను వన వాసమునకు వెళ్లిన పిమ్మట మహారాజు దుఃఖింపకుండు నట్లు చూచుకొనుడు.10

మూ. యథా యథా దాశరథి ర్ధర్మ ఏవాస్థితోఽభవత్,
తథా తథా ప్రకృతయో రామం పతిమకామయన్. 11

ప్ర. అ. దాశరథిః=రాముడు, యథా యథా = ఎట్లు ఎట్లు, ధర్మే ఏవ= ధర్మమునందే, అస్థితః = స్థిరముగా నిలచినవాడు, అభవత్ = అయెనో, తథా

తథా = అట్లు అట్లు, ప్రకృతయః = ప్రజలు, రామమ్ = రాముని, పతిమ్ = ప్రభువునుగా, అకామయన్ = కోరిరి.

తా. రాముడు ధర్మముపై స్థైర్యమును చూపించినకొలఁది, ప్రజలు కూడ అతడే మాకు రాజు కావలెను అని కోరిరి. 11

మూ. బాష్పేణ పిహితం దీనం రామః సౌమిత్రిణా సహ,
చకర్షేవ గుణైర్బద్ధ్వా జనం పురనివాసినమ్. 12

ప్ర. అ. సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, బాష్పేణ = కన్నీటిచేత, పిహితమ్ = కప్పబడిన, దీనమ్ = దీనమైన, పురనివాసినమ్ = పురములో నివసించు, జనమ్ = జనమును, గుణైః = గుణముల చేత (త్రాళ్ళచేత), బద్ధ్వా ఇవ = కట్టి వలె, చకర్ష = లాగెను.

తా. లక్ష్మణసమేతుడగు రాముడు కన్నీరు కప్పి, దీనముగా ఏడ్చుచున్న ఆ పౌరులను తన గుణములచే త్రాడుతో కట్టినట్లు కట్టి ఆకర్షించెను. 12

మూ. తే ద్విజాస్త్రివిధం వృద్ధా జ్ఞానేన వయసౌజసా,
వయఃప్రకమ్పశిరసో దూరాదూచురిదం వచః. 13

ప్ర. అ. జ్ఞానేన = జ్ఞానముచేత, వయసా = వయస్సుచేత, ఓజసా = తేజస్సుచేత, త్రివిధమ్ = మూడు విధములుగా, వృద్ధాః = వృద్ధులైన, తే ద్విజాః = ఆ బ్రాహ్మణులు, వయఃప్రకమ్పశిరసః = వయస్సుచేత కదలుచున్న శిరస్సులు కలవారై, దూరాత్ = దూరమునుండి, ఇదమ్ = ఈ, వచః = వాక్యమును, ఊచుః = పలికిరి.

తా. జ్ఞానముచేత, వయస్సుచేత, తేజస్సుచేత మూడువిధముల వృద్ధులైన బ్రాహ్మణులు, వార్ధకముచేత శిరస్సులు వణకుచుండగా, దూరమునుండియే ఇట్లు పలికిరి. 13

మూ. వహన్తో జవనా రామం భో భో జాత్యాస్తురఙ్గమాః,
నివర్తధ్వం న గన్తవ్యం హితా భవత భర్తరి. 14

ప్ర. అ. రామమ్ = రాముని, వహన్తః = తీసుకొనిపోవుచున్న, జవనాః = వేగము గల, జాత్యాః = ఉత్తమజాతికి చెందిన, భో భో తురఙ్గమాః = ఓ

అశ్వములారా, నివర్తధ్వమ్ = వెనుకకు మరలుడు. న గన్తవ్యమ్ = వెళ్లవద్దు. భర్తరి=మీ ప్రభు వైన రాముని విషయమున, హితాః = హితము చేయువారు, భవత = అవండి.

తా. ఉత్తమజాతులలో పుట్టి, మంచి వేగము గలిగి, రాముని తీసుకొని పోవు చున్న ఓ గుఱ్ఱములారా! ముందుకు వెళ్లవద్దు. వెనుకకు మరలి రండి. మీ ప్రభు వైన రామునకు హితమును చేయండి. 14

మూ. కర్ణవన్తి హి భూతాని విశేషేణ తురంగమాః,
యూయం తస్మాన్నివర్తధ్వం యాచనాం ప్రతివేదితాః.

ప్ర. అ. భూతాని = జంతువులు, కర్ణవన్తి హి = చెవులు కలవి కదా! తురఙ్గమాః = గుఱ్ఱములు, విశేషేణ = విశేషముగా, చెవులుగలవి. తస్మాత్ = ఆ కారణమువలన, యాచనామ్ = ప్రార్థనను, ప్రతివేదితాః = తెలిసికొన్నవారై, యూయమ్ = మీరు, నివర్తధ్వమ్ = మరలండి.

తా. జంతువు లన్నింటికిని, చెవు లుండును. అందును గుఱ్ఱముల చెవులకు అధిక మైన గ్రహణశక్తి ఉండును. అందుచే మీరు మా ప్రార్థనను విని వెనుకకు మరలండి. 15

మూ. ధర్మతః స విశుద్ధాత్మా వీరః శుభదృఢవ్రతః,
ఉపవాహ్యస్తు వో భర్తా నాపవాహ్యః పురాద్వనమ్. 16

ప్ర. అ. ధర్మతః = ధర్మముచేత, విశుద్ధాత్మా = పరిశుద్ధ మైన మనస్సు కలవాడూ, వీరః = వీరుడూ, శుభదృఢవ్రతః = శుభమూ, దృఢమూ అయిన నియమము కలవాడూ అయిన, సః = ఆ, వః భర్తా = మీ ప్రభువు, ఉపవాహ్యః = లోనికి తీసికొని రాదగినవాడు. పురాత్ = పట్టణమునుండి, వనమ్ = వనమును గూర్చి, న అపవాహ్యః = బైటకు తీసికొని వెళ్ళదగినవాడు కాడు.

తా. ధర్మముచే పరిశుద్ధ మైన చిత్తము కలవాడూ, వీరుడూ, శుభ మైన వ్రతములందు స్థిరముగ ఉండువాడూ అయిన మీ ప్రభువును మీరు పురము లోనికి తీసికొనిరావలెను గాని పురమునుండి వనమునకు తీసికొని వెళ్ళగూడదు.

మూ. ఏవమార్తప్రలాపాంస్తాన్ వృద్ధాన్ ప్రలపతో ద్విజాన్,
అవేక్ష్య సహసా రామో రథాదవతతార హ. 17

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, ఆర్తప్రలాపాన్ = దీనాలాపములను, ప్రలపతః = పలుకుచున్న, వృద్ధాన్ = వృద్ధు లైన, తాన్ ద్విజాన్ = ఆ ద్విజులను, అవేక్ష్య = చూచి, రామః = రాముడు, సహసా = వెంటనే. రథాత్ = రథమునుండి, అవతతార హ = దిగెను.

తా. ఈ విధముగా దుఃఖముతో కూడిన మాటలు పలుకుచున్న, వృద్ధు లైన, ఆ ద్విజులను చూచి, రాముడు వెంటనే రథమునుండి దిగెను. 17

మూ. పద్భ్యామేవ జగామాథ ససీతః సహలక్ష్మణః,
సన్నికృష్టపదన్యాసో రామో వనపరాయణః. 18

ప్ర. అ. అథ = అటుపిమ్మట, ససీతః = సీతతో కూడిన, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, వనపరాయణః = వనమునకు అభిముఖు లైన వాడై, సన్నికృష్టపదన్యాసః = దగ్గరగా చేయబడిన పాదన్యాసము కలవాడై, పద్భ్యామ్ ఏవ = పాదములతోనే; జగామ = వెళ్ళెను.

తా. పిమ్మట సీతాలక్ష్మణసహితు డైన రాముడు వనమునకు అభిముఖుడై, అడుగులు దగ్గరదగ్గరగా వేయుచు (మెల్లగా) నడచియే వెళ్ళెను. 18

మూ. ద్విజాతీంస్తు పదాతీంస్తాన్ రామశ్చారిత్రవత్సలః,
న శశాక ఘృణాచక్షుః పరిమోక్తుం రథేన సః. 19

ప్ర. అ. చారిత్రవత్సలః = సచ్చరిత్రమునందు ప్రీతి కలవాడు, ఘృణాచక్షుః = దయతో కూడిన నేత్రములు కలవాడు అయిన, సః రామః = ఆ రాముడు, పదాతీన్ = పాదచారు లైన, తాన్ ద్విజాతీన్ = ఆ బ్రాహ్మణులను, రథేన = రథముచేత, పరిమోక్తుమ్ = విడచుటకు, న శశాక = సమర్థుడు కాలేదు.

తా. సచ్చరిత్రమునందు ప్రేమ కలవాడు, దయతో కూడిన నేత్రములు కలవాడు అయిన రాముడు, ఆ బ్రాహ్మణులు పాదచారులై వచ్చుచుండగ వారిని విడచి తాను రథముపై వెళ్ళజాలకపోయెను. 19

మూ. గచ్ఛన్తమేవ తం దృష్ట్వా రామం సంభ్రాన్తచేతనః,
ఊచుః పరమసన్తప్తా రామం వాక్యమిదం ద్విజాః. 20

ప్ర. అ. ద్విజాః = బ్రాహ్మణులు, గచ్ఛన్తమేవ = వెళ్లుచునే యున్న, తం రామమ్ = ఆ రాముని, దృష్ట్వా = చూచి, సంభ్రాన్తచేతసః = కలత చెందిన మనస్సు కలవారై, పరమసన్తప్తాః = మిక్కిలి బాధపడుచున్నవారై, ఇదం వాక్యమ్ = ఈ వాక్యమును, ఊచుః = పలికిరి.

తా. రాము డింకను, వనమువైపు వెళ్ళిపోవుచుండగ చూచి, ఆ బ్రాహ్మణులు కలత చెందిన మనస్సుతో మిక్కిలి దుఃఖించుచు, ఇట్లు పలికిరి. 20

మూ. బ్రాహ్మణ్యం సర్వమేతత్త్వాం బ్రహ్మణ్యమనుగచ్ఛతి,
ద్విజస్కన్ధాధిరూఢాస్త్వామగ్నయోఽప్యనుయాన్త్యమీ.

ప్ర. అ. సర్వమ్ = సమస్తమైన, ఏతత్ = ఈ, బ్రాహ్మణ్యమ్ = బ్రాహ్మణ సమూహము, బ్రహ్మణ్యమ్ = బ్రాహ్మణులకు హితుడవైన, త్వామ్ = నిన్ను, అనుగచ్ఛతి = అనుసరించుచున్నది. అమీ = ఈ, అగ్నయోఽపి = అగ్నులు కూడ, ద్విజస్కన్ధాధిరూఢాః = బ్రాహ్మణుల భుజములను ఎక్కినవై, త్వామ్ = నిన్ను, అనుయాన్తి = అనుసరించుచున్నవి.

తా. ఈ బ్రాహ్మణసమూహ మంతయు, బ్రాహ్మణులకు హితుడవైన నీ వెనుకనే వచ్చుచున్నది. ఈ అగ్నులు కూడ, బ్రాహ్మణుల మూపుపై ఎక్కి, నీ వెనుకనే వచ్చుచున్నవి. 21

మూ. వాజపేయసముత్థాని ఛత్రాణ్యేతాని పశ్య నః,
పృష్ఠతోఽనుప్రయాతాని మేఘానివ జలాత్యయే. 22

ప్ర. అ. వాజపేయసముత్థాని = వాజపేయయాగము చేయుటవలన లభించినవి, నః = మాయొక్క, పృష్ఠతః = వెనుకనే, అనుప్రయాతాని = అనుసరించి వచ్చుచున్నవి యైన, ఏతాని = ఈ, ఛత్రాణి = ఛత్రములను, జలాత్యయే = వర్షకాలాంతమునందు, మేఘానివ = మేఘములను వలె, పశ్య = చూడుము.

తా. వాజపేయయాగము చేయుటచే మాకు లభించిన, శరత్కాలమునందలి మేఘముల వలె, తెల్లగా నున్న ఈ ఛత్రములు, మా వెనుకనే వచ్చుచున్నవి. చూడుము. 22

మూ. అనవాప్తాతపత్రస్య రశ్మిసన్తాపితస్య తే,
ఏభిశ్ఛాయాం కరిష్యామః స్వైశ్ఛత్రైర్వాజపేయికైః. 23

ప్ర. అ. అనవాప్తాతపత్రస్య = పొందబడని ఛత్రము కలవాడవు, రశ్మిసంతాపితస్య = కిరణములచే తపింపబడినవాడవు అయిన, తే = నీకు, వాజపేయోత్థైః = వాజపేయయాగమున లభించిన, స్వైః = మా సంబంధమైన, ఛత్రైః = ఛత్రములచేత, ఛాయామ్ = నీడను, కరిష్యామః = చేసెదము.

తా. ఛత్రము లేక ఎండచే తపింపబడుచున్న నీకు మేము, మాకు వాజపేయయాగమువలన లభించిన ఈ శ్వేతఛత్రముచే నీడను కల్గించెదము. 23

మూ. యా హి నః సతతం బుద్ధిర్వేదమన్త్రానుసారిణీ,
త్వత్కృతే సా కృతా వత్స! వనవాసానుసారిణీ. 24

ప్ర. అ. వత్స = ఓ వత్సా, నః = మాయొక్క, యా బుద్ధిః = ఏ బుద్ధి, సతతం = ఎల్లప్పుడును, వేదమన్త్రానుసారిణీ = వేదమంత్రములను అనుసరించి యుండునో, సా = అది, త్వత్కృతే = నీకొరకై, వనవాసానుసారిణీ = వనవాసమును అనుసరించునదిగా, కృతా = చేయబడినది.

తా. నాయనా! మా బుద్ధి ఎల్లప్పుడును వేదమంత్రములపైననే యుండును. అట్టి మా బుద్ధి ఇపుడు నీకొరకై వనవాసమును కోరుచున్నది. 24

మూ. హృదయేష్వేవ తిష్ఠన్తి వేదా యే నః పరం ధనమ్,
వత్స్యన్త్యపి గృహేష్వేవ దారాశ్చారిత్రరక్షితాః. 25

ప్ర. అ. నః = మాయొక్క, పరం ధనమ్ = ఉత్తమధనమైన, యే = ఏ, వేదాః = వేదములు కలవో అవి, హృదయేష్వేవ = మా హృదయములందే, తిష్ఠన్తి = ఉన్నవి. దారాః అపి = మా భార్యలు కూడ, చారిత్రరక్షితాః = వారి పాతివ్రత్యముచే రక్షింపబడినవారై, గృహేష్వేవ = గృహములందే, వత్స్యన్తి = నివసింపగలరు.

తా. మా ఉత్తమధనమైన వేదములు మా హృదయములందే యుండును. మా భార్యలు పాతివ్రత్యముచే రక్షింపబడుచు, ఇండ్లలో ఉండగలరు. 25

మూ. న పునర్నిశ్చయః కార్యస్త్వద్గతౌ సుకృతా మతిః,
త్వయి ధర్మవ్యపేక్షే తు కిం స్యాద్ధర్మపథే స్థితమ్. 26

ప్ర. అ. పునః = పరం, (మరియొక) నిశ్చయః = నిశ్చయము, న కార్యః=చేయదగినది కాదు. త్వద్గతా=నీ అయోధ్యాగమనము విషయమున, మతిః=బుద్ధి, సుకృతా=చక్కగా చేయబడినది. త్వయి=నీవు, ధర్మవ్యపేక్షే= ధర్మమునందు అపేక్ష లేనివాడ వైనచో, ధర్మపథే = ధర్మమార్గమునందు, కిమ్ = ఏది, స్థితం స్యాత్ = ఉండును.

తా. నీవు అయోధ్యకు తిరిగి రావలె నని మేము నిర్ణయించితిమి. దీనికి మరొక నిర్ణయము చేయకుము. నీవే ధర్మవిముఖుడ వైనచో, మరి ఎవరు ధర్మ మాచరింతురు? 27

మూ. యాచితో నో నివర్తస్వ హంసశుక్లశిరోరుహైః,
శిరోభిర్నిభృతాచార మహీపతనపాంసులైః. 27

ప్ర. అ. నిభృతాచార=నిశ్చలమైన సదాచారము కలవాడా, మహీపతన పాంసులైః=నేలపై పడుటచే దుమ్ము తగిలిన, హంసశుక్లశిరోరుహైః=హంసల వలె తెల్లనైన కేశములు గల, నః = మాయొక్క, శిరోభిః = శిరస్సులచేత, యాచితః=యాచింపబడినవాడవై, నివర్తస్వ = వెనుకకు మరలుము.

తా. నేలపై బడుటచే దుమ్ము తగిలిన, హంస వలె తెల్లనైన కేశములు గల శిరస్సులతో మేము ప్రార్థించుచున్నాము. వెనుకకు మరలుము. 27

మూ. బహూనాం వితతా యజ్ఞా ద్విజానాం య ఇహాగతాః,
తేషాం సమాప్తిరాయత్తా తవ వత్స నివర్తనే 28

ప్ర. అ. యే = ఎవరు, ఇహ = ఇచటికి, ఆగతాః = వచ్చినారో అట్టి, బహూనామ్ = అనేకు లైన, ద్విజానామ్ = బ్రాహ్మణులయొక్క, యజ్ఞాః=యజ్ఞములు, వితతాః=ప్రారంభింపబడినవి. వత్స=ఓ వత్సా, తేషామ్=వారియొక్క, సమాప్తిః = సమాప్తి, తవ = నీయొక్క, నివర్తనే = తిరిగి వచ్చుటయందు, ఆయత్తా = ఆధారపడినది.

తా. ఇక్కడికి వచ్చిన బ్రాహ్మణులలో, చాలమంది యజ్ఞములు ప్రారంభించి యున్నారు. ఓ వత్సా! ఆ యజ్ఞముల సమాప్తి, నీవు తిరిగి వచ్చుటయందు ఆధారపడి యున్నది. 28

మూ. భక్తిమన్తి హి భూతాని జఙ్గమాజఙ్గమాని చ,
యాచమానేషు రామ త్వం భక్తిం భక్తేషు దర్శయ. 29

ప్ర. అ. రామ = ఓ రామా! జఙ్గమాజఙ్గమాని చ = జంగమములు, స్థావరములు అయిన, భూతాని = ప్రాణులు, భక్తిమన్తి హి = నీపై భక్తి కలవి కదా! త్వమ్ = నీవు, యాచమానేషు = ప్రార్థించుచున్న, భక్తేషు = భక్తుల విషయమున, భక్తిమ్ = స్నేహమును, దర్శయ = చూపుము.

తా. ఓ రామా! స్థావరజంగమాత్మకము లైన, భూతము లన్నియు, నీపై భక్తితో, నిన్ను ప్రార్థించుచున్నవి. నీవు వానిపై స్నేహము చూపుము. 29

మూ. అనుగన్తుమశక్తాస్త్వాం మూలైరుద్ధతవేగినః,
ఉన్నతా వాయువేగేన విక్రోశన్తీవ పాదపాః. 30

ప్ర. అ. మూలైః = వ్రేళ్లచేత, ఉద్ధతవేగినః = కొట్టబడిన వేగముకలవై, పాదపాః = వృక్షములు, త్వామ్ = నిన్ను, అనుగన్తుమ్ = అనుసరించి వెళ్ళుటకు, అశక్తాః = అసమర్థ మైన వై, వాయువేగేన = వాయువేగముచేత, ఉన్నతాః = పైకి లేచినవై, విక్రోశన్తీవ = ఏడ్చుచున్నట్లున్నవి.

తా. వాయువేగముచేత లేచిన ఈ వృక్షములు, నిన్ను అనుసరించవలె నని కోరుచున్నను, వాని వేగమును వ్రేళ్లు అడ్డుకొనుటచే నిన్ను అనుసరింప జాలక, ఏడ్చుచున్న ట్లున్నవి. 30

మూ. నిశ్చేష్టాహారసంచారా వృక్షైకస్థానవిష్ఠితాః,
పక్షిణోఽపి ప్రయాచన్తే సర్వభూతానుకమ్పినమ్. 31

ప్ర. అ. పక్షిణోఽపి = పక్షులు కూడ, నిశ్చేష్టాహారసంచారాః = చేష్టలు, ఆహారములు, సంచారము లేనివై, వృక్షైకస్థానవిష్ఠితాః = వృక్షముల కొన్ని యందు కూర్చున్నవై, సర్వభూతానుకమ్పినమ్ = సకలప్రాణులందు జాలి గల నిన్ను, ప్రయాచన్తే = ప్రార్థించుచున్నవి.

తా. పక్షులుకూడ చేష్టలు, ఆహారము, సంచారము మాని, వృక్షములపై ఒక ప్రక్క కూర్చుండి, సర్వభూతములయందు జాలి గల నిన్ను, వెనుకకు రమ్మని ప్రార్థించుచున్నవి. 31

మూ. ఏవం విక్రోశతాం తేషాం ద్విజాతీనాం నివర్తనే,
దదృశే తమసా తత్ర వారయన్తీవ రాఘవమ్. 32

ప్ర. అ. ఏవమ్=ఈవిధముగా, నివర్తనే=రాముని మరల్పుట నిమిత్తమై, తేషాం ద్విజాతీనామ్=ఆ బ్రాహ్మణులు, విక్రోశతామ్=అరచుచుండగా, తత్ర=అచట, తమసా=తమసానది, రాఘవమ్=రాముని, వారయన్తీవ=నివారించుచున్నది వలె, దదృశే=కనబడెను.

తా. రాముని వెనుకకు మరల్పుటకై ఆ బ్రాహ్మణు లిట్లు అరచుచుండగా, ఇంతలో, తాను కూడ రాముని మరల్చుచున్నదా అన్నట్లు తమసానది వచ్చెను. 32

మూ. తతః సుమన్త్రోఽపి రథాద్విముచ్య
శ్రాన్తాన్హయాన్సంపరివర్త్య శీఘ్రమ్,
పీతోదకాంస్తోయపరిప్లుతాఙ్గా
నచారయద్వై తమసావిదూరే. 33

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
పంచచత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సుమన్త్రోఽపి=సుమంత్రుడు కూడ, శ్రాన్తాన్=అలసిన, హయాన్=గుర్రములను, రథాత్=రథమునుండి, విముచ్య=విడిపించి, శీఘ్రమ్=శీఘ్రముగా, సంపరివర్త్య=నేలపై పొర్లించి, పీతోదకాన్=త్రాగబడిన ఉదకము గల, తోయపరిప్లుతాఙ్గాన్ = నీళ్ళతో తడిసిన శరీరము గల, ఆ గుఱ్ఱములను, తమసావిదూరే=తమసానది సమీపమున, అచారయత్=మేపెను.

తా. పిమ్మట, సుమంత్రుడు కూడ, అలసిపోయిన గుఱ్ఱములను రథము నుండి విప్పి, శీఘ్రముగా నేలపై పొరలించి, నీరు త్రాగించి, వాటి శరీరములు కడిగి, తమసానదీసమీపమున వాటిని మేపెను.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు అయోధ్యాకాండలో నలుబది ఐదవ సర్గ సమాప్తము.

## అథ షట్చత్వారింశః సర్గః

*[రాముడు సీతాలక్ష్మణసమేతుడై తమసాతీరమున నివసించుట. తల్లిదండ్రులను, అయోధ్యానగరమును గూర్చి చింతించుట, పురవాసులు నిద్రించుచుండగా వారిని విడచి అరణ్యమువైపు పోవుట.]*

మూ. తతస్తు తమసాతీరం రమ్యమాశ్రిత్య రాఘవః,
సీతాముద్వీక్ష్య సౌమిత్రిమిదం వచనమబ్రవీత్. 1

ప్ర. అ. తతః=అటుపిమ్మట, రాఘవః=రాముడు, రమ్యమ్=సుందరమైన, తమసాతీరమ్ = తమసానదీతీరమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, సీతామ్ = సీతను, ఉద్వీక్ష్య = చూచి, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, ఇదం వచనమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట రాముడు, సుందరమైన ఆ తమసాతీరమును చేరి, సీతను చూచి, లక్ష్మణునితో ఇట్లనెను.

మూ. ఇయమద్య నిశా పూర్వా సౌమిత్రే ప్రహితా వనమ్,
వనవాసస్య భద్రం తే స నోత్కణ్ఠితుమర్హసి. 2

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! వనమ్=వనమును గూర్చి, ప్రహితాః= పంపబడితిమి. అద్య = నేడు, ఇయమ్ = ఇది, వనవాసస్య=వనవాసముయొక్క, పూర్వా = మొదటి దైన, నిశా=రాత్రి. సః = అట్టి నీవు, ఉత్కణ్ఠితుమ్ = బెంగపెట్టుకొనుటకు, న అర్హసి=తగవు. తే=నీకు, భద్రమ్=భద్ర మగుగాక.

తా. లక్ష్మణా! మనము వనమునకు పంపబడితిమి కదా! నేడు ఇది మన వనవాసములో, మొదటి రాత్రి. నీవు ఏ విధముగను బెంగపెట్టుకొనకుము. 2

మూ. పశ్య శూన్యాన్యరణ్యాని రుదన్తీవ సమన్తతః,
యథానిలయమాయద్భిర్నిలీనాని మృగద్విజైః. 3

ప్ర. అ. యథానిలయమ్ = వారి వారి స్థానములను అనుసరించి, ఆయద్భిః = తిరిగి వచ్చుచున్న, మృగద్విజైః = మృగములచేతను, పక్షులచేతను, నిలీనాని = దాగి నివసింపబడిన, శూన్యాని = శూన్యము లైన, అరణ్యాని = అరణ్యములు, సమన్తతః = నలు వైపుల, రుదన్తీవ = ఏడ్చుచున్న ట్లున్నవి. పశ్య = చూడుము.

తా. మృగములును, పక్షులును, వారి వారి స్థానములకు చేరి అణగి యుండగా, శూన్యము లైన ఈ అరణ్యములు, నలువైపుల ఏడుచుచున్నట్లున్నవి.

మూ. అద్యాయోధ్యా తు నగరీ రాజధానీ పితుర్మమ
సస్త్రీపుంసా గతానస్మాన్ శోచిష్యతి న సంశయః. 4

ప్ర. అ. అద్య = ఇపుడు, మమ పితుః = నా తండ్రియొక్క, రాజధానీ = రాజధాని యైన, అయోధ్యా నగరీ = అయోధ్యానగరము, సస్త్రీపుంసా = స్త్రీపురుషులతో కూడిన దై, గతాన్ = వెళ్ళిపోయిన, అస్మాన్ = మనలను గూర్చి, శోచిష్యతి = దుఃఖించగలదు. సంశయః = సంశయము, న = లేదు.

తా. ఇపుడు మా తండ్రిగారి రాజధాని యైన అయోధ్యానగరములోని స్త్రీపురుషు లందరును, మనము విడిచి వచ్చి నందుకు దుఃఖించుచుందురు. సందేహము లేదు. 4

మూ. అనురక్తా హి మనుజా రాజానం బహుభిర్గుణైః,
త్వాం చ మాం చ నరవ్యాఘ్ర శత్రుఘ్నభరతౌ తథా. 5

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరులలో శ్రేష్ఠుడా, మనుజాః = పౌరులు, బహుభిః = అనేక మైన, గుణైః = గుణములచేత, రాజానమ్ = రాజును గూర్చియు, త్వాం చ = నిన్ను గూర్చియు, మాం చ = నన్ను గూర్చియు, తథా = మరియు, శత్రుఘ్నభరతౌ = శత్రుఘ్నభరతులను గూర్చియు, అనురక్తాః హి = అనురాగము కలవారు కదా.

తా. అనేక మైన గుణములను బట్టి పౌరుల కందరికిని రాజు పైనను, నీపైనను, నాపైనను, భరతశత్రుఘ్నులపైనను చాల ప్రేమ ఉన్నది. 5

మూ. పితరం చానుశోచామి మాతరం చ యశస్వినీమ్,
అపి వాన్ధౌ భవేతాం తు రుదన్తౌ తావభీక్ష్ణశః. 6

ప్ర. అ. పితరం చ = తండ్రిని గూర్చి, యశస్వినీమ్ = కీర్తి గల, మాతరం చ=తల్లిని గూర్చి, అనుశోచామి = దుఃఖించుచున్నాను. తౌ = వారు, అధికమ్=ఎక్కువగా, రుదన్తౌ=ఏడ్చుచున్నవారై, అన్ధౌ = అంధులుగా, అపి వా భవేతామ్=అయిపోవుదురో ఏమో.

తా. నా తండ్రియు, కీర్తిమంతురాలైన నా తల్లియు, నాకొరకై ఎక్కువగా ఏడ్చి, ఏడ్చి, గ్రుడ్డివారైపోవుదురేమో యని దుఃఖించుచున్నాను. 6

మూ. భరతః ఖలు ధర్మాత్మా పితరం మాతరం చ మే,
ధర్మార్థకామసహితైర్వాక్యైరాశ్వాసయిష్యతి. 7

ప్ర. అ. ధర్మాత్మా=ధర్మాత్ముడైన, భరతః = భరతుడు, ధర్మార్థకామసహితైః = ధర్మార్థకామములతో కూడిన, వాక్యైః=వాక్యములచే, మే=నా యొక్క, పితరమ్=తండ్రిని, మాతరం చ = తల్లిని, ఆశ్వాసయిష్యతి ఖలు= ఓదార్చకలడు కదా।

తా. ధర్మాత్ముడైన భరతుడు, ధర్మార్థకామములను బోధించుమాటలతో, నా తల్లి దండ్రులను తప్పక ఓదార్చగలడు. 7

మూ. భరతస్యానృశంసత్వం విచిన్త్యాహం పునః పునః,
నానుశోచామి పితరం మాతరం చాపి లక్ష్మణ. 8

ప్ర. అ. లక్ష్మణ=ఓ లక్ష్మణా! అహమ్=నేను, భరతస్య=భరతుని యొక్క, అనృశంసత్వమ్=క్రూరుడు కాకుండుటను, పునః పునః=మాటిమాటికి, విచిన్త్య=ఆలోచించి, పితరమ్=తండ్రిని గూర్చి, మాతరం చ=తల్లిని గూర్చి, నానుశోచామి=దుఃఖించను.

తా. లక్ష్మణా! మాటి మాటికి భరతుని మంచితనమును గూర్చి తలచుకొనినపుడు నాకు తల్లిదండ్రుల విషయమున చింత యేమియు కలుగుట లేదు.

మూ. త్వయా కార్యం నరవ్యాఘ్ర మామనువ్రజతా కృతమ్,
అన్వేష్టవ్యా హి వైదేహ్యా రక్షణార్థే సహాయతా. 9

ప్ర. అ. నరవ్యాఘ్ర = ఓ నరశ్రేష్ఠుడా, మామ్=నన్ను, అనువ్రజతా= అనుసరించి వచ్చిన, త్వయా=నీచేత, కార్యమ్=చేయదగిన మంచి పని, కృతమ్

=చేయదగినది. వైదేహ్యాః = సీతయొక్క. రక్షణార్థే = రక్షణముకొరకై, సహాయతా = సాహాయ్యము. అన్వేష్టవ్యా హి = అన్వేషింపదగినది కదా।

తా. నరులలో శ్రేష్ఠుడ వైన ఓ లక్ష్మణా! నన్ను అనుసరించి వచ్చి నీవు మంచి పని చేసితివి. సీతను రక్షించుకొనుటకు సాహాయ్యము కావలెను కదా। 9

మూ. అద్భిరేవ తు సౌమిత్రే వత్స్యామ్యద్య నిశామిమామ్,
ఏతద్ధి రోచతే మహ్యం వన్యేఽపి వివిధే సతి॥ 10

ప్ర. అ. సౌమిత్రే=లక్ష్మణా, అద్య = నేడు, ఇమాం నిశామ్ = ఈ రాత్రిని, అద్భిరేవ = ఉదకముతో మాత్రమే, వత్స్యామి = ఉండెదను. వివిధే= అనేకవిధము లైన, వన్యే=వనములందు లభించు పదార్థము, సత్యపి=ఉన్నను, ఏతత్=ఇది, మహ్యమ్=నాకు, రోచతే హి=ఇష్ట మగుచున్నది కదా।

తా. లక్ష్మణా! ఈ రాత్రి ఉదకము మాత్రమే త్రాగి ఉండెదను. అనేక విధము లైన వన్యపదార్థములు లభించుచున్నను ఇపుడు నాకు ఇట్లు ఉండుటయే ఇష్టము. 10

మూ. ఏవముక్త్వా తు సౌమిత్రిం సుమన్త్రమపి రాఘవః,
అప్రమత్తస్త్వమశ్వేషు భవ సౌమ్యేత్యువాచ హ. 11

ప్ర. అ. రాఘవః = రాముడు, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, ఏవమ్ = ఈ విధముగా, ఉక్త్వా=పలికి, సౌమ్య = ఓ సౌమ్యుడా, త్వమ్=నీవు, అశ్వేషు=అశ్వముల విషయమున, అప్రమత్తః = ఏమరుపాటు లేనివాడవై, భవ =అగుము, ఇతి=అని, సుమన్త్రమపి=సుమంత్రుని గూర్చి కూడ, ఉవాచ హ =పలికెను.

తా. రాముడు లక్ష్మణునితో ఇట్లు చెప్పి 'ఓ సౌమ్యుడా! నీవు అశ్వములను జాగ్రత్తగా చూచుకొనుచుండుము" అని సుమంత్రుని ఆదేశించెను. 11

మూ. సోఽశ్వాన్ సుమన్త్రః సంయమ్య సూర్యేఽస్తం సముపాగతే,
ప్రభూతయవసాన్ కృత్వా బభూవ ప్రత్యనన్తరః. 12

ప్ర. అ. సః సుమన్త్రః = ఆ సుమంత్రుడు, సూర్యే=సూర్యుడు, అస్తమ్ =అస్తమయమును, సముపాగతే = పొందినవాడగుచుండగా, అశ్వాన్=అశ్వములను, సంయమ్య = కట్టి, ప్రభూతయవసాన్ =అధికమైన గడ్డికలవానినిగా, కృత్వా=చేసి, ప్రత్యనన్తరః=సమీపమునం దున్నవాడుగా, బభూవ=అయెను.

తా. సూర్యుడు అస్తమించిన పిమ్మట సుమంత్రుడు, మేయుచున్న గుర్రములను కట్టివేసి, వాటికి అధికముగా గడ్డి వేసి వాటి దగ్గరనే ఉండెను. 12

మూ. ఉపాస్య తు శివాం సన్ధ్యాం దృష్ట్వా రాత్రిముపస్థితామ్,
రామస్య శయనం చక్రే సూతః సౌమిత్రిణా సహ. 13

ప్ర. అ. సూతః = సారథి, శివామ్=మంగళకరమైన, సన్ధ్యామ్ = సంధ్యను, ఉపాస్య= సేవించి, రాత్రిమ్=రాత్రిని, ఉపస్థితామ్=వచ్చినదానినిగా, దృష్ట్వా=చూచి, సౌమిత్రిణా సహ=లక్ష్మణునితో గూడ, రామస్య=రామునకు, శయనమ్ = పక్కను, చక్రే=చేసెను.

తా. సుమంత్రుడు సంధ్యోపాసనము చేసి రాత్రి వచ్చినట్లు గుర్తించి రామునకును, లక్ష్మణునకును శయనమును ఏర్పరచెను. 13

మూ. తాం శయ్యాం తమసాతీరే వీక్ష్య వృక్షదళైః కృతామ్,
రామః సౌమిత్రిణా సార్ధం సభార్యః సంవివేశ హ.

ప్ర. అ. తమసాతీరే = తమసానదీతీరమున, వృక్షదళైః = చెట్ల ఆకులతో, కృతామ్=చేయబడిన, తాం శయ్యామ్ = ఆ శయ్యను, వీక్ష్య = చూచి, రామః=రాముడు, సభార్యః = భార్యాసహితుడై, సౌమిత్రిణా సార్ధమ్ = లక్ష్మణునితో కూడ, సంవివేశ హ = పరుండెను.

తా. రాముడు తమసాతీరమునందు చెట్ల ఆకులతో ఏర్పరచిన ఆ శయ్యను చూచి, సీతాసమేతుడై, శయనించెను. లక్ష్మణుడు కూడా శయనించెను. 14

మూ. సభార్యం సంప్రసుప్తం తం భ్రాతరం వీక్ష్య లక్ష్మణః,
కథయామాస సూతాయ రామస్య వివిధాన్ గుణాన్. 15

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, సంప్రసుప్తమ్=నిద్రించిన, సభార్యమ్= భార్యాసహితుడైన, తం భ్రాతరమ్ = ఆ సోదరుని, వీక్ష్య = చూచి, సూతాయ

= సుమంత్రునకు, రామస్య = రామునియొక్క, వివిధాన్ = అనేకవిధము లైన, గుణాన్ = గుణములను గూర్చి, కథయామాస = చెప్పెను.

తా. ఆ విధముగా రాముడును సీతయు నిద్రించుచుండగా చూచి, లక్ష్మణుడు రాముని అనేకసద్గుణములను సుమంత్రునకు వర్ణించి చెప్పెను. 15

మూ. జాగ్రతో హ్యేవ తాం రాత్రిం సౌమిత్రేరుదితో రవిః,
సూతస్య తమసాతీరే రామస్య బ్రువతో గుణాన్. 16

ప్ర. అ. తమసాతీరే = తమసాతీరమునందు, రామస్య = రామునియొక్క, గుణాన్ = గుణములను గూర్చి, సూతస్య = సూతునకు, బ్రువతః = చెప్పుచున్న, సౌమిత్రేః = లక్ష్మణుడు, తాం రాత్రిమ్ = ఆ రాత్రియంతయు, జాగ్రతో హ్యేవ = మేల్కొని యుండగానే, రవిః = సూర్యుడు, ఉదితః = ఉదయించెను.

తా. ఆ తమసాతీరమున లక్ష్మణుడు, సుమంత్రునకు రాముని గుణములను గూర్చి వర్ణించుచు, మేల్కొని యుండగానే, రాత్రి గడచి సూర్యుడు ఉదయించెను. 16

మూ. గోకులాకులతీరాయాస్తమసాయా విదూరతః,
అవసత్తత్ర తాం రాత్రిం రామః ప్రకృతిభిః సహ. 17

ప్ర. అ. రామః = రాముడు, ప్రకృతిభిః సహ = ప్రజలతో కూడ, గోకులాకులతీరాయాః = గోవుల సముదాయములచే వ్యాకుల మైన తీరము గల, తమసాయాః = తమసానదికి, విదూరతః = దూరముగా, తాం రాత్రిమ్ = ఆ రాత్రిని, తత్ర = అచట, అవసత్ = నివసించెను.

తా. రాముడు ఆ రాత్రి తన వెంబడి వచ్చిన ప్రజలతో గోసముదాయముచే వ్యాకుల మైన తీరము గల తమసానదికి దూరముగా నివసించెను. 17

మూ. ఉత్థాయ స మహాతేజాః ప్రకృతీస్తా నిశామ్య చ,
అబ్రవీద్భ్రాతరం రామో లక్ష్మణం పుణ్యలక్షణమ్. 18

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సు గల, సః రామః = ఆ రాముడు, ఉత్థాయ చ = లేచి, తాః = ఆ, ప్రకృతీః = ప్రజలను, నిశామ్య చ = చూచి,

పుణ్యలక్షణమ్ = శుభలక్షణములు గల, భ్రాతరమ్ = సోదరు డైన, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. మహాతేజశ్శాలి యగు ఆ రాముడు నిద్రలేచి ఆ ప్రజలను చూచి, శుభ మైన లక్షణములు గల సోదరు డైన లక్ష్మణునితో ఇట్లనెను. 18

మూ. అస్మద్వ్యపేక్షాన్ సౌమిత్రే నిరపేక్షాన్ గృహేష్వపి,
వృక్షమూలేషు సంసుప్తాన్ పశ్య లక్ష్మణ సాంప్రతమ్.

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! సౌమిత్రే = సుమిత్రాకుమారా! అస్మద్వ్యపేక్షాన్ = మనయందు ఆసక్తి కలవారు, గృహేష్వపి = గృహములందు కూడ, నిరపేక్షాన్ = ఆసక్తి లేనివారు, సాంప్రతమ్ = ఇపుడు, వృక్షమూలేషు = చెట్ల క్రింద. సంసుప్తాన్ = నిద్రించుచున్న వారూ అయిన పౌరులను, పశ్య = చూడుము.

తా. లక్ష్మణా! ఈ పౌరు లందరు మనపై ప్రేమతో, గృహములపై అపేక్షను కూడ విడచి వచ్చి, ఇపుడు చెట్ల క్రింద నిద్రించుచున్నారు; చూడుము. 19

మూ. యథైతే నియమం పౌరాః కుర్వన్త్యస్మన్నివర్తనే,
అపి ప్రాణాన్ న్యసిష్యన్తి న తు త్యక్ష్యన్తి నిశ్చయమ్.

ప్ర. అ. ఏతే పౌరాః = ఈ పౌరులు, అస్మన్నివర్తనే = మనలను మరల్చుటయందు. యథా = ఎట్లు, నియమమ్ = నియమమును, కుర్వన్తి = చేయుచున్నారో, ప్రాణానపి = ప్రాణములను కూడ, న్యసిష్యన్తి = విడిచిపెట్టెదరు. నిశ్చయం తు = తమ నిశ్చయము నైతే, న త్యక్ష్యన్తి = విడువరు.

తా. ఈ పౌరు లందరు మనలను వెనుకకు మరల్చుటకు చూపు పట్టుదలను చూడగా వీరు ప్రాణముల నైన విడుతురు కాని, తమ నిశ్చయమును విడువరు అని తోచుచున్నది. 20

మూ. యావదేవ తు సంసుప్తాస్తావదేవ వయం లఘు,
రథమారుహ్య గచ్ఛామ పన్థానమకుతోభయమ్. 21

ప్ర. అ. యావదేవ = ఎంతవరకు, సంసుప్తాః = నిద్రించినారో, తావదేవ = అంతలో, వయమ్ = మనము, లఘు = శీఘ్రముగా, రథమ్ = రథమును

ఆరుహ్య = ఎక్కి, అకుతోభయమ్ = ఎటువైపునుండియు భయము లేని, పంథా నమ్ = మార్గమును, గచ్ఛామ = పోయెదము.

తా. ఈ పౌరులు నిద్రమంది మేల్కొనులోపుగా మనము రథ మెక్కి శీఘ్రముగా ఎట్టి భయము లేని మార్గమున వెళ్లెదము. 21

మూ. అతో భూయోఽపి నేదానీ మిక్ష్వాకుపురవాసినః,
స్వపేయురనురక్తా మాం వృక్షమూలాని సంశ్రితాః. 22

ప్ర. అ. అతః = అందువలన, మామ్ = నన్ను గూర్చి, అనురక్తాః = అనురాగము గల, ఇక్ష్వాకుపురవాసినః = ఇక్ష్వాకుపురమునందు నివసించు జనులు, భూయోఽపి = మరల, వృక్షమూలాని = వృక్షముల మొదళ్ళను, సంశ్రితాః = ఆశ్రయించినవారై, ఇదానీమ్ = ఇపుడు వలె, భూయోఽపి = మరల, న స్వపేయుః = నిద్రింపకుందురు.

తా. మన మిట్లు చేసినచో నాపై ప్రేమగల ఈ అయోధ్యాపౌరులు చెట్ల మొదళ్ళలో ఈ నాడు నిద్రించుచున్నట్లు, మరల నిద్రించుటకు అవసర ముండదు. 22

మూ. పౌరా హ్యాత్మకృతాద్దుఃఖాద్విప్రమోక్ష్యాః నృపాత్మజైః।
న తు ఖల్వాత్మనా యోజ్యా దుఃఖేన పురవాసినః. 23

ప్ర. అ. పౌరాః = పౌరులు. నృపాత్మజైః = రాజకుమారులచేత, ఆత్మకృతాత్ = తమచే చేయబడిన, దుఃఖాత్ = దుఃఖమునుండి, విప్రమోక్ష్యాః హి = విడిపింపదగినవారు కదా। పురవాసినః = పురమునందు నివసించే వారు, ఆత్మనా = తనచేత, దుఃఖేన = దుఃఖముతో, న యోజ్యాః హి = కూర్పదగినవారు కాదు.

తా. పౌరులకు తమవలన ఏ దైన దుఃఖము కలిగినచో, దానిని రాజ కుమారులు తొలగించవలెను. స్వయముగా పురవాసులకు దుఃఖము కల్గింప కూడదు. 23

మూ. అబ్రవీ ల్లక్ష్మణో రామం సాక్షాద్ధర్మ మివ స్థితమ్,
రోచతే మే తథా ప్రాజ్ఞ క్షిప్ర మారుహ్యతామితి. 24

ప్ర. అ. సాక్షాత్ = ప్రత్యక్ష మైన, ధర్మమివ = ధర్మము వలె, స్థితమ్ = ఉన్న, రామమ్ = రాముని గూర్చి, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రాజ్ఞ = ఓ బుద్ధిమంతుడా, మే = నాకు, తథా = అట్లు, రోచతే = ఇష్టమగుచున్నది. క్షిప్రమ్ = శీఘ్రముగా, అనుష్ఠీయతామ్ = ఎక్కబడుగాక, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను.

తా. లక్ష్మణుడు మూర్తీభవించిన ధర్మము వలె నున్న రామునితో 'బుద్ధిశాలి వైన ఓ రామా! నీవు చెప్పినది నాకు కూడా ఇష్ట మగుచున్నది. శీఘ్రముగా రథము నెక్కుము' అని పలికెను. 24

మూ. అథ రామోఽబ్రవీచ్ఛ్రీమాన్ సుమన్త్రం యుజ్యతాం రథః,
గమిష్యామి తతోఽరణ్యం గచ్ఛ శీఘ్రమితః ప్రభో. 25

ప్ర. అ. అథ = పిమ్మట, శ్రీమాన్ = శ్రీమంతు డైన, రామః = రాముడు, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. ప్రభో = ఓ సమర్థుడా! రథః = రథము, యుజ్యతామ్ = కట్టబడుగాక. తతః = అటు పిమ్మట, లేదా ఆ రథముచే, అరణ్యమ్ = అరణ్యమును గూర్చి, గమిష్యామి = వెళ్లగలను. ఇతః = ఇక్కడ నుండి, శీఘ్రమ్ = శీఘ్రముగా, గచ్ఛ = వెళ్ళుము.

తా. పిమ్మట తేజశ్శాలి యైన రాముడు సుమంత్రునితో "ఓ సమర్థుడా! రథమును కట్టుము. దానిపై అరణ్యమునకు వెళ్ళెదను. ఈ ప్రదేశము నుండి శీఘ్రముగా వెళ్ళుము (వెళ్ళెదము")- 25

మూ. సూతస్తతః స త్వరితః స్యన్దనం తైర్హయోత్తమైః,
యోజయిత్వాథ రామాయ ప్రాఞ్జలిః ప్రత్యవేదయత్. 26

ప్ర. అ. తతః = పిమ్మట, సః సూతః = ఆ సూతుడు, త్వరితః = తొందరపడుచున్నవా డై, స్యన్దనమ్ = రథమును, తైః = ఆ, హయోత్తమైః = అశ్వశ్రేష్ఠములచే, యోజయిత్వా = కూర్చి, అథ = పిమ్మట, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, రామాయ = రామునకు, ప్రత్యవేదయత్ = తెలిపెను.

తా. ఎమ్మట ఆ సారథి తొందరగా రథమునకు గుఱ్ఱములు కట్టి రాము నకు నమస్కరించి రథము సిద్ధముగా నున్నదని చెప్పెను. 26

మూ. అయం యుక్తో మహాబాహో రథస్తే రథినాం వర,
త్వమారోహస్వ భద్రం తే ససీతః సహలక్ష్మణః. 27

ప్ర. అ. మహాబాహో = గొప్ప బాహువులు కలవాడా! రథినామ్ = రథికులలో, వర = శ్రేష్ఠుడా, తే = నీయొక్క, అయం రథః = ఈ రథము, యుక్తః = కట్టబడినది; త్వమ్ = నీవు, ససీతః = సీతతో కూడినవాడ వై, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడవై, ఆరోహస్వ = ఎక్కుము. తే = నీకు, భద్రమ్ = క్షేమ మగుగాక!

తా. రథికులలో శ్రేష్ఠుడ వైన ఓ రామా! ఈ రథము కట్టితిని; ఓ ఆజానుబాహూ! నీవు, సీత, లక్ష్మణుడు దీనిపై ఎక్కుడు. నీకు క్షేమ మగు గాక! 27

మూ. తం స్యన్దనమధిష్ఠాయ రాఘవః సపరిచ్ఛదః,
శీఘ్రగామాకులావర్తాం తమసామతరన్నదీమ్. 28

ప్ర. అ. సపరిచ్ఛదః = పరికరములతో కూడిన, రాఘవః = రాముడు, తం స్యన్దనమ్ = ఆ రథమును, అధిష్ఠాయ = ఎక్కి, శీఘ్రగామ్ = శీఘ్రముగా ప్రవహించునది, ఆకులావర్తామ్ = వ్యాకుల మైన సుడులు కలదీ యైన, తమసాం నదీమ్ = తమసానదిని, అతరత్ = దాటెను.

తా. రాముడు తన పరికరములతో కూడ రథము నెక్కి, సుడులతో వ్యాకుల మై శీఘ్రముగా ప్రవహించు తమసానదిని దాటెను. 28

మూ. స సంతీర్య మహాబాహుః శ్రీమాన్ శివమకణ్టకమ్,
ప్రాపద్యత మహామార్గమభయం భయదర్శినామ్. 29

ప్ర. అ. మహాబాహుః = ఆజానుబాహు వైన, శ్రీమాన్ = శ్రీమంతు డైన, సః = ఆ రాముడు, సంతీర్య = దాటి, శివమ్ = మంగళకర మైనదీ, అకణ్టకమ్ = బాధలులేనిదీ, భయదర్శినామ్ = భయమును చూచువారికి, అభయమ్ = భయము లేనిది అయిన, మహామార్గమ్ = గొప్ప మార్గమును, ప్రాపద్యత = పొందెను.

తా. మహాబాహువు, శ్రీమంతుడు అయిన ఆ రాముడు తమసానదిని దాటి, మంగళకరమూ బాధలు లేనిదీ, భయపడువారికి కూడ భయమును కల్గించనిది అయిన మహామార్గమును పొందెను. 29

వి. ప్రాచ్యప్రతిలోని "ప్రపేదే తమసామార్గమభయం క్షేమదర్శనమ్" అను పాఠము బాగున్నది. 'భయములేనిదీ, క్షేమంకరముగా కనబడేదీ అయిన....'' అని అర్థము. ''భయమును చూచేవారికి అభయమైనది' అనునది అంతగా బాగు లేదు. 'భయపడేవారికి కూడా ఆ మార్గంలో భయమేదీ ఉండదని'' భావం చెప్పుకొనవలెను.

మూ. మోహనార్థం తు పౌరాణాం సూతం రామోఽబ్రవీద్వచః,
ఉదఙ్ముఖః ప్రయాహి త్వం రథమాస్థాయ సారథే. 30
ముహూర్తం త్వరితం గత్వా నివర్తయ రథం పునః,
యథా న విద్యుః పౌరా మాం తథా కురు సమాహితః. 31

ప్ర. అ. రామః=రాముడు, పౌరాణామ్=పౌరులయొక్క, మోహనార్థమ్=మోసపుచ్చుటకు, సూతమ్=సారథిని గూర్చి, వచః=వాక్యమును, అబ్రవీత్ = పలికెను. సారథే = ఓ సారథీ, త్వమ్=నీవు, రథమ్ = రథమును, ఆస్థాయ = అధిష్ఠించి, ఉదఙ్ముఖః = ఉత్తరాభిముఖుడవై, ప్రయాహి = వెళ్ళుము. ముహూర్తమ్ = కొంచెము కాలము, త్వరితమ్=శీఘ్రముగా, గత్వా = వెళ్ళి, రథమ్ = రథమును, పునః = తిరిగి, నివర్తయ = మరల్చుము. మామ్ = నన్ను గూర్చి, పౌరాః=పౌరులు, యథా = ఎట్లు, న విద్యుః=తెలుసుకొనరో, తథా = అట్లు, సమాహితః=సావధాన చిత్తుడ వై, కురు=చేయుము.

తా. ఆ పౌరులను మోసగించుటకై రాముడు సుమంత్రునితో యిట్లనెను. 'ఓ సుమంత్రా! నీవు రథ మెక్కి కొంత దూరము ఉత్తరము వైపు వెళ్ళి త్వరగా రథమును వెనుకకు త్రిప్పుము. నీవు సావధానచిత్తుడ వై పౌరులకు నా విషయము తెలియకుండు నట్లు చూడుము. 30.31

మూ. రామస్య వచనం శ్రుత్వా తథా చక్రే స సారథిః,
ప్రత్యాగమ్య చ రామస్య స్యన్దనం ప్రత్యవేదయత్. 32

ప్ర. అ. సః సారథిః = ఆ సారథి, రామస్య = రాముని యొక్క, వచనమ్ = వచనమును, శ్రుత్వా = విని. తథా = అట్లు, చక్రే = చేసెను. ప్రత్యాగమ్య = తిరిగి వచ్చి, రామస్య = రామునకు, స్యన్దనమ్ = రథమును గూర్చి, ప్రత్యవేదయత్ = తెలిపెను.

తా. సుమన్త్రుడు రాముని ఆజ్ఞ ప్రకారము, ఆ విధముగా చేసి, తిరిగి వచ్చి రామునకు రథము సిద్ధముగా ఉన్నట్లు తెలిపెను. 32

మూ. తౌ సంప్రయుక్తం తు రథం సమాస్థితౌ
తదా ససీతౌ రఘువంశవర్ధనౌ,
ప్రచోదయామాస తతస్తురంగమాన్
స సారథిర్యేన పథా తపోవనమ్. 33

ప్ర. అ. తదా = అపుడు, ససీతౌ = సీతతో కూడిన, రఘువంశవర్ధనౌ = రఘువంశమును వృద్ధి పొందించు రామలక్ష్మణులు. సంప్రయుక్తమ్ = కట్టబడిన, రథమ్ = రథమును, సమాస్థితౌ = ఎక్కిరి. తతః = పిమ్మట. సః సారథిః = ఆ సారథి, యేన = ఏ, పథా = మార్గముచేత, తపోవనమ్ = తపోవన మున్నదో ఆ మార్గమున, తురంగమాన్ = గుఱ్ఱములను, ప్రచోదయామాస = తోలెను.

తా. సీతాసహితులైన రామలక్ష్మణులు, చక్కగా కట్టబడిన ఆ రథమును ఎక్కగా, సుమన్త్రుడు, గుఱ్ఱములను తపోవనము వైపు వెళ్ళు మార్గమునందు నడిపించెను. 33

మూ. తతః సమాస్థాయ రథం మహారథః
ససారథిర్దాశరథిర్వనం యయౌ,
ఉదఙ్ముఖం తం తు రథం చకార స
ప్రయాణమాఙ్గళ్యనిమిత్తదర్శనాత్. 34

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
షట్చత్వారింశః సర్గః.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సః = ఆ సుమన్త్రుడు. ప్రయాణమాఙ్గళ్యనిమిత్తదర్శనాత్ = ప్రయాణమునకు మంగళకర మైన నిమిత్తములను

చూచుటవలన, తం రథమ్ = ఆ రథమును, ఉదఙ్ముఖమ్ = ఉత్తరాభిముఖముగా, చకార = చేసెను. మహారథః = మహారథు డైన, దాశరథిః = రాముడు, ససారథిః = సారథితో కూడినవాడై, రథమ్ = రథమును, ఆస్థాయ = ఎక్కి, వనమ్ = వనమును గూర్చి, యయౌ = వెళ్ళెను.

తా. ఉత్తరాభిముఖముగా ప్రయాణము చేయుట మంగళకర మగుటచే సారథి ఆ రథమును ఉత్తరాభిముఖముగా నుండునట్లు చేసెను. మహారథు డైన రాముడు సారథితో ఆ రథమును ఎక్కి వనమునకు వెళ్ళెను. ౩౬

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదియారవ సర్గ సమాప్తము.

## అథ సప్తచత్వారింశః సర్గః

[పౌరులు వేకువనే లేచి విలపించుట, నిరాశ పొంది నగరమునకు మరలిపోవుట.]

మూ. ప్రభాతాయాం తు శర్వర్యాం పౌరాస్తే రాఘవం వినా,
శోకోపహతనిశ్చేష్టా బభూవుర్హతచేతసః. 1

ప్ర. అ. శర్వర్యామ్=రాత్రి, ప్రభాతాయామ్ = తెల్లవారగనే, తే పౌరాః = ఆ పౌరులు, రాఘవం వినా = రాముడు లేక పోవుటచే, హతచేతసః = పీడింపబడిన మనస్సు గలవారై, శోకోపహతచేతసః = శోకముచే కొట్టబడిన మనస్సులు కలవారుగాను, నిశ్చేష్టాః = నిశ్చేష్టులుగాను, బభూవుః = అయిరి.

తా. రాత్రి తెల్లవారగనే ఆ పౌరులు రాము డక్కడ లేకపోవుట చూచి, దుఃఖముచే పీడింపబడిన చిత్తము కలవా రై నిశ్చేష్టు లైరి. 1

మూ. శోకజాశ్రుపరిద్యూనా వీక్షమాణాస్తతస్తతః,
ఆలోకమపి రామస్య న పశ్యన్తి స్మ దుఃఖితాః. 2

ప్ర. అ. శోకజాశ్రుపరిద్యూనాః = శోకము వలన కలిగిన కన్నీళ్లతో తడిసినవారై, తతస్తతః = ఆ వైపు, ఆ వైపు, వీక్షమాణాః = చూచుచు, దుఃఖితాః = దుఃఖించిన వారై, రామస్య = రామునియొక్క, ఆలోకమపి = వెలుతురును కూడ (జాడను కూడ) న పశ్యన్తి స్మ = చూడలేదు.

తా. కన్నీళ్లతో తడిసి, దుఃఖితులై అటు ఇటు చూచుచున్న వారికి రాముని జాడ కూడ కనబడలేదు. 2

మూ. తే విషాదార్తవదనా రహితాస్తేన ధీమతా,
కృపణాః కరుణా వాచో వదన్తి స్మ మనస్వినః. 3

ప్ర. అ. మనస్వినః = మంచి మనస్సు గల, తే = వారు, ధీమతాః = బుద్ధిమంతు లైన, తేన = ఆ రామునితో. రహితాః = లేనివారై, విషాదార్త వదనాః = దుఃఖముచే పీడింపబడిన ముఖములు కలవారై, కృపణాః = దీనులై, కరుణాః = జాలిని కల్గించు, వాచః = వాక్యములను, వదన్తి స్మ = పలికిరి.

తా. మంచి మనస్సులు గల ఆ పౌరులు, రాము దక్కడ లేకపోవుటచే దుఃఖముచే ఎండిన ముఖములు కలవా రై దీను లై ఇట్లు మాటలాడుకొనిరి. 3

మూ. ధిగస్తు ఖలు నిద్రాం తాం యయాపహృతచేతసః,

నాద్య పశ్యామహే రామం పృథూరస్కం మహాభుజమ్.

ప్ర. అ. యయా = దేనిచే, అపహృత చేతసః = అపహరింపబడిన చిత్తము కలవార మై, అద్య = ఇపుడు, పృథూరస్కమ్ = విశాల మైన వక్షః స్థలము కల వాడూ, మహాభుజమ్ = గొప్ప భుజములు కలవాడూ అయిన, రామమ్ = రాముని, న పశ్యామహే = చూచుట లేదో, తాం నిద్రామ్ = అట్టి నిద్రను గూర్చి, ధిక్ అస్తు = నింద అగుగాక.

తా. ఛీ! ఈ నిద్ర ఎంత పని చేసినది! దీనిచే ఒళ్లు తెలియక మనము విశాల మైన వక్షఃస్థలము కలవాడు, అజానుబాహుం డు అయిన రాముని కోల్పోయి నాము. 4

మూ. కథం నామ మహాబాహుః స తథాఽవితథక్రియః,

భక్తం జనం పరిత్యజ్య ప్రవాసం రాఘవో గతః. 5

ప్ర. అ. తథా = ఆ విధముగా, అవితథక్రియః = వ్యర్థము గాని క్రియలు కలవాడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు అయిన, సః రాఘవః = ఆ రాముడు, భక్తమ్ = భక్తి గల, జనమ్ = జనమును, పరిత్యజ్య = విడిచి, కథం నామ = ఎట్లు, ప్రవాసమ్ = ప్రవాసమును గూర్చి, గతః = వెళ్ళినాడు.

తా. మహాబాహు వైన ఆ రామునకు చేసిన సేవ ఎన్నడును వ్యర్థము కాదు. అట్టి రాముడు తన భక్తుల మైన మనలను విడచి ఎట్లు దూరముగా వెళ్ళి పోయినాడు? 5

మూ. యో నః సదా పాలయతి పితా పుత్రానివౌరసాన్,

కథం రఘూణాం స శ్రేష్ఠస్త్యక్త్వా నో విపినం గతః. 6

ప్ర. అ. రఘూణామ్ = రఘువంశ రాజులలో. శ్రేష్ఠః=శ్రేష్ఠుడైన యః= ఏ రాముడు, పితా = తండ్రి, ఔరసాన్ పుత్రాన్ ఇవ = తన ఔరసు లయిన పుత్రులను వలె, నః = మనలను, సదా = ఎల్లప్పుడును; పాలయతి = పాలించునో, సః=అట్టి రాముడు, నః=మనలను, త్యక్త్వా=విడిచి, విపినమ్=అరణ్యమును, గూర్చి, కథమ్=ఎట్లు, గతః=వెళ్ళినాడు.

తా. తండ్రి ఔరసు లయిన తన కుమారులను పాలించునట్లు రాముడు మనలను సర్వదా పాలించుచుండెడివాడు. అట్టి రాముడు మనలను విడిచి అరణ్యమునకు ఎట్లు వెళ్ళినాడు? 6

మూ. ఇహైవ నిధనం యామో మహాప్రస్థానమేవ వా,
రామేణ రహితానాం హి కిమర్థం జీవితం హి నః. 7

ప్ర. అ. ఇహైవ=ఇక్కడనే, నిధనమ్=మరణమును, యామః = పొందెదము. మహాప్రస్థానమేవ వా=మహాప్రస్థానమును గాని (మరణించువరకు దీక్షతో ఉత్తరాభిముఖముగా నడచి వెళ్లుట) పొందెదము. రామేణ = రామునితో, రహితానామ్=శూన్యులమైన, నః=మనకు, జీవితమ్ = జీవితము, కిమర్థమ్=ఎందుకు?

తా. మన మందరము ఇక్కడనే మరణించెదము. లేదా మరణించువరకు ఉత్తరదిక్కునకు నడచిపోవుదము. రాముడు లేని మన ఈ జీవితము వ్యర్థము. 7

మూ. సన్తి శుష్కాణి కాష్ఠాని ప్రభూతాని మహాన్తి చ,
తైః ప్రజ్వాల్య చితాం సర్వే ప్రవిశామోఽథ పావకమ్

ప్ర. అ. మహాన్తి = పెద్దవి, ప్రభూతాని = అధికములు అయిన, శుష్కాణి = ఎండిన, కాష్ఠాని=కట్టెలు, సన్తి=ఉన్నవి. అథ = లేక, తైః = వానిచే, చితామ్ = చితను, ప్రజ్వాల్య=జ్వలింపజేసి, సర్వే = మన మందరము, పావకమ్ = అగ్నిని, ప్రవిశామః=ప్రవేశించెదము.

తా. ఇక్కడ అత్యధిక మైన పెద్ద పెద్ద ఎండిన కట్టె లున్నవి. వానిచే చితను ఏర్పరచి మన మందరము అగ్నిలో ప్రవేశించెదము. 8

మూ. కిం వక్ష్యామో మహాబాహురనసూయః ప్రియంవదః,
నీతః స రాఘవోఽస్మాభిరితి వక్తుం కథం క్షమమ్. 9

ప్ర. అ. కిమ్ = ఏమి, వక్ష్యామః = చెప్పగలము, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడు, అనసూయః = అసూయ లేనివాడు, ప్రియంవదః = ప్రియమును పలుకువాడు అయిన, సః రాఘవః = ఆ రాముడు, అస్మాభిః = మాచేత, నీతః = అరణ్యము చేర్పబడినవాడు, ఇతి = అని, కథమ్ = ఎట్లు, వక్తుమ్ = చెప్పుటకు, క్షమమ్ = శక్య మైనది?

తా. రాముని గూర్చి అడుగువారికి మనము ఏమి చెప్పగలము? గొప్ప బాహువులు కలవాడు, అసూయ లేనివాడు, ప్రియముగా మాటలాడువాడు అయిన రాముని, అరణ్యమునకు చేర్చి వచ్చితిమి అని, మనము ఎట్లు చెప్పగలము. 9

మూ. సా నూనం నగరీ దీనా దృష్ట్వాఽస్మాన్ రాఘవం వినా
భవిష్యతి నిరానన్దా సస్త్రీబాలవయోధికా. 10

ప్ర. అ. రాఘవం వినా = రాముడు లేని, అస్మాన్ = మనలను, దృష్ట్వా = చూచి, సస్త్రీబాలవయోధికా = స్త్రీ బాల వృద్ధులతో కూడిన, సా నగరీ = ఆ నగరము, నూనమ్ = తప్పక, దీనా = దీన యైనదై, నిరానన్దా = ఆనందశూన్య మై, భవిష్యతి = కాగలదు.

తా. రాముడు లేకుండగా మనమే తిరిగి వచ్చుట చూచి అయోధ్యలోని స్త్రీ బాల వృద్ధులతో సహ అందరును దీనులై ఆనందములేనివారుగా అగుదురు.

మూ. నిర్యాతాస్తేన వీరేణ సహ నిత్యం జితాత్మనా,
విహీనాస్తేన చ పునః కథం పశ్యామ తాం పురీమ్. 11

ప్ర. అ. నిత్యమ్ = ఎల్లప్పుడును, జితాత్మనా = జయింపబడిన మనస్సు గల, తేన వీరేణ సహ = ఆ వీరునితో కూడ, నిర్యాతాః = నగరము విడిచి వచ్చిన మనము, తేన చ = వానితో, విహీనాః = శూన్యుల మై, తాం పురీమ్ = ఆ పట్టణమును, కథమ్ = ఎట్లు, పునః = మరల, పశ్యామ = చూచెదము.

తా. ఆత్మనిగ్రహవంతు డైన ఆ రామునితో కలిసి అయోధ్య విడిచి పోయుటకు వచ్చిన మనము, ఇపుడు అతడు లేకుండా ఆ నగరమును ఎట్లు చూడగలము? 11

మూ. ఇతీవ బహుధా వాచో బాహుముద్యమ్య తే జనాః,
విలపన్తి స్మ దుఃఖార్తా వివత్సా ఇవ ధేనవః. 12

ప్ర. అ. తే జనాః = ఆ జనులు, దుఃఖార్తాః=దుఃఖముచే పీడింపబడిన వారై, బాహుమ్=బాహువులను, ఉద్యమ్య=ఎత్తి, బహుధా = అనేకవిధములుగా, ఇతీవ = ఇట్లు, వాచః = వాక్కులను పలుకుచు, వివత్సాః = దూడలు లేని, ధేనవః ఇవ=ఆవులు వలె, విలపన్తి స్మ=విలపించిరి.

తా. ఆ జను లందరు ఈ విధముగా పలుకుచు, దుఃఖార్తులై, చేతులు పైకెత్తి, లేగదూడలు లేని ఆవులు వలె విలపించిరి. 12

మూ. తతో మార్గానుసారేణ గత్వా కించిత్ క్షణం పునః,
మార్గనాశాద్విషాదేన మహతా సమభిప్లుతాః. 13

ప్ర. అ. తతః=పిమ్మట, క్షణమ్=కొంచెము సేపు, మార్గానుసారేణ = మార్గానుసారముగా, కించిత్ = కొంచెము. గత్వా = వెళ్ళి, మార్గనాశాత్ = మార్గము నశించుటవలన, పునః= మరల, మహతా=గొప్ప, విషాదేన=దుఃఖముచే సమభిప్లుతాః=ముంచబడిరి.

తా. పిమ్మట రథము జాడ ననుసరించి, కొంచెము దూరము వెళ్ళి, తరువాత ఆ జాడ కనబడకపోవుటచే గొప్ప శోకములో మునిగిరి. 13

మూ. రథస్య మార్గనాశేన న్యవర్తన్త మనస్వినః,
కిమిదం కిం కరిష్యామో దైవేనోపహతా ఇతి. 14

ప్ర. అ. మనస్వినః=మంచి మనస్సు గల ఆ పౌరులు, రథస్య=రథము యొక్క, మార్గనాశేన = మార్గముయొక్క నాశముచే, కిమిదమ్ = ఇ దేమిటి, దైవేన = దైవముచేత, ఉపహతాః = కొట్టబడిన మనము, కిం కరిష్యామః=ఏమి చేసెదము, ఇతి=అని పలుకుచు, న్యవర్తన్త = మరలిరి.

తా. రథము నడిచిన జాడ కనబడకపోవుటచే, ఆ పౌరు లందరు "ఇదే మిటి? దైవోపహతుల మైన మనము ఇపుడు ఏమి చేయవలెను?" అని పలుకుచు వెనుకకు మరలిరి. 14

మూ. తతో యథాగతేనైవ మార్గేణ క్లాన్తచేతసః,
అయోధ్యామగమన్సర్వే పురీం వ్యథితసజ్జనామ్. 15

ప్ర. అ. తతః=అటు పిమ్మట, సర్వే=అందరును, క్లాన్తచేతసః=దుఃఖపడుచున్న మనస్సు కలవారై, యథాగతేనైవ=ఎట్లు వచ్చిరో అదే, మార్గేణ=మార్గముచేత. వ్యథితసజ్జనామ్=దుఃఖించుచున్న సత్పురుషులు కల, అయోధ్యాపురీమ్=అయోధ్యానగరమును గూర్చి, అగమన్=వెళ్ళిరి.

తా. పిమ్మట వారందరును, దుఃఖించుచు, శోకాక్రాంతులైన సజ్జనులు గల అయోధ్యాపురమునకు, వచ్చిన మార్గముననే వెళ్ళిరి. 15

మూ. ఆలోక్య నగరీం తాం చ క్షయవ్యాకులమానసాః,
అవర్తయన్త తేఽశ్రూణి నయనైః శోకపీడితైః. 16

ప్ర. అ. తే=వారు, తాం నగరీమ్=ఆ పట్టణమును, ఆలోక్య=చూచి, క్షయవ్యాకులమానసాః=ఈ ఆపదచే వ్యాకులమైన మనస్సు కలవారై, శోకపీడితైః=శోకముచే పీడింపబడిన, నయనైః=నేత్రములచే, అశ్రూణి=కన్నీళ్లను, అవర్తయన్త=రాల్చిరి.

తా. ఆ పౌరులు ఆ నగరమును చూచి, వచ్చిన ఆపదను గూర్చి వ్యాకులమైన మనస్సు గలవారై, దుఃఖముచేత పీడింపబడిన నేత్రములతో కన్నీళ్ళు రాల్చిరి. 16

మూ. ఏషా రామేణ నగరీ రహితా నాతిశోభతే,
ఆపగా గరుడేనేవ హ్రదాదుద్ధృతపన్నగా. 17

ప్ర. అ. రామేణ రహితా=రామునితో శూన్యమైన, ఏషా నగరీ=ఈ పట్టణము, హ్రదాత్=లోతైన ప్రదేశమునుండి, గరుడేన=గరుత్మంతుని చేత, ఉద్ధృతపన్నగా=ఎత్తివేయబడిన సర్పము గల, ఆపగా ఇవ=నది వలె, నాతిశోభతే=ఏమాత్రము ప్రకాశించుటలేదు.

తా. హ్రదమునుండి, సర్పమును గరుత్మంతుడు ఎత్తుకొని పోగా ప్రకాశరహితమగు నది వలె, రాముడు లేని ఈ నగరము ఏమాత్రము ప్రకాశించుటలేదు. 17

మూ. చన్ద్రహీనమివాకాశం తోయహీనమివార్ణవమ్,
అపశ్యన్నిహతానన్దం నగరం తే విచేతసః. 18

ప్ర. అ. విచేతసః = దుఃఖించుచున్న చిత్తము గల, తే = వారు, నిహతానన్దమ్ = కొట్టబడిన ఆనందము గల, నగరమ్ = ఆ నగరమును, చన్ద్రహీనమ్=చంద్రుడు లేని, ఆకాశమ్ ఇవ=ఆకాశమును వలె, తోయహీనమ్= ఉదకము లేని, అర్ణవమ్ ఇవ=సముద్రమును వలె, అపశ్యన్=చూచిరి.

తా. దుఃఖిత మైన మనస్సు గల ఆ పౌరులకు, ఆనందవిహీన మైన ఆ నగరము, చంద్రుడు లేని ఆకాశము వలె, ఉదకము లేని సముద్రము వలె కనబడినది. 18

మూ. తే తాని వేశ్మాని మహాధనాని
దుఃఖేన దుఃఖోపహతా విశన్తః,
నైవ ప్రజజ్ఞుః స్వజనం జనం వా
నిరీక్షమాణాః ప్రవినష్టహర్షాః. 19

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
సప్తచత్వారింశః సర్గః

ప్ర. అ. ప్రవినష్టహర్షాః = నశించిన సంతోషముగల, తే = వారు, మహాధనాని = గొప్ప ధనము గల, తాని = ఆ, వేశ్మాని = గృహములను, దుఃఖేన=అతికష్టముతో, విశన్తః=ప్రవేశించుచు, దుఃఖోపహతాః=దుఃఖముచే కొట్టబడినవారై, నిరీక్షమాణాః=చూచుచున్నవారైనను, స్వజనమ్ = తమ వారిని గాని, జనం వా = ఇతరులను గాని, నైవ ప్రజజ్ఞుః=గుర్తుపట్టలేదు.

తా. ఏ మాత్రము సంతోషము లేని ఆ పౌరులు, అధిక మైన ధనములు గల తమ ఇండ్లలోనికి అతికష్టమున ప్రవేశించి, దుఃఖపీడితులై, ఎదురుగా చూచు చున్నను, తమవారిని గాని, ఇతరులను గాని, సరిగా గుర్తింపలేకపోయిరి.

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదియేడవ సర్గ సమాప్తము.

## అథ అష్ట చత్వారింశః సర్గః

[నగరవాసులగు స్త్రీలు విలపించుట.]

మూ. తేషామేవం విషణ్ణానాంపీడితానామతీవ చ,
బాష్పవిప్లుతనేత్రాణాం సశోకానాం ముమూర్షయా. 1
అనుగమ్య నివృత్తానాం రామం నగరవాసినామ్,
ఉద్గతానీవ సత్త్వాని బభూవు రమనస్వినామ్. 2

ప్ర. అ. ఏవం = ఈ విధముగా, విషణ్ణానామ్ = దుఃఖించుచున్నవారు, అతీవ = మిక్కిలి, పీడితానామ్ = పీడింపబడినవారు, బాష్పవిప్లుతనేత్రాణామ్ = కన్నీటితో నిండిన నేత్రములు గలవారు, సశోకానామ్ = దుఃఖముతో కూడిన వారు, ముమూర్షయా = మరణించవలె నను కోరికతో కూడినవారు, రామమ్ = రాముని, అనుగమ్య = అనుసరించి, నివృత్తానామ్ = మరలి వచ్చిన వారు, అమనస్వినామ్ = ధైర్యరహితులు అయిన, తేషామ్ = ఆ, నగరవాసినామ్ = నగరమునందు నివసించువారియొక్క, సత్త్వాని = ప్రాణములు, ఉద్గతానీవ = లేచిపోయినవా అన్నట్లుండెను.

తా. రాముని అనుసరించి వెళ్ళి మరలి వచ్చిన ఆ పౌరులు, చాల దుఃఖితులై, బాధ పడుచుండిరి. మరణించవలె నను కోరికతో వారు కన్నీళ్ళు కార్చుచుండిరి. దుఃఖమునే ధైర్యమును కోల్పోయిరి. అట్టి ఆ పౌరులు ప్రాణములు పోయినవారివలె ఉండిరి. 1.2

మూ. స్వం స్వం నిలయమాగమ్య పుత్రదారైః సమావృతాః,
అశ్రూణి ముముచుః సర్వే బాష్పేణ పిహితాననాః. 3

ప్ర. అ. సర్వే = వారందరును, స్వం స్వమ్ = తమ తమ, నిలయమ్ = గృహమును, ఆగమ్య = పొంది, పుత్రదారైః = పుత్రులచేతను, భార్యలచేత ను;

సమావృతాః = చుట్టబడినవారై, బాష్పేణ = బాష్పముచేత, పిహితాననాః = కప్పబడిన ముఖములు గలవారై, అశ్రూణి = కన్నీళ్లను, ముముచుః = విడిచిరి.

తా. ఆ పౌరు లందరు, తమ తమ ఇండ్లు చేరి, పుత్రులును, భార్యలును తమ చుట్టు చేరి యుండగా, కన్నీళ్లు కప్పిన ముఖములతో ఏడ్చిరి. 3

మూ. న హ్యహృష్యన్ న చామోదన్ వణిజో న ప్రసారయన్,
న చాశోభన్త పుణ్యాని నాపచన్ గృహమేధినః. 4

ప్ర. అ. న అహృష్యన్ చ = సంతోషించలేదు. న అమోదన్ చ = అభినందించలేదు. వణిజః = వర్తకులు, న ప్రసారయన్ = వస్తువులను అమ్మజూపలేదు. పుణ్యాని చ = పుణ్యస్థానములు కూడ, న అశోభన్త = శోభించలేదు గృహమేధినః = గృహస్థులు, నాపచన్ = వండలేదు.

తా. ఆ పౌరు లెవ్వరును హర్షించలేదు; ఏ కార్యమును ఆమోదించలేదు. వర్తకులు వస్తువులను అమ్మజూపలేదు. దేవాలయాది పుణ్యస్థానములు శోభా విహీనము లై ఉండెను. గృహస్థులు వంటలు చేసుకొనలేదు. 4

మూ. నష్టం దృష్ట్వా నాభ్యనన్దన్ విపులం వా ధనాగమమ్,
పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనన్దత. 5

ప్ర. అ. నష్టమ్ = నష్ట మైన వస్తువును, దృష్ట్వా = చూచి, నాభ్యనన్దన్ = అభినందించలేదు. విపులమ్ = అధిక మైన, ధనాగమం వా = ధనప్రాప్తి నైన, అభినందించలేదు. జననీ = తల్లి, ప్రథమజమ్ = తొలిచూలిగా పుట్టిన, పుత్రమ్ = పుత్రుని, లబ్ధ్వా = పొంది, నాభ్యనన్దత = అభినందించలేదు.

తా. పోయిన వస్తువు దొరికినవారు అందుకు సంతోషించలేదు. అధిక మైన ధనము లభించినవారికి దానివలన ఆనందము కలుగలేదు. తల్లి తొలి చూలిగా పుత్రుని కన్నందులకు కూడ ఆనందించలేదు. 5

మూ. గృహే గృహే రుదన్త్యశ్చ భర్తారం గృహమాగతమ్,
వ్యగర్హయన్త దుఃఖార్తా వాగ్భిస్తోత్త్రై రివ ద్విపాన్. 6

ప్ర. అ. దుఃఖార్తాః = దుఃఖముచే పీడింపబడిన స్త్రీలు, గృహే గృహే = ఇంటింటను, రుదన్త్యః = ఏడ్చుచు, తోత్త్రైః = అంకుశములతో,

ద్విపాన్ ఇవ = ఏనుగులను వలె, వాగ్భిః = మాటలతో, గృహమ్=గృహమును గూర్చి, అగతమ్ = వచ్చిన, భర్తారమ్ = భర్తను, వ్యగ్రస్త్రియ స్త్ర=నిందించిరి.

తా. ఇంటింటియందును, దుఃఖార్త లైన స్త్రీలు, ఏడ్చుచు, ఇంటికి వచ్చిన భర్తను, ఏనుగులను అంకుశముతో పొడిచి నట్లు మాటలతో పొడిచిరి. 6

మూ. కిం ను తేషాం గృహైః కార్యం కిం దారైః కిం ధనేన వా,
పుత్రైర్వా కిం సుఖైర్వాఽపి యే న పశ్యన్తి రాఘవమ్. 7

ప్ర. అ. యే = ఎవరు, రాఘవమ్=రాముని, న పశ్యన్తి = చూడరో, తేషామ్ = వారికి, గృహైః = గృహములచేత, కిమ్ = ఏమి ప్రయోజనము. దారైః = భార్యలచే, కిం కార్యమ్ = ఏమి ప్రయోజనము? ధనేన వా = ధనము చేత నైనను, కిమ్ = ఏమి ప్రయోజనము? పుత్రైః వా = పుత్రులచేత నైనను, సుఖైర్వాపి = సుఖములచేత నైనను, కిమ్ = ఏమి ప్రయోజనము?

తా. రాముని చూడని వారికి గృహములతో కాని, భార్యలతో గాని, ధనముచేత గాని, పుత్రులచేత గాని, సుఖములచేత గాని ఏమి ప్రయోజనము?

మూ. ఏకః సత్పురుషో లోకే లక్ష్మణః సహ సీతయా,
యోఽనుగచ్ఛతి కాకుత్స్థం రామం పరిచరన్ వనే. 8

ప్ర. అ. లోకే = ఈ లోకమునందు, ఏకః = ఒక్క, లక్ష్మణః=లక్ష్మణుడే, సత్పురుషః = సత్పురుషుడు. యః = ఏ లక్ష్మణుడు, సీతయా సహ = సీతతో కూడిన, కాకుత్స్థమ్ = కకుత్స్థవంశమునకు చెందిన, రామమ్=రాముని, వనే = వనమునందు, పరిచరన్ = సేవించుచు, అనుగచ్ఛతి = అనుసరించు చున్నాడో.

తా. సీతాసమేతు డైన రామునకు ఉపచారములు చేయుచు అతని అనుసరించి అరణ్యమునకు వెళ్ళిన లక్ష్మణుడు ఒక్కడే ఈ లోకమునందు సత్పురుషుడు. 8

మూ. ఆపగాః కృతపుణ్యాస్తాః పద్మిన్యశ్చ సరాంసి చ,
యేషు స్నాస్యతి కాకుత్స్థో విగాహ్య సలిలం శుచి. 9

ప్ర. అ. యేషు=వేటియందు, శివ=పవిత్ర మైన, సలిలమ్=ఉదకమును, విగాహ్య = ప్రవేశించి, కాకుత్స్థః = రాముడు, స్నాస్యతి = స్నానము చేయగలడో, తాః = అట్టి, ఆపగాః=నదులూ, పద్మిన్యః=తామరకొలనులూ, సరాంసి చ = సరస్సులూ, కృతపుణ్యాః=చేయబడిన పుణ్యము గలవి.

తా. రాముడు వేటి పవిత్ర మైన నీటిలో దిగి స్నానము చేయునో ఆ నదులూ, పద్మము లున్న చెరువులూ, సరస్సులూ పుణ్యము చేసికొన్నవి. 9

మూ. శోభయిష్యన్తి కాకుత్స్థమటవ్యో రమ్యకాననాః,
ఆపగాశ్చ మహానూపాః సానుమన్తశ్చ పర్వతాః. 10

ప్ర. అ. రమ్యకాననాః = అంద మైన వృక్షసమూహములు గల, అటవ్యః=అడవులూ, మహానూపాః = గొప్ప జలప్రాయ (అధికజల మున్న) ప్రదేశములు గల, ఆపగాః చ = నదులూ, సానుమన్తః = చరియలుగల, పర్వతాః=పర్వతములూ, కాకుత్స్థమ్=రాముని, శోభయిష్యన్తి = ప్రకాశింప చేయగలవు.

తా. అంద మైన వృక్షసముదాయము లున్న అరణ్యములూ, విశాల మైన జలప్రాయప్రదేశము లున్న నదులూ, చరియలు గల పర్వతములూ, రాముని శోభింపచేయగలవు. 10

మూ. కాననం వాపి శైలం వా యం రామోఽభిగమిష్యతి,
ప్రియాతిథిమివ ప్రాప్తం నైనం శక్ష్యన్త్యనర్చితుమ్. 11

ప్ర. అ. రామః = రాముడు, యమ్=ఏ, శైలం వా = శైలమును గాని, కాననం వాపి = అరణ్యమును గాని, అభిగమిష్యతి = పొందగలడో, అవి, ప్రాప్తమ్ = వచ్చిన, ప్రియాతిథిమ్ ఇవ=ప్రియు డైన అతిథిని వలె, ఏనమ్ = ఇతనిని, అనర్చితుమ్ = రక్షించకుండగా ఉండుటకు, న శక్ష్యన్తి = సమర్థము కావు.

తా. రాముడు ఏ అరణ్యమునకు, ఏ పర్వతమునకు వెళ్ళునో అవి ప్రియు డైన అతిథిని వలె అతనిని ఆదరించక ఉండజాలవు. 11

మూ. విచిత్రకుసుమాపీడా బహుమఞ్జరిధారిణః,
రాఘవం దర్శయిష్యన్తి నగా భ్రమరశాలినః. 12

ప్ర. అ. విచిత్రకుసుమాపీడాః = విచిత్ర మైన పుష్పములు శిరోభూష ణములుగా కలవి, బహుమఞ్జరిధారిణః = అనేక మైన గుత్తులు ధరించినవి, భ్రమరశాలినః = తుమ్మెదలతో ప్రకాశించుచున్నవి అయిన, నగాః = వృక్షములు, రాఘవమ్ = రాముని (రామునకు), దర్శయిష్యన్తి = తమను చూపగలవు.

తా. నానావిధము లైన పుష్పములను శిరోభూషణములుగా ధరించినవి, అనేకము లైన పూలగుత్తులు కలవి, తుమ్మెదలతో ప్రకాశించునవి అయిన చెట్లు రామునికి తనబడుచు అతనికి ఆనందము కూర్పగలవు. 12

మూ. అకాలే చాపి ముఖ్యాని పుష్పాణి చ ఫలాని చ,
దర్శయిష్యన్త్యనుక్రోశాద్గిరయో రామమాగతమ్. 13

ప్ర అ. గిరయః = పర్వతములు, అనుక్రోశాత్ = దయవలన, అకాలే చాపి = అకాలమునందు గూడ, ముఖ్యాని = ఉత్తమ మైన, పుష్పాణి = పుష్పము లనూ, ఫలాని చ = ఫలములనూ, ఆగతమ్ = వచ్చిన, రామమ్ = రాముని, దర్శయిష్యన్తి = చూపగలవు.

తా. పర్వతములు తమ దగ్గరకు వచ్చిన రామునకు దయతో, అకాలము నందు గూడ మంచి పుష్పములను, ఫలములను సమర్పింపగలవు. 13

మూ. ప్రస్రవిష్యన్తి తోయాని విమలాని మహీధరాః,
విదర్శయన్తో వివిధాన్ భూయశ్చిత్రాంశ్చ నిర్ఝరాన్. 14

ప్ర. అ. మహీధరాః = పర్వతములు, వివిధాన్ = అనేకవిధము లైన, చిత్రాంశ్చ = విచిత్రము లైన, నిర్ఝరాన్ = ప్రవాహములను, భూయః = మాటిమాటి కిని, విదర్శయన్తః = చూపుచున్న వై, విమలాని = నిర్మల మైన, తోయాని = ఉదకములను, ప్రస్రవిష్యన్తి = స్రవింపగలవు.

తా. పర్వతములు అనేకవిధము లైన, విచిత్రము లైన ప్రవాహములను చూపుచు, రామునికొరకై, నిర్మలము లైన జలములను స్రవింపగలవు. 14

మూ. పాదపాః పర్వతాగ్రేషు రమయిష్యన్తి రాఘవమ్,
యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవః. 15

ప్ర. అ. పర్వతాగ్రేషు=పర్వతశిఖరములందు, పాదపాః=వృక్షములు, రాఘవమ్=రాముని, రమయిష్యన్తి = ఆనందింపజేయగలవు. యత్ర=ఎచట, రామః=రాముడు ఉండునో, అత్ర=ఇచట, భయమ్=భయము. న = లేదు. తత్ర=అచ్చట, పరాభవః=పరాభవము, నాస్తి=లేదు.

తా. పర్వతశిఖరముల మీద వృక్షములు రామునకు ఆనందము కలిగింపగలవు. రాము డున్న చోట భయము గాని, పరాభవము గాని ఉండదు.

మూ. స హి శూరో మహాబాహుః పుత్రో దశరథస్య చ,
పురా భవతి నో దూరాదనుగచ్ఛామ రాఘవమ్. 16

ప్ర. అ. శూరః = శూరుడు, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడూ, దశరథస్య=దశరథునియొక్క, పుత్రః=పుత్రుడూ అయిన, సః=ఆ రాముడు, నః = మనకు, దూరాత్ = దూరముగా, పురా భవతి = పోగలడు. రాఘవమ్=రాముని, అనుగచ్ఛామ=అనుసరించి వెళ్ళెదము.

తా. శూరుడూ, ఆజానుబాహుడూ, దశరథకుమారుడూ అయిన ఆ రాముడు మనకు దూరము కాక ముందే అతనిని అనుసరించి వెళ్ళెదము. 16

మూ. పాదచ్ఛాయా సుఖా భర్తుస్తాదృశస్య మహాత్మనః,
స హి నాథో జనస్యాస్య స గతిః స పరాయణమ్. 17

ప్ర. అ. తాదృశస్య=అట్టి, మహాత్మనః = మహాత్ము డైన, భర్తుః = ప్రభువుయొక్క, పాదచ్ఛాయా = పాదముల నీడ, సుఖా = సుఖకర మైనది. అస్య=ఈ, జనస్య=జనమునకు, సః=అతడే, నాథః హి=నాథుడు కదా. సః=అతడే, గతిః=గతి. సః=అతడే, పరాయణమ్=ఉత్తమ మైన గమ్యస్థానము.

తా. అట్టి మహాత్ము డైన ప్రభువు పాదచ్ఛాయ సుఖకర మైనది. అతడే ఈ జనమున కంతకును నాథుడు; అతడే గతి. అతడే పరమగమ్యస్థానము. 17

మూ. వయం పరిచరిష్యామః సీతాం యూయం తు రాఘవమ్,
ఇతి పౌరస్త్రియో భర్తౄన్ దుఃఖార్తా స్తత్తదబ్రువన్. 18

ప్ర. అ. వయమ్=మేము, సీతామ్=సీతను, పరిచరిష్యామః=సేవింతి
దము. యూయం తు=మీ రైతే, రాఘవమ్=రాముని సేవించగలరు. ఇతి=ఈ
విధముగ, పౌరస్త్రియః=పౌరస్త్రీలు, దుఃఖార్తాః=దుఃఖముచే పీడింపబడినవారై,
భర్తౄన్=భర్తలను గురించి, తత్=ఆ యా మాటలను, అబ్రువన్=
పలికిరి.

తా. మేము సీతను సేవింతెదము. మీరు రాముని సేవింతురు. ఈ విధ
ముగ దుఃఖార్త లైన పౌరస్త్రీలు భర్తలతో అనేకవిధములుగ పలికిరి. 18

మూ. యుష్మాకం రాఘవోఽరణ్యే యోగక్షేమం విధాస్యతి,
సీతా నారీజనస్యాస్య యోగక్షేమం కరిష్యతి. 19

ప్ర. అ. రాఘవః=రాముడు, అరణ్యే=అరణ్యమునందు, యుష్మాకమ్=
మీకు, యోగక్షేమమ్=యోగక్షేమమును, విధాస్యతి=చేయగలడు. సీతా=సీత,
అస్య జనస్య = ఈ జనముయొక్క, యోగక్షేమమ్ = యోగక్షేమమును,
కరిష్యతి=చేయగలదు.

తా. మనము అరణ్యములో నున్నపుడు రాముడు మీ యోగక్షేమాలను
చూడగలడు. సీత మా యోగక్షేమములను చూడగలదు. 19

మూ. కో న్వనేనాఽప్రతీతేన సోత్కంఠితజనేన చ,
సంప్రీయేతామనోజ్ఞేన వాసేన హృతచేతసా. 20

ప్ర. అ. అప్రతీతేన=అప్రశస్తమూ, సోత్కంఠితజనేన చ=బెంగపెట్టు
కొన్న జనులు కలదీ, అమనోజ్ఞేన=మనోహరము కానిదీ, హృతచేతసా=అపహ
రింపబడిన మనస్సు కలదీ అయిన, అనేన వాసేన=ఈ నివాసముచేత, కః ను=
ఎవ్వడు, సంప్రీయేత=సంతోషించును.

తా. ఈ అయోధ్యలో నివాసము అప్రశస్తము. ఇచట నున్న జనులందరు
బెంగపెట్టుకొన్నారు. ఈ నివాసము సుఖకరము కాదు, దుఃఖకరము. అట్టి ఈ
అయోధ్యానివాసమునకు ఎవ్వడు సంతోషించును 20

మూ. కైకేయ్యా యది చేద్రాజ్యం స్యాదధర్మ్యమనాథవత్,
న హి నో జీవితేనార్థః కుతః పుత్రైః కుతో ధనైః. 21

మూ. యా పుత్రం పార్థివేన్ద్రస్య ప్రవాసయతి నిర్ఘృణా,
కస్తాం ప్రాప్య సుఖం జీవేదధర్మ్యాం దుష్టచారిణీమ్. 24

ప్ర. అ. యా = ఏ కైకేయి, నిర్ఘృణా = జాలిలేనిదై, పార్థివేన్ద్రస్య = దశరథమహారాజుయొక్క, పుత్రమ్ = పుత్రుని, ప్రవాసయతి = దూరముగా వెళ్ళగొట్టుచున్నదో, అధర్మ్యామ్ = అధర్మపరురాలు, దుష్టచారిణీమ్ = దుష్టముగా ప్రవర్తించునదీ అయిన, తామ్ = ఆమెను, ప్రాప్య = పొంది, కః = ఎవడు, సుఖమ్ = సుఖముగా, జీవేత్ = జీవించును?

తా. ఏ కైకేయి, ఏ పుత్రుని జాలి లేనిదై, రాముని అరణ్యమునకు పంపినదో, అధర్మాత్మురాలు, దుష్టముగా ప్రవర్తించునది అయిన ఆమెను చేరి ఎవడు సుఖముగా జీవించగలడు? 24

మూ. ఉపద్రుతమిదం సర్వమనాలమ్బమనాయకమ్,
కైకేయ్యా హి కృతే సర్వం వినాశముపయాస్యతి. 25

ప్ర. అ. ఇదమ్ = ఈ, సర్వమ్ = రాజ్య మంతయు, ఉపద్రుతమ్ = ఉపద్రవమును పొందినదై, అనాలమ్బమ్ = ఆధారము లేనిదై, అనాయకమ్ = నాయకుడు లేనిదై, కైకేయ్యాః కృతే = కైకేయి నిమిత్తమై, వినాశమ్ = నాశనమును, ఉపయాస్యతి = పొందగలదు.

తా. కైకేయి మూలమున ఈ రాజ్యమంతయు, నాయకుడు లేక, ఉపద్రవమును పొంది, ఆధారము లేనిదై నాశనమును పొందును. 25

మూ. న హి ప్రవ్రజితే రామే జీవిష్యతి మహీపతిః,
మృతే దశరథే వ్యక్తం విలాపస్తదనన్తరమ్. 26

ప్ర. అ. రామే = రాముడు, ప్రవ్రజితే = ప్రవాసమునకు వెళ్ళినవాడగుచుండగా, మహీపతిః = రాజు, న జీవిష్యతి హి = జీవించడు కదా. దశరథే = దశరథుడు, మృతే = మరణించినవాడగుచుండగా, తదనన్తరమ్ = అటు పిమ్మట, విలాపః = ఏడ్పులే. వ్యక్తమ్ = ఇది యథార్థము.

తా. రాముడు అరణ్యమునకు వెళ్ళిన పిమ్మట దశరథుడు జీవించడు. దశరథుడు మరణించినచో, తరువాత మిగులునవి విలాపములే. 26

మూ. తే విషం పిబతాలోడ్య క్షీణపుణ్యాః సుదుర్గతాః,
రాఘవం వానుగచ్ఛధ్వమశ్రుతిం వాపి గచ్ఛత. 27

ప్ర. అ. క్షీణపుణ్యాః = క్షీణించిన పుణ్యము గలవారు, సుదుర్గతాః = మిక్కిలి కష్టము చెందినవారు, అయిన, తే = అట్టి మీరు, విషమ్ = విషమును, ఆలోడ్య = కలుపుకొని, పిబత = త్రాగండి. రాఘవం వా = రాము నైన, అనుగచ్ఛధ్వమ్ = అనుసరించండి. అశ్రుతిం వా = వినబడకుండు ప్రదేశము నైనను, గచ్ఛత = చేరండి.

భా. మీ యందరి పుణ్యము క్షీణించినది. కష్టములో ఉన్నారు. అందుచే మీ రందరును విషము కలుపుకొని త్రాగండి. లేదా రాముని అనుసరించి వెళ్లండి. లేదా ఎవ్వరికిని తెలియని ప్రదేశమునకు వెళ్ళిపొండి. 27

మూ. మిథ్యా ప్రవ్రాజితో రామః ససీతః సహలక్ష్మణః,
భరతే సన్నిసృష్టాః స్థ సౌనికే పశవో యథా. 28

ప్ర. అ. ససీతః = సీతతో కూడిన, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రామః = రాముడు, మిథ్యా = కపటముతో, ప్రవ్రాజితః = పంపివేయబడినాడు. పశవః = పశువులు, సౌనికే యథా = కసాయివానియందు వలె, భరతే = భరతుని యందు, సన్నిసృష్టాః = సమర్పించబడినవారము, స్థ = అయితిమి.

భా. సీతాలక్ష్మణసమేతు డైన రాముని కపటోపాయముతో దూరముగా పంపివేసి, మనలను, పశువులను కసాయివానికి ఒప్పచెప్పినట్లు భరతునకు ఒప్ప చెప్పినారు. 28

మూ. పూర్ణచన్ద్రాననః శ్యామో గూఢజత్రురరిందమః,
ఆజానుబాహుః పద్మాక్షో రామో లక్ష్మణపూర్వజః. 29
పూర్వాభిభాషీ మధురః సత్యవాదీ మహాబలః,
సౌమ్యః సర్వస్య లోకస్య చన్ద్రవత్ప్రియదర్శనః. 30
నూనం పురుషశార్దూలో మత్తమాతఙ్గవిక్రమః,
శోభయిష్యత్యరణ్యాని విచరన్ స మహారథః. 31

ప్ర. అ. పూర్ణచన్ద్రాననః = పూర్ణచంద్రుని వంటి ముఖము కలవాడు, శ్యామః = నల్లనివాడు, గూఢజత్రుః = కనబడని మూపుల సంధులు కలవాడు, అరిందమః = శత్రువును దంపువాడు, ఆజానుబాహుః = మోకాళ్ళ వరకు బాహువులు కలవాడు, పద్మాక్షః = పద్మముల వంటి నేత్రములు కలవాడు, లక్ష్మణపూర్వజః = లక్ష్మణునికి అన్నగారు, పూర్వాభిభాషీ = ముందుగ పలుకరించువాడు, మధురః = తియ్యని స్వభావము కలవాడు, సత్యవాదీ = సత్యమే పలుకువాడు, మహాబలః = గొప్ప బలము కలవాడు, సౌమ్యః = శాంతస్వభావుడు, సర్వస్య = సమస్త మైన, లోకస్య = లోకమునకు, చన్ద్రవత్ = చంద్రునివలె, ప్రియదర్శనః = ప్రియ మైన దర్శనము కలవాడు, పురుషశార్దూలః = పురుషులలో శ్రేష్ఠుడు, మత్తమాతఙ్గవిక్రమః = మదపు టేనుగు వంటి నడక కలవాడు, మహారథః = మహారథుడు అయిన, స రామః = ఆ రాముడు, నూనమ్ = నిశ్చయముగా, అరణ్యాని = అరణ్యములను, విచరన్ = సంచరించుచు, శోభయిష్యతి = ప్రకాశింపచేయగలడు.

తా. మహారథు డైన రాముడు పూర్ణచంద్రుని వంటి ముఖము కలవాడు. నీలవర్ణుడు. పైకి కనబడని అంససంధులు కలవాడు. శత్రువులను నశింపచేయువాడు. పద్మముల వంటి నేత్రములు కలవాడు, మోకాళ్ల వరకు పొడవైన బాహువులు కలవాడు. లక్ష్మణునికి అన్న. ఇతరులను ముందుగా పలుకరించువాడు. తియ్యని స్వభావము గల అతడు సత్యమునే పలుకును. మహాబలశాలి. సౌమ్య మైన స్వభావము కలవాడు. సకలజగత్తులకును అతని దర్శనము చంద్ర దర్శనము వలె ఆనందమును కల్గించును. పురుషులలో శ్రేష్ఠుడు. మదించిన ఏనుగు వంటి అందమైన నడక కలవాడు. అతడు అరణ్యములలో సంచరించుచు, వాటిని ప్రకాశింప చేయగలడు. 29.81

మూ. తాస్తథా విలపన్త్యస్తు నగరే నాగరస్త్రియః,
చుక్రుశుర్దుఃఖసంతప్తా మృత్యోరివ భయాగమే. 82

ప్ర. అ. నగరే = నగరమునందు, తాః = ఆ, నాగరస్త్రియః = పౌరస్త్రీలు, తథా = ఆ విధముగా, విలపన్త్యః = విలపించుచు, మృత్యోః = మృత్యువువలన, భయాగమే ఇవ = భయము వచ్చి నపుడు వలె, చుక్రుశుః = ఏడ్చిరి.

తా. ఆ అయోధ్యానగరములో ఉన్న స్త్రీలందరును, ఆ విధముగా విలపించుచు, మృత్యువువలన భయము కల్గినట్లు, దుఃఖముచే పీడింపబడినవారై మొరపెట్టిరి. 82

మూ. ఇత్యేవం విలపన్తీనాం స్త్రీణాం వేశ్మసు రాఘవమ్,
జగామాస్తం దినకరో రజనీ చాభ్యవర్తత. ౪౩

ప్ర. అ. వేశ్మసు=గృహములలో, స్త్రీణామ్ = స్త్రీలు, ఇత్యేవమ్ = ఈ విధముగా, రాఘవమ్=రాముని గూర్చి, విలపన్తీనామ్ = విలపించుచుండగా. దినకరః = సూర్యుడు, అస్తమ్=అస్తాద్రిని, జగామ = పొందెను. రజనీ చ = రాత్రి, అభ్యవర్తత=వచ్చెను.

తా. అయోధ్యాపురములోని ఇండ్లలో స్త్రీలు ఈ విధముగా రాముని గూర్చి విలపించుచుండగా, ఇంతలో సూర్యుడు అస్తమించి రాత్రి యైనది. ౪౩

మూ. నష్టజ్వలనసంపాతా ప్రశాన్తాధ్యాయసత్కథా,
తిమిరేణాభిలిప్తేవ తదా సా నగరీ బభౌ. ౪౪

ప్ర. అ. తదా=అపుడు, నష్టజ్వలనసంపాతా=నశించిన అగ్నిహోత్రములు కలది, ప్రశాన్తాధ్యాయసత్కథా = శాంతించిన స్వాధ్యాయప్రసంగము కలది యైన, సా నగరీ=ఆ అయోధ్య, తిమిరేణ=అంధకారముచే, అభిలిప్తేవ= పూయబడినది వలె, బభౌ=కనబడెను.

తా. ఆ నగరములో ఎవ్వరును అగ్నిహోత్రములు చేయలేదు. స్వాధ్యాయ పారాయణము కూడ జరుగుట లేదు. అట్టి ఆ అయోధ్యానగరము చీకటి పూసిన ట్లుండెను. ౪౪

మూ. ఉపశాన్తవణిక్పణ్యా నష్టహర్షా నిరాశ్రయా,
అయోధ్యా నగరీ చాసీన్నష్టతారమివామ్బరమ్. ౪౫

ప్ర. అ. ఉపశాన్తవణిక్పణ్యా=అణగిన వర్తకుల అంగళ్ళు కలదీ, నష్టహర్షా=నష్టమైన ఆనందము కలది, నిరాశ్రయా=ఆశ్రయము లేనిది అయిన, అయోధ్యా నగరీ=అయోధ్యా పట్టణము, నష్టతారమ్ = కనబడని నక్షత్రములు కల, అమ్బరమివ=ఆకాశము వలె, ఆసీత్=ఆయెను.

తా. అయోధ్యాపట్టణములోని అంగళ్లన్నియు, మూతపడినవి. ఎక్కడను హర్షము కనబడుట లేదు. అది ఆశ్రయము లేనిదై యుండెను. ఈ విధముగా నగరము, నక్షత్రములు కనబడని ఆకాశము వలె యుండెను. ౪౫

మూ. తథా స్త్రియో రామనిమిత్తమాతురా
యథా సుతే భ్రాతరి వా వివాసితే,
విలప్య దీనా రురుదుర్విచేతసః
సుతైర్హి తాసా మధికో హి సోఽభవత్. 36

ప్ర. అ. స్త్రియః=స్త్రీలు, సుతే=కుమారుడు గాని, భ్రాతరివా = సోదరుడు గాని, వివాసితే = వెడలం గొట్టబడగా, యథా = ఎట్లో, తథా=అట్లు, రామనిమిత్తమ్=రామునికొరకు, ఆతురాః = దుఃఖించుచు, దీనాః=దీనలై, విచేతసః =బాధపడుచున్న మనస్సు కలవారై, విలప్య = విలపించి, రురుదుః=ఏడ్చిరి. తాసామ్=వారికి, సః = ఆ రాముడు, సుతైః = కుమారులకంటె, అధికః= అధికుడు, అభవత్ హి = అయెను కదా.

తా. ఆ స్త్రీలందరును తమ కుమారుని గాని, సోదరుని గాని, దేశము నుండి వెడలగొట్టి నపుడు ఎంత దుఃఖింతురో, రాముని విషయమై అంత దుఃఖించుచు బాధపడుచున్న మనస్సులతో దీనలై, విలపించుచు, ఏడ్చిరి. రాముడు వారికి కుమారులకంటె కూడ, అధికముగా ప్రేమపాత్రమై ఉండెను. 36

మూ. ప్రశాన్తగీతోత్సవ నృత్తవాదనా
వ్యపాస్తహర్షా పిహితాపణోదయా,
తదా హ్యయోధ్యా నగరీ బభూవ సా
మహార్ణవః సంక్షపితోదకో యథా. 37

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
అష్టచత్వారింశః సర్గః.

ప్ర. అ. ప్రశాన్తగీతోత్సవనృత్తవాదనా=శాంతించిన గీతములు, ఉత్సవములు, నృత్యములు, వాద్యములు కలదీ, వ్యపాస్తహర్షా=తొలగిన సంతోషము కలదీ, పిహితాపణోదయా=మూసివేయబడిన అంగళ్లు కలదీ అయిన, సా = ఆ, అయోధ్యా నగరీ=అయోధ్యాపట్టణము, తదా = అపుడు, సంక్షపితోదకః = తగ్గిపోయిన ఉదకము గల, మహార్ణవః యథా=మహాసముద్రము వలె, బభూవ= ఆయెను.

తా. అపుడు ఆ నగరములో, సంగీతములు కాని, ఉత్సవములు కాని నృత్యములు కాని, వాద్యములు కాని లేకుండెను. ఎక్కడను ఆనందము కనబడుటలేదు. సమృద్ధములైన ఆపణములు మూయబడి యుండెను. అట్టి ఆ అయోధ్య నీరు తగ్గిపోయిన సముద్రము వలె యుండెను. 37

'బాలానందిని' యను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదిఎనిమిదవ సర్గ సమాప్తము.

# అథ ఏకోనపఞ్చాశః సర్గః

[రాముడు గ్రామవాసుల మాటలు వినుచు, కోసలగ్రామములు దాటుచు పోవుట. వేదశ్రుతి, గోమతి స్యందికానదులను దాటి, సుమంత్రునితో సంభాషించుట.]

మూ. రామోఽపి రాత్రిశేషేణ తేనైవ మహదన్తరమ్,
జగామ పురుషవ్యాఘ్రః పితురాజ్ఞామనుస్మరన్. 1

ప్ర. అ. పురుషవ్యాఘ్రః=పురుషశ్రేష్ఠుడైన, రామోఽపి = రాముడుకూడ, పితుః = తండ్రియొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, అనుస్మరన్=స్మరించుచు, తేన=ఆ, రాత్రిశేషేణైవ=రాత్రియొక్క చివరిభాగముచేత, మహత్=గొప్ప, అన్తరమ్=దూరమును, జగామ = పొందెను.

తా. పురుషశ్రేష్ఠుడైన రాముడు, తండ్రి ఆజ్ఞను స్మరించుచు, ఆ రాత్రి శేషమునందే, చాల దూరము ప్రయాణము చేసెను. 1

మూ. తథైవ గచ్ఛతస్తస్య వ్యపాయాద్రజనీ శివా,
ఉపాస్య స శివాం సన్ధ్యాం విషయాన్తం వ్యగాహత. 2

ప్ర. అ. తస్య = ఆ రాముడు, తథా=అట్లు, గచ్ఛతః ఏవ=ప్రయాణము చేయుచుండగనే, శివా = మంగళకరమైన, రజనీ=రాత్రి, వ్యపాయాత్ = గడచిపోయెను. సః=రాముడు, శివామ్=మంగళకరమైన, సన్ధ్యామ్=సంధ్యను, ఉపాస్య=ఉపాసించి, విషయాన్తమ్ = దేశముయొక్క పొలిమేరను, వ్యగాహత = ప్రవేశించెను.

తా. రాము డీ విధముగా ప్రయాణము చేయుచుండగా, రాత్రి గడచెను. ఆ రాముడు, మంగళకరమైన సంధ్యను ఉపాసించి, దేశపు పొలిమేరలోనికి ప్రవేశించెను. 2

మూ. గ్రామాన్ వికృష్టసీమాన్తాన్ పుష్పితాని వనాని చ,
పశ్యన్నతియయౌ శీఘ్రం శనైరివ హయోత్తమైః, 3
శృణ్వన్ వచో మనుష్యాణాం గ్రామసంవాసవాసినామ్.

ప్ర. ఆ వికృష్టసీమాన్తాన్ = దున్నబడిన పొలిమేరలు కల, గ్రామాన్ = గ్రామములను, పుష్పితాని = పుష్పించిన, వనాని చ = వనములను, పశ్యన్ = చూచుచు, గ్రామసంవాసవాసినామ్ = గ్రామము నడిమి భాగమునందు నివసించుచున్న, మనుష్యాణామ్ = మనుష్యులయొక్క, వచః = వాక్యమును, శృణ్వన్ = వినుచు, హయోత్తమైః = శ్రేష్ఠమైన అశ్వములచే, శీఘ్రమ్ = శీఘ్రముగా, ప్రయాణముచేయుచు, శనైరివ = మెల్లమెల్లగా, అతియయౌ = గ్రామములను దాటెను.

తా. ఆ రాముడు దున్నిన సీమాంతములు కల గ్రామములను, పుష్పించిన వనములను చూచుచు, గ్రామములో నివసించు మనుష్యుల మాటలు వినుచు, ఆ ఉత్తమాశ్వములతో, శీఘ్రముగా ప్రయాణము చేయుచు, ఆ గ్రామముల నన్నిటిని దాటెను. 3

మూ. రాజానం ధిక్ దశరథం కామస్య వశమాగతమ్. 4
హా నృశంసాద్య కైకేయీ పాపా పాపానుబన్ధినీ,
తీక్ష్ణసంభిన్నమర్యాదా తీక్ష్ణకర్మణి వర్తతే, 5
యా పుత్రమీదృశం రాజ్ఞః ప్రవాసయతి ధార్మికమ్,
వనవాసే మహాప్రాజ్ఞం సానుక్రోశం జితేన్ద్రియమ్. 6

ప్ర. ఆ. కామస్య = కామమునకు, వశమాగతమ్ = వశమును పొందిన, రాజానమ్ = రాజైన, దశరథమ్ = దశరథుని గూర్చి, ధిక్ = నింద అగుగాక. హా = ఎంత కష్టము! నృశంసా = క్రూరురాలైన, పాపా = పాపాత్మురాలైన, కైకేయీ = కైకేయి, అద్య = ఇపుడు, పాపానుబన్ధినీ = పాపమునే అనుసరించుచున్నది. యా = ఏ కైకేయి, ధార్మికమ్ = ధర్మాత్ముడు, మహాప్రాజ్ఞమ్ = గొప్ప బుద్ధిమంతుడు, సానుక్రోశమ్ = జాలి కలవాడు, జితేన్ద్రియమ్ = జయింపబడిన ఇంద్రియములు కలవాడు, అయిన, ఈదృశమ్ = ఇట్టి, రాజ్ఞః పుత్రమ్ = రాజు కుమారుడైన రాముని, వనవాసే = వనవాసమునిమిత్తమై, ప్రవాసయతి =

దూరముగా పంపించేయుచున్నదో, అద్య, తీక్ష్ణా = క్రూరురాలైన, ఈ కైకేయి, సంభిన్నమర్యాదా = భేదింపబడిన కట్టుబాట్లు కలదై, తీక్ష్ణకర్మణి = తీక్ష్ణమైన పనియందు, వర్తతే = ప్రవర్తించుచున్నది.

తా. ఈ దశరథమహారాజు కామమునకు వశుడైపోయినాడు. అహో! క్రూరురాలు, పాపాత్మురాలు అయిన కైకేయి ఈ నాడు పాపకర్మలను అవిచ్ఛిన్నముగా చేయుచున్నది. ధార్మికుడు, గొప్ప బుద్ధి కలవాడు, దయాశీలుడు, ఇంద్రియములను జయించినవాడు, అయిన, అట్టి రాముని, వనవాసమునకై పంపివేయుచు, క్రూరురాలైన, ఈ కైకేయి, కట్టుబాట్లను ఛేదించి, ఎంతటి క్రూరమైన పనికి ఒడిగట్టినది! 6

మూ. కథం నామ మహాభాగా సీతా జనకనన్దినీ,
సదా సుఖేష్వభిరతా దుఃఖాన్యనుభవిష్యతి. 7

ప్ర. అ. మహాభాగా = పూజ్యురాలు, జనకనన్దినీ = జనకుని కుమార్తె సదా = ఎల్లపుడు, సుఖేషు = సుఖములందు, అభిరతా = ఆసక్తురాలు అయిన, సీతా = సీత, కథం నామ = ఎట్లు, దుఃఖాని = దుఃఖములను, అనుభవిష్యతి = అనుభవించగలదో.

తా. మంచి భాగ్యము కలదీ, ఎల్లపుడు సుఖములకే అలవాటుపడినదీ, అయిన జనకుని పుత్రిక, సీత దుఃఖములను ఎట్లు అనుభవించునో. 7

మూ. అహో దశరథో రాజా నిస్స్నేహః స్వసుతం ప్రియమ్,
ప్రజానామనఘం రామం పరిత్యక్తుమిహేచ్ఛతి. 8

ప్ర. అ. రాజా = రాజైన, దశరథః = దశరథుడు, స్వసుతమ్ = తన కుమారుడు, ప్రజానామ్ = ప్రజలకు, ప్రియమ్ = ఇష్టుడు, అనఘమ్ = దోషములు లేనివాడు అయిన, రామమ్ = రాముని, నిస్స్నేహః = స్నేహము లేనివాడై, ఇహ = ఇపుడు, పరిత్యక్తుమ్ = విడచుటకు, ఇచ్ఛతి = కోరుచున్నాడు. అహో = ఏమి ఆశ్చర్యము.

తా. దశరథమహారాజు, దయలేనివాడై, ప్రజలకు ఇష్టుడు, దోషరహితుడు, తన కుమారుడు అయిన రాముని విడువగోరుచున్నాడు. ఎంత ఆశ్చర్యము!

మూ. ఏతా వాచో మనుష్యాణాం గ్రామసంవాసవాసినామ్,
శృణ్వన్నతియయౌ వీరః కోసలాన్ కోసలేశ్వరః. 9

ప్ర. అ. వీరః=వీరు డైన, కోసలేశ్వరః=కోసలాధిపతి యైన రాముడు, గ్రామసంవాసవాసినామ్ = గ్రామములందు, చిన్నపల్లెలందు నివసించు, మనుష్యాణామ్=మనుష్యులయొక్క, ఏతాః = ఈ, వాచః = వాక్యములను, శృణ్వన్ = వినుచు, కోసలాన్ = కోసలదేశమును, అతియయౌ=దాటెను.

తా. కోసలాధీశ్వరు డైన ఆ వీరుడు, గ్రామములోనివారును, పల్లెలలోనివారును చెప్పుకొనుచున్న ఈ మాటలు వినుచు, కోసలదేశమును దాటెను. 9

మూ. తతో వేదశ్రుతిం నామ శివవారివహాం నదీమ్,
ఉత్తీర్యాభిముఖః ప్రాయాదగస్త్యాధ్యుషితాం దిశమ్. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, శివవారివహామ్ = మంగళకరము లైన ఉదకమును ప్రవహించు, వేదశ్రుతిం నామ = వేదశ్రుతి యను, నదీమ్ = నదిని, ఉత్తీర్య = దాటి, అగస్త్యాధ్యుషితామ్ = అగస్త్యునిచే అధిష్ఠింపబడిన, దిశమ్ = దిక్కును గూర్చి, అభిముఖః = అభిముఖుడై, ప్రాయాత్ = వెళ్లెను.

తా. పిమ్మట రాముడు, పవిత్ర మైన ఉదకము ప్రవహించుచున్న వేదశ్రుతి యను నదిని దాటి, అగస్త్యుడు నివసించు, దక్షిణదిక్కు వైపు ప్రయాణము చేసెను. 10

మూ. గత్వా తు సుచిరం కాలం తతః శివజలాం నదీమ్,
గోమతీం గోయుతానూపామతరత్సాగరంగమామ్. 11

ప్ర. అ. తతః = అక్కడనుండి, సుచిరం కాలమ్ = చాల సేపు, గత్వా = ప్రయాణము చేసి, శివజలామ్ = మంగళకర మైన ఉదకము కలది, గోయుతానూపామ్ = గోవులతో కూడిన జలప్రాయప్రదేశములు కలది, సాగరంగమామ్ = సముద్రములోనికి ప్రవహించుచున్నది యగు, గోమతీమ్ = గోమతి యను, నదీమ్ = నదిని, అతరత్ = దాటెను.

తా. అక్కడనుండి చాల సేపు ప్రయాణము చేసిన పిమ్మట రాముడు పవిత్ర మైన జలములు కలది, జలముతో నిండిన ప్రాంతములలో గోవులతో నిండినది, సముద్రములోనికి ప్రవహించుచున్నది యైన, గోమతీనదిని దాటెను.

మూ. గోమతీం చాప్యతిక్రమ్య రాఘవః శీఘ్రగైర్హయైః,
మయూరహంసాభిరుతాం తతార స్యన్దికాం నదీమ్. 12

ప్ర. అ. రాఘవః = రాముడు, శీఘ్రగైః = శీఘ్రముగా నడచు, హయైః = హయములచేత, గోమతీం చాపి = గోమతినదిని కూడ, అతిక్రమ్య = దాటి, మయూరహంసాభిరుతామ్ = నెమళ్లచేతను, హంసలచేతను, ధ్వనింపచేయబడిన, స్యన్దికామ్ = "స్యందిక"యను, నదీమ్ = నదిని, తతార = దాటెను.

తా. రాముడు శీఘ్రముగా నడచు అశ్వములచేత గోమతీనదిని కూడ దాటి పిమ్మట ధ్వనిచేయుచున్న మయూరములు హంసలు కల "స్యందికా"నదిని కూడ దాటెను. 12

మూ. స మహీం మనునా రాజ్ఞా దత్తామిక్ష్వాకవే పురా,
స్ఫీతాం రాష్ట్రావృతాం రామో వైదేహీమన్వదర్శయత్.

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, పురా = పూర్వము, రాజ్ఞా = రాజైన, మనునా = మనువుచేత, ఇక్ష్వాకవే = ఇక్ష్వాకువునకు, దత్తామ్ = ఇవ్వబడిన, స్ఫీతామ్ = విశాలమైన, రాష్ట్రావృతామ్ = రాష్ట్రములతో నిండిన, మహీమ్ = భూమిని, వైదేహీమ్ = సీతను, అన్వదర్శయత్ = చూపించెను.

తా. అక్కడ రాముడు, పూర్వము మనుచక్రవర్తి ఇక్ష్వాకువునకు ఇచ్చిన, అనేక రాష్ట్రములతో కూడిన, విశాలమైన భూమిని సీతకు చూపించెను.

మూ. సూత ఇత్యేవ చాభాష్య సారథిం తమభీక్ష్ణశః,
హంసమత్తస్వరః శ్రీమానువాచ పురుషర్షభః. 14

ప్ర. అ. హంసమత్తస్వరః = మదించిన హంసయొక్క స్వరము వంటి స్వరము గల, పురుషర్షభః = పురుషశ్రేష్ఠుడైన, శ్రీమాన్ = శ్రీమంతుడైన ఆ రాముడు, సూత ఇత్యేవ = ఓ సూతా! అని, తం సారథిమ్ = ఆ సారథిని, అభీక్ష్ణశః = పెక్కుమారు ప్రేమపూర్వకముగా, ఆభాష్య = పలుకరించి, ఉవాచ = పలికెను.

తా. మదించిన హంసయొక్క ధ్వనివంటి కంఠధ్వని గల, పురుషశ్రేష్ఠుడూ, శ్రీమంతుడూ అయిన రాముడు, సారథి యైన సుమంత్రుని 'సూతా', అని ప్రేమపూర్వకముగా పిలిచి ఇట్లనెను. 14

మూ. కదాఽహం పునరాగమ్య సరయ్వాః పుష్పితే వనే,
మృగయాం పర్యటిష్యామి మాత్రా పిత్రా చ సంగతః.

ప్ర. అ. అహమ్=నేను, పునః=తిరిగి, ఆగమ్య=వచ్చి, మాత్రా=తల్లితోను, పిత్రా చ=తండ్రితోను, సంగతః=కూడినవాడనై, సరయ్వాః=సరయూనదియొక్క, పుష్పితే=పుష్పించిన, వనే=వనమునందు, మృగయామ్=వేటను, కదా=ఎపుడు, పర్యటిష్యామి=తిరుగుదునో.

తా. నేను మరల వచ్చి, తల్లి దండ్రుల దర్శనము చేసి, ఈ సరయూనదీతీరమున పుష్పించిన వనమునందు ఎపుడు వేటాడెదనో! 15

మూ. నాత్యర్థమభికాఙ్క్షామి మృగయాం సరయూవనే,
రతిర్హ్యేషాతులా లోకే రాజర్షిగణసమ్మతా. 16

ప్ర. అ. ఏషా=ఈ వేట, లోకే=లోకమునందు, అతులా=సాటిలేని, రాజర్షిగణసమ్మతా=రాజర్షుల గణములకు అంగీకార్యమైన, రతిః హి=ఆనందమైన క్రీడకదా! సరయూవనే=సరయూతీరమునందలి వనమునందు, మృగయామ్=వేటను, అత్యర్థమ్=మిక్కిలి: నాభికాఙ్క్షామి=కోరను.

తా. వేట ఈ లోకములో సాటిలేనిది, రాజర్షులకు అంగీకారయోగ్యము, ఆనందకరము అయిన క్రీడ. కాని సరయూతీరమునందలి వనమున వేటాడవలెనని నాకు అంతగా కోరిక లేదు. 16

మూ. రాజర్షీణాం హి లోకేఽస్మిన్ రత్యర్థం మృగయా వనే,
కాలే కృతాం తాం మనుజైర్ధన్వినామభికాఙ్క్షితామ్. 17

ప్ర. అ. అస్మిన్=ఈ, లోకే=లోకమునందు, వనే=వనమునందు, మృగయా=వేట, రాజర్షీణామ్=రాజర్షులకు, రత్యర్థం హి=ఆనందముకొరకు కదా! మనుజైః=మనుష్యులచేత, కాలే=ఆయాకాలములందు, కృతామ్=చేయబడినదీ, ధన్వినామ్=ధనుర్ధరులకు, అభికాఙ్క్షితామ్=కోరబడినదీ అయిన, తామ్=ఆ వేటను, నే నంతగా కోరను.

తా. ఈ లోకమునందు వేట రాజర్షులకు ఆనందకరము. ఆయాకాలములందు ఇతరమనుష్యులును చేయుచుందురు. ధనుర్ధరులు దీనిని అధికముగా కోరుదురు. కాని నేను దాని నంతగా కోరను. 17

వి. 16, 17 శ్లోకాల అర్థము, ఉన్నపాఠమును బట్టి చెప్పబడినది. అంత సంగతంగా లేదు. "అరణ్యాన్నుంచి వచ్చి ఈ సరయూతీరంలో ఎప్పుడు వేటాడుదునా'' అని 15వ శ్లోకంలో చెప్పి, "నాకు వేటఅంటే ఇష్టం లేదని" 16వ శ్లోకంలో చెప్పడానికి అర్థం లేదు. 17వ శ్లోకం సమన్వయం కూడా సరిగా లేదు. ప్రాచ్యరామాయణంలోని పాఠం బాగున్నది.

> ''రాజర్షీణాం చ లోకేఽస్మిన్నత్యర్థం మృగయా వనే,
> కాలే వృతానాం మనుజైర్ధన్వినామభికాఙ్క్షితామ్. 16
> అత్యర్థమభికాఙ్క్షామి' మృగయాం శరయూవనే,
> రతిర్హ్యేషా పరా లోకే రాజర్షిగణసేవితా.'' 17

''రాజర్షులు ఆ యా తగిన కాలాంలో, అనుచరులతో కలిసి, ధనుర్ధరులై, మంచి ఆసక్తితో, వనంలో వేటను అభ్యసించాలి. నాకూ సరయూవనంలో వేటాడవలెనని చాలా కోరిక ఉన్నది. ఇది రాజర్షులు సేవించిన క్రీడ కదా" అని ఈ శ్లోకాల భావము.

> మూ. స తమధ్వానమైక్ష్వాకః సూతం మధురయా గిరా,
> తం తమర్థమభిప్రేత్య యయౌ వాక్యముదీరయన్. 18

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే, అయోధ్యాకాణ్డే
ఏకోనపఞ్చాశః సర్గః

ప్ర. అ. సః ఐక్ష్వాకః = ఆ రాముడు, తమ్ = ఆ, సూతమ్ = సారథిని గూర్చి, మధురయా = మధురమైన, గిరా = వాక్కుతో, తం తమ్ = ఆ యా, అర్థమ్=విషయమును, అభిప్రేత్య = ఉద్దేశించి, వాక్యమ్ = వాక్యమును, ఉదీరయన్=పలుకుచు, అధ్వానమ్=మార్గమును, యయౌ=వెళ్లెను.

తా. రాము డీ విధముగ ఆ యా విషయములనుగూర్చి మధుర మైన వాక్కుతో ఆ సూతునకు చెప్పుచు, ఆ మార్గమునంతు ప్రయాణము చేసెను. 18

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో నలుబదితొమ్మిదవ సర్గ సమాప్తము.

(48)

# అథ పఞ్చాశః సర్గః

[మార్గమున రాముడు అయోధ్యను వనవాసమునకై అనుమతింపగోరుట. శృంగిబేరపురమున గంగాతీరము చేరి రాత్రి యచట నివసించుట. అచట నిషాదరాజు గుహుడు రామాదులను సత్కరించుట.]

మూ. విశాలాన్ కోసలాన్ రమ్యాన్ యాత్వా లక్ష్మణపూర్వజః,
అయోధ్యాభిముఖో ధీమాన్ ప్రాఞ్జలిర్వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. లక్ష్మణపూర్వజః = లక్ష్మణునకు అన్నగారైన, ధీమాన్ = బుద్ధిమంతుడైన ఆ రాముడు, రమ్యాన్ = అందమైన, విశాలాన్ = విశాలమైన, కోసలాన్ = కోసలదేశమును, యాత్వా = దాటి, అయోధ్యాభిముఖః = అయోధ్యవైపు అభిముఖుడై, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ పలికెను.

తా. బుద్ధిమంతుడైన ఆ రాముడు, అందము, విశాలము అయిన ఆ కోసలదేశమును దాటి, అయోధ్య వైపు తిరిగి, నమస్కరించుచు ఇట్లు పలికెను. 1

మూ. ఆపృచ్ఛే త్వాం పురిశ్రేష్ఠే కాకుత్స్థపరిపాలితే,
దైవతాని చ యాని త్వాం పాలయన్త్యావసన్తి చ. 2

ప్ర. అ. కాకుత్స్థపరిపాలితే = కకుత్స్థవంశమునందు పుట్టినవారిచే పాలింపబడిన, పురిశ్రేష్ఠే = నగరములలో శ్రేష్ఠమైన ఓ అయోధ్యా, త్వామ్ = నిన్నూ, యాని = ఏ, దైవతాని = దైవతములు, ఆవసన్తి = అధిష్ఠించి యున్నవో, పాలయన్తి చ = పాలించుచున్నవో వాటినీ, ఆపృచ్ఛే = = అనుమతి కోరుచున్నాను.

తా. కకుత్స్థవంశమునందు పుట్టినవారిచే పరిపాలింపబడుచున్న ఓ నగరశ్రేష్ఠమా నిన్నూ, నీయందు నివసించుచు, నిన్ను పాలించుచున్న దేవతలనూ, అనుమతి కోరుచున్నాను. 2

మూ. నివృత్త వనవాసస్త్వామనృణో జగతీపతేః,
పునర్ద్రక్ష్యామి మాత్రా చ పిత్రా చ సహ సంగతః. ౩

ప్ర. అ. జగతీపతేః = రాజైన దశరథునకు, అనృణః = ఋణము లేనివాడనై, నివృత్తవనవాసః = గడచిన వనవాసము కలవాడనై, మాత్రా చ = తల్లితోను, పిత్రా చ సహ = తండ్రితోను, సంగతః = కలిసినవాడనై, త్వామ్ = నిన్ను, పునః = మరల, ద్రక్ష్యామి = చూడగలను.

తా. నేను వనవాసమును పూర్తి చేసుకొని, దశరథుని ఋణము తీర్చి, తల్లిదండ్రులతో కలిసి, మరల నిన్ను చూచెదను. ౩

మూ. తతో రుధిరతామ్రాక్షో భుజముద్యమ్య దక్షిణమ్,
అశ్రుపూర్ణముఖో దీనోఽబ్రవీజ్జానపదం జనమ్. ౪

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అశ్రుపూర్ణముఖః = కన్నీళ్లతో నిండిన ముఖము కలవాడై, రుధిరతామ్రాక్షః = రక్తము వలె ఎర్రనైన నేత్రములు కలవాడై, దీనః = దీనుడై, దక్షిణమ్ = కుడి, భుజమ్ = భుజమును, ఉద్యమ్య = ఎత్తి, జానపదమ్ = గ్రామములకు సంబంధించిన, జనమ్ = జనమును గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట ఆ రాముడు, కన్నీళ్లతో నిండిన ముఖముతో, రక్తమువలె ఎర్రనైన నేత్రములు కలవాడై, దీనుడై, కుడిచేయి ఎత్తి తనను చూడ వచ్చిన ఆ గ్రామీణులతో ఇట్లనెను. ౪

మూ. అనుక్రోశో దయా చైవ యథార్హం మయి వః కృతః,
చిరం దుఃఖస్య పాపీయో గమ్యతామర్థసిద్ధయే ౫

ప్ర. అ. మయి = నాయందు, యథార్హమ్ = తగునట్లుగా, వః = మీకు, (మీచేత), దయా చైవ = దయయు, అనుక్రోశః = జాలియు, కృతః = చేయబడినది. దుఃఖస్య = దుఃఖముయొక్క, చిరమ్ = చిరకాలం ముండుట, పాపీయః = చెడ్డది. అర్థసిద్ధయే = కార్యసిద్ధికొరకై, గమ్యతామ్ = వెళ్లుదురుగాక (వెళ్లుడు).

తా. మీరు నాపై తగువిధముగా జాలి, దయ చూపించినారు. చాలా కాలము దుఃఖించుట మిక్కిలి చెడ్డది. అందుచే మీ మీ పనులు చూచుకొనుటకు

మూ. తే ఽభివాద్య మహాత్మానం కృత్వా చాపి ప్రదక్షిణమ్,
విలపన్తో నరా ఘోరం వ్యతిష్ఠన్త క్వచిత్ క్వచిత్. 6

ప్ర. అ. తే నరాః = ఆ జనులు, మహాత్మానమ్ = మహాత్ముడైన, ఆ రాముని, అభివాద్య = నమస్కరించి, ప్రదక్షిణం చాపి=ప్రదక్షిణము కూడ, కృత్వా = చేసి, ఘోరమ్ = ఘోరముగా, విలపన్తః = విలపించుచు, క్వచిత్ క్వచిత్ = అక్కడక్కడ, వ్యతిష్ఠన్త = నిలచిరి.

తా. వా రందరును, మహాత్ముడైన ఆ రామునకు ప్రదక్షిణపూర్వకముగా నమస్కారము చేసి, ఘోరముగా ఏడ్చుచు, అక్కడక్కడ నిలచి, రాముని చూచుచుండిరి. 6

మూ. తథా విలపతాం తేషామతృప్తానాం చ రాఘవః,
అచక్షుర్విషయం ప్రాయాద్యథార్కః క్షణదాముఖే. 7

ప్ర. అ. అతృప్తానామ్ = తృప్తి చెందని, తేషామ్ = వారు, తథా = ఆ విధముగా, విలపతామ్ = విలపించుచుండగా, రాఘవః = రాముడు, క్షణదాముఖే = సాయంకాలమున, అర్కః యథా = సూర్యుడు వలె, అచక్షుర్విషయమ్ = కండ్లకు కనబడక పోవుటను, ప్రాయాత్ = పొందెను.

తా. ఆ జనులందరు రామదర్శనమునకు తృప్తి చెందక, ఆ విధముగా విలపించుచుండగా, రాత్రి ప్రారంభమున సూర్యుడు వలె, రాముడు కండ్లకు కనబడకుండగా వెళ్ళిపోయెను. 7

మూ. తతో ధాన్యధనోపేతాన్ దానశీలజనాన్ శివాన్,
అకుతశ్చిద్భయాన్ రమ్యాం శ్చైత్యయూపసమావృతాన్,
ఉద్యానామ్రవణోపేతాన్ సమ్పన్నసలిలాశయాన్,
తుష్టపుష్టజనాకీర్ణాన్ గోకులాకులసేవితాన్, 9
లక్షణీయాన్నరేన్ద్రాణాం బ్రహ్మఘోషాభినాదితాన్,
రథేన పురుషవ్యాఘ్రః కోసలానత్యవర్తత. 10

ప్ర. అ. తతః = అటుపిమ్మట, పురుషవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడైన రాముడు, ధాన్యధనోపేతాన్ = ధాన్యములతోను, ధనములతోను కూడినవి, దాన

శీలజనాన్ = దానస్వభావము కల జనులు కలది, శివాన్ = మంగళకరము, అకుతశ్చిద్భయాన్ = ఎక్కడినుండి భయము లేనిది, రమ్యాన్ = సుందరమైనది, చైత్యయూపసమావృతాన్ = చైత్యములతోను, యూపస్తంభములతోను, కప్పబడి నది, ఉద్యానామ్రవనోపేతాన్ = ఉద్యానములతోను, మామిడితోటలతోను కూడి నది, సంపన్నసలిలాశయాన్ = జలసమృద్ధమైన జలాశయములు కలది, తుష్ట పుష్టజనాకీర్ణాన్ = సంతోషముతో పరిపుష్టులై ఉన్న జనులతో వ్యాప్తమైనది, గోకులాకులసేవితాన్ = గోసముదాయములచే నిండునట్లుగా సేవింపబడినది, నరేంద్రాణామ్ = రాజులకు, లక్షణీయాన్ = చూడదగినది, బ్రహ్మఘోషాభినాదితాన్ = వేదఘోషముచే ధ్వనింపచేయబడినది అయిన, కోసలాన్ = కోసల దేశమును, రథేన = రథముచేత, అత్యవర్తత = దాటెను.

తా. పిమ్మట పురుషశ్రేష్ఠుడైన ఆ రాముడు రథముచేత, కోసలదేశమును దాటెను. ఆ దేశము ధనధాన్యములతో నిండి, మంగళప్రదమై, ఎక్కడి నుండియు ఎట్టి భయము లేక, సుందరముగా నుండెను. అక్కడ జను లందరు దానస్వభావులు. అచ్చటచ్చట చైత్యములు, యూపస్తంభములు కనబడుచుండెను. అడుగడుగునను ఉద్యానములు, మామిడితోటలు, జలముతో నిండిన జలాశయములు ప్రకాశించుచుండెను. జను లందరును, సంతుష్టులై, పరిపుష్టులై ఉండిరి. ఆ దేశమునం దంతటను, అనేక గోసమూహములు వ్యాపించి యుండెను. ఎచట చూచినను, వేదఘోషము వినబడుచుండెను. ఆ దేశము రాజు లందరును చూడవలసిన దేశము. 8, 9, 10

మూ. మధ్యేన ముదితం స్ఫీతం రమ్యోద్యానసమాకులమ్,
రాజ్యం భోగ్యం నరేన్ద్రాణాం యయౌ ధృతిమతాం వరః.

ప్ర. అ. ధృతిమతామ్ = ధైర్యవంతులలో, వరః = శ్రేష్ఠుడైన ఆ రాముడు, ముదితమ్ = సంతోషించినది, స్ఫీతమ్ = విస్తృతమైనది, రమ్యోద్యానసమాకులమ్ = సుందరమైన ఉద్యానములతో వ్యాకులమైనది, నరేంద్రాణామ్ = రాజులకు, భోగ్యమ్ = అనుభవింపదగినది అయిన, రాజ్యమ్ = రాజ్యమును, (రాజ్యముయొక్క), మధ్యేన = మధ్యచేత, యయౌ = ప్రయాణము చేసెను.

తా. ధైర్యవంతులలో శ్రేష్ఠుడైన ఆ రాముడు రాజులచే అనుభవింప దగిన ఆ రాజ్యమును, దాని మధ్యభాగమున ప్రయాణము చేసి దాటెను. విశా

మైన ఆ రాజ్యము ఆనందకరమై, సుందరము లైన ఉద్యానవనములతో నిండి యుండెను. 11

మూ. తతస్త్రిపథగాం రమ్యాం శివతోయామశైవలామ్,
దదర్శ రాఘవో గఙ్గాం పుణ్యామృషినిషేవితామ్. 12

ప్ర. అ. తత్ర = అక్కడ, రాఘవః = రాముడు, త్రిపథగామ్ = మూడు మార్గములలో (స్వర్గ, భూలోక, పాతాళములలో) ప్రవహించునదీ, రమ్యామ్ = సుందర మైనదీ, శివతోయామ్ = మంగళకర మైన జలము కలదీ, అశైవలామ్ = నాచు లేనిదీ, పుణ్యామ్ = పుణ్యప్రద మైనదీ, ఋషిసేవితామ్ = ఋషులచే సేవింపబడినదీ యైన, గఙ్గామ్ = గంగను, దదర్శ = చూచెను.

తా. కోసలదేశమును దాటిన ఆ రాముడు, అక్కడ మూడు మార్గములలో ప్రవహించునదీ, సుందర మైనదీ, మంగళకరము లైన ఉదకములు కలదీ, నాచి లేనిదీ. పుణ్య మైనదీ ఋషులచే సేవింపబడునదీ అయిన గంగను చూచెను. 12

మూ. ఆశ్రమైరవిదూరస్థైః శ్రీమద్భిః సమలం కృతామ్,
కాలేఽప్సరోభిర్హృష్టాభిః సేవితామ్భోహ్రదాం శివామ్. 13

ప్ర. అ. (ఇటు పైన వచ్చు పదమూడు శ్లోకములలోని ద్వితీయాంత పదము లన్నీ పై శ్లోకములోని 'గఙ్గామ్' అను దానికి విశేషణములు)

అవిదూరస్థైః = సమీపమునందున్న, శ్రీమద్భిః = శోభాయుక్త మైన, ఆశ్రమైః = ఆశ్రమములచేత, సమలంకృతామ్ = అలంకరింపబడినది, కాలే = తగిన కాలమునందు, హృష్టాభిః = సంతోషించిన, అప్సరోభిః = అప్సరస్త్రీ లచే, సేవితామ్భోహ్రదామ్ = సేవింపబడిన ఉదకము గల, హ్రదములు కలది, శివామ్ = మంగళప్రదము.

తా. ఆ గంగానది సమీపమున ఉన్న అంద మైన ఆశ్రమములు, ఆ నదికి అలంకారములుగా నుండెను. సంతోషముతో కూడిన అప్సరస్త్రీలు ఆ యా కాలములందు వచ్చి మంగళప్రదమైన ఈ గంగకు సంబంధించిన హ్రదములందలి జలమును సేవించుచుందురు. 13

మూ. దేవదానవగన్ధర్వైః కిన్నరైరుపశోభితామ్,
నానాగన్ధర్వపత్నీభిః సేవితాం సతతం శివామ్. 14

ప్ర. అ. దేవదానవగన్ధర్వైః = దేవతలచేతను, దానవులచేతను, గంధర్వుల చేతను, కిన్నరైః = కిన్నరులచేతను, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినది, నానాగన్ధర్వపత్నీభిః = అనేకగంధర్వభార్యలచేత, సతతమ్ = ఎల్లప్పుడు, సేవితామ్ = సేవింపబడినది, శివామ్ = శుభప్రదమైనది.

తా. శుభప్రదమైన ఈ గంగను, దేవతలు, దానవులు, గంధర్వులు, కిన్నరులు ప్రకాశింపచేయుచుందురు. గంధర్వుల భార్యలు చాలమంది ఈ నదిని సర్వదా సేవించుచుందురు. 14

మూ. దేవాక్రీడశతాకీర్ణాం దేవోద్యానశతాయుతామ్,
దేవార్థమాకాశగమాం విఖ్యాతాం దేవపద్మినీమ్. 15

ప్ర. అ. దేవాక్రీడశతాకీర్ణాం = దేవతలయొక్క వందలకొలది క్రీడా పర్వతములతో వ్యాప్తమైనది, దేవోద్యానశతాయుతామ్ = వందలకొలది దేవతల ఉద్యానములతో కూడినది, దేవార్థమ్ = దేవతలకొరకై, ఆకాశగమామ్ = ఆకాశమునందు ప్రవహించుచున్నది, దేవపద్మినీమ్ = దేవతానదిగా, విఖ్యాతామ్ = ప్రసిద్ధమైనది.

తా. ఈ నదియందంతటను, దేవతలు విహరించు పర్వతములు, ఉద్యానములు, వందలకొలది ఉన్నవి. దేవతలకొరకై ఆకాశమునందు ప్రవహించుటచే ఇది 'దేవనది' యని ప్రసిద్ధమైనది. 15

మూ. జలాఘాతాట్టహాసోగ్రాం ఫేననిర్మలహాసినీమ్,
క్వచిద్వేణీకృతజలాం క్వచిదావర్తశోభితామ్. 16

ప్ర. అ. జలాఘాతాట్టహాసోగ్రామ్ = జలముయొక్క, తాకిడి యను వికటహాసముచే భయంకరమైనది, ఫేననిర్మలహాసినీమ్ = నురుగు అనెడు తెల్లని మందహాసము కలది, క్వచిత్ = కొన్నిచోట్ల, వేణీకృతజలామ్ = జడవలె పొడవుగా ప్రవహించుచున్న జలము కలది, క్వచిత్ = కొన్నిచోట్ల, ఆవర్తశోభితామ్ = సుడులచేత ప్రకాశింపచేయబడునది.

తా. ఆ నది కొన్ని చోట్ల నీటి అట్టహాసముచే భయంకరముగా ఉన్నది. కొన్ని చోట్ల నురుగు అనెడు తెల్లని మందహాసముతో కూడి యున్నది. కొన్ని చోట్ల జలము జడ వలె, దీర్ఘమై ప్రవహించుచుండెను. కొన్నిచోట్ల సుడులతో శోభించుచుండెను. 16

మూ. క్వచిత్స్తిమితగంభీరాం క్వచిద్వేగజలాకులామ్,
క్వచిద్గంభీరనిర్ఘోషాం క్వచిద్భైరవనిస్స్వనామ్. 17

ప్ర. అ. క్వచిత్ = కొన్నిచోట్ల, స్తిమితగంభీరామ్ = నిశ్చలముగాను, లోతుగాను ఉన్నది, క్వచిత్ = కొన్నిచోట్ల, వేగజలాకులామ్ = వేగము గల జలముతో వ్యాకుల మైనది, క్వచిత్ = కొన్నిచోట్ల, గంభీరనిర్ఘోషామ్ = గంభీర మైన ధ్వని కలది, క్వచిత్ = కొన్ని చోట్ల, భైరవనిస్స్వనామ్ = భయంకర మైన ధ్వని కలది.

తా. ఆ గంగానదీజలము, కొన్నిచోట్ల నిశ్చలం బై, లోతుగా ఉండెను. కొన్నిచోట్ల వేగముగా ప్రవహించుచుండెను. దాని ధ్వని, కొన్నిచోట్ల గంభీరము గాను, మరి కొన్నిచోట్ల భయంకరముగాను ఉండెను. 17

మూ. దేవసంఘాప్లుతజలాం నిర్మలోత్పలశోభితామ్,
క్వచిదాభోగపులినాం క్వచిన్నిర్మలవాలుకామ్. 18

ప్ర. అ. దేవసంఘాప్లుతజలామ్ = దేవసంఘముచే మునగబడిన జలము కలది, నిర్మలోత్పలశోభితామ్ = స్వచ్ఛ మైన కలువలచేత శోభించబడినది, క్వచిత్ = కొన్ని చోట్ల, ఆభోగపులినామ్ = నిండిన విశాలం బైన ఇసుకతిన్నెలు కలది, క్వచిత్ = కొన్నిచోట్ల, నిర్మలవాలుకామ్ = నిర్మలం బైన ఇసుక కలది.

తా. దేవత లందరును, ఈ నదీజలములో స్నాన మాడుచుండిరి. అది తెల్లని కలువలతో ప్రకాశించుచుండెను. కొన్ని చోట్ల నిండుగా విశాలముగా నున్న ఇసుకతిన్నెలు ఉండెను. కొన్ని చోట్ల తెల్లని ఇసుక వ్యాపించి యుండెను. 18

మూ. హంససారససంఘుష్టాం చక్రవాకోపకూజితామ్,
సదామదైశ్చ విహగైరభిసన్నాదితాంతరామ్. 19

ప్ర. అ. హంససారససంఘుష్టామ్ = హంసములచేతను, సారసపక్షుల చేతను ధ్వనింపచేయబడునది. చక్రవాకోపకూజితామ్ = చక్రవాకపక్షులచేత ధ్వనింపచేయబడినది, సదామత్తైః = ఎల్లప్పుడు మదము గల, విహగైః = పక్షుల చేత, అభినన్నాదితాంతరామ్ = ధ్వనింపచేయబడిన మధ్యభాగము కలది.

తా. హంసలు, సారసపక్షులు, చక్రవాకములు, ఈ నదియందు విహరింపుచు ధ్వని చేయుచుండెను. దీని మధ్యభాగము ఎల్లప్పుడు మదించియున్న పక్షుల రొదచే ప్రతిధ్వనించుచుండెను. 19

మూ. క్వచిత్తీరరుహైర్వృక్షైర్మాలాభిరివ శోభితామ్,
క్వచిత్ఫుల్లోత్పలచ్ఛన్నాం క్వచిత్పద్మవనాకులామ్. 20

ప్ర. అ. క్వచిత్ = కొన్ని చోట్ల, తీరరుహైః = తీరములందు మొలచిన, వృక్షైః = వృక్షములచేత, మాలాభిరివ = మాలలచేత వలె, శోభితామ్ = శోభింప చేయబడినది, క్వచిత్ = కొన్ని చోట్ల, ఫుల్లోత్పలచ్ఛన్నామ్ = వికసించిన కలువల చేత కప్పబడినది, క్వచిత్ = కొన్ని చోట్ల, పద్మవనాకులామ్ = పద్మముల సముదాయములచే, వ్యాకులముగా నున్నది.

తా. కొన్ని చోట్ల తీరములందు మొలచిన వృక్షములు, మాలల వలె ఆ గంగను అలంకరించుచుండెను. కొన్ని చోట్ల వికసించిన కలువలు, మరికొన్ని చోట్ల పద్మవనములు వ్యాపించి యుండెను. 20

మూ. క్వచిత్కుముదషణ్డైశ్చ కుడ్మలైరుపశోభితామ్,
నానాపుష్పరజోధ్వస్తాం సమదామివ చ క్వచిత్. 21

ప్ర. అ. క్వచిత్ = కొన్ని చోట్ల, కుముదషణ్డైశ్చ = తెల్ల కలువల సముదాయములచేతను, కుడ్మలైః = మొగ్గల చేతను, ఉపశోభితామ్ = ప్రకాశింపచేయబడినది. నానాపుష్పరజోధ్వస్తామ్ = అనేక విధములైన పుష్పముల పరాగముచే మారిపోయినదై, క్వచిత్ = కొన్ని చోట్ల, సమదామ్ ఇవ = మదముతో కూడినది వలె నున్నది.

తా. కొన్ని చోట్ల తెల్లని కలువల గుంపులు, వాటి మొగ్గలు ఈ నదిని ప్రకాశింపచేయుచుండెను. కొన్ని చోట్ల అనేకవిధములైన పుష్పముల పరాగములు పడి, రంగు మారిపోవుటచే అది మత్తెక్కినట్లు కనబడుచుండెను. 21

మూ. వ్యపేతమలసంఘాతాం మణినిర్మలదర్శనామ్,
దిశాగజైర్వనగజైర్మత్తైశ్చ వరవారణైః, 22
దేవోపవాహ్యైశ్చ ముహుః సంనాదితవనాన్తరామ్.

ప్ర. అ. వ్యపేతమలసంఘాతామ్ = తొలగిపోయిన మలముల సముదాయములు కలది, మణినిర్మలదర్శనామ్ = మణి వలె నిర్మలమైన దర్శనము కలది, దిశాగజైః = దిగ్గజములచేతను, మత్తైః = మదించిన, వనగజైః = వనగజములచేతను, దేవోపవాహ్యైః = దేవతలను మోయుటకు తగిన, వరవారణైః = శ్రేష్ఠమైన ఏనుగులచేతను, ముహుః = మాటిమాటికి, సంనాదితవనాన్తరామ్ = ధ్వనింపచేయబడిన వనమధ్యము కలది.

తా. ఈ గంగానదిలో ఎట్టి విధములైన మలములు లేకపోవుటచే అది మణి వలె నిర్మలముగా కనబడుచుండెను. దిగ్గజములు, మదించిన వనగజములు, దేవతల వాహనములైన ఉత్తమ గజములు, దీనిలో దిగి మాటి మాటికి ధ్వని చేయుటచే, దానితో వనమధ్యమంతయు ప్రతిధ్వనించుచుండెను. 22

మూ. ప్రమదామివ యత్నేన భూషితాం భూషణోత్తమైః, 23
ఫలైః పుష్పైః కిసలయైర్వృతాం గుల్మైర్ద్విజైస్తథా,
శింశుమారైశ్చ నక్రైశ్చ భుజంగైశ్చ నిషేవితామ్. 24

ప్ర. అ. ఫలైః = ఫలములతోను, పుష్పైః = పుష్పములతోను, కిసలయైః = చిగుళ్లతోను, గుల్మైః = పొదలతోను, తథా = మరియు, ద్విజైః = పక్షులతోను, వృతామ్ = కూడినది, భూషణోత్తమైః = ఉత్తమములైన భూషణములచేత, యత్నేన = ప్రయత్నపూర్వకముగా, భూషితామ్ = అలంకరింపబడిన, ప్రమదామివ = స్త్రీ వలె నున్నది, శింశుమారైశ్చ = నీటికోతులచేతను, నక్రైశ్చ = మొసళ్లచేతను, భుజంగైశ్చ = సర్పములచేతను, నిషేవితామ్ = సేవింపబడినది.

తా. ఆ గంగానదీప్రాంతమంతటను ఫలములు, పుష్పములు, చిగుళ్లు, పొదలు, పక్షులు, వ్యాపించియుండుటచే అది ప్రయత్నపూర్వకముగా ఉత్తమమైన అలంకారములతో అలంకరించిన స్త్రీ వలె ఉండెను. ఆ నదిలో, నీటికోతులు, మొసళ్లు, సర్పములు నివసించుచుండెను. 23, 24

మూ. విష్ణుపాదచ్యుతాం దివ్యామపాపాం పాపనాశినీమ్,
తాం శఙ్కరజటాజూటాద్భ్రష్టాం సాగరతేజసా. 25
సముద్రమహిషీం గఙ్గాం సారసక్రౌఞ్చనాదితామ్,
ఆససాద మహాబాహుః శృఙ్గబేరపురం ప్రతి. 26

ప్ర. అ. మహాబాహుః = గొప్ప బాహువులు కల రాముడు, విష్ణుపాదచ్యుతామ్ = విష్ణుపాదమునుండి ప్రవహించినది, దివ్యామ్ = దివ్యమైనది, అపాపామ్ = పాపములు లేనిది, పావనాశినీమ్ = పాపములను నశింపచేయునది, సాగరతేజసా = సగరచక్రవర్తి వంశమునందు పుట్టిన భగీరథుని తపఃప్రభావముచే, శంకరజటాజూటాత్ = శంకరుని జటాజూటమునుండి, భ్రష్టామ్ = జారినది, సముద్రమహిషీమ్ = సముద్రుని భార్య యైనది, సారసక్రౌంచనాదితామ్ = సారసపక్షుల చేతను, క్రౌంచపక్షులచేతను ధ్వనింపచేయబడినది అయిన, తాం గఙ్గామ్ = ఆ గంగానదిని, శృఙ్గబేరపురం ప్రతి = శృంగిబేరపురసమీపమున, ఆససాద = సమీపించెను.

తా. విష్ణుపాదమునుండి ప్రవహించుచున్నది, దేవలోకమునకు సంబంధించినది, పాపములు లేనిది, అయిన ఆ గంగానది, పాపములను తొలగించునది. భగీరథుని తపస్సుచే శంకరుని జటాజూటమునుండి నేలపై బడినది. సారసపక్షులు, క్రౌంచపక్షులు, ఆ నదియందు ధ్వనిచేయుచుండును. అట్టి సముద్రమహిషియైన గంగను, ఆజానుబాహువగు రాముడు శృంగిబేరపురము వద్ద సమీపించెను.

మూ. తామూర్మికలిలావర్తామన్వవేక్ష్య మహారథః,
సుమన్త్రమబ్రవీత్సూతమిహైవాద్య వసామహే. 27

ప్ర. అ. మహారథః = మహారథుడైన రాముడు, ఊర్మికలిలావర్తామ్ = తరంగములచే కప్పబడిన సుడులు గల, తామ్ = ఆ గంగానదిని, అన్వవేక్ష్య = చూచి, సూతమ్ = సారథి యైన, సుమన్త్రమ్ = సుమంత్రుని గూర్చి, అబ్రవీత్ = పలికెను. అద్య = నేడు, అత్రైవ = ఇక్కడనే, వసామహే = నివసించెదము.

తా. తరంగములచే కప్పబడిన సుడులు కల ఆ నదిని చూచి, రాముడు సారథి యైన సుమంత్రునితో ఇట్లు పలికెను. "నేడు ఇచటనే నివసించెదము". 27

మూ. అవిదూరాదయం నద్యా బహుపుష్పప్రవాళవాన్,
సుమహానిఙ్గుదీవృక్షో వసామో౽త్రైవ సారథే. 28

ప్ర. అ. సారథే = ఓ సారథీ! నద్యాః = నదినుండి, అవిదూరాత్ = సమీపముననే, బహుపుష్పప్రవాళవాన్ = అనేకమైన పుష్పములు, చిగుళ్ళు కల, సుమహాన్ = చాల పెద్దదైన, అయమ్ = ఈ, ఇఙ్గుదీవృక్షః = గార చెట్టు ఉన్నది. అత్రైవ = ఇక్కడనే, వసామః = నివసించెదము.

తా. ఓ సారథీ! ఈ నదికి దగ్గరనే అనేకమైన పుష్పములతో చిగుళ్ళతో నిండిన చాల పెద్దదైన గారచెట్టు ఉన్నది. ఇక్కడనే ఉండెదము. 28

మూ. ప్రేక్షామః సరితాం శ్రేష్ఠాం సమ్మాన్యసలిలాం శివామ్,
దేవదానవగన్ధర్వమృగమానుషపక్షిణామ్. 29

ప్ర. అ. దేవదానవగన్ధర్వమృగమానుషపక్షిణామ్ = దేవతలకు, దానవులకు, గంధర్వులకు, మృగములకు, మనుష్యులకు, పక్షులకు, శివామ్ = మంగళకరమైనది, సమ్మాన్యసలిలామ్ = పూజింపదగిన ఉదకము కలది. సరితాం శ్రేష్ఠామ్ = నదులలో శ్రేష్ఠమూ అయిన గంగానదిని, ప్రేక్షామః = చూచెదము.

తా. పూజింప దగిన జలము గల, నదీశ్రేష్ఠమైన ఈ గంగానది దేవతలకు, దానవులకు, గంధర్వులకు, మృగములకు, మనుష్యులకు, పక్షులకు, శుభము కల్గించును. అట్టి ఈ నదిని చూచెదము. 29

మూ. లక్ష్మణశ్చ సుమన్త్రశ్చ బాఢమిత్యేవ రాఘవమ్,
ఉక్త్వా తమిఙ్గుదీవృక్షం తదోపయయతుర్హయైః. 30

ప్ర. అ. లక్ష్మణశ్చ = లక్ష్మణుడు, సుమన్త్రశ్చ = సుమంత్రుడు, రాఘవమ్ = రాముని గూర్చి, బాఢమిత్యేవ = తప్పక అట్లే అగు గాక యని, ఉక్త్వా = పలికి, తదా = అపుడు, హయైః = గుఱ్ఱములచే, తమ్ = ఆ, ఇఙ్గుదీవృక్షమ్ = ఇంగుదీవృక్షమును, ఉపయయతుః = సమీపించిరి.

తా. లక్ష్మణుడు సుమంత్రుడు కూడ రాముని మాట అంగీకరించి, ఆ రథమును ఇంగుదీవృక్షము దాపునకు తోల్కొని వెళ్ళిరి. 30

మూ. రామోఽభియాయ తం రమ్యం వృక్షమిక్ష్వాకునన్దనః,
రథాదవాతరత్తస్మాత్సభార్యః సహలక్ష్మణః. 31

ప్ర. అ. ఇక్ష్వాకునన్దనః = ఇక్ష్వాకువంశమునకు ఆనందకరు డైన, రామః = రాముడు, రమ్యమ్ = అంద మైన, తం వృక్షమ్ = ఆ వృక్షమును, అభియాయ = చేరి, సభార్యః = భార్యాసహితుడై, సహలక్ష్మణః = లక్ష్మణసహితుడై, తస్మాత్ రథాత్ = ఆ రథమునుండి, అవాతరత్ = దిగెను.

తా. ఆ వృక్షము సమీపించి ఇక్ష్వాకువంశమునకు ఆనందమును కల్గించు రాముడు, సీత, లక్ష్మణుడు రథమునుండి దిగిరి. 31

మూ. సుమన్త్రోఽప్యవతీర్యాస్మాన్మోచయిత్వా హయోత్తమాన్,
వృక్షమూలగతం రామముపతస్థే కృతాఞ్జలిః. 32

ప్ర. అ. సుమన్త్రోఽపి = సుమంత్రుడు కూడ, అస్మాత్ = ఈ రథము నుండి, అవతీర్య = దిగి, హయోత్తమాన్ = శ్రేష్ఠ మైన గుఱ్ఱములను, మోచయిత్వా = విడిపించి, కృతాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడై, వృక్షమూలగతమ్ = వృక్షమూలమును పొందిన, రామమ్ = రాముని, ఉపతస్థే = సేవించెను.

తా. సుమంత్రుడు కూడ ఈ రథమునుండి దిగి గుఱ్ఱములను విప్పి, చెట్టు మొదట ఉన్న రాముని వద్ద వినయపూర్వకముగా కూర్చుండెను. 32

మూ. తత్ర రాజా గుహో నామ రామస్యాత్మసమః సఖా,
నిషాదజాత్యో బలవాన్ స్థపతిశ్చేతి విశ్రుతః. 33

ప్ర. అ. తత్ర = అక్కడ, రామస్య = రామునియొక్క, ఆత్మసమః = ప్రాణసమాను డైన, సఖా = స్నేహితుడు, నిషాదజాత్యః = బోయజాతికి సంబంధించినవాడు, బలవాన్ = బలవంతుడు, స్థపతిశ్చేతి = నిషాదులకు అధిపతి యని, విశ్రుతః = ప్రసిద్ధుడు అయిన, గుహో నామ = గుహుడు అను, రాజా = రాజు ఉండెను.

తా. అక్కడ రామునకు ప్రాణసమానస్నేహితుడు, బోయజాతికి చెందినవాడు, బలవంతుడు, ఆ బోయజాతివారికి అధిపతి యని ప్రసిద్ధుడు అయిన గుహుడు అను రాజు ఉండెను. 33

మూ. స శ్రుత్వా పురుషవ్యాఘ్రం రామం విషయమాగతమ్,
వృద్ధైః పరివృతోఽమాత్యైర్జ్ఞాతిభిశ్చాప్యుపాగతః. ౮౪

ప్ర. అ. సః = అతడు, పురుషవ్యాఘ్రమ్ = పురుషశ్రేష్ఠుడైన, రామమ్ = రాముని, విషయమ్ = తన దేశమును గూర్చి, ఆగతమ్ = వచ్చిన వానినిగా, శ్రుత్వా = విని, వృద్ధైః = వృద్ధులైన, అమాత్యైః = అమాత్యులతోను, జ్ఞాతిభిః = బంధువులతోను, పరివృతః = కూడినవాడై, ఉపాగతః = వచ్చెను.

తా. పురుషశ్రేష్ఠుడైన రాముడు తన దేశమునకు వచ్చినట్లు విని, ఆ గుహుడు, వృద్ధులైన అమాత్యులతోను, జ్ఞాతులతోను కలసి, రామునివద్దకు వచ్చెను. ౮౪

మూ. తతో నిషాదాధిపతిం దృష్ట్వా దూరాదుపస్థితమ్,
సహ సౌమిత్రిణా రామః సమాగచ్ఛద్గుహేన సః. ౮౫

ప్ర. అ. తతః = అటు పిమ్మట, ఉపస్థితమ్ = వచ్చిన, నిషాదాధిపతిం = నిషాదరాజైన గుహుని, దూరాత్ = దూరమునుండి, దృష్ట్వా = చూచి, సౌమిత్రిణా సహ = లక్ష్మణునితో కూడ, సః రామః = ఆ రాముడు, గుహేన = గుహునితో, సమాగచ్ఛత్ = కలిసెను.

తా. నిషాదరాజు వచ్చుచున్నట్లు దూరమునుండియే చూచిన రాముడు, లక్ష్మణసమేతుడై, అతనిని కలిసెను. ౮౫

మూ. తమార్తః సంపరిష్వజ్య గుహో రాఘవమబ్రవీత్,
యథాఽయోధ్యా తథేయం తే రామ కిం కరవాణి తే, ౮౬
ఈదృశం హి మహాబాహో కః ప్రాప్స్యత్యతిథిం ప్రియమ్.

ప్ర. అ. ఆర్తః = దుఃఖితుడైన, గుహః = గుహుడు, తం రాఘవమ్ = ఆ రాముని, సంపరిష్వజ్య = కౌగలించుకొని, అబ్రవీత్ = పలికెను. రామ = రామా, తే = నీకు, అయోధ్యా = అయోధ్య, యథా = ఎట్లో, ఇయమ్ = ఈ నగరము కూడా, తథా = అట్లే. తే = నీకు, కిమ్ = ఏమి, కరవాణి = చేయుదును? మహాబాహో = ఓ మహాబాహా! ఈదృశమ్ = ఇట్టి, ప్రియమ్ = ప్రియుడైన, అతిథిమ్ = అతిథిని, కః = ఎవ్వడు, ప్రాప్స్యతి = పొందగలడు.

తా. గుహుడు దుఃఖితుడై రాముని కౌగలించుకొని ఇట్లనెను. "రామా! నీకు అయోధ్య ఎట్లో ఈ నగరముకూడ అట్లే. నీకు ఏమి చేయుదునో చెప్పుము. ఓ ఆజానుబాహూ! నీవంటి ప్రియాతిథి మరెవ్వరికైనా దొరకునా?" 86

మూ. తతో గుణవదన్నాద్యముపాదాయ పృథగ్విధమ్, 87
అర్ఘ్యం చోపానయత్ క్షిప్రం వాక్యం చేదమువాచ హ.

ప్ర. అ. తతః = అటు పిమ్మట, పృథగ్విధమ్ = అనేకవిధములైన, గుణవత్ = మంచి గుణము గల, అన్నాద్యమ్ = అన్నము మొదలైన దానిని, ఉపాదాయ = తీసికొని వచ్చి, క్షిప్రమ్ = శీఘ్రముగా, అర్ఘ్యం చ = అర్ఘ్యమును కూడా, ఉపానయత్ = తీసికొని వచ్చెను. ఇదమ్ = ఈ, వాక్యం చ = వాక్యమును కూడా, ఉవాచ హ = పలికెను.

తా. పిమ్మట అనేకవిధములైన అన్నమును (ఆహారపదార్థములను), అర్ఘ్యమును శీఘ్రముగా తీసికొని వచ్చి, ఈ వాక్యమును పలికెను. 87

మూ. స్వాగతం తే మహాబాహో తవేయమఖిలా మహీ, 88
వయం ప్రేష్యా భవాన్ భర్తా సాధు రాజ్యం ప్రశాధి నః.

ప్ర. అ. మహాబాహో = ఓ మహాబాహూ, తే = నీకు, స్వాగతమ్ = స్వాగతము. అఖిలా = సమస్తమైన, ఇయం మహీ = ఈ భూమి, తవ = నీది. వయమ్ = మేము, ప్రేష్యాః = పరిచారకులము, భవాన్ = నీవు, భర్తా = ప్రభువు. నః = మాయొక్క, రాజ్యమ్ = ఈ రాజ్యమును, సాధు = చక్కగా, ప్రశాధి = పరిపాలింపుము.

తా. ఓ ఆజానుబాహూ! నీకు స్వాగతము. ఈ భూమి అంతయు నీకు చెందినదే. మేము నీకు నౌకర్లము. నీవు రాజువు. ఈ మా రాజ్యమును పరిపాలింపుము. 88

మూ. భక్ష్యం భోజ్యం చ పేయం చ లేహ్యం చేద ముపస్థితమ్,
శయనాని చ ముఖ్యాని వాజినాం ఖాదనం చ తే.

ప్ర. అ. భక్ష్యమ్ = పిండివంటలు మొదలైన భక్ష్యమూ, భోజ్యమ్ = తినదగిన అన్నము మొదలైనదీ, పేయమ్ = త్రాగదగిన పానకము మొద

లైనది, లేహ్యం చ = నాకదగిన పదార్థజాతమూ, ముఖ్యాని = శ్రేష్ఠమైన, శయనాని = శయనములూ, తే = నీయొక్క, వాజినామ్ = గుఱ్ఱములకు, ఖాదనం చ = ఆహారము, ఇదమ్ = ఇదిగో, ఉపస్థితమ్ = వచ్చి యున్నది.

తా. భక్ష్యములూ, భోజ్యములూ, పేయములూ, లేహ్యములూ, మంచి శయనములూ, నీ అశ్వములకొఱకై ఆహారమూ - ఇవిగో అన్నియు సిద్ధముగా నున్నవి. 39

మూ. గుహమేవం బ్రువాణం తు రాఘవః ప్రత్యువాచ హ, 40
అర్చితాశ్చైవ హృష్టాశ్చ భవతా సర్వథా వయమ్,
పద్భ్యామభిగమాచ్చైవ స్నేహసందర్శనేన చ.

ప్ర. అ. ఏవమ్ = ఈ విధముగా, బ్రువాణమ్ = పలుకుచున్న, గుహమ్ = గుహునిగూర్చి, రాఘవః = రాముడు, ప్రత్యువాచ హ = తిరిగి పలికెను. వయమ్ = మేము, సర్వథా = అన్ని విధములా, భవతా = నీచేత, పద్భ్యామ్ = పాదములతో, అభిగమాచ్చైవ = ఎదురుగా వచ్చుటచేతను, స్నేహసందర్శనేన చ = స్నేహము చూపుటచేతను, అర్చితాశ్చైవ = పూజింపబడితిమి; హృష్టాశ్చ = సంతోషించితిమి.

తా. గుహుని మాటలు విని రాము డిట్లు పలికెను, "నీవు కాలినడకను మా కెదురుగా వచ్చుటచేతను, స్నేహమును ప్రదర్శించుట చేతను, మమ్ములను సర్వవిధములా పూజించితివి. అందుకు, చాలా సంతోషించుచున్నాము. 40, 41

మూ. భుజాభ్యాం సాధు పీనాభ్యాం పీడయన్ వాక్యమబ్రవీత్,
దిష్ట్యా త్వాం గుహ పశ్యామి అరోగం సహబాన్ధవైః. 42
అపి తే కుశలం రాష్ట్రే మిత్రేషు చ ధనేషు చ.

ప్ర. అ. పీనాభ్యామ్ = బలిసిన, భుజాభ్యామ్ = భుజములతో, సాధు = బాగుగా, పీడయన్ = పీడించుచు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను. గుహ = గుహుడా! దిష్ట్యా = దైవానుగ్రహముచేత, సహబాన్ధవైః = బంధువులతో గూడ, అరోగమ్ = రోగములేని, త్వామ్ = నిన్ను, పశ్యామి = చూచుచున్నాను. తే = నీయొక్క, రాష్ట్రే = రాష్ట్రమునందు, మిత్రేషు = మిత్రులందూ, ధనేషు చ = ధనములందూ, అపి కుశలమ్ = కుశలమే కదా!

తా. రాము డాతనిని దగ్గరగా జరిపి యున్న తన భుజములతో కౌగ
లించుకొని ఇట్లు పలికెను: 'నీవూ, నీ బంధువులూ, ఆరోగ్యముగా సుఖముగా
నుండగా, నా భాగ్యవశముచేత చూడ గలుగుచున్నాను. నీ రాష్ట్రమునకూ, నీ
మిత్రులకూ, ధనమునకూ క్షేమమే కదా। 41,42

మూ. యత్త్విదం భవతా కిఞ్చిత్ప్రీత్యా సముపకల్పితమ్,
సర్వం తదనుజానామి న హి వర్తే ప్రతిగ్రహే. 43

ప్ర. అ. భవతా = నీచేత, ప్రీత్యా = ప్రేమచేత, ఇదమ్ = ఈ, యత్కిఞ్చిత్ = ఏదైతే, సముపకల్పితమ్ = ఏర్పరుపబడినదో, తత్ సర్వమ్ = దాని నంతనూ, అనుజానామి = అనుమతించుచున్నాను (నీకే ఇచ్చి వేయుచున్నాను). ప్రతిగ్రహే = ప్రతిగ్రహమునందు, న వర్తే హి = లేను కదా.

తా. నీవు ప్రేమపూర్వకముగా నాకై ఏర్పరచిన దాని నంతను నీకే ఇచ్చివేయుచున్నాను. నేను ఇపుడు ఎవ్వరైన ఇచ్చినదానిని తీసుకొను స్థితిలో లేను. 43

మూ. కుశచీరాజినధరం ఫలమూలాశినం చ మామ్,
విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వనగోచరమ్. 44

ప్ర. అ. మామ్ = నన్ను, కుశచీరాజినధరమ్ = కుశములనూ, నారచీరలనూ, కృష్ణాజినమునూ ధరించినవాడనూ, ఫలమూలాశినమ్ = పండ్లను, దుంపలను తినువాడనూ, ధర్మే = ధర్మమునందు, ప్రణిహితమ్ = దీక్ష వహించినవాడనూ, వనగోచరమ్ = వనమున సంచరించువాడనూ అయిన, తాపసమ్ = మునినిగా, విద్ధి = తెలుసుకొనుము.

తా. ఇపుడు నేను కుశచీరాజినములను ధరించి, ఫలమూలములు భక్షించుచు, వనములో నివసించు, ధర్మనిరతుడ నైన మునిని అను విషయమును తెలుసుకొనుము. 44

మూ. అశ్వానాం ఖాదనేనాహ మర్థీ నాన్యేన కేనచిత్,
ఏతావతాత్ర భవతా భవిష్యామి సుపూజితః. 45

= ఉపాసించి, లక్ష్మణేన = లక్ష్మణునిచేత, స్వయమ్ = స్వయముగా, ఆహృతమ్ = తీసికొని రాబడిన, జలమేవ = జలమును మాత్రమే, భోజ్యమ్ = ఆహారముగా, ఆదదే = గ్రహించెను.

తా. పిదప రాముడు నారచీరను ఉత్తరీయముగా ధరించి, సాయంకాల సంధ్యను అర్చించి, స్వయముగ లక్ష్మణుడు తీసికొని వచ్చిన ఉదకమును మాత్రమే ఆహారముగా గ్రహించెను. 48

మూ. తస్య భూమౌ శయానస్య పాదౌ ప్రక్షాల్య లక్ష్మణః,
సభార్యస్య తతోఽభ్యేత్య తస్థౌ వృక్షముపాశ్రితః. 49

ప్ర. అ. లక్ష్మణః = లక్ష్మణుడు, భూమౌ = భూమిపై, శయానస్య = శయనించుచున్న, సభార్యస్య = భార్యతో కూడిన, తస్య = ఆ రామునియొక్క, పాదౌ = పాదములను, ప్రక్షాల్య = కడిగి, తతః = పిమ్మట, అభ్యేత్య = వచ్చి, వృక్షమ్ = వృక్షమును, ఉపాశ్రితః = ఆశ్రయించినవాడై, తస్థౌ = ఉండెను.

తా. భార్యాసమేతుడై, నేలపై పరుండిన ఆ రాముని పాదములు కడిగి, లక్ష్మణుడు వృక్షమువద్దకు వచ్చి నిలచెను. 49

మూ. గుహోఽపి సహ సూతేన సౌమిత్రిమనుభాషయన్,
అన్వజాగ్రత్తతో రామమప్రమత్తో ధనుర్ధరః. 50

ప్ర. అ. గుహోఽపి = గుహుడు కూడ, సూతేన సహ = సుమంత్రునితో కూడ, సౌమిత్రిమ్ = లక్ష్మణుని, అనుభాషయన్ = మాటలాడించుచు, తతః = పిమ్మట, ధనుర్ధరః = ధనస్సు ధరించినవాడై, అప్రమత్తః = సావధానచిత్తుడై, రామమ్ = రాముని గూర్చి, అన్వజాగ్రత్ = మేల్కొనెను.

తా. గుహుడు కూడ ధనుర్ధారియై, లక్ష్మణసుమంత్రులతో మాటలాడుచు రాముని సంరక్షణము నిమిత్తము సావధానచిత్తుడై, మేల్కొని ఉండెను.

మూ. తథా శయానస్య తతోఽస్య ధీమతో
యశస్వినో దాశరథేర్మహాత్మనః,
అదృష్టదుఃఖస్య సుఖోచితస్య సా
తదా వ్యతీయాయ చిరేణ శర్వరీ. 51

## ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాండే
## పఞ్చాశః సర్గః

ప్ర. అ. తతః = అటుపిమ్మట, అదృష్టదుఃఖస్య = చూడబడని దుఃఖము కలవాడూ, సుఖోచితస్య = సుఖమునకు అలవాటు పడినవాడూ, ధీమతః = బుద్ధిమంతుడూ, యశస్వినః = కీర్తి గలవాడూ, మహాత్మనః = మహాత్ముడూ, తదా = అప్పుడు, తథా = ఆ విధముగా, శయానస్య = శయనించుచున్నవాడూ అయిన, అస్య దాశరథేః = ఈ రామునకు, సా = ఆ, శర్వరీ = రాత్రి, చిరేణ = చిరకాలమునకు, వ్యతీయాయ = గడచినది.

తా. బుద్ధిమంతుడూ, యశశ్శాలీ, మహాత్ముడూ అయిన ఆ రాముడు ఎన్నడును దుఃఖములను అనుభవించి యుండలేదు. సుఖములకే అలవాటు పడి యుండెను. ఆ రోజున ఆ విధముగ నేలపై పండుకొని యున్న అట్టి రామునకు రాత్రి చాల ఆలస్యముగా గడచిన ట్లుండెను. 51

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమందు
అయోధ్యాకాండలో ఏబదవ సర్గ సమాప్తము.

# అథ ఏకపఞ్చాశః సర్గః

[నిషాదరాజైన గుహుని సమక్షమున లక్ష్మణుడు విలపించుట.]

మూ. తం జాగ్రతమదమ్భేన భ్రాతురర్థాయ లక్ష్మణమ్,
గుహః సంతాపసంతప్తో రాఘవం వాక్యమబ్రవీత్. 1

ప్ర. అ. గుహః = గుహుడు, భ్రాతుః = అన్నగారియొక్క, అర్థాయ = ప్రయోజనము కొరకు, జాగ్రతమ్ = మేల్కొని యున్న, రాఘవమ్ = రఘు వంశమునందు పుట్టిన, తం లక్ష్మణమ్ = ఆ లక్ష్మణుని గూర్చి, అదమ్భేన = = కపటము లేకుండగ, సంతాపసంతప్తః = దుఃఖముచేత పీడింపబడినవాడై, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. అన్నగారి రక్షణముకొరకై మేల్కొని యున్న లక్ష్మణునితో, గుహుడు దుఃఖపీడితుడై కపటము లేని వాక్యమును పలికెను. 1

మూ. ఇయం తాత సుఖా శయ్యా త్వదర్థముపకల్పితా,
ప్రత్యాశ్వసిహి సాధ్వస్యాం రాజపుత్ర యథాసుఖమ్. 2

ప్ర. అ. తాత = తండ్రీ, ఇయమ్ = ఈ, సుఖా = సుఖకర మైన, శయ్యా = శయ్య, త్వదర్థమ్ = నీ కొరకై, ఉపకల్పితా = ఏర్పరుపబడినది. రాజపుత్ర = రాజకుమారా! అస్యామ్ = దీనియందు, యథాసుఖమ్ = సుఖముగా, సాధు = చక్కగా, ప్రత్యాశ్వసిహి = ఊరడిల్లుము.

తా. నాయనా! సుఖకర మైన ఈ శయ్య నీ కొరకై ఏర్పరుపబడినది. ఓ రాజకుమారా! నీవు చక్కగా దీనిపై సుఖముగా విశ్రాంతి తీసుకొనుము. 2

మూ. ఉచితోఽయం జనస్సర్వః క్లేశానాం త్వం సుఖోచితః,
గుప్త్యర్థం జాగరిష్యామః కాకుత్స్థస్య వయం నిశామ్. 3

ప్ర. అ. సర్వః=సమస్తమైన, అయం జనః=ఈ జనము, క్లేశానామ్=కష్టములకు, ఉచితః=అలవాటు పడినది. త్వమ్=నీవు, సుఖోచితః=సుఖము నకు అలవాటు పడినవాడవు. కాకుత్స్థస్య=రామునియొక్క, గుప్త్యర్థమ్=రక్షణము కొరకు, వయమ్=మేము, నిశామ్=రాత్రిని, జాగరిష్యామః=మేల్కొనె దము.

తా. మే మందరము శ్రమకు అలవాటుపడినవారము. నీవు సుఖమునకు అలవాటు పడినవాడవు. రాముని రక్షణకొరకై మేము రాత్రి యంతయు మేల్కొనెదము. 3

మూ. న హి రామాత్ప్రియతరో మమాస్తి భువి కశ్చన,
బ్రవీమ్యేతదహం సత్యం సత్యేనైవ చ తే శపే. 4

ప్ర. అ. మమ=నాకు, రామాత్=రామునికంటె, ప్రియతరః=మిక్కిలి ఇష్టుడైన, కశ్చన=ఎవ్వడును, భువి=ఈ భూమియందు, నాస్తి హి=లేడు. అహమ్=నేను, ఏతత్=దీనిని, సత్యమ్=సత్యముగా, బ్రవీమి=చెప్పుచున్నాను. సత్యేనైవ=సత్యముచేతనే, తే=నీకు, శపే=ఒట్టు పెట్టుచున్నాను.

తా. నాకు ఈ లోకములో, రామునికంటె ఇష్టుడు మ రెవ్వడును లేడు. నేను సత్యముపై ఒట్టుపెట్టి నిజముగా చెప్పుచున్నాను. 4

మూ. అస్య ప్రసాదాదాశంసే లోకేఽస్మిన్ సుమహద్యశః,
ధర్మావాప్తిం చ విపులామర్థావాప్తిం చ కేవలమ్. 5

ప్ర. అ. అస్య=ఈ రామునియొక్క, ప్రసాదాత్=అనుగ్రహమువలన, అస్మిన్ లోకే=ఈ లోకమునందు, సుమహత్=చాలా గొప్పదైన, యశః=కీర్తిని, ధర్మావాప్తిం చ=ధర్మప్రాప్తిని, విపులామ్=అధికమైన, అర్థావాప్తిం చ=అర్థప్రాప్తిని, కేవలమ్=కేవలము, ఆశంసే=కోరుచున్నాను.

తా. ఈ రాముని అనుగ్రహమున లోకములో గొప్ప కీర్తిని, అధిక ధర్మమును, అర్థమును పొందవలె నని మాత్రమే కోరుచున్నాను. 5

మూ. సోఽహం ప్రియసఖం రామం శయానం సహ సీతయా,
రక్షిష్యామి ధనుష్పాణిః సర్వైః జ్ఞాతిభిః సహ. 6

ప్ర. అ. సః అహమ్ = అట్టి నేను, జ్ఞాతిభిః సహ = బంధువులతో కూడిన వారనై, ధనుష్పాణిః = ధనుస్సు హస్తమందు కలవారనై, సీతయా సహ = సీతతో కూడ, శయానమ్ = నిద్రించుచున్న, ప్రియసఖం = ప్రియమిత్రు డైన, రామమ్ = రాముని, సర్వతః = అందరినుండి, రక్షిష్యామి = రక్షించెదను.

తా. నేను, నా బంధువులు ధనుస్సు ధరించి, నిద్రపోవుచున్న నా ప్రియ మిత్రు డైన రాముని, సీతను కూడ, అందరినుండియు రక్షించెదము. 6

మూ. న హి మేఽవిదితం కించిద్వనేఽస్మిన్ చరతః సదా,
చతురఙ్గం హ్యపి బలం సుమహత్ప్రసహేమహి. 7

ప్ర. అ. సదా = ఎల్లప్పుడును, అస్మిన్ వనే = ఈ వనమునందు, చరతః = సంచరించుచున్న. మే = నాకు, అవిదితమ్ = తెలియనిది, కించిత్ = ఏదియు, న హి = లేదు కదా. సుమహత్ = చాలా పెద్ద దైన, చతురఙ్గమ్ = నాలుగు అంగములు గల, బలమ్ అపి = సేనను కూడ, ప్రసహేమహి = ఓర్వగలము.

తా. ఎల్లప్పుడు ఈ అరణ్యములో సంచరించుచున్న నాకు ఇక్కడ తెలియనిది ఏదీ లేదు. గొప్ప చతురంగబలము వచ్చినను మేము ఎదిరింప గలము.

మూ. లక్ష్మణస్తం తదోవాచ రక్ష్యమాణా స్త్వయానఘ,
నాత్ర భీతా వయం సర్వే ధర్మమేవానుపశ్యతా. 8

ప్ర. అ. తదా = అప్పుడు, లక్ష్మణః = లక్ష్మణుడు, తమ్ = ఆ గుహుని గూర్చి, ఉవాచ = పలికెను. అనఘ = దోషములు లేనివాడా, ధర్మమేవ = ధర్మమునే, అనుపశ్యతా = చూచుచున్న, త్వయా = నీచేత, రక్ష్యమాణాః = రక్షింపబడుచున్న, వయం సర్వే = మే మందరము, అత్ర = ఇక్కడ, న భీతాః = భయపడినవారము కాము.

తా. అప్పుడు లక్ష్మణుడు గుహునితో ఇట్లనెను. "దోషము లేని ఓ గుహుడా! ధర్మమునందు మాత్రమే శ్రద్ధ గల నీవు రక్షించుచుండగా ఇక్కడ మా కేమియు భయము లేదు".

కుమారుడు, అస్మిన్=అట్టి ఈ రాముడు, ప్రవ్రాజితే=ప్రవాసమునకు వెళ్ళగా, రాజా=రాజు, చిరమ్=చిరకాలము, న వర్తయిష్యతి = జీవించడు. నూనమ్= నిశ్చయముగా, మేదినీ భూమి, క్షిప్రమేవ = శీఘ్రముగా, విధవా = కర్తలేనిది, భవిష్యతి=కాగలదు.

తా. ఈ రాముడు, దశరథునకు తగిన ఉత్తముడైన పుత్రుడు. కుమారులలో ప్రధానుడు. మంత్రములచేతను, తపస్సుచేతను, అనేక విధములైన పరిశ్రమలచేతను, లభించినవాడు. అట్టి ఈ రాముడు, అరణ్యమునకు వెళ్ళిపోయిన పిమ్మట, రాజు చిరకాలము జీవించడు. కొద్ది కాలములో ఈ భూమి కర్త లేనిది అయిపోవును. తప్పదు. 11, 12

మూ. వినద్య సుమహానాదం శ్రమేణోపరతాః స్త్రియః,
నిర్ఘోషోపరతం చాతో మన్యే రాజనివేశనమ్. 13

ప్ర. అ. స్త్రియః=స్త్రీలు, సుమహానాదమ్=మిక్కిలి పెద్ద ధ్వని కలుగునట్లుగా, వినద్య=అరచి, శ్రమేణ=శ్రమచేత, ఉపరతాః=ఊరకొనియుందురు. అతః = ఆ కారణమువలన, రాజనివేశనమ్=రాజగృహమును. నిర్ఘోషోపరతమ్=ధ్వనినుండి విరమించిన దానినిగా, మన్యే = తలంచెదను.

తా. స్త్రీ లందరును, బిగ్గరగా అరచి, శ్రమ చెంది, ఈ సరికి ఊరకొని యుందురు. అందుచే రాజగృహమునందు ధ్వను లన్నియు అణగియుండు నని అనుకొనుచున్నాను. 13

మూ. కౌసల్యా చైవ రాజా చ తథైవ జననీ మమ,
నాశంసే యది జీవన్తి సర్వే తే శర్వరీమిమామ్. 14

ప్ర. అ. కౌసల్యా చైవ = కౌసల్యయు, రాజా చ = రాజు, తథైవ = మరియు, మమ జననీ = నా తల్లియు, తే సర్వే = వారందరు, ఇమామ్ = ఈ, శర్వరీమ్=రాత్రిని, యది జీవన్తి=జీవించెదరు అని, నాశంసే=ఎదురు చూడను.

తా. కౌసల్య, రాజు, మా తల్లి-వీ రందరు, ఈ రాత్రి జీవించి యుందెద రని నేను తలంచను. 14

మూ. శోచేదపి హి మే మాతా శత్రుఘ్నస్యాన్వవేక్షయా,
తద్దుఃఖం యత్తు కౌసల్యా వీరసూర్వినశిష్యతి. 15

ప్ర. అ. శత్రుఘ్నస్య = శత్రుఘ్నుని యొక్క, అన్వవేక్షయా = ఎదురు చూచుటచేత, మే మాతా = నా తల్లి, శోచేదపి హి = శోకించునేమో. వీరసూః = వీరుని కన్న, కౌసల్యా = కౌసల్య, యత్ వినశిష్యతి = మరణించు నని ఏది కలదో, తత్ = అదియే, దుఃఖమ్ = దుఃఖము.

తా. నా తల్లి శత్రుఘ్నునికొరకై, ఎదురుచూచుచు శోకించిన శోకించునేమో కాని వీరు డైన పుత్రుని కన్న కౌసల్య మరణించును అనునదే నాకు దుఃఖము కల్గించుచున్నది. 16

మూ. అనురక్తజనాకీర్ణా సుఖా లోకప్రియావహా,
రాజవ్యసనసంసృష్టా సా పురీ వినశిష్యతి. 16

ప్ర. అ. అనురక్తజనాకీర్ణా = అనురాగవంతు లైన జనులతో వ్యాప్త మైనది, సుఖా = సౌఖ్యమును కల్గించునది, లోకప్రియావహా = లోకమునకు ప్రియమును కల్గించునది, అయిన, సా పురీ = ఆ అయోధ్యాపట్టణము, రాజవ్యసనసంసృష్టా = రాజుమరణమువలన కలిగిన దుఃఖముతో కూడినదై, వినశిష్యతి = నశించగలదు.

తా. అనురాగవంతు లైన జనులతో నిండినది, సుఖకర మైనది, లోకమునకు ప్రియము అయిన ఆ అయోధ్యానగరము, ఇపుడు రాజవ్యసనముచే నశించి పోవును. 16

మూ. కథం పుత్రం మహాత్మానం జ్యేష్ఠం ప్రియమపశ్యతః,
శరీరం ధారయిష్యన్తి ప్రాణా రాజ్ఞో మహాత్మనః. 17

ప్ర. అ. మహాత్మానమ్ = మహాత్ముడు, జ్యేష్ఠమ్ = అందరికంటె పెద్దవాడు, ప్రియమ్ = ప్రియుడు, అయిన, పుత్రమ్ = కుమారుని, అపశ్యతః = చూడని, మహాత్మనః = మహాత్ము డైన, రాజ్ఞః = రాజుయొక్క, ప్రాణాః = ప్రాణములు, శరీరమ్ = శరీరమును, కథమ్ = ఎట్లు, ధారయిష్యన్తి

తా. మహాత్ముడు, ప్రియుడు అయిన, జ్యేష్ఠపుత్రుడు కనబడక, దూరముగా పోయిన ఆ మహాత్ముడైన రాజు ప్రాణములు శరీరములో ఎట్లు నిల్చును? 17

మూ. వినష్టే నృపతౌ పశ్చాత్కౌసల్యా వినశిష్యతి,
అనన్తరం చ మాతాఽపి మమ నాశముపైష్యతి. 18

ప్ర. అ. నృపతౌ = రాజు, వినష్టే = మరణించినవాడగుచుండగా, పశ్చాత్ = పిమ్మట, కౌసల్యా = కౌసల్య, వినశిష్యతి = మరణించగలదు. అనన్తరం చ = పిమ్మట, మమ మాతాఽపి = నా తల్లి కూడ, నాశమ్ = నాశనమును, ఉపైష్యతి = పొందగలదు.

తా. రాజు మరణించిన పిమ్మట కౌసల్య మరణించును. పిదప నా తల్లి కూడ, మరణించును. 18

మూ. అతిక్రాన్తమతిక్రాన్త మనవాప్య మనోరథమ్,
రాజ్యే రామమనిక్షిప్య పితా మే వినశిష్యతి. 19

ప్ర. అ. మే పితా = నా తండ్రి, అతిక్రాన్తమతిక్రాన్తమ్ = గడచుచు గడచుచు పోయిన, మనోరథమ్ = మనోరథమును, అనవాప్య = పొందక, రాజ్యే = రాజ్యమునందు, రామమ్ = రాముని, అనిక్షిప్య = ఉంచజాలక, వినశిష్యతి = నశించగలడు.

తా. తానెంత కాలమునుండియో అనుకొనుచు అనుకొనుచు ఉన్న మనోరథము తీరక, రాముని, రాజ్యాభిషిక్తుని చేయజాలక నా తండ్రి మరణించును.

మూ. సిద్ధార్థాః పితరం వృత్తం తస్మిన్కాలే హ్యుపస్థితే,
ప్రేతకార్యేషు సర్వేషు సంస్కరిష్యన్తి భూమిపమ్. 20

ప్ర. అ. తస్మిన్ = ఆ, కాలే = కాలము, హ్యుపస్థితే = వచ్చినదగుచుండగా, సిద్ధార్థాః = కృతార్థులైనవారు, వృత్తమ్ = మరణించిన, పితరమ్ = తండ్రియైన, భూమిపమ్ = రాజును, సర్వేషు = సమస్తమైన, ప్రేతకార్యేషు = ప్రేతకార్యములందు, సంస్కరిష్యన్తి = సంస్కరించగలరు.

తా. కాలము వచ్చి మరణించిన నా తండ్రి యైన రాజునకు భరతాదులు ప్రేతకార్యము లన్నియు చేసి సంస్కరించి కృతార్థులు కాగలరు. 20

మూ. రమ్యచత్వరసంస్థానాం సువిభక్తమహాపథామ్,
హర్మ్యప్రాసాదసంపన్నామ్ గణికావరశోభితామ్. 21
రథాశ్వగజసమ్బాధామ్ తూర్యనాదవినాదితామ్,
సర్వకల్యాణసంపూర్ణామ్ హృష్టపుష్టజనాకులామ్. 22
ఆరామోద్యానసంపన్నాం సమాజోత్సవశాలినీమ్
సుఖితా విచరిష్యన్తి రాజధానీం పితుర్మమ. 23

ప్ర. అ. రమ్యచత్వరసంస్థానామ్ = రమ్య మైన ముంగిళ్ల ఏర్పాటు కలది, సువిభక్తమహాపథామ్ = చక్కగా విభజింపబడిన విశాల మైన మార్గములు కలది, హర్మ్యప్రాసాదసంపన్నామ్ = ధనికుల గృహములతోను, రాజప్రాసాదములతోను కూడినది, గణికావరశోభితామ్ = శ్రేష్ఠ మైన వేశ్యలచే ప్రకాశింప చేయబడినది, రథాశ్వగజసంబాధామ్ = రథములతోను, అశ్వములతోను, గజములతోను ఇరుకుగా ఉన్నది, తూర్యనాదవినాదితామ్ = వాద్యధ్వనులచే ధ్వనింప చేయబడినది, సర్వకల్యాణసంపూర్ణామ్ = సమస్త మైన మంగళములతో నిండినది, హృష్టపుష్టజనాకులామ్ = సంతోషించి, బలిసి ఉన్న జనులతో నిండి ఉన్నది, ఆరామోద్యానసంపన్నామ్ = జనులు విహరించు ఆరామములతోను, రాజులు విహరించు ఉద్యానములతోను కూడినది, సమాజోత్సవశాలినీమ్ = జన సమాజములచే చేయబడు ఉత్సవములతో ప్రకాశించునది, అయిన, మమ పితుః = నా తండ్రియొక్క, రాజధానీమ్ = రాజధానిని, సుఖితాః = సుఖము కలవారు, విచరిష్యన్తి = సంచరించెదరు.

తా. నా తండ్రి రాజధాని యైన అయోధ్యలోని ముంగిళ్ళు అందముగా ఏర్పడి ఉండును. విశాల మైన మార్గములు, చక్కగా విభజింపబడి ఉండును. ఎన్నియో ధనికుల మేడలు, రాజులు నివసించు ప్రాసాదములు, దీనిని అలంకరించును. ఇది శ్రేష్ఠమైన వేశ్యలతో ప్రకాశించుచుండును. రథములతోను, అశ్వములతోను, గజములతోను, ఇరుకుగా నుండి, సమస్తకల్యాణములతో నిండిన ఈ పట్టణము నందు, వాద్యఘోషములు వ్యాపించుచుండును. జనులందరు సంతుష్టులై, ఆరోగ్యవంతులై ఉందురు. జనులు విహరించు ఆరామములు,

భామలు విహరించు ఉద్యానములు అచ్చటచ్చట ఉండును. జనులు సమూహములుగా చేరి అనేకవిధము లైన ఉత్సవములు చేసికొనుచుందురు. అట్టి ఈ నగరములో సుఖముగా కొందరు భాగ్యవంతులు సంచరించుచుందురు. 21, 22

మూ. అపి జీవేద్దశరథో వనవాసాత్పునర్వయమ్,
ప్రత్యాగమ్య మహాత్మానమపి పశ్యేమ సువ్రతమ్. 24

ప్ర. అ. దశరథః = దశరథుడు, అపి జీవేత్ = జీవించి యుండునా? వయమ్ = మేము, వనవాసాత్ = వనవాసమునుండి, ప్రత్యాగమ్య = తిరిగి వచ్చి, సువ్రతమ్ = ఉత్తమ మైన వ్రతములు గల, మహాత్మానమ్ = మహాత్ము డైన ఆ దశరథుని, పునః = మరల, అపి పశ్యేమ = చూడగల్గుదుమా.

తా. దశరథుడు జీవించునా? మేము వనవాసమునుండి తిరిగి వచ్చి ఉత్తమము లైన వ్రతములను పాలించు, ఆ మహాత్ముని మరల చూడగల్గెదమా. 24

మూ. అపి సత్యప్రతిజ్ఞేన సార్ధం కుశలినా వయమ్,
నివృత్తవనవాసేఽస్మిన్నయోధ్యాం ప్రవిశేమహి. 25

ప్ర. అ. అస్మిన్ = ఈ రాముడు, నివృత్తవనవాసే = పూర్తి యైన వనవాసము కలవా డగుచుండగా, కుశలినా = క్షేమముగా నున్న, సత్యప్రతిజ్ఞేన సార్ధం = సత్య మైన ప్రతిజ్ఞ గల ఆ దశరథునితో గూడ, వయమ్ = మేము, అయోధ్యామ్ = అయోధ్యను, అపి ప్రవిశేమహి = ప్రవేశించెదమా?

తా. రాముడు వనవాసము పూర్తి చేసికొనిన పిమ్మట, మే మందరము, క్షేమవంతు లై, తన ప్రతిజ్ఞను సత్యము చేసికొనిన దశరథునితో, అయోధ్యలో ప్రవేశింపగలమా? 26

మూ. పరిదేవయమానస్య దుఃఖార్తస్య మహాత్మనః,
తిష్ఠతో రాజపుత్రస్య శర్వరీ సాఽత్యవర్తత. 26

ప్ర. అ. మహాత్మనః = మహాత్ము డైన, దుఃఖార్తస్య = దుఃఖముచే పీడింపబడిన, రాజపుత్రస్య = లక్ష్మణుడు, పరిదేవయమానస్య = ఈ విధముగా దుఃఖాలాపములు చేయుచు, తిష్ఠతః = నిలిచియుండగానే, సా శర్వరీ = ఆ రాత్రి, అత్యవర్తత = గడచిపోయెను.

తా. మహాత్ముడైన ఆ లక్ష్మణుడు, దుఃఖార్తుడై, ఈ విధముగా విలాపములు చేయుచు, నిలబడి ఉండగానే రాత్రి గడచి పోయినది. 26

మూ॥ తథాహి సత్యం బ్రువతి ప్రజాహితే
నరేంద్రపుత్రే గురుసౌహృదాద్గుహః,
ముమోచ బాష్పం వ్యసనాభిపీడితో
జ్వరాతురో నాగ ఇవ వ్యథాతురః. 27

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
ఏకపంచాశః సర్గః.

ప్ర. అ. ప్రజాహితే = ప్రజలకు హితుడైన, నరేంద్రపుత్రే = రాజకుమారుడైన లక్ష్మణుడు, గురుసౌహృదాత్ = పెద్దలయందు ప్రేమవలన, తథా = ఆ విధముగా, సత్యమ్ = సత్యమును, బ్రువతి = పలుకుచుండగా, గుహః = గుహుడు, వ్యథాతురః = మనోవ్యథతో వ్యాకులుడై, వ్యసనాభిపీడితః = దుఃఖముచే పీడింపబడినవాడై, జ్వరాతురః = జ్వరముచే బాధపడుచున్న, నాగః ఇవ = ఏనుగువలె, బాష్పమ్ = కన్నీటిని, ముమోచ = విడచెను.

తా. ప్రజలకు హితుడైన లక్ష్మణుడు, పెద్దలయందు ప్రేమతో పలికిన, సత్యమైన ఆ మాటలు విని, గుహుడు, దుఃఖముచే పీడితుడై, మనోవ్యథతో బాధపడుచు జ్వరముతో బాధపడుచున్న ఏనుగ వలె కన్నీటిని విడిచెను. 27

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదియొకటవ సర్గ సమాప్తము.

## అథ ద్విపఞ్చాశః సర్గః

[రాముని ఆజ్ఞచే గుహుడు నావను తెప్పించుట. రాముడు సుమంత్రుని ఓదార్చి అయోధ్యకు పోవ ననుమతించుట, తల్లిదండ్రులు మున్నగువారికై రాముడు సందేశమును వినిపించుట, సుమంత్రుడు తాను వనమునకే వత్తునని పట్టుబట్టగా రాముడు అతనిని యుక్తితో మరలిపోవుట కొడంబరచుట.- తిరిగి ముగ్గురును నావలో కూర్చుండుట, సీత గంగను ప్రార్థించుట, రామాదులు నావచే గంగను దాటి వత్స దేశము చేరుట. సాయంకాల మొక చెట్టు క్రింద నిలుచుటకై పోవుట.]

మూ. ప్రభాతాయాం తు శర్వర్యాం పృథువక్షా మహాయశాః,
ఉవాచ రామః సౌమిత్రిం లక్ష్మణం శుభలక్షణమ్. 1

ప్ర. అ. శర్వర్యామ్ = రాత్రి, ప్రభాతాయాం తు = తెల్లవారిన దగు చుండగా, పృథువక్షాః = విశాల మైన వక్షఃస్థలము కలవాడు, మహాయశాః = గొప్ప కీర్తి గలవాడు అయిన, రామః = రాముడు, శుభలక్షణమ్ = శుభ మైన లక్షణములు గల, సౌమిత్రిమ్ = సుమిత్రాకుమారు డైన, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాత్రి తెల్లవారిన పిమ్మట, విశాల మైన వక్షఃస్థలము కలవాడు, మహాయశస్వి యైన రాముడు, ఉత్తమలక్షణములు గల ఆ లక్ష్మణునితో ఇట్లు పలికెను. 1

మూ. భాస్కరోదయకాలోఽయం గతా భగవతీ నిశా,
అసౌ సుకృష్ణో విహగః కోకిలస్తాత కూజతి. 2

ప్ర. అ. తాత = ఓ తండ్రీ, అయమ్ = ఇది, భాస్కరోదయకాలః = సూర్యోదయసమయము. భగవతీ = పూజ్యురా లైన, నిశా = రాత్రి, గతా =

గడచినది, సుకృష్ణః = చాలా నల్లని, విహగః = పక్షి యైన, అసౌ కోకిలః = ఈ కోకిల, కూజతి = కూయుచున్నది.

తా. నాయనా! పూజ్యురాలైన రాత్రి గడచినది. సూర్యోదయసమయము ఆసన్నమైనది. చాలా నల్లని పక్షి యైన ఈ కోకిల కూయుచున్నది. 2

మూ. బర్హిణానాం చ నిర్ఘోషః శ్రూయతే నదతాం వనే,
తరామ జాహ్నవీం సౌమ్య శీఘ్రగాం సాగరంగమామ్. 3

ప్ర. అ. వనే = వనమునందు, నదతామ్ = ధ్వని చేయుచున్న, బర్హిణానామ్ = నెమళ్ళ యొక్క, నిర్ఘోషః = ధ్వని, శ్రూయతే = వినబడుచున్నది. సౌమ్య = ఓ సౌమ్యుడా, శీఘ్రగామ్ = శీఘ్రముగా ప్రవహించునది, సాగరంగమామ్ = సముద్రమును చేరునది అయిన, జాహ్నవీమ్ = గంగానదిని, తరామ = దాటెదము.

తా. వనములో నెమళ్ళు కూయుచున్న ధ్వని కూడ వినబడుచున్నది. ఓ సౌమ్యుడా! శీఘ్రముగా ప్రవహించునది, సాగరమును చేరునది యైన గంగా నదిని దాటెదము. 3

మూ. విజ్ఞాయ రామస్య వచః సౌమిత్రిర్మిత్రనన్దనః,
గుహమామన్త్ర్య సూతం చ సోఽతిష్ఠద్భ్రాతురగ్రతః. 4

ప్ర. అ. మిత్రనన్దనః = మిత్రులకు ఆనందకరుడైన, సః సౌమిత్రిః = ఆ లక్ష్మణుడు, రామస్య = రాముని యొక్క, వచః = వాక్యమును, విజ్ఞాయ = తెలుసుకొని, గుహమ్ = గుహుని, సూతం చ = సుమంత్రుని, ఆమన్త్ర్య = పిలిచి, భ్రాతుః = సోదరుని యొక్క, అగ్రతః = ఎదుట, అతిష్ఠత్ = నిలచెను.

తా. మిత్రులకు ఆనందము కలిగించు ఆ లక్ష్మణుడు, రాముని మాట విని, గుహుని, సుమంత్రుని పిలిచి, వారికి ఆ విషయము చెప్పి రాముని ఎదుట నిలచెను. 4

మూ. స తు రామస్య వచనం నిశమ్య ప్రతిగృహ్య చ,
స్థపతి స్తూర్ణమాహూయ సచివానిద| 5

ప్ర. అ. సః స్థపతిః = ఆ గుహుడు, రామస్య = రామునియొక్క, వచనమ్ = వచనమును, నిశమ్య = విని, ప్రతిగృహ్య చ = స్వీకరించి, తూర్ణమ్ = శీఘ్రముగా, సచివాన్ = మంత్రులను, ఆహూయ = పిలిచి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. గుహుడు రాముని మాట విని, దాని ప్రకారము, వెంటనే తన మంత్రులను పిలిచి, ఇట్లు చెప్పెను. 5

మూ. అస్య వాహనసంయుక్తాం కర్ణగ్రాహవతీం శుభామ్,
సుప్రతారాం దృఢాం తీర్థే శీఘ్రం నావముపాహర. 6

ప్ర. అ. వాహనసంయుక్తామ్ = నడపేవారితో కూడినది, కర్ణగ్రాహవతీమ్ = చుక్కాని పట్టువాడు కలది, శుభామ్ = అందమైనది, సుప్రతారామ్ = అనాయాసముగా దాటించునది, దృఢామ్ = దృఢము అయిన, నావమ్ = నావను, శీఘ్రమ్ = శీఘ్రముగా, అస్య = ఈ రాముని నిమిత్తమై, తీర్థే = రేవులోనికి, ఉపాహర = తీసుకొని రమ్ము.

తా. సులభముగా దాటుటకు వీలైనది, దృఢమైనది, సమర్థులైన నడుపువారూ, చుక్కాని పట్టువారూ ఉన్నది, అయిన అందమైన నావను రాముని కొరకు శీఘ్రముగా రేవులోనికి తీసుకొని రమ్ము. 6

మూ. తం నిశమ్య సమాదేశం గుహామాత్యగణో మహాన్,
ఉపోహ్య రుచిరాం నావం గుహాయ ప్రత్యవేదయత్. 7

ప్ర. అ. మహాన్ = పెద్దదైన, గుహామాత్యగణః = గుహుని అమాత్య సముదాయము, తమ్ = ఆ, సమాదేశమ్ = ఆజ్ఞను, నిశమ్య = విని, రుచిరామ్ = అందమైన, నావమ్ = నావను, ఉపోహ్య = తెచ్చి, గుహాయ = గుహునకు, ప్రత్యవేదయత్ = తెలిపెను.

తా. గుహుని అమాత్యులు, అతని ఆజ్ఞ విని, ఒక అందమైన నావను తీసుకొని వచ్చి, ఆ విషయమును గుహునకు తెలిపిరి. 7

మూ. తతః సప్రాఞ్జలిర్భూత్వా గుహో రాఘవమబ్రవీత్,
ఉపస్థితేయం నౌర్దేవ భూయః కిం కరవాణి తే. 8

ప్ర. అ. తతః = పిమ్మట, సః గుహః = ఆ గుహుడు, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలవాడు, భూత్వా = అయి, రాఘవమ్ = రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను. దేవః = ఓ రాజా! ఇయమ్ = ఈ, నౌః = నావ, ఉపస్థితా = వచ్చినది; తే = నీకు, భూయః = మరల, కిమ్ = ఏమి, కరవాణి = చేయుదును.

తా. అపుడు గుహుడు చేతులు మోడ్చి నమస్కరించుచు, రామునితో ఇట్లనెను— 'ఓ ప్రభూ! ఇదిగో నావ వచ్చినది. ఇంక నీ కేమి చేయుదును!" 8

మూ. తవామరసుతప్రఖ్య తర్తుం సాగరగాం నదీమ్,
నౌరియం పురుషవ్యాఘ్ర! తాం త్వమారోహ సువ్రత! 9

ప్ర. అ. పురుషవ్యాఘ్ర = పురుషులలో శ్రేష్ఠుడా! అమరసుతప్రఖ్య = దేవతాపుత్రులతో సమానుడ వైన ఓ రామా! సాగరగామ్ = సాగరములోనికి ప్రవహించుచున్న, నదీమ్ = నదిని, తర్తుమ్ = దాటుటకు, తవ = నీకు, ఇయమ్ = ఈ, నౌః = నావ వచ్చినది. సువ్రత = మంచి నియమము కలవాడా! త్వమ్ = నీవు, తామ్ = దానిని, ఆరోహ = ఎక్కుము.

తా. దేవతాపుత్రులతో సమానుడవు, పురుషశ్రేష్ఠుడవు అయిన ఓ రామా! సముద్రములోనికి ప్రవహించు, ఈ గంగానది దాటుటకై, నీకు నావ సిద్ధముగా ఉన్నది. ఉత్తమమైన వ్రతములు గల ఓ రామా! నీవు ఈ నావ నెక్కుము. 9

మూ. అథోవాచ మహాతేజా రామో గుహమిదం వచః,
కృతకామోఽస్మి భవతా శీఘ్రమారోప్యతామితి. 10

ప్ర. అ. అథ = అటుపిమ్మట, మహాతేజాః = గొప్ప తేజస్సు గల, రామః = రాముడు, గుహమ్ = గుహుని గూర్చి, ఇదమ్ = ఈ, వచః = వాక్యమును, ఉవాచ = పలికెను. భవతా = నీచేత, కృతకామః = చేయబడిన ఇష్టమైన కార్యము కలవాడను, అస్మి = అయితిని. శీఘ్రమ్ = శీఘ్రముగా, ఆరోప్యతామ్ = ఎక్కించబడుదుగాక.

తా. అపుడు మహాతేజశ్శాలి యైన రాముడు గుహునితో "నేను కోరిన విధముగా చేసితివి. మమ్ములను నావ ఎక్కించుము" అని పలికెను. 10

మూ. తతః కలాపాన్ సంనహ్య ఖడ్గౌ బద్ధ్వా చ ధన్వినౌ,
జగ్మతుర్యేన తౌ గంగాం సీతయా సహ రాఘవౌ. 11

ప్ర. అ. తతః=అటుపిమ్మట, తౌ రాఘవౌ=ఆ రామలక్ష్మణులు, సీతయా సహ=సీతతో కూడ, కలాపాన్=అంబులపొదులను, సంనహ్య=కట్టుకొని, ఖడ్గౌ చ=ఖడ్గములను కూడ, బద్ధ్వా=కట్టుకొని, ధన్వినౌ=ధనుర్ధరులై, యేన=ఏ మార్గము చేత, గఙ్గామ్=గంగను గూర్చి వెళ్ళవలెనో ఆ మార్గముచే, జగ్మతుః=వెళ్ళిరి.

తా. పిమ్మట ఆ రామలక్ష్మణులు, అంబుల పొదులను, ఖడ్గములను కట్టుకొని, ధనుర్ధారులై, సీతతో కూడ గంగ వైపు వెళ్ళిరి. 11

మూ. రామమేవ తు ధర్మజ్ఞముపగమ్య వినీతవత్,
కిమహం కరవాణీతి సూతః ప్రాఞ్జలి రబ్రవీత్. 12

ప్ర. అ. సూతః=సుమంత్రుడు, ప్రాఞ్జలిః=కట్టబడిన దోసిలి కలవాడై, వినీతవత్=సవినయముగా, ధర్మజ్ఞమ్=ధర్మజ్ఞు డైన, రామమేవ తు=రామునే, ఉపగమ్య=సమీపించి, అహమ్=నేను, కిమ్=ఏమి, కరవాణి=చేయుదును, ఇతి=అని, అబ్రవీత్=పలికెను.

తా. సుమంత్రుడు చేతులు మోడ్చి సవినయముగా ధర్మవేత్త యైన రాముని వద్దకు వెళ్ళి, 'ఇపుడు నే నేమి చేయవలెను' అని అడిగెను. 12

మూ. తతోఽబ్రవీద్దాశరథిః సుమన్త్రం
స్పృశన్ కరేణోత్తమదక్షిణేన,
సుమన్త్ర శీఘ్రం పునరేవ యాహి
రాజ్ఞః సకాశే భవ చాప్రమత్తః. 13

ప్ర. అ. తతః=అటు పిమ్మట, దాశరథిః=రాముడు, సుమన్త్రమ్=సుమంత్రుని, ఉత్తమదక్షిణేన=ఉత్తమమూ, కుడిదీ అయిన, కరేణ=కరముతో, స్పృశన్=స్పృశించుచు, అబ్రవీత్=పలికెను. సుమన్త్ర=ఓ సుమంత్రా! పునరేవ=మరల, శీఘ్రమ్=శీఘ్రముగా, యాహి=వెళ్ళుము. రాజ్ఞః=రాజాయొక్క, సకాశే=సమీపమున, అప్రమత్తః చ=ఏమరుపాటు లేనివార వై, భవ=ఉండుము.

తా. ఆ మాట విని రాముడు సుమంత్రుని ఉత్తమమైన కుడిచేతితో స్పృశించుచు, ఇట్లు పలికెను. "ఓ సుమంత్రా! అయోధ్యకు తిరిగి వెళ్ళి రాజు విషయమున ఏమరిపాటు లేక ఆయనను చూచుకొనుచుండుము". 13

మూ. నివర్తస్వేత్యువాచైవ హ్యేతావద్ధి కృతం మమ,
రథం విహాయ పద్భ్యాం తు గమిష్యామి మహావనమ్.

ప్ర. అ. మమ=నాకు, ఏతావత్=ఇంత సాహాయ్యము, కృతం హి=చేయబడినది కదా. నివర్తస్వ=నీవు మరలి వెళ్ళుము. రథమ్=రథమును, విహాయ=విడచి, పద్భ్యామ్=పాదములతోనే, మహావనమ్=మహావనమును గూర్చి, గమిష్యామి=వెళ్లగలను. ఇతి=ఇట్లు, ఉవాచ=పలికెను.

తా. "నా కింత సాహాయ్యము చేసినావు కదా! ఇంక రథమును విడచి కాలినడకచే అరణ్యమునకు వెళ్ళెదను. నీవు మరలి వెళ్లుము" అని పలికెను. 14

మూ. ఆత్మానం త్వభ్యనుజ్ఞాతమవేక్ష్యార్తః స సారథిః,
సుమన్త్రః పురుషవ్యాఘ్రమైక్ష్వాకమిదమబ్రవీత్. 15

ప్ర. అ. సారథిః=సారథి యైన, సః సుమన్త్రః=ఆ సుమంత్రుడు, ఆత్మానమ్=తనను, అభ్యనుజ్ఞాతమ్=అనుజ్ఞ ఇవ్వబడినవానినిగా, అవేక్ష్య=చూచి, ఆర్తః=దుఃఖితుడై, పురుషవ్యాఘ్రమ్=పురుషశ్రేష్ఠుడైన, ఐక్ష్వాకమ్=రాముని గూర్చి, ఇదమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. వెనుకకు మరలి పోవుటకై రాముడు తనకు అనుజ్ఞ ఇచ్చినట్లు తెలిసికొని సుమంత్రుడు, పురుషశ్రేష్ఠుడైన ఆ రామునితో ఇట్లనెను. 15

మూ. నాతిక్రాన్తమిదం లోకే పురుషేణేహ కేనచిత్,
తవ సభ్రాతృభార్యస్య వాసః ప్రాకృతవద్వనే. 16

ప్ర. అ. సభ్రాతృభార్యస్య=సోదరునితోను, భార్యతోను కూడిన, తవ=నీకు, ప్రాకృతవత్=సామాన్యజనునికి వలె, వనే=వనమునందు, వాసః=నివాసము వచ్చినది. ఇదమ్=ఇది, ఇహ లోకే=ఈ లోకమునందు, కేనచిత్ పురుషేణ=ఏ పురుషునిచేతను కూడ, నాతిక్రాన్తమ్=అతిక్రమింపబడలేదు.

తా. నీవు సోదరునితోను భార్యతోను కలసి సామాన్యజనుడు వలె అర ణ్యములో నివసింప నున్నావు. దీనిని ఈ లోకములో ఏ ఒక్కరును అతిక్ర మింపజాలరు. అనగా ఇట్టి పని ఏ ఒక్కరును చేయజాలరు. 16

మూ. న మన్యే బ్రహ్మచర్యేఽస్తి స్వధీతే వా ఫలోదయః,
మార్దవార్జవయోర్వాపి త్వాం చేద్వ్యసనమాగతమ్. 17

ప్ర. అ. త్వామ్=నిన్ను, వ్యసనమ్ = దుఃఖము, ఆగతం చేత్ = పొంది నట్లైతే, బ్రహ్మచర్యే=బ్రహ్మచర్యమునందు గాని, స్వధీతే వా = చక్కగా వేదా ధ్యయనము చేయుటయందు గాని, మార్దవార్జవయోర్వాపి = మృదుత్వమునందు గాని, ఋజుత్వమునందు గాని, ఫలోదయః = ఫలలాభము, నాస్తి = లేదు అని, మన్యే=తలచుచున్నాను.

తా. నీకే ఇట్టి కష్టము వచ్చుట చూడగా బ్రహ్మచర్యానికి గాని, వేదా ధ్యయనమునకు గాని, మృదుత్వమునకు గాని, ఋజుత్వమునకు గాని, ఫలమే లేదని తోచుచున్నది. 17

మూ. సహ రాఘవ వైదేహ్యా భ్రాత్రా చైవ వనే వసన్,
త్వం గతిం ప్రాప్స్యసే వీర! త్రీన్ లోకాంస్తు జయన్నివ.

ప్ర. అ. వీర=వీరుడవైన, రాఘవ=ఓ రామా, త్వమ్=నీవు, వైదేహ్యా సహ=సీతతోను, భ్రాత్రా చైవ=సోదరునితోను, వనే=వనమునందు, వసన్ = నివసించుచు, త్రీన్ = మూడు, లోకాన్ = లోకములను, జయన్నివ = జయించు చున్నవాడవు వలె, గతిమ్=సద్గతిని, ప్రాప్స్యసే=పొందగలవు.

తా. వీరుడవైన ఓ రామా! సీతతోను, సోదరునితోను, వనములో నివ సించుచు, నీవు మూడు లోకములను జయించినట్లు సద్గతిని పొందగలవు. 18

మూ. వయం ఖలు హతా రామ! యే త్వయాప్యుపవఞ్చితాః,
కైకేయ్యా వశమేష్యామః పాపాయా దుఃఖభాగినః. 19

ప్ర. అ. రామ=ఓ రామా! వయమ్ = మేము, హతాః ఖలు=కొట్టబడిన వారముకదా! యే=ఏ మేము, త్వయాపి=నీచేత కూడ, ఉపవఞ్చితాః=వంచింప బడినవారమై (విడువబడినవారమై), దుఃఖభాగినః=దుఃఖమును అనుభవించుచు,

పాపాయాః=పాపాత్మురా లైన, కైకేయ్యాః=కైకేయియొక్క, వశమ్=వశమును, ఏష్యామః=పొందగలమో.

తా. ఓ రామా! మేమే చాలా దురదృష్టవంతులము. ఎందుచేతననగా నీకు దూరమై దుఃఖించుచు, పాపాత్మురా లైన, కైకేయికి వశులమై ఉండవలసి యున్నది. 19

మూ. ఇతి బ్రువన్నాత్మసమం సుమన్త్రః సారథిస్తదా,
దృష్ట్వా దూరగతం రామం దుఃఖార్తో రురుదే చిరమ్.20

ప్ర. అ. తదా=అపుడు, సారథిః=సారథి యైన, సుమన్త్రః=సుమంత్రుడు, ఇతి=ఇట్లు, బ్రువన్=పలుకుచు, దూరగతమ్=దూరముగా వెళ్ళిన, ఆత్మసమమ్=తన ప్రాణములతో సమాను డైన, రామమ్=రాముని, దృష్ట్వా=చూచి, దుఃఖార్తః=దుఃఖముచే పీడింపబడినవాడై, చిరమ్=చిరకాలము, రురుదే=ఏడ్చెను.

తా. సుమంత్రుడు ఈ విధముగా పలుకుచు, తనకు ప్రాణతుల్యు డైన రాముడు దూరముగా వెళ్ళుట చూచి, దుఃఖార్తుడై చాలసేపు ఏడ్చెను. 20

మూ. తతస్తు విగతే బాష్పే సూతం స్పృష్టోదకం శుచిమ్,
రామస్తు మధురం వాక్యం పునః పునరువాచ తమ్. 21

ప్ర. అ. తతః=అటుపిమ్మట, బాష్పే=కన్నీరు, విగతే=తొలగినదగుచుండగా, స్పృష్టోదకమ్=ఆచమనము చేసిన, శుచిమ్=పరిశుద్ధు డైన, తం సూతమ్=ఆ సారథిని గూర్చి, రామస్తు=రాముడు, పునః పునః=మాటి మాటికి, మధురమ్=మధుర మైన, వాక్యమ్=వాక్యమును, ఉవాచ=పలికెను.

తా. కన్నీరు తగ్గిన పిమ్మట, ఆచమనము చేసి పరిశుద్ధు డై ఉన్న ఆ సూతునితో, రాముడు, మధురముగా మాటిమాటికిని ఇట్లు పలికెను. 21

మూ. ఇక్ష్వాకూణాం త్వయా తుల్యం సుహృదం నోపలక్షయే,
యథా దశరథో రాజా మాం న శోచేత్ తథా కురు. 22

ప్ర. అ. ఇక్ష్వాకూణామ్=ఇక్ష్వాకురాజులకు, త్వయా=నీతో, తుల్యమ్=సమాను డైన, సుహృదమ్=స్నేహితుని, నోపలక్షయే=చూడను. రాజా=రాజైన,

దశరథః = దశరథుడు, మామ్ = నన్ను గూర్చి, యథా = ఎట్లు, న శోచేత్ = దుఃఖించడో, తథా = అట్లు, కురు = చేయుము.

తా. ఇక్ష్వాకువంశమువారికి నీవంటి మిత్రు డెవ్వడును లేడు. దశరథ మహారాజు, నన్ను గూర్చి విచారించకుండు నట్లు చేయుము. 22

మూ. శోకోపహతచేతాశ్చ వృద్ధశ్చ జగతీపతిః,
కామభారావసన్నశ్చ తస్మాదేతద్బ్రవీమి తే. 23

ప్ర. అ. జగతీపతిః = రాజు, శోకోపహతచేతాశ్చ = శోకముచే కొట్టబడిన చిత్తము కలవాడు. వృద్ధశ్చ = వృద్ధుడు. కామభారావసన్నశ్చ = కామముయొక్క భారముచే పీడితుడు. తస్మాత్ = ఆ కారణము వలన, తే = నీకు, ఏతత్ = దీనిని, బ్రవీమి = చెప్పుచున్నాను.

తా. రాజు మనస్సు శోకావేశముచే పీడింపబడి యున్నది. ఆతడు వృద్ధుడు. కామభారముచే క్రుంగిపోయినవాడు. అందువలననే ఇట్లు చెప్పుచున్నాను. 23

మూ. యద్యదాజ్ఞాపయేత్కించిత్స మహాత్మా మహీపతిః,
కైకేయ్యాః ప్రియకామార్థం కార్యం తదవికాఙ్క్షయా. 24

ప్ర. అ. మహాత్మా = మహాత్ముడైన, సః = ఆ, మహీపతిః = రాజు, యద్యత్ = ఏ యే, కించిత్ = ఒకానొక కార్యమును, కైకేయ్యాః = కైకేయి యొక్క, ప్రియకామార్థమ్ = ఇష్టమైన కోరికను తీర్చుటకై, ఆజ్ఞాపయేత్ = ఆజ్ఞాపించునో, తత్ = అది, అవికాఙ్క్షయా = సందేహము లేకుండగ, కార్యమ్ = చేయదగినది.

తా. కైకేయికి ఇష్టమైన కోరికను తీర్చుటకై మహాత్ముడైన ఆ రాజు ఏమేమి ఆజ్ఞాపించినను, దానిని నిస్సంశయముగా చేయుచుండ వలయును. 24

మూ. ఏతదర్థం హి రాజ్యాని ప్రశాసతి నరేశ్వరాః,
యదేషాం సర్వకృత్యేషు మనో న ప్రతిహన్యతే. 25

ప్ర. అ. ఏషామ్ = ఈ రాజులయొక్క, మనః = మనస్సు, సర్వకృత్యేషు = అన్నికృత్యములందు, యత్ న ప్రతిహన్యతే = కొట్టబడదు అనునది ఏది కలదో,

ఏతదర్థమ్=దీని కొరకే, నరేశ్వరాః=రాజులు, రాజ్యాని=రాజ్యములను, ప్రశాసతి హి=పరిపాలించుచున్నారు కదా।

తా. రాజులు రాజ్యములను పరిపాలించుచున్నా రనగా, అన్ని కార్యము లందును వారి ఆజ్ఞ అప్రతిహతముగా ఉండుటకే కదా. 25

మూ. యద్యథా స మహారాజో నాలీకమధిగచ్ఛతి,
న చ తామ్యతి దుఃఖేన సుమన్త్ర కురు తత్తథా. 26

ప్ర. అ. సుమన్త్ర=ఓ సుమంత్రుడా, సః మహారాజః=ఆ మహారాజు, యత్=దేనిని, యథా=ఎట్లు, అలీకమ్=అసత్యమునుగా, నాధిగచ్ఛతి=భావించడో, దుఃఖేన=దుఃఖముచేత, న చ తామ్యతి=పీడితుడు కాడో, తత్=దానిని, తథా=అట్లు, కురు=చేయుము.

తా. సుమంత్రా! ఆ మహారాజు, తాను ఆజ్ఞాపించినది, వ్యర్థ మైనదే అని అనుకొనకుండు నట్లును, దుఃఖముతో బాధపడకుండు నట్లును చేయుచుండుము.

మూ. అదృష్టదుఃఖం రాజానం వృద్ధమార్యం జితేన్ద్రియమ్,
బ్రూయాస్త్వమభివాద్యైవ మమ హేతోరిదం వచః 27

ప్ర. అ. అదృష్టదుఃఖమ్=చూడబడని దుఃఖములు కలవాడు, వృద్ధమ్=వృద్ధుడు, ఆర్యమ్=పూజ్యుడు, జితేంద్రియమ్=జయింపబడిన ఇంద్రియములు కలవాడు అయిన, రాజానమ్=రాజును, మమ హేతోః=నాకొరకై, (నా పక్షమున) అభివాద్యైవ=నమస్కరించి, ఇదమ్=ఈ, వచః=వాక్యమును, త్వమ్=నీవు, బ్రూయాః=చెప్పుము.

తా. నీవు పూర్వ మెన్నడును ఇట్టి దుఃఖము చూడని వాడు, వృద్ధుడు, పూజ్యుడు, జితేంద్రియుడు అయిన రాజును, నా పక్షమున నమస్కరించి నా మాటగా ఇట్లు చెప్పుము. 27

మూ. నైవాహమనుశోచామి లక్ష్మణో న చ మైథిలీ,
అయోధ్యాయాశ్చ్యుతాశ్చేతి వనే వత్స్యామహేతి చ. 28

ప్ర. అ. అయోధ్యాయాః=అయోధ్యనుండి, చ్యుతాశ్చేతి=జారిపోయినాము అని, వనే=వనమునందు, వత్స్యామహేతి చ=నివసింపగలము అని,

అహమ్=నేను, నైవ అనుశోచామి = దుఃఖించుటలేదు. లక్ష్మణః = లక్ష్మణుడు, మైథిలీ చ=సీతయు, న=దుఃఖించుటలేదు.

తా. అయోధ్యను విడచి అరణ్యములో నివసించవలసి వచ్చినదే అని నేను గాని, లక్ష్మణుడు గాని, సీత గాని, ఏ మాత్రము దుఃఖించుటలేదు. 28

మూ. చతుర్దశసు వర్షేషు నివృత్తేషు పునః పునః,
లక్ష్మణం మాం చ సీతాం చ ద్రక్ష్యసే శీఘ్రమాగతాన్.

ప్ర. అ. చతుర్దశసు = పదునాలుగు, వర్షేషు = సంవత్సరములు, నివృత్తేషు = గడచిన వగుచుండగా, శీఘ్రమ్=శీఘ్రముగా, ఆగతాన్ = వచ్చిన, లక్ష్మణమ్=లక్ష్మణుని, మాం చ = నన్ను, సీతాం చ = సీతను, పునః పునః= మాటిమాటికి, ద్రక్ష్యసి=చూడగలవు.

తా. పదునాలుగు సంవత్సరములు గడచిన పిమ్మట. లక్ష్మణుడు. నేను, సీత, తిరిగి వచ్చెదము. అపుడు నీవు, మమ్ములను నిత్యము చూచుచుండ వచ్చును. 29

మూ. ఏవముక్త్వా తు రాజానం మాతరం చ సుమన్త్ర మే,
అన్యాశ్చ దేవీస్సహితాః కైకేయీం చ పునః పునః. 30
ఆరోగ్యం బ్రూహి కౌసల్యామథ పాదాభివన్దనమ్,
సీతాయా మమ చార్యస్య వచనాల్లక్ష్మణస్య చ. 31

ప్ర. అ. రాజానమ్=రాజును గూర్చి, ఏవమ్=ఈ విధముగా, ఉక్త్వా = పలికి, సుమన్త్ర = ఓ సుమంత్రా, మే మాతరం చ = నా తల్లిని, సహితాః = సమస్తమైన, అన్యాః=ఇతర మైన, దేవీశ్చ=రాజభార్యలను, కైకేయీం చ= కైకేయిని, పునః పునః=మాటి మాటికి, ఆరోగ్యమ్ = ఆరోగ్యమును, బ్రూహి= చెప్పుము. అథ = అటుపిమ్మట, సీతాయాః = సీతయొక్కయు, మమ చ = నాయొక్కయు, ఆర్యస్య = పూజ్యుడైన, లక్ష్మణస్య చ=లక్ష్మణుని యొక్కయు, పాదాభివన్దనమ్ = పాదాభివందనమును, కౌసల్యామ్ = కౌసల్యను గూర్చి (చెప్పుము).

తా. ఓ సుమంత్రా! రాజుతో ఇట్లు చెప్పి, మా తల్లిని. సమస్తమైన ఇతర రాజభార్యలను, కైకేయిని, మేము మరల మరల ఆరోగ్యమును గూర్చి

ప్రశ్నించి నట్లు చెప్పి, పిదప కౌసల్యకు నేను, లక్ష్మణుడు, సీత, పాదాభివంద
నము చేసి నట్లు తెలుపుము. ౩౦, ౩౧

మూ. బ్రూయాశ్చ హి మహారాజం భరతం క్షిప్ర మానయ,
ఆగతశ్చాపి భరత: స్థాప్యో నృపమతే పదే. ౩౨

ప్ర. అ. మహారాజం చ = మహారాజును గూర్చి కూడ, బ్రూయా: = మా పాదాభివందనము చెప్పుము. భరతమ్ = భరతుని, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఆనయ = తీసుకొనిరమ్ము. ఆగతశ్చాపి = వచ్చిన, భరత: = భరతుడు, నృపమతే = రాజునకు ఇష్ట మైన, పదే = పదమునందు, స్థాప్య: = స్థాపింపదగినవాడు.

తా. మేము పాదాభివందనము చేసి నట్లు మహారాజుకు కూడ చెప్పుము. భరతుని శీఘ్రముగా తీసుకొనిరమ్ము. వచ్చిన ఆ భరతుని రాజుకు సమ్మత మైన రాజ్యాధికారమునందు స్థాపింపుము. ౩౨

మూ. భరతం చ పరిష్వజ్య యౌవరాజ్యేఽభిషిచ్య చ,
అస్మత్సంతాపజం దుఃఖం న త్వామభిభవిష్యతి. ౩౩

ప్ర. అ. భరతమ్ = భరతుని, పరిష్వజ్య = కౌగలించుకొని, యౌవరాజ్యే = యౌవరాజ్యమునందు, అభిషిచ్య చ = అభిషేకించి, అస్మత్సంతాపజమ్ = మా కష్టమువలన కలిగిన, దుఃఖమ్ = దుఃఖము, త్వామ్ = నిన్ను, న అభిభవిష్యతి = ఆక్రమించదు.

తా. భరతుని కౌగలించుకొని, ఆతని యౌవరాజ్యమునందు అభిషిక్తుని చేసిన పిదప, నీకు మా కష్టములవలన కల్గిన దుఃఖము ఉండదు. ౩౩

మూ. భరతశ్చాపి వక్తవ్యో యథా రాజని వర్తసే,
తథా మాతృషు వర్తేథా: సర్వాస్వేవావిశేషత:. ౩౪

ప్ర. అ. భరతశ్చాపి = భరతుడు కూడ, వక్తవ్య: = ఇట్లు చెప్పదగినవాడు. రాజని = రాజు విషయములో, యథా = ఏ విధముగా, వర్తసే = ప్రవర్తించుచున్నావో, సర్వాస్వేవ = సమస్త మైన, మాతృషు = తల్లుల విషయమున, తథా = అట్లే, అవిశేషత: = భేదబుద్ధి లేక, వర్తేథా: = ప్రవర్తింపుము.

తా. భరతునితో ఇట్లు చెప్పవలెను. రాజు విషయములో ఎట్లు ప్రవర్తించుచుందువో, అందరు తల్లుల విషయములో కూడ ఎట్టి భేదబుద్ధియు లేక ఆ విధముగనే ప్రవర్తించుచుండుము. 34

మూ. యథా చ తవ కైకేయీ సుమిత్రా చ విశేషతః.
తథైవ దేవీ కౌసల్యా మమ మాతా విశేషతః. 35

ప్ర. అ. తవ = నీకు, కైకేయీ = కైకేయి, యథా చ = ఎట్లో, సుమిత్రా చ = సుమిత్ర, విశేషతః = అధికముగా ఎట్లో, దేవీ = దేవియు, విశేషతః = విశేషముగా, మమ మాతా = నాతల్లియు అయిన, కౌసల్యా = కౌసల్యయు, తథైవ = అట్లే.

తా. నీకు కైకేయి ఎట్లో, విశేషించి సుమిత్ర ఎట్లో, రాణియు, విశేషించి అందులోను నా తల్లియు అయిన కౌసల్య కూడ అట్లే. 35

మూ. తాతస్య ప్రియకామేన యౌవరాజ్యమపేక్షతా
లోకయోరుభయోః శక్యం త్వయా యత్సుఖమేధితుమ్.

ప్ర. అ. తాతస్య = తండ్రియొక్క, ప్రియకామేన = ప్రియమును కోరుచున్న, యౌవరాజ్యమ్ = యౌవరాజ్యమును, అపేక్షతః = అంగీకరించిన, త్వయా = నీచేత, ఉభయోః = రెండు, లోకయోః = లోకములయందు, యత్ = ఏ, సుఖమ్ = సుఖము ఉన్నదో అది, ఏధితుం = వృద్ధిపొందించుటకు, శక్యమ్ = శక్యమైనది.

తా. తండ్రి ఇష్టమును చేయుటకై యౌవరాజ్యమును స్వీకరించి, నీవు ఇహపరములు రెండింటియందును సుఖమును పెంచుకొనుటకు శక్యమగును. 36

మూ. నివర్త్యమానో రామేణ సుమన్త్రః శోకకర్శితః,
తత్సర్వం వచనం శ్రుత్వా స్నేహాత్కాకుత్స్థమబ్రవీత్.

ప్ర. అ. రామేణ = రామునిచేత, నివర్త్యమానః = వెనుకకు పంపబడుచున్న, సుమన్త్రః = సుమంత్రుడు, శోకకర్శితః = శోకముచే కృశింపచేయబడినవాడై, తత్ = ఆ, సర్వమ్ = సమస్తమైన, వచనమ్ = వాక్యమును, శ్రుత్వా =

విని, స్నేహాత్ = స్నేహమువలన, రామమ్ = రాముని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. రామునిచే వెనుకకు పంపబడు చున్న ఆ సుమంత్రుడు, శోకముతో కృశించి, ఆ మాటలన్నియు విని, స్నేహపూర్వకముగా రామునితో ఇట్లనెను

మూ. యదహం నోపచారేణ బ్రూయాం స్నేహాదవిక్లబః,
భక్తిమానితి తత్తావద్వాక్యం త్వం క్షన్తుమర్హసి. 38

ప్ర. అ. స్నేహాత్ = స్నేహమువలన, అవిక్లబః = భయములేనివాడనై, నోపచారేణ = ఉపచారము లేకుండగ, అహమ్ = నేను, యత్ వాక్యమ్ = ఏ వాక్యమును, బ్రూయామ్ = పలుకుచున్నానో, తత్ = దానిని, భక్తిమాన్ ఇతి = భక్తిమంతుడు కదా। అని, త్వమ్ = నీవు, క్షన్తుమ్ = క్షమించుటకు, అర్హసి తావత్ = తగి యున్నావు.

తా. నేను, నీపై నున్న స్నేహముచే సంకోచము లేకుండగా ఉపచారములు లేని ఏ మాటలు చెప్పుచున్నానో వాటిని మన భక్తుడు కదా. యను భావముతో నీవు క్షమించవలెను. 38

వి. "ఉపచార మనగా" ఇతరుల విషయమున చూపవలసిన వినయాదులతో కూడిన ప్రవర్తన.

మూ. కథం హి త్వద్విహీనోఽహం ప్రతియాస్యామి తాంపురీమ్,
తవ తావద్వియోగేన పుత్రశోకాకులామివ. 39

ప్ర. అ. అహమ్ = నేను, త్వద్విహీనః = నీవు లేకుండగా, తవ = నీ యొక్క, వియోగేన తావత్ = వియోగముచేత, పుత్రశోకాకులామివ = పుత్రశోకముచే వ్యాకుల మైనదివలె నున్న, తామ్ = ఆ, పురీమ్ = పట్టణమును, కథం హి = ఎట్లు, ప్రతియాస్యామి = తిరిగిపొందెదను.

తా. నీ వియోగముతో, పుత్రశోకముచే బాధపడు చున్నట్లు బాధపడు చున్న ఆ అయోధ్యానగరమునకు నీవు లేకుండ, నేను తిరిగి ఎట్లు వెళ్ళగలను।

మూ. సరామమపి తావన్మే రథం దృష్ట్వా తదా జనః,
వినా రామం రథం దృష్ట్వా విదీర్యేతాపి సా పురీ. 40

ప్ర. అ. తదా = అపుడు, జనః = జనము, సరామమపి = రామునితో కూడియున్న దైన్యను, మే రథమ్ = నా రథమును, దృష్ట్వా = చూచి, తావత్ = అంతగా దుఃఖించెను. వినా రామమ్ = రాముడు లేని, రథమ్ = రథమును, దృష్ట్వా = చూచి, సా పురీ = ఆ పట్టణము, విదీర్యేతాపి = బ్రద్దలై పోవచ్చును కూడ.

తా. ఆ నాడు, రాము డున్న రథమును చూచి కూడ ప్రజలు అంతగా దుఃఖించిరి. రాముడు లేని రథమును చూచి ఆ పౌరుల హృదయములు బ్రద్దలై పోవచ్చును కూడ. 40

మూ. దైన్యం హి నగరీ గచ్ఛేద్దృష్ట్వా శూన్యమిమం రథమ్,
సూతావశేషం స్వం సైన్యం హతవీర మివాహవే. 41

ప్ర. అ. శూన్యమ్ = శూన్య మైన, ఇమమ్ = ఈ, రథమ్ = రథమును, దృష్ట్వా = చూచి, ఆహవే = యుద్ధమునందు, హతవీరమ్ = చంపబడిన వీరులు కలది, సూతావశేషమ్ = సారథియే మిగిలినది యైన, స్వమ్ = తమ రథమును చూచి, సైన్యమ్ ఇవ = సైన్యము వలె, నగరీ = అయోధ్యానగరము, దైన్యమ్ = దైన్యమును, గచ్ఛేత్ హి = పొందును కదా.

తా. యుద్ధములో వీరులు మరణించగా సారథిమాత్రమే మిగిలిన, తమ రథమును చూచి, సైన్యము దుఃఖించి నట్లు నీవు లేని ఈ రథమును చూచి, ఆ నగరము, దైన్యమును పొందును. 41

మూ. దూరేఽపి నివసన్తం త్వాం మానసేనాగ్రతః స్థితమ్,
చిన్తయన్త్యోఽద్య నూనం త్వాం నిరాహారాః కృతాః ప్రజాః

ప్ర. అ. ప్రజాః = ప్రజలు, అద్య = ఇపుడు, దూరే = దూరమునందు, నివసన్తమ్ అపి = నివసించుచున్నను, మానసేన = మనస్సు చేత, అగ్రతః = ఎదుట, స్థితమ్ = ఉన్న, త్వామ్ = నిన్ను గూర్చి, చిన్తయన్త్యః = చింతించుచు, నిరాహారాః = ఆహారము లేనివారుగా, కృతాః = చేయబడిరి. నూనమ్ = నిశ్చయము.

తా. ఇపుడు అయోధ్యలోని ప్రజ లందరు దూరములో నివసించుచున్నను మనస్సుచే ఎదుటనే ఉన్న నిన్ను గూర్చి చింతించుచు ఆహారము లేక ఉందురు.

మూ. దృష్టం తద్ధి త్వయా రామ! యాదృశం త్వత్ప్రవాసనే,
ప్రజానాం సంకులం వృత్తం త్వచ్ఛోకక్లాన్తచేతసామ్. 43

ప్ర. అ. రామ = ఓ రామా! త్వత్ప్రవాసనే = నీ వన ప్రయాణ సమయమందు, త్వచ్ఛోకక్లాన్తచేతసాం = నిన్ను గూర్చిన శోకముచే అలసట చెందిన మనస్సు గల, ప్రజానామ్ = ప్రజలయొక్క, వృత్తమ్ = ప్రవర్తనము, యాదృశమ్ = ఏ విధముగా, సంకులమ్ = వ్యాకుల మైనదో, తత్ = అది, త్వయా = నీచేత, దృష్టం హి = చూడబడినది కదా!

తా. రామా! నీ ప్రవాససమయమునందు నిన్ను గూర్చిన శోకముతో బాధపడుచున్న ప్రజలు ఏ విధముగా శోక చెంది ప్రవర్తించినారో అది నీవే చూచితివి కదా! 43

మూ. ఆర్తనాదో హి యః పౌరైర్ముక్తస్త్వద్విప్రవాసనే,
సరథం మాం నిశామ్యైవ కుర్యుః శతగుణం తతః. 44

ప్ర. అ. త్వద్విప్రవాసనే = నీ వన ప్రయాణమునందు, పౌరైః = పౌరులచేత, యః = ఏ, ఆర్తనాదః = ఆర్తనాదము, ముక్తః = విడువబడినదో, సరథమ్ = రథముతో కూడిన, మామ్ = నన్ను, నిశామ్యైవ = చూచినంతనే, తతః = దానికంటే, శతగుణమ్ = నూరు రెట్లు, కుర్యుః = చేయుదురు.

తా. నీవు వనమునకు ప్రయాణ మై వచ్చు సమయమున, పౌరులు ఎంత ఆర్తనాదము చేసినారో, దానికి నూరు రెట్లు ఆర్తనాదమును, రథమును, నన్నును చూడగనే చేయుదురు. 44

మూ. అహం కిం చాపి వక్ష్యామి దేవీం తవ సుతో మయా,
నీతోఽసౌ మాతులకులం సంతాపం మా కృథా ఇతి. 45

ప్ర. అ. అసౌ = ఈ, తవ సుతః = నీ కుమారుడు, మయా = నాచేత, మాతులకులమ్ = మేనమామ ఇంటిని గూర్చి, నీతః = తీసుకొని వెళ్లబడినాడు. సంతాపమ్ = దుఃఖమును, మా కృథాః = చేయకుము. ఇతి = అని, అహమ్ = నేను, దేవీమ్ = కౌసల్యాదేవిని గూర్చి, వక్ష్యామి కిం చాపి = చెప్పెదనా!

తా. నీ కుమారుని మేనమామ ఇంటికి తీసుకొని వెళ్ళినాను. దుఃఖించ కుము; అని నేను కౌసల్యాదేవితో చెప్పవలెనా। 45

మూ. అసత్యమపి నైవాహం బ్రూయాం వచనమీదృశమ్,
కథమప్రియమేవాహం బ్రూయాం సత్యమిదం వచః. 46

ప్ర. అ. అహమ్ = నేను, అసత్యమ్ = అసత్య మైన, ఈదృశమ్ = ఇట్టి, వచనమపి = వచనమును కూడ, నైవ బ్రూయామ్ = చెప్పజాలను, అహమ్ = నేను, అప్రియమ్ = అప్రియ మైన, సత్యమ్=సత్య మైన, ఇదం వచః = ఈ వాక్యమును, కథమ్ = ఎట్లు, బ్రూయామ్ = చెప్పెదను?

తా. నేను, ప్రియ మైనను ఇట్టి అసత్య మైన వాక్యమును చెప్పజాలను. 'నీ కుమారుని అరణ్యములో విడిచితిని' అను అప్రియ మైన ఈ సత్యవాక్య మును ఆమెతో ఎట్లు చెప్పగలను? 46

మూ. మమ తావన్నియోగస్థాస్త్వద్బన్ధుజనవాహినః,
కథం రథం త్వయా హీనం ప్రవక్ష్యన్తి హయోత్తమాః.

ప్ర. అ. త్వద్బన్ధుజనవాహినః = నిన్ను నీ బంధుజను లైన సీతా లక్ష్మ ణులను, తీసుకొని వచ్చిన, మమ = నాయొక్క, నియోగస్థాః = ఆజ్ఞలో ఉన్న, హయోత్తమాః = శ్రేష్ఠ మైన గుఱ్ఱములు, త్వయా = నీతో, హీనమ్ = శూన్య మైన, రథమ్ = రథమును, కథమ్ = ఎట్లు, ప్రవక్ష్యన్తి = మోయగలవు.

తా. నిన్ను సీతాలక్ష్మణులను, ఇంతవరకు తీసుకొనివచ్చిన, నా అదుపులో ఉన్న ఈ శ్రేష్ఠము లైన గుఱ్ఱములు నీవు లేని రథమును ఎట్లు తీసు కొని వెళ్ళను? 47

మూ. తన్న శక్ష్యామ్యహం గన్తుమయోధ్యాం త్వదృతేఽనఘ,
వనవాసానుయానాయ మామనుజ్ఞాతుమర్హసి. 48

ప్ర. అ. తత్ = ఆ కారణము వలన, అనఘ = దోషములు లేని ఓ రామా! త్వదృతే = నీవు లేకుండగ, అహమ్ = నేను, అయోధ్యామ్ = అయోధ్యను గూర్చి, గన్తుమ్ = వెళ్లుటకు, న శక్ష్యామి = సమర్థుడను కాజాలను. మామ్ =

నన్ను, వనవాసానుయానాయ=వనవాసమునందు నిన్ను అనుసరించి వచ్చుటకు, అనుజ్ఞాతుమ్=అనుజ్ఞ ఇచ్చుటకు, అర్హసి=తగియున్నావు.

తా. పాపరహితుడ వైన ఓ రామా! ఈ కారణముచే నేను అయోధ్యకు తిరిగి వెళ్లజాలను; నీ వెనుకనే అరణ్యమునకు వచ్చుటకు నాకు అనుజ్ఞ ఇమ్ము.

మూ. యది మే యాచమానస్య త్యాగమేవ కరిష్యసి,
సరథోఽగ్నిం ప్రవేక్ష్యామి త్యక్తమాత్ర ఇహ త్వయా.

ప్ర. అ. యాచమానస్య=ప్రార్థించుచున్న, మే=నా యొక్క, త్యాగమేవ=త్యాగమునే, కరిష్యసి యది=నీవు చేసిన దైనచో, త్వయా=నీచేత, త్యక్తమాత్రః=విడువబడిన వెంటనే, ఇహ=ఇచట, సరథః=రథముతో కూడినవాడనై, అగ్నిమ్=అగ్నిని, ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను.

తా. నీవు, ఇంతగా ప్రార్థించుచున్నను, నన్ను విడిచివేసినచో, నేను వెంటనే రథముతో కూడ, ఇక్కడనే అగ్నిలో ప్రవేశించెదను. 49

మూ. భవిష్యన్తి వనే యాని తపోవిఘ్నకరాణి తే,
రథేన ప్రతిబాధిష్యే తాని సత్త్వాని రాఘవ. 50

ప్ర. అ. రాఘవ=ఓ రామా! వనే=వనమునందు, యాని=ఏ జంతువులు, తే=నీకు, తపోవిఘ్నకరాణి=తపోవిఘ్నము చేయునవి, భవిష్యన్తి=అగునో, తాని సత్త్వాని=ఆ జంతువులను, రథేన=రథముచేత, ప్రతిబాధిష్యే=నివారించెదను.

తా. ఓ రామా! అరణ్యములో నీ తపస్సునకు విఘ్నము కల్గించు మృగములను రథముచేత నివారించెదను. 50

మూ. త్వత్కృతేన మయావాప్తం రథచర్యాకృతం సుఖమ్,
ఆశంసే త్వత్కృతేనాహం వనవాసకృతం సుఖమ్. 51

ప్ర. అ. త్వత్కృతేన=నీచేత చేయబడిన అనుగ్రహముచే, మయా=నా చేత, రథచర్యాకృతమ్=రథమును నడుపుటవలన కలిగిన, సుఖమ్=సుఖము, అవాప్తమ్=పొందబడినది. త్వత్కృతేన=నీచేత, చేయబడిన అను

గ్రహముచే, అహమ్ = నేను, వనవాసకృతమ్ = వనవాసమువలన కలిగిన, సుఖమ్ = సుఖమును, ఆకాంక్షే = కోరుచున్నాను.

తా. నేను నీ అనుగ్రహముచే నీ రథమును నడుపు సుఖమును పొందియుంటిని. ఇపుడు నీ అనుగ్రహముచేత వనవాససుఖమును కూడ పొందదలంచుచున్నాను. 51

మూ. ప్రసీదేచ్ఛామి తేఽరణ్యే భవితుం ప్రత్యనన్తరః,
ప్రీత్యాఽభిహితమిచ్ఛామి భవ మే ప్రత్యనన్తరః. 52

ప్ర. అ. ప్రసీద = అనుగ్రహింపుము. అరణ్యే = అరణ్యమునందు, తే = నీకు, ప్రత్యనన్తరః = సమీపమునం దున్నవాడను, భవితుమ్ = అగుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను; మే = నాకు, ప్రత్యనన్తరః = సమీపమునం దున్నవాడవుగా, భవ = అగుము అని, ప్రీత్యా = ప్రేమతో, అభిహితమ్ = చెప్పబడిన మాటను, ఇచ్ఛామి = కోరుచున్నాను.

తా. నన్ను అనుగ్రహింపుము. నేను అరణ్యములో నీ సమీపమునందే ఉండవలె నని కోరుచున్నాను. 'నీవు సమీపమునందే ఉండుము' అని నీవు ప్రేమపూర్వకముగా చెప్పగా వినవలె నని కోరుచున్నాను. 52

మూ. ఇమే చాపి హయా వీర యది తే వనవాసినః
పరిచర్యాం కరిష్యన్తి ప్రాప్స్యన్తి పరమాం గతిమ్. 53

ప్ర. అ. వీర = ఓ వీరుడా! ఇమే = ఈ, హయాశ్చాపి = గుఱ్ఱములు కూడ, వనవాసినః = వనమునందు నివసించుచున్న, తే = నీకు, పరిచర్యామ్ = సేవను, కరిష్యన్తి యది = చేసిన ట్లైతే, పరమామ్ = శ్రేష్ఠ మైన, గతిమ్ = గతిని, ప్రాప్స్యన్తి = పొందగలవు.

తా. ఓ వీరుడా! నీవు వనములో నివసించుచుండగా ఈ గుఱ్ఱములు నీకు సేవ చేసినచో, వాటికి కూడ, ఉత్తమగతి లభించును. 53

మూ. తవ శుశ్రూషణం మూర్ధ్నా కరిష్యామి వనే వసన్,
అయోధ్యాం దేవలోకం వా సర్వథా ప్రజహామ్యహమ్.

ప్ర. అ. వనే = వనమునందు, వసన్ = నివసించుచు, మూర్ధ్నా = శిరస్సుతో, తవ = నీయొక్క, శుశ్రూషణమ్ = శుశ్రూషను, కరిష్యామి = చేసెదను, అయోధ్యామ్ = అయోధ్యను గాని, దేవలోకం వా = దేవలోకమును గాని, అహమ్ = నేను, సర్వథా = అన్ని విధముల, ప్రజహామి = విడుచుచున్నాను.

తా. నేను అన్నివిధముల అయోధ్య నైనను, దేవలోకము నైనను విడిచి, వనములో నివసించుచు నీకు శిరస్సుతో నమస్కరించుచు, శుశ్రూష చేసెదను.

మూ. న హి శక్యా ప్రవేష్టుం సా మయాఽయోధ్యా త్వయా వినా,
రాజధానీ మహేన్ద్రస్య యథా దుష్కృతకర్మణా. 55

ప్ర. అ. త్వయా వినా = నీవు లేకుండగ, మయా = నాచేత, దుష్కృతకర్మణా = పాపాత్మునిచేత, మహేన్ద్రస్య = మహేంద్రునియొక్క, రాజధానీ యథా = రాజధాని యైన అమరావతి వలె, సా అయోధ్యా = ఆ అయోధ్య, ప్రవేష్టుమ్ = ప్రవేశించుటకు, న హి శక్యా = శక్య మైనది కాదు.

తా. పాపాత్ముడు దేవేంద్రుని రాజధాని యైన అమరావతిలోనికి ఎట్లు ప్రవేశింపజాలండో, అట్లే నీవు లేకుండగా నేను అయోధ్యలో ప్రవేశింపజాలను.

మూ. వనవాసే క్షయం ప్రాప్తే మమైష హి మనోరథః,
యదనేన రథేనైవ త్వాం వహేయం పురీం పునః. 56

ప్ర. అ. మమ = నాకు, ఏషః హి = ఇదియే, మనోరథః = కోరిక, యత్ ఏ మనగా, వనవాసే = వనవాసము, క్షయమ్ = క్షయమును, ప్రాప్తే = పొందిన దగుచుండగా, అనేన = ఈ, రథేనైవ = రథముచేతనే, త్వామ్ = నిన్ను, పునః = మరల, పురీమ్ = పట్టణమును గూర్చి, వహేయమ్ = తీసుకొని పోవుదును.

తా. వనవాసము పూర్తి యైన పిమ్మట ఇదే రథముపై ఎక్కించి, నిన్ను అయోధ్యాపురికి తీసుకొని వెళ్లవలెను అనునదియే నా కోరిక. 56

మూ. చతుర్దశ హి వర్షాణి సహితస్య త్వయా వనే,
క్షణభూతాని యాస్యన్తి శతసంఖ్యాన్యతోఽన్యథా. 57

ప్ర. అ. వనే = వనమునందు, త్వయా = నీతో, సహితస్య = కూడియున్న నాకు, చతుర్దశ వర్షాణి = పదు నాలుగు సంవత్సరములు, క్షణభూతాని = క్షణ

ములై, యాస్యన్తి=గడచిపోవును, అతః=దీనికంటె, అన్యథా=మరియొక విధమున, శతసంఖ్యాని = నూరు సంఖ్య కలవి యగును.

తా. వనములో నీ సన్నిధిలో ఉన్నచో నాకు పదునాలుగు సంవత్సరములు క్షణములవలె గడచిపోవును. అట్లు కానిచో, వంద సంవత్సరముల వలె అగును. 57

మూ. భృత్యవత్సల తిష్ఠన్తం భర్తృపుత్రగతే పథి,
భక్తం భృత్యం స్థితం స్థిత్యాం త్వం న మాం హాతుమర్హసి.

ప్ర. అ. భృత్యవత్సల=భృత్యులపై ప్రేమ కలవాడా! భర్తృపుత్రగతే=ప్రభువుయొక్క పుత్రునిచే అనుసరింపబడిన, పథి = మార్గమునందు, తిష్ఠన్తమ్ = ఉన్నవాడను, భక్తమ్ = భక్తుడను, భృత్యమ్=భృత్యుడను, స్థిత్యామ్ = మర్యాదయందు, స్థితమ్=ఉన్నవాడను అయిన, మామ్=నన్ను, త్వమ్=నీవు, హాతుమ్ = విడుచుటకు, నార్హసి=తగవు.

తా. భృత్యులయందు ప్రేమ గల ఓ రామా! నేను నా ప్రభువు పుత్రుడవైన నీవు వెళ్లుచున్న మార్గముననే వెళ్ళగోరుచున్నాను. నీ భక్తుడను. భృత్యుడను. మర్యాద కాపాడువాడను. అట్టి నన్ను విడువవద్దు. 58

మూ. ఏవం బహువిధం దీనం యాచమానం పునః పునః,
రామో భృత్యానుకమ్పీ తు సుమన్త్రమిదమబ్రవీత్. 59

ప్ర. అ. భృత్యానుకమ్పీ = భృత్యులపై జాలి కల, రామః=రాముడు, ఏవమ్ = ఇట్లు, బహువిధమ్=అనేక విధములుగా, పునః పునః=మాటి మాటికి, యాచమానమ్=ప్రార్థించుచున్న, దీనమ్=దీనుడైన, సుమన్త్రమ్=సుమంత్రుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. భృత్యులపై జాలి కల రాముడు, ఇట్లు మాటి మాటికి, అనేక విధముల ప్రార్థించుచున్న, దీనుడైన ఆ సుమంత్రునితో ఇట్లు పలికెను. 59

మూ. జానామి పరమాం భక్తిం మయి తే భర్తృవత్సల,
శృణు చాపి యదర్థం త్వాం ప్రేషయామి పురీమితః. 60

ప్ర. అ. భర్తృవత్సల=ప్రభువునందు ప్రేమ గలవాడా, త్వం=నీవు, మయి=నాయందున్న, పరమామ్=గొప్ప, భక్తిమ్=భక్తిని, జానామి=ఎరుగుదును ఇతః=ఇక్కడనుండి, త్వామ్=నిన్ను, యదర్థమ్=ఎందు నిమిత్తమై, పురీమ్=పట్టణమును గూర్చి, ప్రేషయామి=పంపుచున్నానో, శృణు తావత్=వినుము.

తా. ప్రభువుపై ప్రేమగల ఓ సుమంత్రా! నీకు నాపై ఎంత గొప్ప భక్తి యున్నదో నేను ఎరుగుదును. నిన్ను ఇక్కడి నుండి పట్టణమునకు ఎందుకు పంపుచున్నానో వినుము. 60

మూ. నగరీం త్వాం గతం దృష్ట్వా జననీ మే యవీయసీ,
కైకేయీ ప్రత్యయం గచ్ఛేదితి రామో వనం గతః. 61

ప్ర. అ. నగరీమ్=పట్టణమును గూర్చి, గతమ్=వెళ్ళిన, త్వామ్=నిన్ను, దృష్ట్వా=చూచి, మే=నాయొక్క, యవీయసీ=చిన్న, జననీ=తల్లి యైన, కైకేయీ=కైకేయి, రామః=రాముడు, వనమ్=వనమును గూర్చి, గతః=వెళ్ళినాడు, ఇతి=అని, ప్రత్యయమ్=నమ్మకమును, గచ్ఛేత్=పొందును.

తా. నీవు అయోధ్యకు తిరిగి వెళ్ళగా, నిన్ను చూచినచో మా పినతల్లి యైన కైకేయికి రాముడు అరణ్యమునకు వెళ్ళినాడు అని నమ్మకము కలుగును.

మూ. పరితుష్టా హి సా దేవీ వనవాసం గతే మయి,
రాజానం నాఽతిశఙ్కేత మిథ్యావాదీతి ధార్మికమ్. 62

ప్ర. అ. మయి=నేను, వనవాసమ్=వనవాసమును, గతే=పొందినవాడ నగుచుండగా, సా దేవీ=ఆ దేవి, పరితుష్టా=సంతోషించినదై, ధార్మికమ్=ధార్మికుడైన, రాజానమ్=రాజును గూర్చి, మిథ్యావాదీతి=అసత్యము పలుకువాడని, నాతిశఙ్కేత=శంకింపకుండును.

తా. నేను వనవాసమునకు వెళ్ళుటచే కైకేయి సంతోషించును. ధార్మికుడైన రాజునుగూర్చి ఇతడు అసత్యము చెప్పుచున్నాడు అను శంకను విడుచును.

మూ. ఏష మే ప్రథమః కల్పో యదమ్బా మే యవీయసీ
భరతారక్షితం స్ఫీతం పుత్రరాజ్యమవాప్నుయాత్ 63

ప్ర. అ. ఏషః = ఇది, మే = నాకు, ప్రథమః = ముఖ్య మైన, కల్పః = పక్షము, యత్ = ఏమనగా, మే = నాయొక్క, యవీయసీ = చిన్న దైన, అమ్బా = తల్లి, భరతారక్షితమ్ = భరతునిచేత రక్షింపబడిన, స్ఫీతమ్ = విశాల మైన, పుత్రరాజ్యమ్ = పుత్రుని రాజ్యమును, అవాప్నుయాత్ = పొందుగాక:

తా. మా పినతల్లి తన పుత్రు డైన భరతునిచే రక్షింపబడిన విశాల మైన రాజ్యమును పొందవలెను అనునదియే నాకు చాల ముఖ్య మైన విషయము. ౬౩

మూ. మమ ప్రియార్థం రాజ్ఞశ్చ సరథస్త్వం పురీం వ్రజ,
సందిష్టశ్చాసి యానర్థాంస్తాంస్తాన్ బ్రూయాస్తథా తథా.

ప్ర. అ. త్వమ్ = నీవు, సరథః = రథముతో కూడినవాడవై, మమ = నాయొక్క, రాజ్ఞశ్చ = రాజుయొక్క, ప్రియార్థమ్ = సంతోషముకొరకు, పురీమ్ = పట్టణమును గూర్చి, వ్రజ = వెళ్ళుము. యాన్ = ఏ, అర్థాన్ = విషయములను, సందిష్టః = చెప్పబడినవాడవు, అసి = అయితివో, తాన్ తాన్ = ఆ యా విషయములను, తథా తథా = అట్లే, బ్రూయాః = చెప్పుము.

తా. నీవు ఈ రథమును తీసుకొని నగరమునకు వెళ్ళినచో, నాకును, రాజునకును కూడ, ప్రియము చేసినవాడవు అగుదువు. నీకు ఏ యే విషయములు చెప్పినానో వాటిని అన్నింటిని ఆ విధముగా చేయుము. ౬౪

మూ. ఇత్యుక్త్వా వచనం సూతం సాన్త్వయిత్వా పునః పునః,
గుహం వచన మక్లీబో రామో హేతుమదబ్రవీత్. ౬౫

ప్ర. అ. అక్లీబః = ధైర్యవంతు డైన, రామః = రాముడు, సూతమ్ = సారథిని గూర్చి, ఇతి = ఇట్లు, వచనమ్ = వాక్యమును, ఉక్త్వా = పలికి, పునః పునః = మాటిమాటికి, సాన్త్వయిత్వా = ఓదార్చి, గుహమ్ = గుహుని గూర్చి, హేతుమత్ = యుక్తియుక్త మైన, వచనమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను.

తా. ధైర్యవంతు డైన రాముడు సుమంత్రునితో ఇట్లు పలికి, మాటి మాటికిని ఓదార్చి, గుహునితో యుక్తియుక్త మగు వాక్యము పలికెను. ౬౫

మూ. నేదానీం గుహ యోగ్యోఽయం వాసో మే సజనే వనే,
అవశ్యం హ్యాశ్రమే వాసః కర్తవ్యస్తద్గతో విధిః. ౬౬

ప్ర. అ. గుహ=గుహుఁడా! ఇదానీమ్ = ఇప్పుడు, మే = నాకు, సజనే= జనముతో కూడిన, వనే = వనమునందు, అయమ్ = ఈ, వాసః = నివాసము, న యోగ్యః = యోగ్య మైనది కాదు, ఆశ్రమే = ఆశ్రమమునందు, వాసః = నివాసము, అవశ్యమ్ = తప్పక చేయఁదగినది. తద్గతః = దానికి సంబంధించిన, విధిః = విధానము, కర్తవ్యః = చేయఁదగినది.

తా. గుహుఁడా! నే నిపుడు జను లున్న వనములో నివసించగూడదు. నేను ఆశ్రమమునందు మాత్రమే నివసించవలెను. అందుచే దానికి తగిన విధానము చేయుదము గాక. 66

మూ. సోఽహం గృహీత్వా నియమం తపస్విజనభూషణమ్,
హితకామః పితుర్భూయః సీతాయా లక్ష్మణస్య చ. 67
జటాః కృత్వా గమిష్యామి న్యగ్రోధక్షీరమానయ.

ప్ర. అ. సః అహమ్=అట్టి నేను, తపస్విజనభూషణమ్ = మునులకు అలంకార మైన, నియమమ్ = నియమమును, గృహీత్వా=గ్రహించి, పితుః= తండ్రియొక్క, భూయః=మరియు, సీతాయాః=సీతయొక్క, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్క, హితకామః = హితమును కోరువాఁడనై, జటాః = జటలను, కృత్వా = చేసికొని, గమిష్యామి = వెళ్ళెదను. న్యగ్రోధక్షీరమ్ = మఱ్ఱిపాలను, ఆనయ=తీసికొనిరమ్ము.

తా. నా తండ్రికి, సీతకూ, లక్ష్మణునకూ హితమును కోరుచున్న నేను, మునులకు అలంకార మైన నియమమును అవలంబించి, జటాధారినై, వెళ్ళెదను. మఱ్ఱిపాలు తెమ్ము. 67

మూ. తత్ క్షీరం రాజపుత్రాయ గుహః క్షిప్రముపాహరత్,
లక్ష్మణస్యాత్మనశ్చైవ రామస్తేనాకరోజ్జటాః. 68

ప్ర. అ. గుహః=గుహుఁడు, క్షిప్రమ్=శీఘ్రముగా, రాజపుత్రాయ=రాజ పుత్రునకు, తత్ = ఆ, క్షీరమ్ = పాలను, రాజపుత్రాయ = రామునకు, ఉపాహరత్ = తీసికొని వచ్చి ఇచ్చెను. రామః = రాముఁడు, తేన = దానితో, లక్ష్మణస్య=లక్ష్మణునకును, ఆత్మనశ్చైవ=తనకును, జటాః=జటలను, అకరోత్= చేసెను.

తా. గుహుడు వెంటనే ఆ క్షీరమును తీసికొని వచ్చి, రామున కిచ్చెను. రాముడు ఆ పాలతో తనకును, లక్ష్మణునకును జటలు కట్టెను. 68

మూ. దీర్ఘబాహుర్నరవ్యాఘ్రో జటిలత్వ మధారయత్. 69
తౌ తదా చీరవసనౌ జటామణ్డలధారిణౌ,
అశోభేతామృషిసమౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ. 70

ప్ర. అ. దీర్ఘబాహుః = దీర్ఘ మైన బాహువులు గల, నరవ్యాఘ్రః = నరశ్రేష్ఠు డైన ఆ రాముడు, జటిలత్వమ్ = జటలను కలిగియుండుటను, అధారయత్ = ధరించెను. తదా = అప్పుడు, చీరవసనౌ = నారచీరలు ధరించినవారూ, జటామణ్డలధారిణౌ = జటామండలము ధరించినవారూ అయిన, భ్రాతరౌ = సోదరు లైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఋషిసమౌ = ఋషులతో సమానులుగా, అశోభేతామ్ = ప్రకాశించిరి.

తా. ఆజానుబాహు వైన ఆ పురుషశ్రేష్ఠుడు, జటాధారి అయ్యెను. అప్పుడు, నారచీరలు కట్టి, జటామండలమును ధరించిన ఆ సోదరు లైన రామలక్ష్మణులు, ఋషుల వలె శోభించిరి. 69, 70

మూ. తతో వైఖానసం మార్గమాస్థితః సహ లక్ష్మణః,
వ్రతమాదిష్టవాన్ రామః సఖాయం గుహమబ్రవీత్. 71

ప్ర. అ. తతః = అటుపిమ్మట, సహలక్ష్మణః = లక్ష్మణసహితు డై, వైఖానసమ్ = విఖనసప్రోక్త మైన, మార్గమ్ = మార్గమును, ఆస్థితః = అవలంబించిన, రామః = రాముడు, వ్రతమ్ = నియమమును, ఆదిష్టవాన్ = అంగీకరించినవాడై, సఖాయమ్ = మిత్రు డైన, గుహమ్ = గుహుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. పిమ్మట, లక్ష్మణునితో కూడ విఖనస్సు అను మహర్షి ప్రతిపాదించిన వానప్రస్థమార్గమును అవలంబించి, ఆ వ్రతమును పాలించుచున్న రాముడు మిత్రు డైన గుహునితో ఇట్లనెను. 71

మూ. అప్రమత్తో బలే కోశే దుర్గే జనపదే తథా,
భవేథా గుహ రాజ్యం హి దురారక్షతమం మతమ్. 72

ప్ర. అ. గుహ = గుహుడా! బలే = సైన్యమునందును, కోశే = కోశమునందును, దుర్గే = దుర్గమునందును, తథా = మరియు, జనపదే = దేశమునందును, అప్రమత్తః = ఏమరుపాటు లేనివాడవు, భవేథాః = అగుదువుగాక. రాజ్యమ్ = రాజ్యము, దురారక్షతమమ్ = చాల కష్టముచే రక్షింప శక్యమైనదిగా, మతం హి = చెప్పబడినది కదా.

తా. గుహుడా! సైన్యము, ధనాగారము, దుర్గము, దేశము— వీని విషయమున ఏ మాత్రము ఏమరుపాటు లేకుండ ఉండుము. రాజ్యము పాలించుట అనునది చాల కష్టమైన దని పెద్దలు చెప్పుదురు కదా! 72

మూ. తత స్తం సమనుజ్ఞాయ గుహమిక్ష్వాకునన్దనః,
జగామ తూర్ణమవ్యగ్రః సభార్యః సహ లక్ష్మణః. 73

ప్ర. అ. తతః = అటుపిమ్మట, ఇక్ష్వాకునన్దనః = ఇక్ష్వాకువంశమును ఆనందింపచేయు రాముడు, తం గుహమ్ = ఆ గుహుని, సమనుజ్ఞాయ = అనుమతించి, అవ్యగ్రః = వ్యాకులుడు కానివాడై, సభార్యః = భార్యతో కూడినవాడై, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, తూర్ణమ్ = శీఘ్రముగా, జగామ = వెళ్లెను.

తా. పిమ్మట, రాముడు గుహుని వీడుకొల్పి, వ్యాకులత్వము చెందక, భార్యాలక్ష్మణసమేతుడై శీఘ్రముగా వెళ్ళెను. 73

మూ. స తు దృష్ట్వా నదీతీరే నావమిక్ష్వాకునన్దనః,
తితీర్షుః శీఘ్రగాం గఙ్గామిదం లక్ష్మణమబ్రవీత్. 74

ప్ర. అ. సః ఇక్ష్వాకునన్దనః = ఆ రాముడు, నదీతీరే = నదీతీరమునందు, నావమ్ = నావను, దృష్ట్వా = చూచి, శీఘ్రగామ్ = శీఘ్రముగా ప్రవహించుచున్న, గఙ్గామ్ = గంగను, తితీర్షుః = దాటదలచినవాడై, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. రాముడు నది యొడ్డు ప్రక్కన ఉన్న నావను చూచి, శీఘ్రముగా ప్రవహించుచున్న ఆ గంగానదిని దాట దలచినవాడై, లక్ష్మణునితో ఇట్లనెను. 74

మూ. ఆరోహ త్వం నరవ్యాఘ్ర స్థితాం నావమిమాం శనైః,
సీతాం చారోపయాన్వక్షం పరిగృహ్య మనస్వినీమ్. 75

ప్ర. అ. నరవ్యాఘ్ర = నరులలో శ్రేష్ఠుడ వైన ఓ లక్ష్మణా! త్వమ్ = నీవు, స్థితామ్ = నిలచి ఉన్న, ఇమామ్ = ఈ, నావమ్ = నావను, శనైః = మెల్లగా, ఆరోహ = ఎక్కుము. అన్వక్షమ్ = పిదప, మనస్వినీమ్ = ఉత్తమ మైన మనస్సు గల, సీతాం చ = సీతను కూడ, పరిగృహ్య = పట్టుకొని, ఆరోపయ = ఎక్కించుము.

తా. లక్ష్మణా! నావ నిలచియున్నది. దానిని మెల్లగా ఎక్కుము. పిదప ఉత్తమ మైన మనస్సు గల సీతను కూడ చేయి పట్టుకొని ఎక్కించుము. 75

మూ. స భ్రాతుః శాసనం శ్రుత్వా సర్వమప్రతికూలయన్,
ఆరోప్య మైథిలీం పూర్వమారురోహాత్మవాం స్తతః. 76

ప్ర. అ. ఆత్మవాన్ = బుద్ధిమంతు డైన, సః = ఆ లక్ష్మణుడు, భ్రాతుః = సోదరునియొక్క, శాసనమ్ = శాసనమును, శ్రుత్వా = విని, సర్వమ్ = అతడు చెప్పినదానినంతను, అప్రతికూలయన్ = ప్రతికూలము చేయక, పూర్వమ్ = ముందుగా, మైథిలీమ్ = సీతను, ఆరోప్య = ఎక్కించి, తతః = అటుపిమ్మట, ఆరురోహ = ఎక్కెను.

తా. బుద్ధిమంతు డైన లక్ష్మణుడు సోదరుని ఆజ్ఞను విని, అతడు చెప్పిన దాని నంతను అవిరుద్ధముగా పాటించుచు ముందుగా సీతను ఎక్కించి పిదప తాను ఎక్కెను. 76

వి. "ముందు నీవు నావపై ఎక్కి పిదప సీత నెక్కించుము" అని రాముడు చెప్పగా లక్ష్మణుడు ముందుగా సీత నెక్కించి తాను తరువాత నావ నెక్కెను. లక్ష్మణుడు బుద్ధిమంతుడు గాన రాముని అభిప్రాయము సీతనే ముందుగా ఎక్కించ వలె అయి ఉండు నని గ్రహించి అట్లు చేసెను. అందుచే ప్రతికూలముగా చేసి నట్లు కాదు. 76

మూ. అథారురోహ తేజస్వీ స్వయం లక్ష్మణపూర్వజః,
తతో నిషాదాధిపతిర్గుహో జ్ఞాతీనచోదయత్. 77

ప్ర. అ. అథ=పిమ్మట, తేజస్వీ=తేజశ్శాలియైన, లక్ష్మణపూర్వజః = రాముడు, స్వయమ్ = తాను, ఆరురోహ = ఎక్కెను. తతః = అటుపిమ్మట, నిషాదాధిపతిః=బోయల ప్రభు వైన, గుహః=గుహుడు, జ్ఞాతీన్ = బంధువులను, అచోదయత్=ప్రేరేపించెను.

తా. తేజశ్శాలి యైన రాముడు కూడ నావ నెక్కిన పిమ్మట, నిషాదాధిపతి యైన గుహుడు "నావను అవలి ఒడ్డు చేర్చుడు" అని తన బంధువులను ఆజ్ఞాపించెను. 77

మూ. రాఘవోఽపి మహాతేజా నావమారుహ్య తాం తతః,
బ్రహ్మవత్ క్షత్రవచ్చైవ జజాప హితమాత్మనః. 78

ప్ర. అ. మహాతేజాః = గొప్ప తేజస్సుగల, రాఘవోఽపి = రాముడు కూడా, తాం నావమ్ = ఆ నావను, ఆరుహ్య=ఎక్కి, తతః=పిమ్మట, బ్రహ్మవత్=బ్రాహ్మణులకు హిత మైనదీ, క్షత్రవచ్చైవ=క్షత్రియులకు హిత మైనదీ అయిన మంత్రమును, ఆత్మనః = తనయొక్క, హితమ్ = హితమును గూర్చి, జజాప=జపించెను.

తా. గొప్ప తేజస్సు గల రాముడు ఆ నావ నెక్కిన పిదప, తన శ్రేయస్సును కోరుచు, బ్రాహ్మణ క్షత్రియులు రెండు జాతులవారును సాధారణముగ జపింపదగిన "దైవీం నావమ్" అను నావ నెక్కు నపుడు జపించు మంత్రమును జపించెను. 78

మూ. ఆచమ్య చ యథాశాస్త్రం నదీం తాం సహ సీతయా,
ప్రాణమత్ప్రీతిసంహృష్టో లక్ష్మణశ్చామితప్రభః. 79

ప్ర. అ. సీతయా సహ = సీతతో కూడ, యథాశాస్త్రమ్ = శాస్త్రమును సారముగా, ఆచమ్య చ = ఆచమనము చేసి, ప్రీతిసంహృష్టః = సంతోషముతో గగుర్పాటు చెందినవాడై, తాం నదీమ్=ఆ నదిని, ప్రాణమత్=నమస్కరించెను. అమితప్రభః = గొప్ప తేజస్సుగల, లక్ష్మణశ్చ = లక్ష్మణుడు కూడ, (నమస్కరించెను).

తా. పిమ్మట, రాముడు, సీత, లక్ష్మణుడును యథాశాస్త్రముగా ఆచమనము చేసి ఆనందముతో ఆ నదికి నమస్కరించిరి. 79

మూ. అనుజ్ఞాయ సుమన్త్రం చ సబలం చైవ తం గుహమ్,
ఆస్థాయ నావం రామస్తు చోదయామాస నావికాన్. 80

ప్ర. అ. రామస్తు = రాముడు, సుమన్త్రమ్ = సుమంత్రుని, సబలమ్ = సైన్యముతో కూడిన, తం గుహమ్ = ఆ గుహుని, అనుజ్ఞాయ = వీడ్కొల్పి, నావమ్ = నావను, ఆస్థాయ = అధిష్ఠించి, నావికాన్ = నావ నడుపువారిని, చోదయామాస = ప్రేరేపించెను.

తా. రాముడు సుమంత్రుని, సైన్యసహితుడైన గుహుని వీడ్కొలిపి, నావలో కూర్చుండి, "నావ నడుపుడు" అని నావికులను ఆదేశించెను. 80

మూ. తతస్తైశ్చోదితా సా నౌః కర్ణధారసమాహితా,
శుభస్ఫ్యవేగాభిహతా శీఘ్రం సలిలమత్యగాత్. 81

ప్ర. అ. తతః = అటుపిమ్మట, కర్ణధారసమాహితా = చుక్కాని పట్టువానిచే సావధానముగా తగు విధమున త్రిప్పబడిన, సా నౌః = ఆ నావ, తైః = వారిచే, చోదితా = ప్రేరేపింపబడినదై, శుభస్ఫ్యవేగాభిహతా = మంచి తెడ్ల వేగముచే కొట్టబడినదై, శీఘ్రమ్ = శీఘ్రముగా, సలిలమ్ = జలమును, అత్యగాత్ = దాటెను.

తా. చుక్కాని పట్టువాడు చక్కగా చుక్కాని పట్టగా, వారిచే నడుపబడిన ఆ నావ మంచి తెడ్లచే త్రోయబడినదై, శీఘ్రముగా జలమును దాటెను.

మూ. మధ్యం తు సమనుప్రాప్య భాగీరథ్యాస్త్వనిన్దితా,
వైదేహీ ప్రాఞ్జలిర్భూత్వా తాం నదీమిదమబ్రవీత్. 82

ప్ర. అ. అనిన్దితా = నిందింపబడని, వైదేహీ = సీత, భాగీరథ్యాః = గంగానదియొక్క, మధ్యమ్ = మధ్యప్రదేశమును, సమనుప్రాప్య = పొంది, ప్రాఞ్జలిః = కట్టబడిన దోసిలి కలది, భూత్వా = అయి, తాం నదీమ్ = ఆ నదిని గూర్చి, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఎట్టి నిందలును ఎరుగని సీత గంగానది మధ్యను చేరిన పిమ్మట చేతులు జోడించి ఆ గంగానదితో ఇట్లనెను. 82

మూ. పుత్రో దశరథస్యాయం మహారాజస్య ధీమతః,
నిదేశం పారయిత్వేమం గఙ్గే త్వదభిరక్షితః. ౮౩
చతుర్దశ హి వర్షాణి సమగ్రాణ్యుష్య కాననే,
భ్రాత్రా సహ మయా చైవ పునః ప్రత్యాగమిష్యతి. ౮౪
తతస్త్వాం దేవి సుభగే క్షేమేణ పునరాగతా,
యక్ష్యే ప్రముదితా గఙ్గే సర్వకామసమృద్ధినీ. ౮౫

ప్ర. అ. గఙ్గే = ఓ గంగా, ధీమతః = బుద్ధిమంతుడూ, మహారాజస్య = మహారాజూ అయిన, దశరథస్య = దశరథునియొక్క, పుత్రః = పుత్రు డైన, అయమ్ = ఈ రాముడు, త్వదభిరక్షితః = నీచే రక్షింపబడినవాడై, ఇమమ్ = ఈ, నిదేశమ్ = ఆజ్ఞను, పారయిత్వా = పాలించి, భ్రాత్రా సహ = సోదరునితోనూ, మయా చైవ = నాతోనూ, చతుర్దశ = పదునాలుగు, వర్షాణి = సంవత్సరములు, సమగ్రాణి = సంపూర్ణ మైన, వర్షాణి = సంవత్సరములు, కాననే = అడవియందు, ఉష్య = నివసించి, పునః = తిరిగి, ప్రత్యాగమిష్యతి = వెనుకకు రాగలడు. సుభగే = సుందర మైన, దేవి = దేవీ! గఙ్గే = గంగా, తతః = అటుపిమ్మట, క్షేమేణ = క్షేమముగా, పునః = మరల, ఆగతా = వచ్చినదానను, ప్రముదితా = సంతోషించినదానను, సర్వకామసమృద్ధినీ = సమస్తకామముల సమృద్ధి కల దానను అయిన నేను, త్వామ్ = నిన్ను, యక్ష్యే = పూజించెదను.

తా. ఓ గంగాదేవీ! ధీమంతు డైన దశరథమహారాజు కుమారు డైన ఈ రాముడు నీచేత రక్షింపబడుచు, సోదరునితోను, నాతోను కలిసి పదునాలుగు సంవత్సరములు పూర్తిగా అరణ్యవాసము చేసి, తండ్రి యాజ్ఞను పాలించి, మరల వచ్చును. సౌందర్యవతి వైన ఓ గంగాదేవీ! అప్పుడు, కోరిక లన్నియు, సఫలము లై, ఆనందముతో నేను క్షేమముగ తిరిగి వచ్చి, నిన్ను పూజించెదను.

మూ. త్వం హి త్రిపథగా దేవి బ్రహ్మలోకం సమీక్షసే,
భార్యా చోదధిరాజస్య లోకేఽస్మిన్ సంప్రదృశ్యసే. ౮౬

ప్ర. అ. దేవి = ఓ గంగాదేవీ! త్రిపథగా = మూడు మార్గములందు (స్వర్గ భూలోక - పాతాళములందు) ప్రవహించుచున్న, త్వమ్ = నీవు, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమును, సమీక్షసే హి = చూచుచున్నావు కదా. అస్మిన్ = ఈ, లోకే =

భూలోకమునందు, ఉదధిరాజస్య=సముద్రరాజుయొక్క, భార్యా చ=భార్యవుగా కూడ, సంప్రదృశ్యసే=చూడబడుచున్నావు.

తా. ఓ గంగాదేవీ! స్వర్గ భూలోక పాతాళములందు మూడింటియందును ప్రవహించుటచే నీవు బ్రహ్మలోకముతో సంబంధించి ఉన్నావు. ఈ లోకమునందు సముద్రుని భార్యవుగా కనబడుచున్నావు. 86

మూ. సా త్వాం దేవి నమస్యామి ప్రశంసామి చ శోభనే,
ప్రాప్తరాజ్యే నరవ్యాఘ్రే శివేన పునరాగతే. 87
గవాం శతసహస్రాణి వస్త్రాణ్యన్నం చ పేశలమ్,
బ్రాహ్మణేభ్యః ప్రదాస్యామి తవ ప్రియచికీర్షయా 88

ప్ర. అ. దేవి=ఓ గంగాదేవీ! శోభనే = ఓ మంగళకర మైన దానా, సా=అట్టి నేను, త్వామ్ = నిన్ను, నమస్యామి = నమస్కరించుచున్నాను. ప్రశంసామి చ=స్తుతించుచున్నాను కూడ. శివేన=క్షేమముగా, పునః=తిరిగి, ఆగతే=వచ్చిన, నరవ్యాఘ్రే=నరులలో శ్రేష్ఠు డైన రాముడు, ప్రాప్తరాజ్యే=పొందబడిన రాజ్యము కలవా డగుచుండగా, తవ=నీకు, ప్రియచికీర్షయా = ప్రియమును చేయవలయు నను కోరికచే, గవామ్=గోవులయొక్క, శతసహస్రాణి=లక్షలను, వస్త్రాణి=వస్త్రములను, పేశలమ్ = మనోహర మైన, అన్నం చ = అన్నమును, బ్రాహ్మణేభ్యః=బ్రాహ్మణులకు, ప్రదాస్యామి = ఇచ్చెదను.

తా. మంగళప్రదురాల వైన ఓ గంగాదేవీ! నిన్ను నమస్కరించి స్తుతించుచున్నాను. పురుషశ్రేష్ఠు డైన రాముడు, సుఖముగా తిరిగి వచ్చి, రాజ్యమును పొందిన పిమ్మట, నీ సంతోషమునకై బ్రాహ్మణులకు, లక్షలకొలది గోవులను, వస్త్రములను, మంచి అన్నమును ఇచ్చెదను. 87, 88

మూ. సురాఘటసహస్రేణ మాంసభూతోదనేన చ,
యక్ష్యే త్వాం ప్రయతా దేవి పురీం పునరుపాగతా. 89

ప్ర. అ. దేవి=ఓ గంగాదేవీ, పునః=మరల, పురీమ్=పట్టణమును, ఉపాగతా = పొందిన నేను, ప్రయతా = నియమవంతురాలనై, సురాఘట

సహస్రేణ = వెయ్యి కల్లుకుండలతోను, మాంసభూతోదనేన చ = మాంసరూప మైన అన్నముతోను, యక్ష్యే = పూజించెదను.

తా. ఓ గంగాదేవీ! వనవాసమునుండి తిరిగి వచ్చిన పిమ్మట, నేను నియమవంతురాలనై నీకు వెయ్యి కుండల కల్లు, మాంసరూప మైన ఆహారము, సమర్పించి పూజించెదను. 89

మూ. యాని త్వత్తీరవాసీని దైవతాని చ సన్తి హి,
తాని సర్వాణి యక్ష్యామి తీర్థాన్యాయతనాని చ. 90

ప్ర. అ. యాని = ఏ, దైవతాని = దేవతలు, త్వత్తీరవాసీని = నీ తీరము నందు నివసించుచు, సన్తి = ఉన్నవో, తాని సర్వాణి = వాటి నన్నిటిని, తీర్థాని = తీర్థములను, ఆయతనాని చ = దేవాలయములను, యక్ష్యామి = పూజించెదను.

తా. నీ తీరములపై ఉన్న సమస్తదేవతలను, తీర్థములను, దేవాలయములను కూడ పూజించెదను. 90

మూ. పునరేవ మహాబాహుర్మయా భ్రాత్రా చ సంగతః,
అయోధ్యాం వనవాసాత్తు ప్రవిశత్వనఘోఽనఘే. 91

ప్ర. అ. అనఘే = ఓ పుణ్యాత్మురాలా! అనఘః = దోషములు లేని, మహాబాహుః = గొప్ప బాహువులు కల రాముడు, మయా = నాతోను, భ్రాత్రా చ = సోదరునితోను, సంగతః = కూడినవాడై, వనవాసాత్ = వనవాసమునుండి, పునరేవ = మరల, అయోధ్యామ్ = అయోధ్యను, ప్రవిశతు = ప్రవేశించుగాక!

తా. ఓ పుణ్యాత్మురాలా! పాపరహితుడు, మహాబాహువు అయిన, రాముడు, నాతోను సోదరునితోను కలసి, వనవాసమునుండి తిరిగి వచ్చి, మరల అయోధ్యలో ప్రవేశించుగాక. 91

మూ. తథా సంభాషమాణా సా సీతా గఙ్గామనిన్దితా,
దక్షిణా దక్షిణం తీరం క్షిప్రమేవాభ్యుపాగమత్. 92

ప్ర. అ. అనిన్దితా = నిందింపబడనిది, దక్షిణా = సమర్థురాలు అయిన, సా సీతా = ఆ సీత, తథా = అట్లు, సంభాషమాణా = పలుకుచు, క్షిప్రమేవ = శీఘ్రము

గాన్, దక్షిణమ్=దక్షిణము వైపు నున్న, తీరమ్=తీరమును, అభ్యుపాగమత్= చేరెను.

తా. నిందింపబడనిది, సమర్థురాలు అయిన సీత, ఇట్లు పలుకుచు, శీఘ్రముగా దక్షిణము వైపున నున్న తీరమును చేరెను.

మూ. తీరం తు సమనుప్రాప్య నావం హిత్వా నరర్షభః,
ప్రాతిష్ఠత సహ భ్రాత్రా వైదేహ్యా చ పరంతపః. 93

ప్ర. అ. నరర్షభః=నరశ్రేష్ఠుడు, పరంతపః=శత్రువులను తపింపచేయువాడు అయిన రాముడు, తీరమ్=తీరమును, సమనుప్రాప్య=చేరి, నావమ్=నావను, హిత్వా=విడచి, భ్రాత్రా సహ=సోదరునితోను, వైదేహ్యా చ=సీతతోను, ప్రాతిష్ఠత=బయలుదేరెను.

తా. శత్రుభయంకరుడు, నరశ్రేష్ఠుడు అయిన రాముడు, తీరమును చేరిన పిమ్మట ఆ నావను విడచి, సోదరునితోను, సీతతోను కలిసి నడిచి వెళ్లెను.

మూ. అథాఽబ్రవీన్మహాబాహుః సుమిత్రానన్దవర్ధనమ్,
భవ సంరక్షణార్థాయ సజనే విజనేఽపి వా. 94

ప్ర. అ. అథ=అటుపిమ్మట, మహాబాహుః=గొప్ప బాహువులు గల రాముడు, సుమిత్రానన్దవర్ధనమ్=సుమిత్రకు ఆనందమును వృద్ధి పొందించు లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్=పలికెను. సజనే=జను లున్న ప్రదేశమం దైనను, విజనేఽపి వా=జనులు లేని ప్రదేశమం దైనను, సంరక్షణార్థాయ=సంరక్షణ మను ప్రయోజనముకొరకు, భవ=ఆగుము.

తా. పిదప ఆజానుబాహు వైన రాముడు, లక్ష్మణునితో ఇట్లనెను. జనులున్న ప్రదేశమం దైనను, లేని ప్రదేశమం దైనను, రక్షణము విషయమున, జాగ్రత్తతో ఉండుము. 94

మూ. అవశ్యం రక్షణం కార్యమదృష్టే విజనే వనే,
అగ్రతో గచ్ఛ సౌమిత్రే! సీతా త్వామనుగచ్ఛతు. 95

ప్ర. అ. అదృష్టే=చూడబడని, విజనే=జనులు లేని, వనే=వనమునందు, అవశ్యమ్=తప్పక, రక్షణమ్=రక్షణము, కార్యమ్=చేయదగినది.

సౌమిత్రే=ఓ లక్ష్మణా, అగ్రతః=ముందు, గచ్ఛ=నడువుము. సీతా=సీత, త్వామ్=నిన్ను, అనుగచ్ఛతు=అనుసరించి నడచుగాక!

తా. పూర్వ మెన్నడును చూడని ఈ జనశూన్య మైన అరణ్యములో మనము తప్పక రక్షణవిషయమున జాగ్రత్తతో ఉండవలెను. ఓ లక్ష్మణా! నీవు ముందు నడువుము. సీత వెనుక నడచును. 95

మూ. పృష్ఠతోఽహం గమిష్యామి త్వాం చ సీతాం చ పాలయన్,
అన్యోన్యస్యేహ నో రక్షా కర్తవ్యా పురుషర్షభ. 96

ప్ర. అ. అహమ్=నేను, త్వాం చ=నిన్ను, సీతాం చ=సీతను, పాలయన్=రక్షించుచు, పృష్ఠతః=వెనుక, గమిష్యామి=నడచెదను, పురుషర్షభ=ఓ పురుషశ్రేష్ఠా! ఇహ=ఇక్కడ, నః=మనకు, అన్యోన్యస్య=పరస్పరము యొక్క, రక్షా=రక్ష, కర్తవ్యా=చేయతగినది.

తా. లక్ష్మణా! నేను నిన్ను, సీతను రక్షించుచు, వెనుక నడచెదను. మనము ఇక్కడ ఒకరి నొకరు రక్షించుకొనవలెను 96

మూ. న హి తావదతిక్రాన్తా సుకరా కాచన క్రియా,
అద్య దుఃఖం తు వైదేహీ వనవాసస్య వేత్స్యతి. 97

ప్ర. అ. అతిక్రాన్తా=జరిగిపోయిన, కాచన క్రియా=ఏ పనియు, సుకరా=మరల సులభముగా చేయదగినది, న హి తావత్=కాదు కదా! అద్య=ఇపుడు, వైదేహీ=సీత, వనవాసస్య=వనవాసముయొక్క, దుఃఖమ్=దుఃఖమును, వేత్స్యతి=తెలుసుకొనగలదు.

తా. ఏ పని యైనను, చేయి దాటి పోయినచో, దానిని మరల సరిచేయుట శక్యము గాదు. వనవాసములోని కష్టములను గూర్చి ఇటు పైన, సీతకు అర్థమగును. 97

మూ. ప్రణష్టజనసంబాధం క్షేత్రారామవివర్జితమ్,
విషమం చ ప్రపాతం చ వనమద్య ప్రవేక్ష్యతి. 98

ప్ర. అ. ప్రణష్టజనసంబాధమ్=కనబడని జనసమ్మర్దము కలది, క్షేత్రారామవివర్జితమ్=తోటలతోను, ఉద్యానములతోను శూన్య మైనది, విషమమ్ చ

మెట్ట పల్లములుగా ఉన్నది, ప్రపాతం చ=గోతులతో నిండినది అయిన, వనమ్=వనమును, అద్య=నేడు, ప్రవేక్ష్యతి=ప్రవేశించగలదు.

తా. ఈ వనములో జనసమ్మర్దము కాని, పొలములు గాని, ఉద్యానవనములు గాని ఉండవు. మిట్టపల్లములు, లోతైన లోయలు ఉండును. అట్టి వనములోనికి సీత ఈనాడు ప్రవేశింపగలదు. 98

మూ. శ్రుత్వా రామస్య వచనం ప్రతస్థే లక్ష్మణోఽగ్రతః,
అనన్తరం చ సీతాయా రాఘవో రఘునన్దనః. 99

ప్ర. అ. లక్ష్మణః=లక్ష్మణుడు, రామస్య=రామునియొక్క, వచనమ్=వచనమును, శ్రుత్వా=విని, అగ్రతః=ముందు, ప్రతస్థే=నడచెను. సీతాయాః=సీతకు, అనన్తరమ్=వెనుక, రఘునన్దనః=రఘువంశము వారిని ఆనందింపచేయు, రాఘవః=రాముడు నడచెను.

తా. లక్ష్మణుడు, రాముని మాట ప్రకారము ముందుగా నడచెను. రాముడు సీత వెనుక నడచెను. 99

మూ. గతం తు గఙ్గాపరపారమాశు
రామం సుమన్త్రః ప్రతతం నిరీక్ష్య,
అధ్వప్రకర్షాద్వినివృత్తదృష్టి
ర్ముమోచ బాష్పం వ్యథిత స్తపస్వీ. 100

ప్ర. అ. తపస్వీ=దీనుడైన, సుమన్త్రః=సుమంత్రుడు, ఆశు=శీఘ్రముగా, గఙ్గాపరపారమ్=గంగ అవలి ఒడ్డును, గతమ్=చేరిన, రామమ్=రాముని, ప్రతతమ్=అవిచ్ఛిన్నముగా, నిరీక్ష్య=చూచి, అధ్వప్రకర్షాత్=మార్గముయొక్క అధిక్యమువలన, వినివృత్తదృష్టిః= మరలిన చూపులు కలవాడై, వ్యథితః=దుఃఖపడుచు, బాష్పమ్=కన్నీటిని, ముమోచ=విడచెను.

తా. దీనుడైన ఆ సుమంత్రుడు, గంగ అవతలి ఒడ్డుకు శీఘ్రముగా చేరిన రాముని కనబడునంతవరకు చూచుచునే ఉండి మార్గము దీర్ఘమై పోవుటచే కనబడక, దృష్టిని మరల్చి దుఃఖితుడై కన్నీరు కార్చెను.

మూ. స లోకపాలప్రతిమప్రభావవాం
స్తీర్త్వా మహాత్మా వరదో మహానదీమ్
తతః సమృద్ధాన్ శుభసస్యమాలినః
క్రమేణ వత్సాన్ ముదితానుపాగమత్. 101

ప్ర. అ. మహాత్మా=మహాత్ముడు, వరదః=వరముల నిచ్చువాడు, లోకపాలప్రతిమప్రభావవాన్ = లోకపాలురతో సమాన మైన ప్రభావము కలవాడు అయిన, సః=ఆ రాముడు, మహానదీమ్= ఆ గంగానదిని, తీర్త్వా=దాటి, తతః =అటుపిమ్మట, క్రమేణ = క్రమముగా, సమృద్ధాన్=సమృద్ధి కలది అయిన, ముదితాన్=ఆనందముతో కూడిన,వత్సాన్=వత్సదేశమునకు,ఉపాగమత్=చేరెను.

తా. లోకపాలురతో సమాన మైన ప్రభావము కలవాడు, మహాత్ముడు, వరముల నిచ్చువాడు అయిన ఆ రాముడు గంగానదిని దాటిన పిమ్మట, నడచి వెళ్ళుచు, ఉత్తమ మైన సస్యసముదాయములతో నిండినది, ఐశ్వర్యముతో సమృద్ధ మైనది, సంతోషించిన జనులు కలది యైన, వత్సదేశమును చేరెను.

మూ. తౌ తత్ర హత్వా చతురో మహామృగాన్
వరాహమృశ్యం పృషతం మహారురుమ్,
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ
వాసాయ కాలే యయతుర్వనస్పతిమ్. 102

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే ద్విపంచాశః సర్గః.

ప్ర. అ. బుభుక్షితౌ=ఆకలి గొన్న, తౌ=ఆ రామలక్ష్మణులు, తత్ర= అక్కడ, వరాహమ్=వరాహమును, ఋశ్యమ్=ఋశ్యమృగమును, పృషతమ్= దుప్పిని, మహారురుమ్= నల్లచారల దుప్పిని, చతురః=నాలుగు, మృగాన్= మృగములను, హత్వా= చంపి, మేధ్యమ్= పవిత్ర మైన మాంసమును, త్వరితమ్= శీఘ్రముగా, ఆదాయ= గ్రహించి, కాలే = సాయంకాలమునందు, వాసాయ = నివాసము కొరకు, వనస్పతిమ్= వృక్షమును, యయతుః = చేరిరి.

తా. ఆకలిగొన్న ఆ రామలక్ష్మణులు, అక్కడ వరాహము, ఋష్యము, దుప్పి, నల్లచారల దుప్పియను నాలుగు మహామృగములను చంపి, వాటి పరిశుద్ధమైన మాంసమును తీసుకొని, సాయంకాలము కాగానే రాత్రి నివసించుటకు, ఒక చెట్టు మొదలు చేరిరి. 102

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదిరెండవ సర్గ సమాప్తము.

## అథ త్రిపఞ్చాశః సర్గః

*[రాజును నిందించుచు కైక కౌసల్యాదులకు కీడు కలిగించునేమో యని రాముడు లక్ష్మణు నయోధ్యకు పంప ప్రయత్నించుట. రాముడు లేనిచో తాను జీవించుట అసంభవ మని పలికి లక్ష్మణుడు అయోధ్యకేగుటకు తిరస్కరించుట. తిరిగి రాముడు అతనిని వనవాసమున కనుమతించుట]*

మూ. స తం వృక్షం సమాసాద్య సన్ధ్యామన్వాస్య పశ్చిమామ్,
రామో రమయతాం శ్రేష్ఠ ఇతి హోవాచ లక్ష్మణమ్. 1

ప్ర. అ. రమయతామ్ = సంతోషింపచేయువారలలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, సః రామః = ఆ రాముడు, తం వృక్షమ్ = ఆ వృక్షమును, సమాసాద్య = చేరి, పశ్చిమామ్ = పడమటి, సన్ధ్యామ్ = సంధ్యను, అన్వాస్య = సేవించి, లక్ష్మణమ్ = లక్ష్మణుని గూర్చి, ఇతి = ఇట్లు, ఉవాచ హ = పలికెను.

తా. ఆనందింపచేయువారలలో శ్రేష్ఠుడైన రాముడు, వృక్షమూలము చేరి, పడమటి సంధ్యను ఉపాసించి, లక్ష్మణునితో ఇట్లనెను. 1

మూ. అద్యేయం ప్రథమా రాత్రిర్యాతా జనపదాద్బహిః,
యా సుమన్త్రేణ రహితా తాం నోత్కణ్ఠితుమర్హసి. 2

ప్ర. అ. అద్య = నేడు, సుమన్త్రేణ = సుమంత్రునితో, రహితా = శూన్యమైన, యా = ఏ, ఇయమ్ = ఈ, ప్రథమా రాత్రిః = మొదటి రాత్రి, జనపదాత్ = జనపదము కంటె, బహిః = వెలుపల, యాతా = పొందబడినదో, తామ్ = అట్టి ఈ రాత్రిని గూర్చి, ఉత్కణ్ఠితుమ్ = బెంగపెట్టుకొనుటకు, నార్హసి = తగవు.

తా. ఇపుడు మనము మన దేశము బయటకు వచ్చినాము. సుమంత్రుడు కూడ వెళ్ళి పోయినాడు. ఇటుపై మనము ఒంటరిగా ఉండవలసిన రాత్రులలో, ఇది మొదటిది. నీవు దుఃఖింపకుము. 2

మూ. జాగర్తవ్య మతన్ద్రిభ్యామద్యప్రభృతి రాత్రిషు,
యోగక్షేమౌ హి సీతాయా వర్తేతే లక్ష్మణావయోః. ౩

ప్ర. అ. లక్ష్మణ! = ఓ లక్ష్మణా! అద్య ప్రభృతి = నేడు మొదలు, రాత్రిషు = రాత్రులందు, అతన్ద్రిభ్యామ్ = ఏమరుపాటు లేకుండగ, (మన ఇరువురి చేత), జాగర్తవ్యమ్ = మేల్కొనవలసి యున్నది. సీతాయాః = సీతయొక్క, యోగక్షేమౌ = యోగక్షేమములు, ఆవయోః = మన ఇద్దరిపై, వర్తేతే హి = ఉన్నవి కదా!

తా. నేడు మొదలు మన యిద్దరము రాత్రులందు మేల్కొని యుండవలెను. సీత యోగక్షేమములు మన యిద్దరి పైననే ఆధారపడియున్నవి కదా! ౩

మూ. రాత్రిం కథంచిదేవేమాం సౌమిత్రే వర్తయామహే,
ఉపావర్తామహే భూమావాస్తీర్య స్వయమార్జితైః. ౪

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! ఇమాం రాత్రిమ్ = ఈ రాత్రిని, కథంచిదేవ = ఏదో విధముగానే, వర్తయామహే = గడపెదము. స్వయమ్ = స్వయముగా, ఆర్జితైః = సంపాదింపబడిన తృణాదులచే, భూమౌ = నేలపై, ఆస్తీర్య = కప్పి, ఉపావర్తామహే = పరుండెదము.

తా. లక్ష్మణా! పచ్చియా పర్ణాదులు స్వయముగా తెచ్చుకొని, భూమిపై పరచుకొని, పరుండి, ఈ రాత్రి ఏదో విధముగా గడపెదము. ౪

మూ. స తు సంవిశ్య మేదిన్యాం మహార్హశయనోచితః,
ఇమాః సౌమిత్రయే రామో వ్యాజహార కథాః శుభాః. ౫

ప్ర. అ. మహార్హశయనోచితః = ఉత్తమ మైన శయనమునకు అలవాటు పడిన, సః = రాముడు, మేదిన్యామ్ = నేలపై, సంవిశ్య = శయనించి, సౌమిత్రయే = లక్ష్మణునకు, శుభాః = శుభ మైన, ఇమాః = ఈ, కథాః = మాటలను, వ్యాజహార = చెప్పెను.

తా. ఉత్తమ మైన పాన్పుపై పరుండుటకు అలవాటు పడిన ఆ రాముడు నేలపై పరుండి, లక్ష్మణునితో ఈ విధముగా మంచి మాటలు చెప్పెను. ౫

మూ. ధ్రువమద్య మహారాజో దుఃఖం స్వపితి లక్ష్మణ,
కృతకామా తు కైకేయీ తుష్టా భవితుమర్హతి. 6

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! అద్య = ఇపుడు, మహారాజః = మహారాజా, ధ్రువమ్ = నిశ్చయముగా, దుఃఖమ్ = దుఃఖముగా, స్వపితి = నిద్రపోవును. కృతకామా = చేయబడిన కోరిక గల, కైకేయీ తు = కైకేయి మాత్రము, తుష్టా = సంతోషించినదై, భవితుమ్ = అగుటకు, అర్హతి = తగియున్నది.

తా. లక్ష్మణా! మహారాజునకు ఇపుడు దుఃఖముతో నిద్ర పట్టదు. కైకేయి మాత్రము తన కోరిక తీరుటచే సంతోషించుచుండును. 6

మూ. సా హి దేవీ మహారాజం కైకేయీ రాజ్యకారణాత్,
అపి న చ్యావయేత్ప్రాణాన్ దృష్ట్వా భరతమాగతమ్. 7

ప్ర. అ. సా = ఆ, దేవీ = రాణి యైన, కైకేయీ = కైకేయి, ఆగతమ్ = వచ్చిన, భరతమ్ = భరతుని, దృష్ట్వా = చూచి, రాజ్యకారణాత్ = రాజ్యము కొరకై, మహారాజమ్ = మహారాజును, ప్రాణాన్ = ప్రాణములను, న చ్యావయేదపి = విడిపింపచేయదు కదా!

తా. ఆ కైకేయి భరతుడు వచ్చిన పిమ్మట రాజ్యము కొరకై మహారాజు ప్రాణములను తీసివేయదు కదా! 7

మూ. అనాథశ్చ హి వృద్ధశ్చ మయా చైవ వినాకృతః,
కిం కరిష్యతి కామాత్మా కైకేయీవశమాగతః. 8

ప్ర. అ. అనాథశ్చ = దిక్కు లేనివాడు, వృద్ధశ్చ = వృద్ధుడు, మయా వినా చ = నేను లేకుండగా కూడ, కృతః = చేయబడినవాడు, కామాత్మా = కామబుద్ధి గల ఆ రాజు, కైకేయీవశమ్ = కైకేయివశమును, ఆగతః = పొందినవాడై, కిం కరిష్యతి = ఏమి చేయగలడు.

తా. ఆ రాజు కామబుద్ధి కలవాడై, కైకేయికి లొంగి పోయినాడు. ఇపుడు నామంతటి కూడ దూర మైనాడు. దిక్కు లేక, వృద్ధుడై యున్న ఆ రాజు ఏమి చేయగలడు. 8

మూ. ఇదం వ్యసనమాలోక్య రాజ్ఞశ్చ మతివిభ్రమమ్,
కామ ఏవార్థధర్మాభ్యాం గరీయానితి మే మతిః. 9

ప్ర. అ. ఇదమ్ = ఈ, వ్యసనమ్ = కష్టమును, రాజ్ఞః = రాజుయొక్క, మతివిభ్రమం చ = బుద్ధియొక్క భ్రాంతిని, ఆలోక్య = చూచి, అర్థధర్మాభ్యామ్ = అర్థ ధర్మములకంటె, కామ ఏవ = కామమే, గరీయాన్ = గొప్పది, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = ఆలోచన.

తా. ఈ కష్టమును, రాజు బుద్ధిలో కలిగిన ఈ భ్రాంతిని చూడగా, అర్థ ధర్మములకంటె కూడ కామమే గొప్పదని నాకు అభిప్రాయము కలుగుచున్నది.

మూ. కో హ్యవిద్వానపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్,
ఛన్దానువర్తినం పుత్రం తాతో మామివ లక్ష్మణ. 10

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! తాతః = తండ్రి, మామివ = నన్నువలె, ప్రమదాయాః కృతే = స్త్రీకొరకై, ఛన్దానువర్తినమ్ = తన ఇష్టము ప్రకారము ప్రవర్తించు, పుత్రమ్ = కుమారుని, అవిద్వానపి = తెలివి తక్కువవాడైనను, కః పుమాన్ = ఏ పురుషుడు, త్యజేత్ = విడుచును.

తా. లక్ష్మణా! మన తండ్రి నన్ను విడిచివేసి నట్లు, ఎంత తెలివితక్కువ వాడైనను, ఆడుదాని మాట విని, తన యిష్టము ప్రకారము ప్రవర్తించు కుమారుని విడిచిపెట్టునా! 10

మూ. సుఖీ బత సభార్యశ్చ భరతః కైకయీసుతః,
ముదితాన్ కోసలానేకో యో భోక్ష్యత్యధిరాజవత్. 11

ప్ర. అ. యః = ఏ భరతుడు, ఏకః = ఒక్కడే, అధిరాజవత్ = మహారాజువలె, ముదితాన్ = సుఖసమృద్ధమైన, కోసలాన్ = కోసలదేశమును, భోక్ష్యతి = అనుభవింపగలడో, సభార్యః = భార్యా సహితుడైన, కైకయీసుతః = కైకయీకుమారుడైన, భరతః = భరతుడు, సుఖీ = సుఖముగలవాడు. బత = ఎంత కష్టము.

తా. కైకేయి కుమారుడైన భరతు డొక్కడే భార్యాసహితుడై మహారాజువలె, ఐశ్వర్య సమృద్ధమైన కోసలదేశమును సుఖముగా అనుభవింపగలడు.

మూ. స హి సర్వస్య రాజ్యస్య ముఖమేకం భవిష్యతి,
తాతే చ వయసాఽతీతే మయి చారణ్యమాస్థితే. 12

ప్ర. అ. తాతే = తండ్రి, వయసా = వయస్సుచేత, అతీతే = గడచిపోగా, మయి చ = నేను, అరణ్యమ్ = అరణ్యమును, ఆస్థితే = ఆశ్రయించి ఉండగా, సః = ఆ భరతుడు, సర్వస్య = సమస్త మైన, రాజ్యస్య = రాజ్యమునకు, ఏకమ్ = ఒక్క, ముఖమ్ = ప్రధాన వ్యక్తి గా, భవిష్యతి = కాగలడు.

తా. రాజు వయస్సు చేత మరణించును. నేను అరణ్యములో ఉన్నాను. అందుచే ఆ భరతుడు రాజ్యమునకు అంతకును ప్రధాను డైన రాజు కాగలడు.

మూ. అర్థధర్మౌ పరిత్యజ్య యః కామమనువర్తతే,
ఏవమాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా. 13

ప్ర. అ. యః = ఎవడు, అర్థధర్మౌ = అర్థమును, ధర్మమును, పరిత్యజ్య = విడచి, కామమ్ = కామమును మాత్రమే, అనువర్తతే = అనుసరించునో అతడు, రాజా = రాజైన, దశరథో యథా = దశరథుడు వలె, క్షిప్రమ్ = శీఘ్రముగా, ఏవమ్ = ఇట్లు, ఆపద్యతే = ఆపదను పొందును.

తా. అర్థధర్మములు విడిచి కామమునే అనుసరించువాడు, దశరథమహా రాజు వలె శీఘ్రముగా ఈ విధముగనే ఆపదలలో చిక్కుకొనును. 13

మూ. మన్యే దశరథాన్తాయ మమ ప్రవ్రాజనాయ చ,
కైకేయీ సౌమ్య సంప్రాప్తా రాజ్యాయ భరతస్య చ. 14

ప్ర. అ. సౌమ్య = ఓ సౌమ్యుడా! కైకేయీ = కైకేయి, దశరథాన్తాయ = దశరథుని మరణము కొరకు, మమ = నా యొక్క, ప్రవ్రాజనాయ చ = అడవికి పంపుటకు, భరతస్య = భరతునియొక్క, రాజ్యాయ చ = రాజ్యముకొరకు, సంప్రాప్తా = వచ్చినది అని, మన్యే = తలంచెదను.

తా. సౌమ్యుడ వైన ఓ లక్ష్మణా! ఈ కైకేయి, దశరథుని చావునకును, నా వనగమనమునకును, భరతుని రాజ్యమునకును, మన యింట చేరిన దని అనుకొనుచున్నాను. 14

మూ. అపీదానీం న కైకేయీ సౌభాగ్యమదమోహితా,
కౌసల్యాం చ సుమిత్రాం చ సంప్రబాధేత మత్కృతే.15

ప్ర. అ. కైకేయీ = కైకేయి, సౌభాగ్యమదమోహితా = సౌభాగ్యము వలన కలిగిన గర్వముచే ఒళ్ళు తెలియనిదై, మత్కృతే = నాకొరకై, కౌసల్యాం చ = కౌసల్యను, సుమిత్రాం చ = సుమిత్రను, ఇదానీమ్ = ఇపుడు, అపి న సంప్రబాధేత = బాధింపకుండునా?

తా. కైకేయి తనకు కలిగిన సౌభాగ్యముచే గర్వించి, ఒళ్ళు తెలియక, నా మూలమున కౌసల్యను, సుమిత్రను కూడ బాధించదు కదా! 15

మూ. మా స్మ మత్కారణాద్దేవీ సుమిత్రా దుఃఖమావసేత్,
అయోధ్యామిత ఏవ త్వం కాల్యే ప్రవిశ లక్ష్మణ. 16

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా, మత్కారణాత్ = నావలన, దేవీ = దేవియైన, సుమిత్రా = సుమిత్ర, దుఃఖమ్ = దుఃఖముగా, మా ఆవసేత్ స్మ = నివసించకుండుగాక. త్వమ్ = నీవు, కాల్యే = ప్రాతఃకాలమున, ఇత ఏవ = ఇక్కడినుండియే, అయోధ్యామ్ = అయోధ్యను, ప్రవిశ = ప్రవేశించుము.

తా. లక్ష్మణా! నా మూలమున సుమిత్రాదేవి కూడ దుఃఖపడకుండుగాక! అందుచే నీవు ప్రాతఃకాలముననే లేచి ఇక్కడినుండియే అయోధ్యకు వెళ్ళుము. 16

మూ. అహమేకో గమిష్యామి సీతయా సహ దణ్డకాన్,
అనాథాయా హి నాథస్త్వం కౌసల్యాయా భవిష్యసి. 17

ప్ర. అ. అహమ్ = నేను, ఏకః = ఒక్కరనే, సీతయా సహ = సీతతో కూడ, దణ్డకాన్ = దండకారణ్యమును గూర్చి, గమిష్యామి = వెళ్ళెదను. అనాథాయాః = అనాథురాలైన, కౌసల్యాయాః = కౌసల్యకు, త్వమ్ = నీవు, నాథః = రక్షకుడవు, భవిష్యసి = కాగలవు.

తా. నే నొక్కరనే సీతతో కలసి, దండకారణ్యమునకు వెళ్ళెదను. అనాథురాలైన కౌసల్యను నీవు రక్షింపుము. 17

మూ. క్షుద్రకర్మా హి కైకేయీ ద్వేష్యమన్యాయ్యమాచరేత్,
పరిదద్యా హి ధర్మజ్ఞే భరతే మమ మాతరమ్. 18

ప్ర. అ. క్షుద్రకర్మా = నీచమైన కర్మ గల, కైకేయీ = కైకేయి, ద్వేష్యమ్ = ద్వేషింప దగిన, అన్యాయ్యమ్ = అన్యాయమైన పనిని, ఆచరేత్ = చేయును. మమ = నాయొక్క, మాతరమ్ = తల్లిని, ధర్మజ్ఞే = ధర్మములను తెలిసిన, భరతే = భరతునియందు, పరిదద్యాః హి = ఇమ్ము.

తా. నీచమైన కార్యములను చేయు కైకేయి, నా తల్లి విషయమున న్యాయవిరుద్ధముగా ప్రవర్తించవచ్చును. అందుచే మా తల్లిని ధర్మములు తెలిసిన భరతునకు అప్పచెప్పుము. 18

మూ. నూనం జాత్యన్తరే కస్మిన్ స్త్రియః పుత్రైర్వియోజితాః,
జనన్యా మమ సౌమిత్రే తస్మాదేతదుపస్థితమ్. 19

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! మమ జనన్యా = నా తల్లిచేత, కస్మిన్ జాత్యన్తరే = ఒకానొక పూర్వజన్మయందు, స్త్రియః = స్త్రీలు, పుత్రైః = పుత్రులతో, వియోజితాః = వియోగము కలవారుగా చేయబడినారు. తస్మాత్ = ఆ కారణమువలననే, ఏతత్ = ఇది, ఉపస్థితమ్ = వచ్చినది. నూనమ్ = సత్యము.

తా. లక్ష్మణా! పూర్వజన్మలో ఎప్పుడో నా తల్లి, స్త్రీలను తమ పుత్రులనుండి దూరము చేసినది. అందువలననే ఈ కష్టము వచ్చినది. నిజము. 19

మూ. మయా హి చిరపుష్టేన దుఃఖసంవర్ధితేన చ,
విప్రాయుజ్యత కౌసల్యా ఫలకాలే ధిగస్తు మామ్. 20

ప్ర. అ. చిరపుష్టేన = చిరకాలము పోషింపబడిన, దుఃఖసంవర్ధితేన = కష్టపడి పెంచబడిన, మయా = నాతో, కౌసల్యా = కౌసల్య, ఫలకాలే = నావలన ఫలమును పొందవలసిన కాలమునందు, విప్రాయుజ్యత = వియోగము కలదిగా చేయబడినది. మామ్ = నన్నుగూర్చి, ధిక్ = నింద, అస్తు = అగుగాక.

తా. నన్ను చిరకాలము పోషించి, కష్టపడి పెంచిన నా తల్లి, నావలన ఫలమును పొందవలసిన సమయమున నానుండి దూరము చేయబడినది. నేనెంత వ్యర్థజన్ముడను! 20

మూ. మా స్మ సీమన్తినీ కాచిజ్జనయేత్పుత్రమీదృశమ్,
సౌమిత్రే యోఽహమమ్బాయా దద్మి శోకమనన్తకమ్. 21

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! యః = ఏ, అహమ్ = నేను, అమ్బాయాః = తల్లికి, అనన్తకమ్ = అంతములేని, శోకమ్ = శోకమును, దద్మి = ఇచ్చుచున్నానో, ఈదృశమ్ = ఇట్టి, పుత్రమ్ = పుత్రుని, కాచిత్ జననీ = ఏ తల్లియు, మా స్మ జనయేత్ = కనకుండుగాక.

తా. లక్ష్మణా! నేను నా తల్లికి అనంతమైన శోకమును కలిగించు చున్నాను. ఏ ఆడుది కూడ నావంటి పుత్రుని కనకుండుగాక. 21

మూ. మన్యే ప్రీతివిశిష్టా సా మత్తో లక్ష్మణ శారికా,
యస్యాస్తచ్ఛ్రూయతే వాక్యం శుకపాదమరేర్దశ. 22

ప్ర. అ. లక్ష్మణ = ఓ లక్ష్మణా! యస్యాః = ఏ గోరువంక పిట్టయొక్క, శుక = ఓ చిలుకా! అరేః = శత్రువుయొక్క, పాదమ్ = పాదమును, దశ = కొరుకుము అను, తత్ వాక్యమ్ = ఆ వాక్యము, శ్రూయతే = వినబడినదో, సా శారికా = ఆ గోరువంకపిట్ట, మత్తః = నాకంటె, ప్రీతివిశిష్టా = అధిక ప్రేమతో కూడినది అని, మన్యే = తలంచెదను.

తా. లక్ష్మణా! నా వనవాసము మాట వినగానే గోరువంకపిట్ట "ఓ చిలుకా! శత్రువైన కైకేయి పాదమును కొరుకుము" అని చిలుకతో పలికినది. ఆ శారికకు కౌసల్యపై నాకున్న ప్రీతికంటె ఎక్కువ ప్రీతి ఉన్నదని తలంచెదను.

వి. దీని భావం అంతగా బాగాలేదు. ఉన్నపాఠాన్ని పట్టి చెప్పబడినది. ప్రాచ్యప్రతిలో ఈశ్లోకం తరువాత

"యావదేకశ్చ అస్త్యశ్చ యావదన్యః ముఖం మయి,
తావద్ధార్మ్యవిమోక్షార్థం శుకపాదమరేర్దశ."

అనే మరొక శ్లోకం కూడా ఉన్నది.

"ఇది ఒంటరిగా ఆకాశంమీద ఉన్నప్పుడే దానిముఖం నామీద పడటానికి ముందుగా, ఈ శత్రువు పాదాన్ని కరచివేసి విమోచనము సంపాదించుము."

అని దీని భావము. మరొక పక్షి ఆక్రమించడానికై వచ్చుచున్నప్పుడు సారిక, చిలుకతో ఈ మాటలు చెప్పినట్లు కథ ఏదైనా ఉండి ఉంటుంది." పక్షులలోనే శత్రువులవిషయంలో అంత పగ ఉన్నప్పుడు నేను ఏమీ మాటలాడకుండా నాకూ, నా తల్లికి అపకారం తలపెట్టిన కైకేయికి లొంగిపోయినానుకదా! అని రాముని భావం అయి ఉంటుంది. 22

మూ. శోచన్త్యా అల్పభాగ్యాయా నకించిదుపకుర్వతా,
పుత్రేణ కిమపుత్రాయా మయా కార్యమరిందమ. 23

ప్ర- అ. అరిందమ = శత్రువులను శిక్షించువాడా! శోచన్త్యాః = దుఃఖించుచున్న, అల్పభాగ్యాయాః = అల్పమైన భాగ్యము గల, అపుత్రాయాః = ఇక పుత్రు లెవ్వరును లేని నా తల్లికి, కించిత్ = కొంచెము కూడ, నోపకుర్వతా = ఉపకారము చేయని, పుత్రేణ = పుత్రుడనైన, మయా = నాచేత, కిమ్ = ఏమి, కార్యమ్ = కార్యమున్నది.

తా. నేను తప్ప వేరు పుత్రు లెవ్వరును లేని అల్పభాగ్యురాలైన నా తల్లి ఏడ్చుచుండగా ఏ విధముగాను ఉపకారము చేయజాలని నేను పుత్రుడనై ఉండి ఏమి ప్రయోజనము? 23

మూ. అల్పభాగ్యా హి మే మాతా కౌసల్యా రహితా మయా,
శేతే పరమదుఃఖార్తా పతితా శోకసాగరే. 24

ప్ర. అ. అల్పభాగ్యా = అల్పమైన భాగ్యము గల, మే మాతా = నా తల్లి, కౌసల్యా = కౌసల్య, మయా = నాతో, రహితా = శూన్యురాలై, పరమదుఃఖార్తా = గొప్ప దుఃఖముచే పీడింపబడినదై, శోకసాగరే = దుఃఖసముద్రమునందు, పతితా = పడినదై, శేతే = శయనించియుండును.

తా. దురదృష్టవంతురాలైన నా తల్లి కౌసల్య, నేను దగ్గర లేకపోవుటచే అత్యధికమైన దుఃఖముచేత పీడితురాలై, శోకసాగరమునందు మునిగి పడియుండును. 24

మూ. ఏకో హ్యహమయోధ్యాం చ పృథివీం చాపి లక్ష్మణ,
తరేయమిషుభిః క్రుద్ధో నను వీర్యమకారణమ్. 25

ప్ర. అ. లక్ష్మణ=లక్ష్మణా! అహమ్=నేను, క్రుద్ధః=కోపగించినవాడనై, ఏకః=ఒక్కడనే, అయోధ్యాం చ=అయోధ్యను, పృథివీం చాపి=ఈ భూమిని అంతనూ, ఇషుభిః=బాణములచే, తరేయమ్=దాటగలను (సాధింపగలను). వీర్యమ్=పరాక్రమము, అకారణం నను=కారణము కాదు కదా.

తా. లక్ష్మణా! కోపించినచో, నేను ఒక్కడనే బాణములతో అయోధ్యను, ఈ భూమి నంతను గూడ సాధింపగలను. కాని ఇది పరాక్రమమును చూపు సందర్భము కాదు కదా! 25

మూ. అధర్మభయభీతశ్చ పరలోకస్య చానఘ,
తేన లక్ష్మణ నాద్యాహ మాత్మాన మభిషేచయే. 26

ప్ర. అ. అనఘ=దోషములు లేనివాడా! అహమ్=నేను, అధర్మభయభీతశ్చ=అధర్మమువలన భయముచేత సంకోచించుచున్నాను. పరలోకస్య చ=పరలోకమునకు కూడ భయపడుచున్నాను. లక్ష్మణ=లక్ష్మణా! తేన=ఆకారణము చేతనే, అద్య=ఇప్పుడు, ఆత్మానమ్=నన్ను, నాభిషేచయే=అభిషేకము చేయించుకొనుటలేదు.

తా. దోషరహితుడ వైన ఓ లక్ష్మణా! నేను అధర్మమునకును, పరలోకమునకును భయపడి రాజ్యాభిషేకము చేయించుకొనకాలం డున్నాను. 26

మూ. ఏతదన్యచ్చ కరుణం విలప్య విజనే వనే,
అశ్రుపూర్ణముఖో రామో నిశి తూష్ణీముపావిశత్. 27

ప్ర. అ. రామః=రాముడు, నిశి=రాత్రియందు, విజనే=జనశూన్య మైన, వనే=అరణ్యమునందు, ఏతత్=దీనిని, అన్యచ్చ=మరి ఇతరమునూ, కరుణమ్=దీనముగా, విలప్య=విలపించి, అశ్రుపూర్ణముఖః=కన్నీళ్ళతో నిండిన ముఖము గలవాడై, తూష్ణీమ్=మౌనముగా, ఉపావిశత్=కూర్చుండెను.

తా. రాముడా రాత్రి, విజన మైన వనమునందు, ఈ మాటలూ, మరి కొన్ని మాటలూ దైన్యముతో పలుకుచు, కన్నీళ్లతో నిండిన ముఖము కలవాడై మాట లాడక, కూర్చుండెను.

వి. ఈ ఘట్టములో రాముడు లక్ష్మణుని చిత్తస్థైర్యమును పరీక్షించుటకై "సీత వెనుకకు అయోధ్యకు వెళ్ళుము" అని చెప్పినాడు అని వ్యాఖ్యాతలు

వ్రాసిరి. వ్యాఖ్యాతలు వ్రాసే విశేషార్థా లన్నీ "రాముడు పరమాత్ముడు, అన్ని పనులూ కావలె ననియే చేయుచున్నాడు" అనే అభిప్రాయంతో వ్రాసినవి. కాని వాల్మీకి రాముని పూర్తిగా మానవునిగానే చిత్రించినాడు. ఏ ఘట్టమును చూచినా ఈ విషయం స్పష్ట మగును. రాముడు అరణ్యవాసానికి బయలుదేరి, అరణ్యములో కాలు పెట్టిన మొదటి రాత్రి అది. ఆ సమయములో ఎంతటి ధీరచిత్తు డైన మానవున కైనను ఈ విధము లైన భావములు కలుగుట స్వాభావికము. తన తండ్రి కూడ ధర్మముకంటె కామానికే ప్రాధాన్య మిచ్చి తనను అడవుల పాలు చేసినా డనీ, భరతుడు భార్యాసమేతు డై సర్వభోగాలు అనుభవించగల డనీ, తాను తలుచుకొన్నచో ఐంద్రప్రయోగము చేసి రాజ్యాభిషేకము పొందగల డనీ- ఈ విధ మైన మాట లన్నీ ఆర్త పరిస్థితిలో ఉన్న ఎంతటివా డైనను పలుకుట స్వాభావికము. "నేను దూరముగా నున్నపుడు కైక కౌసల్యకు బాధలు కలిగించును. అందుచే నీవు ఆమెను సంరక్షించుట కై వెనుకకు వెళ్ళుము" అని లక్ష్మణునితో చెప్పుట గూడ అతిసహజము. అంతే కాని అయోధ్యలోనే అన్ని నిర్ణయాలూ చేసికొని ఇంతవరకు వచ్చిన పిమ్మట రాముడు లక్ష్మణుని నిర్ణయంలోని దృఢత్వాన్ని శంకించి ఈ విధంగా అన్నా డనుట అంతగా సమంజసము కాదు. పరమాత్ము డైన రామునికి లక్ష్మణుని ఆశయము తెలియదా! అందుచేత ఇలాంటి ఘట్టాలలో అన్నింటిలోనూ వాల్మీకి మానవస్వాభావికప్రవృత్తిని అతి సహజముగా, రమణీయముగా చిత్రించి నా డని గ్రహించి, కవితా సౌందర్యమును ఆస్వాదించుట మంచిది. 27

మూ. విలప్యోపరతం రామం గతార్చిషమివానలమ్,
సముద్రమివ నిర్వేగమాశ్వాసయత లక్ష్మణః. 28

ప్ర. అ. విలప్య = విలపించి, ఉపరతమ్ = ఊరకొన్నవాడు, గతార్చిషమ్ = పోయిన మంటలు గల, అనలమ్ ఇవ = అగ్ని వలె ఉన్నవాడు, నిర్వేగమ్ = వేగము లేని, సముద్రమివ = సముద్రము వలె ఉన్నవాడు అయిన, రామమ్ = రాముని, లక్ష్మణః = లక్ష్మణుడు, ఆశ్వాసయత = ఓదార్చెను.

తా. ఈ విధముగా విలపించిన పిమ్మట మంటలు లేని అగ్ని వలె, వేగము లేని సముద్రము వలె ఊర కున్న ఆ రాముని లక్ష్మణుడు ఓదార్చెను.

మూ. ధ్రువమద్య పురీ రాజన్నయోధ్యాఽఽయుధినాం వర,
నిష్ప్రభా త్వయి నిష్క్రాన్తే గతచన్ద్రేవ శర్వరీ. 29

ప్ర. అ. ఆయుధినామ్=ఆయుధములు ధరించినవారిలో, వర = శ్రేష్ఠుడ వైన, రాజన్=ఓ రాజా! అద్య=ఇపుడు, అయోధ్యా పురీ=అయోధ్యానగరము, త్వయి=నీవు, నిష్క్రాన్తే=నిష్క్రమించిన వాడ వగుచుండగా, గతచన్ద్రా=చంద్రుడు లేని, శర్వరీవ = రాత్రి వలె, నిష్ప్రభా= కాంతివిహీన మైనదై ఉండును. ధ్రువమ్=నిశ్చయము.

తా. శస్త్రధారులలో శ్రేష్ఠుడ వైన ఓ రామా! నీవు విడిచి వెళ్ళిపోవుటచే, అయోధ్యానగరము ఇపుడు చంద్రుడు లేని రాత్రి వలె కాంతివిహీనమై ఉండును. నిశ్చయము. 29

మూ. నైతదౌపయికం రామ యదిదం పరితప్యతే,
విషాదయసి సీతాం చ మాం చైవ పురుషర్షభ. 30

ప్ర. అ. రామ=ఓ రామా! ఇదమ్=ఈ విధముగా, యత్ పరితప్యతే= పరితాపము చెందుచున్నావు అనునది ఏది కలదో, ఏతత్=ఇది, ఔపయికమ్ = యుక్త మైనది, న = కాదు. పురుషర్షభ = పురుషశ్రేష్ఠుడా, సీతాం చ = సీతను, మాం చైవ=నన్ను, విషాదయసి=దుఃఖించు నట్లు చేయుచున్నావు.

తా. రామా! నీ విట్లు దుఃఖించుట యుక్తము కాదు. ఓ పురుష శ్రేష్ఠుడా! నీ విట్లు చేయుటచే నాకును సీతకును కూడ దుఃఖము కలుగును. 30

మూ. న చ సీతా త్వయా హీనా న చాహమపి రాఘవ,
ముహూర్తమపి జీవావో జలాన్మత్స్యావివోద్ధృతౌ. 31

ప్ర. అ. రాఘవ=ఓ రామా; త్వయా =నీతో, హీనా = కూడినది కాని దైన, సీతా=సీత, న=జీవించదు. అహమపి=నేనుకూడ, న=జీవించను. జలాత్ = జలమునుండి, ఉద్ధృతౌ = పైకి తీయబడిన, మత్స్యావివ = మత్స్యముల వలె, (మేము ఇరువురము) ముహూర్తమపి=క్షణకాల మైనను, న జీవావః=జీవింపము.

తా. ఓ రామా! నీ సాన్నిధ్యము లేనిచో సీత గాని, నేను గాని, నీటి నుండి పైకి తీసిన మత్స్యముల వలె క్షణకాల మైనను, జీవింపజాలము. 31

మూ. న హి తాతం న శత్రుఘ్నం న సుమిత్రాం పరంతప,
ద్రష్టుమిచ్ఛేయమద్యాహం స్వర్గం వాపి త్వయా వినా. 32

ప్ర. అ. పరంతప = శత్రువులను పీడించు ఓ రామా! అహమ్ = నేను, అద్య = ఇపుడు, త్వయా వినా = నీవు లేకుండగ. తాతమ్ = తండ్రిని, ద్రష్టుమ్ = చూచుటకు, న హి ఇచ్ఛేయమ్ = కోరను. శత్రుఘ్నమ్ = శత్రుఘ్నుని, న = చూచుటకు కోరను. సుమిత్రామ్ = సుమిత్రనైనను, స్వర్గం వాపి = స్వర్గమునైనను, చూచుటకు కోరను.

తా. శత్రుసంహారకుడ వైన ఓ రామా! నిన్ను విడచి, తండ్రిని గాని, శత్రుఘ్నుని గాని, సుమిత్రను గాని, స్వర్గమును గాని, చూడవలె నను కోరిక నాకు లేదు. 32

మూ. తత స్తత్ర సుఖాసీనే నాతిదూరే నిరీక్ష్య తామ్
న్యగ్రోధే సుకృతాం శయ్యాం భేజాతే ధర్మవత్సలౌ. 33

ప్ర. అ. తతః = అటు పిమ్మట, తత్ర = అక్కడ, సుఖాసీనౌ = సుఖముగా కూర్చున్న, ధర్మవత్సలౌ = ధర్మమునందు ప్రేమ గల రామలక్ష్మణులు, నాతిదూరే = సమీపమున, న్యగ్రోధే = మఱ్ఱిచెట్టు క్రింద, సుకృతామ్ = చక్కగా చేయబడిన, తాం శయ్యామ్ = ఆ శయ్యను, నిరీక్ష్య = చూచి, భేజాతే = దానిని సేవించిరి.

తా. అక్కడ సుఖముగా కూర్చుని యున్న ధర్మాత్ము లైన, ఆ రామలక్ష్మణులు, దగ్గరనే మఱ్ఱి చెట్టు క్రింద చక్కగా అమర్చబడిన శయ్యను చూచి దానిపై పండుకొనిరి. 33

మూ. స లక్ష్మణస్యోత్తమపుష్కలం వచో
నిశమ్య చైవం వనవాసమాదరాత్,
సమాః సమస్తా విదధే పరంతపః
ప్రపద్య ధర్మం సుచిరాయ రాఘవః. 34

ప్ర. అ. పరంతపః = శత్రువులకు బాధ కల్గించు, సః రాఘవః = ఆ రాముడు, ఏవమ్ = ఇట్లు, లక్ష్మణస్య = లక్ష్మణుని యొక్క, ఉత్తమపుష్కలమ్

= ఉత్తమము పరిపూర్ణము అయిన, వచః = వాక్యమును, ఆదరాత్ = ఆదర పూర్వకముగా, నిశమ్య = విని, సుచిరాయ = చాలా కాలము, ధర్మమ్ = ధర్మమును, ప్రపద్య = పొంది, సమస్తాః = సమస్త మైన, సమాః = సంవత్సరములను, వనవాసమ్ = వనవాసమును, విదధే = చేసెను.

తా. శత్రువినాశకుడగు రాముడు, లక్ష్మణుడు చెప్పిన ఉత్తమము, అర్థసంపూర్ణములు అయిన మాటలు సాదరముగా విని, చిరకాలము వానప్రస్థ ధర్మము అవలంబించి, పదునాలుగు సంవత్సరములు పూర్తిగా వనవాసము చేయ నిర్ణయించెను. 34

మూ. తతస్తు తస్మిన్ విజనే వనే తదా
మహాబలౌ రాఘవవంశవర్ధనౌ,
న తౌ భయం సంభ్రమమభ్యుపేయతుః
ర్యథైవ సింహౌ గిరిసానుగోచరౌ. 35

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే, అయోధ్యాకాణ్డే
త్రిపఞ్చాశః సర్గః.

ప్ర. అ. తతః = అటుపిమ్మట, తదా = అపుడు, విజనే = జనశూన్య మైన, తస్మిన్ వనే = ఆ వనమునందు, మహాబలౌ = గొప్ప బలము గల, తౌ = ఆ, రాఘవవంశవర్ధనౌ = రఘువంశమును వృద్ధి పొందించు రామలక్ష్మణులు, గిరిసానుగోచరౌ = పర్వతముల చరియలపై నివసించు, సింహౌ యథైవ = సింహములవలె, భయమ్ = భయమును గాని, సంభ్రమమ్ = తొందర గాని, న అభ్యుపేయతుః = పొందలేదు.

తా. అప్పుడు మహాబలశాలు రైన రామలక్ష్మణులు జనశూన్య మైన అరణ్యములో కూడ, పర్వతముల చరియలపై సంచరించు రెండు సింహములవలె, ఏ మాత్రము, భయము గాని, తొందర గాని లేకుండ ఉండిరి. 35

"బాలానందిని" అను శ్రీమద్రామాయణాంధ్రవ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదిమూడవ సర్గ సమాప్తము.

# అథ చతుఃపంచాశః సర్గః

*[శ్రీరాముడు సీతాలక్ష్మణసమేతుడై ప్రయాగలో గంగాయమునా సంగమునకు చెంతనే ఉన్న భరద్వాజాశ్రమమునకు పోవుట. భరద్వాజ ముని వారిని సత్కరించుట. చిత్రకూటమున నివసింపుడని అనతిచ్చుట. చిత్రకూటపు మహాత్మ్యమును, శోభను వర్ణించుట].*

మూ. తే తు తస్మిన్మహావృక్షే ఉషిత్వా రజనీం శివామ్,
విమలేఽభ్యుదితే సూర్యే తస్మాద్దేశాత్ప్రతస్థిరే. 1

ప్ర. అ. తే = వారు, శివామ్ = మంగళకర మైన, రజనీమ్ = రాత్రిని, తస్మిన్ = ఆ, మహావృక్షే = మహావృక్షమునందు, ఉషిత్వా = ఉండి, విమలే = నిర్మలు డైన, సూర్యే = సూర్యుడు, అభ్యుదితే = ఉదయించినవాడగుచుండగా, తస్మాత్ దేశాత్ = ఆ ప్రదేశమునుండి, ప్రతస్థిరే = బయలుదేరిరి.

తా. ఆ సీతారామలక్ష్మణులు మంగళకర మైన ఆ రాత్రి యంతయు మహావృక్షము క్రింద ఉండి, మరునాడు, సూర్యుడు ఉదయించిన పిమ్మట, ఆ ప్రదేశమును విడిచి వెళ్ళిరి. 1

మూ. యత్ర భాగీరథీం గఙ్గాం యమునాభిప్రవర్తతే,
జగ్ముస్తం దేశముద్దిశ్య విగాహ్య సుమహద్వనమ్. 2
తే భూమిభాగాన్వివిధాన్ దేశాంశ్చాపి మనోరమాన్,
అదృష్టపూర్వాన్ పశ్యన్తస్తత్ర తత్ర యశస్వినః. 3

ప్ర. అ. యశస్వినః = మంచి కీర్తి గల, తే = వారు, సుమహత్ = చాల పెద్ద దైన, వనమ్ = వనమును, విగాహ్య = ప్రవేశించి, వివిధాన్ = అనేక విధము లైన, భూమిభాగాన్ = భూమి భాగములను, అదృష్టపూర్వాన్ = పూర్వము

చూడబడని, మనోరమాన్ = మనోహర మైన, దేశాంశ్చాపి = దేశములను, తత్ర తత్ర = అక్కడక్కడ, పశ్యన్తౌ = చూచుచున్న వారై, యమునా = యమునా నది, యత్ర = ఎచట, భాగీరథీమ్ = భగీరథునకు సంబంధించిన, గఙ్గామ్ = గంగానదిని, అభిప్రవర్తతే = చేరుచున్నదో, తం దేశమ్ = ఆ ప్రదేశమును, ఉద్దిశ్య = ఉద్దేశించి, జగ్మతుః = వెళ్ళిరి.

తా. ఉత్తమ మైన కీర్తి గల, సీతారామలక్ష్మణులు, ఆ గొప్ప అరణ్యమును ప్రవేశించి, అక్కడక్కడ అనేకవిధము లైన భూమిభాగములను, పూర్వ మెన్నడును చూడని అంద మైన దేశములను చూచుచు, యమునా నది గంగా నదిలో ప్రవేశించిన ప్రదేశమును గూర్చి వెళ్ళిరి. 2, 3

మూ. యథా క్షేమేణ గచ్ఛన్ స పశ్యంశ్చ వివిధాన్ ద్రుమాన్,
నివృత్తమాత్రే దివసే రామః సౌమిత్రి మబ్రవీత్. 4

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, యథా క్షేమేన = క్షేమముగా ఉండు నట్లు, గచ్ఛన్ = నడచుచు, వివిధాన్ = అనేక విధము లైన, ద్రుమాన్ = వృక్షములను, పశ్యంశ్చ = చూచుచు, దివసే = దినము, నివృత్తమాత్రే = మరలిన వెంటనే, సౌమిత్రిమ్ = లక్ష్మణుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాముడు, కష్టము కలుగకుండు నట్లు మెల్లగా నడచి ప్రయాణము చేయుచు, అనేక విధము లైన వృక్షములను చూచుచు, వెళ్ళ పగలు గడచిన వెంటనే లక్ష్మణునితో ఇట్లనెను. 4

మూ. ప్రయాగమభితః పశ్య సౌమిత్రే ధూమమున్నతమ్,
అగ్నేర్భగవతః కేతుం మన్యే సన్నిహితో మునిః. 5

ప్ర. అ. సౌమిత్రే = ఓ లక్ష్మణా! ప్రయాగమ్ అభితః = ప్రయాగకు చుట్టు, ఉన్నతమ్ = ఎత్తైన, భగవతః = పూజ్యు డైన, అగ్నేః = అగ్నియొక్క, కేతుమ్ = ధ్వజమైన, ధూమమ్ = ధూమమును, పశ్య = చూడుము. మునిః = ముని, సన్నిహితః = సమీపమునం దున్నాడు అని, మన్యే = తలచెదను.

తా. ఓ లక్ష్మణా! ప్రయాగమునకు చుట్టు భగవంతు డైన అగ్నికి ధ్వజ మైన ధూమము ఎత్తుగా కనబడుచున్నది; చూడుము. ఇక్కడ దగ్గరనే భరద్వాజ ముని ఉన్నా డని తలచెదను. 5

మూ. నూనం ప్రాప్తాః స్మ సంభేదం గఙ్గాయమునయోర్వయమ్,
తథా హి శ్రూయతే శబ్దో వారిణో వారిఘట్టితః. 6

ప్ర. అ. వయమ్ = మనము, గఙ్గాయమునయోః = గంగాయమునల, సంభేదమ్ = సంగమమును, ప్రాప్తాః = చేరిన వారము, స్మ = అయితిమి. నూనమ్ = నిశ్చయము. తథాహి = యుక్తమే కదా! వారిఘట్టితః = జలముచే ఘట్టింపబడిన, వారిణః = జలముయొక్క, శబ్దః = శబ్దము, శ్రూయతే = విన బడుచున్నది.

తా. మనము గంగాయమునా సంగమ స్థానమును చేరినాము. సందేహము లేదు. ఎందుచేత ననగా, నీరు నీటితో కొట్టుకొనుటచే కలుగు శబ్దము వినబడు చున్నది.

మూ. దారూణి పరిభిన్నాని వనజైరుపజీవిభిః,
భరద్వాజాశ్రమే చైతే దృశ్యన్తే వివిధా ద్రుమాః. 7

ప్ర. అ. వనజైః = వనమునందు పుట్టిన పదార్థములతో, ఉపజీవిభిః = ఆధారపడి జీవించువారిచేత, పరిభిన్నాని = పగలగొట్టబడిన, దారూణి = కట్టెలు (కనబడుచున్నవి). భరద్వాజాశ్రమే = భరద్వాజాశ్రమమునందు, ఏతే = ఈ, వివిధాః = అనేకవిధములైన, ద్రుమాశ్చ = వృక్షములు కూడ, దృశ్యన్తే = కనబడుచున్నవి.

తా. వనములో లభించు వస్తువులపై ఆధారపడి జీవించువారిచే ఖండింప బడిన ఈ కట్టెలు ఇచ్చట పడియున్నవి. భరద్వాజాశ్రమములో అనేకవిధము లైన ఈ వృక్షములు కనబడుచున్నవి. 7

మూ. ధన్వినౌ తౌ సుఖం గత్వా లమ్బమానే దివాకరే,
గఙ్గాయమునయోః సన్ధౌ ప్రాపతుర్నిలయం మునేః. 8

ప్ర. అ. ధన్వినౌ = ధనుర్ధరులైన, తౌ = రామలక్ష్మణులు, సుఖమ్ = సుఖముగా, గత్వా = వెళ్ళి, దివాకరే = సూర్యుడు, లమ్బమానే = పశ్చిమమున వ్రేలాడుచుండగా, గఙ్గాయమునయోః = గంగాయమునల, సన్ధౌ = సంగమము నందు, మునేః = భరద్వాజమునియొక్క, నిలయమ్ = ఆశ్రమమును, ప్రాపతుః = పొందిరి.

తా. ధనుర్ధరు లైన ఆ రామలక్ష్మణులు, సుఖముగా ప్రయాణము చేసి, సాయంకాలసమయమున, గంగాయమునల సంగమమునకు దగ్గరగా ఉన్న భరద్వాజాశ్రమమును చేరిరి. 8

మూ. రామస్త్వాశ్రమమాసాద్య త్రాసయన్మృగపక్షిణః,
గత్వా ముహూర్తమధ్వానం భరద్వాజముపాగమత్. 9

ప్ర. అ. రామః = రాముడు, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆసాద్య = పొంది, మృగపక్షిణః = మృగములను, పక్షులను, త్రాసయన్ = భయపెట్టుచు, ముహూర్తమ్ = కొంచెము సేపు, అధ్వానమ్ = మార్గమును, గత్వా = పొంది, భరద్వాజమ్ = భరద్వాజుని, ఉపాగమత్ = సమీపించెను.

తా. రాముడు, ఆశ్రమసమీపమునకు చేరగానే వారిని చూచి, మృగములు పక్షులును భయపడినవి. పిదప రాముడు కొంత దూరము నడచి, భరద్వాజుని సమీపము చేరెను. 9

మూ. తతస్త్వాశ్రమమాసాద్య మునేర్దర్శనకాంక్షిణౌ,
సీతయాఽనుగతౌ వీరౌ దూరాదేవావతస్థతుః. 10

ప్ర. అ. తతః = అటు పిమ్మట, సీతయా = సీతచేత, అనుగతౌ = అనుసరింపబడిన, వీరౌ = ఆ వీరులు, ఆశ్రమమ్ = ఆశ్రమమును, ఆసాద్య = సమీపించి, మునేః = మునియొక్క, దర్శనకాంక్షిణౌ = దర్శనము కోరుచు, దూరాదేవ = దూరమునందే, అవతస్థతుః = నిలచిరి.

తా. పిమ్మట ఆశ్రమమును సమీపించిన సీతారామలక్ష్మణులు, మునిని చూడవలె నను కోరికతో కొంచెము దూరముగనే నిలచి యుండిరి. 10

మూ. స ప్రవిశ్య మహాత్మానమృషిం శిష్యగణైర్వృతమ్,
సంశితవ్రతమేకాగ్రం తపసా లబ్ధచక్షుషమ్. 11
హుతాగ్నిహోత్రం దృష్ట్వైవ మహాభాగం కృతాఞ్జలిః,
రామః సౌమిత్రిణా సార్ధం సీతయా చాభ్యవాదయత్. 12

ప్ర. అ. సః రామః = ఆ రాముడు, ప్రవిశ్య = ప్రవేశించి, సంశితవ్రతమ్ = మిక్కిలి కఠిన మైన నియమములు కలవాడు, ఏకాగ్రమ్ = ఏకాగ్ర మైన చిత్తము

కలవాడు, తపసా = తపస్సు చేత, లబ్ధచక్షుషమ్ = పొందబడిన దివ్యదృష్టి గలవాడు, హుతాఽగ్నిహోత్రమ్ = చేయబడిన అగ్నిహోత్రములు కలవాడు, మహాభాగమ్ = గొప్ప భాగ్యము కలవాడు, శిష్యగణైః = శిష్యుల సముదాయములచే, వృతమ్ = చుట్టబడినవాడు, మహాత్మానమ్ = మహాత్ముడు అయిన, ఋషిమ్ = భరద్వాజమహర్షిని, దృష్ట్వైవ = చూడగానే, సౌమిత్రిణా సార్ధమ్ = లక్ష్మణునితో కూడ, సీతయా చ = సీతతో కూడ, అభ్యవాదయత్ = నమస్కరించెను.

తా. ఆ రాముడు ఆశ్రమములో ప్రవేశించి అక్కడ శిష్యుల సముదాయములతో కూడి యున్న, మహాత్ము డైన భరద్వాజమహర్షిని చూచెను. ఆ మహర్షి కఠిన మైన వ్రతములను ఆచరించుచు, ఏకాగ్రచిత్తు డై, తపస్సుచేత దివ్యదృష్టిని పొందియుండెను. అతడు నిత్యాగ్నిహోత్రి యైన మహాభాగ్యవంతుడు. ఆ మహర్షిని చూచిన వెంటనే, రాముడు, లక్ష్మణుడు, సీత, ఆయనకు నమస్కరించిరి. 11, 12

మూ. న్యవేదయత చాత్మానం తస్మై లక్ష్మణపూర్వజః,
పుత్రౌ దశరథస్యావాం భగవన్ రామలక్ష్మణౌ. 13

ప్ర. అ. లక్ష్మణపూర్వజః = లక్ష్మణుని అన్నగా రైన రాముడు, తస్మై = ఆ మహర్షికి, ఆత్మానమ్ = తనను గూర్చి, న్యవేదయత = తెలిపెను. భగవన్ = ఓ పూజ్యుడా! ఆవామ్ = మేము ఇరువురము, దశరథస్య = దశరథుని యొక్క, పుత్రౌ = పుత్రు లైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులము.

తా. రాముడు తనను గూర్చి, ఆ భరద్వాజమహర్షికి ఇట్లు తెలిపెను. "ఓ పూజ్యుడా! మేము దశరథుని పుత్రుల మైన రామలక్ష్మణులము. 13

మూ. భార్యా మమేయం వైదేహీ కల్యాణీ జనకాత్మజా,
మాం చానుయాతా విజనం తపోవనమనిన్దితా. 14

ప్ర. అ. ఇయమ్ = ఈ, కల్యాణీ = మంగళస్వరూపురాలు, మమ = నా యొక్క, భార్యా = భార్య యైన, జనకాత్మజా = జనకుని కుమార్తె యైన, వైదేహీ = సీత, అనిన్దితా = నిందింపబడని ఈమె, మామ్ = నన్ను, విజనమ్ = జనశూన్య మైన, తపోవనమ్ = తపోవనమును గూర్చి, అనుయాతా = అనుసరించి వచ్చినది.

తా. ఈ కల్యాణి నా భార్య. జనకుని కుమార్తె యైన సీత. ఎవ్వరిచేతను నిందింపబడని ఈమె నన్ను అనుసరించి, తపోవనమునకు వచ్చుచున్నది. 14

మూ. పిత్రా ప్రవ్రాజ్యమానం మాం సౌమిత్రిరనుజః ప్రియః,
అయమన్వగమత్ భ్రాతా వనమేవ దృఢవ్రతః. 15

ప్ర. అ. దృఢవ్రతః = దృఢ మైన నిర్ణయము కలవాడు, భ్రాతా = సోదరుడు, అనుజః = తమ్ముడు, ప్రియః = ఇష్టుడు అయిన, అయం సౌమిత్రిః = ఈ లక్ష్మణుడు, పిత్రా = తండ్రిచేత, ప్రవ్రాజ్యమానమ్ = అడవికి పంపబడు చున్న, మామ్ = నన్ను, వనమేవ = వనమును గూర్చియే, అన్వగమత్ = అనుసరించి వచ్చెను.

తా. నా తమ్ముడు, దృఢ మైన నిశ్చయము కలవాడు, నాయందు స్నేహము కలవాడు అయిన ఈ లక్ష్మణుడు తండ్రిచే అరణ్యమునకు పంపబడిన నన్ను అనుసరించి, తాను కూడ అరణ్యమునకు వచ్చినాడు. 15

మూ. పిత్రా నియుక్తా భగవన్ ప్రవేక్ష్యామస్తపోవనమ్,
ధర్మమేవ చరిష్యామస్తత్ర మూలఫలాశనాః. 16

ప్ర. అ. భగవన్ = పూజ్యుడా! పిత్రా = తండ్రిచేత, నియుక్తాః = ఆజ్ఞాపింపబడిన మేము, తపోవనమ్ = తపోవనమును, ప్రవేక్ష్యామః = ప్రవేశించెదము. తత్ర = అక్కడ, మూలఫలాశనాః = దుంపలు, ఫలములు ఆహారముగా కలవారమై, ధర్మమేవ = ధర్మమునే, చరిష్యామః = ఆచరించెదము.

తా. ఓ పూజ్యుడా! మేము, తండ్రి యాజ్ఞ ప్రకారము, తపోవనములో నివసించి, అక్కడ, దుంపలు, ఫలములు తినుచు, ధర్మమునే ఆచరించుచు ఉండెదము. 16

మూ. తస్య తద్వచనం శ్రుత్వా రాజపుత్రస్య ధీమతః,
ఉపానయత ధర్మాత్మా గామర్ఘ్యముదకం తతః. 17

ప్ర. అ. ధర్మాత్మా = ధర్మాత్ము డైన ఆ భరద్వాజుడు, ధీమతః = బుద్ధిమంతు డైన, తస్య = ఆ, రాజపుత్రస్య = రాజకుమారు డైన రాముని యొక్క, తత్ వచనమ్ = ఆ మాటను, శ్రుత్వా = విని, తతః = పిమ్మట, గామ్

= ఎద్దును, అర్ఘ్యమ్ = పూజ కొరకైన, ఉదకమ్=ఉదకమును, ఉపానయత= తీసుకొనివచ్చెను.

తా. ధీమంతుడైన ఆ రాముని మాటలు విని, ధర్మాత్ముడైన ఆ భరద్వాజుడు, మధుపర్కము కొరకై గోవును, అర్ఘ్యోదకములను, రామునకు సమర్పించుటకు తీసికొనివచ్చెను. 17

మూ. నానావిధానన్నరసాన్ వన్యమూలఫలాశ్రయాన్,
తేభ్యో దదౌ తప్తతపా వాసం చైవాభ్యకల్పయత్. 18

ప్ర. అ. తప్తతపాః=చేయబడిన తపస్సు గల ఆ భరద్వాజ మహర్షి, నానావిధాన్=అనేక విధములైన, వన్యమూలఫలాశ్రయాన్ =వనమునందలి మూలములకు, ఫలములకు సంబంధించిన. అన్నరసాన్ = అన్నరసములను, తేభ్యః=వారికి, దదౌ=ఇచ్చెను. వాసం చైవ=నివాసమును కూడ, అకల్పయత్ =ఏర్పరచెను.

తా. గొప్ప తపస్సు చేసిన ఆ భరద్వాజమహర్షి, వారికి వనములో లభించు మూలములతోను, ఫలములతోను, తయారుచేసిన అనేకవిధములైన అన్నములను రసములను ఇచ్చి నివాసము ఏర్పరచెను. 18

మూ. మృగపక్షిభిరాసీనో మునిభిశ్చ సమన్తతః,
రామమాగతమభ్యర్చ్య స్వాగతేనాహ తం మునిః. 19

ప్ర. అ. మృగపక్షిభిః=మృగములచేతను, పక్షులచేతను, మునిభిశ్చ= మునులచేతను, సమన్తతః=చుట్టును, ఆసీనః=కూర్చుండబడిన, మునిః=ఆ ముని, ఆగతమ్=వచ్చిన, తం రామమ్=ఆ రాముని, స్వాగతేన=స్వాగతము చేత, అభ్యర్చ్య=పూజించి, ఆహ=పలికెను.

తా. అక్కడ, భరద్వాజముని చుట్టును, మృగములు, పక్షులు, మునులు కూర్చుండి యుండిరి. అపుడు ఆ భరద్వాజుడు, తన ఆశ్రమమునకు వచ్చిన రాముని స్వాగతవచనపూర్వకముగా పూజించి ఇట్లు అనెను. 19

మూ. ప్రతిగృహ్య చ తామర్చాముపవిష్టం స రాఘవమ్,
భరద్వాజోఽబ్రవీద్వాక్యం ధర్మయుక్తమిదం తదా. 20

ప్ర. అ. సః భరద్వాజః=ఆ భరద్వాజుడు, తదా=అపుడు, తామ్=ఆ, అర్ఘ్యమ్=పూజను, ప్రతిగృహ్య=స్వీకరించి, ఉపవిష్టమ్=కూర్చున్న, రాఘవమ్=రాముని గూర్చి, ధర్మయుక్తమ్=ధర్మముతో కూడిన, ఇదం వాక్యమ్=ఈ వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. తా నిచ్చిన పూజను స్వీకరించి కూర్చుని యున్న ఆ రామునితో, భరద్వాజుడు ధర్మసమ్మత మైన మాటలు ఇట్లు పలికెను. 20

మూ. చిరస్య ఖలు కాకుత్స్థ పశ్యామి త్వామిహాగతమ్,
శ్రుతం తవ మయా చేదం వివాసనమకారణమ్ 21

ప్ర. అ. కాకుత్స్థ=రామా, చిరస్య=చిరకాలమునకు, ఇహ=ఇచటికి, ఆగతమ్=వచ్చిన, త్వామ్=నిన్ను, పశ్యామి ఖలు=చూచుచున్నానుకదా, అకారణమ్=కారణ మేదియు లేకుండగా, తవ=నీయొక్క, ఇదమ్=ఈ, వివాసనమ్=అడవికి పంపుట, మయా=నాచేత, శ్రుతం చ=వినబడినదికూడ.

తా. ఓ రామా! ఎంతో కాలమునకు ఇక్కడికి వచ్చిన నిన్ను చూడ గలుగుచున్నాను. నిన్ను అకారణముగా తండ్రి అరణ్యమునకు పంపె నను విషయమును కూడ విని ఉన్నాను. 21

మూ. అవకాశో వివిక్తోఽయం మహానద్యోః సమాగమే,
పుణ్యశ్చ రమణీయశ్చ వసత్విహ భవాన్ సుఖమ్. 22

ప్ర. అ. మహానద్యోః=ఈ మహానదులయొక్క, సమాగమే=సంగమమునందు, అయమ్=ఈ, అవకాశః=ప్రదేశము, వివిక్తః=జనరహితమైనది; పుణ్యశ్చ=పుణ్య మైనది; రమణీయశ్చ=సుందరమైనది. భవాన్=నీవు, ఇహ=ఇక్కడ, సుఖమ్=సుఖముగా, వసతు=నివసించెదవు గాక.

తా. ఈ గంగాయమునాసంగమము దగ్గర నున్న ఈ ప్రదేశములో జనసంమర్దము తక్కువగా ఉన్నది. ఈ ప్రదేశము పుణ్యమైనది; సుందరమైనది. నీవు ఇక్కడ సుఖముగా నివసించవచ్చును. 22

మూ. ఏవముక్తస్తు వచనం భరద్వాజేన రాఘవః,
ప్రత్యువాచ శుభం వాక్యం రామః సర్వహితే రతః. 23

ప్ర. అ. సర్వహితే=అందరియొక్క హితమునందు, రతః=ఆసక్తి కలవాడు, రాఘవః=రఘువంశమునందు పుట్టిన వాడు అయిన, రామః=రాముడు, భరద్వాజేన=భరద్వాజునిచేత, ఏవమ్=ఇట్లు, వచనమ్=వాక్యమును, ఉక్తః=పలుకబడినవాడై, శుభమ్=శుభమైన, వాక్యమ్ = వాక్యమును, ప్రత్యువాచ = తిరిగి పలికెను.

తా. అందరి హితమును కోరు రాముడు, భరద్వాజుని మాటలు విని ఇట్లు పలికెను. 23.

మూ. భగవన్నిత ఆసన్నః పౌరజానపదో జనః,
సుదర్శమిహ మాం ప్రేక్ష్య మన్యేఽహ మిమమాశ్రమమ్.
ఆగమిష్యతి వైదేహీం మాం చాపి ప్రేక్షకో జనః,
అనేన కారణేనాహమిహ వాసం న రోచయే. 25

ప్ర. అ. భగవన్=ఓ పూజ్యుడా, ఇతః=ఇక్కడికి, పౌరజానపదః = పురములకు, గ్రామములకు సంబంధించిన, జనః = జనము, ఆసన్నః = సమీపమునం దున్నది. ఇహ=ఇక్కడ, మామ్=నన్ను, సుదర్శమ్ = సులభముగా చూడదగినవానినిగా, ప్రేక్ష్య=తెలుసుకొని, జనః=జనము, వైదేహీమ్=సీతను, మాం చాపి = నన్ను, ప్రేక్షకః = చూచునదై, ఇమమ్ ఆశ్రమమ్ = ఈ ఆశ్రమమును గూర్చి, ఆగమిష్యతి=రాగలదు, అని, అహమ్=నేను, మన్యే=తలచుచున్నాను. అనేన కారణేన=ఈ కారణముచే, అహమ్ = నేను, ఇహ=ఇక్కడ, వాసమ్=నివాసమును గూర్చి, న రోచయే=ఇష్టపడను.

తా. ఓ పూజ్యుడా! పౌరులు, జానపదులు, ఈ ప్రదేశమునకు చాల దగ్గరగా నుందురు. ఇక్కడ నన్ను చూచుట సులభ మని తెలిసి వారందరును, నన్ను, సీతను చూచుటకై ఈ ఆశ్రమమునకు వచ్చెద రని నా అభిప్రాయము. అందుచే ఇక్కడ నివసించుటకు నాకు ఇష్టము లేదు. 24, 25.

మూ. ఏకాన్తే పశ్య భగవన్నాశ్రమస్థానముత్తమమ్,
రమేత యత్ర వైదేహీ సుఖార్హా జనకాత్మజా. 26.

ప్ర. అ. భగవన్ = ఓ పూజ్యుడా, సుఖార్హా = సుఖములకు తగిన, జనకాత్మజా=జనకుని కుమార్తె యైన, వైదేహీ=సీత, యత్ర = ఎక్కడ, రమేత=

క్రీడింతువో, ఏకాన్తే=అట్టి రహస్యప్రదేశమునందు, ఉత్తమమ్ = ఉత్తమ మైన, ఆశ్రమస్థానమ్=ఆశ్రమప్రదేశమును, పశ్య=చూడుము.

తా. ఓ పూజ్యుడా! సుఖమునకు తగిన జనకాత్మజ యైన సీత, ఏ ఆశ్రమమునందు సుఖముగా ఉండి విహరింపగల్గునో అట్టి, జనసమ్మర్దము లేని ప్రదేశమును చూడుము. 26

మూ. ఏతచ్ఛ్రుత్వా శుభం వాక్యం భరద్వాజో మహామునిః,
రాఘవస్య తతో వాక్యమర్థగ్రాహకమబ్రవీత్. 27

ప్ర. అ. మహామునిః = మహాముని యైన, భరద్వాజః = భరద్వాజుడు, రాఘవస్య = రాముని యొక్క, ఏతత్ = ఈ, శుభమ్ = శుభ మైన, వాక్యమ్ = వాక్యమును, శ్రుత్వా=విని, తతః=పిమ్మట, అర్థగ్రాహకమ్=తగిన అర్థమును బోధించు, వాక్యమ్=వాక్యమును, అబ్రవీత్=పలికెను.

తా. భరద్వాజమహాముని రాముడు పలికిన ఈ మంగళకర మైన మాట విని, తగిన స్థానమును చూపు వాక్యమును పలికెను.

మూ. దశక్రోశ ఇతస్తాత గిరిర్యస్మిన్ నివత్స్యసి.
మహర్షిసేవితః పుణ్యః సర్వతః సుఖదర్శనః, 28
గోలాఙ్గూలానుచరితో వానరర్క్షనిషేవితః,
చిత్రకూట ఇతి ఖ్యాతో గన్ధమాదనసన్నిభః. 29

ప్ర. అ. తాత=తండ్రీ, మహర్షిసేవితః=మహర్షులచే సేవింపబడినది, పుణ్యః=పుణ్య మైనది, సర్వతః=అన్ని వైపుల, సుఖదర్శనః=సుఖమును కల్గించు దర్శనము కలది, గోలాఙ్గూలానుచరితః=కొండముచ్చులచే సంచరింపబడునది, వానరర్క్షనిషేవితః = వానరములచేతను, ఎలుగుబంట్లచేతను సేవింపబడునది, చిత్రకూటః ఇతి = చిత్రకూట మని, ఖ్యాతః=ప్రసిద్ధ మైనది, గన్ధమాదనసన్నిభః = గంధమాదనపర్వతముతో సమానమూ అయిన, గిరిః=పర్వతము, ఇతః=ఇక్కడనుండి, దశక్రోశే=పది క్రోశుల దూరములో నున్నది. యత్ర=దేనిపై, నివత్స్యసి=నివసింపగలవో.

తా. నాయనా! ఇక్కడనుండి, పది క్రోశుల దూరములో గంధమాదన పర్వతముతో సమాన మైన చిత్రకూట మను పర్వత మున్నది. ఎందరో మహా

ర్షులు నివసించు ఆ పర్వతము పవిత్ర మైనది. అన్ని వైపుల చూచుటకు ఆనందము కల్గించునది. దానిపై కొండముచ్చులు, వానరములు, ఎలుగుబంటులు, నివసించుచుండును. (క్రూరమృగము లుండవు. అందుచే) ఇది నీవు నివ సించుటకు తగిన స్థానము. 28, 29

మూ. యావతా చిత్రకూటస్య నరః శృఙ్గాణ్యవేక్షతే,
కల్యాణాని సమాధత్తే న పాపే కురుతే మనః. 30

ప్ర. అ. నరః=నరుడు, యావతా=ఎంతవరకు, చిత్రకూటస్య=చిత్ర కూటపర్వతముయొక్క, శృఙ్గాణి=శిఖరములను, అవేక్షతే=చూచునో, అంత వరకు, కల్యాణాని=మంగళకరము లైన కార్యములను, సమాధత్తే=చేయును. పాపే=పాపమునందు, మనః=మనస్సును, న కురుతే=చేయడు.

తా. మానవుడు ఆ చిత్రకూటపర్వతశిఖరములను, చూచుచున్నంత వరకు, మంగళకరము లైన కార్యములనే చేయుచుండును. అతని మనస్సు అమంగళ కార్యముల వైపు ప్రవర్తించదు. 30

మూ. ఋషయస్తత్ర బహవో విహృత్య శరదాం శతమ్,
తపసా దివమారూఢాః కపాలశిరసా సహ. 31

ప్ర. అ. తత్ర=అక్కడ, బహవః=అనేకు లైన, ఋషయః=ఋషులు, శరదాం శతమ్=నూరు సంవత్సరములు, తపసా=తపస్సుచేత, విహృత్య=విహరించి, కపాలశిరసా సహ=కపాలముగా మాత్రము మిగిలిన శిరస్సుతో కూడ, దివమ్=స్వర్గమును, ఆరూఢాః=ఎక్కినారు.

తా. ఆ చిత్రకూటము పై ఎందరో ఋషులు వందల కొలది సంవత్స రములు, తమ శిరస్సులు కపాలములుగా ఎండిపోవు నంతవరకు తపస్సు చేసి స్వర్గమునకు వెళ్ళిరి. 31

మూ. ప్రవివిక్తమహం మన్యే తం వాసం భవతస్సుఖమ్,
ఇహ వా వనవాసాయ వస రామ మయా సహ. 32

ప్ర. అ. రామ=ఓ రామా! ప్రవివిక్తమ్=జనరహిత మైన, తం వాసమ్=ఆ నివాసస్థానమును, భవతః=నీకు, సుఖమ్=సుఖకర మైన దానినిగా,

అహమ్ = నేను, మన్యే = తలంచెదను. మయా సహ = నాతో, ఇహ వా = ఇక్కడ నైనను, వనవాసాయ = వనవాసము నిమిత్తము, వస = నివసింపుము.

తా. ఓ రామా! ఏకాంతముగా ఉండు ఆ చిత్రకూటప్రాంతము నీ నివాసమునకు సుఖకరముగా ఉండు నని తలంచెదను. లేదా నాతో ఇక్కడనే ఉండి వనవాసమును పూర్తిచేసుకొనుము. ౩౨

మూ. స రామం సర్వకామైస్తం భరద్వాజః ప్రియాతిథిమ్,
సభార్యం సహ చ భ్రాత్రా ప్రతిజగ్రాహ ధర్మవిత్. ౩౩

ప్ర. అ. ధర్మవిత్ = ధర్మము నెరిగిన, సః భరద్వాజః = ఆ భరద్వాజుడు, సభార్యమ్ = భార్యతో కూడినవాడు, భ్రాత్రా సహ చ = సోదరునితో కూడినవాడు, ప్రియాతిథిమ్ = ప్రియాతిథి యైన, తం రామమ్ = ఆ రాముని, సర్వకామైః = అన్ని కామములతోను, ప్రతిజగ్రాహ = పూజించెను.

తా. ధర్మవేత్త యైన ఆ భరద్వాజుడు, భార్యతోను, సోదరునితోను, కలిసి ప్రియ మైన అతిథిగా వచ్చిన ఆ రామునకు కావలసిన పదార్థము లన్నియు నిచ్చి స్వాగతము చెప్పెను. ౩౩

మూ. తస్య ప్రయాగే రామస్య తం మహర్షిముపేయుషః,
ప్రపన్నా రజనీ పుణ్యా చిత్రాః కథయతః కథాః. ౩౪

ప్ర. అ. ప్రయాగే = ప్రయాగక్షేత్రమునందు, తం మహర్షిమ్ = ఆ మహర్షిని, ఉపేయుషః = పొందిన, తస్య రామస్య = ఆ రాముడు, చిత్రాః = చిత్ర మైన, కథాః = కథలను, కథయతః = చెప్పుచుండగా, పుణ్యా = పుణ్య మైన, రజనీ = రాత్రి, ప్రపన్నా = వచ్చినది.

తా. ఆ ప్రయాగక్షేత్రములో భరద్వాజమహర్షి దగ్గర కూర్చుండి, రాముడు ఆతనితో అనేకవిధముల సంభాషణలు చేయుచుండగా అంతలో పవిత్ర మైన రాత్రి వచ్చినది. ౩౪

మూ. సీతాతృతీయః కాకుత్స్థః పరిశ్రాన్తః సుఖోచితః,
భరద్వాజాశ్రమే రమ్యే తాం రాత్రిమవసత్సుఖమ్. ౩౫

ప్ర. అ. సుఖోచితః = సుఖమునకు అలవాటు పడినవాడు, పరిశ్రాన్తః = అలసి పోయినవాడు, సీతాతృతీయః = సీత చేర మూడవ వాడైన, రామః = రాముడు, రమ్యే = సుందర మైన, భరద్వాజాశ్రమే = భరద్వాజాశ్రమమునందు, తాం రాత్రిమ్ = ఆ రాత్రిని, సుఖమ్ = సుఖముగా, అవసత్ = నివసించెను.

తా. సుఖపడుటకు అలవాటుపడిన ఆ సీతారామలక్ష్మణులు చాల అలసి పోయినవారై, ఆ రాత్రి సుందర మైన ఆ భరద్వాజాశ్రమములో సుఖముగా నివసించిరి. ౩౫

మూ. ప్రభాతాయాం రజన్యాం తు భరద్వాజముపాగమత్,
ఉవాచ నరశార్దూలో మునిం జ్వలితతేజసమ్. ౩౬

ప్ర. అ. నరశార్దూలః = నరశ్రేష్ఠు డైన రాముడు, రజన్యామ్ = రాత్రి ప్రభాతాయామ్ = తెల్లవారినదగుచుండగా, భరద్వాజమ్ = భరద్వాజుని, ఉపాగమత్ = పొందెను జ్వలితతేజసమ్ = ప్రజ్వలించుచున్న తేజస్సుగల, మునిమ్ = మునిని గూర్చి, ఉవాచ = పలికెను.

తా. రాత్రి తెల్లవారిన పిమ్మట నరులలో శ్రేష్ఠు డైన రాముడు తేజస్సుతో వెలుగుచున్న ఆ భరద్వాజమునివద్దకు వెళ్ళి, ఇట్లు పలికెను. ౩౬

మూ. శర్వరీం భగవన్నద్య సత్యశీల తవాశ్రమే,
ఉషితాః స్మేహ వసతిమనుజానాతు నో భవాన్. ౩౭

ప్ర. అ. సత్యశీల = సత్యస్వభావము గల, భగవన్ = ఓ పూజ్యుడా, ఇహ = ఈ, తవ ఆశ్రమే = నీ ఆశ్రమమునందు, శర్వరీమ్ = రాత్రిని, ఉషితాః స్మ = నివసించితిమి. అద్య = ఇపుడు, నః = మమ్ములను, భవాన్ = నీవు, వసతిమ్ = మా నివాసస్థానమును గూర్చి, అనుజానాతు = అనుజ్ఞ ఇచ్చెదవు గాక!

తా. సత్యశీలుడ వైన ఓ మహర్షి! నీ ఆశ్రమములో రాత్రి గడపినాము. ఇక మా నివాసస్థానమునకు వెళ్ళుటకు మాకు అనుజ్ఞ ఇమ్ము. ౩౭

మూ. రాత్ర్యాం తు తస్యాం వ్యుష్టాయాం భరద్వాజోఽబ్రవీదిదమ్,
మధుమూలఫలోపేతం చిత్రకూటం వ్రజేతి హ. ౩౮

ప్ర. అ. తస్యామ్ = ఆ, రాత్ర్యామ్ = రాత్రి, వ్యుష్టాయామ్ = గడచిన దగుచుండగా, భరద్వాజః = భరద్వాజుడు, మధుమూలఫలోపేతమ్ = తేనెతోను, ఫలములతోను దుంపలతోను కూడిన, చిత్రకూటమ్ = చిత్రకూట పర్వతమును గూర్చి, వ్రజ = వెళ్ళుము, ఇతి = అని, ఇదమ్ = ఈ వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

తా. ఆ రాత్రి గడచిన పిమ్మట భరద్వాజుడు, రామునితో, "చిత్రకూట పర్వతముపై తేనె, దుంపలు, ఫలములు, అధికముగా లభించును. అక్కడికి వెళ్ళుము" అని పలికెను. 38

మూ. వాసమౌపయికం మన్యే తవ రామ మహాబల,
నానానగగణోపేతః కిన్నరోరగసేవితః 39
మయూరనాదాభిరుతో గజరాజనిషేవితః,
గమ్యతాం భవతా శైలశ్చిత్రకూటః స విశ్రుతః, 40
పుణ్యశ్చ రమణీయశ్చ బహుమూలఫలాయుతః.

ప్ర. అ. మహాబల=గొప్పబలము గల, రామ = ఓ రామా! తవ = నీకు, ఔపయికమ్=యుక్తమైన, వాసమ్=నివాసమునుగా, మన్యే = తలచుచున్నాను. నానానగగణోపేతః = అనేక విధములైన వృక్షసముదాయములతో కూడినది, కిన్నరోరగసేవితః=కిన్నరులచేతను, ఉరగులచేతను సేవింపబడినది, మయూరనాదాభిరుతః = నెమళ్ళ నాదములచే ధ్వనింపచేయబడినది, గజరాజనిషేవితః= గజశ్రేష్ఠములచే సేవింపబడినది, పుణ్యశ్చ = పవిత్రము, రమణీయశ్చ = సుందరము, బహుమూలఫలాయుతః = అనేకమైన మూలములతోను, ఫలములతోను, కూడినది, విశ్రుతః = ప్రసిద్ధము అయిన, సః = ఆ, చిత్రకూటః శైలః = చిత్రకూట శైలము, భవతా = నీచేత, గమ్యతామ్ = వెళ్ళబడుగాక!

తా. "మహాబలుడవైన ఓ రామా! చిత్రకూటపర్వతము, నీకు యుక్తమైన నివాసస్థానమని తలచెదను. అందుచే నీవు అచటికి వెళ్ళుము. ఆ పర్వతముపై అనేక విధములైన వృక్షములు ఉండును. కిన్నరులు, ఉరగులు దానిపై నివసించుచుండును. నెమళ్ళ కూతలచేత ప్రతిధ్వనించుచున్న ఆ పర్వతముపై ఉత్తమమైన గజములు నివసించుచుండును. మూలఫలములతో సమృద్ధమైన ఆ పర్వతము పవిత్రమైనది, సుందరమైనది కూడ. 40

మూ. తత్ర కుఞ్జరయూథాని మృగయూథాని చాభితః, 41
విచరన్తి వనాన్తేఽస్మిన్ తాని ద్రక్ష్యసి రాఘవ

ప్ర. అ. రాఘవ = రామా! తత్ర=అక్కడ, అస్మిన్ వనాన్తే=ఈ వనమధ్యమునందు, అభితః = అంతటను, కుఞ్జరయూథాని=ఏనుగుల గుంపులు, మృగయూథాని చ = లేళ్ళ గుంపులు, విచరన్తి = సంచరించుచుండును. తాని = వానిని, ద్రక్ష్యసి = చూడగలవు.

తా. రామా! ఆ చిత్రకూటపర్వతముపై వనమధ్యమునందు ఏనుగులు, లేళ్లు, గుంపు గుంపులుగా తిరుగుచుండును. నీవు వానిని చూడగలవు. 41

మూ. సరిత్ప్రస్రవణప్రస్థాన్ దరీకన్దరనిర్ఝరాన్, 42
చరతః సీతయా సార్ధం నన్దిష్యతి మనస్తవ.

ప్ర. అ. సీతయా సార్ధమ్=సీతతో కూడ, సరిత్ప్రస్రవణప్రస్థాన్=నదులను, సెలయేళ్లను, కొండల చరియలను, దరీకన్దరనిర్ఝరాన్=చిన్న గుహలను, పెద్ద గుహలను, జలప్రవాహములను, చరతః=సంచరించుచున్న, తవ = నీ యొక్క, మనః=మనస్సు. నన్దిష్యతి=ఆనందింపగలదు.

తా. నీవు సీతతో కలసి నదులు, సెలయేళ్లు, కొండల చరియలు, చిన్న గుహలు, పెద్ద గుహలు, జలప్రవాహములు చూచుచు ఆనందింపగలవు. 42

మూ. ప్రహృష్టకోయష్టికకోకిలస్వనై-
ర్వినాదితం తం వసుధాధరం శివమ్,
మృగైశ్చ మత్తైర్బహుభిశ్చ కుఞ్జరైః
సురమ్యమాసాద్య సమావసాశ్రమమ్. 43

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే అయోధ్యాకాణ్డే
చతుఃపఞ్చాశః సర్గః.

ప్ర. అ. ప్రహృష్టకోయష్టికకోకిలస్వనైః = సంతోషించిన కోయష్టిక పక్షులయొక్కయు, కోకిలలయొక్కయు, కూతలచేత, వినాదితమ్=ధ్వనింపచేయబడినది, శివమ్=మంగళకర మైనది, బహుభిః=అనేక మైన, మృగైశ్చ=మృగములతోను, మత్తైః=మదించిన, కుఞ్జరైశ్చ=ఏనుగులతోను, సురమ్యమ్ = చాలా సుందరము అయిన, తం వసుధాధరమ్=ఆ చిత్రకూట పర్వతమును, ఆసాద్య=పొంది, ఆశ్రమమ్ = ఆశ్రమమునందు, సమావస = నివసింపుము.

తా. మంగళకర మైన ఆ చిత్రకూటపర్వతమునందు. సంతోషించిన కోయష్టిక పక్షులు, కోకిలలు కూయుచుండును. ఇటు అటు సంచరించుచున్న అనేక మైన మృగములతోను, మదించిన ఏనుగులతోను, అది రమ్యముగా నుండును. అట్టి చిత్రకూటమును చేరి ఆశ్రమములో నివసింపుము. 43

పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన
"బాలానందిని" యను శ్రీమద్రామాయణ వ్యాఖ్యానమునందు
అయోధ్యాకాండలో ఏబదినాలుగవ సర్గ సమాప్తము.

# అయోధ్యాకాండాంతర్గత విషయసూచిక-II


| సర్గ | విషయము | పుట |
|---|---|---|
| 55. | భరద్వాజమహర్షి శ్రీరాములకు స్వస్తివచనము పలికి, వారికి చిత్రకూటమునకు మార్గము తెలుపుట. తామే నిర్మించిన తెప్పతో వారు యమునానది దాటుట. సీత యమునను, శ్యామవటమును ప్రార్థించుట. వారు ముగ్గురును యమునాతీరమార్గముననే ఒక క్రోసు దూరము పోయి, వనవిహారము చేయుట, చదునైన యమునాతట ప్రదేశమున ఆ రాత్రి నివసించుట. | 1 |
| 56. | వనశోభను చూచుచు, శ్రీరాములు చిత్రకూటము చేరుట. వాల్మీకి మహర్షిని దర్శించుట. రామాజ్ఞచే లక్ష్మణుడు పర్ణశాలను నిర్మించుట. వాస్తుశాంతి చేసి వారు కుటీరమున ప్రవేశించుట. | 14 |
| 57. | సుమంత్రుడు అయోధ్యకు మరలివచ్చుట. రాముని సందేశమును అతనివలన విని పౌరులు విలపించుట. దశరథమహారాజు, కౌసల్య మూర్ఛిల్లుట, అంతఃపురమందలి రాణులు ఆర్తనాదము చేయుట. | 29 |
| 58. | దశరథమహారాజు ఆదేశింపగా సుమంత్రుడు రామలక్ష్మణుల సందేశము వినిపించుట. | 42 |
| 59. | శ్రీరామవియోగముచే అయోధ్యాపురిలోని జడచేతనముల దురవస్థను సుమంత్రుడు చెప్పుట. దశరథుడు విలపించుట. | 56 |
| 60 | కౌసల్య విలపించుట, సుమంత్రు డామెను ఓదార్చుట. | 70 |
| 61. | కౌసల్య విలపించుచు దశరథుని నిందించుట. | 79 |
| 62. | దుఃఖితుడైన దశరథమహారాజు కౌసల్యకు చేతులు మోడ్చి ఊరడించుట. కౌసల్య ఆయన పాదములపై పడి క్షమింపగోరుట. | 92 |

